భవానందంపిళ్లై, ఎస్

హరిశ్చంద్రుఁడు (సత్యవీరుఁడు)

Madras, 1913

Record no. 252

Bhavānandampiḷle, Es

Hariścandrum̐ḍu (Satyavīrum̐ḍu)

Madras, 1913

Record no. 252

## Bibliographic Record Target

భవానందంపిళ్లె, ఎస్.

హరిశ్చంద్రుఁడు (సత్యవీరుఁడు) / రావ్ సాహెబ్ ఎస్. భవానందంపిళ్లె గారి విరిచితమయిన అరవనాటకమునుండి కొందఱు ఆంధ్ర పండితులు గద్య పద్యాత్మకముగ ఆంధ్రీకరించారు.- Madras : Vaijayanti Press, 1913.

3, iv, iii, xxxii, 518 p. ;20 cm.

Record no. 252

Bhavānandampiḷḷe, Es.

Hariścandrum̐ḍu (Satyavīrum̐ḍu) / Rāv Sāheb Es. Bhavānandampiḷḷe gāri viricitamayina aravanāṭakamunuṇḍi kondaṟu āṃdhra paṇḍitulu gadya padyātmakamuga āṃdhrīkariñcāru.- Madras : Vaijayanti Press, 1913.

3, iv, iii, xxxii, 518 p. ;20 cm.

Record no. 252

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB        Date filming began:

# HARISCHANDRA



THE MARTYR TO TRUTH

(…ON)

TRANSLATED INTO TELUGU PROSE AND VERSE

BY A COMMITTEE OF EMINENT TELUGU SCHOLARS

FROM THE TAMIL



OF

RAO SAHIB S. BAVANANDAM PILLAI

F. R. HIST. S. (LOND.) AND M.R.A.S (LOND.)

[Illustrated with half-tone pictures.]

*Truth is Supreme; that which is Supreme is Truth; On Truth the Universe is based. Think Truth, Speak Truth, Act Truth*—Taittiriyopanishat.

---

MADRAS:

1913

MADRAS.

PRINTED AT THE VAIJAYANTI PRESS,

MADRAS TIMES PRINTING & PUBLISHING & CO., LD.)

BY

W. F. GRAHAME ESQ., I.C.S (RETIRED) AT 32, MOUNT ROAD.

# హరిశ్చంద్రుఁడు.



(సత్యవీరుఁడు)

ఒక యభినవసందర్భము

రావ్ సాహెబ్ ఎస్. భవానందంపిళ్లై

ఎఫ్. ఆర్. హెచ్. ఎస్ (లండన్)., ఎమ్. ఆర్. ఏ. ఎస్. (లండన్)

గారి

విరచితమయిన అరవనాటకమునుండి

కొందఱు ఆంధ్ర పండితులు

గద్య పద్యాత్మకముగ

ఆంధ్రీకరించిరి.

[Half-Tone పటములతోఁ గూడినది.]

[ సత్యము తరోత్కృష్టము: సరోత్కృష్టకు
సత్యము: సత్యమందు విశ్వము ప్రతిష్ఠితము:
సత్యమునే భావింపుము: సత్యమునే భాషింపుము:
సత్యమునే అనుష్ఠింపుము.] తైత్తిరీయోపనిషత్తు.

౧౯౧౩

# PREFACE.

The episode of Harischandra, as an embodiment of the Ancient Indian conception of truth is one of our greatest and most valuable possessions. It is a tale of suffering and sacrifice for truth, for virtue at all cost, without a touch or taint or any thought of reward either here or in the inevitable hereafter. It seems to me that in its simple pathos and in the dignity of manhood it presents, it is without a parallel in the history of the world. The following pages are an attempt to present this episode in modern dramatic form to my countrymen. A puranic episode, the main facts and features of which have become crystalised in the popular mind, has no doubt its peculiar advantages as a plot for a drama ; but it has also its essential limitations. I do not claim to have enlarged the limitations or improved the advantages ; but I have, however attempted to give the story a somewhat new setting, with what measure of failure or success the kind critic and the indulgent reader will judge, after reading it. The story, it struck me, whether as told in our books, as handed down by tradition or as acted in the street or on the stage, almost borders on the burlesque. It will, perhaps, be easily conceded that the most effective way of inducing a person to tell a lie is not to press him directly to speak an unturth. But from start to finish the accepted version of the story consists mainly in the insistent demands on Harischandra, by threats and entreaties, in season and out of season, to speak, as the phrase goes, but one lie. A more ludicrous spectacle it is hard to conceive. Visvamitra is represented

as a fool without any knowledge of human nature, and Harischandra is depicted merely as an obstinate person. A moral test, to be effective, must be a real temptation and must have reference and be directed to the tender and weaker aspects of a man's character. There is no real tragedy in mere physical or even in mental suffering. Character can only be overcome by itself, and the consummate tempter is a casuist. I have thus sought to press into service various insidious devices by wich a man's character may be undermined such as by shaking the very foundations of faith, by rousing and playing upon the nobler passions and emotions, by appealing to his own sense of duty and so forth. I have also endeavoured to dispense with any intervention of the supernatural. In a word, my object has been to present the story in a modern form.

Primeval art, it will be remembered, mostly delighted in mass and number. Complexity of conception and subtlety of suggestion were foreign to it. I confess to having consciously attempted to modify the story in details, but whether the modification has been an improvement it is not for me to discuss. Some of my readers may complain that I have not altered the story sufficiently to make it a proper drama. The extent of liberty that can be taken with a puranic story like that of Harischandra is a field for wide discussion on which I do not propose now to enter. The more I contemplate the work, the more conscious I become of its numerous and varied imperfections and the less inclined I feel to publish it to the world; but I am assured by more than one sympathising friend that I ought for that very reason to hasten to



let it go out of the translators' hands. Here then it is with all its errors of omission and commission.

I wish I could here name and thank all my friends to whom I am indebted for various suggestions and many acts of kindly help rendered to me in the course of publishing this work. But they are too many to be catalogued in a preface and too modest to permit me to acknowledge their services in suitable terms.

NEWTON HOUSE, VEPERY,
MADRAS,
*20th January, 1913.*

S. B. P.



## *Suggestions for selecting portions of the drama to be staged.*

---

**For enacting the drama in three parts on three nights.**

**Part I.** Acts I and II.

**Part II.** Act III and Act IV, Scenes 1 to 3.

**Part III.** Act IV, Scenes 4 to 9, and Act V.

**For enacting the drama on a single night.**

**Act I. Scene 1.**

**Scene 2.**

**Scene 4.** Omitting the whole of the scene after "సుశీలుఁడు ఇదిగో కులపతి యాజ్ఞానుసారము" in line 22 at page 14.

**Scene 5.**

**Scene 6.** Omitting pages 34, 35, 36, 37 and 38 up to "ఇట్టి యకార్యంబునకుఁ బాల్పడితివి" line 7.

**Act II. Scene 1.** Last 7 lines on page 58 and pages 59 60 and 61 except the speech of Chandramathi "కోపింపక నాపల్కులాలకింపుడు" and the first 2 lines on page 63.

**Scene 2.** Page 64 line 7, *Read* "దేవరవారికి స్వాధీనపఱచెదను" *for* "దేవరవారికి స్వాధీనపఱచుటకైన................" and *omit* the whole of page 65, 66 except from "ఇంక నీ విధేయుల కనుజ్ఞయేకదా!" in line 2 to "నా జననిమాత్ర మిచ్చుటనే యుండును" line 8. *Omit* first 5 lines on page 67 and *omit* the rest of the scene after "వెడలిపోవుచున్నారు" on page 73.

**Scene 3.**

**Scene 6.** *Omit* pages 94, 95 and 96 except the last 3 lines on page 96.

**Scene 9.** *Omit* pages 119 and 120, and begin from "అయ్యా మీరు కాశికిఁ బోవుచున్నారా?" line 5 on page 121. *Omit* రాశిచక్రం on page 122 and the whole of page 123 except 4 lines from the top and 4 lines from the bottom beginning with "ఈగ్రహసంపత్తికిఁ దాత్కాలిక ఫలము" *to* "పెట్టియుండవలెను". *Omit* 9 lines from the top on page 124.

**Scene 12.** *Omit* pages 143, 144, 145 and 12 lines from the top of page 146.

**Act III. Scene 2.** The whole of pages 170 to 173 and 9 lines from the top of page 174.



**Scene 3.** The whole of pages 176-178 and 179 Except 10 lines from the bottom. *Omit* 18 lines from the bottom on pages 188 and the whole of 189 and lines 1 to 4 and 9 to 14 on page 190.

**Scene 4.** *Omit* 5 lines from the bottom on page 200 and pages 201 to 205 except the last 4 lines at the bottom of page 205. *Omit* the whole of page 213 except 10 lines from the top. *Omit* lines 3 to 19 to the last line on page 215 and 19 lines from the top on page 216. *Omit* the whole of page 221 except lines 1 to 9 from the top and the whole of page 222 except 6 lines from the bottom.

**Scene 6.** *Omit* the whole Scene from page 253.

**Act IV. Scene 2.**

**Scene 4.** *Omit* from the 17th line from the top of page 335 and the whole of page 336 and 16 lines from the top of page 337, the whole of page 338 except lines 1 to 12 from the top. *Omit* the whole of pages 339 to 346 and 3 lines from the top on page 347.

**Scene 6.**

**Scene 7.** *Omit* pages 373 to 381 except the last 2 lines and *omit* the rest of the scene commencing from the 6th line from the top of page 384.

**Act V. Scene 1.**

**Scene 2.** *Omit* pages 468 to 472 except 9 lines from the bottom on page 472. *Omit* 3 lines from the bottom on page 481. *Omit* pages 482 to 492 and 2 lines from the top on page 493.

**Scene 3**

---

ఈ నాటక మాడు విషయమున కొన్ని సూచనలు.

మూడు భాగములుగ మూడు రాత్రులు నటించుటకు.

---

I. భాగము—అంకములు I, II. పూర్తిగా.

II. భాగము—అంకములు III. IV లో 1 మొ. 3 రంగములు.

III. భాగము—అంకములు IV రంగము 4 మొ. 9 వఱకును, V వ అంకము పూర్తిగను.

ఒకటే రాత్రి యాడుటకు వదలిపెట్టఁ దగిన భాగములు.

అంకము 1. రంగము 1.

రంగము 2.

రంగము 4. ఇందు 14 వ పుట 22 వ పంక్తిలో "సుశీలుఁడు-ఇదిగో కులపతి యాజ్ఞానుసారము" మొదలుకొని మిగిలినభాగ మంతయు

రంగము 5.

రంగము 6. ఇందు 34, 35, 36, 37 వ పుటలును 38 వ పుటలో 7 పంక్తి "ఇట్టి యకార్యంబునకుఁ బాల్పడితివి" వఱకును

అంకము II. రంగము I. ఇందు 58 వ పుటలో కడపటి 7 పంక్తులును, 59, 60 వ పుటలు పూర్తిగను, 61 వ పుటలో చంద్రమతి వాక్యములు తప్ప మిగిలిన భాగమంతయును, 62 వ పుటయును 63 వ పుటలో మొదటి 2 పంక్తులును

రంగము 2. ఇందు 64 వ పుట 7 వ పంక్తి "దేవరవారికి స్వాధీనపఱచుటకైన" అను దానిని "దేవరవారికి స్వాధీనపఱచెదను" అని ముగించి, మిగిలిన భాగమును, 65 వ పుట

యంతయును, 66 వ పుటలో 2 వ పంక్తి "ఇంక నీ విధేయుల కనుజ్ఞ రేయే గదా" మొదలుకొని 8 వ పంక్తిలో "నాజనని మాత్ర మిచ్చుట నుండును" అనుభాగము తప్ప మిగిలిన దంతయును, 67 వ పుటలో మొదటి 5 పంక్తులును, 73 వ పుటలో "వెడలిపోవుచున్నారు" కు పిమ్మటనుండు భాగమంతయును

రంగము 6. 94, 95 పుటలును, 97 లో కడపటి 3 పంక్తులును

రంగము 9. 119, 120 వ పుటలును, 121 పుట 5 వ పంక్తిలో "అయ్యా! మీరు కాశికిఁబోవుచున్నారా?" వఱకును 122 వ పుటలోని రాశిచక్రమును, 123 వ పుటలో మొదటి నాల్గు బంతులును, కడపటి నాల్గవ బంతిలోని "ఈ గ్రహసంపత్తికిఁ దాత్కాలిక ఫలము" మొదలు "పుట్టియుండవలెను" వఱకు నుంచుకొనిమిగిలిన దంతయును, 124 వ పుటలో మొదటి 9 పంక్తులును

రంగము 12. 143. 144, 145 వ పుటలును, 146 వ పుటలో మొదటి 12 బంతులును

అంకము III. రంగము 2. 170 వ పుట మొదలుకొని, 173 వ పుట కడవఱకును, 174 వ పుటలో మొదటి 9 బంతులును

రంగము 3. 176 మొ. 178 వ పుట కడవఱకును, 179 వ పుటలో కడపటి 10 బంతులు తప్ప మిగిలినదయు 188 వ పుటలో కడపటి 18 బంతులును, 189 వ పుట యంతయును, 190 వ పుటలో మొదటి నాల్గు బంతులును, 9 వ బంతి మొదలు 14 వ బంతి వఱకును

రంగము 4. 200 వ పుటలోని కడపటి 5 బంతులును, 201 మొదలుకొని 305 వ పుటలోని కడపటి 4 బంతులు తప్ప మిగిలిన దంతయును, 213 వ పుటలో మొదటి 10



బంతులుతప్ప మిగిలిన దంతయును, 215 వ పొరటలోని మొదటి 3 వ బంతి మొదలుకొని 19 వబంతి కడవఱకును, కడపటి బంతియును, 216 వపుటలోని మొదటి 19 బంతులును విడిచిపెట్టవలెను. మొదటి 9 బంతులు తప్ప మిగిలిన 221 వ పుటయంతయును, కడపటి 6 బంతులు తప్ప మిగిలిన 222 వ పొరట యంతయును

రంగము 6. 253 వ పుట మొదలుకొని మిగిలిన రంగమంతయును

అంకము IV. రంగము. 2.

రంగము 4. 335 వ పుటలో 17 వ పంక్తి మొదలుకొని 336 వ పుటయంతయును, 337 వ పుటలో మొదటి 16 బంతులును, 338 వ పుటలో మొదటి 12 బంతులు తప్ప మిగిలిన భాగమును, 339 వ పుట మొదలుకొని 340 వ పుట కడవఱకును, 347 వ పుటలో మొదటి 3బంతులును

రంగము 6.

రంగము 7. 373 వ పుట మొదలుకొని 381 వ పుటలో కడపటి రెండవ బంతివఱకును, 384 వ పుటలో మొదటి 6 వ బంతి మొదలుకొని మిగిలినదంతయును

అంకము V. రంగము 1.

రంగము 2. 468 వ పుట మొ. 472 వ పుటలో కడపటి 9 బంతులు తప్ప తక్కిన దంతయును 481 వ పుటలో కడపటి 3 బంతులును 482 వ పుట మొదలుకొని 493 వ పుటలోని మొదటి రెండుబంతుల వఱకును వదలునది.



# ఉపోద్ఘాతము.

అపసవ్యమైన నడక గలది యయ్యును
"ఎల్లభాషలందు నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స."

అని మహామహులచే మెప్పు వడసిన యీ తెలుఁగుబాస గ్రాంథికభాష, యనియు, వ్యావహారికభాష యనియు సామాన్యభాష యనియు మూఁడువిధములుగా నున్నది. అందు గ్రాంథికభాష కవితాసామ్రాజ్యధురంధరుం డగు నన్నయభట్టారకుఁడు మొదలగు మహాకవులచే భారతము మొదలగు నుద్గ్రంథములయందుఁ బ్రయోగింపఁబడినది. దానిని బండితులు మిక్కిలిని గౌరవించుచుందురు. వ్యావహారికభాష సామాన్యవలె సర్వజనసామాన్యముగా నియమరాహిత్యమును బొంది యిచ్చ వచ్చినట్లు వ్యవహరింపఁబడుచున్నది. దానినే గ్రామ్యభాష యందురు. ఇఁక మూఁడవది యంత గ్రాంథికమును గాదు. అంత గ్రామ్యమును గాదు. ప్రకృతకాలమునం దీయాంధ్రభాష విషయమునఁ బలువురకుఁ బలువిధముగా నభిప్రాయభేదములును వివాదములును నేర్పడుచున్నవి. ఏమయినను గ్రాంథికభాషకుఁ గలగౌరవము దక్కినభాషల కుండఁబోవ దనుట ముఖ్యాంశము. అయినను గ్రాంథికభాష కేవలమును బండితులు గౌరవింపఁదగినదే యనుటయు నిర్వివాదాంశమే. వ్యావహారికభాష సర్వజనసామాన్యముగా వారివారి యభ్యాసమునుబట్టియు దేశభేదమునుబట్టియు ననేకరూపములుగా మాఱ్పులను జెందుచుండును. గ్రాంథిక

భాషయో? అట్లు గాక యాంధ్రదేశమునం దంతటను సదా యేకరూపముగా నుండునది. సామాన్యభాష గ్రాంథిక చిహ్నములను గ్రామ్యచిహ్నములను గలిగి యెందును జేర్పఁబడక వ్యావహారికభాషగా నాంధ్రదేశమునం దంతటను బ్రచారదశను బొందియే యున్నది.

ఆగ్రాంథికభాష సలక్షణముగాఁ బ్రబంధములు వ్రాయుటకే యుపయోగించుచున్నది. వ్యావహారికభాషామిశ్రమ మైన యాగ్రాంథికభాషను మనవారు పూర్వమును నిప్పుడును నాటకాదులను వ్రాయునపు డుపయోగించుచున్నారు. నాటకములు కేవలమును గ్రాంథికభాషలోనే వ్రాయఁబడినను లేక కేవలమును వ్యావహారికభాషలోనే వ్రాయఁబడినను నంతగాఁ జదువరుల కింపునింపకుండుటచే నందుఁ జాలభాగ ముత్తమపాత్రలకు గ్రాంథికభాషను నీచపాత్రములకు వ్యావహారికభాషను నుపయోగించి చదువరుల కమందమయిన యానందమును గలిగించుచుండుట కవులకు మర్యాదయై యున్నది. భాషయొక్కయుపయోగ మర్థజ్ఞానముకొఱకే యనుసిద్ధాంత మొకటి కొందఱచేఁ జేయఁబడియున్నది. కావుననే కావ్యాదులకంటె నాటకాదులలో సులభమైనపదములనే ప్రయోగించి ఝడిత్యర్థస్ఫూర్తిని గలిగించు నేర్పు గలవారిని దీర్పరులు గొనియాడుచుందురు.

మన తెలుఁగుదేశములో మొట్టమొదటనుండియుఁ బద్యప్రబంధముల కాని నాటకగ్రంథములు లేవు. ఇటీవల వీథినాటకములు గొన్ని బయలుదేరినవి గాని యవి కేవలమును బామరులచేతనే గౌరవింపఁబడుచుండెడివి. క్రమముగా నాగరికత ముదిరినకొలఁదియు వీథినాటకములు నానాటికి మూలఁబడినవి. మఱికొందఱు కాళిదాసాదుల సంస్కృతనాటకములను యథాస్థితిగా గద్యపద్యములుగా మార్చి యుపయోగించుచున్నారు. మఱికొందఱు స్వతంత్రించియే నాటక



ములను దెలుఁగుభాషలో వ్రాసి ప్రకటించుచున్నారు. ఏమయినను భాషాంతరీకృతము లగునాటకముల సంఖ్యకంటె స్వతంత్రించి వ్రాసిన నాటకములసంఖ్య యిప్పటికిని జాలఁ దక్కువ యనియే చెప్పవచ్చును.

శ్రవ్యప్రబంధములకంటె దృశ్యప్రబంధములు జ్ఞానాభివృద్ధికై మిగుల నుపయోగించు ననుట యందఱును నెఱిఁగినయంశమే. కావుననే కాళిదాసాది మహాకవులు ప్రయత్నపూర్వకముగా నాటకములు గూడ వ్రాసి యాచంద్రార్కమును జెడనికీర్తిని సంపాదించుకొనిరి. కావున నాటకములు వ్రాయకవులే లోకోపకారు లని చెప్పవలసి యున్నది. అట్లనుటచేఁ దక్కినవారు కారని యభిప్రాయపడెదరేమో యట్లుగాదు. ఏమనఁగాఁ బ్రత్యక్షముకన్న శాబ్దము ప్రమాణము గాదు గదా! కావున నేనును:—

## కథాప్రారంభము.

సత్యసంధుఁ డని యనేక మహామహులవలనఁ బేరువడసిన హరిశ్చంద్ర మహారాజుయొక్క యుత్తమచరిత్రము నొక నాటకముగా వ్రాయుట కుద్దేశించితిని. మనదేశస్థులు పురాతనచరిత్రములయందును మిక్కిలి యాదరము గలవారై పలుమాఱు వానిని జదువుటయందును వినుటయందును గొంచెమైనను సోమరితనము లేక యుండుట నైసర్గికమగుటచే వారల కీయుత్తమపురుషుని చరిత్రమును గాలానుసారముగాఁ బొందుపఱిచి వ్రాయుట ముఖ్య మని తోఁచుటచే నందులకై లేఖినిని బ్రేరేపించుచున్నాను.

కోసలదేశమునకు ముఖ్యపట్టణమును, మోక్షప్రదము లగునేడుపట్టణములలో మొదటిదియు నగు నయోధ్య రాజధానిగా నాఱుగురు చక్రవర్తులలో మొదటివాఁ డగు హరిశ్చంద్రమహారాజు రాజ్యమును బరిపాలించుచుండెడివాఁడు. ఆమహారాజొకప్పుడు సింహాసన మలం

కరించ్చి యుండఁగా తపోనిధు లగుకొందఱు మునీశ్వరులు వచ్చి ద్వార భూమియం దున్నా రని ద్వారపాలకునివలన విని సింహాసనము దిగి వారి నెదుర్కొని విధ్యుక్తముగా నర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి తోడి తెచ్చి యుచితాసనములఁ గూర్చుండఁబెట్టి వినయవిధేయతలతో సంభాషించుచుండెను. అప్పు డామునులలో నొకముని కాన్యకుబ్జమను పేరుగలరాజ్యమున కధీశ్వరుఁడగు చంద్రదయుఁ డను మహారాజు తపస్సిద్ధివలనఁ బడసిన చంద్రమతియను కన్నియయొక్క రూపలావణ్యాదులను గుణాతిశయమును వర్ణించి యామెను నీవు పాణిగ్రహణ మొనర్చి కొందువేని బంగరు పువ్వునకుఁ బరిమళ మబ్బిన ట్లుండు నని చెప్పెను.

హరిశ్చంద్రుఁ డామునివరుఁడు సెప్పినవాక్యముల కెంతయు స్వాంతమున సంతసించి యంతటనే చతురంగబలముతోఁ బయనమై యాపట్టణముం బ్రవేశించెను. మఱునాఁ డందఱును స్వయంవరమంటపమును జేరిరి. "జన్మాంతరాధికృతకర్మవిపాక జన్మైవోన్మీలతి క్వచన కస్యచ నానురాగః" అను న్యాయము చొప్పున నాచంద్రమతి యాహరిశ్చంద్రనరేంద్రుననే పతిగా వరించి పూలమాల యాభూపాలుని కంఠమున గీలించినది. ఆమహోత్సవమును జూచి మాత్సర్యప్రేరితులై లోలోనఁ గందఱును నిందించుచు నొకనిమొగ మొకఁడు చూడఁజాలక స్వయంవరమునకై వచ్చిన రాజకుమారులు తమతమ దేశములకుఁ బోయిరి.

హరిశ్చంద్రుఁ డతివైభవముగా నాసతీమతల్లిని బరిణయమై కృతసత్కృతుఁడై కొన్నినాళ్ళు మామగారిమందిరమున నుండి పిమ్మట వారి యనుమతి నొంది ధర్మపత్నీసమేతుఁడై యయోధ్యకు వచ్చెను. కొంతకాలము వివిధములయినభోగము లనుభవించుచుఁ బ్రజాపాలన మొనరించుచుండఁగా దైవకృపవలన నాపుణ్యదంపతులకుఁ గుమారుఁడు జని



యించెను. కులగురుండగు వసిష్ఠభగవానుని యనుమతిచే నతనికి దేవదాసుఁ (లోహితాస్యుఁ) డని నామకరణము చేసిరి. పుత్త్రోదయమున కెంతయు సంతసించి యామహీకాంతుఁడు తన పౌరులు మొదలగువారి నందఱను యథోచితముగా సంతసపఱుచుచు నుండెను.

ఇది యిట్లుండఁగా నొకనాఁడు విశ్వామిత్త్రుఁడు, వసిష్ఠుఁడు, అత్రి, సూతుఁడు మొదలగువారు దేవేంద్రుని జూచుటకై స్వర్గలోకమునకు వెళ్ళిరి. అప్పు డామునీశ్వరులు నెదుర్కొని పూజించి యుచితాసనములఁ గూర్చుండ నియోగించి యాయాప్రసంగము లడుగుచు దేవేంద్రుఁడు "మునిభగవానులారా! తాము పంచభూతములను స్వాధీనము చేసికొన్నవారు. తమకుఁ ద్రికాలములయందలి సంగతులును గోచరమే యగుచుండును గావున భూలోకములో మంచినడత గలవాఁడును సత్యము దప్పనివాఁడును నగురాజు గలఁడా?" అని ప్రశ్నింపఁగా నందఱును విని యేమనుటకును నోరాడక యొకరిమొగ మొకరు చూచుచునుండఁగా వసిష్ఠమహాముని లేచి యింద్రునివంకఁ జేయెత్తి "దేవేంద్రా! ఒడిలో బిడ్డ నుంచుకొని యూరెల్ల వెదకినట్లు నాశిష్యుఁడు హరిశ్చంద్రమహారాజు సత్యము దప్పనివాఁడును మంచినడతగలవాఁడును నుండఁగా నేల యీలాగు ప్రశ్నచేయుచున్నావు?" అనఁగానే యామాటలు విని తొల్లింటిపగ ప్రేరేపింపఁగా లేచి విశ్వామిత్త్రుఁడు "ఏమేమీ? యిందఱు మునులలో నీశిష్యుని నొకపెద్దగాఁ జెప్పుకొనుటకు నీకు సిగ్గయినను లేకపోయినదా? నే నెఱుఁగనా మీహరిశ్చంద్రుని, చాలు నీప్రగల్భములు చాలించుము" అని ప్రతికూలముగాఁ జెప్పెను.

ఈరీతిగా నిరువురును వాదించుకొని పందెములు వైచుకొని యుండఁగా నపు డాయింద్రుఁడు "మీయుభయుల మాటలలోని సారమును నిక హరిశ్చంద్రుని యధీనమై యున్నది. అదియును జూతము

లెండు." అని చెప్పి యాయిరువురిని సమాధానపఱిచి సభ చాలించెను. తరువాతను వసిష్ఠుఁడు విశ్వామిత్రుఁడు మొదలయిన మునీశ్వరులందఱును దమతమ యాశ్రమములకుఁ బోయిరి. అది మొదలుకొని విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని లోపములు గనిపట్ట మొదలిడెను.

ఇది యిట్లుండఁగా నయోధ్యాపట్టణ సమీపమున నున్నయడవికి సమిధలు దర్భలు మొదలగు వానికొఱకు వచ్చి వసిష్ఠుని శిష్యులును విశ్వామిత్రుని శిష్యులును నొకచెఱువుగట్టునఁ గలసికొనిరి.

(ఇక్కడనుండి నాటక మారంభింపఁబడినది.)

అపుడు విశ్వామిత్త్రుని శిష్యులు వసిష్ఠుని శిష్యులతో వాదించి జయ మొందుద మను తాత్పర్యముతో వేదాంతవిషయముగా ననేక విధములుగాఁ బ్రశ్నించుచు వచ్చిరి. వాని కన్నింటికిని వసిష్ఠుని శిష్యులు తగిన సమాధానములను వెంటవెంటనే చెప్పిరి. తరువాత విశ్వామిత్త్రునిశిష్యు లోడిపోయి వసిష్ఠుని శిష్యులతో విరోధించి యచ్చటనుండి తమ గురువుదగ్గరకుఁ బోయి జరిగినది కొంత పెంచి యాతనితోఁ జెప్పిరి. "చెప్పుడుమాటలు చెడ్డవి" యను సామెత యాదినుండియు నున్నదే కనుక వారు చెప్పినమాటలు విని మండిపడి వెంటనే లేచి యక్కడనుండి బయలుదేఱెను.

ఇట్లు బయలుదేఱి తిన్నఁగా నయోధ్యకు వచ్చి హరిశ్చంద్రుని జూడఁబోయెను. ఆమహారాజును విశ్వామిత్త్రునిరాక విని మిగుల సంతసించి యెదుర్కొని తెచ్చి యర్ఘ్యపాద్యాది విధులచేఁ బూజించి యుచితాసనంబున గూర్చుండఁబెట్టి కుశలప్రశ్న చేసినపిమ్మటను విశ్వామిత్త్రుఁడును రాజును గుశలప్రశ్నచేసి తరువాతను "రాజా! నే నొక యాగమును జేయఁదలపెట్టితిని. దానికి నూఱులక్షలు సువర్ణములు పట్టును. "కర్తా కారయితా చైవ సమానఫలభాగ్భవే" త్తను న్యాయ



మును నీవును నెఱిఁగియే యుందువు గనుక "నీద్రవ్యసహాయము చేసి యాగము పూర్తిపఱిపింపవలయు" ననఁగానే రాజు సంతోషించి యట్లే యిచ్చుట కంగీకరించెను. విశ్వామిత్త్రుఁ డితని యౌదార్యమునకు మనస్సులో సంతోషించి "రాజా! యీద్రవ్యము ప్రస్తుతము నీయొద్దనే యుండనిమ్ము. అవసరపడఁగానే వచ్చి పుచ్చుకొనియెదను" అని చెప్పి యచ్చటినుండి తిన్నఁగాఁ దనయాశ్రమమునకు వచ్చి చేరెను. వెంటనే విశ్వామిత్త్రుఁడు తనశిష్యులను బంపి వేఁటకాండ్రను రప్పించి యడవిలో నుండు దుష్టమృగములను వెంటనే యూరిలోనికిఁ బ్రవేశపెట్టి పాడు చేయించు మని యాజ్ఞాపించెను. వాండ్రును నట్లే చేసిరి. అట్లగుటచే మృగము లూరిమీఁదను బడి ప్రజను హింసించుచుఁ బొలములు పాడు చేయ మొదలిడినవి. ప్రజలందఱును నొక్కుమ్మడిగా వచ్చి హరిశ్చంద్రమహారాజుతో మొఱ్ఱపెట్టుకొన్నారు. హరిశ్చంద్రుఁడు వారికి ధైర్యము చెప్పి యెవరియిండ్లకు వారిని బంపించి వెంటనే వేఁటకు బయలుదేఱుటకై వేఁటగాండ్రను రప్పించి సైన్యసమేతుఁడై యడవిలోఁ బ్రవేశించి దుష్టమృగములను యథేష్టముగా హింసించెను. ఆతనిమంత్రియగు సత్యకీర్తి యొకపెద్దపులిని వెంటఁబడి తరుముకొని దూరముగాఁ బోయి యున్నాఁడు. రా జొకయేదుఁబందని కొట్టి యొక చెట్టుక్రిందను గూర్చుండెను.

ఈప్రకారముగా హరిశ్చంద్రమహారాజు వేఁటకు వచ్చియున్నాఁ డన్నసంగతి విని విశ్వామిత్త్రుఁడు తనయొద్ద శుశ్రూషచేయుచు బ్రహ్మవిద్య నధ్యయనము చేయుచున్న మునికన్యలను బోగపువేషము వేయించి "మీయాటపాటలచేతను మీ మాటలచేతను వేఁటకై యడవికి వచ్చియున్న హరిశ్చంద్రుని వలపించి లోఁబఱుచుకొని రండు" అని యాజ్ఞాపించి పంపించెను. ఆకన్యకలును నదేమాదిరిగా

హరిశ్చంద్రునియొద్దకు వచ్చి ముని చెప్పిన చొప్పునఁ జేసిరి. మోళ్ళు చిగుర్చునట్లును ఱాళ్ళు గఱఁగునట్లును బాడిరి. మనోహరముగ నాడిరి. ఇదంతయుఁ జూచి మహారాజు పై నేమిజరుగునో యను సంగతిని దెలిసికొనుటకై కొంచెము నిదానించియుండెను.

పిమ్మట రాజు వీండ్రపాట విని మనసులోఁ జాల సంతోషించి తనకంఠసీమ నలంకరించియుండు రత్నహారములు దీసి యిద్దఱకును జెఱియొకటి యీయఁబోఁగా వాండ్రు "రాజా! నిన్ను మోహించి వరించుటకు వచ్చితిమిగాని నీహారాలకు మోరీలకు మే మాసపడి రాలేదు కావున మాకోర్కె తీర్చవలసినది" అని తమకోర్కె నాయనతోఁ దెలిపిరి. రాజును వాండ్రకుఁ జెడునడతలవలనఁ గలుగు ననర్థములను మంచిమాటలతో బోధించి మాఱుమొగము పెట్టుకొని కూర్చుండెను. వాండ్రును రాజుయొక్క యుత్తమగుణములకు లోలోపల సంతోషించి తాము చేయవచ్చినపని నెఱవేఱకపోయినప్పటికిని నతనిని గొనియాడిరి. వీండ్రు కోరినకోరిక యననుగుణ మగుటచేఁ గొంచెము కోపించి పరుషముగా నేమో యనఁబోయెను. ఆమాటలు విని వాండ్రును గోపించి రాజును నిందింప మొదలిడిరి. పిమ్మట నక్కడనుండి విశ్వామిత్త్రునియొద్దకు వచ్చి సంగతియంతయుఁ జెప్పి మొఱలిడసాగిరి. అది విని ముని మనసులోఁ జాలఁ గినిసి రాజువలనఁ గలిగిన పరాభవమునకు వెంటనే ప్రతిక్రియ చేయుటకై బయలుదేఱి తిన్నఁగా రాజునొద్దకు వచ్చెను. మునివరుని రాక చూచి రాజు చాలఁ గంపించి యేమిజరుగునో యని భయపడి చేతులు జోడించుకొని వినయముగా నిల్చుండి యుండఁగా "రాజా! నీవు రాజ్యమదముచేతను గదా! కనులు గానక యిచ్చకు వచ్చినపనులు చేయుచున్నావు" అని యేమేమో భీకరముగా మాటలాడఁదొడఁగెను. ఆమాటలు విని రాజు "మునివరా! నా



కటువంటిరాజ్యమద మెప్పుడును లేదు. రాజ్యము నొకశుష్కతృణముగాఁ జూచుచున్నాను" అనెను. అది విని విశ్వామిత్త్రుఁడు లోలోన సంతోషపడుచు నేమేమో ప్రస్తుతోపయోగముగా రాజుతో మాటలాడి రాజును వశపఱిచికొని రాజ్యమంతయుఁ దన కిచ్చునట్లు ప్రోత్సాహపఱిచి పుచ్చుకొన్నాఁడు.

హరిశ్చంద్రుఁ డట్లు రాజ్యమంతయు విశ్వామిత్త్రుని యధీనము చేసి పిమ్మట నాముని చెప్పినచొప్పుననే నగలుమొదలగునవి తీసివేసి సామాన్యపువేషమును ధరించి భార్యాపుత్త్రసమేతముగా వానప్రస్థాశ్రమమునకు బయలుదేఱఁగానే ముని హరిశ్చంద్రుని జూచి "రాజా! మఱచితిని. మునుపు నీదగ్గర దాచఁబెట్టుకొనియున్న నానూఱులక్షలుసువర్ణములును నా కిచ్చి మఱియు నడవికిఁ బొమ్ము" అనెను. రాజు మునికి రాజ్యమప్పగించునపు డాసువర్ణముల సంగతి యేమియుఁ జెప్పకుండుటచే నిక వేఱుగా నాసువర్ణము లీయ నొప్పుకొన్నట్లు మాటవరుసకు స్పష్టమగుచున్నది. అందులకుఁగాను నలువది దినములకుఁ లోఁగానే యిచ్చుటకు గడువు కోరుటయే కాక మునియాజ్ఞమేరకుఁ దనయప్పు తీర్చకుండ మరలి యయోధ్యకు రానని నిశ్చయించుకొని మునివరునికి నమస్కరించి చెప్పి పోయెను. హరిశ్చంద్రుని తల్లి చిత్రరేఖ యనునామె కొడుకును విడువలేక వెంట వచ్చుటకు సిద్ధపడఁగానే యడవిలో నుండెడి యిడుమలు నొడివి యాపడతిని బుడమియొడయఁడు, కడుంగడు దుఃఖపడుచుండఁగా నయోధ్యలోనే విడిచి యడవికి నడిచెను. పిమ్మట మంత్రులు మొదలగువారును బౌరులును జాలఁ జింతించిరి. రాజును విడువలేక యేడ్చిరి. రాజు వారినందఱను బ్రత్యేకముగా నోదార్చి మంచిమాటలు చెప్పి వెంట రానీక యింటికిఁ బంపెను. పిమ్మట నెట్టకేలకయోధ్యపొలిమేర దాఁటెను.

విశ్వామిత్రుఁడు తనకు రావలసినధనము రాఁబట్టుటకై నక్షత్రేశుఁ డనుశిష్యుని బిలిచి చెప్పవలసినమాటలు చెప్పి హరిశ్చంద్రుని వెంటఁ బంపించెను. అతఁడును ముని చెప్పిన నట్లే “హరిశ్చంద్రుఁడు మొదలగు వారిని బలువిధములుగా హింసించి సత్యమునుండి తప్పించెదను” అని నమ్మించి గురువుగారియొద్ద సెలవుపుచ్చుకొని రాజును వెంబడించెను.

పిమ్మట విశ్వామిత్రుఁడు “పౌరులలో నెవ్వరైనను రాజువెంట వెళ్ళఁగూడ” దనియు “రాజును జూడఁగూడ” దనియు, “నీయాజ్ఞను మీఱి నడిచినచో రాజద్రోహులుగా నెంచి వారు చట్టప్రకారము దేశభ్రష్టులుగాఁ జేయఁబడుటయే కాక చరస్థిరరూపమయిన యావద్ధనమునకునుగూడ దూరముచేయఁబడుదురు.” అనియుఁ జాటింపించెను. అది విని మంత్రులుమొదలగువా రందఱును జాలఁ జింతించిరి.

ఇట్లుండఁగా రాజు మొదలగువా రయోధ్యనుండి బయలుదేఱి సమీపమునందున్న యొకవనములో నివసించి యుండఁగా నక్షత్రేశుఁడు “నా కాఁకలి యగుచున్నది. నా కాఁకలి యగుచున్నది” అని యల్లరి చేయఁ బ్రారంభించెను. అప్పుడే విశ్వామిత్రునిశిష్యులలో నొకఁడు పరమానందుఁ డనువాఁడు మాఱువేషముతో వచ్చి “రాజా! మీయమ్మ చిత్రరేఖ యనునామె నీవియోగముచేత మూర్ఛాక్రాంత యయిపడియున్నది. తత్క్షణమే బయలుదేఱి, రమ్ము. లేనిచో నిష్కారణముగాఁ జచ్చిపోవునేమో” అని లేనిమాటలు కల్పించి చెప్పి రమ్మని ప్రార్థింప మొదలిడెను. అది విని హరిశ్చంద్రుఁడు మొదలగు వారు చాల వ్యాకులపడిరి. నక్షత్రేశుఁ డయోధ్యకే పోవుద మని ప్రోత్సాహపఱుప మొదలిడెను. హరిశ్చంద్రుఁడు, “మునితోఁ జెప్పిన ప్రకారముగా వారిధనము వారికిఁ దీర్చకుండఁ బట్టణమున కెట్లు రావచ్చును? ఏమిజరిగినను దైవసంకల్పమే కద! మన మేమిచేయఁగలము?”



అని బదులు చెప్పెను. పిమ్మట నందఱును, బరమేశ్వరుని బ్రార్థించి యచ్చటనుండి బయలుదేఱి సరయువుగట్టెక్కిరి. ఇంతట సత్యకీర్తి యను మంత్రి మాఱువేషముతో వచ్చి రాజును గలిసెను. అది చూచి రాజు భ్రమించి “సత్యకీర్తీ! ఏల యీలాగున వచ్చితివి?” అని యడుగఁగా విశ్వామిత్రునిచాటింపంతయుఁ జెప్పెను. అది విని రాజు ముని చేసినకార్యములన్నింటికిని దగినకారణములు చెప్పి మంత్రిని దనయొద్ద నుంచుకొనెను. అక్కడనుండి బయలుదేఱి పోవుచు ముందఱ నొక పెద్దగుహాద్వారమును జూచి యందఱును నాద్వారముగుండ నెటకేలకు బయటికిఁ జేరిరి.

పిమ్మట హరిశ్చంద్రుఁడు మొదలయినవా రందఱును మెల్లఁగా గోమతీనదియొద్దనకుఁ జేరియుండఁగా నింతటఁ జేతనుఁడనువాఁడు విశ్వామిత్రుని శిష్యుఁ డొకఁడు యతివేషమువేసికొనివచ్చి హరిశ్చంద్రుఁడు మొదలగువారి నుద్దేశించి “పాపము! చిత్రరేఖ యనునది పుత్త్రవియోగమును సహింపలేక బెంగపెట్టుకొని దిక్కుమాలినచావు చచ్చినది” అని వ్యాకులపడుచున్నవానివలెఁ జెప్పెను. అందఱును నొక్కపెట్టున గోలుమని యేడ్చిరి. నక్షత్రేశుఁడు వారికిఁ దటస్థించిన యాపదసంగతిని గూర్చి వ్యసనపడుచున్నట్లు నటించుచు “హరిశ్చంద్రా! అయోధ్యకుఁ బోయి మీయమ్మ కుత్తరక్రియలు చేయుము. ఇందులకే కదా “కొడుకులో కొడుకులో, అని యేడుచుచుందురు పెద్దలు” అని వంచింపుమాటలు వచింప మొదలిడెను. ఆమాటల కంగీకరింపక “మునివరులకు ధనము చెల్లించిననేకాని యయోధ్యకు రాఁజాల” నని చెప్పి తన కర్మమే తనదిగా నెంచుకొని మునితోడఁ జెప్పినమాట మనస్సులో నుంచుకొని నక్షత్రేశుననుకుఁదగురీతిని సమాధానముచెప్పి హరిశ్చంద్రుఁ డందఱితోడను బయలుదేఱి యడవులు మొదలగునవి దాఁటి గంగ

యొద్దునకుఁ జేరెను. పిమ్మట నప్పుణ్యనదిలో మునిఁగి యందఱును దమకర్మమును గడిగికొని యన్నదియొద్దున నుండునొకవనములోఁ బ్రవేశించిరి.

అచ్చట వైఖానసుఁడు, వశిధరుఁడు, సారంగుఁడు, అనుమురువుర శిష్యులు సేనాధిపతివేషముతో నగపడి "పాపము! చంద్రదయుఁడను రాజు భార్యతోఁగూడఁ బరరాజులచేతను జంపఁబడెను" అనియు "ఈ సంగతి నీతోఁ జెప్పుమనుటయేకాక శత్రువుల నందఱను జంపి రాజ్యమంతయు నిన్నే యేలుకొమ్మన్నాఁడు" అనియుఁ జెప్పిరి. ఆమాటలు వినఁగానే చంద్రమతి మొదలగువారు చాల దుఃఖించిరి. పిమ్మటఁ దమకుఁ దామే యోదార్చుకొని యచ్చటినుండి బయలుదేఱి శోణనది యొద్దునకుఁ జేరిరి. వైరధముఁ డను శిష్యుఁడు జ్యోతిష్కునివేషము, వేసికొని రాజునొద్దకు వచ్చి జ్యోతిషము చెప్పమొదలిడెను. వాఁడీక హరిశ్చంద్రునికి రాఁబోవువానిని జెప్పుటయే కాక "ప్రాణాపాయముగూడఁ దటస్థించు" ననియు "వీని నాఁడువాండ్రకుఁ జెప్పఁబోకుమీ" యనియు దృఢముగాఁ జెప్పెను. పిమ్మటను రాజును జూచి చంద్రమతి "కాలబల మేరీతికా నున్నది" అని యడుగఁగా హరిశ్చంద్రుఁ డంతయు విన్నది విన్నట్లు చెప్పెను. అది విని జ్యోతిష్కుఁడు కోపించి యాడరానిమాట లాడుచుఁ బోయెను. తరువాత నందఱును గలవరపడి కన్నీరువిడిచి కొంతసేపటికి ధైర్యము దెచ్చుకొని క్రమముగా యమునానదియొద్దునకుఁ జేరిరి. తరువాతను వివేకుఁ డనుశిష్యుఁడు తత్త్వశాస్త్రిగాను, జ్ఞానాదిత్యుఁ డష్టావధానిగాను వచ్చి హరిశ్చంద్రుఁడు మొదలగువారితోఁ బ్రపంచ మసత్య మనియు, దేహ మసత్యమనియు, అది యిది యన నేల తుద కంతయు నసత్యమే యనియు నిచ్చట మన మనుభవించిన సుఖ మొక్కటిమాత్రమె నిజ మనియు ననేక



విధములుగా వితండవాదములు సలిపి యిచ్చినరాజ్యమును లేదని చెప్పి మరలఁ బుచ్చుకొమ్మని ప్రోత్సాహపఱిచెను. జ్ఞానాదిత్యుఁడు "తొండకు వెలుఁగే సాక్షి" అను న్యాయముగా వివేకుఁడు చెప్పిన దంతయు నిజమే యని సాక్ష్యము చెప్పెను. హరిశ్చంద్రుఁడు వారు చెప్పిన యసత్యన్యాయములకుఁ దగురీతి సమాధానము చెప్పి యచ్చట నుండి బయలుదేఱి యందఱితోడను మెల్లఁగాఁ గాశీక్షేత్రములోఁ బ్రవేశించెను. అచ్చట నక్షత్రేశుఁడు తనకుఁ గడుపునొప్పి వచ్చినట్లు తొందరచేయఁగా సత్యకీర్తి తత్క్షణమే పోయి వైద్యుని వెదక మొదలిడెను. ఇట్లు వెదకుచుండఁగా మత్సరుఁడు వైద్యునివలె వేషము వేసికొని యొకచోటున నగపడెను. సత్యకీర్తి రమ్మని పిలువఁగానే వచ్చి నక్షత్రేశుని జూచి హరిశ్చంద్రుని దూరముగాఁ గొనిపోయి "రాజా! యిది యసాధ్యరోగము. ఈసంగతి రోగితోమాత్రము చెప్పఁబోకుము." అని దృఢముగాఁ జెప్పెను. తరువాత నక్షత్రేశుఁడు హరిశ్చంద్రుని బిలిచి యేమిసంగతి యని యడుగఁగా వైద్యుఁడు చెప్పినమాట యన్నియు మాట విప్పి యెదుటఁ బెట్టినట్లు చెప్పెను. అది విని వైద్యుఁడు తనయెత్తు సాగనందులకై కోపించి యచ్చటినుండి పోయెను. దొంగ కడుపునొప్పియుఁ గ్రమముగాఁ గుదిరినది.

ఇటువంటికష్టము లన్నియు గట్టెక్కినతరువాత నందఱును గంగలో స్నానము చేసి కోవెలకుఁ బోయి విశ్వేశ్వరుని సందర్శించిరి. నక్షత్రేశుఁడు ధన మియ్యవలసిన దని తొందరచేయ నారంభించెను. హరిశ్చంద్రుఁ "డీక నేమి చేయుదును దైవమా!" అని సత్యకీర్తితో నాలోచించుచు నిలువఁబడియెను. అక్కాలమందు విశ్వామిత్రుని శిష్యులలో నొకఁడు రసనాదిగా వచ్చి సంగతులు దెలిసికొని హరిశ్చంద్రునకుఁ గావలసిన ద్రవ్యమును దాను జేసి యిచ్చునట్లు నమ్మిక పుట్టఁజెప్పెను. అందులకు

హరిశ్చంద్రుఁడెంతయు సమ్మతించి సంతోషపడెను గాని యారసవాది "తా నిచ్చుద్రవ్యము రెండుదినములకుమీఁదఁ గొంత ధన్నె తగ్గు" ననియు "నప్పు డందులకుఁ దగినట్లు వెలయును దగ్గును" అనియుఁ జెప్పెను. నక్షత్రేశుఁ డాబంగారమును దాను దీసికొనుటకై సమ్మతించెనుగాని హరిశ్చంద్రుఁడది యితరులను మోసపుచ్చుటే యగు నని యాధన మక్కఱలే దనియు మేము వేఱువిధముగాఁ దెచ్చి యిచ్చెద మనియు నాచోటు విడిచి యొకసత్రములోఁ బ్రవేశించెను.

అటుపిమ్మట నక్షత్రేశుఁడు ద్రవ్యము వేగముగాఁ జెల్లింపవలయు నని తొందర చేయుటచే హరిశ్చంద్రుఁడెవరికేని పూఁటఁ బడియైనను త్వరలోనే మీధనము మీకుఁ జెల్లింతు నని చెప్పఁగానే విని నక్షత్రేశుఁడు బైటికిఁ బోయి విశ్వామిత్త్రుని శిష్యులలో నొకఁడు కాలకంఠుఁ డనుపేరుగల ముసలివానివేషముతో రాఁగా వానిని సంధించి జరిగిన సంగతి యంతయుఁ జెప్పి హరిశ్చంద్రుని యొద్దకుఁ దీసికొనివచ్చెను. కాలకంఠుఁడు హరిశ్చంద్రునిఁ జూచి తన కొకసేవకురాలు గావలసి యున్న దని చెప్పఁగా రా జందులకు సమ్మతించి తనభార్యనుమాత్రము సేవకురాలినిగా నిచ్చుట కంగీకరించి నూఱులక్షలు సువర్ణములును దన కిమ్మని చెప్పి పుచ్చుకొని నక్షత్రేశునకుఁ జెల్లించెను. కాలకంఠుఁడు చంద్రమతిని స్వాధీనపఱుచుకొని వాదించి దేవదాసునిగూడ వెంటఁబెట్టుకొని చంద్రమతిని దనయింటికిఁ దీసికొనిపోయెను.

ఈరీతిగా ద్రవ్య మంతయుఁ బుచ్చుకొని నక్షత్రేశుఁడు కొన్నవారి కిచ్చిన లంచపుధనముకూడ నాకు రావలసియున్నది. చెల్లింపవలయు నని యల్లరి ప్రారంభించెను. అది న్యాయమే యని యెంచి నేనే యెవరికైనను విక్రయింపఁబడి మీకు రావలసినధన మిచ్చెద నని చెప్పి తన్నెవరైనను గొందురేమో యని వెదుక నారంభించెను. ఇంతట



విశ్వామిత్త్రుని శిష్యులలో నొకఁడు శ్మశానము గాచువానివేషముతో వచ్చి తనపేరు వీరబాహు వనియుఁ దన కొకదాసుఁడు గావలసియున్నాఁ డనియుఁ జెప్పఁగా హరిశ్చంద్రుఁ డాదేశపు మనుష్యులయోగ్యత నడిగి తెలిసికొని తనయభిప్రాయమును బ్రకటించెను. వీరబాహువు తానే కావలసినద్రవ్య మిచ్చి కొనఁగల నని యొప్పుకొనఁగా హరిశ్చంద్రుఁ డందులకు సమ్మతించి ధనము పుచ్చుకొని నక్షత్రేశునకుఁ జెల్లించి వీరబాహునివెంట వానియింటికిఁ బోయెను. సత్యకీర్త్తి హరిశ్చంద్రుని వెంట వచ్చుచుండుట చూచి వీరబాహువు రావల్లఁగాదని నిషేధింపఁగానే విధిలేక హరిశ్చంద్రుని విడిచి యేడ్చుచు నెందేని పోయెను. హరిశ్చంద్రుఁ డట్లు వీరబాహునియింటికిఁ బోయి వాఁడును వానికి భార్యగా వచ్చియున్న పతివ్రతయుఁ జెప్పినపను లన్నియుఁ జేయుచుండెను. అట శ్మశానము కాచుచుఁ జచ్చిన యెద్దుమొదలగువానిని గోయుచు నీప్రకారముగాఁ దన సేవాధర్మమును నెఱవేర్చుచుండెను. విశ్వామిత్త్రుని శిష్యులలో నొకఁడు వీరఁ డనుపేరుపెట్టుకొని హరిశ్చంద్రునికిఁ దోడుగా నుండువానివలె నటించుచు నతనితోఁగూడి శ్మశానమును గాచుచుండెను.

ఇది యిట్లుండఁగా నచ్చటఁ గాలకంఠుని యింటికిఁ జేరిన చంద్రమతియు దేవదాసుఁడును వారి కనేకవిధములుగా సేవ చేయుచు నలసత నొంది శ్రమపడుచు నుండఁగా నొకనాఁడు కాలకంఠుఁ డా దేవదాసును దోడి బ్రాహ్మణ బాలురతోఁగూడి పోయి యడవినుండి దర్భ, సమిధలు మొదలయినవి తెమ్మని చెప్పి యడవికిఁ బంపెను. ఆపిల్లవాఁ డదేప్రకార మాబాలురతో నడవికిఁ బోయెను.

వారువారు పలుచోటులకుఁ బోయి తమకుఁ గావలసినవానిని వెదకువారివలెను దేవదాసుఁడు చేయుదానిని జూడనివారివలెను దిరు

గుచుండిరి. పిమ్మట దేవదాసుఁ డయ్యవా రేమిచేయుదురో యని భయపడి యటు నిటు తిరుగుచు నచ్చట నొకపుట్టపైని బలసియున్న దర్భ గోయుటకుఁ బోయెను. విశ్వామిత్త్రుని శిష్యులలో నొకఁడు సర్వార్థసిద్ధి యనిపేరుపెట్టుకొని యచ్చటకు వచ్చి దేవదాసునితో స్నేహముచేసి దర్భకోయుటకు సాయపడెను. దేవదాసుఁడును వానివెంట నుండి దర్భలాగుచుండఁగా నొకముల్లు పాదమునఁ గ్రుచ్చుకొన్నది. ఆబాలుఁ డాబాధకుఁ దాళఁజాలక యేడ్చుచుండఁగా సర్వార్థసిద్ధి యాముల్లు దీయువానివలె నటించి యాముల్లు మెల్లఁగాఁ దీసి యాచోటున విషమెక్కించి యచ్చటనుండి పరుగెత్తుకొని పాఱిపోయెను. విషతీవ్రతకుఁ దాళఁజాలక దేవదాసుఁడు "అమ్మో!" అని యేడువసాగెను. ఆధ్వని విని బాలురు వెదకుకొనుచు వచ్చి సంగతి యేమని యడుగఁగా నేమియుఁ జెప్పఁజాలక మూర్ఛపడిపోయెను. ఆబాలురమాటల చప్పుడు విని యాపొదలో నున్నపా మొకటి పుట్టలోఁ దూఱినది. దానిం జూచి, యాబాలురు దేవదాసుని పామే కఱచిన దని నిశ్చయించుకొని పడిపోయి ప్రేతముగా నున్న యాపిల్లవాని నొక మఱ్ఱిచెట్టుక్రిందఁ బరుండఁబెట్టి మీఁద నాకులు గప్పి తమతమ యిండ్లకు బయలుదేఱిరి.

ఇచ్చటఁ జంద్రమతి సూర్యాస్తమయ మయినప్పటికిని దనకుమారుఁడు రాకుండుటకుఁ జింతించుచుఁ గాలకంఠునకు నమస్కరించి తన కుమారుని వెదకి తీసికొనివచ్చుట కనుమతి పుచ్చుకుని యూరిబైటిదాఁకఁ బోయి బ్రాహ్మణబాలురరాక చూచి వారివలనఁ దన పుత్త్రుని సంగతి యంతయు విని గోలు మని యేడ్చియేడ్చి మూర్ఛిల్లెను. పిమ్మటఁ దనలోఁదానే ధైర్యము తెచ్చుకొని లేచి వెంటనే యింటికి వచ్చి కాలకంఠునితోను వానిభార్యతోను జెప్పఁగాఁ దమద్రవ్యమంతయు నష్టపడిపోయెనే యని వారు చింతింపమొదలిడిరి. చంద్ర



మతి తాను జేయవలసినగృహకృత్యములను వేగముగా ముగించి తన కుమారుని కళేబరమును వెదకి తీసికొనిపోయి సంస్కరించి రావలె నని వారియొద్ద నాజ్ఞనుబొందఁగోరఁగా వారు పలువిధముల శోధించి తుట్టతుదకుఁ దెల్లవాఱకమునుపు వచ్చెదవేని వెళ్ళవచ్చు ననిరి. ఆప్రకారమే వచ్చెద నని యొప్పుకొని యతివేగముగా నడవికిఁ బోయి ప్రతిచెట్టుక్రిందను వెదకి తుద కొకమఱ్ఱిచెట్టుక్రిందఁ బడియుండుటను జూచి తత్క్షణమే మూర్ఛిల్లెను. కొంతవడికి ధైర్యము దెచ్చుకొని లేచి యాశవము నెత్తి బుజముపై వైచుకొని శ్మశానమును వెదకుచు బయలుదేఱినది. ఇంతట సర్వార్థసిద్ధి యనువాఁడు తనతో నున్న సోమసుందరునివలనఁ జంద్రమతిసంగతి యంతయుఁ దెలిసికొని యిఁక నయ్యవారి యింటికి వెళ్ళుట మాని తనయొద్ద సేవచేయుచు నుండెద నని యొప్పుకొందువేని వెంటనే నీకుమారుని బ్రదికింతు నని నమ్మలాగునఁ జెప్పెను గాని చంద్రమతిమాత్ర మందులకు సమ్మతించినది గాదు. వారు పోయిరి. చంద్రమతియు శ్మశానమువొద్దకు వచ్చి శవమును దించి యచ్చటఁ బడియున్న కొఱకచ్చు లొకచోటికిఁ బోగుచేసి చితి పేర్చి శవము నందుపై నుంచి యగ్గి ముట్టించినది.

అర్ధరాత్రసమయమునఁ బీనుఁగును గాల్చుచుండుట తెలిసికొని హరిశ్చంద్రుఁడు తన దగ్గర నున్నవీరని లేపి యది యేమో చూచి రమ్మనఁగా వాఁడు పోయి యేకాకినిగా నున్నచంద్రమతిని జూచి భయపడినవానివలెఁ బలువిధములఁ బ్రలపింప మొదలిడి తుదకుఁ దమకుఁ జేరవలసిన చిన్నరూకయు మూరెఁడు గుడ్డయు నిచ్చిననే కాని శవమును గాల్చుటకు వల్లఁగా దనఁగాఁ జంద్రమతి తా నిచ్చుకొనుటకు శక్తిలేనిదాన నని విధేయతతోఁ జెప్పఁగా వీరఁడు కోపించి యాశవమును గ్రిందికిఁ దన్ని తిరుగఁద్రోచి హరిశ్చంద్రునియొద్దకు వచ్చి జరిగినసంగతి

యంతయుఁ జెప్పెను. శవము దన్ని తిరుగఁ ద్రోచినసంగతి విని హరిశ్చంద్రుఁడు చాల దుఃఖించి వీరనికి బుద్ధి చెప్పి పిమ్మటఁ దానే చంద్రమతియొద్దకుఁ బోయి వచ్చినవాఁడు తనకుమారుఁడే యనియు వచ్చినది తనభార్యయే యనియుఁ దెలిసికొని దుఃఖాక్రాంతుఁ డాయెను. చంద్రమతియుఁ దనభర్తయే యిట్లు వీరబాహునకు దాసుఁడాయె నని తెలిసికొని మునుపటికంటెను నెన్నోరెట్లధికముగా దుఃఖించి కడపట రాజాజ్ఞాప్రకారము చిన్నరూకయు మూరెఁడు గుడ్డయుఁ దెచ్చుటకై కాలకంఠుని యింటికిఁ బోయినది.

ఇది యిట్లుండఁగా విశ్వామిత్త్రుని శిష్యులలో నొకఁడు కాశీరాజపుత్త్రుఁ డగు విశ్వనాథుని గురువుయొక్క వేషము వేసికొని యంతఃపురమునకుఁ బోయి యెవ్వరికిని దెలియకుండఁగ నాపిల్లవానిని దెచ్చి విషము ద్రాగించి మూర్ఛిల్లఁజేసి దేవదాసునియాకారమువలె మాఱురూపమును గలిగించి చంద్రమతి శ్మశానమునుండి యింటికి వచ్చు దారిలోఁ బడవైచి పోయెను. చంద్రమతి పోవునపుడు కాలికి శవము తగులఁగాఁ దనకుమారుఁడే యని భ్రమసి తీసి చేతులమీఁద నుంచుకొని యేడువసాగినది. ఆసమయమం దూరికావలివాండ్రు రాజకుమారునిగూర్చి యూరునాలుగు వైపులను వెదకి వెదకి తుద కెచ్చటను గానక తిరుగుచు నీచంద్రమతిని శవముతోఁగూడఁ బట్టుకొనిరి. మఱియు నామెయే యీహత్యచేసిన దని దృఢపఱుచుకొఱకు విశ్వామిత్త్రుని శిష్యులలోఁ గొందఱు పలువిధములుగా మాఱువేషములు ధరించి యచ్చటచ్చట డాగి తుదకుఁ జంద్రమతియే హత్యచేసిన దని చెప్పుటకు సాక్షులుగా నేర్పడిరి. ఇది యంతయుఁ జూచి కావలివాండ్రు తమ యజమానునికిఁ దెలియఁబఱుపఁగా నతఁడు చంద్రమతిని నేరముచేసిన దానినిగా నిరూపించి న్యాయాధిపతి యెదుటకుఁ దెచ్చెను. న్యాయాధిపతి



చంద్రమతిని మధ్యస్థులయెదుట జరిగిన విషయములను విచారింపఁగా నామె దా నేపాపమును నెఱుఁగ నని చెప్పినది. న్యాయాధిపతి సాక్షులు చెప్పిన ధైర్యపు మాటలచేతను మధ్యవర్తుల యభిప్రాయముచేతను జంద్రమతిని నేరముచేసినదానినిగాఁ దీర్మానించి మరణదండనను విధించెను.

ఆమరణదండనను నెఱవేఱుచుటకై వీరబాహున కుత్తరువు కాఁగా వాఁడు తనసేవకుఁ డగు హరిశ్చంద్రున కాజ్ఞాపించెను. పాపము హరిశ్చంద్రుఁడు తన దుర్దశను దలంచుకొని దుఃఖించి తుదకుఁ జంద్రమతిని శిరశ్ఛేదము చేయుటకు సిద్ధపడెను. ఇంతటఁ గాశీరాజుకుమారుని సంస్కరించుటకై శ్మశానము నొద్దకుఁ దెచ్చిరి.

ఆసమయమున విశ్వామిత్త్రుఁ డేవిధముగానైనను హరిశ్చంద్రుని బొంకింపఁజాలక తాను వారికిఁ జేసిన దుర్మార్గపుఁబను లన్నియుఁ దలపోసికొని వ్యాకులపాటుతో హరిశ్చంద్రుని జూచి నడిచిన సంగతులనుగూర్చి విచారింపసాగెను. హరిశ్చంద్రుఁడును మిగుల నమ్రతతో జరిగినదంతయుఁ జెప్పెను. పిమ్మట విశ్వామిత్త్రుఁ డివి యన్నియు. దాను జేసినపనులే యని బాగుగాఁ దెల్పి చంద్రమతిని శిరశ్ఛేదము చేయక కొంతవఱకు నిలుపు మని బ్రతిమాలుకొనెను. అందుల కాహరిశ్చంద్రుఁడు సమ్మతింపకపోఁగా విశ్వామిత్త్రుఁ డప్పుడు తనశిష్యులలో నొకని బిలిచి వెంటనే పోయి వసిష్ఠుని దీసికొని రమ్మని చెప్పి పంపెనుఁ. అప్పుడే వసిష్ఠుఁడు నారదుఁడు మొదలగు మునులును విశ్వామిత్త్రుని శిష్యులును వచ్చిరి. అపుడు చంద్రమతి యందఱకును వందనము లాచరించి దండన ననుభవించుటకు సిద్ధురాలు కాఁగా హరిశ్చంద్రుఁడు భగవంతుని స్మరించి నఱుకుటకుఁ గత్తి మీఁది కెత్తెను. అపుడు వసిష్ఠుఁడు హరిశ్చంద్రుని వారించి తను కింద్రునిసభలో జరిగినవృత్తాంత మంతయు వినిపించి యిఁక నీవు పూర్వమువలెనే రాజ్యమునకుఁ బోయి ప్రజలను

బరిపాలించుచుండువుగాక యని యాశీర్వదించెను. హరిశ్చంద్రుఁ డిటు వంటికొఱఁత లన్నియు ననుభవించిన పిమ్మటను రాజుగానుండుట కిష్టము లేదని నమస్కార పూర్వకముగా విన్నవింపఁగా నపుడు విశ్వామిత్త్రుఁడు "హరిశ్చంద్రా! యీశ్మశానమంతయు యజ్ఞశాల. ఇది త్రిమూర్తుల రూపమునఁ బ్రకాశించుక్షేత్రము." అని యథార్థము చెప్పి హరిశ్చంద్రుని స్తుతిచేసెను. దేవదాసుఁడును, కాశీరాజు కుమారుఁడును విషతీవ్రతనుండి విడువఁబడి జీవించి లేచి తమ తమ తల్లులయొద్దికిఁ బోఁగానే తల్లులు కౌఁగిలించుకొని ముద్దులాడుచుండఁగాఁ దమకు విషముపెట్టిన వారిని జూపించి యచ్చటనే యుండిరి. అంతట నాప్రదేశ మంతయు నందఱును వింతగాఁ జూచుచుండఁగానే యిష్టకామయమయిన యొక దివ్యభవనమువలె నగపడినది. విశ్వామిత్త్రుఁడు తాను దేవసభలోఁ ఒడ్డినపందెము ప్రకారముగాఁ దనతపస్సులోని సగము తప మాహరిశ్చంద్రునకు ధారవోసియ నంగీకరించుటయే కాక జయము వసిష్ఠుని దనియు నపజయము తన దనియు నందఱకును దెలియునట్లుగాఁ జెప్పెను.

ఇవన్నియు నీరీతిగా జరిగిన పిమ్మట మునులును గాశీరాజును హరిశ్చంద్రునితో నయోధ్యకు వచ్చిరి. విశ్వామిత్త్రుఁడు పూర్వము హరిశ్చంద్రునివలనఁ బుచ్చుకొన్న రాజ్య మంతయు మరల నాతని కప్పగించెను. హరిశ్చంద్రుఁ డట్లు రాజ్యమును గైకొని యథాపూర్వముగాఁ బరిపాలించుచు సుఖముగా నుండెను. ఇదియే యీనాటకము నందలి కథాసంగ్రహము.

### కథ సమాప్తము.

ఇఁక హరిశ్చంద్రుఁడు మొదలగువారిసత్యమును బరీక్షించుటకై ప్రయాసపడినవారు విశ్వామిత్త్రునిశిష్యులే యని తెలియఁదగును. వారిలో నొకరొకరు తమ గురునియాజ్ఞ చొప్పున నాయాసమయము



లలో వేఱువేఱురూపములు ధరించి హరిశ్చంద్రుఁడు మొదలగువారిని శోధించి రనియు వానిలో నొకదానికయినను హరిశ్చంద్రుఁడేకాక తక్కినవారును జిక్కువడలేదనియు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నదిగదా

ఈనాటకములోని కొన్ని మార్పులే హరిశ్చంద్రుని చరితమును దెలియఁజేయు పెక్కునాటకము లున్నను మే మీనాటకమును వ్రాయుటకుఁ గారణము. అనఁగా నిదివఱకుఁ దెలుఁగుబాసలో నున్న హరిశ్చంద్రనాటకములలో నిందులోనిసంగతులు చాలవఱకు లేవు. కనుక నీనాటకమునకైన వ్యయప్రయాసములు వ్యర్థమని తలంపవలనుపడదు. ఆ మార్పు లన్నింటికిని దగినకారణములను జెప్పుటకు ముందుగా గ్రంథకర్త స్వభావోక్తికిఁ దగురీతిని నాటక కథలో లేనివానిని జేర్చుటయు నున్నవానిని గొన్నింటిని ద్యజించుటయు జరిగిన దని చెప్పవలసియున్నది. అది యుక్తమే కదా! ఇఁక నీగ్రంథములోఁ జేసిన మార్పులును వానికిఁ దగినకారణములును సంక్షేపముగా నీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

1. విశ్వామిత్త్రుఁడు మృగములను సృజించి యయోధ్యానగరమువారి పంటలు మొదలగువానిని బాడుచేయుటకుఁ బంపినాఁడనుటను వాండ్రు వేఁటకాండ్రను గాని యడవిమృగములను నగరమునఁ బ్రవేశపెట్టి రని కల్పింపఁబడినది.

సర్వజ్ఞుఁ డగునీశ్వరునికొక్కనికే సృష్టిస్థితిసంహారము లొనర్చుట కధికారము గలిగియుండఁగాఁ దక్కినవా రట్లు చేసిరనుట స్వభావవిరుద్ధము. ఒకవేళ భగవంతుని యనుగ్రహమును బొందినవారు భగవత్సమానులయి సృష్ట్యాదికమును జేయుశక్తిగలవా రగుదురని యొప్పినను, అట్టి శక్తి మంచిమార్గమునం దున్నచో నలవడునే కాని చెడుత్రోవను బోవువారి కలవడుట యుండఁగూడదు.

2. హరిశ్చంద్రుని వేటవలన నడవిలోని మృగములన్నియుఁ జచ్చిపడి యుండుట చూచి విశ్వామిత్రుఁడు చింతించి యొకానొకమదించిన వరాహమును సృజించి పంపె ననుటయు నమ్మఁదగ దనుటకుఁ బైని జూపినవే కారణములు గావచ్చును. అడవిపందియు ముండ్లపందియు వేటగాండ్రను వంచించి తప్పించుకొని పాఱిపోవుట స్వభావమే కనుక వానిని జంపుటకే హరిశ్చంద్రుఁడు మొదలగువారు మిక్కిలిగాఁ బ్రయత్నించి రనుట యొప్పిదము.

3. విశ్వామిత్రుఁడు మాతంగకన్యకల నిద్దఱను సృజించె నని పురాణసమ్మతమే యయినను స్వభావమునకు విరుద్ధముగా నుండుటవలన ముని తనయొద్ద శుశ్రూషచేయు మునికన్యకలనే పంపించినట్లు మార్పఁబడినది.

4. హరిశ్చంద్రుఁడు మంత్రులు మొదలగువారితోఁ గలిసి యుండు నపుడు మునికన్యలు వారియొద్దకు వచ్చి తమ్మును వివాహము చేసికొమ్మనుటయు వారు వాండ్రను హరిశ్చంద్రుఁడు చూచుచుండఁగా వెడలఁగొట్టిరి. దానిని హరిశ్చంద్రుఁడు ప్రత్యేకముగా నొకచోటున నుండఁగా నాకన్నియలు వచ్చి చూచి రనియు రాజునకుఁ దెలియకుండఁగనే సేవకులు వాండ్రను గొట్టి రనియు మార్పుచేసితిమి. రా జందఱతోడను గూడి యుండునపుడు తమ్మును బెండ్లియాడు మని కోరుట స్త్రీలకుఁ దగదు. ఒకవేళ వాండ్రు కోరినను రా జందఱును నెఱుఁగులాగున దాని నంగీకరించుటయుఁ దగదు. రా జేకాంతముగా నున్నప్పుడు కోరుటయే యుభయులకును దగినది. అదిగాక రాజుయొక్క మనోదార్ఢ్యమును శోధించుటకై యిదియే తగినమార్గముగాని యది కాఁజాలదు. ఇట్లుండఁగాఁ దన్ను వలచి వచ్చిన కన్నియలను న్యాయమార్గము చెప్పి యుపేక్షించుట లేక పీడించుట సామాన్యులకే తగ



దనఁగా నిఁక రాజ్యాధిపతుల కెట్లు తగియుండును? అదిగాక నాటకకర్త సంకల్పము స్వభావమునకు విరుద్ధముగా నుండఁగా దనుటయే.

5. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునియొద్దకు వచ్చి తాను బంపిన కన్నియలను నిపుడైనను బెండ్లియాడు మనుట నాక్షేపింపనేల యనఁగా, ముని తానే రాజు నసత్యవంతునిగాఁ జేయునిమిత్తమై ప్రోత్సాహపఱుపనేరాదు. ఆప్రకారమే యత్నించినచో మునియొక్కమాయ బయటఁ బడుటయే కాని వేఱులాభ ముండదు. మఱియు సామాన్యు లందులకంగీకరింపరు.

6. ముని తనప్రతాపముచే నగ్నినదిని, వర్షమును, భూతములను, ఉరుములను మొదలుగా సృజించె ననుటయు స్వభావవిరుద్ధ మగుటచే వీని కన్నింటికిని సరిపడునట్లు వేసవికాలమున మంటిదిబ్బ యొకటి సూచింపఁబడినది.

7. నక్షత్రేశునిచే హరిశ్చంద్రుని శ్రమపఱుచువిషయమై చేయఁబడిన దుష్కృత్యములు విడువఁబడినవి. నలుబది దినములలోఁగా నిచ్చుటకు గడువేర్పడి యున్నప్పుడు దండించుట న్యాయము గాదు. అదిగాక యిటువంటిదండనలు సామాన్యుల మనోభావములనే మార్పలేవనఁగా నిఁక మహావీరుఁ డగు క్షత్రియునిమనస్సు నెవ్విధముగా మార్పఁగలవు? అందుచే నచ్చటచ్చటఁ బైపైఁగా వ్యసనమును గలిగించు ఛిద్రములు తటస్థము లయిన వని చెప్పఁబడినది.

8. హరిశ్చంద్రుఁడు చంద్రమతిని దానే విక్రయించె ననుటయు, కాలకంఠుఁడు తనకు స్త్రీమాత్రమే దాసిగాఁ గావలె నని చెప్పినందున నామెను వారి కొప్పగించినట్టు మార్పఁబడినది. హరిశ్చంద్రుఁడు తన్నుఁగాక తనభార్యను విక్రయించి యప్పు తీర్చె ననుట సామాన్యులే యొప్పుకొనరు. అందును రాజ్యాధిపతి యగు నొకచక్రవర్తి యట్లు చేసె ననుట తుదపఱకును నసంభావితము.

9. దేవదాసుఁడు పామువలన మృతి నొందె ననుదానిని సర్వార్థసిద్ధి యనువాఁడు విషమెక్కించి మూర్ఛిల్లఁజేసినట్లుగా మార్పఁబడినది. ఇందులకుఁ దగినకారణము చెప్పుటకు ముందుగా వేఱొకయంశము ముఖ్యముగాఁ జెప్పఁదగి యున్నది. విశ్వామిత్రుఁడు తాను జేయుదుష్కృత్యములకు సాయపడునట్లు శుక్రుఁడు, అగ్ని, యముఁడు, కుమారస్వామి మొదలగువారిని వేఁడె ననుటయు నిటువంటి మహాకార్యమునకు వారు సాయపడి రనుటయుఁ గొంతయైనను సందర్భించి యుండదు. అందుచే సుబ్రహ్మణ్యుఁడు సర్పాకారముగా వచ్చి దేవదాసుని గఱిచె ననుటయుఁ బిమ్మట నతఁడే వచ్చి జీవింపఁజేసె ననుటయుఁ దప్పింపఁబడినవి.

10. విశ్వామిత్రుని మాయలబాధచేతఁ జంద్రమతియొక్క కంఠధ్వని మాఱిన దనుటయు, హరిశ్చంద్రుఁ డామె మెడలోనిమంగళసూత్రమును జూచి పోల్చుకొనె ననుటయుఁ దొలఁగింపఁబడెను. స్వభావమునకు విరుద్ధము గాక రాత్రివేను "ఫలానా" వా రని తెలిసికొనక యొకరినొకరు విచారించి తెలిసికొని రనుటయే యొప్పఁదగును.

11. బిడ్డని కళేబరమును హరిశ్చంద్రుఁడు తన్ని తిరుగఁద్రోచినాఁ డనుసంగతి వీరఁడు తన్ని తిరుగఁ ద్రోచినట్టుగా మార్పఁబడినది. ప్రేతమును దృణీకరించుటయు దాని నలక్ష్యము సేయుటయు నెవ్వరును నంగీకరింపఁదగినది గాదు. అట్లుండఁగా మంచినడతగల హరిశ్చంద్రుఁ డట్టి పని చేసె ననుట యెట్లు సరిపడును?

12. కాశీరాజుకొడుకు హత్యచేయఁబడె ననుదానిని మాని విషమువలన మూర్ఛితుఁడుగాఁ జేయఁబడె నని మార్పఁబడినది. దేవదాసుని బాము గఱువకుండుటకుఁ జెప్పినన్యాయమే యిచ్చటను జెప్పవచ్చును.



13. చంద్రమతి కాశీరాజుకుమారుని జంపిన ట్లొప్పుకొన్న సంగతి లేదని యాక్షేపించినట్లు మార్పఁబడినది. హరిశ్చంద్రుని చరితమును జెప్పునప్పుడే యొకరొకరును నీలాగునఁ జంద్రమతి చెప్పుట యసత్యము గాదా యని యడుగుటయు నందుల కితరులకు సందర్భానుసారముగాఁ జెప్పినయసత్యము తప్పిదము కాదనియు బదులుచెప్పుట పెద్దవ్యాజముగా నుండును. తాను హత్యచేయకుండుటయుఁ జేసిన ట్లొప్పుకొనుటయు నితరులకు విపరీతము గలుగకుండుటయును దనప్రాణమునకు హానికలుగఁజేయునట్టి స్వహత్య యగుచున్నది. స్వహత్య చేసికొనుటకు దారి వెదకుట యను గొప్ప తప్పిద మొకటి లేనందుచేతను, అదియే ధర్మశాస్త్రవిధి యగుటచేతను, చంపలేదని వాస్తవము చెప్పె నని తలఁచుట విశేషము.

14. అచ్చటనుండు కాలియడుగుల గుఱుతులను జంద్రమతియొక్క కాలియడుగుల గుఱుతులుగా విశ్వామిత్రుఁడు తన తపోబలముచేతను మార్చె ననుట స్వభావమునకు విరుద మగుటచేఁ ద్రోయఁబడినది.

15. తనకుమారుని మృతిసంగతి తానే విచారించి తెలిసికొనుటచే నిజము తోఁచుటయే కాక న్యాయమునకు విరుద్ధముగా నుండు నని తలఁచి కాశీరాజు న్యాయాధిపతిచే విచారింపించె నని మార్పఁబడినది.

16. కాశీరాజు విశ్వామిత్ర మునిమాయలచేఁ గొంచెమేనియుఁ దెలియకుండుటయు, ఆరాజుననుమతి లేకుండనే వీరబాహు వనెడువాఁడు శ్మశానమున కధికారి యాయె ననుటయుఁ బొందికగా నుండకపోవుటచే నీకాలవ్యవహారమునకుఁ దగినట్లుగా నయోధ్యయొక్కప్రతినిధి యొకఁడు కాశికానగరములో నివసించి యుండె ననియు వానిసాయముచే విశ్వామిత్రునిశిష్యుఁ డొకఁడు మఱొకశ్మశానమును గల్పించె ననుటయు దానిని దానే కాచుకొనుచుండుటకు నిశ్చయించుకొన్నాఁ డనియుఁ దెలుపఁబడినది.

ఈమార్పులే మిగుల ముఖ్యమైనవి యయినను మఱల నచ్చటచ్చటఁ గొన్నికొన్ని విషయములు సమయోచితముగాఁ జెప్పఁబడినవి. అవి యన్నియుఁ బైని చెప్పిన కారణములకుఁ దగినవియే యగునని యెఱుంగఁదగును.

మఱియు నింతవఱకు వెలువడినహరిశ్చంద్ర చరిత్రగ్రంథములలో విశ్వామిత్రముని హరిశ్చంద్రుఁడు మొదలగువారల కెన్నోయిడుములు కలిగించె ననియు వానికిఁ బ్రతిఫలముగా, దనతపస్సులోనుండి యర్ధభాగ మిచ్చినట్లుమాత్రమే చెప్పఁబడియున్నది. అందుచే నితరులకుఁ జెడుగు చేయుట కుద్దేశించినవాఁడు తానే చెడుగు ననుభవించుచుండు నని స్పష్ట మగుచున్నది.

"ఇతరుల కొకఁడు ముందు చెడుగు చేసినఁ దనకొకఁడు
ప్రతిఫలము తానే వచ్చును."

అనున్యాయముచొప్పున హరిశ్చంద్రునకు విశ్వామిత్రుఁడు తన మాయనుబ్రకటించువఱకును దాను బడ్డదుఃఖములును, శిష్యులు వచ్చి తమచర్యలు సఫలముగాలేదని చెప్పెడుకాలమున వాండ్రు చెందునవస్థలును, తనచర్యలు నెఱవేఱవని తెలిసి యతఁడు తుదకు, బడిన పరితాపము మొదలగునవియే కాక మఱియు నెన్నో కలవు.

ఇఁక నీనాటకగ్రంథములలోని ప్రతియంకమందును దెలసికొనవలసిన యద్భుతవిషయముల నొకవిధముగా సంగ్రహించి వ్రాయుట మంచిదే యని యట్లుచేయుచున్నారము.

ప్రథమాంకము.

దీనిచే జ్ఞానులకును జన్మవాసన యంటు ననియును, తపస్సుకంటె మంచినడతయే గొప్పను గలిగించున దనియును, వేఁటాడుటయు, వేఁటగాండ్రనడతలు, సంగీతముయొక్క గొప్ప, నటనముయొక్క స్వభావ



మును స్త్రీలు వలచి వలపించుచు వచ్చినను బురుషుఁడు చెడునడతల యందుఁ బ్రవేశింపకుండ మంచినడతగలిగి యుండవలె ననుటయు, పెద్దలు నిష్కారణముగాఁ గోపించినను జిన్నవాండ్రు వినయముతో నణఁగి నడుచుకొను స్వభావము గలిగి యుండవలె ననుటయు, ధనము స్థిరమయిన వస్తువు కాదనియు, రాజు ప్రజలమంచినే యపేక్షించుచుండవలె ననుటయు మొదలగునవియే కాక మఱియు నెన్నేని దెలియును.

ద్వితీయాంకము.

ఇందువలన రాజ్యాధిపతి తన ప్రజలయందుఁ జూపువిశ్వాసమును, ప్రజలు తమప్రభువువిషయమై చూపించుభక్తియు, మంచిరాజు రాజ్యమును విడిచినప్పుడు ప్రజలు పడెడి యవస్థయు, చెడ్డవాఁడు రాజ్యాధికారిగా వచ్చి చేయు దుష్కృత్యములును, వానికిఁ దాళఁజాలక ప్రజలనుభవించెడి దుఃఖములును, మంచివారి కుపద్రవము లొకదానివెంట నొకటిగా వచ్చుచుండుననుటయు, ఎంతకష్టము వచ్చినను నిజము విడువరా దనుటయు, జ్యోతిష్కులు, శాస్త్రులు, వైద్యులు, మొదలగువారి దుర్గుణములును, పుణ్యానదులయొక్క విశేషములును, మఱియు నెన్నేని యితరవిషయములును దెలియును.

తృతీయాంకము.

ఇందువలనఁ గాశీక్షేత్రమునందు గంగలోఁ జేయుస్నానమువిధులును, ఆలయ దర్శనక్రమమును, వాదుల మోసములును, దాస్యము చేయవలసిన విధమును, దాస్యపడుమార్గమును, పూఁటపడువా రనుభవించు కష్టములును, స్వల్పవిషయమందును నసత్యము మొదలయిన తప్పిదములను జేయఁగూడ దనుటయు, కఠినచిత్తులు చేయు కఠోరకార్యములును గాక యింకను నెన్నేని మంచివిషయములు దెలియును.

## చతుర్థాంకము.

ఇందువలన వేషసన్న్యాసులు చేయు నద్భుతచర్యలును వారలితరులు శోకించునట్లు మాటలాడు వంచనములును, ఊరికావలివాండ్రు ప్రజలవిషయమై నడుచుకొనవలసిన పద్ధతియు, వాండ్రనియతములైన పనులును, మార్గములును, తప్పుచేసినవారి విషయమై జరుపవలసిన కృత్యములును, సాక్షులను సేకరించునేర్పును, న్యాయాధిపతియొక్క పూర్ణగుణములును, మధ్యవర్తులయొక్క నడతలును, న్యాయవాదుల నిబంధనలును, చట్టములప్రకారమును, దండనము నియమించు నధికారులు చేయునేర్పును, మఱియు నితరవిషయములను దెలియును.

## పంచమాంకము.

ఇందువలన నితరులకుఁ గష్టములు గల్గించుటకు యత్నించు వారు తామే కష్టములపా లగుదు రనియు, మంచివా రెప్పటికిని బాగుగానే యుందు రనియు, సత్యము తన్నుఁ గాపాడు ననుటయు, తపస్సుకన్న సత్యమేఁ గొప్ప దనియు, ప్రజలకుఁ దాము విడివడినరాజు మరలఁ గనఁబడినచోఁ గలిగెడి సంతోష మిట్టిదనియుఁ దెలియుటయే కాక యింకను నెన్నోవిషయములు తెలియును.

ఇఁక నొక్కొక్కసంగతిని విభజించి తెలియఁజేయుద మన్న నీగ్రంథమంత యుపోద్ఘాతమే యగునని సంగ్రహింపఁబడినది.

ఇందుఁ బాత్రముల కనుగుణముగానే భాషావిభాగముకూడ మార్పఁబడి యున్నది. ఆయాపాత్రముల కుచితమైన మాట లుపయోగింపఁబడినవి. అచ్చటచ్చటఁ గ్రొత్తపద్యము లుపయోగింపఁబడి యున్నవి. ఇతరులగ్రంథములనుండి సంగ్రహించినపద్యములలో సందర్భానుసారముగా మార్చి గ్రహింపఁబడినవి.



ఈ నాటకగ్రంథము నాకుఁ దీఱిక యయినప్పుడు నిదానముగా వ్రాయఁబడినది. ఇందుఁ గల స్ఖాలిత్యములను నాకుఁ దెల్పినచోఁ గృతజ్ఞతతో రెండవ కూర్పునందు సవరించుకొందును.

ఈగ్రంథము నిర్విఘ్నముగా ముగింపఁజేసినందులకై భగవంతునికిఁ గృతజ్ఞతాసూచకముగా ననేకవందనము లాచరించుచున్నారము.

ఇట్లు :

గ్రంథకర్త,

ఎస్. భవానందముపిళ్ళె.

NEWTON HOUSE,
*1st January, 1913.*

## నాటక పాత్రములు.

| | | |
|---|---|---|
| 1. హరిశ్చంద్రుఁడు | ... ... | అయోధ్యాధిపతి, కథానాయకుఁడు. |
| 2. దేవదాసుఁడు | ... ... | హరిశ్చంద్రుని కుమారుఁడు. |
| 3. సత్యకీర్తి | ... ... ... | హరిశ్చంద్రుని ప్రధానమంత్రి. |
| 4. వసిష్ఠుఁడు | ... ... ... | హరిశ్చంద్రుని కులగురువు. |
| 5. విశ్వామిత్రుఁడు | ... ... | వసిష్ఠునితో వాదించిన ముని. |
| 6. నారదుఁడు | ... ... ... | వసిష్ఠునితోఁగూడఁ గాశీనగరములోని శ్మశానమునకును, అయోధ్యకును వచ్చిన మునివరులు. |
| 7. సూతుఁడు | ... ... ... | |
| 8. అత్రి | ... ... ... | |
| 9. విద్యాపారగుఁడు | ... ... | వసిష్ఠుని శిష్యులు. |
| 10. యోగపారగుఁడు | ... ... | |
| 11. స్వరూపానందుఁడు | ... ... | |
| 12. పరమైకాంతికుఁడు | ... ... | |
| 13. వైఖానసుఁడు | ... ... | విశ్వామిత్రుని శిష్యులు, యుద్ధవీరులు, తత్త్వశాస్త్రి, అష్టావధాని, వైద్యుఁడు, జ్యోతిష్కుఁడు, రసవాది, రాజప్రతినిధి, వీరబాహుఁడు, వీరఁడు, సర్వార్థసిద్ధి, సోమసుందరుఁడు, విశ్వనాథుఁడు, ఆళర్యుఁడు, ముత్తువీరసెట్టి, వేలాయుధాచారి, న్యాయవాది గుమాస్తా, పరమానందయోగి, ధన్నాజీరావు, కాళిదాసుఁడు, మొదలగు వేషములను ధరించి యాయాసమయము లందు విశ్వామిత్రుని యాజ్ఞవలనఁ బ్రవర్తించినవారు. |
| 14. గౌతముఁడు | ... ... | |
| 15. గాలవుఁడు | ... ... | |
| 16. తీవ్రచేతసుఁడు | ... ... | |
| 17. సారంగుఁడు | ... .. | |
| 18. సుశీలుఁడు | ... ... | |
| 19. మత్సరుఁడు | ... ... | |
| 20. నక్షత్రేశుఁడు | ... ... | |
| 21. పరమానందుఁడు | ... ... | |
| 22. జ్ఞానాదిత్యుఁడు | ... ... | |
| 23. వివేకుఁడు ... | ... ... | |
| 24. కాలకంఠుఁడు | ... ... | |
| 25. భాస్కరుఁడు | ... ... | |
| 26. లాలు ... | ... ... | హరిశ్చంద్రుని వేఁటకాండ్రు. |
| 27. కాలు ... | ... ... | |
| 28. భైరి ... | ... ... | |
| 29. అమావాస్యుఁడు | ... ... | |



| | | |
|---|---|---|
| 30. కృష్ణస్వామి | ... ... | సమిధలు మొదలగువానికై దేవదాసునితో నడవికిఁ బోయిన బ్రాహ్మణ బాలురు. |
| 31. శ్రీనివాసుఁడు | ... ... | |
| 32. శేషుఁడు ... | ... ... | |
| 33. విశ్వనాథుఁడు | ... ... | కాశీరాజు కుమారుఁడు. |
| 34. కావలి తలవరి | ... ... | కాశీనగరములోని కావలి వాండ్రకు దలవరి. |
| 35. రంజీత్ సింగ్ | ... ... | కాశీనగరములోని కావలివాండ్రు. |
| 36. రంబాల్ సింగ్ | ... ... | |
| 37. అపరాధి న్యాయవాది ... | ... | చంద్రమతి పక్షమున వాదించుటకై రాజ్యాంగమువారిచే నియమింపఁబడిన న్యాయవాది. |
| 38. రాజ్యాంగ న్యాయవాది | ... | రాజుగారిపక్షమున వాదించిన న్యాయవాది. |
| 39. న్యాయాధిపతి | ... ... | చంద్రమతిమీఁదను నేరమును స్థాపించి మరణదండనను విధించిన కాశీనగరపు న్యాయాధిపతి. |
| 40. రాజ్యాంగ లేఖకుఁడు | ... | న్యాయస్థానమునందుఁ గావలసినవాని నమర్చువారు. |
| 41. రాజ్యాంగసేవకుఁడు ... | ... | |
| 42. రాజ్యాంగలేఖకుఁడు ... | ... | న్యాయస్థానములో వ్రాయువాఁడు. |
| 43. నీలకంఠశాస్త్రి | ... ... | చంద్రమతిమీఁదను న్యాయస్థానములో నేరమును స్థాపించిన మధ్యవర్తులు. |
| 44. కృష్ణనాథదత్త | ... ... | |
| 45. లక్ష్మీనాథ ప్రసాద్ | ... ... | |
| 46. కుమారశర్మ | ... ... | |
| 47. మహాదేవమేత | ... ... | |
| 48. గోపీనాథ టాకూర్ | ... ... | |
| 49. మునిలాల్ సింగ్ | ... ... | |
| 50. మోహనరాయి | ... ... | |
| 51. పండరీనాథ చటర్జీ | ... ... | |
| 52. లాల్ మోహనప్రసాద్ | ... | కాశీరాజుగారి నగరిలోఁ గార్యముల నిర్వహించువాఁడు. |
| 53. చెఱసాల యధికారి ... | ... | కాశీనగరములోని చెఱసాల కధికారి. |
| 54. కాశీరాజు | ... ... | కాశీనగరమునకు రాజు. |

55. చంద్రమతి … … హరిశ్చంద్రునిభార్య, కథానాయిక.

56. చిత్రరేఖ … … హరిశ్చంద్రుని తల్లి.

57. కల్యాణి… … …
58. సుగంధి … … …
59. యౌవని .. … …
60. నాగరిక … … …
61. కాంచని … … …
62. వాసంతిక … …
} చంద్రమతి చెలికత్తెలు.

63. కాంతారిక … …
64. విశాఖిని … … …
} హరిశ్చంద్రుని వలపించుటకై విశ్వామిత్రునిచేఁ బోగపుఁగాంతలుగాఁ బంపఁబడిన ముని కన్యకలు.

65. చంద్రవదన … … కాలకంఠునికి భార్యగా విశ్వామిత్రునిచేఁ బంపఁబడిన మునికన్యక

66. వీరి … … … వీరబాహునకుఁ బెండ్లముగా విశ్వామిత్రునిచేఁ బంపఁబడిన మునికన్యక.

67. భాగీరథి … … … కాలకంఠునిభార్యతో మాటలాడుచుండెడి పొరుగింటి స్త్రీ.

ఇవిగాక మంత్రులు, సామంతరాజులు, అమాత్యులు, సేనాధిపతులు, ప్రభువులు, సేద్యముచేయువాండ్రు, న్యాయస్థలములోని కావలివాండ్రు, సంస్థానవిద్వాంసులు, మాగధులు, మొదలగుపాత్రము లాయా సమయములయందు వచ్చుచుండును.

## నాటకములోని రంగస్థలములు.

అయోధ్య, అయోధ్యాప్రాంతమునందలి యరణ్యము, కాశికిఁబోవుదోవ, కాశి, కాశిలోని శ్మశానము, మొదలగునవి.





శ్రీవేంకటేశ పరబ్రహ్మణేనమః.

# హరిశ్చంద్రుఁడు

## ప్రథమాంకము - ప్రథమరంగము.

స్థలము: అయోధ్యకు సమీపమైనయరణ్యము.

కాలము: అపరాహ్ణము.

ప్రవేశము: విశ్వామిత్రుని శిష్యులు—వైఖానసుఁడు, గౌతముఁడు, గాలవుఁడు, తీవ్రచేతసుఁడు, సారంగుఁడు, మొదలగువారు.

వసిష్ఠునిశిష్యులు—విద్యాపారగుఁడు, యోగపారగుఁడు, స్వరూపానందుఁడు, పరమైకాంతికుఁడు, లోనగువారు.

విద్యాపారగుఁడు—“తపోధికం బౌను దగుశీల మెందుఁ” అనునట్లు సుజ్ఞాని యగువాఁడు, పూర్వజన్మసంచితంబులై కలుగు దోషములను ఒక్క శీలంబువలననే నివర్తించుకొని కృతార్థుఁడు కాఁగలఁడు.

వైఖానసుఁడు—అయ్యా! యోగపారగా! వింటిరా విద్యాపారగుల విపరీతజ్ఞానమును. మహాతపోగ్నిజ్వాలచేత దగ్ధకర్ములై, పాశబంధవిముక్తులగుజ్ఞానులకును దోషము లంటి యుండునఁట! మీయోగశాస్త్రములందును ఇట్లు సిద్ధాంతీకరింపఁబడి యున్నదా?

యోగపారగుఁడు—ఎట్టిసుజ్ఞాని కైనను, స్థూలదేహధారి యైన వానికి ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక తాపత్రయాగ్నిదాహము వలనను, రాగద్వేషాదిదోషసంపర్కమువలనను, అహంకారమమకారములు జనించి ‹‹నేను›› ‹‹నాది›› యని తోఁచుచుండును.

వైఖానసుఁడు—ఇ దేమి వింత! నే నీవిషయ మెఱుఁగను.

యోగపారగుఁడు—ఎఱుఁగవా, దృష్టాంతమునకు ఎక్కడికో పో నేల? నిజ మాడిన నిష్ఠురము. దానికై యోజించెదను.

వైఖానసుఁడు—దృష్టాంతమాత్రమునకే నిష్ఠురమా? చెప్పుఁడు, చూచెదము.

యోగపారగుఁడు—కొంచె మాలోచించి చూచినఁ జాలును. మీలో నొక రున్నా రనుట స్పష్ట మగును.

వైఖానసుఁడు—(స్వగతము) ఏమీ మాకే వాఁత వేయుట కారంభించితిరి? ఉండ నిండు (ప్రకాశము) మీచిత్తమునకు గోచరించి నట్టివారు మాలో నెవరు? చెప్పుఁడు.

యోగపారగుఁడు—మీ కింకను స్ఫురింప లేదా? నేను జెప్పినాఁడ నని కోపింప రాదు సుండీ. మీయాచార్యులవారె యందునకుఁ దగినదృష్టాంత మగుదురు.

వైఖానసుఁడు—(స్వగతము) ఓహో! మేము మొదటఁ దలఁచి నట్లే, మాయాచార్యులమీఁదనే దోషారోపణము చేయఁ దెగించిరి. (ప్రకాశము) సరి. సరి. మాయాచార్యు లెట్లు తార్కాణము?

యోగపారగుఁడు—నేను నిందగాఁ బలికినవాఁడను గాను. మీగురునాథులు ప్రశంసనీయు లైనరాజర్షు లనుట కేసందియమును లేదు. అట్టితపోధనులును ఒకయసూయను లోఁగొని మాయాచార్యుల



వారితో నకారణ మైనకలహమును బెట్టుకొని, యేపాపము నెఱుఁగని హరిశ్చంద్రసార్వభౌముని నిప్పటికే పెక్కులంపటలం బెట్టిరి. చాలక యింకను బెట్టఁ దలఁచి యున్నారు. ఇఁక, యోజింపుఁడు, వ్యక్తము కాఁ గలదు—మీయాచార్యులు తార్కాణ మగుదురో కారో.

వైఖానసుఁడు—ఇ దేమి క్రొత్తయా? మీయాచార్యులకును మాయాచార్యులకును గలప్రతిస్పర్థ లోకవిదితమే కదా. దాననే కదా రాజచంద్రుఁడు రాజర్షిచంద్రముఁ డయ్యెను. మఱి, యిప్పుడు హరిశ్చంద్రునివిషయ మేదో పల్కితిరే, యావిషయ మేమో వివరింపుఁడు వినెదము.

యోగపారగుఁడు—అయ్యా సావధానుల రై వినుఁడు. ఒకానొకప్పు డింద్రసభ యనేకఋషిచంద్రములతోఁ దేజరిల్లుచుండెను. ఆకాలమున నింద్రుఁడు

మ. ‹‹కలఁడే మానివరేణ్యులార! ధర స-త్కర్మానురక్తుండు, ని
ర్మలచారిత్రుఁడు సత్యసంధుఁ డతిసం-భావ్యుండు దీనాశ్రయుం
డలఘుం డన్యవధూముఖేందువిముఖుం - డౌదార్యధుర్యుండు, భూ
లలనాలాలనలాలసుండు, హితరా-డ్లక్ష్మీముఖోల్లాసి యై››

దీని విన్నవా రందఱును మౌనముద్రలతో నుండిరి. అప్పుడు మీగురువర్యులు

మ. ‹‹కలఁ డోయింద్ర! నరేంద్రచంద్రముఁడు స-త్కార్యానురక్తుండు, ని
ర్మలచారిత్రుఁడు, సత్యవాక్స్థిరుఁడు సం-భావ్యుండు, దీనాశ్రయుం
డలఘుం, డన్యవధూముఖేందువిముఖుం, - డౌదార్యధుర్యుండు, భూ
స్థలి సూర్యాన్వయవర్ధనుం డగుహరి-శ్చంద్రుండు శంసార్హుఁ డై››

అని చెప్పఁగా మీయాచార్యులు మాగురువరుల నధిక్షేపించి

మ. „కలఁడో వాఁడు వసిష్ఠ! నీహితుఁడు; దుష్కార్యానురక్తుం డని
ర్మలచారిత్రుఁ డసత్యసంధుఁ డఘసంభావ్యప్రలాపామితుం
డలసుం డన్యవధూరతుం డధికమిథ్యాచారధుర్యుండు, భూ
స్థలి వానిం దగ నే నెఱుంగనె హరిశ్చంద్రున్ గిరిశ్చంద్రునిన్”

అని పలికిరి. ఇది నడిచిన విషయము.

వైఖానసుఁడు—సరి, సరి, మీ కందఱకు నొకటే పాఠమువలె నున్నది. ముఖ్యముగఁ దెలిసికొనఁ దగినసందర్భములను బద్యములు చేసి పెట్టుటయా? బాగు, బాగు, ఆసంగతిని వివరించి చెప్పుఁడు.

యోగపారగుఁడు—వివరము కావలయునా? ఇంద్రుఁడు ఋషిసత్తములం జూచి, „భూలోకంబున సత్ప్రవర్తనుఁ డై కొంచె మైనను నెఱి దప్పక యొప్పురురాజు గలఁడా?” యని యడిగెను. అప్పుడు మాగురునాధులు „అయోధ్యానగరము రాజధానిగా భూపరిపాలనము చేయు చున్నహరిశ్చంద్రసార్వభౌముఁడు సత్కార్యరతుఁడు, పరిశుద్ధవర్తనుఁడు, సత్యవ్రతుఁడు, దీనజనాశ్రయుఁడు, పరదారసహోదరుఁడు, వితరణశాలి. అతనికి సాటి యతఁడే గాక ప్రపంచమునం దేనృపాలుఁడును లేఁడు” అని పల్కిరి. అంతట మీయాచార్యులు మాయాచార్యులయెడ వహించిన యీర్ష్యను గారణముగాఁ గొని, వారు సెలవిచ్చినయంశముల కన్నిటికిని విరుద్ధముగా „ఆ హరిశ్చంద్రుఁడు దుష్కార్యరతుఁడు, మలినవర్తనుఁడు, అసత్యకర్ముఁడు, కఠినహృదయుఁడు, సర్వదా పరదారాసక్తుఁడు, లోభి. ఇట్టివాని నుత్తమోత్తమునిగాఁ జెప్ప సాహసించితిరి” అని యాక్షేపించిరి. వీరిసంభాషణల విను చుండినయింద్రుఁడు వీరిని సమాధానపఱచి „వానిఁ బరీక్షించి యిందలి సత్యాసత్యములను దెలిసికొనెదము” అనెను. పిమ్మట మీయాచార్యులు తాముచెప్పిన



యంశములను న్యాయపూర్వకముగా ఋజువు చేయుటకు మాఱుగా విషపరీక్ష చేయుట కారంభించి యున్నారు. ఇట్టిచిత్తవృత్తి మీయాచార్యులకు దేనివలనఁ గలిగి యుండ వచ్చును? కొంచె మాలోచించి చూడుఁడు. జ్ఞానోదయకాలమున ననాదిగా వెన్నంటి వచ్చుమాయావికారములు దొలఁగి చనినను, జన్మాంతర దుష్కర్మఫలము లప్పు డప్పుడు గనఁబడు చుండుననియు నా యంశమునకు మీ యాచార్యు లెంతవఱకు లక్ష్యభూతులో చక్కఁగా యోజించిన మీకే తెలియ వచ్చును.

వైఖానసుఁడు—ఓహో! యవసరపడి యూఱక క్రుమ్మరింపకుఁడు. ఇంద్రసభలో జరిగినవిషయము మాకు ముందే తెలిసి యుండినను మీరు చెప్పుటలో నే మైనఁ బొరబా టున్నదా యని పరీక్షించుటకే మే మిదివఱకును శాంతచిత్తముతోఁ జెవి యొగ్గి విను చుంటిమి. మాయాచార్యు లెప్పుడును లేనిది చెప్పరు. మేమును నారాజు దుశ్చరితములను బదింబది విని యున్నారము. తెలిసికొనియు నున్నారము. మీరలు కావలయు ననియె, ప్రతిదినము నిచటికి వచ్చి మాచెవిఁ బడునట్లు మాయాచార్యులను దూషించెద రనుట యిందువలన వ్యక్తమగు చున్నది. ఇఁక మీతోడ సంభాషించుటయును చేటునకే మూల మగును. మీగురువరులు సెల విచ్చిన వానిని మేమె ఋజువులతో నిరూపింపఁ గలము. ఇఁక వైళంబ మీరును జూడఁ గలరు. పొండు, పొండు.

[నిష్క్రమింతురు.

ఇది శుద్ధవిష్కంభము ప్రథమరంగము.



## ద్వితీయరంగము.

స్థలము: అయోధ్యయందు హరిశ్చంద్రునిసభ.

కాలము: పూర్వాహ్ణము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, విశ్వామిత్రుఁడు, మంత్రులు లోనగువారు.

---

[హరిశ్చంద్రుఁడు సభాసదులు మొదలగువారిచేఁ బరివేష్టితుఁడై సింహాసనాసీనుఁడై యుండును. విశ్వామిత్రుఁడు ప్రవేశించు చున్నాఁడు.]

హరిశ్చంద్రుఁడు—(విశ్వామిత్రుని రాకఁ జూచి, ఆసనమునుండి దిగి యంజలిబద్ధుఁడై) మునినాథా!

చ. పరమునినాథ! ఘోరవన - వాటికలందును, గ్రావసీమలన్
నిరుపమశీతవాతముల - నెమ్మి దలంగక, క్షుత్పిపాసలన్
గరమరుదార గెల్చి, మదిఁ - గాంక్షలఁ గూల్చి తపస్సమగ్రులై
తిరముగఁ బొల్చు తాపస-ధృతులు మానిలయాంగణంబులన్
గురుమతిఁ దోఁచుటల్ గనఁగఁ - గోటిభవంబులపుణ్యసంపదల్.

స్వామీ! అనుగ్రహించి యాసీనులు కండు.

విశ్వామిత్రుఁడు—

సీ. ఎవనిజటాటవి - నింపెసలారంగ జహ్నుకన్యక యెప్డుఁ జలుపు విహృతి,
ఏవానిజూటాగ్ర - మే వాసభూమిగ ఖండేందుబింబంబు - గ్రాలు చుండు,
ఏదేవదేవుఫా - లేక్షణసీమయే భవనంబు చటులోగ్ర - పావకునకు,
ఎవ్వానిఘనకుక్షి - నీయజాండంబులు నిలయంబుగా నూని - నెలమి మిగులు,

గీ. నట్టిమహనీయుసామేన - నంద మొందు । సర్వమంగళమృదుపాద - సారసముల,
మధువు గ్రోలంగ మధుపాయ-మాను లౌచుఁ। బొదలువారలె నినుఁ బోలు-పుడమిదొరలు

గీ. అట్టివారలకే గాదె - యవనిఁ దోఁచు । మణిమయోజ్జ్వలమకుట - సన్మండనంబు
వసుమతీశత్వసిద్ధియు - వాహినీచ । తుష్టయము, వస్తువాహనా-ద్యుత్తరములు॥



హరిశ్చంద్రుఁడు—దాసునిభాగ్యమె భాగ్యము. మహానుభావుల రగు మీ రిందు విచ్చేసి యకించనుండ నగుననుం గౌరవించుట నాకు భాగధేయంబ కాదే? ఇట్టిభాగ్యంబు నా కొనఁగూడుటకుం గారణం బీ యయోధ్యానగరసుకృతవిశేషమో; లేక నా పూర్వులును, నేనును జేసినపుణ్యఫలమో. ఏదియో తెలియలేను. నేఁడు మొద లీనిలయము దివ్యనిలయము. రాజ్యము పవిత్రక్షేత్రము. కార్యాంతరము లేకున్న మునిపాదులవారికి శిష్యుఁడు చేయఁ దగినసపర్య నానతిచ్చిన మహాప్రసాద మగును.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! రాజులకును రాష్ట్రములకును సుఖసమృద్ధులు గూర్పఁ గోరి, మే మొకయిష్టి చేయ నుద్దేశించినారము. దానికిఁ గొంతద్రవ్యము కావలసి యున్నయది. అది పర్థాపేక్ష లేకయె స్వతంత్రించి చేసికొనఁ జాలుసామర్థ్యము మాకుఁ గల దని నీకే కాక లోకమున కంతటికినిఁ దెలియును. అయిన నా వేల్మి రాజులమేలిమినిగూర్చి వేల్చుటం జేసి దాన నీధనమును వ్యయపఱచి నీకు శ్రేయ మొనగూర్ప భావించినారము.

హరిశ్చంద్రుఁడు—తాపసవర! కులపతిధనము కానిధనమునందు భావము చెల్లించి, నన్ను నొకనిగ భావసీమ సమ్మానించినది నా పూర్వజన్మ పుణ్యపరిపాకఫలము గాని వేఱేమి! పరులసంతోషము నుద్దేశించి తాము సంతసించు చుండుటయె పెద్దలస్వభావసిద్ధగుణము. అట్లగుటఁ దాము నావంటివారి యుజ్జీవనార్థ మనుగ్రహించితిరి. ఆముఖమునకు వలయుధనము దేవరవారియాజ్ఞానుసారముగ నాశక్తి కొలఁది సమర్పించుకొనుటకు స్వతస్సిద్ధుఁడను. ఇంత కన్నను భాగ్య మెయ్యదియు లేదు.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! దాని కొకగొప్పముత్తమును గావలసినది లేదు. ఒకనూఱులక్షలగద్యాణంబు లున్నఁ జాలును.

హరిశ్చంద్రుఁడు—స్వామి! నూఱులక్ష లేమి? మదీయం బగువిత్తంబున దేవరవారికి వలయునంత యెత్తికొనుటకు నభ్యంతర మే మున్నది? సమస్తమును దేవరవారిదే. నే నెవ్వఁడను? దేవరవారిబానిసనే కదా!

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! అధిక మేల? బంగారము గర్వించు స్వభావము గల దగుటచేతనే కదా దానికిఁ గర్బుర మనుపే రన్వర్థమగు చున్నది? అది విరాగుల కేల? నూఱులక్షలకంటెనధికము కావలసి యున్నచో నపుడు చూచుకొందము. మఱి నీ విప్పుడీయఁ దలఁచినద్రవ్యము నీకడనే యుండనిమ్ము. వలసినప్పుడు వచ్చి కొని పోయెదను. ఆశీర్వాదము, రాజ్యముతోడ నీవు వర్ధిల్లుదువు గాక [లేచు చున్నాఁడు.]

హరిశ్చంద్రుఁడు—(లేచి ముకుళితహస్తుఁడై నిలిచి) మునివరా! వలసిన సమయము సెల విచ్చిన, దాసుఁడు తెచ్చి చేర్పించుటకు సిద్ధుఁడు. [రాజు పలుమాఱు విధేయతతో నమస్కరించు చున్నాఁడు. మంత్రులు లోనగువారును నమ్రతతో నమస్కరించు చున్నారు. విశ్వామిత్రుఁడు వెడలి పోవును.]

ద్వితీయరంగము.





## తృతీయరంగము.

స్థలము: అంతఃపురము.

కాలము: మునిమాపు.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, దేవదాసుఁడు, చంద్రమతి, కల్యాణి లోనగు చెలికత్తెలు.

[చంద్రమతి, దేవదాసుఁడు, చెలికత్తియలు కూర్చుండి యుందురు.]

చంద్రమతి—కల్యాణీ! మునిమాపయినది. మహారాజుగారు కొలువు చాలించి వచ్చుకాల మిదియె కదా? ఆవైపున కంది చూడుము.

కల్యాణి—ఔనమ్మా! ఔను. అదిగో వచ్చెదరు; ముఖవికాసమును జూడ వారు నేఁటి కేమో కుతూహలాయత్తచిత్తు లయి వచ్చునట్లు గనఁబడుచున్నారు. మేము కొంచె మావలి కొదిగి నిలిచి యుండెదము. మీరు చక్రవర్తిగారిమనోభావం బెఱుంగుఁడు.

(చంద్రమతి హరిశ్చంద్రున కభిముఖముగఁ బోవ హరిశ్చంద్రుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

చంద్రమతి—ప్రాణేశా, మన తపఃఫలము మూర్తీభవించిన ట్లొప్పారు దేవదాసుఁడు తమ రాకకై వేచి యున్నాఁడు.

హరిశ్చంద్రుఁడు—ఆఁ - ఆలాగా! [దేవదాసునిఁ గౌఁగిలించుకొను చున్నాఁడు.] కాంతామణీ! వినుము.

గీ. చారుతర మైనశీతల-వారిచేత
నింబు దళ్కొత్తుశ్రీచంద-నంబువలనఁ
బరఁగుఘనసారపాంసులఁ - బ్రబ్బ నొక్క
యాత్మజాలింగనంబుచే - నబ్బుసుఖము!

హృదయేశ్వరీ! మనచిరంజీవి మనయపూర్వతపఃఫల మనుటకు సందియమే లేదు. ఈపుత్రరత్నమువలన మనము దినదినము శ్రేయోభివృద్ధిఁ బొందుచున్నారము. మఱియును 'వీనికాలమున మనవంశవృక్షము వ్యాపించును' అనుటకు సూచన యొకటి నేఁడు తటస్థించి యున్నది.

చంద్రమతి—[మిగుల నుత్కంఠతో] చిత్తేశా! అది యేది? నేను వినఁదగినదా?

హరిశ్చంద్రుఁడు—పైదలీ! నీవు వినఁ దగనిదియు నొకటి గలదా? జీవము లొకటి యైనప్పుడు, మన స్సెట్లు రెం డగును? అది నీకుఁ దెలుప వలసియే కదా ముందుగా సూచించితిని.

చంద్రమతి—ప్రాణవల్లభా! అట్లయిన నిఁక నింత కన్న భాగ్యము నా కేది? అనుగ్రహించి వినిపింపఁ గోరెదను.

హరిశ్చంద్రుఁడు—కాంతామతల్లీ! నేఁడు సభ చేయుచుండఁగా విశ్వామిత్రకులపతు లచ్చోటికి విజయము చేసిరి.

చంద్రమతి—ఓహో! అందువల్లనె తాము మిక్కుటమైనసంతోషముతో నున్నారు!

హరిశ్చంద్రుఁడు—ఔను; తలోదరీ! మఱియును వినుము. ఆమునివరులయాగమన మభ్యుదయపరంపరాభివృద్ధికి నంకురప్రాయం బని యెఱింగి సరభసంబుగ నభ్యుత్థాన మాచరించి వినయవినమితోత్తమాంగుండ నై యెదురు సని తోడ్తెచ్చి యుచితాసనాసీనులం గావించితి. అంత నాకులపతియును నన్నాశీర్వదించి రాజునకును రాష్ట్రమునకును మేలు చేకూర్చుతలంపునఁ దా నొకమఖం బొనర్పఁ దలపెట్టుటయు దానికి వలయువిత్తంబు నావలనం బొందఁ గోరి విచ్చేయుటయుం దెలిపిరి.



చంద్రమతి—ఆహా! హృదయేశ! మనపురాకృతసుకృతవిశేష మేమన? మనబోంట్లనిలయములకు నామునివరేణ్యులు విచ్చేయుటే యరుదు. రాజునకును రాజ్యమునకును మేలును గూర్చుసవన మొనరింపఁ గడఁగుట మిగుల నరుదు. అట్టిసవనంబునకు మనధన ముపపత్తిగా నాతని చిత్తమునకుం దోఁచినయది యెంతయు నరుదు. చిత్తేశ! ఇదియే కదా మనపూర్వసంచిత సుకృతము శ్లాఘాపాత్ర మనుటకు సూచనము. ఔను. రాజచంద్రుఁడుగ నుండినయాతఁడు గదా యీరాజర్షి చంద్రముఁడు. ఇతఁడు తనతొల్లింటివంశాభిమానమును వదలునా? నాథునిపలుకులకు నడ్డపడి మాట లాడుట కానిప్రవర్తన మగుచున్నది. ఐనను సంతోషసుధావిశేషము నాహృదయమునం దిమిడియుండఁ జాలక పొంగి పొరలుటచే నాకింత యాడ వలసి వచ్చె. మన్నింప వలెను. పిమ్మట?

హరిశ్చంద్రుఁడు—మునిరాణ్మండను లానతిచ్చినవాగ్విలాసంబులు నన్ను సంతోషసాగరనిమగ్నుఁ గావింపఁగా వారు కోరినస్వర్ణము నంతట నిచ్చుటకు సంసిద్ధుఁడ నైతిని. అమ్మహనీయులు దానిని మన యొద్దనే యుంచి వలయువేళఁ బుచ్చుకొనునట్లు చెప్పి, యాశీర్వదించి యుత్సాహాతిశయముతో వీడ్కొనిరి. ఇవ్విధముగా మనలను జరితార్థులను జేయుపొంటె, మనకు శ్రేయోదాయకం బైనప్రయోజనం బనుగ్రహించినట్టి భగవంతునిఁ గూర్చి ప్రార్థించుట యావశ్యకం బే కదా?

తృతీయరంగము.



## చతుర్థరంగము.

స్థలము: విశ్వామిత్రపర్ణశాలోపాంతభూరుహచ్ఛాయ.

కాలము: ఉదయము

పాత్రములు: విశ్వామిత్రుఁడు, సుశీలుఁడు, మత్సరుఁడు, కాంతారిక, విశాఖిని.

[విశ్వామిత్రునియొద్దకు సుశీలుఁడు సవేగుఁడై వచ్చుచున్నాఁడు.]

సుశీలుఁడు—మునివరాగ్రగణ్యా! నమస్కరించెదను.

విశ్వామిత్రుఁడు—శిష్యా! నిన్నింత వేగముతో రప్పించిన దేయతిశయము?

సుశీలుఁడు—గురువరా! హరిశ్చంద్రసార్వభౌముఁ డాఖేటవ్యసనాయత్తచిత్తుఁడై, యిప్పు డిచ్చోటికి వచ్చియున్నవాఁడు; వేఁటగాండ్రందఱు తమతమయాయుధంబులఁ జేఁ బూని పలుదిక్కులకుఁ బోయి తమ కెదురుపడినక్రూరసత్త్వంబులఁ గూల్చుచున్నారు.

విశ్వామిత్రుఁడు—ఓహో! బాగు, బాగు. హరిశ్చంద్రుఁ డిచ్చోటికి వచ్చి యుండుటను నీవు గన్నులారఁ జూచితివా?

సుశీలుఁడు—ఔను, స్వామీ! కన్నులారఁ జూచినాఁడను.

విశ్వామిత్రుఁడు—అట్లయిన మన మెంచుకొనినక్రియల నభియోగించుటకు నిదియే సరి యైనయద నగును. కావున, మన మిప్పుడు తగినతంత్రమును బర్యాలోచింప వలయును. ఆ వసిష్ఠవృద్ధుని వాగ్గర్వము నణఁచుటకుఁ బ్రకృష్ట మయినసమయము నేఁడే తటస్థించెను. దీనికిఁ దగినయుక్తి నొకటిఁ బన్ని చెప్పుదువు గాక.

సుశీలుఁడు—తపస్విజనాగ్రగణ్యా! హరిశ్చంద్రుఁడు సత్యవంతుఁ డను నంశ మొకటియే వసిష్ఠులు వాకొన్నవిషయంబుగఁ దోఁచుచున్నది. ఇచ్చటికి వచ్చినమాత్రంబున సార్వభౌముని నెట్టు లసత్యవాదిఁగాఁ



జేయ వచ్చును? కారణ మావంతయేనియు నబ్బినది గాదు. నామది కేమియు వ్యక్తపడినది గాదు.

విశ్వామిత్రుఁడు—శిష్యా! ఇంతయే నీ తెలిసినది? హరిశ్చంద్రుఁడు సత్యవంతుఁ డని యొకయంశమును మాత్రము చెప్పిన వాఁడు గాఁడు వసిష్ఠుఁడు. ఆవృద్ధుఁడు వాగ్గర్వాతిశయంబు పేర్మిఁ బ్రేలినమాటలు పెక్కులు.

సుశీలుఁడు—మునివరా! అవి యివి యవి యని చిత్తగించి సెలవిచ్చినచో, సమయోచితం బయినయుక్తి నొకదానిఁ బన్నవచ్చును.

విశ్వామిత్రుఁడు—ఔ నౌను. నాఁడు హరిశ్చంద్రుం గూర్చి యవ్వసిష్ఠుం డింద్రునిసుధర్మయం దుగ్గడించినవానిని విందువుగాక:

(1) సచ్ఛీలమునకు గని, (2) సత్యంబు నే కాని యన్య మెఱుఁగనివాఁడు. (3) నిర్ణయపరుఁడు. (4) లోకజ్ఞానంబు నాత్మజ్ఞానంబు గలవాఁడు. (5) పరస్త్రీలయెడ మాతృభావము గలవాఁడు. ఇఁక నెన్నో—

సుశీలుఁడు—హా! అవ్వసిష్ఠుఁ డారాజమాత్రునింగూర్చి యిన్ని విశేషంబులం బన్నెనా! నే నీ యంశంబుల నెఱుంగను. ఆరాజసామాన్యునకెట్టు లీగుణంబులు చెల్లును. రాజసగుణప్రధానులకా పరమతపస్వులకును జేకూడనియీసద్గుణగణంబు లలవడుట! ఒకవేళ శిష్యవాత్సల్యంబున నవ్వసిష్ఠు లట్లు చెప్పి యుందురు. ఓహో! వారియవిచారజల్పంబులవలనఁ బాప మీరా జలమటములపా లయ్యెను. ఏమీ, పరస్త్రీలయెడ మాతృభావమును దాఁ గొనసాగించువాఁడా యితఁడు? ఎది చెప్పినను జెప్ప వచ్చును గాని యిది యెట్లు వానియెడల సార్థక మగును?

ఉ. "ఇంచుకముద్దులేనగవు - లింపవువవ్యవిలాసనూత్త ల
భ్యంచితలోలదృష్టులు న-వారుణపల్లవమాలికాళి ని
ర్తించుసలీలయానములు - మే లవుయౌవన లక్ష్మితోడ వ
ర్తించుమృగాక్షి చందము ల-తిప్రమదంబు ఘటింప వేరికిన్?"

ఓహో! విచిత్రము! ఇట్టి పరస్త్రీ విముఖత్వ మారజోగుణప్రధానుని యెడ నారోపించుట యొకటియే చాలును. ఇదొకటి వసిష్ఠుల తెలివిలేమినిగూర్చి యుగ్గడించుచున్నది. ఔరా! యువతీజనవిలాసంబులకు మాఱుమొగం బిడునంతటివాఁడునుం గలఁడే? అందును వసుంధరాధీశుండా యట్టివాఁడు?

విశ్వామిత్రుఁడు—అవును. అవును. దాని కొకసందియంబును గలదా? ఆ విషయంబుం గూర్చియే యిప్పుడు పర్యాలోచింపవలసి యున్నది.

సీ. మెత్తనియడుగులు - మెఱుఁగారుజానువు లరఁటికంబములదో - యైనతొడలు
ఘన మగుజఘనంబుఁ - గడులేఁతనడుమును బల్లవారుణకాంతి-పాణియుగముఁ
గనకంపునును మేనుఁ - గంబుకంఠంబును బింబాధరముఁ జంద్ర-బింబముఖముఁ
దెలికన్నుఁగవయును - నలికుంతలంబులు బాలేందుసన్నిభ-ఫాలతలము
నమరఁ గుండలకేయూర - హారకంకణాదు లేపార మంజీర - నాద మొప్ప
నల్ల నవ్వుచుఁ దోతెంచు - నబల నెవఁడు, గాంచి మరుముల్కులకు గుఱి-గాక నిలుచు?

ఉ. ఒత్తుగ మాంసము న్నడుఁగు-టోగిరమున్ ఘృతశర్కరాదులున్
గుత్తుకబంటిగా మెసవి - క్రొవ్వినభూధవుఁ డట్టె యెంతయుం
జిత్తముఁ జిక్కఁ బట్టి యల-చిత్తజుధాకకు సంచలింప క
త్యుత్తమభంగి నుండుటయు - నున్నదియే భువి నెందుఁ జూచినన్?

(ఊర్ధ్వంబున దృష్టి సారించి కొంచె మాలోచించి) సరి, సరి. కుదిరి నదిగా యిప్పటికి! శిష్యా! నీ వింక శీఘ్రగామి వై పోయి మేము సేకరించి యుంచి యున్న భూషణాంబరంబులం గైసేసికొని య్యాయిరువురు గన్నియలు నిచ్చటికిఁ ద్వరితముగా వచ్చునట్లు సేయుము.

సుశీలుఁడు—ఇదిగోఁ గులపతియాజ్ఞానుసారము చేసి వచ్చెదను. (మత్సరునిఁ దోడ్కొని పరుగిడు చున్నాఁడు.)

(మార్గమధ్యమున సుశీలుఁడును మత్సరుఁడును మాట లాడు చుందురు.)

మత్సరుఁడు—సుశీల! మనమునివరు లా కన్నియల నింత త్వరలో రమ్మని పంచుటకుఁ గారణం బేమిగా నుండును?



సుశీలుఁడు—వారిని రాజు నొద్ద కంపి, వానిని జేటీదాసునిఁగఁ జేయఁ దలఁచి కాఁబోలు?

మత్సరుఁడు—ఆరాజు వీరికి వశ్యుఁ డయి పోవునో?

సుశీలుఁడు—మత్సరా! నీమాటలు మిక్కిలి క్రొత్త లయ్యె. మానినీమణులమాయావాగురం బడనిమానవుం డెవ్వఁ డీమహామహీమండలంబునం గలఁడు? ధీరులు, భీరులు, శూరులు, విరాగులులోనగు వారెల్లరును స్త్రీ వ్యామోహంబునం గొట్టువడువారే!

శా. "విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతాంబుపర్ణాశనాః
తేపి స్త్రీముఖపఙ్కజమ్ సులలితమ్ దృష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నమ్, సఘృతమ్, పయోదధియుతమ్, యేభుఞ్జతే మానవాః
తేషా మింద్రియనిగ్రహో యది భవే ద్వింధ్యః ప్లవే త్సాగరే."

అనునట్లు మన యాచార్యులు వాయువు, నీరము, పత్రములు, మొదలగు వానిని భుజించి, ఘోరంబుగ శీతాతపకాలంబుల జలంబులను బంచాగ్నిమధ్యంబులను నిలిచి తపశ్చర్యం గొనసాగించుచు, నింద్రియాద్ధత్యంబులను రూపుమాపినట్టివారు. వారే మేనకాప్సరస యొక్క హేలావిలాసంబులకుఁ బట్టువడి యోగంబు నెడ వైరాగ్యంబును భోగంబు నెడ ననురాగంబునుం గూరరే? శాల్యన్నాదుల భుజించి మత్తిల్లి యైహికసుఖలోలు రైమెలంగు నృపాలురా పద్మాక్షుల సల్లాపాదులకుఁ బెడమోము లిడువారలు? అరుదు, అరుదు. మన కులపతులు విశ్వామిత్రులు ప్రశస్త మైన యొక యుక్తిని బన్నిరి. ఇంత మాత్రము శక్తిలేనిదే యవ్వసిష్ఠులతోడ వాదు పెట్టుకొందురా? (ఆకన్యకలం జేరి) తోఁబుట్టువులార! మన యాచార్యులు విశ్వామిత్ర కులపతులు, తొల్లి తాము సేకరించి యుంచినభూషణాంబరంబులను ధరించికొని, మిమ్ముఁ ద్వరితగతి వచ్చునట్లు సెల విచ్చిరి. శీఘ్రంబుగ వత్తురు గాక!

కన్యకలు—సహోదరా! ఇదే వచ్చెదము.

[విశ్వామిత్రుఁ డున్నయెడకు మత్సరుఁడును సుశీలుఁడును
కన్యకలతోడ వచ్చి చేరుదురు.]

సుశీలుఁడు—(విశ్వామిత్రుని దగ్గఱి) స్వామీ! ఇదే కన్యకామణులు వచ్చి యున్నవారు.

విశాఖిని—మునివరాగ్రగణ్యా! నమస్కరించుచున్నాము.

విశ్వామిత్రుఁడు—మానినీమణులార! మీకు సర్వంబును శివ మవుత! మనస్సునం దొక విషయంబు గోచరింపఁగా మి మ్మిచటికి రప్పించినాము. మీరు ఋషివాటికిం బోయి, కార్యంబుఁ గొనసాగించికొని వత్తురు గాక!

కాంతారిక—స్వామీ! యబలల మగుట సమయోచితప్రతిభను బ్రకాశింపం జేసి, కార్యనిర్వాహంబునకు వలయు ప్రకృష్టసామర్థ్యంబు—

విశ్వామిత్రుఁడు—(తొందరపాటుతో) అతివలారా! అట్లన్నఁ బోకుఁడు. మముఁ బోలువా రెందఱో జయింపఁబడిరి. ఇంకను వినుఁడు—

చ. "అతివలఁ జూచి వీ రబల - లంచు వచించు మహాకవీంద్రు లు
ద్ధతవిపరీతవాదు; లిది - దబ్బర కాదె విలాసినీసమం
చితతరలాక్షిపాతముల-చే గెలువంబడి రింద్రముఖ్యులున్!
ధృతి నటువంటివా రబల - లేగతి నైరి తలంచి చూడఁగన్?

స్త్రీలను 'అబలలు' అనుట కేవలము పొరపాటు - ఇది కవికల్పితం బయినప్రౌఢోక్తి.

కాంతారిక—స్వామీ! దేవరవారిపాదకమలంబులకే విధేయలమై యుండు నీదాసురాండ్రము, చిత్తానుసారము మెలఁగ సిద్ధముగ నుండువారము. ఇంతకంటెను మేము పొందఁ గలధన్యత యేది గలదు?



విశ్వామిత్రుఁడు—పడఁతుకలార! మంచిది. అయోధ్యాధిపుఁడు హరిశ్చంద్రుఁ డని వినియే యుందురుగదా! వాఁ డీకానకు వచ్చియుండువాఁడఁట. వాఁడు విశ్రమించి యుండుచోటికి మీరు పోయి వాఁడు మిమ్ము వరించునట్లు లేదేని యొకపన్నుగడఁ బన్న వలయును.

విశాఖిని—మునివరాగ్రగణ్యా! "స్త్రీబుద్ధి" యనునది, పరమనైచ్యంబులకును దైన్యంబులకును బుట్టినిల్లనుట ప్రాపంచికోక్తి. అట్టి బుద్ధిగలవార మైనమాచేఁ దమ కెట్టికార్యంబు కొనసాగఁ బోలు?

విశ్వామిత్రుఁడు—ఇంతులార! వానియెడల మీరు ప్రయోగింపవలసిన నూత్నచర్య లేవియు నుండవు. మీశరీరలతల నాశ్రయించిన యౌవనలక్ష్మీవలనియప్రయత్నశృంగారములే వాని వ్యామోహశృంఖలాబద్ధునిఁగఁ జేసి వైచును. అట్లును వాఁడు లోపడక మతిస్థైర్యముఁ గొని యుండెనేని, మీయభ్యసించిన సంగీతంబును గానరసాధిదైవతములవలె వెలయించి, వాని మీవ్యామోహవాగురం బడవైచి కొనిరండు, పొండు. మీకుఁ గార్యసిద్ధి కలుగుత!

కాంతారిక—మునీంద్రచూడామణీ! దాసురాండ్రవిన్నపం బొకటి కలదు. చిత్తగించి విన వలయును. హరిశ్చంద్రుఁడు మిగుల విరివిం జెందిన సుగుణనిధి. కళాభిజ్ఞుండు. మఱియు నా రాజచంద్రముని రాజ్యపాలనవిధానంబును దేవరవా రరయనిది గాదు. అట్టిచతురుని యెడ నెట్లు మావైదుష్యంబు నెఱపి ప్రతిఫలంబును గాంచఁ గల్గుదుము? ఇది యొక్కటియే మాయెదలం బొదలుసందియంబు.

విశ్వామిత్రుఁడు—మీ కేల సందియంబు?

తే. ఇంతులార యనంగుచా-దంతులార!
చింత సేయక మీ రిట్లు - చెప్పవారు,
కామినీసంగమంబులఁ - గాంచు లేని
వాఁ డొకండేనిఁ గలఁడె యీ-వసుధమీఁద?

ఉ.చ. చెలువపుఁ బేటలేనగవు-చేతను, భావముచేత, సిగ్గుచే,
వలు వగులీలచేత, నుగు-ణంబులచేఁ, గడగంటిచూపుచేఁ,
గలహముచేత, విందు లగు-కందువమాటలచే, బనూయచేఁ,
బెలుచన నెంతవారి వల-పింతురు గాంతలు పెక్కుభంగులన్."

కాంతారిక—గురునాథా! తమ రానతిచ్చునది నిజమే. అట్లుండినను, సౌందర్యమే మూర్తీభవించినట్లు పొలుపొందు పూఁబోండ్లు పెక్కండ్రతో మెలంగునా సార్వభౌముఁడు కాంతారంబునం దపశ్చర్యలఁ గాలంబు గడపుచుఁ గార్శ్యతం జెంది బడలు మమ్ముఁ గాంచి, యెట్లు లనురాగంబునకు లోఁగును?

విశ్వామిత్రుఁడు—కాంతలార! మీ కా రాజపుత్రుని హృదయమును జలింపఁ జేయఁ గల సౌందర్యపటిమ లేక పోయినది గాదు, దానికిఁ దోడుగ శారీరధర్మంబును సంగీతకౌశలంబును జాలినంత గలవు.

"శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణిః"

అనునట్లు, సంగీత మొక్కటియే సర్వజనవశీకరణచణం బై సరవిఁ గాంచు. శిశువులును బశువులును బాములును గానరసము తమ కర్ణప్రణాళికలం బ్రవహింపఁ జిత్తంబు పరవశంబులుగాఁ జేష్టలు దక్కి శిలాధారులంబలెఁ బొలుచు నన్నఁగా మనుష్యునకా యయ్యది యాహ్లాదప్రదంబు గా కుండును? అందును రాజులకు రాగంబులయం దనురాగము మిక్కుటము. ఇంత యేల? సంగీతమునకుఁ బట్టుపడని వార లీలోకంబునకుఁ గాని లేక యాలోకంబునకుఁగాని మత్తే లోకంబునకుఁగాని కాని వారలే యగుదురు. గానమునం దిచ్ఛ లేనివానిని జాతితోఁ దుల్యునిగ భావింప వచ్చును. కాఁబట్టి మీర లించుకేనియును సందియం పడక యుత్సాహశక్తిం గొని చనుఁడు, సర్వ మనుకూలించుత! పొండు.



విశాఖని—గురునాథా! దేవరవారి యాజ్ఞానుసారమే పోయెదము. అయినను రాజును వ్యామోహపాశబద్ధునిఁగాఁ జేయఁ జాలుసామర్థ్యము మాకుఁ గలదో లేదో యను సందియంబుచేతఁ దొట్రిలుచున్నారము.

విశ్వామిత్రుఁడు—విశాఖనీ! నీ కేల యింత సంశయము?

చ. "పరభృతపంక్తి నీయధర-పల్లవలబ్ధియుఁ దుమ్మెదల్ భవ
త్సరసముఖాంబుజాప్తియును - సంగతిఁ గోరి వనంబులం దప
శ్చరణలు చేసి పల్కులును - జక్కనిచూపులు నై మెలంగెడున్
బురుషులు నిన్నుఁ జూచి మరు-పూన్కికిఁ జిక్కరె నీకు దక్కరే?"

కొండయొక్క యౌన్నత్యము నాకొండ యెఱుఁగఁ గలదే? వైనువ్య విశేషాలంకృతులు దమ విద్యాపెం పింత యనుచుఁ దామే యెఱుఁగఁ జాలరు. మీరలు మా యెడ సకల కళల నభ్యసించి తన రారువారు. మిమ్ము జయించుట యేలోకంబులయందలివారికిని నసాధ్యం బయి యుండును. డెబ్బదిరెండు మేళకర్తలును దమయెడల జన్యంబు లయిన రాగంబులతోడ మీయందు లయించి యుండును. అవియో కనకాంగి, రత్నాంగి, మానవతి, తానరూపి, సేనావతి, రూపావతి, హాటకాంబరి, గీర్వాణి, గౌరీ మనోహరి, చారుకేశి, సరసాంగి, నాగానంది, రాగవర్ధని, గాంగేయభూషణి, వాగధీశ్వరి, శూలిని, పావని, స్వర్ణాంగి, దివ్యమణి, ధవళాంబరి, నామనారాయణి, కామవర్ధని, శ్యామలాంగి, హేమవతి, నీతిమతి, కాంతామణి, లతాంగి, చిత్రాంబరి, జ్యోతిస్స్వరూపిణి, నాసికాభూషణి, రసికప్రియ మొదలుగాఁ గలవి. ఇట్టి మీబోంట్ల నామధేయంబులనే తమకు సంజ్ఞలుగాఁ గల్గిన రాగంబులు శ్రోతలౌ రసికజనులహృదయారవిందంబుల కనురాగ సంపదలు నించు ననుచో మీరే తదీయగానరసాధిదేవతలు మూర్తీభవించునట్టు లావిశ్వాధిపునొద్ద కేగి, సంగీత

రసంబు వెలయింపవాఁడు దదీయరసావగాహనతత్పరుండు గా నొల్లని మూఢమానవుం డై యుండఁ గలండో? అందును, మీసంగీత శాస్త్రసరణికిఁ దోడు, శారీరసౌభాగ్యము. శారీరమంజిమకు సాయము సౌందర్యమహిమచేత వ్యక్తీకృతం బయినభావాభినయవిరచనాప్రౌఢిమంబు. ఓహో! నారీమణులార! ఇట్టివిశిష్టగుణగణ ప్రకాశనంబు ము న్నెన్నఁడు నప్సరోనికురుంబంబులయెడల నేనియును గాంచి యుండువారమో? లేదు, లేదు; ముమ్మాటికిని లేదు. (విశాఖనిం గాంచి) కాంతామణీ! నీవు నీమహిమ నెఱుంగమి ని ట్లింతయు జంకు చున్నదానవు.

సీ. సరససారంగాతి-శయనిరూఢఁ దనర్చెఁ బాలత! వాల్చూపులు - జాలువు మీఱి
లాలితగతిని వ-రాళివైఖరిఁ బొల్చెఁ బల్లవపాణి! ధ-మ్మిల్లగరిమ
కంకరాభరణంబు-సౌష్ఠవంబున మించె భామినీరత్నంబ! - రోమరాజి
రహిని బన్నాగాభి-రామలీల నెసంగె నీలనీలాలక! - నిమ్ననాభి
యరయ సౌందర్యగానవి-ద్యానిరూఢము, లింతి! నీయందు బెరయుఁ టి-వెఱుఁగ కున్కి
నిట్లు వికలాత్మ వయ్యెద-వే బెఱుంగ, నొక్క మరుమల్కి యనఁగ నీ-వొప్పుచుంట

యున్నల మిన్నలారా! మీ రేగి వానిమ్రోల మీనైపుణంబుల నెఱపితి రేని వానిడెందంబు ధరాధరాశ్మ సన్నిభం బై యున్నను క్షణమాత్రంబున వ్రయ్యలు వ్రయ్యలుగ వ్రస్సి పోవునట్లు చేయఁ జాలుదురు. అట్టిపటిమ మీకు మెండుగఁ గలదు. ఓ విధుంతుద వేణులారా! వినుండు. త్రిలోకజేత యైనరతీకాంతునితూణీరంబు నుండి వెలివడు మోహనబాణంబుల వైఖరి మీరలు మదీయాశ్రమమునుండి నిర్గమించి వాని దృష్టిపథంబులంబడి, కొంతవడి స్వైర విహార వినోదంబుల నెఱపు వారిభంగి రాజహంసీద్వయంబు భాతి సలీలమందమందయానంబుల సంచరించుచు, నవ్వక నవ్వుమోములును జూడక యే చూచుచూపులును జూపక యే చూపు బాహు



మూలంబులును, మోవివిఱుపులును, బయ్యెద జార్పులును, మందహాసంబులును, సుందర వికాసంబులును, వెలయించుడు మేచకద్యుతు లీనుకబరీభరంబునైగనిగ్యంబులును, మోముచందురు ధాళధళ్యంబులును, కింకిణీఘణాఘణ్యంబులును, మంజుమంజీర నిస్వన ఘూలఘుల్యంబును, భళిరే! యెట్టివాని హృదయంబును జిక్కులకుఁ దార్పక పోవును? ఇట్లింపారు మీ విలాసపాశంబులకుఁ జిక్కక తక్కెనో, డగ్గఱించి తన్వంగులార మీపయ్యెదముంగొంగులను గెంగేలను గీలించి యొయ్యారపుతీవులకు నయగారపుం బసలు తోడగునట్లు ధరణీధవపుంగవునకు జోహారుండువ్యాజంబు నూని, కలికి నేతల బలితంపువలపు పెరుఁగ మీవిలాసంబులు నెఱపి తదీయ స్థైర్యంబును జెల్లాచెదరగునట్లు కలంచి వైచి వానిని మీదాసునిగాఁ జేసికొని యేలికొండు; పొండు. నితంబినీమణులార! ఇంతకును వాఁడు మీతగులంబునం బడక తక్కఁడు, తక్కఁడు. తక్కెనుబో రాజకీరంబుల తేజు మీఱి, మీ మంజులాలాపంబులఁ దదీయశ్రోత్ర పర్వంబు గావింపుఁడు. పరభృతంబులవడువున మోహోద్దీపకములయిన పాటలు పాడి వానిచిత్తంబున కుత్కర్ష నాపాదించి, యణఁపరాని విరాళిని బ్రుంచి వేయుఁడు. ఔరా! ఇవన్నియు మేము చెప్పవలయునే? కుసుమగంధులకుఁ గూడఁ బుట్టినవి గావె యీవిలాసంబులు? ఇంతకును లోఁగఁ డందు రేమో?

సీ. "ముగ్ధేందువదనల-ముఖవిలాసములకుఁ జిగురుఁబోడులనుఖా-శ్లేషములకు
మహిళాజనంబుల-మధురభాషణలకు వనితలనిశ్వాస-వాసనలకుఁ
గలకంఠకంఠుల-కలికిచూపులకును బాటలగంధుల-పాటలకును
మత్తేభయానల-మందహాసములకు మగువలవాతెఱ-మధువులకును
నంగనలపాదహ-స్తవి-న్యాసములకు, వెంటఁ బరు వెత్తు మునివన-వృత్తతతులు
విషయసౌఖ్యస్వరూపవి-వేకు లైన, వరుఁడు పశుఁ డౌట యేమి య-చ్చెరువు జగతి?"

వినుఁడు మఱొక్క విశేషంబు గలదు. మీరలు వాదిత్రాల లాస్యకలాధిదేవతలో యన మర్దళతాళనినాదపద్ధతులకు మాఱు, కరకంకణరత్ననూపురమంజీర ఝణంఝణార్భటులు పేరోలయ, దేవతానటీమణులకు బొమ్మఁ బెట్టునట్టులు కేలిక సల్పుఁడు. తత్తదవసరంబులందు వస్త్రాచ్ఛాదితంబు లయినమీయవయవలక్ష్మిని దదీయదృష్టిపథంబులఁ బడున ట్లప్రయత్నంబునం బోలె సవరింపుఁడు. ఓహో! ఇట్లేకాంతంబున నున్నతనదెసకు దివ్యసుందరీమణులం బోని యిందుముఖులు భావరసాభిజ్ఞలై వలచి వచ్చి యిచ్చకొలుపు నిచ్చకపుమాట లచ్చువడఁ బొచ్చెంబులేని కూరిమిం జూపుమచ్చెకంటులకుఁ జిత్తం బీనిమానవుండును గలఁడో? అణుమధ్యలార! అతిత్వరితంబుగఁ బొండు. తప్పక మీకుఁ గార్యసిద్ధి యయ్యెడును.

కాంతారిక—గురునాథా! దేవరవారి యానతిచొప్పుననే చేసెదము. ఈ సార్వభౌముండు మాయాటలకే వశ్యుఁడయి పోవునా యని సందేహించెదము.

విశ్వామిత్రుఁడు—అంగనామణులార! అధిపుఁడు మీ యాటలకుఁ జిక్కఁ డన్నఁ బాటలకును జిక్కువడఁడో? చిక్కువడును. తప్పక చిక్కువడును వినుఁడు. (కాంతారికం జూచి)

మ. అకలంకేందుముఖీ! విశాఖినియుఁ దా - నాలాపముల్ సేయ గా
నకళాదేవతభాతిఁ బల్లవితవీ-ణాదండకాండంబుఁ గో
రకితస్థాణువుగా జగత్త్రితయముల్ - రాగాబ్ధి నోలాడు గా
యకవేళాదిసమస్తదోషహరి-హారాంకూరకంఠధ్వనిన్.

హేలావతులార! ఏల యీలీల వలవనిజాలి మీకు. మీకుం గామితార్థంబు చేకుఱు. ఇంచుకంతయు సందియము లేదు, పొండు. పోయి రండు. ఆశీర్వాదము.



కన్నియలు—మునివరా! దేవరవారియాశీర్వచనంబు నూతఁ గొని పోయి వచ్చెదము.

(నిష్క్రమించుచున్నారు.)

---

## పంచమరంగము.

---

స్థలము: అయోధ్యాసమీపారణ్యము.

కాలము: పగలు.

పాత్రములు: లాలు, కాలు, బైరీ, మొదలగు మృగయులు.
హరిశ్చంద్రుఁడు, నర్మసఖుఁడు, కాంతారిక, విశాఖిని.

---

లాలు—అరే కాలు! యెంట్రా బైరే? గంగూ! రండ్రా. బిరాన రండ్రా, అడు గెత్తి పెట్టా అరజామూ! రండ్రోవ్, మనసామి, పెబూ, యేల్క రా బోతాండ్రా! పాజ్జిండ్రా, అడ వంతా కలియ పెట్టాలె. బాకూ బల్లెం కత్తి కటారీ యెత్తుక రండ్రోయ్. బైరే, యేంట్రా ఆలిశ్యెం.

కాలు—గో పాటోస్తాం. ఆర్దూల కంతా తుప్ప పో రాసినాం. ఊర్కే కేక లేస్తావేం పాటోస్తూ వుంటె. యెం శెయ్యాలి శెప్పు సూస్తాం.

బైరే—అంణ్ణేం అడిగేది? యేం శెయ్యాలా? మనపబువు దొర వచ్చె తాల్కే అడి వంతా గలియ పెట్టాలే. సందు గొందు మూలా ముడుకుల్లో వాదల్లో పాయ్ దాంకుండే మెకాల్ని పరవ తోలాలి. సా మొచ్చి పోరు కొట్టి కొట్టి యేసి వెస్తాఁడు.

లాలు—(బైరీతో) ముందు సూండ్రోయి. అదుగో అదుగో

సీ. బయలికై తనతోక - బటువుగా తిప్పక,
బెబ్బులిగో సూడు - బెదరకాక,
పొదసాటుమాటుగా - పొంచి పొంచే సూస్కు
కూకొ్కు వున్నాదిరా - కూయ బాక.

కాలు—

సీ. బూశిగా సూడరా - పొదసాయ బింకాన
శెట్టి పట్టుకో నిల్సి - శిటుకు మనకు,
మనకేసి సూనుతా - మశ్శెల్ల గాఁరాక,
మూల్గు తున్నా దిరా - యెల్గుబంటి.

భైరే—

గీ. లోయలోప లగో సూడు - వేయి లచ్చ
ముండ్లపందుల మొత్తాలు - మొనసి వుండు.
శింటబూశికి మలెశెంగు - శెంగుమంట,
యెల్కబార్తాయిగార్లోకి - యిట్టిగుంపు.

గంగూ—లాలూ. ఓరిలాలూ. అదుగో సూద్రా! ఆగుట్టమీాద! ఆ. అబ్బ! దీనిదుంప తెంతు! ఎన్ని ఏనిగెల్రా! ఒకపదిలచ్చ వుంటాయి!

లాలూ—ఓరి. యేం బుద్దిరా! పదిలచ్చంటావు బగుతెల్సురా నీకు. ఇంకా నిండావుంటాయి. తొమ్మిదినూఱుకంటె యెక్వ వుంటాయి.

భైరే—అదుగోసూద్రా చౌలపిల్లి. చెట్టుకిందిపొదల్లో డాగింది.

గంగూ—కూతేయ్యొకు. అల్లదోసింగాలు వస్తాయి సూడు. ఒరే ఆడాడ మనందాగుండి చూస్కొంటాం. రాజొచ్చేయేళ్కు అన్నీ చూస్దాం.

లాలూ—అదోయెన్ని శివ్వంగులో సూద్రా.

గంగూ—సరికానీ. నూవెళ్లు. ఆ పొన్నచెట్టుకో్కు. నేనీణ్ణుండిసూస్తా. ఒరేభైరే నూవల్లగుంటకాడా డాకో్కు.



(హరిశ్చంద్రుఁడు ప్రవేశించి వేఁటాడును. మృగయు లతనిం దఱిసి మృగముల యునికిపట్టులం దెలుపుదురు. రాజు వారివెంటం బోవును. నర్మసఖుఁడు అరణ్యమునందలియొక చెట్టునీడను నిలిచి తనలోఁదా ననుకొను చున్నాఁడు.)

నర్మసఖుఁడు—స్వ ఆహా యేమి యెండ! ఏమి తాపము! ఇంచుకయైన నోర్వరాక యున్నది. ఉదయము మొదలుకొని యిదివఱకు నరణ్యమం దంతటను దిరిగి తిరిగి యనేకమృగములను గెడపినను గొన్ని కొన్ని యింకను దప్పించుకొని పాఱి పోవుటచేఁ జంపఁబడినవి కావు. చక్రవర్తియు నిందలిదుర్గమప్రదేశములను శ్రమముల కోర్చి, ప్రవేశించి, క్రూరసత్త్వముల నన్నింటిని గూల్చి వైచెను. వేఁటగాండ్రును క్రూరజంతువధోద్యమంబునఁ దమతమనైపుణ్యంబును వెల్లడి చేసిరి. ఇది యిట్లయ్యు నింకను గొన్నిదుష్టసత్త్వములు దాఁగి యున్నవి. ఏమి చేయ వచ్చును? ముండ్లు విఱుగుటవలనఁ బాదములు జల్లెడక్రంత లైనవి. అనవరతసంచారములచేతఁ గాళ్ళు సత్త్వవిహీనతను జెంది, కదల లేకున్నవి. అవయవము లన్నియు నలసి శరీరమును గుప్పఁగూల నొనర్చు చున్నవి. ఇంకఁ గొంత నిలఁబడుటకు సైతము శక్యము గాదు. నే నీభూరుహచ్ఛాయఁ గొంత విశ్రమించెదను. ఎవ రెట్లు పోయినను నీ త్రోవనేకదా పోవలెను. ఆహా! ననుబోఁటివాని గతియె యిట్లున్న సుకుమారశరీరి సార్వభౌముఁ డెట్టిస్థితియం దుండువాఁడు? ఇట్టియాఖేటము నాబుద్ధికిఁ దెలిసినంతలో నిదివఱలో నెన్నఁడును జూచినాఁడను గాను. (విశ్రమించు చున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—(స్వగతము) ఈ వరాహమును వేఁటాడుటయందే యధిక మగుశ్రము ముప్పతిల్లినది; దాని వెన్నంటి పరువు లిడుట

యందుఁ గంఠమునం దున్న యీరత్నహారము సైతము తెగెను. ఇట్టి దుష్కరమృగయ నాజీవితకాలమునం దెన్నఁడును దటస్థించినదిగాదు. ఈ శ్రమము నాయొక్కనియందె తక్కినను, క్రూరమృగసంచయ మొకవగఁ దుదముట్టెను. ఒక బెబ్బులి వెన్నంటి వేటాడఁ జనినమంత్రి యింకను వచ్చినవాఁడు గాఁడు. భల్లూకభద్రేభాదిజంతుసంతానముల నంతరింపఁ జన్నమృగయులును రారు. మనవేటగాండ్రందఱు క్రూరమృగనికరంబులఁ గూల్చి కూల్చి యలసి యున్నవారు. ఇంకను వేటలాడుఁ డనుట కానిపని. ఏవైన మృగము లిదివఱకుఁ గన్నులఁ బడక దాఁగియుండినవి గనఁబడినచో నేనె వధింతును. అల్లదె పత్రఫలకుసుమసమన్వితబహుళశాఖాయతోత్తుంగమ్మగు నొక మహీరుహమ్ము. దానియంతటిపెంపుం గూర్చి విమర్శింపఁ బరిసరమునం దొకజలాశయమే దేనుండవలెను. మాకుఁ దప్పిన మొకంబులు దప్పిగొని తత్ప్రదేశంబునకుఁ దప్పక రానోపును. ఔను; అదిగోఁ గనఁబడు చున్నయానికుంజంబుచాటున నుండి యట్లు వచ్చువానిఁ బారిగొనెద.

(పోయి పొదమాటునఁ గూర్చుండును)

[కాంతారికా విశాఖినులు వచ్చి నమస్కరించెదరు.]

విశాఖిని—

మ. జయ మార్తాండకులావతంస! విమత - క్ష్మానాథనానాచమూ
చయపాథోనిధికుంభసంభవ! సమ- స్తద్వీపవిన్యస్తభూ
రియశస్తంభ విజృంభమాణమతి వ-ర్ణింపన్సమర్థుండె య
వ్యయ మై యొప్పుభవన్మహామహిమ య-వ్వాతాశనాధీశుఁడున్.

హరిశ్చంద్రుఁడు—వనితలారా! మీ రెవరు?

కాంతారిక—రాజేంద్ర! మే మీకాంతారసీమ వసించుకన్యలము. మునినాథునిపర్ణశాల న్వసించి, వా రిడినకార్యములను జేయుచుఁ



దదీయానుగ్రహవిశేషంబున వైదుష్యవిభూషితల మై కాలము గడపు వారము.

ఉ. నీరమణీయవైభవము - నిర్జరవల్లభు గెల్చు, నీమహో
దారత పారిజాతవసు-ధారుహముం బ్రహసించు, నీశుభా
కారము చంద్రమండలముఁ - గైకొన కుండు, నటంచు మాటికిన్
సూరిజను ల్నుతింప నినుఁ - జూడఁగ వచ్చితి మయ్య వేడుకన్.

హరిశ్చంద్రుఁడు—సరి, మిమ్ము మాయొద్దకు రాఁ జేసినభావగత మేదియో?

విశాఖిని—రాజరాజ! మాకు సంగీతసాహిత్యములయం దప్రతిమానప్రతిభ గలదు. సకలశాస్త్రాభిజ్ఞల మైనవిదుషులము. దేవరవారు మృగయావినోదంబునకై యిచటికి వచ్చుట విన్నారము. మాశ్రమసాధితం బైన సకలవిద్యాచమత్కృతులను దమ మ్రోల వెలయించి, యాఖేటజం బైనయలసటఁ దూలినతమచిత్తంబున కుత్సాహాతిశయంబు నాపాదింపఁ జేసి, సన్మానితలము గా వలయు నని యుద్దేశించినారము. దేవరవారియనుజ్ఞ యైనచో మాయొక్క సంగీతసాహిత్యపరిజ్ఞానమును గనఁబఱిచెదము.

[నర్మసఖుఁడు వీరిసంభాషణలను చర్యలను జాగరూకతతోఁ గనుఁగొను చున్నాఁడు.]

నర్మసఖుఁడు—(స్వగతము) ఎవరో యిరువు రింతులును మనచక్రవర్తియు నేకాంతగోష్ఠీవినోదైకచిత్తు లయి యుండువారు. నే నిచ్చోట డాఁగి యుండుట వారు గన్నారు కారు. ఇఁక నేమి జరుగుచున్నదో గమనించెద.

(సంకుచితశరీరముతో దాఁగి పరుండు చున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—ఇంతులార! మీయిష్టానుసారమె కానిండు.

(కాంతారికయు విశాఖినియుఁ బాడుచున్నారు.)

హంసధ్వని—రూపకము.

పల్లవి.

నాయకా కామినీపంచసాయకా
ధీరా - మరుబారిఁ బాలఁ
గలేర, యేలికోరా॥ నాయకా॥

అనుపల్లవి.

నిద్రాహారసౌఖ్యమ్ములఁ ద్రోచి
పల్మాఱు నిన్నెడఁ దలఁచి వలచి,
వివేకగుణసంపన్న భోగ
సామ్రాజ్యమె మదిఁ గోరి వేగ॥ నా॥

చరణములు.

సంతతము మదనాగ్నికి నోడి
నీఘనకీర్తుల నెప్పుడు పాడి
సుందరాంగ నిన్నిప్పుడె కూడి
సౌఖ్యవారాశి నోల లాడ
జాల నేల వేళ; తాళఁ జాల, జాల మేల?
కరుణాకరుఁడా! ధీరుఁడ - కాఁగిలిచ్చి మన మారఁ బ్రోవర.
ఈ మలయపవనుఁ డేచి - వీచి - దరిగా ననిశమో - వహ్నిని
బెంచఁగ - నాయకా॥
పరభృత - పారా - వతస్వన - ములుకే - లికిమితి - చొప్పఁగ. నా॥
ఘనసాం - ద్ర్యము - మామది - కనవ - రతము - వేడ్కనిం - ప నా॥
శ్రీ - కర - నీమో - వినుధను - గ్రోలఁగ - మనసారఁ - దలఁచి నా॥
మం - జీర - జములు - హం - స - ధ్వను - లై వెలయఁగ - మంద - నా॥
మంద - గమనం - బులనీ - సామీ - ప్యముఁజే - రితిసా-మిసరగ॥ నా॥

హరిశ్చంద్రుఁడు—పంకజాక్షులారా! బాగు. బాగు. మీసంగీతశాస్త్ర పరిజ్ఞానమునకును శారీరమంజిమకును మిక్కిలి సంతోషించితిని.



మునివరునియనుగ్రహవిశేషంబున మీకొనగూడినయీవిద్య శ్లాఘార్హము. మీసమకూర్చినసాహిత్యమునందలివిషయ మొక తీరుగా నున్నను, అందలిపదగుంభనమును వాక్యచమత్కృతియు నత్యంత ప్రశంసార్హములు. మీకుఁ దగినట్టు లియ్యరణ్యమునం దేయ మూల్యవస్తువు నొసఁగి బహూకరింపఁ గలను. ఐనను మీకు నీ రత్నహారము నొసఁగెదను. దీని మీ రిరువురు నంగీకరింతురు గాక. ఇది మీప్రౌఢిమకుఁ దగినపారితోషికము గా దని నాకుఁ దెలియును. మీకు సందర్భము గలిగినప్పు డొకపరి మానగరమునకు రండు.

(మణిహారము నీయఁ బోవును.)

కాంతారిక—(కైకొనక)వనితానూతనమదనా! దేవరవారిభవ్యాశీర్వచనప్రభావాతిశయమున మాయొద్ద నిట్టిమణిహారములు పెక్కులు గలవు. పుష్పబాణునియరవిందబాణపాతంబుచేత గ్లానిఁ జెందినమాహృదయారవిందములఁ దావకకరుణారసాసారములచేఁ బునరుజ్జీవితములు చేయ భావించి వచ్చినమా కీమణిమాలతోడిపని యేమి? తావక బాహు దండాశ్లేషములకన్నా యీమణిమాలికాశ్లేషము మా కంఠసీమల కాహ్లాదప్రదములు? చిత్తగించి చిత్త మిచ్చినఁ గదా మే మీచిత్తజు బారినుండి యొకదరిఁ జేరఁ గలము.

హరిశ్చంద్రుఁడు—(ఉలికి పడి) మునిశిక్షితల రగుమీ కీదుష్టభావంబు తగునా? కాయికసుఖంబులె పరమార్థంబు లని తలంపఁ బోలునా? వివేకం బేల తూలఁ బుచ్చెదరు?

విశాఖిని—రూపజితమారా! మానినీమణుల నెంజిలిని దీర్ప కుండుట మహీపతులకుఁ దీరు కాదు. భూకాంతులకు గాంధర్వము కైకన్న ఫలము. ఇది వేదోదితమార్గము. దేవరవారికిఁ దెలియనివిధాన మేది? దానిఁ బర్యాలోచించి చిత్తము మామకాయత్తము గావింతురుగాక, సీతితెఱంగు మే మెఱుంగుదుము...............

ఉ. నిక్కము దాఁప నేల ధరణీవరమండన! మాకు నీపయిం
జిక్కె మనంబు; మమ్ము నిఁకఁ - జిత్తజుబారికి నప్పగించెదో;
చొక్కి మరందమద్యముల-చూఱలఁ బాటలు పాడు తేంట్లసాం
పెక్కినయల్లపూవుఁబోద-రిండ్లను గౌఁగిట గారవించెదో!

మనస్సు గలిగిన మార్గము గల్గును.

హరిశ్చంద్రుఁడు—వనితామణులారా! మీ రాడుమాటలు యథార్థములే. "మనసు గలిగిన మార్గము గలుగు" ననునది యొక మంచిలోకోక్తియె. ఐనను నా కని యొకమనస్సు స్వాతంత్ర్యస్థితి యందు లేదు. ఎన్నఁడు నేను నాజీవితేశ్వరిని బెండ్లాడఁ గంటినో నాఁడె నాధనజీవితాంతరంగము లన్నియు నావనితాయత్తము గావించితిని. ఆహేతువు ననుసరించి మీ కీదిన మర్పింపఁ దగిన యంతరంగ మొకటి నాయం దెక్కడిది? మీ రీమణిమాలిక నంగీకరించి పనివినుఁడు.

కాంతారిక—పార్థివేంద్ర! ఏమి చాకచక్యము! వైదుష్యచతురతకుఁ దోడు మార్దవాలాపచమత్కారమును మాయెడలఁ బ్రకాశింపఁ జేసి కామోత్కంఠతచేతఁ దహతహపడుమమ్ముఁ దఱుమఁ గొట్టఁ దలఁచెదరు. రాజేంద్రులకు బహు దార పరిగ్రహము శాస్త్రసమ్మతము గాదా?

హరిశ్చంద్రుఁడు—కామినీమణులారా! కాముకుల రైనమిమ్ము వంచితలఁ జేయుచున్నా ననుకొనకుఁడు. పరస్త్రీలపొం దెడలుటయే పౌరుషము. ప్రపంచమునం గలసకలాశ్రమములందును సర్వాధికారముల వహించి ప్రశంసార్హ మైనది గృహస్థాశ్రమ మొక్కండే. అది సకలధర్మములకును జన్మగృహము. అందు నేకపత్నీవ్రతమవశ్యాచరణీయము. కాఁబట్టి నేను మిమ్ము నిరాకరించునట్లు భావింపక యీ మణిహారమును గైకొని పొండు.



బాలికలు—ప్రభూ! కోరి వచ్చినమమ్ము నకారణముగ నిరాకరించెదరు. మేమో యబలలము. బలహీనలు బలవంతులయెడఁ జేయనగునది యేది? తమరు మాయెడల నభిమానించి యంగీకారమును జూపని యెడల, నాథా! మాయాయువు శేషించినంతకాలము నాహారవిహారములయం దనురాగంబును వర్జించి మీనామమునే స్మరించుచుఁ బ్రాణములను వదలువారము.

మత్తకోకిల వృత్తములు.

విశాఖిని—
కామినీమణి కోరి వచ్చినఁ - గాదు పొమ్మన ధర్మమే?

హరిశ్చంద్రుఁడు—
నేమముం గనుచిత్తవృత్తుల - నిర్ణయంబు ల విట్టివే.

కాంతారిక—
ఈ మహీస్థలి మీయుదారత - కిట్టి లో చ్చొనగూర్తురే?

హరిశ్చంద్రుఁడు—
లేమ! చిత్త మనన్యదత్తము - లీన మానె మఱొక్కటన్?

విశాఖిని—
రాజ! మీరసికత్వసంపద - రామచేతము నేర్పెనో?

హరిశ్చంద్రుఁడు—
ఓజ నారసికత్వ మక్కట - యొప్పునే వ్యభిచారితన్?

కాంతారిక—
ఈజగాన నెవండు సౌఖ్య మి - దేల యంచుఁ దొలంగునో?

హరిశ్చంద్రుఁడు—
ధీజితేంద్రియుఁ డెన్నిభంగులఁ - ద్రిప్పఁ జూచునె స్థైర్యమున్?

విశాఖిని—
మారరూప! కుశేశయాక్షులు - మన్నన ల్గన రాదొకో!

హరిశ్చంద్రుఁడు—(మౌనముతోఁ జూచు చున్నాఁడు.)

కాంతారిక—

పారపర్యము లెంతురే గద - భామ లేదము డాసినన్

హరిశ్చంద్రుఁడు—(మౌనముతోఁ జూచు చున్నాఁడు.)

విశాఖని—

క్రూరకర్ముఁ గృతాంతుఁ బోలితో - కోమలాంగుల నేఁపఁగన్

హరిశ్చంద్రుఁడు—(మౌనముతోఁ జూచు చున్నాఁడు)

కాంతారిక—

పారమార్థికుఁ డెవ్వఁ డౌ నృప! - పారదారికుఁడే గదా!

విశాఖని—

గీ. పరమ మాప్రజ్ఞఁ దలపోయఁ - బార్థివేంద్ర!
ప్రాణదానంబుకంటెను - భవ్య మెద్ది?
పుష్పబాణునిబాణాగ్ని - బ్రుంచఁ గలవొ?
యొలమి దరిఁ దార్చి మముఁ బ్రీతి - నేలఁ గలవొ?

కాంతారిక—

గీ. దురితములలోన ఘోర మా-దురిత మరయఁ
గాంతలను నేఁచుచెయ్దంబు - క్ష్మాతలేశ!
వారిఁ బోరిగొనువారికి - వఱలుఫలముఁ
జెప్ప నేరికి శక్య మై - యొప్పు వసుధ?

హరిశ్చంద్రుఁడు—

ఉ. ఒల్లనివానిపై వలపు - లూఱఁగ నీగతిఁ బల్కనేల? మీ
యుల్లముఁ దేర్చి సద్గతికి - నొప్పును దార్పఁగ; నెంత లాడినన్
సల్లలితార్యమార్గమున - సంతతము న్మెలఁగు న్మదాత్మ; మీ
రల్లినవాగురం బడునె? - యంగనలార యిఁ కేల పల్కఁగన్?

నామంత్రి లోనగువారలు నారాక కెదురు చూచు చుందురు. కాఁబట్టి నేను దీర్ఘకాల మొకతావునఁ దడయుట తగవుకాదు. మీరు పనివినుఁడు. (తిరిగి పోవు చున్నాఁడు.)

విశాఖని—సహోదరీ! ఈరాజపుంగవునినిర్ణయదార్ఢ్యంబును, గంభీరభావంబును గన్నావు గద! ఆహా! ఇట్టిపురుషోత్తముని వంచితునిఁ జేయ నెవరితరము?



కాంతారిక—ఔ నౌను! ఆరాజోత్తముని యింగితజ్ఞానమును, వాఙ్మంజిమము ననన్యసామాన్యములే. గొప్పతపస్వి యైనమనమునిరాజున కీరాజవరునిగుణములం దొకశతాంశ మైన నుండదు. మన మనేక విధంబుల నాటంకపఱిచి చెప్పినను వినక వ్యర్థముగా మనల నంపెను. మన మేమి చేయ వచ్చును? వచ్చినత్రోవ మరలుటయే ప్రశస్తము.

నర్మసఖుఁడు—(ఎదురుపడి) ఆహా! ఎంతటి యుత్తమలు! రాజేంద్రుఁ డించుకంత చలించి యుండినచో మీవలలఁ దగిలించుకొని యుందురు. పాపము! ఎంత ప్రలాపించితిరి? మీజతనంబులు సాగఁ గానము.

విశాఖని—ఆ! వీఁ డెవఁడు? వీఁ డిదివఱ కెక్కడ నుండినవాఁడు? ఎవ్వఁడవురా నీవు?

నర్మసఖుఁడు—'ఓరీ' యన్న నీకుఁ జెంప బ్రద్దలు తీయుదును. నే నెవ్వఁడనా? నే నిట్టిఁడని తెలియదా? నే నే రాజేంద్రుని ప్రాణసచివుఁడను.

కాంతారిక—ఏమిరా! మట్టుమర్యాద లేక ప్రేలెదవు? మా చెంప కాయలా నీవు బ్రద్దలు తీయుదువు?

నర్మసఖుఁడు—చెంపకాయ చినుఁగునట్లు చఱపనా యేమి? మీగుణములకును శీలములకును జెంపప్రేటే బహుమానము. అప్పుడేకదా తగిన బుద్ధి వచ్చును. ఈయాటలు మఱొక్కరికిఁ జూపఁ బోవునప్పుడు నీ 'చెంపశుద్ధి' సుగుణసుశీలంబులను జ్ఞాపకపఱుపదా? తీసెదను ఇదిగోఁ జెంపకాయ పగులు నట్లొకచెంపపెట్టు (చఱచు చున్నాఁడు.) చూడు.

పడుచులు—అయ్యో! అయ్యో! ఓరిపాపీ మహాపాపీ! నీ కెట్టిచేటు మూఁడఁ గలదో చూడు. ఇదో యొకనిముసములోనే నీదొసఁగు గలుగునో చూడు. (ఏడ్చుచు నిష్క్రమించెదరు.)

నర్మసఖుఁడు—అహా! వచ్చునది రానిమ్ము. దీని కెవఁడును భయపడఁడు. అధిపుని నపయశో మనుపెనురొంపిలోఁ ద్రింపఁ దలఁచి వచ్చిన చెడిపెలకు మీరు నుత్తెట్టినీచకార్యమును జేయఁ బాల్పడరు?

(నిష్క్రమించు చున్నాఁడు.)

పంచమరంగము.

షష్ఠరంగము.

స్థలము: అరణ్యమునం దొకమార్గము.

కాలము: పూర్వాహ్ణము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, సత్యకీర్తి, నర్మసఖుఁడు, విశ్వామిత్రుఁడు, వైఖానసుఁడు.

హరిశ్చంద్రుఁడు—మంత్రివరా! ఇంతకాలమువఱకు మీ రెచటి కేగి యుంటిరి?

మంత్రి—రాజేంద్రా! మహాభీకరం బైనయొకశార్దూలంబును దొడరి పోయినాఁడను గద! అది తనపిక్కబలముకొలఁదిని బరువుపాఱి యొకగుహాంతరమ్మున డాఁగెను. దానిపోబడి తెలిసి వధించి వచ్చుట కింతకాలము పట్టెను.

హరిశ్చంద్రుఁడు—ఓహో! సరి. సంతోషము! చంపితిరిగదా?

మంత్రి—ఔను! మహాప్రభూ! ఔను. నాబారిఁబడిన యాదుష్టసత్త్వమును సమయింపక వదలుదునా? మననర్మసచివుఁడును వచ్చుచున్నాఁడు. వీఁ డెచటి కేగి యుండెను?

హరిశ్చంద్రుఁడు—రానిమ్ము, రానిమ్ము.

(నర్మసఖుఁడు రాజునొద్దకు వచ్చు చున్నాఁడు.)



నర్మసఖుఁడు—రాజా! ఆశ్రితుఁడు నమస్కరించు చున్నాఁడు.

హరిశ్చంద్రుఁడు—ఓహో! నెచ్చెలీ! ఇదివఱ కెట కేగి యుంటివి?

నర్మసఖుఁడు—మహాప్రభూ! తమరు వేఁటలాడఁ దలఁచి ననుఁ బాసి పోయినదిమొదలు నడవియం దంతటను మిమ్ము వెదకి వెదకి తుదకు సొమ్మసిల్లి యొకమహీరుహచ్ఛాయ విశ్రమించితిని. దైవమే మిమ్ము నాప్రదేశంబునకు రప్పించినది.

హరిశ్చంద్రుఁడు—నెయ్యమా! ఏమి వింత? నీవు నాతోడనె యుంటివా? అట్లయినచో నాకన్నులం బడక యెచటఁ బ్రచ్ఛన్నతను జెందితివి?

నర్మసఖుఁడు—ధరణీనాథ! తమదాసుఁడు తమ్ముఁ బాసి తొలఁగినవాఁడే కాఁడు. ఐన నిప్పు డొక్కింత సేపు తమకు నిర్ణయనిరోధం బొనరింపఁ బాలుపడినయాచెడిపెలకు బుద్ధి రాఁ జేయుటకై పోయి యుంటిని.

హరిశ్చంద్రుఁడు—(ఉచ్చపాటుతో) హా! హా! ఏమి చేసితివి? ఆమానినులను నీ వెక్కడఁ జూచితివి? వారి కేయవమతిని ఘటింపఁ జేసితివి?

నర్మసఖుఁడు—రాజేంద్రా! నే నంతయు నెఱుంగుదును. తమ రాధరణీరుహచ్ఛాయ విశ్రమించుటయుఁ దత్క్షణమె యాతలిరుఁబోండ్లు దమ దాపునకు వచ్చి పాటలు పాడుటయును నాకన్నవే.

హరిశ్చంద్రుఁడు—అప్పుడు నీ వెక్కడ నుంటివి?

నర్మసఖుఁడు—అవనీధవా! నే నచ్చటనే యుంటిని.

హరిశ్చంద్రుఁడు—నెయ్యుఁడా! నీవు నాదృష్టిగోచరుండవు కావే? దాఁగి యుంటివా?

నర్మసఖుఁడు—ధరణీశా! నేను దాఁగియున్నవాఁడను గాను. ఆమహీరుహచ్ఛాయ మఱొండువైపునఁ బరుండి నిద్రించు చుంటిని. ఆకాలమునం దెవ్వరో కామినీమణులు కర్ణరసాయనంబుగ గాంధర్వవిద్య వెలయించుటను వింటిని. మేల్కని చూచితిని. ఇరువురు హేలా

వతులు గానరసాధిదేవతలవలెఁ దమప్రమోల నుండి తమసంగీతవిద్యా నైపుణ్యమునకు శారీరధర్మమును సాహిత్యప్రౌఢిమయును దోడుగాఁ బాడుటయును దేవరవారిచిత్త మాహ్లాదాయత్త మగుటయును గాంచితిని.

హరిశ్చంద్రుఁడు—మిత్రుఁడా! వీని నన్నింటిని దెలిసిననీవు నాయొద్దకు రామికిఁ గారణ మేమి? అట్లయినచో నర్మసఖశబ్ద మెట్లు నీయెడ నన్వర్థ మగును?

నర్మసఖుఁడు—సార్వభౌమ! స్వైరవిహారిణు లైనతరుణు లచ్చోట నుండి రనుట యటుండ, ‹‹ఏమివింత యుత్తరోత్తరము జరుగఁ గలదో తెలిసికొందము›› అని తలఁచితిని గాన, నే నట్టిరసభంగమునకుఁ దెగించినవాఁడను గాను. పిమ్మటివి దేవరవారికి విదితమె కాన నేను విస్తరింప వలసినయవసరము లేదు.

హరిశ్చంద్రుఁడు—ఓహో! అది యుండని. ‹‹వారికి బుద్ధి రాఁ జేయుటకై పోయి యుంటి›› నంటివే యది యేమి?

నర్మసఖుఁడు—ఔను. అవనీశా! పూఁబోండ్లయెడ మోహపాశబద్ధుఁడు కాని పురుషోత్తముం డుండుట యరుదు. విద్యావయోరూపవిలాసాతిశయంబుల నెంతయు మించి పలువితంబులవిలాసంబులు నెరపి మరుమ్ముల్లిం బడలుమమ్ముఁ బ్రోవు మని వాఙ్మరందంబుఁ జిల్కువేఁడు జవ్వనులకు లోఁగనిరాజేంద్రుఁ డొరుఁడు గలడా? ఆపొలఁతుకలు వ్రీడా భయ విశ్వాసజుగుప్స లనెడిగుణచతుష్టయమును దొలఁచి వైచి, తమ్ముఁ బ్రార్థించినను నిరాకరించి నిలిచినతమచిత్తస్థైర్యమె స్థైర్యము. ఎన్నోతడవలు దేవరవారు వల దని నొక్కి వక్కాణించినను, ఆ పిశాచులు వదలి చన్నవారు గారు? అప్పుడే నేను వారియాయువుల నీయాయుధమునకు బలి యియ్య వలసి యుండెను. అయ్యో!



నీచత్వము; స్త్రీహత్య వెన్నంటు నని వెనుదీసినాఁడను. అట్లు వారిని వధించి వైచుటయును హత్య కాఁ జాలదు. ఆహా! ఈ దుశ్చరిత లుజ్జీవించియున్నయెడల నెందఱు పురుషులజీవనంబుల కెసరు పెట్టుదురో? అధిపతితోడ సల్లాపములు సలుపుచుండు నావిలాసవతుల నేమియుఁ గైలాటములు గావింప రా దని యుంటిని.

హరిశ్చంద్రుఁడు—అట్లయిన నధిపుని వదలినదే యాపనిని బూర్తి చేయుద మని యుంటివా?

నర్మసఖుఁడు—అద్దిరా! అట్టితలంపు తలఁచినవాఁడనే కాను. తమరు వారికోరికలకు లోపడక యచ్చోటు వదలి పోయినంత నాపడుచులు తమమనోరథంబు సాగి రా నందుల కనేకవిధంబుల సంభాషించుకొను చుండిరి. అంతట వారికి నేను న్యాయమును జెప్పినవాఁడ నైతిని. దానికై వారు నన్ను హీనోక్తుల నధిక్షేపించిరి. ఆకారణమునుబట్టి నాకుఁ జెప్పరానికోప మతిశయించినది. వారిచెంపల మీఁద నొకచఱపే చఱచితిని. అంతట వారు ‹‹గురునాథా! గురునాథా!›› యనికూఁతలు వెట్టుచు పరుగుపాఱిరి. పిమ్మట నేనును మీయడుగులజాడనే మీవచ్చినమార్గముమీఁద నిటకు వచ్చి చేరితిని. ఇంతయే జరిగినది.

హరిశ్చంద్రుఁడు—ఆహా యేమిపని చేసితివి? పడుచులు దమయజ్ఞానము కారణముగా నేవో యసంబద్ధములను బలికినను సుబుద్ధి యగువాఁడు సైరింప వలదా? వా రెట్లుమనగుణం బెఱుఁగుదురు? ఎఱుంగరని వారిని మనము భర్జించి ప్రహరించుటయా? బాగు బాగు. స్త్రీలహృదయంబు లతికోమలంబులు. కొంచెము మేలు లభించినచో మేరు వంతగ భావించి పరమాహ్లాదపరవశ లగుదురు. అట్లే దోసఁగు పొసఁగెనో దుఃఖవారాన్నిధినిమగ్న లై పరిదేవన మొన

ర్తురు. కావున వా రొకచిన్నయపరాధ మొనర్చి రేని, పురుషుఁ డైనవాఁడు వారియెడ నక్కటికమును జూపి, హితబోధచే న్యాయ పద్ధతిని నిరూపింప వలయును. దీని వదలి వారిని గొట్టుటయు నాడుటయు బుద్ధిహీనులచెయ్దములు. బుద్ధిస్థైర్యములేమిచేత వారు 'అబల' లనఁబడుదురు. సఖుఁడా! నీవు మాతోడ సఖ్యముచేసి మాదండ నుండి సదసత్కార్యవివేచనములయం దలవాటుపడియు నిట్టియకార్యంబునకుఁ బాల్పడితివి. ముందు వెనుకలఁ గూర్చి పర్యాలోచింపమి నిట్లు చేసితివి. ఏమి చేయ వచ్చును! దీనివలన నేమి తటస్థింప నున్నదో? (అని దృష్టిని దూరముగా సాగించుటచే దీర్ఘాలోచన నటించు చున్నాఁడు.) మంత్రివర! అదిగోఁ గొంచెము దూరమునం దెవరు వచ్చు చున్నారు? చూడు మతఁ డతి శీఘ్రగామియై సగర్వముగా వచ్చు చున్నట్లు కనఁబడుచున్నది.

మంత్రి—క్ష్మాతలేంద్రా! ఆవచ్చువిగ్రహము జటాజూటుఁడు గను శాటీవసనపరీధానుఁడుగను నుండునట్లు గోచరించెడిని. ఎవరో మునివరులవలె భావింప వలసి యున్నది.

హరిశ్చంద్రుఁడు—ఎవరుగ నుండ వచ్చును? మన మున్నదిశనుగూర్చియే కద వచ్చు చున్నారు.

నర్మసఖుఁడు—ఔ నౌను. ఈప్రక్కకె వచ్చు చున్నారు. సగర్వులుగా నున్నవిశ్వామిత్రమునివరులుగానె యుండ వలయును. గర్వపర్వతాధిరూఢు లనుప్రఖ్యాతి వారిసొమ్మే కద? దీని కేమి సందియము? వా రే! ఇఁక నితరమునులుగా నున్న నమరిక యుండును గదా!

హరిశ్చంద్రుఁడు—మిత్రుఁడా! ఏమి నీ వెప్పుడును వికటములనే పల్కువాఁడవు. అట్లు పలుకుట యుచితము గాదు. వారు వచ్చినప్పుడణఁగి యుండుము.



నర్మసఖుఁడు—(చేతితో నోరు మూసికొని) ఆహా! అధిప! ఆలాగే.

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! ఔ నౌను, మనమునివరులే! విశ్వామిత్రకులపతులే! ఏమి యిట్టియుద్రేకముతో వచ్చు చున్నారు?

నర్మసఖుఁడు—మునివరులుగారా! ఉద్రేకము సహజమే! దీని కేల సందేహము?

హరిశ్చంద్రుఁడు—ఊరక నోరికొలఁదులు మాట లాడకు. అణఁగి యుండుము.

(విశ్వామిత్రుఁడు సమీపించు చున్నాఁడు. అతనికోప చిహ్నమును జూచి భయపడినవానివలె నర్మసఖుఁడు మఱుఁగున నిలుచు చున్నాఁడు.)

(అవనతవదనముతో నంజలిబద్ధుఁ డై) మౌనివర్యా! విధేయుఁడు నమస్కరించు చున్నాఁడు.

మంత్రి—స్వామీ! దాసుఁడను నమస్కరించు చున్నాను.

విశ్వామిత్రుఁడు—హా! హా! హరిశ్చంద్ర! మేలు, మేలు.

గీ. భూరిఫాలాక్షివహ్నుల - భువనములను
భస్మపటలంబు గావించు-భర్గుపాద
పల్లవంబులఁ గొనియాడు-వాఁడు వసుధ
ధనమదాంధతఁ గైకొని - తనరువాఁడె?

అపరాధంబును ద్రోచి వైవ నుంకించితివా? సమయోచితప్రతిభావిశేషంబున "నందిన జుట్టు నంద కున్నఁ బాదారవిందంబు" లను ప్రానుడి తెలుంగుం బట్టఁ బ్రయత్నించితో! బాగు, బాగు; హరిశ్చంద్ర! రాజమాత్రుండ వైన నేమి? దండించువారలు లే రని తప్పఁ జరించినాఁడవు. నీయట్టిఖలుని దండింప దైవంబు సమయంబు చూచు చున్న దని భావింపవు కాఁబోలు. ప్రజలకన్నులం బొదలు బాష్పబిందుసందోహంబులు ప్రళయాగ్నికణోపమానంబు లై ప్రభువంశవనదాహం బొనర్పఁ గా దే! తదీయ ఘోరతరదీర్ఘనిశ్వాసంబులు

నిశాతాసిధారాభంబులై బోరున భూపతి సకుటుంబునిగఁ జెండి వైచు. విజ్ఞానసంపద నీ తెలియనిది గానగు. హా! కష్టము, కష్టము. హరిశ్చంద్ర! ఈ దోసఁగు దెలిసి సమాచరించితో? తెలియక చేసితో? ఇట్టియపచారాచరణంబులచే సకలవైభవాస్పదం బగు రాజ్యలక్ష్మి యెంతకాలంబు నిన్నొడఁగూడి నిలుచును? నశ్వరంబైన ద్రవ్యంబునెడల శాశ్వతబుద్ధి నిలిపి నశింపకుము.

తే. వెలుఁగు పైరును మేసిన-విధము గాఁగ
నాశ్రమంబుల రక్షించు-నవనిధవుఁడె
యిట్లు కొఱగామి యొనరింప - నెన్ను టరయ
ధనమదాంధతఁ గాద యో-ధారుణీశ?

ఔను? హరిశ్చంద్ర? నీ కైలాటపుటొడ్డోలగంబులం జూతము, చూతము.

హరిశ్చంద్రుఁడు—(మిగుల భీతివలనికంపముతో వినయావనతుఁ డయి యంజలి గూర్చి) ఓతపోనిధీ! దేవరవారిచిత్తము నిట్లు పరితపింపఁ జేయుకోపదవానలంబున కాస్పదం బయినయనుచితకార్య మొక్కించుకేనియుఁ జేసిన వాఁడను గాను. అట్టిదుష్కృత మిట్టిదనియుఁ దెలియదు. స్వామీ! భయపరితప్తునిఁ గరుణారసవీచికలచేఁ గాపాడుదురు గాక.

(మంత్రి భయభ్రాంతవినయనమ్రుఁడై నిలుచుచున్నాఁడు.)

విశ్వామిత్రుఁడు—ఓహో! బాగు, బాగు, నీ కేమియుఁ దెలియదా! మాయోపాయాచరణచణుండవై మమ్మేఁచఁ జూచెదో! ఇట్టిచెయ్దములందు నీకు నీవె తుల్యుఁడవు. సరి! నీసమాచరితదుశ్చరిత మిట్టిదని యింకను నీకుఁ దోఁచినది గాదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుని కేమియుఁ దోఁప లేదు.



విశ్వామిత్రుఁడు—తోఁపదు. తోఁపదు. ఆత్మీయదుశ్చరిత మెవ్వాని జ్ఞాననేత్రములకు గోచరించును?

శా. "ఓరీ రాజకులాధమా! నృపులు లే-రో, వేఁట రారో, మద
క్రూరాఖిలమృగావళిం దునుమరో, - ఘోరాటవుల్లేవో, మా
యారామంబుఁ గలంచి జంతుతతి మా-యం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వా-రి న్నోఁదినా వేమిరా?"

ఇప్పుడైన నేర్పడుచున్నదా నీచేసినదౌష్ట్యము?

హరిశ్చంద్రుఁడు—విధేయుని కేమియు నేర్పడినది గాదు! ఆఖేటంబునఁ గ్రూరమృగంబుల మట్టుపెట్టించి తాపసులకు మేలు చేసితి. దాసుఁ డొకప్పుడును దన్వంగుల దండనీతిపాల్చేసినవాఁడు కాఁడు.

విశ్వామిత్రుఁడు—నీవు దండించినవాఁడవు గావా? నీయొద్దకు వచ్చిన మునికన్యలను మన్నించి పంచితివా? నీ వొనర్చినకొఱగామి నే నెఱుంగ ననుకొంటివా? అన్యాయంబున కసత్యంబును గూడ జత పఱిచెదవు కాఁబోలు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయునివిన్నపమును గొంచెము వినఁ గోరెదను. నే నామునికన్యకలయెడఁ గఠినోక్తుల నైన నాడినవాఁడను గాను. ఎట్లు వారిని దండనీతికి లోఁబఱిచి యుందును?

విశ్వామిత్రుఁడు—

ఆ. "అసిమిలోని దొకటి - యమ్మెడి దొక్కటి!
నీచరిత్ర మెల్ల - నేఁడు తెలియ
వచ్చె మాకుఁ; గపట-వర్తనుఁడవు నీవు!
చేరి నిన్ను విశ్వ-సింపఁ జనునె?"

కొట్టినవాఁడవుగావా? నీవాకార్య మొనర్చుట తగదని యొరులచేఁ జేయించితివో? అందుచే నపరాధిని గానని సాధించెదవు. సరి. సరి.

నీ వెట్టపరాధివి గాక తప్పించుకొనఁ గలవు. "బాణ మేసినవాని వదలి బాణమును దూషించె" ననునానుడి నీవిన్నది గాదా?

హరిశ్చంద్రుఁడు—విధేయుఁ డెట్టి పాపము నొడిఁగినట్టివాఁడు గాఁడు. దాసుఁడు నిరపరాధిగ నుండఁ బూజ్యు లిట్లాగ్రహపరవశు లైనచో నాకుఁ జేయున దేది గలదు?

విశ్వామిత్రుఁడు—ఏమి చేయుదు ననియా చెప్పెదవు? పరిజనులవలని దుష్కార్యములు పార్థివుని గాక మఱెవ్వని నాశ్రయించును? రాష్ట్రపాపంబు నృపునిదే. ఇవన్నియు నీధనమదాంధతవలన జన్యములు గావా! 'సంపద' యనుపదంబునకుఁ గలయవయవార్థమును విమర్శించి చూడుము తెలియును. అట్టిదాని మముబోటి మహర్షులు తుచ్ఛంబుగా నెంచి పరిత్యజించి యుందువారు. అద్దానియం దభిమాన ముంచి కదా నీ విట్లు త్రుళ్ళి పడువాఁడవు. నినుఁ బోలు లఘుబుద్ధు లాధనము నొకవస్తువుగఁ బరిగణింతురు. ఆహా! అది కదా నిన్నంతటిగర్వపర్వతాధిరూఢునిఁ గావించినది!

చ. "ఇలఁ గలరాజు లెల్ల భజియింప మహోన్నతిఁ జక్రవర్తి వై
యలరుట యెల్లఁ దాపసజనాశ్రమభూముల కెగ్గు సేఁతకే?
తులువ! భవద్వివేకమతి దుర్ణయ మారయ నివ్విధంబునన్
మెలఁగఁగ నీకు నెవ్వఁడు సమిద్ధమతిన్ సెల విచ్చెఁ జెప్పుమా.

హరిశ్చంద్రుఁడు—మునిలోకాగ్రగణ్యా! ఈరాజ్యపదవి నొక్కస్థిరపదార్థంబుగ భావించినవాఁడను గాను తమ్ముం బోలుతపోధనులదయావిశేషంబువలన నైశ్వర్యంబులు మృగతృష్ణికలం బోని వని చక్కఁగ నెఱుంగుదు. కావున విధేయుఁ డేదౌష్ట్యంబును సంకల్పించినవాఁడు గాఁడు. ఏదానికిఁ దగులనినాపై దేవరవా రాగ్రహగ్రస్తు లగుటకుఁ గారణం బెఱుఁగ లేకున్నాఁడను?



విశ్వామిత్రుఁడు—(కోపజనితం బగుహాసంబుతో) బాగు. బాగు. నీ సిద్ధాంతమును నీశీలంబును మిక్కిలి ప్రశస్తంబులు! అసత్యంబులైన నందఱు విశ్వసించున ట్లాడవలెను. సకలసంపదలును మృగతృష్ణికఁ బోలు నంటివి. అది నిజమె. మృగతృష్ణిక యని యెఱిఁగియు వాని యెడల నౌదాసీన్యముఁ జూపకున్నా వేల? వీక్షించితే మాయావిధంబు? లోకం బనిత్యం బని గ్రహించితిమి. ఆమణిమయమకుటంబుకంటె నీజటాజూటంబె యుత్తమం బని యవధరించితిమి. అరాతివీరనికరకంఠనికృంతనచణంబు లైనధనుర్బాణంబులకంటె నీదర్భలె పరమోపకారు లని తలపోసి తద్దయు నంగీకరించితిమి. అసత్తని తెలిసినంతనే యద్దాని దూరీకరింప వలయుఁ గాదె. రక్తమాంసాదివస్తువిహీనం బైనశల్యంబును శ్వానంబు కఱచి కఱచి తనివి చెందు భంగిఁ బ్రయోజన రహితం బైనప్రపంచంబునకు వశుండ వై యుంద చిత్తం బనన్యాయత్తంబుగఁ బ్రయుక్తపఱుచుట యజ్ఞానము? కాదు. కాదు. వాచాద్వైతవాదు లీలోకంబునఁ బెక్కుఱు. వారిలో నీ వొక్కరుండ వని తోఁచెడి.

హరిశ్చంద్రుఁడు—ఓతపోనిధీ! దాసునకుఁ దత్త్వబోధఁ గూర్చి వక్కాణింపఁ జాలుచాకచక్య మొక్కించుక యైనను లేదు గాని, మిముఁ బోలుజ్ఞానసంపన్నుల యనుగ్రహవిశేషంబుచేత వివేకంబు గలదు. ఆహేతువునుబట్టి ప్రాపంచిక సౌఖ్యంబులు స్వప్నగతసామ్రాజ్యపదవినిఁ బోలినవని చక్కఁగఁ దెలిసికొని యున్నాఁడను గాన సరోజపత్రగత జలకణంబుకైవడి నాధారాధేయసంబంధమును వహించి యీరాజ్యభారంబును దాల్చి యున్నాఁడను.

ద్విపద—"మణిమయం బై మించు-మకుటంబునందు.
ఘనతరారిష్టముల్ - గాఁపురం బుండు."

అని పెద్ద లుద్ఘోషించునట్లు రాజమాత్రునిభోగవైభవంబులయందుఁ గష్టపరంపరలే శేషించిన వగును. కావున "రాజ" శబ్దవాచ్యుండు ప్రపంచ సుఖోదయంబులకే రాజ్యభారంబు వహించుచున్నాఁడు. మఱియుఁ బ్రజలసుఖదుఃఖంబులు దనవిగా భావించి తత్తదుచితమార్గంబులఁ బ్రవర్తించువాఁడే రాజదండంబు ధరింప నర్హుం డగు. యుక్తాయుక్త వివేచనంబున మిముఁ బోలినవసిష్ఠులచే నిట్టి ధర్మతత్త్వం బెఱింగినవాఁడను. ఇట్టినీతి దేవరవారెఱుంగనిది గాదు. ఏవాఁడు గాని యిట్టికష్టభూయిష్ఠం బయిన రాజ్యతంత్రంబును నెఱి దప్పక నెఱపఁ జాలు నేర్పరి లభించిన నిప్పుడె వసుంధరాభారంబు వానిపై డించి వానప్రస్థాశ్రమ మంగీకరించుటకు సిద్ధ మై యున్నవాఁడను. కావున విధేయున కీరాజ్యభోగంబులయం దించుక యైనను జిత్తము లయించినది కాదు. మునిగణాగ్రగణ్యా! ఇట్టి యుద్దేశవశంబుననే తమదాసుఁడు సత్యసౌశీల్యాద్యుత్తమగుణంబులఁ గైకొని చరించువాఁడు. ఎట్లున్నను దేవరవారీదాసునియెడల ననుకంపఁ బ్రకాశింపఁ జేసి పాలింపవలె నని ప్రార్థించెదను.

విశ్వామిత్రుఁడు—అవన్నియు నుండ నిమ్ము. ఈ రాజ్యము పెద్దభారమని యన్నావు గద? దీనిని భరింపఁ జాలిన సామర్థ్యశాలురు నీకెవ్వరును లభించినవారు గారా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఎవ్వఁడును లభించినవాఁడు గాఁడు.

విశ్వామిత్రుఁడు—ఇది సత్యమైనసంకల్పంబె యైనచో లభించువారలు లక్షోపలక్షలు. బూటకపుమాటలు గాన నెవ్వరును దొరక రైరి.

హరిశ్చంద్రుఁడు—మునివర! విధేయుఁ డెన్నండు బూటకపుమాటలకుఁ జోటిచ్చువాఁడు గాఁడు. సంకల్పించునదియే సంభాషించునట్టిది. సంభాషించునదియె మఱి సమాచరింపఁబడునది. వంచనతోడి స్వాంతము దాసునకు లేదని దేవరవారు గ్రహింతురు గాక.



విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! మే మొకయంశంబును నీకుఁ జెప్పెదము వినుము. మేమో పరమతపోధనులము. మాపూర్వాశ్రమం బిట్టిదని నీకు బాగుగఁ దెలిసి యుండ నోపును. మే మిప్పుడు పంచేంద్రియోన్మాదంబులం బరిమార్చి ప్రాణాయామాద్యష్టాంగయోగవైఖరుల నవలీల సాధించి యనేకయుగంబులనైన నితరులచే సాధ్యంబు గాని ఘోరతరతపశ్చర్య నత్యల్పకాలంబునవ సంతరించుకొని కృతకృత్యుల మైతిమి. మమ్మును మాతపఃప్రాబల్యంబును దెలియని ప్రాణియొక్కండైన నీ ప్రపంచమునఁ గానరాఁడు; ఇయ్యది నీ వెఱింగినయంశమే కద! ఇప్పుడు మాకు రాష్ట్రీయప్రజలపై నెడవిడనికూర్మి గలదని నీవు భావింతువో భావింపవో?

హరిశ్చంద్రుఁడు—ఋషివరా! దేవరవారి కిట్టియక్కటిక ముండ దని చెప్పుట కెవఁడు సాహసించును? దేవరవారీభారమును వహింప నిచ్చగొందు రేని యిప్పుడె పుడమిని దత్తము చేయుటకు సిద్ధుఁడనై యున్నాఁడను. పూజ్యులీభావము సేవకునికి సూచించి యున్నచో నీకార్యము నింతకు మున్నెప్పుడో చేసి కృతార్థుండనైయుందును. దేవరవారీరాజ్యము నంగీకరించుట ప్రజలపూర్వసంచితపుణ్యపరిపాకంబ యనుట య టుండ, విధేయునిపూజాఫల మత్యంత శ్లాఘాపాత్ర మనియు, భావించెదను. మునినాథా! నాయం దనుగ్రహించి రాజ్యభారంబునుండి నన్ను విముక్తుం జేయఁ బ్రార్థించెద. చిత్తగింప వలయును.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! అట్లంగీకరించుట కాటంక మేదియు లేదు. విశ్వమునందు వైరాగ్యంబులు మూఁడు. అవి:—పురాణవైరాగ్యము, శ్మశానవైరాగ్యము, ప్రతిసూతివైరాగ్యము. ఇవి క్వాచిత్కములుగఁ దోఁచుచు నప్పు డప్పుడే నశించుచుండుటయే

వాని స్వభావంబులు. కాఁబట్టి మాతోడ జ్ఞానసంబంధము లయిన సంభాషణములు చేయుటచేఁ గలిగిన వైరాగ్యము కారణంబుగాఁ బ్రాభవంబును మాకు దత్తము చేసి పిమ్మటఁ బరితపింపఁ గలవు. కావున బాగుగాఁ బర్యాలోచించి పలుకుము.

హరిశ్చంద్రుఁడు—మునీంద్రా! అట్లెన్నఁడును గలుగదు. అనృతాలాపముల జిహ్వాగ్రమునకు రానీను. ఇఁక నారాజ్యము దత్తము సేయుటకుఁ ద్రికరణశుద్ధిగా సిద్ధముగా నున్నాఁడను. గురునాథా! నాయెడ నెంతయు ననుగ్రహించి యీవసుంధరాభార మంగీకరింప నుత్సహింప వలయును.

చ. సిరులు సతంబులే? ప్రభుత - చేడ్పడదే? యిహసౌఖ్యవారముల్
తిరములె? యంచు నే నెఱిఁగి-తి; మ్మునినాయక! సత్యము స్సదా
చరణము సాధుపూజనము - శాశ్వతసత్పదదాయు లంచు హృ
త్సరసిజమందు నమ్మితి; నొ-సంగెద రాజ్య మనుగ్రహింపరే.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! నీ వింత స్థైర్య మూని విన్నవించుటం జేసి యాధురంబు ధరింప మే మొడఁబడు చున్నారము. ఈ కష్టముల నుండి నిన్ను రక్షింప వలయు ననునవ్యాజకరుణావిశేషంబే దీనికిం గారణంబుగాని వేఱొండు గాదు. రాజ్యలోభముచేత మే మీరీతి నీ ప్రభుత నాశించితి మని యెన్నకుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! దానున కట్టితలంపుకూడఁ గలుగునా? ఈదృశధరాపరిపాలనంబు రోఁతగా వగచి పరిత్యజించి మించిన దేవర వారు మరల నద్దాని వహింప నంగీకరించుట పర్యాలోచింపఁగాఁ బ్రజలపైఁ గలకూర్మి పెంపె కారణంబుకాని వే ఱెద్ది యగును?

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! దానం బెట్టియ్యెడం జేయం దలంచి యున్నాఁడవు?



హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇచ్చటనే చేసెదను.

విశ్వామిత్రుఁడు—ఆహా! ఈయొకయంశమునం దే నీదైన యుద్దేశము చక్కఁగా వెల్లడి యైనది. దత్తము చేయుటకు నీకు నిజ మైనతలంపు గలదేని, దానికి వలయువిధానంబులతో సాంగోపాంగముగాఁ గఁ జేయఁ జూడవా? జనశూన్య మయినయిమ్మహారణ్యగర్భంబున దత్తము చేసి, పిమ్మట నెవరు చేసి రెవరు చూచి రనుటకా? బాగు. బాగు. నా కక్కఱ లేదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! దానుని వ్యర్థముగా నపఖ్యాతికిఁ బాత్రునిఁ జేయ రాదు. ఇచ్చట నుద్దేశించి చెప్పినదాని లే దని చెప్పుట నాసంకల్పంబు గాదు. ఎవ రున్న నేమి? లే కున్న నేమి? ఎవరు దెలిసిన నేమి? అంతఃకరణమునకుఁ దెలిసి యుండినఁ జాలదా? మునినాథా! దత్తవిధానంబుం గూర్చి తమ కిష్ట మగున ట్లేయాటంకమును లేక చేయుటకు బద్ధుఁడను.

విశ్వామిత్రుఁడు—అదియే ప్రశస్తము. నీవు దత్తము సేయుట నిజ మైనచో.........

హరిశ్చంద్రుఁడు—మఱియు న ట్లేల సెల విచ్చెదరు? స్వామీ! దానుని యెడల నింక నట్టి న్యూనభావమును వదలుదు రని ప్రార్థించెద.

విశ్వామిత్రుఁడు—మంచిది. హరిశ్చంద్ర! నీవు రాజధానికి వచ్చి పౌరు లరయునట్లు దత్తము చేసి, సమీపమునం దుండి మమ్ము సింహాసనాసీనులఁ జేసి, కిరీటాధిపత్య మొసంగినచో, మే మంగీకరింతుము. అట్లొనర్పవేని నీత్రోవ నీ వేగం దగు.

హరిశ్చంద్రుఁడు—అట్లే సమాచరించెదను. గురునాథా! ఇప్పుడే విచ్చేయుదురు గాక.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! సంతోషము. మీరలు నగరమునకుఁ బొండు. మేము పర్ణశాలకుఁబోయి యచ్చోఁ గొంత యోగనిష్ఠ నుండి వచ్చెదము. సర్వము సిద్ధముగ నం దుండ నిమ్ము.

(విశ్వామిత్రుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

మంత్రి—రాజేంద్రా! ఎంతమాత్రము నాలోచింపక యిట్లు సమాచరించితిరె! ఇ దేమి?

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! మే మేమి చేసినారము! లోక మనిత్యము. సంపదలు ఝరీవేగతుల్యములు. జీవితము బుద్బుదప్రాయము. ఈశరీరము దగినస్థితియం దుండునపుడే తపస్సున కేగ వలయును. ఇది యిట్లుండ మేము మాప్రజలకు మేలొనగూడు నుపాయమునే చేసినారము. మహాతపస్సిద్ధు లయిన యమ్మునివరు లణుమాత్రం బేనియు నీతిపథంబు దొలఁగక వసుంధరాపాలనము చేయువారు. పౌరులసుఖసమృద్ధిని గూర్చి పాటుపడుటయే పార్థివునిపరమార్థంబు కాఁబట్టి మేము యుక్తకార్యమునే చేసినారము. చింతింపకుము.

మంత్రి—ఇది నీతి గాదు. ఇమ్మునిపుంగవులో ముందు రాజుగ నుండినవారు. రాజభోగంబుల సమగ్రంబులుగ ననుభవించి తపోమార్గమునం దనురక్తిని బొందఁ గోరి సర్వసౌఖ్యమ్ములకును విరక్తు లైరి. తపస్సునందును సామాన్యులు గారు. అద్వితీయులు. అనుపమానమహిమాభినందితులు. అంతటిమహాతపస్వి తొల్లిఁ దాను వదలిపెట్టినభూపరిపాలనము మరలఁ బొందఁ గోరుటయం దేదో లోఁగిటు కుండి తీఱ వలయును. నాతలఁచినట్లు యయినయెడ దేవరవారి యిచ్చచొప్పునఁ బ్రజల కెట్లు సుఖసమృద్ధి సమకూడునో యంచు సందేహించెదను. మఱియును మీ కిప్పుడు వానప్రస్థాశ్రమ మనుసరించుటకుఁ దగినకాలము తఱిసినది గాదు. ఏలయన దేవర



వారి పుత్త్రరత్నము యుక్తవయస్కుఁ డైన తోడనే తమరాజ్యభారము నతనిభుజాగ్రసీమ డించి, వానప్రస్థవిధి నవధరించునదియే యుక్త మౌను. ఇదియె వంశపరంపరాగతం బగున్యాయము.

నర్మసఖుఁడు—ఔ నౌను. అదియే వాడుక. మహారాజులవారి కేమో చిత్తమునకు భ్రమ దట్టినది. మన మేమి చేయ వచ్చును.

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! మనకుఁ బరలోకము లే కున్నను దాన మిచ్చుటయే మంచిది.

శా. కారే రాజులు రాజ్యము ల్గలుగవే - గర్వోన్నతిం బొందరే?
వా రేరీ సిరి మూటఁ గట్టికొని పో-వం జాలిరే? భూమిపైఁ
బే రైనం గలదే? శిబిప్రముఖులుం - బ్రీతిన్ యశఃకాము లై
యీరే కోర్కులు? వారల న్మఱచిరే - యిక్కాలమున్ ధీవరా!

మనము వ్యర్థముగాఁ బలుపలు వితర్కములుగఁ బర్యాలోచించుటవలనఁ బ్రయోజన మేమియు లేదు. నిర్ణయించి నట్లే నెరవుదును. పాత్ర మెఱింగి చేయు దానంబువలన మేలు చేకుఱు. ఎన్నఁడు దీనం గీడు పాటిల్లదు.

క. ధాత్రిని హలికునకు ను
త్క్షేత్రము బీజములు నొకటఁ - జేకుఱుభంగిన్
జిత్రంబుగ దానమునకుఁ
బాత్రము సమకూరునట్టి - భాగ్యము గలదే?

పుడమి యనియు సిరి యనియుఁ బుత్త్రిం డనియు నాశాపాశంబునకుఁ గట్టువడి తమజీవితంబులు వృథ లొనర్చి పరంబునకుం దూరు లైనరాజన్యులం జూడమే? వారిం గని యైన వివేకంబు దాల్చుట పోలదే?

శా. ఆశాపాశము దాఁ గడు న్నిడుపు; లే - దంతంబు నీతిజ్ఞ! వా
రాశిప్రావృతమేదినీవలయసా-మ్రాజ్యంబు చేకూడియున్
గాసిం బొందిరి గాక [illegible]గయభూ-కాంతాదులు న్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే మును నిజా-శాంతంబులం జూచిరే?

మంత్రి—రాజేంద్రా! సచ్ఛీలంబునే హేతువుగఁ జేసి మన మేకార్యము చేసిన నయ్యది లోకజ్ఞత్వంబునకు ననురూపంబుగనే పరిణమించు ననుట కవకాశ ముండదు. అయినను దేవరవారిసంకల్ప మట్లున్న దాసుఁ డేమి చెప్పఁ గలఁడు?

[హరిశ్చంద్రుఁడు, మంత్రి, నర్మసఖుఁడు నిష్క్రమింతురు.]

(పర్ణశాలకుం బోవుమార్గము. విశ్వామిత్రుఁడు ప్రవేశించును.)

విశ్వామిత్రుఁడు—

అక్కటా! వ్యర్థముగా మేము చింతాపరంపరలను దెచ్చుకొంటిమి. హరిశ్చంద్రుని నిర్ణయంబులందు మొదటిది యగునేకపత్నీవ్రతంబుఁ బరీక్షింప మునికన్యకల నంపినవాఁడను. దాన నాయత్నంబు భగ్నం బయ్యెను. ఇఁక రెండవది యౌదార్యము. దానిఁ బరీక్షింపఁ బ్రయత్నించితిమి. అతఁడో మాసంకల్పమును దెలిసికొన్నాఁడు. తత్క్షణమె తనయుదారస్వభావము తేఁటపడునట్లు దన రాజ్యము నంతయు నాకొసంగినాఁడు. మఱియును మే మెంతగ దూషించితిమి! అట్టిపరుసంబులేని వానిమనంబు గలఁపఁ గలిగెనా? ఆహా! వానిసౌజన్యము. అద్దిరా! వానివాఙ్మంజిమము. సర్వసంగపరిత్యాగము సేసినమునివరులయెడల నేనియు నింతటి సర్వోత్కృష్టమైన శమంబు గాన్పించదే! ఏమి చేయుదము. ఇప్పుడు మే మచ్చోటికిఁ బోయినంతన రాజ్యసంపద మా కర్పించువాఁడు. పిమ్మట వాని నెట్లు భ్రంశునిఁ జేయుట. ఆహా! యేమిచిక్కు. ఏమి చేయుదును? వసిష్ఠుఁడు వీనింగూర్చి శ్లాఘించినకాలంబున నితరులవలె నూఱక నోరు మూసికొని యూర కుంటినేని నిట్టిచిక్కు లేవియుఁ దటస్థించి యుండవుగా! ఇంకఁ బరిత్యజింపఁబడినప్రజాపరిపాలనంబును గట్టికొని బాధ లొందు వాఁ డెవఁడు?



తే. భారములలోన నెక్కుడు-భార మరయ
రాజ్యభారంబ; యది యసు-రక్తిఁ గోరు
వాఁడు మూఢతఁ గష్టముల్ - వాంఛ చేసి
పొలియువానికిఁ దుల్యుండు - భూతలమున.

సామాన్యమానవసంసారభారమే సాగరోపమితంబు గాఁగ నిప్పుడీ వసుంధరాభారము దేని కుపమింప నగు? ఏమి చేయుదును?

కం. ధరణీపాలన మన నతి
భర మగు నని మున్న వదలి - వనిఁ జేరియు నేఁ
డరయమి నాభారంబున
కర మారఁగఁ బాల్పడితిఁ గ-దా మూర్ఖమతిన్!

(ఊర్ధ్వముఖుఁడై చింతించును.) ఊ—చూచెదము! ఇయ్యల్పముల కంతయు వెనుదీసిన నెట్లు! నిర్ణయించినకార్యంబు నెఱవేఱకే వదల నగు. మేము పోయి రాజ్యంబును గైకొన్న వెనుక వాఁ డొకకొన్ని దినంబు లందుండి తుదకుఁ గాటికిఁ బోవ నుంకించు. అప్పు డుపాయంబుమై వాని యొద్దను, వానియిల్లాలి యొద్దను, తనయునియొద్దను గలుగుసొమ్ము నాకర్షించికొనియెద. సకలమునుండి తొలఁగిన తుదిని, మున్ను మేము వానియొద్దన యుంచిపోయినట్టి ధనమును గూర్చి యడుగుటకు మొదలుపెట్ట వలయును. వాఁ డిచ్చుటకు లేమిచే లే దనియే చెప్పును. దారిద్ర్యము సకలసద్గుణంబులకుఁ బ్రతిస్పర్థి. సమస్త నిర్ణయంబులకును వేఱువిత్తు. పేదఱికము సర్వాకార్యములకును జన్మభూమి. లేమి నిఖిలదుర్గుణగణంబులకుఁ బట్టుఁగొమ్మ. దారిద్ర్యవంతుం డెట్టి యపచారంబుల కొడిగట్టఁడు? అట్టి సర్వోత్కృష్టదారిద్ర్యసమాశ్రయంబునం జేసి హరిశ్చంద్రుం బొల్లువానిగఁ గావింప నోపుదు. ఆహా! ఇదియె యుత్తమకార్యసూత్రము. ఇట్టి యనన్యసామాన్య ప్రతిభా విశేషానుసంధానంబున హరిశ్చంద్రుని “సత్యవాది” యను బిరుదంబునకు మొదట నకారమును జేర్పఁ

జాలనా? ఇక్కార్యకలాపంబుల కన్నిఁటికిని మాప్రథమశిష్యుని సాహాయ్య మత్యంతావశ్యకము. హరిశ్చంద్రునిచే మాదాఁచియుంచినధనమును బుచ్చుకొనుటకు వానినే నియమింప వలయును. వాఁ డించుకేనియు దయాదాక్షిణ్యములు లేక యేయేవిధంబుల మా మనోరథసిద్ధిఁ బరిసమాప్తి నొందింపవలయునో యయ్యైవిధంబులఁ దనప్రయత్నంబుల హరిశ్చంద్రునెడలఁ బ్రయుక్త పఱిచి కార్యము గొనసాగించువాఁడు. సరి. సరి. కార్యము విలక్షణంబుగ ముగించినది. ఆహా! జయము నొందినారము. ఇఁక వసిష్ఠుని మ్రోల వీరపతాక మెత్తుటయె సరి. ఔరా! వసిష్ఠ! నీ వేల యంత వేగిరపడి సురేంద్రునిసభం బ్రల్లదంబులాడితివి? నీ వొకమొనగాఁడ వని తలంచి మమ్మెల్లఁ దిరస్కరించితివి కాదే!

సీ. ఎవ్వాఁడు వింధ్యాచ-లేంద్రంబుగర్వంబు సర్వంబు నడఁచె ని-ర్జరులు మెచ్చ
నెవ్వాఁడు సక్రోధ-హేతువీక్షణ నింద్రునొడ లెల్లఁ గన్ను లై-యుండఁ జేసె
నెవ్వాఁడు వేదంబు-లేర్పాటు గావించి యన్నియుఁ గ్రమ మొప్ప-నచ్చు కట్టె
నెవ్వాఁడు హైమవ-తీశుతో నెదిరించి గర్వించి యఱకాలఁ-గన్నుఁ జూపె
నట్టికుంభజగౌతమ-వ్యాసభృగువు
లుండ బ్రహ్మీభవించి య-ఖండగరిమఁ
దనరునే నుండ నెవ్వరిం-గొనక నోటి
కొలఁది నీ వేల యాడితి-కుమతి వగుచు!

తత్ఫలం బనుభవించెదవు గాక! అసమానతపోబలుం డగుకౌశికుండా నిను విడుచువాఁడు! ఒరులు బలిమిలేమి నూరకున్న నుందురు కాక!

(పర్ణశాలకుఁ బోవుచున్నాఁడు.)

నక్షత్రేశుఁడు—స్వామీ! నమస్కారము.

విశ్వామిత్రుఁడు—ఓయంతేవాసీ! మే మాహరిశ్చంద్రునొద్దకుం బోయి యొకమాటమాత్రంబుననే వాఁడు తనరాజ్యమును దానే మా కర్పించునట్లు చేసినారము. ఆరాజ్యమును బొందుటకై యిదే పోవుచున్నాము.



నక్షత్రేశుఁడు—భూపరిపాలంబున విరక్తిఁ జెందినమీమనం బేల నేఁ డం దనురక్తిఁ గాంచినది?

విశ్వామిత్రుఁడు—వత్సా! అనురక్తి గాదు. ముదుసలి యైనట్టి వసిష్ఠుని జయించుట కీయుపాయ సూత్రమును బన్నినారము. దీని కేమి? మే మేది యైనను జేయ వచ్చును గద. సత్యస్థితిని దెలిసిన జీవన్ముక్తు లన్ని పదవులకును దగినవారు గారె!

గీ. దేశములవెంటఁ ద్రిమ్మఱి-తిరిపె మెత్తు
వర్తకంబులచేత లా-భంబు లొంద
వసుమతీ పాలనాతిధూ-ర్వహతఁ గ్రాలఁ
దగినవారె ముముక్షు లై-తనరువారు.

ఘటప్రారబ్ధాతిశయం బిట్టులె తొలఁచ వలయు. అది యట్లుండ నిమ్ము. మే మొకకార్యమును బట్టి యంగీకరించితిమి. అందువలన లోప మేమియు లేదు. శిష్యా! మేము రాజ్యమును వహించినంత ననేకరాజకార్యంబులయందు మాయవధానము వినియోగపఱుప వలసి యుండును. కనుక నీవును మమ్ము వెంబడించి రా వలయు. మే మిప్పుడు హరిశ్చంద్రునొద్దకుఁ బోవుచున్నాము. వానియొద్దనుండి రాజ్యమును బొందినంతన, వానివద్ద ముం దుంచి వచ్చినధనము నడిగెదము. దానికయి వాఁడు ఋణస్థుఁ డగుచున్నాఁడు. ఆధనమును దెచ్చుటకై నిన్నె వానితోడఁ బంపుదుము. నీవు వానితోడఁ బోయి పలువితంబులుగ వాని నిర్బంధించి యే దైన నొక యనృతమును బలుకునట్లు చేయవలయును. తక్కినశిష్యులను సైతము తత్తత్కాలోచితముగఁ దత్తత్ప్రదేశంబుల కంపుచుందుము. వారువారు చేయఁ గలవి చిన్నచిన్న కార్యంబు లగును. నీవుమాత్ర మాహరిశ్చంద్రుని వెన్నంటి పోయి రేయింబవళ్ళు వానియొద్దనె యుండి యేవిధంబుచేత నైన నొకయసత్యవాక్యంబును వానిజిహ్వాగ్రమునుండి రప్పింప వలయును. ఇట్టి దుష్కరకార్యఘటనంబునకు

నిన్ను మీఱినవా రెందు నెవ్వరును లేరు. మఱియును నీకు మే మధికముగాఁ జెప్ప వలసినయవసరమును లేదు. సమయోచితంబు లయిన కార్యసూత్రంబుల నెన్ని కార్యసిద్ధి సమకూర్ప వలయును. ఆయా యెడల నిన్ను సంధించుశిష్యులమూలమున మనకుఁ జేకుఱఁ బోవుకార్యానుకూల్యంబునకు వలయు విధానంబులం జెప్పి పంపు చుండ వలెను. నీప్రయత్నంబువలనన నాకు జయము సంఘటిల్ల వలయును. ఇందుఁ దప్పితిమా మేము చేసినదుష్కరతపఃఫలంబు నంతయుఁ దొలంగి పోవుటయె గాక వసిష్ఠునిమ్రోల మాకును దలవంపు గల్గును. మాయంతేవాసు లగుమీకును దీనివలన నవమానమె గదా? ఇవన్నియును జక్కఁగాఁ బర్యాలోచించి ప్రథమశిష్యుఁడ వైన నీవే కార్యతంత్రమును గౌశలము మెఱసి జరప వలయును.

నక్షత్రేశుఁడు—గురునాథా! దేవరవారి యానుజ్ఞానుసారమె నడచుకొనుటకు సిద్ధమై యున్నవాఁడను. ఇంతకంటెను దేవరవారి దాసుఁడు చేయఁగల దేమున్నయది? మేమును వసిష్ఠమునివరుని శిష్యులతోడ వాదించియె వచ్చి యున్నారము. ఆకారణమును బట్టి విధేయులము కొంచమైనను శక్తివంచనమును జూపక ప్రయత్నించి కార్యసిద్ధిని జెంది వచ్చుట కించుకేనియును వెనుదీయము.





## ద్వితీయాంకము - ప్రథమరంగము.

స్థలము: నగరులోనియంతఃపురము.

కాలము: అపరాహ్ణము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, సుగంధి.

(హరిశ్చంద్రుఁ డంతిపురమును బ్రవేశించుచున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—ప్రాణేశ్వరీ! మనముద్దులబిడ్డఁ డేడీ?

చంద్రమతి—ఇదిగో! ఉన్నాఁడు. (రాజు బిడ్డ నెత్తికొని ముద్దిడును.) నాయకా! వేట కేగినచోట విశేష మేదేనియుం గలదా?

హరిశ్చంద్రుఁడు—కలదు ప్రేయసీ! మేము వేట లాడఁబోయితిమి. మన ప్రజలు చెప్పినరీతినె యొక్కకు మిక్కుటంబు లగుమృగసంచయంబు లుండినవి. వాని నన్నిఁటి వధించువిధంబుఁ జింతించి నానాముఖములుగ వ్యాపించిన యవ్వాలుమెకంబుల వెన్దగిలి మే మొక్కరొక్కరుగ వేఱుపడితిమి. నే నొకయడవిపందిని వెన్నంటి పోయి దానిం గూల్చి శ్రమ వాయ నొకధరణీరుహంబుచెంత విశ్రమించితిని. అచ్చోటి కిరువురు కన్యలు వచ్చిరి.

చంద్రమతి—వారు వనకన్యకలు గా నోపుదురు! వారొకవేళ మలరాచకన్నియ లగుదురో!

హరిశ్చంద్రుఁడు—కారు కారు. వారు మునికన్యక లఁట.

చంద్రమతి—మునికన్యకలా మిముఁ నాశ్రయించిరి?

హరిశ్చంద్రుఁడు—ఔను. వెనుకటిసంగతిని వినుము. విద్రుమోష్ఠీ!

చంద్రమతి—వచ్చి యేమి చేసిరి?

హరిశ్చంద్రుఁడు—వచ్చి యింపులు నింపఁ బాట పాడిరి. ఆగానము ఱాతిని సైతము నీరుగాఁ జేయ జాలుమనోజ్ఞతను జెంది యుండె. దాని విని సంతసించి, యదివఱకుఁ జెట్టుకొమ్మలం దగిలి తెగి, నావద్ద నుండినమణిహారమును వారికిచ్చి బహూకరింప యత్నించితి. దాని వారు వల దని గ్రహింప రైరి.

చంద్రమతి—ఆహా! తమదివ్యహస్తములతో నీయఁ బోయినబహుమతి వల దని నిగ్రహించిరా? ఔ నౌను. మునికన్యకల కాభరణము లేల? ఐన నేమి గోరి మీయొడకు వచ్చిరి?

హరిశ్చంద్రుఁడు—నాకును వారిరాక దురూహముగానే యుండెను. పిమ్మట నేను దమ్ముఁ జేపట్ట వలయు నని పలువగల బతిమాలిరి.

చంద్రమతి—ఏమీ, మిమ్మా పరిణయ మాడఁ బ్రార్థించిరి! ఏమి చిత్రము! ఈదృశచింత గలవారా మునికన్య లనఁబడెదరు! ఆవల నేమి జరిగెనో సవిస్తరముగాఁ జెప్పుఁడు; విన వేడుకగా నున్నది.

హరిశ్చంద్రుఁడు—నేను వారి కుచితరీతి నీతి బోధించి వారిచిత్తవృత్తిని మార్పఁ జూచితిని. అట్లుండియు వారు నన్నుఁ బలుమాఱు బతిమాలిరి. పిమ్మట నేను వారి కనేకవిధంబుల హితబోధ చేసి "నేనిది వఱకే యొక తన్వంగిని బెండ్లాడి, నాశరీరాంతఃకరణముల నన్నింటి నాతలిరుఁబోణికి నర్పించితిని. కాఁబట్టి మీయభీప్సితం బొనర్పఁ జాలు శరీరప్రాణంబులు వేఱుగా నాయొద్ద లేవు" అనిచెప్పుచు నేనె తొలఁగి పోయినాఁడను.

చంద్రమతి—ఔ నౌను; తమ రట్లే చేసి యుందురని తలంచితిని.



హరిశ్చంద్రుఁడు—దాని కేల సందియము? మనమనస్సు లొక్కటియే గద! పిమ్మట నాకన్యక లేమియో తమకొఱఁతలను గూర్చి సంభాషించుకొను చుండిరఁట. దాని నానర్మసఖుఁడు విని వారిచెంప కాయలఁ బగులఁ గొట్టినాఁడఁట.

చంద్రమతి—(మందహాసముతో) అయ్యోపాపము! దెబ్బలును దినిరా! వెనుకఁ జెప్పుఁడు. నడుమ నడుమ నడ్డవాటుగ నాపలుకుటకు క్షమింప వలెను.

హరిశ్చంద్రుఁడు—పిమ్మట నాసచివుఁడు నాయొద్దకు వచ్చి నడచినవానిం గూర్చి విన్నవించెను. అట్టివానికార్య మనుచిత మని వానికి సద్బుద్ధి గఱపు చుంటిని. అపుడు విశ్వామిత్రమునివర్యులు కడుఁ గుపితు లయి మాయొద్దకు విచ్చేసిరి.

చంద్రమతి—మన విశ్వామిత్రకులపతులే గద! వారి కేల మనపై నంత కోపము?

హరిశ్చంద్రుఁడు—ఆమునికన్యలు విశ్వామిత్రులయొద్ద నుండువారఁట. వారిని నేనే మర్దించి యనిచినట్లు భావించి కోపాయత్తచిత్తంబుతో వచ్చిరి.

చంద్రమతి—(ముఖవైవర్ణ్యముతో) అయ్యో! ఏమికాలము!

హరిశ్చంద్రుఁడు—అట్లు వచ్చినవారు నన్నుఁ గఠినోక్తుల నాడి యిట్లు చేయ నగునా యని కోపతామ్రాక్షు లయి యడిగి చుఱచుఱఁ జూచిరి. నేను నమ్రత దీపింప నపరాధిని గా నని వివరించితిని. నాచేఁ బ్రేరేపింపఁబడి నాసఖుఁడు వారిని హింసించె నని యమ్మౌని మండనులు మది నెంచి, రాజ్యాహంకృతి కారణంబుగ నే నిట్లాచరించితి నని చెప్పిరి. అప్పు డేను రాజ్యసుఖము తిరంబు గాదు. దానంజేసి దాసున కొక్కింతయేనియుఁ దన్మూల మగుగర్వము

లేదు. నేను ప్రజాక్షేమము నుద్దేశించి వసుంధరాపరిపాలనము చేసెదను గాని యధికార విశేషమును జెల్లించుటకుం గాదు. అని విన్నవించితిని.

చంద్రమతి—ఔ నౌను. అది సత్యమే కద!

హరిశ్చంద్రుఁడు—ఆయభిప్రాయము సత్య మగునా యనిరి. ఈరాజ్యభారము వహింపఁ జాలువలంతి నాకు లభించినచో నాభారము వానిపై డించి, నేను వానప్రస్థాశ్రమము నవలంబింతు నంటిని. మునివరు “లట్లయినచో నాభారమును మా కర్పించి వేయు” మనిరి. అది విన్నతోడనే యీ సామ్రాజ్యసంపద నమ్మహనీయుల కర్పించునట్లు వాగ్దానము చేసితిని. ప్రాణేశ్వరీ! మన మింకఁ గాలతామసము చేయక యీధరాపరిపాలన మాతనికి స్వాధీనపఱిచి వనవాసులము గా వలయును. అదియే మనకు జన్మసాఫల్య మొనగూర్చునది. ఇట్టి నాచేఁతకీ వొక్కింతయేని మనఃక్లేశ మొందరాదు మానినీమణీ!

శా. మత్తారాతివరేణ్యులఁ గెడపి సామ్రాజ్యాప్తిచే మించువీ
రోత్తంసుల్ వసుధాస్థలి న్నిగులువా - రొప్పారిరే నిత్యతన్?
విత్తం బేరిది? వైభవం బెవరిదో - వే మిత్తి మొత్తంగ? హా!
చిత్తం బీశ్వరపాదపద్మయుగళిన్ - జేర్పంగ లే రెలా హా!

మన కీరాజ్యభార మొకపెనుభారమే గాని, మ జేమి? నాకు ముం దున్నమణిమయమకుటోజ్జ్వలు లయినమాపెద్ద లిపు డేరీ? అరయ వారును మృత్యువదనగహ్వరంబును జొచ్చినవారు కారె! మహీమండలాఖండులు లయి మహిమఁ బొందిన మాత్రాన వారిం జూచి మిత్తి తనయెత్తికోలు మానెనా! మానదు. మానదు. కావునం దలపోయ నపవర్గసౌఖ్యమ్మునకై మార్గాన్వేషణమ్ము చేయుటయె యుత్తమము.



చంద్రమతి—ఔ నౌను, దాని కేమి సందేహము? నాయకా! అందువలన విధేయురాలి కొక్కింత యైనను గలఁత లేదు.

సుగంధి—అయ్యో! అమ్మా! రాజ్యము బాలరాజునకు లేకయా?

చంద్రమతి—సఖీ! ఏరాజ్యమే బాలుని కయినది? పుట్టినప్పుడు కూడఁ దెచ్చినది కాదుగద. గతించునప్పుడు మనతోడఁ దీసికొని పోవుటయును లేదుగద. సంపద మధ్యకాలమున వచ్చునది. అదియు స్థిరమైనది గాదు. సౌశీల్యంబును బరిపాలించుటకే కద మన రాజ్యపాలనము. మఱియు మనకు వలయున దేది? (నాథునిఁ జూచి) ప్రాణనాథా! వానప్రస్థస్థితి యను నయ్యాశ్రమ మాచార మెట్టిదో?

హరిశ్చంద్రుఁడు—సతీమణీ! మానవులు పొందఁ గలయాశ్రమంబులు నాలుగు. అవి:—బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము లనునవి. వానిలో బ్రహ్మచర్య మాచార్యుల నాశ్రయించి, వేదాధ్యయనము చేసి, వ్రతనిష్ఠమై నవివాహితుఁడుగా నుండుటయె. గృహస్థాశ్రమము నాఁబడునది యిల్లాలితోఁ గూడి ప్రాపంచికసౌఖ్యము లనుభవించుచుఁ బరలోకంబు గడింపఁ బుణ్యకార్యసమాచరణంబులతో దినములు గడపుట. వానప్రస్థ మనఁగా భార్యాసమన్వితుఁ డయి గాని యేకాంగిగఁ గాని, పురవాసంబు వదలి వనసీమల వన్యాహారంబులం దృప్తి చెంది యపవర్గసుఖంబులకయి జపతపంబులఁ గాలంబు సలుపుటయే యగు. సన్న్యాసం బన్నది సర్వసంపరిత్యాగ మొనర్చి యాత్మానాత్మవివేచనంబుం జేసి జీవన్ముక్తి నొందుటయే యగు. అట్టి యాశ్రమచతుష్టయంబునం దేను తృతీయాశ్రమంబునుం జెంద నెంచి యుండుటంబట్టి నీవు మన ముద్దులకొమరునిఁ బరిపోషించి, ముదుసలితనంబుం బొందిన నామాతకుఁ బ్రాపవయి యుండి కాలము గడపుదువుగాక. అది

యును గాక రాజ్యము విశ్వామిత్ర మునివరుల పరిపాలనమునకు లోఁబడినది గాన మీ కొక్క కొఱఁతయుఁ దటస్థింపదు.

చంద్రమతి—నాథా!

ద్విపద. పతి నెడబాసిన-పద్మాయతాక్షి
వ్రతనిష్ఠ లన్నియు - వ మ్మయి చనును.
పతిభక్తి పడఁతికిఁ - బరమమంత్రంబు
పతిభక్తి భామకుఁ - బరమశోభనము.
ముదమునఁ గులశీల-ముల మదిఁ గోరి
బ్రదుకుపతివ్రతా-రత్నంబులకును
బతి లేనిసుఖ మేల - భాగ్యంబు లేల?
పతి లేనిసుతు లేల - బంధువు లేల?
పతి లేనిహితు లేల - ప్రాణంబు లేల?
పతి లేనిరాజ్య సం-పద లవి యేల?
పతియ సూ దైవ మె-బ్భంగుల సతికి;
సతి కేడుగడయును - జర్చింపఁ బతియె.

నాయకా! వేయిమాట లేల! వినుండు—

సీ. ఘనదుర్గమారణ్య-గర్భప్రదేశమ్ము లారామసీమ లౌ - నవనినాథ!
పటుతరోత్తుంగప-ర్వతగహ్వరాళులు కనకహర్మ్యస్థలుల్ - క్ష్మాతలేంద్ర!
భల్లశార్దూలాది-బహుళసత్త్వార్భటుల్ పరభృతాలాపము - ల్వనుమతీశ!
విలయజంఝానిలో-ద్వేలఘాతంబులు మందసమీరము - ల్మానవేంద్ర!
గీ. కందమూలఫలాదులే - కాంతు దీర్పఁ బరఁగుసరసాన్నభక్ష్యము - ల్పార్థివేంద్ర!
నాథుఁ గవగూడి చరియించు-నాతి కెందు; పతినిఁ బాసినసాధ్వికి - బ్రతుకు గలదె?

శాస్త్రములు పతిరహితలై పత్ను లుండ నగు నని యేసందర్భము నందేని ననుమతి యిచ్చుట గానము. కాఁబట్టి నే నెట్లు దేవరవారి నెడబాసి యుండ నగును?

హరిశ్చంద్రుఁడు—నీవు వచించునది వాస్తవమే. అయ్యదియె న్యాయము. ఐనను నామాట వినుము.



సీ. కాంతరో! పుండరీ-కంబులో పాలసాదుపుండరీకంబులు - పొలుపుఁ జెఱచు,
సీమంతినీమణీ! - సింహమధ్యలా చూడ సింహాళిమధ్యంబు - చెలువు డించు,
ఘనఘనాఘనవేణి! - కటకసంవాసంబొ కటకాళి కడువెత - ల్గడలుకొలుపు,
విమలవాఃపూరశో-భితతటాకంబులో దావపావకశిఖ - ల్దరియఁ గాదు,
కటకటా! కంటకావిహిత-కాననాంత రమ్ము లవి యేడ నీ వేడ-వమ్ము చువ్వె
పువ్వుబోణిరో! నాపల్కు-బుద్ధి వినుము కాన వందురఁ దలపోయఁ-గాదు నీకు.

చంద్రమతి—ప్రాణేశా! కోపింపక నాపల్కు లాలకింపుఁడు. తమ్మెడ బాసి యేకాకినిగా నిందుండ లేను. నాఁడు కన్యాకుబ్జమహానగరము నందు నన్నుఁ జేపట్టుచో సంపదలయందు నాపదలయందును, సుఖములు గల్గిన దుఃఖము లడరిన నెడబాయ నని ప్రజ్జ్వలితజాతవేదుని మ్రోల పెద్దలే సాక్షులు గాఁగఁ బల్కినయమ్మాట లేల నేఁడు మఱవం దలపోసితిరి? విధేయురాల నగునేనును నాఁడు వచించిన యట్టి వచనము లింకను హృదయము నందుఁ బొంకముగఁ బదిల పఱిచి యున్నదాన. నాయాడినమాట ననుసరించి యెన్నఁడు నే యవస్థలయందును దేవరవారి నెడబాయకుందు ననుటం దెలిసియుఁ దమ రిట్లు న్యాయవిరుద్ధముగాఁ బలుకం దగునా? దైవేచ్ఛచేఁగాని యెడబాటు లొడగూడిననేకాని, మన మెట్లు పరస్పర మెడబాయ నగును. శీతలోదకంబులనుండి శైత్యంబును హుతాశనునుండి యుష్ణంబును నెట్లు వేఱుపడ నోపును? అట్లె మిము నిప్పుడే నెడబాయుటయు నగును. మఱియును నేను శరీరమువలెను దమరు శరీరివలె నయినప్పుడు శరీరివియోగంబును జెందినశరీర మెట్లు జీవించి యుండు? కాఁబట్టి దేవరవారు నన్నెడబాయుసంకల్పము హృదయవీథిఁ దోఁపించుట తగదు.

హరిశ్చంద్రుఁడు—కాంతా! నిన్నెడబాయుతలంపు నాకెంతమాత్రమును లేదు. వనవాస మనునది సామాన్యము గాదు. మానవుల

కించుక కష్టము దోఁచినను “ఇది యేమి వనవాసమువలె నున్న దే” యనుట నీ వెఱుఁగ నిదియా? నీకోమలతనువల్లి వనవాసక్లేశంబులఁ దాల కుండునా? అక్కటా! నీ ముఖకమలము కాననవాసఖేదంబు గడలుకొనం బడలి సొం పెడల కున్నె?

సీ. ఉజ్ఝితోచ్ఛ్వాసతా-పోద్వృత్తినీమోవి బీటలుపాఱదె - పృథులవేణి!
పటుతీక్ష్ణరశ్మికి - బడలినీమైదీవ వాఁడిసోలక యున్నె - వామనేత్ర!
నీముఖచంద్రము - నెలదప్పికందరాంతరసీమఁగోల్పడుఁ - దలిరుబోణి!
కలితశారీనాద - ములనొచ్చుశ్రవముల ద్విపరాజఘీంకృతు - ల్వ్రీల్పకున్నె?
యుపవనాంతరసీమల - నొప్పుగుల్కు కేళికూళులదరిఁబొల్చి - కెరలుకుంజ
పుంజములపొంతఁ - బొనరారుపుష్పశయ్య వెలయుదానవుచెలఁగుదే - విపినసీమ.

చంద్రమతి—నాయకా! తమ రనుగ్రహించి సెల విచ్చిన వన్నియు నా హృదయకమలంబును గంటగించునవి గావు. పతివిరహ మొక్కటియె బాధాచరణపటిమం బయి మనఃకమలంబును బాధించు హృదయేశ! ఏవిధంబుచేతఁగాని నన్నెడబాయుకార్యమును మాత్రము పర్యాలోచింపకుఁడు. దాసురాలు దయితు నెడబాసి వసించునంతఃపురము దారుణ దావసీమ యగును. నాయకునకుఁ గానినారీమణిదివ్యభూషణాలంకారంబులకై సేత యది యెవ్వారిమనోరంజకంబునకో? ఔరా కష్టము! కాంతునిచెంత నందమొందు సీమంతినీమణికిఁ గష్టము లవి యేల సంధిల్ల నోపు? అదియును గాక, పతి ప్రవాసంబుచే నుత్తమ యౌసతీమణి సజీవ యై యెట్లు కాలయాపనంబు సేయు? అది పాతివ్రత్యమహిమకు మహావిరోధము. అట్లు మని యుండుటకంటె మంట ప్రగ్గుట శ్రేయము. నన్ను విడనాడి పోవం దలంచి దేవరవారీరీతి బలుపలువిధంబుల నాతోడనాడుట పాడియే? నే నెంతటికి నెడ వీడి యుండ నోపను. అట్లెడబాయ వలసి వచ్చినచో నీ నాశరీరంబున క్షణమాత్రం బేనియు జీవంబు నిలిచి యుండ నోపదు.



కం. పతితోడ నున్కి నడవియు, సతికిఁ స్వారాజ్యవిభవ-సౌఖ్యము లొసఁగుఁ
బతిఁ బాసినస్వారాజ్యము, సతికి న్నిరయంబ కాక-సంతస మిడునే?

హరిశ్చంద్రుఁడు—సతీమణీ! నీతలంచినట్లు నిన్ను వెంటఁ బెట్టుకొని పోవ నా కొక యాటంకము నుండదు. నీయభిమతంబు దీర్చెద.

చంద్రమతి—నాయకా! సంతోషము. ఇఁక నేను మీ యెడ నభిలషించునది మఱేమియును లేదు. తాము చిత్తగించినమేరకే వానప్రస్థాశ్రమం బనుసరించెదము.

హరిశ్చంద్రుఁడు—ప్రాణేశ్వరీ! ఋషిధూర్జటి విచ్చేయును. రమ్ము కొలువుకూటంబున కేగి యచ్చట నందఱు నెఱుఁగునట్లు లీ రాజ్యము నామునివరులకు దత్తము చేసి మనము కాన కేగుదము.

చంద్రమతి—ఇదిగో సిద్ధముగా నున్నాను.

(సభామంటపమునకు హరిశ్చంద్రుఁడు మొదలగువారు వెడలుచున్నారు.)

ఇది మొదటిరంగము.

## ద్వితీయరంగము.

స్థలము : సభామండపము.

కాలము : సాయాహ్ణము.

పాత్రములు : హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, చిత్రరేఖ, విశ్వామిత్రుఁడు, నక్షత్రేశుఁడు, సత్యకీర్తి, సామంతరాజులు, సేనాపతులు, ప్రభువులు, మొదలగువారు.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! వచ్చినారము. ఏర్పాటు లన్నియుఁ గ్రమముగాఁ దీర్చి యుంచి యున్నావు గద! ఏ నైన నిందువలనఁ జిత్తచాంచల్యము గలదే?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! చిత్తచాంచల్యమున కణుమాత్ర మేనియును గారణము లేదు. దేవరరాకకె యెదురు చూచు చున్నాము.

విశ్వామిత్రుఁడు—ఇదె! వచ్చితిమి. నీవు చేయ వలసినక్రమం బెద్ది?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఈపరివేష్టించి యుండువారిం జూడుఁడు. పౌరులు పలువురు వచ్చి యిం దాసీను లయి యుండువారలు. మఱియును రాజ్యనిర్వాహకోద్యోగులును విచ్చేసి యుండువారు. వీరిసమక్షమంబున నీ రాజ్యమును విధేయుఁడు దేవరవారికి స్వాధీన పఱుచుట కైన రాజ్యాంగప్రసిద్ధ పత్రము నిదిగోఁ జదివెదను. అనుగ్రహించి యాలకింప వలయును.

విశ్వామిత్రుఁడు—ఆహా! సంతోషము. మాకు స్వాధీనమగు సమస్త వస్తువులు నిందు సూచింపఁబడి యుండును గాదె?

హరిశ్చంద్రుఁడు—అవును స్వామీ! దానినే యిచ్చటఁ జదువఁ బోవుచున్నాను.

విశ్వామిత్రుఁడు—అట్లయిన సరి. కానిమ్ము.

హరిశ్చంద్రుఁడు—“మాపాలనకు లోఁబడి యున్న రాజులు, ప్రభువులు, నాగరికులు, మొదలగు నందఱకును దెలిపించుట యే మనఁగా:— మాప్రార్థన ననుసరించి యీ రాజ్య మనియెడు మహాభారమును వహించి యనుగ్రహించుటకై పూజ్యు లగువిశ్వామిత్రకులపతులు చిత్తగించినందున నీ రాజ్యమును, చతురంగబలంబులును, వారి వశము సేయుటయె కాక, మావసించునగరు, కోశంబులు లోనుగాఁగల సకల జంగమ స్థావరరూపంబు లయినవస్తువుల నెల్ల నిమ్మునివరులకే స్వాధీనము లగునట్లు మనఃపూర్వకముగ దత్తము చేసినారము. ఐహికేచ్ఛల నన్నిటిఁ ద్రెంచి వైచి ముముక్షూత్తము లైన యిమ్మునిధూర్జటిప్రభుత్వ మారయ మాప్రభుత్వముకంటెను బ్రజల



యుజ్జీవనంబులకు సౌఖ్యప్రద మగు నటంచు మేము దలంచినతలంపె యీ రాజ్యము తదీయాధీనము చేయుటకుఁ దగినకారణం బగును. అదియును గాక మేము సంసారసాగరాంతర్నిమగ్నుల మౌచు వనరంగ నోపక వైరాగ్యంబు దాల్చి వానప్రస్థాశ్రమ మవధరింపఁ జిత్తంబుఁ గుతుహలాయత్తంబు గావించితిమి. అదికారణంబుగ మీ రందఱు మాకిదివఱకుఁ జెల్లించుచు వచ్చినకట్నముల నీ మునిశార్దూలులకె చెల్లించి వీరియెడ నిర్వంచనముగఁ బ్రీతిఁ నెరపం గోరెద.

ఇట్లు:

హరిశ్చంద్రుఁడు.”

[హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునకుఁ బట్టంబు గట్టుట.]

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! ఈరాజ్యమును జతురంగసైన్యమును మాయధీనము చేసితివి. నిజమే. మఱల నదేమో యొకటి వ్రాసి యున్న వాఁడవు. అక్కడఁ గొంచెము చదువుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! నానగరు, ధనాగారము, మొదలుగాఁగల సకలసంపదలను, సూచించి యున్నాను.

విశ్వామిత్రుఁడు—మిగులసంతోషము. ధనగార మనఁగా బొక్కసమా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఔను.

[హరిశ్చంద్రుఁడు పత్రమును విశ్వామిత్రునకు కిచ్చుచున్నాఁడు.]

విశ్వామిత్రుఁడు—(పత్రమును గైకొని) సత్యకీర్తి! హరిశ్చంద్రుఁడు రాజ్యము నా కర్పించుటయు నేఁడు నేను బట్టాభిషిక్తుండ నగుటయు సామంతరాజులు, పౌరులు గ్రామ్యులు మున్నగు సర్వప్రజలకును జాటింతువుగాక.

త్యకీర్తి—ఆహా! అట్లె చేసెదను స్వామీ!

హరిశ్చంద్రుఁడు—మునినాథా! సకలమును గ్రమముగానే పరిసమాప్తి నొందెను. ఇంక నీవిధేయుల కనుజ్ఞయే కదా?

విశ్వామిత్రుఁడు—'విధేయుల' కనిన నెవ రెవరికి? నీ వొక్కరుఁడవే కద? బహువచనమువలని ప్రయోజన మేమియో తెలియకున్నది.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుఁడనుమాత్రము కాను. నాజాయయు నను బాయ ననుచున్నది. కాఁబట్టి బిడ్డఁడును మావెంట వచ్చుట యావశ్యక మగుచున్నది. ఈ మూవురికి నుత్తర వను గ్రహింప వలసి యున్నది. నాజననిమాత్ర మిచ్చటనే యుండును.

చిత్రరేఖ—నాముద్దుల తనయా! హరిశ్చంద్ర! మిమ్ము నందఱ వదలి నేను మాత్ర మిచ్చోట నొంటి నుండ నామనస్సె ట్లొప్పును? నేనును మీతోడ వచ్చెదను. ఈ వార్ధక్యంబున న న్నొంటి వదలి చనిన నే నెవ్వారి ప్రాపున నిచ్చోట నుండఁ గలను?

హరిశ్చంద్రుఁడు—మాతా! మిమ్ము నొంటి వదలి చనుట మాతలంపు గాదు. ఈవార్ధకమునఁ గాననంబునఁ గందమూలఫలాహారంబులఁ గాలము గడపఁ దమకు సాధ్యముకాదు. ఇచ్చటనే వసించి యుండ వచ్చును. మునివరులు తమశరీరరక్షణము నాకంటెఁ బదిమడుంగు లధికశ్రద్ధతోఁ జేయింతురు. "దుర్బలస్య బలం రాజా" యనఁగ వినరా! దిక్కు లేనివారి భూధవుండు తండ్రియుఁ దనయుఁడుం బోలెఁ బోషించువాఁడు. ఈ మునివరుల కియ్యది తెలియనివారు కారు. ఇంక నిదిగో నానర్మసఖుఁ డుండువాఁడు. ఏమఱక మీకు భక్తి సలుపువాఁడు. కాఁబట్టి తల్లీ! తా మిచ్చోటనే యుండుట ప్రశస్తము. చల్లనిమనస్సుతో నాకుత్తరు విండు. (నర్మసఖునిం జూచి) సఖా! మాజననిగారిని సర్వకాలసర్వావస్థల నభిరక్షణము సేయుచు సమీపమునందే యుందువుగాక.



చంద్రమతి—అత్తగారూ! దేవరవా రెందులకును గలఁతఁ జెంద వలసినది లేదు. ఒంటరిగా నుండ నిష్టము లేకున్నఁ గన్యాకుబ్జమునకుఁ బోయి యచ్చో నాతలిదండ్రులచెంత వసించి యుండ వచ్చును. అయ్యదియుఁ దమగృహమె కద?

చిత్రరేఖ—అమ్మా! ఎట్లు మి మ్మెడఁ బాసి యుందును?

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! మీ మాటలు నురియాటలు నాకు సందేహాస్పదములుగ నున్నవి. ఏమో నన్ను వచింతుఁ గావింపఁ దలపోయుదురని శంకించెద. రాజ్యము మా కర్పించితివి. ఇపుడు మీ రెల్లరు దేశంబు వదలి పోవ నాలోచించెదరు. మేలు మేలు. మీ భావం బే నెఱింగితి. లోకులు నను గని "ఈ పాపి రాజ్యం బపహరించియుఁ దనివి చెందక హరిశ్చంద్రు సకుటుంబునిఁ గాంతారంబుల కనిచె" ననునపఖ్యాతి నాకుం దెచ్చి కట్టుట కెన్నితివిగా! అట్టి యపయశంబు తోడి నీయనంతా పరిపాలనంబు మాకు వలసినది లేదు. నీవె తీసికొనుము. ఆహా! ఏమివింత! తపశ్చర్య కేగువాఁడా దారాతనయుల తగులంబుతోడఁ దత్తఱపడువాఁడు. తపస్వి కిది యే కాఁబోలుఁ దగునట్టి యాచారము?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! నాదార నిచ్చటనే వదలి చనుటకై యనేకవిధముల బోధించితిఁ గాని తనయునితోడ నన్నువెన్నంటి వానప్రస్థ మనుభవింపఁ గోరుచున్నది. కాఁబట్టి నాజనని మాత్ర మిచ్చో వదలిపోవుట కుద్దేశించెదను. ఇందు నాచేయువంచన యెద్ది?

విశ్వామిత్రుఁడు—సరి. నీతల్లి నేనియు వదలి పోవుటచే మా కేయపనిందయుఁ గలుగదు. అట్లయిన మీరు మువ్వు రేగ వచ్చును. హరిశ్చంద్ర! నీవు వానప్రస్థాశ్రమంబును గద వలచితివి.

హరిశ్చంద్రుఁడు—ఔ నౌను, స్వామీ!

విశ్వామిత్రుఁడు—ఓహో! హరిశ్చంద్ర! ఏమి యవిమర్శితకార్యములఁ జేసెదవు? ఏయాశ్రయంబున కేదిపద్ధతియో యట్లు గదా నడచుకొన వలెను. కేవలము మోక్షాపేక్షు లయి వైరాగ్యంబుకతన ఘోరవనాంతరవాసంబు సలుపఁగఁ బోవువానప్రస్థుల కీదివ్యమణిభూషణాద్యలంకారంబులు సంతోషదాయకంబు లగునా? వానప్రస్థుల కనర్ఘచీని చీనాంబరాదులు వల్కలములా, కాషాయవసనంబులా? మణిభూషణంబులన నక్షమాలలా రుద్రాక్షమాలలా? నీయీవిభవంబునకును నీకోరువానప్రస్థాశ్రమవిధానంబునకును గడు దూరంబు.

హరిశ్చంద్రుఁడు—ఔను, స్వామీ! ఔను. మోక్ష మన్న నేమో? ముముక్షు వన్న నేఁడో? నూతనుల మయినమా కే మెఱుక? దీని కే కద సర్వజ్ఞులసమాశ్రయంబు సర్వశ్రేయోదాయకం బనుట. ఈ భూషణాంబరంబుల దేవరవారి కే యర్పించుచున్నారము. గురునాథులే మాకుఁ దగినవాని నిత్తురు గాక!

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! సంతోషము. వానప్రస్థునికిఁ దెల్లబట్టలు నిషేధములు గావు. ఐనప్పటికిని, నీ సచ్ఛీలమున కాహ్లాదపడి తురీయాశ్రమస్థుఁడు ధరించు కాషాయవసనము నె యనుగ్రహించెదము!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! దేవరవారి యాశీర్వచనమును నిరోధించునట్లు భావింప రాదు. విధేయుఁడు పొందునది వానప్రస్థస్థితి. దానికంటె నెచ్చిన సన్న్యాసాశ్రమోచిత వస్త్రములఁ దాల్చుట యెట్లు సమీచీన మగును? కావున సూర్యవంశమున కుచితం బయినట్టి యుదయరాగవసనముల నా కనుగ్రహించుటయె యుక్త మగును.

విశ్వామిత్రుఁడు—అట్లైన నీ కోర్కె నెరవేర్చెదము.



(విశ్వామిత్రుఁడు తనయొద్ద నున్న యుదయరాగవసనంబె రావించుచున్నాఁడు. ఆవలికిఁ బోయి మూవురును వాని ధరింతురు. తాము ధరించి యున్నభూషణాంబరముల నెల్ల మునివరుని కర్పింతురు.)

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇఁక నుత్తరు వనుగ్రహింతురు గాక!

తే. మీయనుగ్రహమునఁజేసి - మేరలేని
యైహికాంభోధిఁ దరియించి - యభవుపాద
వనజముల నాత్మఁ గొలిచి శా-శ్వతపదంబు
నందువాఁడను గారుణి-కాగ్రగణ్య!

విశ్వామిత్రుఁడు—నీ గుణంబునకు సంతసించితిమి. మీరలు వానప్రస్థాశ్రమాచారంబుల సుఖులరై కాలయాపనము సేయ నాశీర్వదించెదము. ఆశ్రమభ్రంశ మొందకుందురు గాత!

హరిశ్చంద్రుఁడు—(తల్లికి మ్రొక్కి) జనయిత్రీ! సెల విండు. పోవుచున్నారము.

చిత్రరేఖ—నాముద్దులబిడ్డా! హరిశ్చంద్ర! చంద్రమతీ! పోయి రండు, మనబిడ్డఁ డెక్కడ? తండ్రీ! రార. (ఎత్తి ముద్దిడుచున్నది.) ఆశీర్వాద మక్కఱ లేదా?

(మువ్వురును నగరు వదలి తరలుచున్నారు.)

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! హరిశ్చంద్ర! ఇక్కడికి రా! రా!

హరిశ్చంద్రుఁడు—ఇదిగో వచ్చినాఁడను స్వామీ! విధేయుఁ డీఁకఁ జేయఁ దగినకార్యశేష మేది యైనఁ గలదో?

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! నీకుఁ గలసకలసంపదలును మాకు నర్పించినాఁడవు, నిజమే; మేము నీయొద్దఁ బూర్వ ముంచి చనినట్టి మాధనము నప్పగించినవాఁడవు గావే!

హరిశ్చంద్రుఁడు—అదియును, స్వామీ! ధనశాలయందే యున్నది. దాని సైతము దేవరవారిస్వాధీనమునకుఁ దెచ్చినాఁడను గానా?

విశ్వామిత్రుఁడు—స్వాధీనపఱిచినది నిజమే! ధనశాలనుగూర్చి విమర్శించుచో మేము నీయెడనుంచి చన్నధనము నందే యుంచి యుండునట్లు సూచించినాఁడవు గావు. ఆకాలమునందు నిన్నురెట్టించి సైత మడిగినాము. అప్పు డైనను జెప్పినాఁడవు కావు.

క. ఇలఁ బూర్వద్రవ్యమునకు
సెలవుగ నిచ్చితివె? నిజము - చెప్పుము; నీమా
టలు నేఁటిదాఁక నన్మృతం
బులు పోరయవు; నేఁ డి దేల - బొంకఁగ నీకుఁ?

ధర్మదృష్టిం జూడ నాధనమును బ్రత్యేకించి నా కీయ వలసినది పద్ధతియా? కాదా? పాడి తెఱఁ గీ వెఱుంగనిది కాదు.

క. భూవల్లభ! మును ధరణీ, దేవున కొడఁబడినస్వాప-తేయము పిదపన్
వేవేగ నీక యంకిలి, గావించినఁ దలఁచ రాని-కలుషము లొదవున్.

తే. ఎఱుఁగ కొదవించె నేనియు - నినకులేశ
విప్రదత్తాపహరణ ము-ర్వీశ్వరునకుఁ
జాలఁ గల్మష మొదవు సం-శయము లేదు
మఱచి సర్పంబుఁ బట్టినఁ - గఱవ కున్నె?

హరిశ్చంద్రుఁడు—మాటపద్ధతికి నియ్య వలసినట్లే యేర్పడు చున్నది స్వామీ!

విశ్వామిత్రుఁడు—మనకు మాటయె కద ముఖ్యము. మాటపద్ధతిని మార్ప నగునా?

హరిశ్చంద్రుఁడు—హా. హా! కూడదు, కూడదు.

“జీవనము లెల్లఁ - జెడ నిండు వడ నిండు
మాట దిరుగ లేరు - మానధనులు”

అట్లే యర్పించుటకు యత్నించెదను.

విశ్వామిత్రుఁడు—యత్నించు నెడల దాని నిచటనే చెల్లించినఁ గదా?



హరిశ్చంద్రుఁడు—మునినాథ! మాధరించిన వస్త్రాభరణాద్యఖిల వస్తుచయంబులు దేవరవారికె యొసంగి నాఁడను. అయ్యది తమదివ్యచిత్తమునకు వచ్చినయంశమే. ప్రకృతము కట్టువస్త్రములు తప్ప మావి యనఁ దగిన వస్తు వణుమాత్రం బైన మాయధీనమున లేదు. కావున ననుకంప నొక యవధి యొసంగితి రేనిఁ దమకుఁ జేరఁ గల సొమ్ము నంతయుం జేర్పించెదను.

విశ్వామిత్రుఁడు—ఎంతకాలము వ్యవధి కావలెను? దీర్ఘముగా నుండ రాదు.

హరిశ్చంద్రుఁడు—లేదు. లేదు. స్వామీ! నలువది దినముల వ్యవధి నిచ్చినఁ జాలును.

విశ్వామిత్రుఁడు—నలువది దినంబులా? సరి. ఈలో నిచ్చుటకుఁ దప్పిన వాక్కు దప్పిన ట్లగును. ఇంతేకాక యీధనము నియ్యయోధ్యా రాజ్యపుటెల్లలకు లోపల నార్జింపఁ దగదు. ఈరాజ్యమునందు నీవు గడించుధనంబు మాదే యగును. విత్తమును నీవు మాకుఁ జేర్పించుటకు ముందు నీనగరమునఁ గాలూనుటయుఁ బొరబాటగును. దీని కేమి సెప్పెదవు?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మే మీదేశము వదలి కాశీక్షేత్రంబునకుఁ బోయి ధన మార్జించి, నిర్ణీతకాలంబునఁ దమకుసమర్పించుకొనెదము.

విశ్వామిత్రుఁడు—అది యట్లుండ నిమ్ము. ఈ నలువదిదివసంబులవఱకెవ్వరు నీ వేగుచోటుల కంతయు నీతోడఁ దిరిగి యలమట నొందువారు? సొమ్మును బొందుట యన్న దొకశ్రమ. దానిలాభంబునకై త్రిమ్మరుట వలనిశ్రమ చెప్ప శక్య మగునె? నీతోడ నెవరి నంపుదును? మీతోడ వాఁడును బడలి యుత్తలం బొంద వలసినట్లున్నదే.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఏమి చేయ వచ్చును? ఎవరి నైన నౌకరిని బంపివేయ తీఱ వలయును. తప్పక గడువులోపల వారికి ధనము నంతయుఁ జేర్పించెదను.

విశ్వామిత్రుఁడు—(మీఁదఁ జూచి) ఎవరిని బంపుదును? దీని కెవ్వఁడీ కొనును? ఔను, మనశిష్యు నె యంప వలయును. విశ్వాసపాత్రులితరు లెవరు? హరిశ్చంద్ర! (నక్షత్రేశునిఁ జూపి)

తే. ఇతని మీవెంటఁ దోడ్కొని - యేగి భక్తి
గొనలుసాగంగ ననుఁ గనుం-గొనినయట్లు
కనుఁగొనం దగు; నాయాస-మునకు నోర్వ
లేఁడు; సౌఖ్యంబు జరపుఁడీ - నేఁడు మొదలు.

వీనిని మార్గమధ్యమునఁ జక్కఁగ విచారించుకొను చుండి వ్యవధిలోపల ధనము నంతయు నిచ్చి పంపివేయ వలయును. (నక్షత్రేశునిఁ జూచి) నీ వీహరిశ్చంద్రుని వెంటఁ బోయి నలువది దివసంబులకు లోపల మనకుఁ జేరఁ గలధనమును నూఱులక్షల నిష్కములను గొని, యిచ్చటికి మరలి వత్తువుగాక! నలువదిదివసముల మితి మీఱెనో, మఱి వాని యొద్ద నుండ వలసిన యవసరము లేదు. తత్క్షణమే మా చోటికి మరలి రావచ్చును.

నక్షత్రేశుఁడు—గురువర్యా! అట్లే చేసెదను.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! శిష్యుని జాగరూకతతో సంరక్షింపుమా? ఇతఁడే మాశిష్యాగ్రగణ్యుఁడు. నీవుగడువులోపల ధనము చెల్లింపకుందువేని నితఁ డుండఁ జాలఁడు. తిరిగి వచ్చును. ఊరక వాని హింసింపకు.

హరిశ్చంద్రుఁడు—లేదు. లేదు. స్వామీ! గడువుమించ కుండునట్లు విత్తంబు చేర్చెదను.



విశ్వామిత్రుఁడు—నక్షత్రేశ! మేము సెప్పిన వన్నియు నెడఁ బదిలపఱిచికొనుము. జాగ్రత్త.

(వెడలి పోవు చున్నారు.)

సామంతరాజులు—హా! సార్వభౌమ! మే మిఁక నేమి సేయువారము? ఎట్లు జీవింపఁ గలము! మహీధవా!

ఆ. ఈనఁ గాచి నక్క-కిడురీతి నక్కట
మమ్ము నింతదనుక-మనిచి నేఁడు
కరుణఁ బాసి యిట్లు - కఠినాత్ముఁ డగునాని
పాల వైచి పోవఁ - బాడి యగునె?

ఆశ్రయవిహీనంబు లయినలతావితానంబులు పుడమి కొఱఁగు నట్లేమును బ్రాపుఁ బాసి మ్రంద వలసి వచ్చెఁగా! రాజేంద్రా! దేవరవారిదివఱకు మాయెడం జూపిన మన్నన లెట్లు మఱచి పోఁ గలము? ఇఁక మారాజ్యతంత్రంబు లెవ్వారి హితోపదేశానుసారము నెఱపఁ గలము?

హరిశ్చంద్రుఁడు—సామంతులార! సందియపడకుఁడు. మీ కేకొఱఁతయుఁ బాటిల్లదు. మనమునివరులు మీకుఁ జాలినంత సాహాయ్యమొనగూర్చి వలయునంశంబుల ననుగ్రహించువారు. వీరిదివ్యానుగ్రహాతిశయంబునే కదా మన మెల్లర మపేక్షింపఁ దగినది. సర్వమునకును సర్వేశ్వరుండు గలఁడు. నాకు సెల విండు.

సామంతరాజులు—చిత్తము. మ మ్మెప్పుడుఁ జిత్తవీథి వీడకుఁడు.

ప్రధానులు—భూమండలాఖండలా! దేవరవా రొకవేళ వానప్రస్థంబున కీయకొనినను, రాణివాసమువారును బాలరాజులుగారు నెట్టులు వనవాసాయాసంబులకుఁ బాలుపడం జాలుదురు? మే మెట్లు దేవరవారి ప్రియపూర్వకాలోకనములను, గరుణారసామృతాసారంబు గావించు ముఖచంద్రమండలంబును మఱచి యుండువారము?

హరిశ్చంద్రుఁడు—మతిమంతులార! మంత్రులార! ఎఱుఁగనివారిం బోలి మీ రిట్లుత్తలంబునఁ దత్తఱిల్లుట పాడియే? విధికృతంబు లెట్టివారికిని దాఁట రాని వనుట మీ రెఱుంగరె? ఎది జరగవలయునో యది జరగియే తీఱును. మనచింతలవలనం బ్రయోజనం బేమియును లేదు. స్వస్థచిత్తులరు కండు.

దండనాథులు—రాజేంద్ర! దేవరవా రిట్లు మమ్మెడఁబాసిన మా కవలంబనం బెద్ది? త ప్పొనర్చినప్పుడును వాత్సల్యంబున మ మ్మరసి ప్రభువులవారు సంరక్షించినారు. ఇఁక నేమి సేయఁ గలవారము?

కం. మానుఖదుఃఖంబుల వి
శ్వాసముతో నరయు నెవఁడు - పాల్పడును వనీ
వాసము మీతో మాకును
వాసి యు టంచును దలంచు-వారము భూపా!

హరిశ్చంద్రుఁడు—సేనానులార! యోధాగ్రగణ్యులార! విశ్వామిత్ర కులపతు లసమానమహిమాన్వితులు. తొల్లి ధరాపరిపాలనమును నిర్వహించినవారు. వారు సర్వజ్ఞులు. వారు మముబోటి వారలను బరిపాలింపఁ దగుప్రతిభావిశేషపరిశోభితులు. అమ్మహానీయులపాలనంబున మీ కేపాటిపాటుం బాటిల్లదు. చింతిల్లకుఁడు.

ప్రభువులు—రాజచంద్ర! ఏమి కాలవిపర్యయము! "సంసార మసారము. అయ్యది చంచలా చంచలిత" మని పెద్ద లంద్రు. అది నేఁడుగదా దృష్టాంతపూర్వక మయ్యెను! చిత్రము! దేవరవారు వేఁటకుఁ జనుట. వచ్చుట. వైరాగ్యంబును బొందుట. వసుంధరాపరిపాలనము పరిత్యజించి వానప్రస్థుల రగుట. ఇ వన్నియు నాలోచింప నాటక ప్రాయంబులుగ నున్నవి.

సీ. మృగయావినోదంబు - మితిమీఱఁ గానల, విహరింప నది యేల - వెడలినారు!
వెడలినంతన యేమి - కడుఁగోపనుం డైన, ముని యేల చూపట్టె - క్రూరాల మీకు!
చూపట్టెఁగా నేమి - యీపాటివైరాగ్య, మేల మీమనమున - కిట్టు లయ్యె!
అయ్యెఁ బో ముని కేల - యవని యంతయు నీయ, వాగ్దానమును జేసి - వచ్చినారు!
అకట వచ్చిన నేమి సం-యమివరేణ్యుఁ
డదియ యద నని పుడమి తా - నపహరించె
నంతటను బోక మిము ముంచె - నడలుకడలిఁ
దలఁప నివి యెల్ల మాపాప-ముల ఫలంబు!

ఆక్కటా! ఈ యంతిపురము వారును, చిరంజీవులు నెట్లు వనవాసక్లేశంబు లనుభవింపఁ గలవారలు? ఔరా! విధి దుర్లంఘ్యము! కుసుమగుచ్ఛంబుల మెట్టినఁ గందు వీరికోమల చరణపల్లవంబులు కర్కశ కంటకావృత కాననస్థలుల నెట్లు సంచరింప నోపు? విధి దుర్లంఘ్యము! దుర్లంఘ్యము!

హరిశ్చంద్రుఁడు—ప్రభువులార! విధి బలీయము. దానిముం దెట్టివాని బుద్ధిసంపదయును బొదలం జాలదు. ఎవ్వియేవేళల నెవ్వ రెవరికి నెయ్యవి సమకూడ వలయునో తత్తత్కాలంబుల న్వారివారి కవి సమకూడఁ గలవు. మనపరితాపంబులవలనఁ బ్రయోజనము లేదు. కాలానుసారములై సుఖదుఃఖములు శరీరికి వ్యత్యస్తస్థితులఁ జెందుచుండును. తదనుగుణముగనే శరీర మేర్పడుటయును. ఇ వన్నియుఁ బిండోత్పత్తికాలముననే నిర్ణయింపఁ బడినవి.

పౌరులు—మాయిలువేల్పా! ధ్వజపరిశోభిత దివ్యరథంబును జతురంగ సేనాబలంబును విడనాడి దేవరవారు పాదచారులై పోవుటంజూచుట కీమా చక్షువులు తొల్లి యేమిముల నెట్టి దోసఁగులఁ జేసినవో!

ఉ. సల్లలితప్రతాప! ఘన-సత్యవచోరచనాకలాప! మీ
చల్లఁదనంబునం బ్రదికి - సమ్మద మొందఁగ నేఁటిదాఁక నే
మెల్ల మనోరథంబులు న-హీనతఁ గల్గఁగ సౌఖ్యవృత్తిపైఁ
దల్లిదండ్రులంగు బిడ్డలవి-ధంబున నుంటిమి యేపు చూపుచున్!

నేఁ డిట్లు మమ్ము విడనాడం దలంతురా? తలఁచితిరి పో యీకో
వనుం డగుమునిపాలం బడవైచి పోవం బాడియా? మామాట లటు
లుండ నిండు. కుసుమకోమలి యగునిమ్మానినీమణి వనవాసం బెట్లు
చేయం గలదు.

సీ. ఆరామవిహరణం-బాయాస మనులేమ, యుగ్రాటవుల నెట్టు - లుదరఁ గలదు
మగవారిఁ గనినఁ దా - మఱుఁగు చేరెడుగోల, నడివీధి నేరీతి - నడవఁ గలదు
సఖులకోలాహల-స్వనము లోర్వనిచాన, వనమృగారవము లె-ట్లంగి నోర్చు
మణిహర్మ్యతలముల - మహితరీతులఁ బొల్చు, నింతి కంటకభూమి - నెట్లు మెలఁగు
నీలకంఠములకు - నృత్యంబు గఱపుచు, నలసి తలఁగి పోవు-నలరుబోఁడి
బడల కెట్టు లుండు - వనవాసభేదంబు, గడలుకొనఁగ? నలువ - కఠినుఁ డకట!

ఔరా! రూపజితకంతుం డగునిబ్బాలుండును మిమ్మనుగమించుఁగాదే!
ఎవనిముఖేందుబింబంబు చూచినంతన మాయుల్లంబు పల్లవించునో,
యెవనివాఙ్మరందంబులు వీనులం గ్రోలినంతన హృదయతాపంబు
లెల్లఁ జల్లాఱునో యట్టితమపుత్త్రరత్నంబు దీనత నడవులం బడి
యడలంగ వలసెఁగా! యౌవరాజ్యపట్టాభిషిక్తుం డగునిక్కుమార
రత్నంబుఁ గాంచి యానందించుభాగ్యంబు మాకుఁ జేకూర దయ్యె!
ఒరుల దూఱ నేల? మేము మందభాగ్యుల మనుట నిస్సంశయంబు.

హరిశ్చంద్రుఁడు—నాగరికులార! తక్కువ యేది? ఎక్కువ యేది?
ఇప్పటి మాస్థితిని గన్నారుకద! ఇదియే నిత్యము; ఉత్తమము.
మునివరులపాలనంబున సకలసౌఖ్యమ్ముల నందుచు నుత్సాహవంతు
లై పొదలు చుందురు. మీరు భయ మందం బని లేదు.

ఉ. తోయజగర్భతోడఁ దులఁ - దూఁగఁగ నొప్పెడుపుణ్యమూర్తి గా
ధేయుఁడు; మీర లీతనియు-దీర్ణమహత్త్వ మెఱుంగ లేరు; గాం
గేయవసుంధరాధరము - గెంటిన గెంటు నమర్త్యసన్నుతా
మేయతపఃప్రభావమున - మిక్కిలిమేటి మునీంద్రకోటిలోన్.

(సాఁగుచున్నాఁడు.)



ఇతరులు—(హరిశ్చంద్రాదులు పోవుటంగాంచి సామాన్యలోకాఁపులు)
ఆహా! మన ప్రభువున కని యేర్పడిన కాలమే కాలము! ఈ ముని
తన్నడిగినవాని నన్నిఁటిని బ్రీతిపూర్వకముగ నిచ్చినట్టి మనరాజున
కీదృశదురవస్థ రా వచ్చునా! ఆహా!

ఉ. కొంచక రాజ్యముం గొనుచుఁ - గ్రూరత భూధవుఁ గాననంబులన్
సంచరణంబు నేయు మని - సంయమి పంచె! విధాతృఁ డౌర కా
వించెడుకార్యము ల్నగుడ-వే! యవి పాయఁగ నెవ్వఁ డోపు! మా
కించుకయేనిఁ బ్రాపు గల-దే యిఁక మాకు సుఖంబు గల్గునే!

ఇట్లు మహాసార్వభౌములు పరదేశులవలె దేశాటనమునకుఁ బో
వుటం జూచియు నీకోపనునకు మనస్సు కరఁగినది గాదు. ఇట్టి
వాఁడా మనకు మేలు చేయువాఁడు? ఈ దేశమునకే దురదృష్టము
పట్టుకొన్నది. మన మిక్కడనే యుండవలెనా? మన మెట్లు కాలంబు
గడప వలయునో తెలియకున్నది. ఇట్టి పుణ్యాత్మునికే యీగతి
గలుగఁగా మనగతులకు మేర యేది? మనుష్యజీవిత మంతయు
నింతే! ఈ సతీసుతులఁ జూచిన నెవ్వారికి భావంబు వ్రయ్యలు గాక
పోవు!

ఉ. ఎన్నఁడు నెండకన్నెఱుఁగ - కెంతయు వైభవలీలఁ గ్రాలునీ
యన్నులమిన్న కోమలల-తాంగి వనస్థలి నొవ్వ నయ్యె! నా
పన్నత సర్వలక్షణశు-భప్రతిముం డగుబాలుఁ డిట్లు పో
వ న్నయనంబు లెట్లు గను - బాష్పనిరోధితపాటవస్థితిన్!

(వ్యసనపడెదరు.)

విశ్వామిత్రుఁడు—మంత్రీ! సత్యకీర్తి! మీ రెప్పుడు వచ్చిరి?
సత్యకీర్తి—స్వామీ! చిత్తము! ఇప్పుడ వచ్చిరి.
విశ్వామిత్రుఁడు—వింటివా యిచ్చో జరగినసంభాషణములను? హరి
శ్చంద్రుఁ డింకను నిచ్చోట నున్న నీ సామంతులు లోనగువా రిచ్చ

టనే నన్ను సింహాసనమునకు బలి యిత్తు రని తోఁచెడిని. ఏ మన్యాయము! మాయెదుట నిట్లెల్ల యీహరిశ్చంద్రు నింత పొగడి పొగడి మాటలాడిరి. అయిన నేమి! మన మిఁక నూర కుండ రాదు. దీనికిఁ దగిన యేర్పాటులు చేయుట యుత్తమము. అట్లు లేకున్న నలు ప్రక్కలను రాజద్రోహులు ప్రబలి, యంతఃకలహముల కెడ మగును. కాఁబట్టి మనమీక్షణమే ప్రసిద్ధపత్రమును బ్రకటించి తీఱవలెను. ఆవివర మాచండాలాదిబ్రహ్మపర్యంతము నెల్ల రెఱుఁగునట్లు చాటింపవలెను. ఏమి చెప్పెదవు?

సత్యకీర్తి—స్వామీ! మీరు తమకుఁ గలస్వామిభక్తి పారవశ్యంబునం జేసి తామిట్లు పలికిరి. మఱెట్టి నీచబుద్ధిచేతఁ గాదు. అప్పుడే రాజుగారును వారివారికిఁ దగిన ట్లుత్తరము లిచ్చి ప్రబోధించిరి గాదె. దేవరవారి చిత్తమునకు వెలిగా నేమియు జరగదు. ఎట్లైనను దేవరవారి యాజ్ఞానుసారము ప్రకటించుటయును మంచిదే.

విశ్వామిత్రుఁడు—బాగు. బాగు. అట్లయినచో నీవు వలసినది లేదు. ఓరి శిష్యా! దాని నీవు చాటింతువు గాక!

శిష్యులు—(విశ్వామిత్రుఁ డిచ్చుదానిఁ దీసికొని చదువు చున్నాఁడు.) ఈ యయోధ్యారాజ్యమును జేరిన సామంతులు, మంత్రులు, ప్రభువులు, దండనాథులు, పౌరులు, మొదలయినవారు దెలిసి నడచుకొనునట్లు, విశ్వామిత్ర మహామునుల మగు మేము దెలిపించుట యేమనఁగా:—హరిశ్చంద్రరాజు తనరాజ్యభారమును రోసి మాయధీనంబు చేసిన యంశము నింతకుఁ బూర్వమే మీకుఁ దెలిసియున్నయది. ఇఁక మీర లందఱు మాయాజ్ఞలకు లోఁబడి నడచుకొన వలయును. మీలో నెవ్వండును హరిశ్చంద్రరాజున కేనెపము మీఁదను ధనసాహాయ్య మేమియును జేయ రాదు. పోయి, చూచి



పలికి, వచ్చుటయును దగదు. ఎవఁడయినను మాయాన మీఱి నడచెనా వానిస్థిరచరాస్తుల నన్నిఁటిని, రాజాంగమువారు స్వాధీనపఱుచుకొనుటయె కాక వానిని రాజ్యమునుండి తొలఁగింతురు. ఇఁకముందు మాకుఁ జెల్లింపఁ గల పన్ను మొదలైనవానిని గాలాతిక్రమణదోషములకుఁ జోటీక చెల్లించుచు వత్తురు గాక.

ఇట్లు:

విశ్వామిత్ర మహామునులవారు.

విశ్వామిత్రుఁడు—గాలవా! దీని దేశమం దంతటను జాటింతువు గాక!

సేవక—స్వామీ! ఆజ్ఞానుసారము చేసెదను.

(ప్రతీహారి చాటింప నిష్క్రమించు చున్నాఁడు.)

సత్యకీర్తి—మునినాయక! విధేయుఁడను హరిశ్చంద్ర మహీనాయకులను దర్శింపఁ గోరెదను. అనుగ్రహించి యుత్తర వొసఁగుదురు గాక.

విశ్వామిత్రుఁడు—సత్యకీర్తి! నీవె మనప్రకటనమునందలి విధులకు మీఱి నడచుకొందువేని నితరు లేమగుదురు? దీనిం జూడఁ గంచెయే చేను మేసిన విధంబు గాదె?

సత్యకీర్తి—స్వామీ! నే నేమి చేయుటకుఁ గోరినవాఁడను గాను. వారిని దర్శించి వచ్చుటకు మాత్ర ముత్తరు విచ్చినఁ జాలును.

విశ్వామిత్రుఁడు—అది యెంతటికిని గూడని పని. నీకుమాత్ర మొకటి మఱొకని కొకటిగా విధించుట గూడదు. ఆహరిశ్చంద్రునిఁ జూడఁ గోరువా రెట్టివారైనను మాయాజ్ఞానుసారమే చేసి, మఱి కాలెత్తి పెట్ట వలయును. అట్లు పోయినవారలు మరల నీ రాజ్యమునకు రా నర్హులు గారు.

సత్యకీర్తి—మునినాథ! దేవరవారిదివ్యచిత్తానుసారమే చేయువాఁడ. ఇఁక వెడలెదను. (అని వస్త్రాభరణాదుల నర్పించి నిష్క్రమించును.)

ఇది ద్వితీయరంగము.

## తృతీయరంగము.

స్థలము : నగరునందలి యొకభాగము.

కాలము : సాయాహ్నము.

పాత్రము : విశ్వామిత్రుఁడు.

విశ్వామిత్రుఁడు—ఆహా, యేమి వింత! దివ్యతీర్థ మని స్నాన మాడఁ బోయి యొడలి కంతయుఁ బెనురొంపి నలందికొని వచ్చిన ట్లైనది గదా మాగతి. వసిష్ఠుని జయింపఁ దలఁచి, జగత్తనెడుపెనువాగుర యందుఁ బడి తగులుకొంటిమి. ఒకచిన్నసంసారమునే సాగర సమాన మని చెప్పఁ నపు డింతటిగొప్పరాజ్యభారమున కెద్దానిఁ బోల్ప నగును? పూర్వము మేము భరింపని రాజ్యమా యిది? అందలి హింసలనెల్ల భావించి పరిత్యజించియే కద యీ యుత్తమస్థితికి వచ్చినారము. ప్రకృతము ముందువెన్కల నాలోచింపక యీపెనుబరువును దలపై నెక్కించుకొంటిమి. ఏమి యాటలబుద్ధి? ఇంక మాతపమంతయును దాప మయి ముగించెనే! ఇఁక నేమి చేయ వచ్చును? ఈ హరిశ్చంద్రుని శీలచ్యుతునిఁ గావింప నెన్నోసూత్రములఁ బన్నినారము. అవన్నియుఁ గొనసాగినవి గావు. అప్పుడే యాచిగురుఁబోణులవలఁ దగిలి యుండెనేని నదియె వాని మిగులు సద్వ్రతములనుండి భ్రష్టునిఁ గావించుటకుఁ బూర్వసూచకముగా నుండును. స్త్రీల జయించినవాఁడు మఱిజగత్తున దేని జయింపఁడు? ఇఁక దుశ్చరితములు మాయెడలఁ గలవు గాని వీనియెడ నించు కంతయైనఁ జూపట్టవు.



ఉ. సర్వము రోసి కానలను - సంతతముం దప మాచరించుమా
గర్వము నూడ్చి నమ్మరుని-కాండము; లెంతటివాఁడు వీఁ? డటం
చుర్విపుఁ దప్ప నెన్నితి; న-నూనగుణాకరుఁ డీతఁ డౌర యా
శర్వుని నైన నోర్చు నయ-సాంద్రమతిస్థిరతావిభూతిచేఁ!

అపాయంబున కుపాయంబు చింతింపఁ బోయి యుపాయంబునన యుపాయంబుఁ దెచ్చికొన్నవాని కథకు మాచర్య సామ్య మైనది. ఎట్లయ్యు నింతలో నిట్లు చిత్తస్థైర్యంబు దొఱంగుట పాడి గాదు. ఉపాయాతిరిక్త మయినకార్య మేదియును లేదు. హరిశ్చంద్రుఁడు మాకుఁ జేర్పఁ గల యీగొప్పమొత్తము నెట్లు చేర్పించువాఁడు? ఈ యంశమునందుఁ దప్పక వాఁడు తనమాటఁ జెల్లింపలేనివాఁడ యగును. అందువలన మేము జయం బొందఁ గలము. ఇంకను గొన్నికార్యసూత్రములను బన్ని, యచ్చ టచ్చట హరిశ్చంద్రు నెడలఁ బ్రయుక్త పఱుప మాశిష్యులనే నిర్ణయింప వలసినది కర్తవ్యము. (అని వెడలును.)

ఇది తృతీయరంగము.

## చతుర్థరంగము.

స్థలము : అయోధ్యకుఁ జేరినయొక తోఁపు.

కాలము : మధ్యాహ్నము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, నక్షత్రేశుఁడు, పరమానందుఁడు.

పరమానందుఁడు—(వేగముగాఁ బరుగిడి వచ్చి హరిశ్చంద్రుని దగ్గఱి) ఓ భద్రుఁడా! (మోము పైఁ జేతులు సేర్చి మొఱ లిడుచున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మీ రెవరు! ఏల వ్యసనపడెదరు?

పరమానందుఁడు—ఓ భద్రుఁడా! నే నయోధ్యానగరవాసిని. దేవర వారి తల్లిగారిస్థితినిగూర్చి తమ కెఱుకపఱుచుట కిట్లు పరుగిడి వచ్చిన వాఁడను. దయచేసి, యిప్పుడే వచ్చెదరు గాక!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మాతల్లిగారిస్థితి యేమి? ఉన్నదానిని వ్యసనపడక చెప్పుఁడు. ఏమి సంభవించెను? మాజనయిత్రిగారి కేమి?

పరమానందుఁడు—రాజేంద్రా! నే నేమని చెప్పఁ గలను? అయ్యో! నాలుక రాదే! తమతల్లిగారు మీప్రవాసమునుగూర్చి కన్నీరు మున్నీరుగాఁ బరిదేవించుచు నాహారాదులను మాని పడి యుండు వారు. ఎత్తువారును బట్టువారును లేక పరితపించుచున్నారు. తమ నామధేయమునే జపించుచు వేసట నొందుచున్నారు. మాదృశులు సమీపించి యేమి కావలయు నని యడిగిన మీ నామోచ్చారణమును జేసి, కన్నులు మూసి మౌనము భజించెదరు. మీరు వచ్చినట్లు చెప్పితిమా, కర్ణ్లు దెఱచి నలువలఁకులఁ దమ దివ్యవిగ్రహదర్శనార్థము దృష్టిని బ్రసరింపఁజేసెదరు. అంతట మిమ్ముం జూడ లేక, యక్షిముద్రల నవధరించెదరు. తుదకు "నాపుత్త్రిరత్నమును గనఁ బఱుపుఁడీ" యని సమీపస్థులను హీనస్వనమున బతిమాలెదరు. దేవరవారి నర్మసచివుఁడు జననిగారిసమీపమునం దుండ నీక, యితర కార్యములమీఁదఁ బంపఁబడినాఁడు; కావున, విధేయుఁడనై దేవర వారిని వెదకుచు దప్పుదప్పునఁ బరుగిడి వచ్చినాఁడను. దయ చేసి యిప్పుడే బయలుదేఱి రం డని ప్రార్థించెదను.

హరిశ్చంద్రుఁడు—(క్రీఁ జూపులతో వ్యసన మభినయించి కన్నీటితో) నా తల్లిగారిని దేర్చి ధైర్యము చెప్పఁగలిగిన వా రెవరు నచ్చోట లేరా? ఏమికాలము!



క. కాలము నే మన వచ్చును, గాలము గాలంబ పోలుఁ - గా కొంటికి నీ
లీలలు గలవే లెస్సఁగ, నాలోకింప నిది హితము - నభిమతము నగుణా.

పరమానందుఁడు—రాజేంద్ర! ఏమి చెప్పుదును. దగ్గఱించు వాఁ డొకఁడును లేఁడు. నేను నీఁక నొకరిద్దఱును మాత్రమే యివ్విషయమును విని పరుగెత్తినారము. ఆహార మించుకయు లేక పుడమిపైఁ బడి పొర్లాడుచున్నారు. ఎత్తి కూర్చుండఁ బెట్టి మావలన నైనంతమట్టున కుపచరించి, పలువగ లూఱటఁ జెందుపలుకులు పలికియుఁ బ్రయోజనమును గని నారము గాము. అయ్యయో! ఇంతలో వా రెట్టిస్థితియం దుండువారో! దేవరవా రీక్షణమే బయలుదేఱి వచ్చునది. వచ్చిన మీదర్శనమాత్రమున జాడ్యము తీఱును. పుత్త్రివియోగ శోకమువద్ద మఱేజాడ్యమును లేదు.

చంద్రమతి—అయ్యో తల్లీ! ఏమిగతి తమకు! అనదతన మనుభవింపనా? ఓహతవిధీ! మాయత్త కిట్టిగతియు సంభవించునా? ప్రాణనాథా! మీరలేయిట్లు వ్యసనవారాశిమగ్నులైనచో మాబోటివారి నననేల?

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఆలస్యము చేయుటవలనఁ బ్రయోజన మేమి? ఆయమ్మయుఁ గన్నీరు వదలెను. నీవును గలఁతఁ జెందెదవు. మీ మోముదమ్ము లెమ్మె దప్పుటం గని, యీ కుమారుఁడు నుమ్మలికఁ జెందుచున్నాఁడు. ఇట్టి వెతలఁ గుందిన నే కార్యము సాధ్య మగును? ఏదో యొక సంకటము సంభవించిన సమయములయందుఁ బుత్త్రులు ధైర్యంబు దాల్చి కార్యసంవిధానంబునకుఁ బూన వలదా? కర్తవ్యంబుఁ దలఁపక యిట్లుదంతంబుఁ దెచ్చిన దౌవారికునిఁ బలుపలువగల ప్రశ్న లడుగుటవలన ఫల మేమి? దానివలనఁ గాఁ దగిన పని యేది? ఎది ముగించును?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇప్పు డేమి నాకృత్యము? ఇరుప్రక్కలఁ గొఱవిఁ జిక్కిన చీమవిధంబునఁ దపించెదను. కరణీయ మిట్టిదని గోచరించినది గాదు.

నక్షత్రేశుఁడు —సరి. సరి. బాగుగా నున్నది. అవశ్యాచరణీయ మిది యని గోచరించినది గాదా! పాపము. జనని పుత్త్రవాత్సల్యంబునఁ బ్రాణపరిత్యాగ మొనరించుకొను చున్నది. ఈ దృశావస్థను విని యేమియుఁ దోఁచ లేద నెదవే! ఇది సత్పుత్త్రుల కందమా? ఏ దైవమున కిది సమ్మత మగును? “తల్లిదండ్రులు మొదటిదైవము” లను నంశము నీ విన్నది కాదో?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మీమాట లన్నియు న్యాయచోదితములే! నే నిప్పు డేమి సేయ వచ్చును? నగరపు టెల్ల దాఁటి చాలదూరము వచ్చినారము.

నక్షత్రేశుఁడు—ఎల్ల దాఁటి వచ్చిన నేమి? మునిఁగి పోయినదా? ఈ సంగతి విన్నది మొదలుకొని నామనస్సే పరితపించుచున్నదే! నీ విప్పు డీ వన్నియుఁ దలపోయ నగునా! ఇప్పుడే పోయి ముఖమును జూపితి వేని నీతల్లికిఁ బ్రాణములు గుదుటఁ బడం గలవు. పిమ్మట వలయునన్ని ధైర్యములను జెప్పి మరల వచ్చును. బయలు దేఱుము. నేనును వచ్చెదను. పాపము! నీ యిల్లాలు సైతము చింతిల్లు చున్నది!

పరమానందుఁడు—ఔను. ఔను. మహారాజులం గాంచినదే యామె బ్రదుకఁ గలదు. ఇది నిశ్చయము.

నక్షత్రేశుఁడు—వింటివా! హరిశ్చంద్ర! ఇంక నేమి యోచన! బయలు దేఱుము పోయి వచ్చెదము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! తమ రి ట్లేల సెలవిచ్చెదరు? మే మయోధ్య నుండి వెడలుకాలమున మునివరులయుప్పు దీర్పక మరల నయోధ్యయం దడు గెత్తిపెట్టుట లే దని నే నాడి వచ్చినది తమకు జ్ఞాపకము లేదా? దానికి విరుద్ధముగ నిపు డెట్లు ప్రవర్తింప వచ్చును. నాజన



యిత్రిగారి కట్టి యంతిమదశ యుత్పాదిల్ల వలె నని సర్వేశ్వరుని చిత్తవృత్తి యైనచో నిపు డేమి చేయ వచ్చును? భగవదాజ్ఞ దుర్లంఘ్యము.

తే. వఱదఁ బడి కొట్టుకొనిపోవఁ - బడినవాఁడు, గట్టు చేరెదు త్రోవను - గాంచనట్లు
నరుఁడు కర్మప్రవాహంబు-నడుమఁ జిక్కి, తత్తఱిల్లును మూఢత - ధైర్య మెడలి.

తే. అకట రాజ్యంబుఁ దొఱఁగితి - నఖిలవైభ
వంబులను గోలుపోయితి - వనితతోడ
సుతునితోఁ గాన విహరించి - వెతలు గుడువ
నొప్పితిని సత్యమును బాయ - నోప నెపుడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఈ సందర్భమున నిట్లు తలపోయఁ దగునే? జీవములకన్నను సకలవేదాగమోపపాదిత నిర్ణయంబులకన్న మిన్న తన్నుఁ గన్నమాతృదేవత. అట్టి పవిత్రజననిని వధించుట జ్ఞానవృద్ధుల సమ్మతముగాదు. ఏ వేదము “సత్యంవద” యని యుద్ఘోషించునో యావేదమే “మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ” అని వాకొనునెడఁ దల్లిని దేవతగాఁ బ్రశంసించుచుండెడిని. హరిశ్చంద్ర! వింటివా? అట్టి వేద సంభావనీయ యగు జనయిత్రి తనకు జన్మ మొసఁగిన వెనుకయే నరుఁడు సర్వధర్మపరిపాలనకును సమర్థుఁ డగుట. గోడలేని చిత్రము గలదా? కాఁబట్టి సత్యవ్రతంబుకంటెను మాతృపరిపాలనంబు పరమార్థ మగును. ఇది మహాధర్మసూక్ష్మము. ధర్మజ్ఞు లిట్టిసూక్ష్మాభిప్రాయముల నవలంబించియే యాచంద్రార్కముగఁ గీర్తిశేషులై వెలసెదరు.

వ. అనయము సైఁప రానివిపు-లార్తికిఁ జిక్కిన నెమ్మనంబుఁ దా
ననువునఁ దేర్పలేమి నిటు - లంగదఁ గూలెదు తల్లిఁ బ్రోవ నె
న్ననినిను నే మనంగి? నర-నాయక నీమన మశ్మసన్నిభం
బనుట నెఱుంగ నయ్యె; భళి-రా నిను నెవ్వఁడు పోలు ధారుణిన్!

అదియునుగాక. ""మనము తిరిగి రాము."" అని ప్రతిన చేసినారము నిజమే! ఇట్టి దుర్నిరీక్షిత మైనయాపద సంభవించు నని భావించి నారమా? నీ కీ నిబంధనములచే హృదయము ఱాయి యైనను స్త్రీలస్వాభావిక హృదయమార్దవ మెట్లు దొలఁగును. వలదు. ఇది జీవములున్నంతకాలము హృదయమును బరివేదనములపాలు పఱుచుచుండును. అందుచేత నొక దోషమును లేదు. బయలుదేఱుము పోవుదము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! సత్యమే మాట. సూక్ష్మశరీరికి సూక్ష్మశరీరియే శాశ్వతుఁడైన ""అహమ్"" శబ్దవాచ్యుఁడు. ఇట్టి పరమజననినే పరిపాలించుట యొప్పును. స్థూలశరీరము క్షణభంగురము. అట్టినశ్వరశరీరమునకు సంబంధించిన తల్లికొఱకు శాశ్వతజననిని జంపుకొన వచ్చునా? అట్లు చేయుట కే నొప్పను. ఆదియునుంగాక యెక్కాలమున నేదేది యెట్లెట్లు జరగ వలయునో యక్కాలమునం దయ్యది యట్లు జరిగియే తీఱును. ఉదయించువానిఁ బ్రతిరోధించువాఁ డెవఁడు. మరణించువానిని మాన్పువాఁ డెవఁడు? అన్నియును బరమేశ్వరునికృపావిశేష మనుసరించి పరిఢవిల్లును. దానికి వైకల్య మొందుట యజ్ఞానము.

క. విను కర్మం బొనరించును, జననము మరణంబు నదియ - సౌఖ్యము దుఃఖం
బును గావించుం; దనచే, సినదానం బడక పోవ - శివునకు వశమే?

కావున ధీరుండు సుఖదుఃఖంబులకుఁ గలంగ కుండువాఁడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! నీవంటికఠినహృదయు నే నెక్కడను జూచి నాఁడను గాను. మహాజ్ఞానులును దమతమతల్లులమరణము విన్నంత విలపించుట విశ్వప్రసిద్ధము. దానిని సైతము ధిక్కరించెదవె! నీ హృదయమునకుఁ దుల్యము నీ హృదయమె!



హరిశ్చంద్రుఁడు—స్వామీ! అట్లు తలపోయ రాదు. నామది యింగలము సోఁకినమైనమువలెఁ గఱఁగుచున్నది. చెప్పినమాట యొక్కటియే యడ్డపడుచున్నది. ఆమాటను ధిక్కరించి నడవ మనస్సు కొంచెమేనియు సమ్మతించినది గాదు.

నక్షత్రేశుఁడు—అమ్మా! నీయజమానునిచిత్తవృత్తిఁ గంటివి గద! ఇక నీవేనియుఁ బుత్త్రసహిత వై పోయినచో నీ యత్త శోకతీరుతనివి గలుగ వచ్చును. నీ నాయకునివలె నీవును బ్రతినచేయ లేదు గద!

చంద్రమతి—స్వామీ! పత్ని పతికి మీఱినది గాదు. తన కనియించుకేనియు స్వాతంత్ర్యాతిశయము కలిగినది గాదు. కాఁబట్టి కాంతున కేర్పడినదే కాంతకును. నాయకునకుఁ గానిదే నాయికకును గానిది. ఇదియే సకలశాస్త్ర సమ్మత మైన దని దేవరవారిని బోలినపెద్దలు చెప్పఁ దద్దయు విని యున్నదానను. కాఁబట్టి నాహృదయేశుని పూన్కియే నాకు నవశ్యాచరణీయంబు. మా పుత్త్రుఁ డన్ననో మాకు వేఱుపడినవాఁడు గాఁడు. అందుచే వాఁడును దండ్రియాడిన మాటఁ బాలింప వలసినవాఁడు. కావున మేము మువ్వుర మేకమార్గమునన చరింప నొప్పు. ఏమి చేయ నగును? అన్నియు భగవంతుని దివ్యచిత్తమే యని తలఁచి మిన్నకుండ వలయును.

నక్షత్రేశుఁడు—అట్లయిన సరి. నీవు పురుషునకు మేలుబంతి యగు నింతివి. నే నేమొ నీవలన నైనను హరిశ్చంద్రుఁడు గదలు నని చూచితిని. అదియును గాలేదు. నా కేమి? అయ్యో, పాపము! ఒక యాత్మ పరితపించుచున్నదే యని పరితాపము గొని చెప్పితిని. ఇంత దూరము వెదకులాడుచు వచ్చినవానికిఁ బనిలేదు. వాఁ డొకవెఱ్ఱి వాఁడు. (పరమానందునిఁ జూచి) ఏ మయ్యా! వింటివా యిదివఱ కాడఁ బడినజ్ఞానవాక్యములను? నీవు వచ్చినదారిఁ బట్టి పో వచ్చును.

పరమానందుఁడు—రాజా! విధేయుని కేమి యాజ్ఞ? తమరు వచ్చి మోముఁ జూపితిరా క్షణమాత్రమున నే మీతల్లికి శోకవిమోచన మగును. ఆమెకు మనోజాడ్యము దప్ప మఱొకజాడ్యము లేదు.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! తమదయకును శ్రమకును నే నేమి ప్రతి చేయఁ గలను? నేను మరలి యయోధ్యయం దడు గెత్తి పెట్టఁ దగిన స్థితియందు లేదు. తా మనుగ్రహించి నాయమ్మ నిచ్చటికి మోఁచికొని తెచ్చితి రేని, నే నెప్పటికి నా మేలును మఱచువాఁడను గాను. ఇ దొకటియే నేను మీకుం జేయఁ గలిగినవిన్నపము. దయ చేయవలెను.

పరమానందుఁడు—అధిపా! అట్లే చేయ వచ్చును. అందును దగ్గఱనుండి కొంచము సహాయపడువా రెవరును లేరు. అంతలోపల నామె స్థితి యెట్లుండునో తెలియదు. ఐనప్పటికిని విధేయుఁడు శక్తిలోపము చేయఁడు. పోయి వచ్చెదను.

నక్షత్రేశుఁడు—(పరమానందునితో రహస్యముగ) పరమానందా! చూచితివిగాదే యీ మహీపాలుని చిత్తస్థైర్యము! ఇట్టి వాని నెట్లు మనము జయింపఁ గల్గుదుము. ఆనారీమణియును సత్యమునందే దృష్టి యుంచి యున్నది. పోయి మన మునివరుల కీవిషయమును వివరముగాఁ జెప్పుదువుగాక.

పరమానందుఁడు—ఆత్రపడకుము. మునివరులపన్నుగడలలో నిది యొకటి. దీనియం దితఁడు తప్పించుకొనిన నేమి? ఇంకను జూచెదము. ఇఁకఁ బోయి వచ్చెదను.

(అందఱు వెడలెదరు.)

ఇది చతుర్థరంగము.

---



## పంచమరంగము.

---

స్థలము: సరయూనదీతీరము.

కాలము: సాయాహ్నము.

పాత్రములు: నక్షత్రేశుఁడు, హరిశ్చంద్రుఁడు, దేవదాసుఁడు, చంద్రమతి, సత్యకీర్తి.

---

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర, మన మిదే సరయూనదీతీరమును జేరితిమి. ఇదె భానుఁడును నపరవారాశితీరముఁ జేరుచున్నాఁడు. ఈ దినమున నిందే తామసింప వలయును. ఇంకఁ దమఃపటలము గ్రమ్మి రేయి భయావహమై యుండును. రాత్రి సంచారయోగ్యము కాదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! అట్లే చేయుదము. ఈ రేయి యిచటఁ బో నిచ్చి రేపటివేళనే బయలు వెడలుదము.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఏమికాలము! మన మేల యిట్టికష్టపరంపరలకుఁ జోటీయ వలయును? కష్టసుఖములు మనము దెచ్చి పెట్టుకొనునవిగాని, తాముగా వచ్చునవి గావు. ఇదిబుద్ధిమంతునకు విదితమైనయంశము. ఇంచుకయును యోజింపక నీవు చేసినకార్యమునకై యెందఱు హింసలపాలు గావలసి యున్నారో! అయ్యో! ఈ బిడ్డని శరీరము వాడియుండుటను జూచి, యేపాపి యోర్వఁ గలఁడు? నీ దేవిగారిస్థితియా చెప్పి తీఱదు. ఇట్టి మీ కష్టములఁ జూచి క్రుగ్గుటకా నేను మీతోడ వచ్చినది! ఇ వన్నియు నీయవివేకకార్యఫలంబులు. ఏ మన్యాయము! అయ్యో! ఈ పెనుమంచు గుమ్మరించు నీచెట్టుక్రింద రేయి యంతయు నెట్లు వెడలఁ బుచ్చుట?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఒకదినమునందే రేయియును బవలును మాఱునట్లు, శరీరధారికి సుఖదుఃఖములు మాఱిమాఱి వచ్చునవి.

క. ప్రియములు వాయుటయును న, ప్రియములు వెసఁ బొందుటయును - బెల్లుగ నగుఁ ద
త్క్రియలందు మూఢమతికి హృ, దయతాపము వాయ దెపుడు - దరికొని మండున్.

కావున నుత్తమజ్ఞానసంపన్నులు సుఖదుఃఖములయెడ సమదర్శను లగుదురు. వారు నిర్ద్వంద్వులు. శీతోష్ణములు, గృహగహనములు, సుహృద్భావశాత్రవభావములు, కలిమిలేములు, సుఖదుఃఖములును, వారికిఁ దుల్యములు. ఇందలి కష్టముల కులికి యకృత్యములకు లోఁ బడరు. కాఁబట్టి వీనికి బద్ధుఁ డయి యెట్టివాఁడును మోక్షమును జేవిడువ రాదు. మావలన దేవరవారికి మనస్సంకటములు సంభవించుట యథార్థమే. ఏమి చేయ వచ్చును? సహాయమునకు సమ్మతించి, తోడ్పడ వచ్చిన వారికిని దుఃఖపరంపరలు దోఁచుట సహజమే. అందువలనఁ జిత్తగించి మమ్ము క్షమింతురుగాక.

నక్షత్రేశుఁడు—సరి. సరి. వచ్చి యారెను. ఇఁక వీని నన్నిఁటిని జెప్పి నందున లాభ మేమి? నీవు చెప్పునది నిజమే. మీకు సమ్మతముగా నుండిన ననుభవించియే తీఱవలయును. మ తెట్లు మునివరులకు ధన మబ్బుట?

హరిశ్చంద్రుఁడు—ప్రాణేశ్వరీ! చంద్రమతి! ఈ మహీరుహచ్ఛాయ నందగించునిసుకదిబ్బపై బాలకునితోడఁ గొంత విశ్రమింపుము.

చంద్రమతి—ప్రాణేశా! దేవరవారును నిచ్చోటనే యుపవిష్టులు గా వచ్చును.

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే చేసెదను. (కూర్చుండును.)

(సత్యకీర్తి ప్రవేశించుచున్నాఁడు.)

సత్యకీర్తి—వసుమతీకాంతా! వందనములు.

హరిశ్చంద్రుఁడు—హా! నీ రెవరు? మన మంత్రిగారు సత్యకీర్తియా?



సత్యకీర్తి—ఔను, ప్రభూ! విధేయుఁడను సత్యకీర్తినే!

హరిశ్చంద్రుఁడు—ఆహా! ఇ దేమి చిత్రము మంత్రీ! మీ రేల యిచ్చటికి వచ్చినారు. రాజ్యమునం దుండి మునివరేణ్యులకుఁ బరిపాలనాక్లేశము దోఁపనీక రాజ్యతంత్రముల నిర్వహింపఁ గల రనునమ్మకముతోడనే కద మిము నచట వదలి వచ్చుట. తమ రిట్లు వచ్చుట యుక్తమా? అదియునుగాక రూపము చెడి వేసము చెడి యేల రా వలయును?

సత్యకీర్తి—ఇట్లు రావలసిన సమయము తటస్థించినప్పు డేమి చేయవచ్చును?

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! మీరును వైరాగ్యమును గొంటిరా?

సత్యకీర్తి—లేదు, దేవరా! మునివరులే విధేయుని విరాగునిగఁ జేసిరి.

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! ఆఋషిపుంగవులయుపదేశంబుఁ జెంది యీ వైరాగ్యమును గొంటిరా?

సత్యకీర్తి—రాజేంద్ర! మునివరులు దేవరవారిని నిజముగా వైరాగ్యబంధురులుగాఁ జేసిరి. న న్నన్నో బూటకములవిరాగిగాఁ జేసిరి. జరగినదాని మనవి చేసెదను. చిత్తగించి విన వలయును. దేవరవారయోధ్యనుండి వెడలినంత మునివరు లచ్చోట నున్నయితరులను గాంచి, వారియెడల నసూయయు, నపనమ్మకమును నిరూపింప మొదలిడిరి.

హరిశ్చంద్రుఁడు—వా రట్లు భావింపఁ బడుట కేమి చేసిరి?

సత్యకీర్తి—వా రేమియుఁ జేసినారు కారు, సార్వభౌమా! తమ వియోగము దుస్సహ మగుటంబట్టి వ్యసన మొందిరి. అదియే వారు మునివరుల కొనర్చిన యపకృతి.

హరిశ్చంద్రుఁడు—ఇంకను జరగిన దేమి?

సత్యకీర్తి—మునివరు లెల్లరపై ననూయ గొన్నదే కాక, దేవరవారిఁ జూచునిమిత్తమె కోరును బోరా దనియు, నీయాజ్ఞను మీఱువారు రాజ్యభ్రష్టులు గావింపఁబడుదు రనియు, నట్టివారి జంగమ స్థావర ద్రవ్యంబులు రాజ్యాంగమునకుఁ బరివర్తనము చేయఁబడు ననియు, నగరమునుండి యిల్లుతొలఁగింపఁబడినవారు మరల నయోధ్యా నగరప్రవేశమ్మున కనర్హు లగుదు రనియుఁ, దమశిష్యులలో నొకని మూలముగ నగరమునం దంతటను వాడవాడలఁ జాటింపించిరి. పిమ్మట విధేయుఁడను దేవరవారిని దర్శింప మనస్సు గొంటిని. ఉత్తర వనుగ్రహించునట్లు ఋషీంద్రులను బ్రార్థించితిని. దాని కామునిపుంగవులు దానుని సొత్తులనేగాక వస్త్రాభరణముల సర్వము నప్పగించి వెడల వలయు నని యొత్తి చెప్పిరి. అట్లే యొనర్చి యిప్పటి యీవేసముతో దేవరవారిసన్నిధికి వచ్చి చేరినాఁడను. ఇదియే విధేయుఁడు బూటకపు వైరాగ్యమును జెందుటకు హేతు వయ్యెను.

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! నేను జెప్పునవి మీకుఁ దోఁపనివి కావు. మునివరులు మేలు పర్యాలోచించియే యట్లు చేసి రని తోఁచుచున్నది. నాగరకు లెల్లరు మాపైని ప్రేమాతిశయమున రాజ్యము నుండి తొలఁగినచోఁ బ్రాభవంబు సాఁగ దని తలఁచి యట్లు చేసి యుందురు. వాఙ్మంజిమ కపటహృదయులకును వాక్పారుష్యము హితవాదులకును లక్షణ మగు చున్నది గాదె? అది యట్లుండ మునిరాజునకుఁ దమపోక యసమ్మతంబుగానే యుండి యుండును. మఱియు రాజకీయవ్యవస్థలకు నుత్తరవాదు లగుతమరే వారియాజ్ఞలకు మీఱినచో నితరుల కెట్టి లక్ష్యము గుదురును? ఐనప్పటికిని మాయందలి యభిమానవిశేషంబుచే వారు చెప్పినపద్ధతులు మీకు వ్యత్యస్తములై తోఁచియుండ వచ్చును. విధి బలీయము. విధి నను



సరించియే మదియుఁ జెల్లును. తమరును మాతోడ సంచారక్లేశంబు లనుభవింప వలయు నని భగవన్నియమన మయినచో నెవ రేమి సేయ వచ్చును. ఇచ్చటఁ గూర్చుండుఁడు. చాలు నెత్తికొనుఁడు.

(సత్యకీర్తి కుమారు నెత్తి తొడ నుంచుకొని సమీపమునఁ గూర్చుండును.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా! ఇది నీకు యుక్త మని తోఁచుచున్నదా? పాశరహితుండై పరిఘవిల్లు నప్పరమయోగితలమీఁద నీ ధారుణీపాలనభారంబు వైచి వేడుక చూడ నగునా? ఇమ్మంత్రిపుంగవుండు నిట్లు వచ్చిన మునివరులే ప్రజాపాలనంబుచేయలేక రాజ్యము కష్టప్రదమని మరల నిచ్చివేయ వలయు నని యిట్టి యేర్పాటు చేసితివా? ఇది యన్యాయము. అన్యాయము. “మన మిచ్చినట్లే వారును మన కిచ్చివేయవలయు” ననుట నీయభిమతమా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇచ్చట జరగినదాని నన్నిటిని దాము వినుచునే యుంటిరి? ఏమేని విధేయునిపై దోష మున్నఁ జెప్పుఁడు.

నక్షత్రేశుఁడు—మంత్రి వచ్చుట నీకు నిష్టము కానిచో, మరల నగరమున కేగున ట్లుత్తరువు చేసి యుండవా? వచ్చినదే చాలు నని యున్నావు.

హరిశ్చంద్రుఁడు—రాజ్యమునుండి మాయెడకు వచ్చిన వారలు మరల రాజ్యము చేర రా దని గాధేయకులపతులు ప్రకటించినట్లు తెలియ వచ్చుటచేత, మరలి యెట్లు పొమ్మన వచ్చు నని, యూఱకున్నాను గాని మఱొండుగాదు.

సత్యకీర్తి—ఔను; వచ్చినవాఁడు మరల పోఁ గూడదు. ఇదియు, ముని శాసనంబు?

నక్షత్రేశుఁడు—అట్లయినచో నిష్టానుసారమే గానిండు. నే నేమి చేయ నగును. ధనము తీసికొనవలసినది నాభారమేగాని, తక్కినయూను

నా కేల? ప్రొద్దు మీఱుచున్నది. నిద్రింపఁ బోవుదము. (స్వగతము.) అయ్యో గతియా! ఇదియు నావిధియా! ఈ యిసుకదిబ్బపై శయనింప వలయునా! పర్ణశాలయందుఁ బరుండితినేని మంచుసోనలు పైఁ గవియకుండునే!

ఉ. చల్లనిమందమారుతము - పారసగంధభరంబుఁ దాల్చి తా
నల్లన వీవఁగా నెలమి - యారఁగఁ బూఁబొదరింటఁ బొల్చుసం
ఫుల్లలతాంతశయ్యఁ దను-వుం దగఁ జేరిచి కూర్కు చెందునన్
బెల్లువగన్ గలంచు నిటు - వీఁడి యాచు మునీంద్రు లక్కటా!

(పరుండును.)

ఇది పంచమరంగము.

షష్ఠరంగము.

స్థలము : ఒక యెడారి.

కాలము : మధ్యాహ్నము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, నక్షత్రేశుఁడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఇదె చండకిరణుండు నడిమింటి నంటి నిప్పులు గురియుచున్నవాఁడు. ఇప్పటికి సుమారు పదునైదు గడియలప్రొద్దయినది. అబ్బా యేమియెండ? ఇంచుకేనియు నోర్వ శక్యముగాదు. ఎండ వాన యనక కానం దిరుగులాడు నాకె యిట్లున్న సకలవైభవంబుల నొరఁగి సుఖం బుండిన మీ కెట్లుండును! వేఁడిగాలి వీఁచుచున్నది. హరిశ్చంద్ర! ఇది యొకమరుభూమి. ఈ యిసుకబయలునఁ జెట్టనునది గానరాదు. సుడిగాలి యిసుకతోఁ బై



కెగయుచున్నది. దీని నడుమఁ జిక్కిన వానిగతిని జెప్పి తీఱదు. ఆహా దీనిని జూడఁగానే, నే నెప్పుడో చదివిన పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది.

గీ. మండువేసవిఁ దాపంబు - మెండుకొనఁగఁ,
గాల్పఁ గార్చిచ్చు కానన-తరువాళి,
భేక మొక్కండు కాలూన - లేక పాము
పడగక్రింద నొదిగెఁ బ్రాణ-భయముఁ బాయ!

ఆహా! అనేకాబ్దంబు లనావృష్టిదోషంబుచే శోషిల్లిన యొక కాననయందలితటాకజలపూరంబులు నిశ్శేషంబుగ నడుగంటిన నందుఁ జిరకాలంబుగ వసించుచుండిన యొకకప్ప మండువేసవిని నిలువనీడ నరయఁగా నంతకుమున్నె దావపావకకీలాళిచే నందలిలతాగుల్మతృణవృక్షంబులు భస్మీభూతంబులై యుండె. అప్పు డొక కాలసర్పంబు పడగ విచ్చి విషం బుమియుచు బుసగొట్టుచు రోఁజుచుండె. అంతట నీకప్ప యాపాము పడగవలన నేర్పడిననీడయే తనకుఁ దాపోపశాంతికిఁ దగినమనికిపట్టని తలపోసి చేరి యొదిఁగి కూర్చుండె. ఆహా! ఈబ్రదుకు నట్టిద కాదె! ఇట్టితాపము జీవేచ్ఛనుగూడఁ బోఁపించునా! మఱియు నిట్టివేసవికాలమునందే యీ యెడారిమీఁదుగ లోకులకే చల్లఁదన మిచ్చు సామర్థ్యముగల మేఘుఁడును జంద్రుఁడును బో వలసి వచ్చెనఁట. ఈ యపరిమితతాపము మన మెట్లోర్వఁ గల మని పిక్కలబలము కొలఁది నాకసమునఁ బరుగులు వారినారఁట. అట్టి శ్రమవలన వారిదేహములు చెమర్చి, మేఘునిచెమట వర్షరూపముగాను జంద్రునిచెమట హిమరూపముగాను భూమిపైఁ బడె నని కవు లత్యుక్తిగాఁ జెప్పుదురు. అది సత్యోక్తియే యని యీ తాపము దెలుపుచున్నది. ఆహా! ఏమి యెండ! అబ్బా! ఈ గ్రీష్మబలమే బలము. అక్కటికము లేని

కుటిలహృదయుల హృదయమును బోలి యున్నదే! ఇట్టి యీ ఋతుధర్మమునకుఁ జాల ననువుపడి యున్న దీయెడారి. అడుగు పెట్టినఁ జాలును, నెత్తివఱకును భగ్గున మండుమంట ప్రసరించు చున్నది. హరిశ్చంద్ర! ఇందలి సైకతమును సాధారణపుటిసుకగా భావించెదవా యేమి? కాదు. కాదు. వినుము.—

గీ. అల్లుఁగుఱ్ఱని దౌతాప - మతిశయింపఁ
దనతనూజాత సంజ్ఞ దాఁ - దాళకున్నఁ
దొడరుకోపాన మయుఁ డంత - ద్యుమణిఁ బట్టి
సానఁ బెట్టంగ భువి రాలు - సన్న మగును.

ఆహా! కష్టము! ఈ వేఁడిసెగలఁ గ్రక్కు నుగ్రసమీరములు తనువునందలి జీవనమును సైతము పీల్చు చున్నవి. ఎట్టి కష్టానుభవంబులకో యేను మీతోడ వచ్చుటకుఁ బ్రాల్మాలినది! ఎవరిధనము నెవరు గనిరి? వారు మాత్ర మేమి కుప్పలు కుప్పలుగ నీ చేతఁ గ్రుమ్మరించినది? పుణ్యమున కిచ్చితివి. అదియును వారికే చేరి పోయెను. వారు చిక్కులఁ బెట్టుచుండఁగా, నీవు నా మాటలకుఁ జిక్కి, తగిలికొంటివే! ఒకరిధనము నీ వెత్తికొన్నాఁడవు కావుగా! చేతఁ బెట్టుకొనియు వంచనచేసి లే దని చెప్పినవాఁడవు గావు. ఇది యంతను దలపోసి యప్పుడే నాయొద్ద ‘‘లేదు’’ అని చెప్పి తొలఁచివేయక యిచ్చెద నని పూనుకొంటివే! ఇప్పు డీకష్టపరంపరల నెవ్వఁ డోర్వఁ గలఁడు? నేను బడుట యొకపా టైనను, మీపాట్లను జూచి పరితపించుటలు దుస్సహాముగా నున్నవే.

సత్యకీర్తి—రాజేంద్ర! కుమారు లీ కఱకునేలపై నడు గత్తి పెట్టఁ జాలక తపించు చున్నారు. సోలుదు రని తోఁచెడిని. ఇఁక వీరిని నడువ నిచ్చుట యుక్తము గాదు.



గీ. కలితసమదర్శు లెందును - జలన మొంద
రొనరఁ బల్యంకికాస్థితి - ఘనత నంద
ఘోరవనిఁ బాదచారు లై - గ్రుమ్మరంగ
సరసభక్ష్యాన్నముల మెక్కి - సరివి నొంద
వన్యమూలాదిఖాదు లై - వనటఁ జెంద.

రాజేంద్రా! ఈయార్యోక్తి తమయెడ నిక్క మయ్యె.

చంద్రమతి—నా కన్నతండ్రీ! దేవదాస! నీ కేమికష్టంబు లొదవెనురా నాయనా!

ఉ. ఎన్నఁడు నిన్నుఁ జూచి మది - నెంతయు సంతస మందుదాన; నేఁ
డన్న నినుం గనుంగొనఁగ - నంగదఁ దూలెడుదాన!......నింక నీ
విన్ననిమోముఁ జూచి యెటు - వేదుఱు చెందక నిల్చుదాన?...నో
చిన్నరి పన్నెలాఁడ! విధి-చెయ్దము నేరికిఁ బోలు దాఁటఁగన్?

పుత్రసంపద లేనివిభవంబు లెల్లఁ బద్మరహితంబు లగుకాసారంబు లని తలంచి కన్న దేవతలకుం గేల్దోయి జోడించితి. భక్తితాత్పర్యంబునఁ దీర్థక్షేత్రంబుల నెల్ల దర్శించితి. నిరుపమానమహిమాన్వితు లగువిప్రవరుల బహుదానాదిసత్కారంబులం దనిపి వారి దీవనలం గైకొంటి. ఎన్నియోనోములు నోఁచి విప్రసువాసినులం గొలిచి పరితుష్టలం జేసితి......నినుం గని కృతార్థ నైతి నని తలంచితి...ఇఁక ననుం బోలునృపమాత యెందుం గలుగ దని విఱ్ఱవీఁగితి...అక్కటా! నేఁడు గదా నాదురభిమానంబు పాలియ నయ్యె!...నాకుం బుట్టి నీ విట్టిరాయిడులకుం బాలుపడుటం జూచి యీకడు పెట్లు సైరించునురా! (బాలునిఁ గౌఁగిటం జేర్చి)

ఉ. నాయన! యేల పుట్టితివి - నాయుదరంబునఁ?...గష్టపాటులన్
దోయజసంభవుం డకట - దొట్టఁగఁ జేసెను...జూచి సైఁపఁగా
నాయెను నాకు... నీజనకుఁ - డంగదఁ దూలెడు నిన్నుఁ జూచి...యే
మాయరొ నామనం బనుప-మానశిలాస్థితి వ్రయ్య కుండెడిన్!

కాలంబునకుఁ దగినధైర్యంబు వచ్చు నని పెద్ద లందురు. అది నిక్కంబ కాఁ దలఁచెద. అక్కటా! ఇట్టికాలంబు పాటిల్లు నని కల నైనం దలఁప నైతి. ఐహికసుఖవారంబులు జలబుద్బుదప్రాయంబు లని యెఱుంగనిమూఢచిత్త నైతిఁ గదరా......ఇఁక నీదుఃఖంబు నూచి నే నేరీని సైరింతురా? (శిరంబు మూర్కొని మోము దుడిచి)

సీ. తడఁబడునడుగుల - నడయాడునిన్నుఁ జూచి మదిలోన సంతసం - బొదవఁ గంటిఁ
దొక్కుమాటల నాడి - తోడిబాలురఁ గూడి యాడుని న్గని యాత్మ - నలరఁ గంటిఁ
గంకణాంగదములు - ఘల్లుఘల్లు మని మ్రోఁగఁ బరువువాఱెడునీదు-మురువు గంటిఁ
జిన్నయ్య ర మ్మన్నఁ - జిఱునవ్వు మోమునఁ జిలుకంగ వచ్చునీ-చెలువు గంటి
నడరి దహియించుసెండలో - నడవి నేఁడు
నడవ నేరక యడలునీ - వడువుఁ జూడఁ
గాంచితిని!...దీనికా నిన్నుఁ · గనుట?...నాదు
నోము లెల్లఁ బండెనె యి ట్లనుంగుఁగుఱ్ఱ!

(అని పుడమిపయిం గూర్చుండును. హరిశ్చంద్రుఁడు కన్నుల నీరు గ్రమ్మఁ దల వాంచి నిలుచును.)

సత్యకీర్తి—తల్లీ! చింతిల్ల వలదు. మిముం జూచి బాలరాజులు భయ మందిరి. రాజేంద్రా! మీరును బడలితిరి. కుమారులను నే నెత్తుకొని తెత్తును. (బిడ్డ నెత్తుకొను చున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—(చంద్రమతిని జూచి) ప్రాణేశ్వరీ! ఏల పరితపించె దవు! నినుం జూచిన నాధైర్యంబును నీఱగు చున్నది. విధి! ఈ ప్రచండతీక్ష్ణవాతంబులును, ఖరకరకిరణజాలంబులును నీలావణ్యపూరంబు నిగురఁ గ్రాఁచినవి గదా! నిన్నును మన పుత్త్రరత్నంబును నగరము నంద యుండునట్లు పరిపరివిధంబుల బోధించితిని. నామాట వినక వచ్చి యి ట్లుత్తలంబునకుఁ బాల్పడితిరి. ఇఁకఁ జింతిల్లుట వలన ఫలం బెయ్యది? సర్వంబు విధిచోదితం బని యెఱింగి మనంబుఁ జిక్కఁ బట్టి కాలంబు గడప వలయు. ......ఇంతటిపా టెన్నఁడు



నెఱుంగనిదానవు. నడచి నడచి మిక్కిలి డస్సితివి. ఏమి చేయనగు? ఇంక నీవు నడవ లేవు. నేను నిన్ను నెత్తికొని వచ్చెదను. ఈ యెడారిని దాఁటినదే, పాదచారిణివి కావచ్చును.

చంద్రమతి—హా! ప్రాణేశా! తమ రి ట్లాడఁ బోలునే?

గీ. భూమికాంతయు జయకాంత - భూపవర్య!
తావకీనభుజాగ్రంబుఁ - దారసిలఁగ
వనరుహాక్షుల భరియింపఁ - బాప మంచు
మునివరేణ్యునిమూఁపుపై - మోపినారు.

ఆ యన్నులమిన్నల కన్ననా నేను మిన్నను? ప్రాణేశా! తమ పాదాతపత్త్రచ్ఛాయ సుఖయించు నాకుఁ బరితాప మొందు గలదా? (తత్తఱపాటుతోడ లేచి) దేవర వా రిట్లు నన్నుఁ బరిశోధింప వచ్చునా?

హరిశ్చంద్రుఁడు—హృదయేశ్వరీ! ఈ సద్గుణము నీకు నేఁడే పుట్టినది గాదు. ఎప్పటికిని గలదు. నిన్ను శోధించుట గాదు. నీ క్లాంతిని గాంచి మన స్సోర్వమి నట్లు చెప్పితిని.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! "వారివారి కష్టము వారివారికి గొప్ప" యందురు. అట్లే మీ రొకరి నొకరు విచారించుకొనుచుఁ బరితాప మొందు చున్నారుగాని, నన్నెవ్వరును గమనింప కున్నారు. ఇట్టి మీరలా సొత్తు నీయఁ బోయెదరు? ఏమి "వీఁడుగాఁ బరుగిడి పోవని" మ్మని యి ట్లాచరించెదరా? నిజముగా నా కుపచరింప కున్నను, రెం డుపచారపుఁగూఁతలకుఁ గూడఁ గఱవయ్యెనా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! సర్వజ్ఞుల రగుతమ రే యిట్లు పలికిన, విధే యుఁడ నేమి చేయ వచ్చును. మన్నింప వలయును.

నక్షత్రేశుఁడు—మంచిది, మంచిది, నడువుఁడు. మన మొకతీరుగా నీ మరుభూమిని సైతము దాఁటితిమి. సూర్యుఁడును నాకడగండ్లను

జూడఁ జాలని వానివలెఁ బశ్చిమవారాశిలోఁ బడిపోవఁ బ్రయత్నించెదును. ఇఁక నీతోఁపున విశ్రమింతము. ఇప్పుడేనియుఁ గడుపు చిచ్చున కాహుతి యేమేనియుఁ గలదా, లేదా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మన్నింప వలెను. ఇదిగోఁ బోయి యొక క్షణమాత్రంబున మే లయినఫలంబులం దెచ్చి యిచ్చెదము. ఇఁక నొక్కింతదూరము రండు.

(ఎల్లరును నిష్క్రమింతురు.)

ఇది షష్ఠరంగము.

---

## సప్తమరంగము.

స్థలము : గోమతీనదీతీరము.

కాలము : పగలు పదిగడియలు.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, నక్షత్రేశుఁడు, చేతనుఁడు.

---

హరిశ్చంద్రుఁడు—పదిగడియలప్రొ ద్దెక్కెను. దేవరవా రలసటచే మిగుల వాడి యున్నారు. అందఱిని జఠరాగ్ని పేర్చి యేర్చు చున్నది. సమీపమునం దేదేనియు నీటిపట్టు గలతోఁపున్నచో నందీపూఁట విశ్రమించి పిమ్మట మనపయనమునకు మొదలుపెట్ట వచ్చునని తలఁచెదను.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఇదిగో సమీపమునం దగపడు తోఁపు గోమతీతీరము నంటియే యుండునది. అచ్చోటనే కొంత విశ్రమించి యలపు తీఱినంతన పయనము గా వచ్చును.



సత్యకీర్తి—స్వామీ! ఈ నది యెంత రమణీయముగా నున్నది. ఆహాహా! ప్రవాహము రెండుగట్ల నాని పాఱు చున్నది. (హరిశ్చంద్రుం గాంచి) సార్వభౌమా! ఈ నదీరమణీయత యీ నదీ రమణీయతకె సామ్య మగును.

గీ. పావనరుఁగా, సైకతశ్రోణి, - పులినజఘన,
మృదులనిస్వన, తరళిత-మీననేత్ర,
కలితగంభీరనాభి, శృం-గారగాత్రి,
యగుచు నీనదీకాంత భూ-పాగ్రగణ్య!

మహీశ! తమ రీవటచ్ఛాయ నుండుఁడు. నేఁ బోయి ఫలములను వెదకి తెచ్చి యిచ్చువాఁడ. (అని వెడలును.)

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే చేయుఁడు. నేను గొంచెము విశ్రమించెదను.

(సత్యకీర్తి తెచ్చిన ఫలమ్ముల నందఱుఁ దిను చున్నారు. చేతనుఁడు తపస్వివేషంబుతోఁ బ్రవేశించు చున్నాఁడు.)

చేతనుఁడు—

చ. వినయవిశేషహృద్య లగు-విద్యల నేర్చుట లేదు, నీతిచే
ధనమును గూర్ప లేదు; తలి-దండ్రులసేవయుఁ జేయ లేదు; చ
క్కనిచిగురాకుఁబోండ్లబిగి-కౌఁగిలియుం గల నైన లేదు; గొ
బ్బున సమయంబు కాకులకుఁ - బోలె గతించెఁ బరాన్నభుక్తులకా.

హరిశ్చంద్రుఁడు—(ప్రత్యుత్థానము చేసి వినయముతో నంజలిపుటంబు చేర్చి)

గీ. దండములు మీకు, మీపూను-దండమునకుఁ,
గుండలంబుల, కొప్పైన-కుండికకును,
గావికాటికి, రుదురాక-కంఠమాల,
కంచితం బైన పావల - కమితతేజ.

స్వామీ! అనుగ్రహించి యిచ్చోటికి విచ్చేయుఁడు.

చేతనుఁడు—

గీ. "పరవిదారణచణుఁ డౌచుఁ - బరిఢవిలిన,
సకలశాస్త్రార్థవేది యై - సరవి నొందఁ
బృథ్వి ధనధాన్యములఁ జేర్చి - పేర్మి గన్నఁ
గలుగ నేర్చునే దయచేత - నొలయుఫలము."

అనునట్లు, నీ యిం పయినయక్కటికముతోడిమాట లాహా యెంత యుం బ్రశస్తములు! నీ మాటలచేత నీవు పరమసాధు వనుట నే నెఱుంగ నైతి. ప్రియుఁడా! మేము సన్న్యాసులము. అయోధ్యా నగరమునుండి కాశీయాత్రకయి బయలు వెడలితిమి.

హరిశ్చంద్రుఁడు—మీ రయోధ్యనుండియా వచ్చు చున్నారు?—తమ జన్మభూమి యయోధ్యయే యగునా?

చేతనుఁడు—ఔను. అయోధ్యా సమీప గ్రామ మొకటి. అందు సాధు మండలియందు శాస్త్రవిచారమును జేయుచు నుండుటే మాపని.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! అయోధ్యయందు విశేషము లేవేనియుఁ గలవా?

చేతనుఁడు—మేము పరదేశవాసుల మైనదే విశేషము.

సత్యకీర్తి—స్వామీ! అ దేల యిట్లు సెల విచ్చెదరు?

చేతనుఁడు—ఏ మన్యాయము! ఏమి కాఠిన్యము! పాపము! ఆ హరిశ్చంద్ర సార్వభౌముఁడు కాఁపులను దనకన్నులవలెఁ గాపాడుచు వచ్చెను. పిమ్మట నారాజ్యము నొక ఋషివరుని కప్పగించినాఁడు. ఆమునిరా జప్పుడే యొకప్రకటనఁ జేసెను ఆహా! అది విన్నది మొదలుకొని నగరమాద్యంతము తత్తఱపడు చున్నది. ఎవరును హరిశ్చంద్రుని జూడనే కూడదఁట. అట్టిచిత్తము గలవాఁడు తనసర్వస్వము మునివరునకే యప్పగించి తొలఁగ వలయునఁట. వాఁడు మరలఁ బురప్రవేశమున కనర్హుం డఁట. ఆహా యెట్టి యన్యాయము!



హరిశ్చంద్రుఁడు—దీనివలనఁ దమ కేమి! సర్వసంగపరిత్యక్తుల రయిన యతివర్యుల రే! మీ కట్టి సుఖదుఃఖంబులతోడిసంబంధం బేమి?

చేతనుఁడు—అయ్యా! మా కందువలనఁ గావలసిన దేమియు లేదు. ఐనను, జనులపరివేదనమును జూడ మనస్స్వాస్థ్యము దప్పు చున్నది. ఆ ఋషి పరిపాలనముక్రింద బ్రతుక వలయు ననునాస యెంతమాత్రమును బ్రజలకు లేదు. కొంద ఱున్ననో, యాతని కట్టుదిట్టముల మేరకే తమ సర్వస్వము నెడఁబాసి, తమప్రభువును బోయి దర్శింపఁ గోరి యున్నారు. అంతలో మఱియొక మహాపాతకము సంభవించెను. దానిఁ గాంచినదే మా కూరియం దుండ బుద్ధి నిలువక తత్క్షణమే కాశికిఁ గదలితిమి. ఆయన్యాయమును బేర్కొనుటకు సైతము నాల్కరాదు.

సత్యకీర్తి—స్వామీ! నాల్కరానంతటి యన్యాయ మేమో?

చేతనుఁడు—ఆనిరాబారికటికితనంబు నే నేమని చెప్పుదు? మన సార్వభౌమపదవి నొసఁగినహరిశ్చంద్రభూపేంద్రుని లేనిపోని నెపములు పన్ని కాటికిఁ దఱిమి వైచెను. అంతటితోఁ దనియక, యయ్యయో! యామహారాజుగారిజనని నాగర్భశ్రీమతి—కడు వృద్ధను.—

హరిశ్చంద్రుఁడు—(ఱిచ్చపాటును బరితాపంబుఁ గదుర) స్వామీ! ఆమెగారి కేమి? సుఖముగా నున్నారా?

చేతనుఁడు—ఉన్నది పాపము. పరలోకమున.

హరిశ్చంద్రుఁడు—(దుఃఖమునఁ బుడమికొరఁగి) హా! ఎప్పుడు? స్వామీ! పిమ్మట నామె గతి యేమి యాయెను? అనుగ్రహించి సెలవిండు.

చేతనుఁడు—మూఁడుదినము లగు చున్నది. అయ్యో! అయ్యో! దైవమా! ఆరాజమాతకు నపరక్రియలను సైతముఁ జేయువా రొక

రును లేక పోయిరి. ఏమిచెప్పుదును. ఆమె కళేబర మొకదినమంతయు దిక్కులేక పడి యుండ వలసి వచ్చెను. తుట్టతుద కిరువు రంత్యజులు వచ్చి, యాశవమును జుట్టి పట్టించుకొని పోయి శ్మశానమున దహనము చేసిరి. కొందఱు స్వామిభక్తిపరాయణు లైన పుణ్యాత్ము లొకటిగఁ గూడి ''మారాజమాత'' గదా యనునభిమానంబున నామెగారికి సంచయనాద్యుత్తరక్రియాకలాపంబులను నిర్వర్తింప నమకట్టిరి. అహహా! ఆమునివరు లట్లు సమకట్టినవారి నెల్ల నదల్చి బెదరించిన దేగాక, పాపము, వారిని గారాగృహబద్ధులను గావించిరి. అక్కటా! ఏమి చేయుదురు? ఏమికాలము!

(చంద్రమతి యవనతవదన యై కన్నీరు విడుచు చున్నది. సత్యకీర్తి పరితపించు చున్నాఁడు. దుఃఖించువారిమోములం గాంచి దేవదాసుఁడు వెల్లఁ బోవు చున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—హా. దైవమా!

మ. తనగర్భంబున నైదురెండ్లనెల లాస్థం దాల్చి దుర్ధర్షమా
ఘనభారంబు వహించి, నొప్పులకునై - గాసిల్లి శోషిల్లుచుఁ
దనయుం గాంచి, తదీయపోషణలఁ - దా నిద్రాదుల న్వీడి, యా
తనలం బెక్కుల నోర్చునాజనని సం- స్తవ్యార్హ గా కుండునే!

హా! పరమేశా! ఇట్టి దిక్కుమాలిన గతి నాతల్లికిఁ గలుగవచ్చునా! హా! జనయిత్రి! పాపి నగునన్నుఁ బుత్త్రునిఁగఁ బడసి యేమిఫలము! నీయుత్తరక్రియలకును యోగ్యుండనుగాక పోయినవాఁడనే! నాబోటి మహాపాపియు జగమునం దొక్కఁ డుండునా? హా! నా యమూల్య మైన జననీ! నాశైశవంబున నన్నుఁ గౌఁగిలించి ముద్దిడిన నీవాత్సల్యం బెట్లు మఱవఁ గలను? నాయొడలు నాస్వాధీనము నందులేని కాల మునఁ జీమల్లు దోమలు మొద లగువానినుండి నను నిర్నిద్రజాగరూ కతతో మనిచిననీకుఁ బుత్త్రునివలని (పాప) నంతిమకాలంబుననేని లభించినది గాదు గా! హా!



ఉ. మంచియుఁ జెడ్డయుం గఱపి - మాన్యతఁ గూర్చుచు నెల్లవేళలన్
మంచినమాతృదేవతస-మక్షమున న్వసియించి సేవలన్
వంచన లేక సల్ప త్రిది-వంబున కన్పెడుభాగ్య మెంతయున్
గాంచఁగ నోఁచ నైతిని; య-ఘంబు గడించితి నేమి సేయుదున్!

హా జనని! కర్మశరీరంబుతోడన నాకసంవాసంబు చేయునట్టి పూత చరితుం డైనత్రిశంకుభూమండలాఖండలునకు దేవి వై, యొకకాలం బునం దష్టాదశద్వీపసంధుల నతివేలకీర్తివిశేషంబులు నించి ప్రజాపరి పాలనం బొనర్చిన యీహరిశ్చంద్రహతకునికి మాత వై తనరిననీ విట్టి యాఱడిచావునకా పాల్పడితివి? ఔరా పరమేశ! నీచిత్తమగాధము.

గీ. ఎన్నఁగాఁ గాని జన్మంబు - లెత్తి యెత్తి,
తుదకు నీ వరగాత్రమే - తొడిగి, జగతి
విషయవాంఛల మది నిల్పి - వినుగు చెంద
నింక నాగతి యెట్లు సు-రేశవినుత!

(శోకించు చున్నాఁడు. చేతనుఁ డాశ్చర్యపడువానివలె బిక్కిరి చూపులు చూచు చున్నాఁడు.)

చంద్రమతి—దేవరవా రిట్లు వ్యాకులత్వమునకుఁ జోటీయ నగునా? మీరే యిట్లు చింతాసాగరమగ్నుల రయినచో మాబోంట్లగతి యేమి? పశ్చాత్తాపమువలనఁ బ్రయోజనం బేమి? ఓర్పు చెందుఁడు.

సత్యకీర్తి—రాజేంద్రా! లోకస్వభావము మీకుఁ దెలియనిది గాదు. సర్వము వెలికిఁ దోఁచుచు నణఁగుచు నుండును. జీవితమో జల బుద్బుదము. దీనికిఁ జింత యేల! ''జాతస్య మరణం ధ్రువ'' మ్మన వినలేదా.

నక్షత్రకుఁడు—హా! హరిశ్చంద్ర! హా. హా. ఏమిదుష్కాలము! ''తగిలినకాలే తగులును, చెడినకాఁపురమే చెడు'' నందురు. దానిని నీయొద్దనే చూచు చున్నాను. నరునకు మాతృవియోగంబునకంటె నధికం బగుదుఃఖం బొండు లేదు. వానిగతి సంతాపకరంబు.

క. అప్పుడ యసమర్థుం డగు, నప్పుడ దుఃఖి యగు శూన్య - మై తోఁచు జగం
బప్పుడ మాతృవియోగం, బెప్పుడు వాటిల్లు నపుడ - యెంతయుఁ దూలున్.

తల్లిని దహనము చేయనితనుజుఁ డవే నైతివి. ఇంకఁ బరితాప మేల? తల్లియే మొదటి దైవము. తల్లి కింపుగా నడచుకొనుటయే తనయుని కృత్యము. అట్టి మాతకుఁ జేయు నుడిగంబులే తప్పని తపస్సగును. తల్లిని వదలి తపస్సు చేయ సంకల్పించితివే! ఇదియా తపము? ఇఁక మనపరితాపముల వలన ఫలం బేమి? నీ విప్పుడె యయోధ్యం జేరి, నీ తల్లికిఁ జేయ వలసినయుత్తరక్రియలను గ్రమంబుగ నిర్వర్తించి, యాయాత్మకుఁ దృప్తి గలిగించుటే యుక్తము. ఆత్మ తనసుకృతదుష్కృతఫలానుభవంబుల కనువుగా సూక్ష్మం బైన యాతనాశరీరంబు వహించెడును. అట్టిశరీరలబ్ధికే యుత్తరకర్మకలాపంబు మనుజుం డాచరింప వలయును. కానిచోఁ బ్రేతరూపంబున జీవాత్మ పరితపించు చుండును. కర్మకలాపంబులే ప్రధానంబులని కర్మకాండము పరిపరివిధంబుల, వాకొను చున్నది. జగత్తే కర్మబద్ధము. మహావైరాగ్యప్రవరులై వనములయందుఁ గందమూలంబులు మెసవి కాలము గడపు జ్ఞానయోగులును గర్మయోగమును మిక్కుటముగ నాదరించెదరు. కావున లెమ్ము, లెమ్ము. ఆలస్యము చేయకుము. జననీజనకులకుం గానివీతనయుండు తనయుండు గాఁడు.

జతనంబు మిగుల మా-సములు దొమ్మిది యుదరంబునఁ గరముభ-రంబుతోడ
భరియించి పదపడి - ప్రాణసంశయదశ నొంది పుత్త్రునిఁ గాంచు - నొనరఁ దల్లి
తపములు యజ్ఞము - ల్దానము ల్వ్రతములు దేవతాసజ్జన - సేవనములు
గావించఁ బుత్త్రునిఁ - గామించి జనకుఁ డి ట్లిరువురపాటును - సరియె తలఁపఁ
దనయుఁ గని తల్లిదండ్రులు - తమకు సతఁడు, భక్తుఁ డగుటకు ధర్మార్థ-సక్తుఁ డగుట
కాసపడుదురు విను మట్టి - యాసనిద్ధి, పొందఁజేయువాఁడె సూడ-నందనుండు.



హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఎవ రెవరిత్రోవం బోవు వారు? పరితపించుటవలనిప్రయోజనం బెయ్యది? మునివరుల యప్పు దీర్చుటకై ప్రయత్నించుటయే మొదటిపని. ఏమి వచ్చినను రానిండు. సత్యమే సర్వశ్రేయములకు నిదానము. సత్యపోషణమునకై వారాణసీక్షేత్రమును జేరి ధనార్జనమునకు దారి వెదకుటయే ప్రస్తుతమునకుం దగినకృత్యము. అది నిర్వర్తింపఁబడకయే యయోధ్యకుఁ బోవుట నాకుఁ దగని పని.

నక్షత్రేశుఁడు—అట్లయిన నీయిష్టము! ఉన్నదానిని మందలించితిని. ఇఁక నీయిచ్చవొప్పునఁ జేయుము.

చేతనుఁడు—ఓహో! వీరె హరిశ్చంద్ర సార్వభౌములు! ఆహా! ఏమి గతి! ఏమి పరితాపము! పితలు తమయంతిమసంస్కారంబులకే పుత్త్రసంతానమును గోరుదురు. సత్పుత్త్రుఁడు తలిదండ్రులకుఁ జేయు నూడిగమే పరమతపంబుగాఁ దలపోయు చున్నాఁడు. సర్వధర్మజ్ఞుండ వగుసీవె, నీజననికిఁ జేయఁదగినవిధ్యుక్త కర్మంబుల నిషేధించి చరించినచోఁ దక్కుంగలవారిలో నెవ్వారు తత్క్రియల నిర్వర్తించుటకుఁ దొడంగువారు? ప్రేతంబున కైనకర్తవ్యాంశంబు కర్తకుం దప్ప నితరులకు విధింపఁబడదు. ఔరా! ఏ మన వచ్చును! అనాథప్రేతసంస్కారంబునఁ గలుగుపుణ్యము యజ్ఞకోటులకంటె నధిక మందురు. జననీజనకులకుఁ జేయు సంస్కారము నే మని చెప్ప నగును? విధి విధానంబు విమర్శింప నతివృద్ధు లౌ జననీజనకులను విడిచి, తనయిచ్చవొప్పునఁ బ్రవాసము చేయుట సుతునకు యోగ్యంబు గా దని తేలు చున్నది. అంతిమదశ యందున్న జననీజనకుల వాంఛాపరిపోషణమే పరమార్థంబుగఁ దలపోసి యుపచరించుచు, వారి యాత్మలకుఁ దృప్తి ఘటించుటే తనూజాతునికి ముఖ్యకృత్యము.

మీకాలబల మన్ననో యిట్లు మాతృపరిపోషణమున కెడ మియ్యక తొలఁగించినది. ఇప్పటికిని వగవం బని లేదు. ద్వాదశాహములకు లోపుగ, శవమును దహించి యపరక్రియలు సమగ్రములుగా నాచరించినచో నాయాత్మ సుకృత మొందును. అట్లు చేయ కున్నఁ బ్రయోజనం బేమి? పుత్రనామంబు గాల్పనా? "పున్నామ నరకాత్త్రాయంత ఇతిపుత్ర" యను దాని విని యుండవో? అదియుఁగాక మాతాపితలఋణంబును దీర్పని కొమరుండు రౌరవాదినరకంబులకుఁ బాత్రుండని శాస్త్రము లుద్ఘోషించుఁగాదె. కావున నుత్తమధర్మజ్ఞుండ వైనయీవు కాలవ్యయంబు చేయక బయలుదేఱుటయే ప్రశస్తము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయునిస్థితి తమకును దెలిసియే యుండవచ్చును. సర్వమును దైవసంకల్పానుసారమే జరగును.

గీ. వఱదఁ గాష్ఠము ల్గూడిన-వడువు బంధు
సంగమం; బవి వాసిన-చాడ్పు తద్వి
యోగ; మింత సూచినవాని - కుష్మలికము
వొరయ నేరదు, ధర్మను-స్థిరత గుదురు.

ఇది తా రెఱుంగనిది గాదు. దుఃఖంబున మేను మఱచి యయోధ్యం జేరితినేని నేను మునితోడ నాడినమాటం దప్పినవాఁడ నగుదు. కావున నే నందుఁ బోనోప. మరణ మొందినతల్లి కపరక్రియలు సల్పుట కర్తవ్యంబ. ఇది నే నెఱుంగుదు. దాసుఁడను శాస్త్రవిరోధిని గాను, నాస్తికుండను గాను. గంగాద్యుత్తమనదులఁ బితౄణంబు దీర్చుట పరమవిశేష మని మీవంటి పెద్దలు వచింప విని యున్నవాఁడను. ఆకారణమును బట్టియే గద గయాద్యుత్తమస్థలంబులయం దాత్మపిండమును సైతముఁ బెట్టు కొందురు? కావున నేను నట్టిస్థలంబులనె నాజనయిత్రి కుత్తరక్రియలఁ జేసి ముగింప వలయు



నని తలఁచెదను. దేవరవారి పలుకులకు మాఱు మాట లాడుటకు మన్నింప వలయును.

చేతనుఁడు—(ప్రత్యేకముగా నక్షత్రేశుని సంధించి) నక్షత్రేశ! ఏమి మనసంకల్పించిన కార్య మింత చక్కఁగా ముగియు చున్నది! నీవేమి చేసితివి?

నక్షత్రేశుఁడు—చేతనా! తనతల్లిమరణంబునకే మానసమునందుఁ జలింపనియితఁ డింక దేనికిఁ జలన మొందువాఁడు? వీరిమనస్థైర్యము సకలైహికపరిత్యాగశీలుం డగు తపస్వికిని దనరారుట యరుదు. ఏమి సేయ వచ్చును? నాయెడ శక్తి వంచనము లేదు. నీవు పోయి మునివరులకు నాగతి విన్నవింపుము.

చేతనుఁడు—సరి. ఉండనిమ్ము. ఒకమునుకతో మ న్నంతయు నొడ్డు చేరునా? ఇఁక నెన్నిపరీక్ష లున్నవి! చూచెదము. (వెడలును.)

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది సప్తమరంగము.

~~~~~~~~~~

## అష్టమరంగము.

---

| | |
|---|---|
| స్థలము : | గంగాతీరము దగ్గఱ నొక తోఁపు. |
| కాలము : | సాయాహ్నము. |
| పాత్రములు : | హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, నక్షత్రేశుఁడు, అసిధరుఁడు, వైఖానసుఁడు, సారంగుఁడు. |

---

హరిశ్చంద్రుఁడు—ప్రాణేశ్వరీ! చంద్రమతి! ఏమి వెనుకఁ జిక్కితివి? పాదము లలసినవా?
~~~~~~~~~~

(కన్నుల నీరు గ్రమ్మ) ఔరా! పద్మసంభవుని చేఁతల నేమన వచ్చు! ఎందుం గొఱంతలేని వైభవంబులం బొరలుచు దుఃఖం బెఱుంగని నీ కెట్టికష్టపరంపరలు ఘటిల్లె!

ఉ. బంగరుమేడలం జలువ-పందిరులన్ వెలరాతితిన్నెలన్
రంగగుమేలిమిద్దియల - రచ్చబవంతుల నాట్యశాలలన్
సింగపుమోము లొక్కయెడఁ - జెక్కినచక్కనిగోపురంబులన్
బొంగుచు సంచరించునిను - భూరివిషాదపయోధి ముంచితిన్!

విధి బలీయం బగుటచేఁ బ్రస్తుతస్థితికిఁ జింతిల్లుటవలని ప్రయోజనం బెయ్యది? ఈకష్టంబు లొక్కింత నోర్చికొనుము...... (ఉస్సురని) ఇదే వచ్చినాము. ఈతోఁపున నాఁగి కొంతయలసట దీర్చికొందము. చింతింపకుము.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! వేళ కనువుగా—జఠరాగ్నికి—వ్రేల్చ నట్టి—ప్రయత్నమేమియు లేదా? మీ రెట్టు లోర్చి యుండెదరో! అమృతపానము చేసి యున్నారా?

గీ. "వ్రీడ, ప్రత్యర్థి, మానంబు - వేఱువిత్తు,
పౌరుషఘ్నంబు, దొసఁగుల-పట్టుఁగొమ్మ,
నిర్ణయంబుల కపకారి, - నిరయదంబు,
చింతలకుఁ జోటు, నాఁకటి-చిచ్చు గాదె."

అని యందురు. మీయెడల నీన్యాయము వ్యత్యస్తముగాఁ గనఁబడు చున్నది. నావలన నీఁక నేమాత్రమును గాదు; జరగుట కును గాదు.

సత్యకీర్తి—స్వామీ! ఇదిగో! ఈతోఁపున దిగుదము. ఒక క్షణమునందే భోజ్యములను దెచ్చెదము. (అందఱును దోఁపుఁ బ్రవేశింతురు. సత్యకీర్తి ఫలములను దెచ్చును.)



హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తి! మంచి పరిపక్వఫలంబులను మునివర్యుల కిండు. తక్కినవి మనము భుజింతము. (తినుదురు. వైఖానసుఁడు, అసిధరుఁడు, సారంగుఁడు, ఈముప్వురును యుద్ధభటుల వేషంబుం గొని, యచ్చోటున నే యొక వృక్షచ్ఛాయఁ గూర్చుండి సంభాషించుకొను చుందురు.)

హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తి! ఆవృక్షచ్ఛాయఁ గూర్చుండువార లెవరు? యుద్ధభటులవలెఁ గనఁబడు చున్నారు.

సత్యకీర్తి—ఔను! కనుంగొనెదను. (యుద్ధభటులను సమీపించి) అయ్యా! మీ రెవరు? ఎచ్చటికిఁ బోయెదరు?

యుద్ధభటులు—అయ్యా! మేము కన్యాకుబ్జరాజ్య యుద్ధవీరులము. ఇట్లు దేశాంతరము పోవు చున్నాము.

సత్యకీర్తి—యుద్ధవీరుల కేల దేశాటనము? యుద్ధభటుల వేషములే గాక, యుద్ధరంగము నందుం బోరాడిన చిహ్నములతోడ, రక్తమయము లయిన వస్త్రములను గలిగియు నున్నారు. మీరు దేశాంతరుల రగుటకుఁ గారణ మేమి?

యుద్ధభటులు—కారణమా యడిగెదరు? ఏమి కారణ మని చెప్పి, మిమ్ము సమాధానపఱుపఁగలము?

(చంద్రమతియును హరిశ్చంద్రుఁడును బ్రత్యుత్తరమున కెదురు చూచు చున్నారు.)

సత్యకీర్తి—ఏమి యట్లు చెప్పెదరు? మీనగరమునందు విశేష మేమి? రాజుగా రేమయిన దొసఁగు పొసఁగించిరో?

యుద్ధభటులు—అయ్యో! ఆ రాజేంద్రులు సుకృతవారాసులు. వా రేల దొసఁగుఁ బొసఁగింతురు. అయ్యో! ఆభద్రులవలె నీఁక నెచ్చట నెవరినిఁ జూడఁ బోయెదము!

చంద్రమతి——హా! ఏ మిది. ప్రాణనాథా! విషయ మరయుఁడు. యీనము కలఁతఁ జెందు చున్నది.

హరిశ్చంద్రుఁడు——అయ్యా! ఏమి సంభవించెను? వివరింపుఁడు.

యుద్ధభటులు——అయ్యో! ఏ మని చెప్పువారము! జయశీలుఁ డయిన నృపాలుఁ డొక్కఁడు కన్యాకుబ్జముమీఁద దండు విడిసి, మాప్రభువులు నిరాయుధపాణు లయినయజాగ్రత్త సమయమునం దధర్మ యుద్ధమును జేసి జయించెను.

చంద్రమతి——హా దైవమా! ఏమికాలము! ఇట్లును బరిశోధింపఁ దగునా?

(హరిశ్చంద్రుఁడు తల వంచి దుఃఖించు చున్నాఁడు. మంత్రియు దేవదాను నెత్తి పెట్టుకొని చింతిలు చున్నాఁడు.)

నక్షత్రేశుఁడు——పిమ్మట నడచిన విశేష మేమి? దాఁపక యంతయుఁ జెప్పుము; పాపము వారు కలఁతఁ జెందెదరే!

యుద్ధభటులు——అయ్యో! ఏమిపాపము! వీ రెవరు? వీరేల కలఁత చెంద వలెను?

నక్షత్రేశుఁడు——వీ రారాజునకు సమీపబంధువులు. ఈ మానిని యాయవనీశుని పుత్త్రిక.

యుద్ధభటులు——ఆహా! వీరు మాచంద్రమతి రాణిగారా?

నక్షత్రేశుఁడు——ఔ నౌను.

యుద్ధభటులు——(కలఁత నొంది) మాతల్లీ! ఏమి చేయుదము? అయ్యో! జయ మొందినయానృపాల హతకుఁడు, మారాజుగారిని రాణిగారిని, కారాగృహ బద్ధులను గావించి, యన్నపానాదుల నీయక, తలుపులకు బీగముముద్రల వేసి యుంచెను. వారు "జలము జలము" మని పరితపించుచుఁ బ్రాణవాయువులను వదలిరి. తల్లీ! ఇంకఁ జెప్పున దే మున్నది.



చంద్రమతి——అహా! దైవమా! ఈ నీచప్రపంచమునం దక్కట యిట్టి కాలదోషము గలదా!

సీ. సిరిఁ బాసి వైభవ-స్థితిఁ గోలుపోయి కాననవాసము[illegible]దూల - నాథుఁ డొప్పె
నమకోమలుం డైన-సుతుఁడు డీల్పడఁ జూచి వగచుచిత్తముఁ జిక్కఁ-బట్ట నయ్యె
నత్తగారు నయోధ్య - ననద రై కడచె నం చాలించి యెంతయు - నడల నయ్యె
నిదె తల్లిదండ్రులు - నిలఁ బాసి రనునట్టి బెడిదంపునుడి చెవు - లీఁ[illegible]లఁ జేసె
నకట దుఃఖంబు లొండొంటి - నంటికొనుచు, వచ్చుకాలంబు దఱిసిన - వగలచేతఁ
గార్య మే మంచు నెఱుఁగుదుఁ-గాని తూలు,హృదయ మోదార్చుమార్గంబు-నే నెఱుంగ

పూర్వభవంబున మే మొనరికే కష్టమును సమకూర్చి నారమో గద! ఈభవమునఁ దెలిసి మే మొకచిన్నదానఁ గొకరికిని బొసఁగించిన వారము గామే! హా! హతవిధీ! ఇట్టి పరిశోధనయుఁ గలదా!

(పుడమిపైఁ జతికిలఁబడు చున్నది.)

హరిశ్చంద్రుఁడు——(చంద్రమతి నూఱడించి) చంద్రమతీ! ఈ మహా ప్రపంచంబే నేపథ్యము. మన మందఱమును నాటకపాత్రములము. మనపనులు దీరగనే నిష్క్రమించువారము. మనవలన నేమి కొన సాగఁ గలదు? విధివశగతుల మైన సూత్రపు బొమ్మలము. ఆవిధి మనల నిచ్ఛానుసార మాడింప వచ్చును. బుద్ధిమతీ చింతపడకుము.

క. నేర్పరి పెక్కువిధంబుల, నార్పఁగ బొమ్మలు గడంగి - యాడెడుచందం
బేర్పడఁ గాన్పుము కాలస,మర్పితకార్యకరు లైన-మానవులదసఖా.

యుద్ధభటులు——అయ్యా! మారాజుగా రవసానకాలంబున మమ్ముఁ బిలిచి, తమ మరణంబును దమకుం దెలిపి, తమసాహాయ్యంబున నాపాతకుని జయించి, చిత్రవధకుం బాల్పడఁ జేయ నాజ్ఞాపించి మఱి జీవవాయువులను వదలిరి. ఇయ్యుదంతంబు దమకుం దెలుప నయోధ్యకుఁ బోయినారము. అచటఁ దమరు రాజ్యవిభూతి యంతయు నొక విభూతిధారి యగుపుట్టగోఁచుల సామికి నిచ్చి నట్ల

ంపుల నివసింపఁ బోయినా రను వెట్టిదంపునుడి వింటిమి. సార్వభౌమునిజనని పుత్త్రశోకపరవశ యాచుఁ బ్రాణానిలములను వదల, నాప్రేతంబున కపరక్రియ లాచరించుదిక్కు లేక, తుద కిరువురు పంచము లా పంచతఁ జెందిన మానినికళేబరమును దహనముచేసి రనియు వింటిమి. పౌరు లందఱు మునివరుఁడు సేయునట్టి ఘోర కృత్యంబులను జెప్పి చెప్పి ప్రలాపించెదరు. "గోరుచుట్టుపై రోఁకంటిపోటు" వలె, నీ సంగతిని విని యచ్చోటను నిల్వఁ గాలు రాక, యచటినుండి కాశికిఁ బోఁ దలఁచి, విరక్తిఁ జెంది వచ్చినాము. భగవదనుగ్రహవిశేషంబుచే మిమ్మిచ్చటఁ జూచినారము. నడచిన సంగతులను సమగ్రంబుగ మీా కెఱుకపఱిచితిమి. ఈ పరితుష్టి యొకటి మామానసంబుల కిప్పుడు పాటిల్లినది. ఇఁకను మా చేయునట్టి దేది గలదు? (అందఱును వ్యసనపడుదురు.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఆపదలయందు బుద్ధిమంతులు చిత్తజాడ్యమునకుఁ జోటీరు. చింతాగ్నికి లోపడి క్రుగ్గక, కృత్యాకృత్యముల తెఱఁగారసి, యుక్త మని తోఁచుదానిఁ దోడనే సమాచరించుట జ్ఞానసంపన్నులకు లక్షణము. దానిని వదలి నీవును, నీజాయవలెఁ జిత్తచాంచల్య మొందుట పాడి గాదు. హరిశ్చంద్ర! నే నొక్కటి చెప్పెదను వినుము. దాని నాదరించిన నీకష్టంబులు తొలంగు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! అట్టి దేదో యనుగ్రహింతురా?

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! నే నేమో చెప్పెద నని పరాఙ్ముఖుఁడవు గాకుము

ఉ. ఆపద వచ్చినం జలన - మందఁడు ధీరుఁడు దాని దాఁటఁగా
నోపును సూక్ష్మబుద్ధిత; మహోదధి నావ మునుంగుపోల్కి నా
కాపురుషుండు తూలుఁ దగు-కార్య మెఱుంగమి; నీవు నేఁడు చిం
తాపరతం గలంగుమదిఁ - దద్దయుఁ దేర్పమి పోల దెప్మెయిన్.



నీ కేర్పడినకష్టపరంపరలం గాంచి, మన స్సోర్వమి నింత చెప్పెదను. అసత్యము, చౌర్యము, వధ, మొదలగునవి సామాన్య జనసముదాయములకు దండనార్హంబు లైనదోషకృత్యము లగు చున్నవి. అయ్యవి రాజేంద్రులకుఁ దమ రాజ్యము నడుపుటకుఁ దగిన ముఖ్యపరికరములు. అ దేల యట్లు? అని వితర్కింపకుము. చక్కఁగా విచారింపుము. నాయాలోచనమును గూర్చి బాగుగాఁ బర్యాలోచింపుము. సత్య స్థితినిగూర్చి యిదమిత్థమ్మని నీవే నిర్ణయించుకొనుము. ఒకఁ డొకని వధించెనా వాఁడు రాజునెదుటకుఁ దేఁబడి, యపరాధిగా నిరూపింపఁబడి, వధింపఁబడును. క్షత్త్రియుఁ డన్ననో సేనాసమన్వితుఁ డయి, మఱొక యవనీశుని పై నెత్తి, యనేకుల జీవనంబులనుండి తొలఁగించి జయించితి నని జయధ్వజంబు నెత్తుచున్నాఁడు. అట్లు సమాచరింపనివాఁడు క్షాత్త్ర తేజంబునకుఁ దప్పినవాఁడే యగు. వాఁ డుత్తమక్షత్త్రియుఁడుగానే పరిగణింపఁబడఁడు. అట్లుండ, ననేక జీవిహంత యగు నాభూమీనేతను దండించువా రెవరు? ఎవ్వరును లేరుగా. ఒక రాజపుంగవుం డింకొకరి రాష్ట్రంబునకు, ధనాశయే కారణంబుగాఁ, బోయి కొల్లవెట్టు చున్నాఁడు. వాఁడు కొల్లగాఁ డనియా భావింపఁబడెడు. అయ్యది క్షాత్త్ర తేజంబునకు వన్నియ దెచ్చు చెయ్దంబెగాని మఱేమి? ఒక క్షత్త్రియుఁడు తనకు నిగ్రహస్థానమునం దున్న బలాఢ్యుఁ డగు రాజుతో సంధిని గోరియుండును. కాలస్థితి మాఱుటం జేసి తాను బలాఢ్యుఁ డైనను లేక యారాజు క్షీణబలుఁ డయినను, దాను నిగ్రహనీతి నవలంబించును. వానిని జయించి యణఁగఁ ద్రొక్కును. మఱియును హరిశ్చంద్రా! రాజులకు సమయదాసు లయిన క్షీణరాష్ట్రులు పునస్సంపన్ను లగుటకు ముఖ్యమగు మంత్రము సంధి విగ్రహ

తంత్రము. అయ్యది, మొదట దాసునివలె నేమొడయుని యొద్ద మెలఁగునో, వానియొద్దనే తనయనుకూలకాలంబున వ్యాఘ్రంబువలెఁ బొదలి సరాష్ట్రునిగాఁ బొరిగొనును. రాజ్యమే తంత్రోజ్జీవితము. తంత్ర మసత్యమునకు జనని. రాజకీయ రహస్యాలోచన సభయే యాయసత్యమునకు విహారభూమి. హరిశ్చంద్ర! వింటివే? తత్తత్కాలానుసారమ్ముగ యుక్తి యుక్తమ్ముగఁ బరిపోషణములకై సత్యాసత్యముల నెఱపుటయే సర్వజ్ఞత్వమున కందము. ఇట్లు నెఱపు చతురుఁడే సర్వజనులచే నాదరింపఁబడు చున్నాఁడు. కాఁబట్టి, యెట్టిదిగాని, తన జన్మస్థానముయొక్క గౌరవాదులనుబట్టి, వ్యవహరింపఁబడును. స్థానాస్థానములను బట్టియే గౌరవలాఘవంబులు గలుగుచున్నవి. ఇన్ని విషయములను హరిశ్చంద్ర! సమాహిత చిత్తంబుతోఁ బరీక్షింపఁగా నిపుడు నీరాజ్యమును మునివరులు జయశీలురై పొందినవారు గారు. నీవు దానముచేసినవాఁడవే యగుదువు. వారు చేయునట్టి ప్రతికార్యమును నీతికిఁ గడుదూరం బని పలువురు చెప్పఁగా విను చున్నాము. కావున మునీంద్రులవలనిబాధలం బరితపించుప్రజల నరికట్టి తొంటివలె నేల ప్రోవం దలపోయవు?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! దత్తాపహార మెట్లు ప్రశస్త మగును? ఎట్టు లకార్యంబునకుఁ బాలుపడుదు?

నక్షత్రేశుఁడు—పొందుటకా మార్గములు లేవు? ఒక తంత్రమే యున్నది. నేను దానిని స్మరింపఁ దగదు. ఐనను నీయున్కియు నానాగరుల మన్కియు నారయ నాకుం బరితాపంబు గదురుటంజేసి నాయెఱింగినది నీకుం జెప్పవలసియే యున్నది. వినుము.

ద్విపదలు. "జీవకోటికి మేలు - చేకూఱునట్లు
భావించి దబ్బఱ - పలుకఁగా నదియు
సత్యాతిశయ" మని - సర్వజ్ఞు లంద్రు;
వ్యత్యస్త మనరాదు - వసుధ నీనీతి.



ఒక దేశంబునకై యొకరాష్ట్రంబును నొక నగరము నిమిత్త మొక గ్రామమును నాశము చేయ వచ్చును. అట్లే పెక్కుఱు జనుల మేలునకై యొక యసత్యము వాకొన వచ్చును. కావునఁ బూర్వ మాజిటిలుఁ డైనజటికి రాజ్య "మే నొసఁగినవాఁడను గా" నని చెప్పుము. ఆపుట్టగోఁచులపుడమియెకిమీనిని పౌరసంఘంబె పాఱఁ దఱుమును. నీమీఁద దోషారోపణమున కెడ ముండదు. ఇందువలన మహాజన సముదాయంబునకు మేలొనగూర్చినవాఁడ వగుదువు. ఇది యొకటియే యుక్తపద్ధతి.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మీరు సెల విచ్చినవన్నియును మనచిత్తదృష్టికిఁ దప్పులుగాఁ దోఁప కున్నను, భగవంతునిచూపునకు గొప్ప కొఱగాములుగాఁ బొడసూపక మానవు. ఎది యెట్లయినను మనము సద్వ్రతమునుండి సడల రాదు.

ఉ. సర్వ మెఱింగి యాకరణి - సత్యముఁ బాయు మటంట పోలునే?
ఉర్వి నొసంగి కైకొనెడు, నున్మదవృత్తికిఁ బాల్పడన్; ధరా
ధూర్వహధర్మవర్తనవి-దుల్మునిపుంగవు లేల క్రౌర్యమున్
గర్వముఁ బూని భూజనుల - గాసిలఁ జేయుదు రయ్య భూసురా!

అమ్మహాత్ములయాజ్ఞలకుం గారణంబు లరయలేమిఁ బలు తెఱంగుల నాడుమూఢజనులమాటల నమ్మి నే నయోధ్యకుఁ దిరుగం జనదు. నే నతని కాడినమాట దాఁటఁ జాలను. పలుపలుకు లేల?

క. సత్యమ తపమును యజ్ఞము, సత్యమ వేదంబు దాంతి-శాంతులు నగుటన్
సత్యము దొఱఁగిన నిర్మల, నిత్యానుష్ఠానములును - నిష్ఫలము లగున్.

ఈ ప్రపంచసౌఖ్యంబుల నమ్మి, యాత్మసౌఖ్యమునె యాశించుట యజ్ఞానముఁ బాపము నపయశంబు నగును. మునివరులు మా కొఱకుఁ గొన్ని ప్రకటనంబులు ప్రచురపఱిచిన మాత్రానఁ గాఁపులకు నేకొఱఁతయు సమీపింప నీరు. వా రాత్మీయజీవంబుంబోలెఁ

ప్రజలఁ బరిపాలించువారు. అట్లగుటంజేసి ప్రజలకు మేలగునను నెపంబున మనము బాస దప్పి తిరుగుట పాడి గాదు. ఏదెట్లయినను మనము ఋషీంద్రుల ఋణమును దీర్చుటకయి ప్రయత్నించుటయే యుక్తము. ఇఁకఁ బ్రొద్దగుచున్నది. పోవుదము, స్వామీ!

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! నేను జెప్పిన యంశంబుల నించుకేనియు నాదరించినవాఁడవే గావు. ఇంకొకటి చెప్పెదను వినుము. నీమామగారు ప్రాణావసాన కాలంబున, నీచెవికి సోఁకునట్లు చెప్పి పుత్తెంచిన యంశంబును విన్నాఁడవు గద! ఎట్టివారును మరణశాసనంబును మన్నింప వలసినది మర్యాద. అట్టిదాని ధిక్కరించుట కూడని పని. అట్టిశాసనంబు గడచు మనుజుండు మహాపాతకి యగును. దానిఁ గూర్చియేనియు నాయుపదేశానుసారము చేయుదువుగాక. నీదైన్యనైచ్యంబులకు నాహృదయం బత్యంతము పరితాప పరీతం బగుటంబట్టి, హితోక్తులాడెద నని యించుకేనియు భావించినాఁడవు గావే!

చంద్రమతి—ప్రాణనాథా! ఏదియెట్లయినను మనము సత్యమునుండి తొలఁగ రాదు. పోయినవారు పోయినవారే! అట్లుగతించినవారికై చింతిల్లి ధర్మంబుఁ బోనాడి యకృత్యంబులాచరించుట యుక్తమా?

గీ. కాలగతి చెందువారలఁ - గాంచి జనులు
పొక్కి పొర్లాడి పెక్కేండ్లు - వెక్కి యేడ్వఁ
జన్నవారలు వత్తురే? - జగతిలోన
మనము వారిరి శిలల మై - మనఁగఁ గలమె?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! దేవరవారు మాస్థితికి ననుకంప గొని వచించిన హితోక్తుల కనేకవందనములు. ఐనను శీలంబునుండి తొలంగుట యెవ్వనికిం బాడి గాదు. నామామగారు నన్నయోధ్యా పరిపాలన మాచరించుచున్నవానిఁగా భావించి యీవిధమ్ముగ విధిం



చిరి. నారాజ్యమును ఋషివర్యున కర్పించిన సంగతిని వారెఱిఁగి యుండిరేని యట్లు సెలవిచ్చి యుందురా? ఉండరు. ఉండరు. కావున వారెఱుకలేమి సెలవిచ్చినమాటం దలఁచి మన మొక యకార్యంబు సేయఁ దలపెట్ట నగునా? స్వామీ! దేవరవారు మామీఁదఁ గొన్న కరుణావిశేషంబునకుఁ గృతజ్ఞుల మైతిమి. ఇఁకఁ గాశీక్షేత్రంబుఁ జేరి, యచట నెవ్విధంబుగా నైన, ధన మార్జించి, ఋషిధూర్జటి కొసంగి ఋణవిముక్తిఁ బడసి సత్యసంస్థాపనంబును బొనరించుటే మాకుత్తమపథంబు. ఇక్కార్యంబున మమ్ముఁ గృతార్థులు గావించునట్లు లనుగ్రహింతురుగాక! అనుగ్రహించి దయ చేయవలయును.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! రాజ్యాంగమునఁ బరిపాలింపఁ దగిననీతి వైఖరులను గొన్నింటిని వాక్రుచ్చితిని. ఇష్టపడకున్నను వదలివేయుము. నీయిచ్ఛకు వచ్చినట్లే చేయుదము.

(అందఱును నిష్క్రమించెదరు.)

ఇది యష్టమరంగము.

## నవమరంగము.

స్థలము : శోణనదీతీరము.

కాలము : మధ్యాహ్నము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, జ్యోతిష్కుఁడు.

సత్యకీర్తి—రాజేంద్రా! ఇదిగో శోణనది గనఁబడుచున్నది. మునివరుని యవ్యాజకృపచేత ననేక పుణ్యతీర్థములను దర్శించుటకును నందుం

గృతస్నాతులమై పాపంబులను బరిహరించుకొనుటకును బాత్రులమైతిమి. ఈ దిన మీనదీతీరముననుండి పో వచ్చునని తలఁచెదను.

హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తి! అట్లే చేయుదము. విజ్ఞాను లైనయోగులును దీర్ఘయాత్రల నపేక్షింతురు. అట్టివి మనకు దైవికంబుగఁ దటస్థించుట మనచేసిన పూజాఫలమే యగును. ఈవిధమున నైనను బాపవిముక్తులమై సుకృతవిశేషమును జెందుదము. (నక్షత్రేశునిఁగూర్చి) స్వామీ! నేఁ డీశోణనదీతీరమునందు దిగి యిప్పుణ్యసరిత్తునందుఁ గృతావగాహులమై పోవునట్లు సంకల్పించినారము. దేవరవారి చిత్త మెట్లో? ప్రకాశపఱుప వలెను.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! కాలయాపనము చేయుటచేత నీకు నష్టమే గాని నా కొక్కటియును లేదు. ఎచ్చట నున్నను నా కొక్కటియే. భోజనము మాత్రము తక్కువ లేకుండ వలెను. ముందుగా దానికి మార్గము వెదకుము. పిమ్మట మీయాటపాట లిష్టానుసారముగా నెఱవేర్చుకొన వచ్చును.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! భోజనమున కెప్పుడును గొఱఁత గలుగదు. మేము పోయి పరిపక్వఫలములను గోసికొని యిప్పుడే వచ్చెదము.

(పోవు చున్నారు.)

(హరిశ్చంద్రుఁడును సత్యకీర్తియును ముందుగా వచ్చి నక్షత్రేశునియొద్దఁ జేరు చున్నారు. చంద్రమతి కొంతదూరమునం దుండి దేవదానునకుఁ బండ్లు దిన నిచ్చు చున్నది.)

సత్యకీర్తి—స్వామీ! ఇదిగోఁ దెచ్చినారము పండ్లను. అనుగ్రహించి మంచిపండ్లను భుజించి తృప్తిఁ జెందుఁడు.

హరిశ్చంద్రుఁడు—స్వామి! ఇది మిగుల మాఁగినపండు, చూడుఁడు. సత్యకీర్తి! మనబిడ్డఁ డెక్కడ?



సత్యకీర్తి—అదిగో నున్నారు. రాణిగారు వారికిఁ బండ్లను దినిపించు చున్నారు.

హరిశ్చంద్రుఁడు—సరి, అట్లే తినిపింపనిమ్ము.

(జోస్యులు వచ్చు చున్నారు.)

జోస్యులు—అయ్యా! మీరు కాశికిఁ బోవు చున్నారా?

సత్యకీర్తి—ఔను. అయ్యా! మేము కాశికిఁ బోవుట మీ కెట్లు తెలియ వచ్చెను?

జోస్యులు—మాకు జ్యోతిషము కరతలామలకము. దేనినైనను బ్రత్యక్షమునఁ జూచినట్లు చెప్పఁ గలము.

సత్యకీర్తి—ఔరా! సంతోషము. మీ రేశాస్త్రము ననుసరింతురో?

జోస్యులు—(మందహాసముతో) శాస్త్రమా! మేము బాల్యము మొదలుకొని శుక్రమహానాడి, చంద్రనాడి, గురునాడి, కాలామృతము, వృద్ధపారాశరము, నక్షత్రచూడామణి, కేరళప్రశ్నము, సంతానదీపిక, ఫలదీపిక, బృహజ్జాతకము, ముహూర్తదర్పణము, ముహూర్తమార్తాండము, జాతకచింతామణి, సర్వార్థచింతామణి, ఛప్పన్నము, అష్టకవర్గు, కాలచక్రము, ముహూర్తకంఠాభరణము, ముహూర్తసంగ్రహము, జ్యోతిషార్ణవ నవనీతము, ఆరూఢరత్నసిద్ధాంజనము, మొదలైన యనేకకోటి జ్యోతిష గ్రంథములను జూచి చూచి విసిఁగి యున్నాము.

సత్యకీర్తి—అయ్యా! ఇప్పుడు కొంచెము జాతకము చూడవచ్చునా?

జోస్యులు—ఆహా, దాని కేమి? చూడ వచ్చును. ఐన నిప్పుడు నాకు మిక్కిలి యాఁకలిగా నున్నది.

హరిశ్చంద్రుఁడు—అట్లయిన నీపండ్లలోఁ గొన్నిటిని భుజించి యాఁకలిని బోఁగొట్టుకొన వచ్చునే. (ఇచ్చు చున్నాఁడు.)

జోస్యులు—(తిను చుండి) ఎవరిజాతకము? జాతక మిక్కడ నున్నదా?

హరిశ్చంద్రుఁడు—మనచిన్నవానిజాతకమే. జాతక మిక్కడ లేదు. పుట్టిన తిథి వారములు మొదలగునవి జ్ఞాపకమునం దున్నవి.

జోస్యులు—ఓ, చాలును. చాలును. అంతే చాలును. దైవజ్ఞచూడామణి కెంత కావలెను? అంత దొరకినయెడల నఱువదివత్సరముల పంచాంగములను సైతము నర్ధక్షణములో గుణింప వచ్చును. అది యొక పెద్దపని కాదు. ఏదీ చిన్నవాఁడు పుట్టినదినమును జెప్పుఁడు?

సత్యకీర్తి—భావనామసంవత్సరము. పుష్యమాసము. పూర్వపక్షము. నవమితిథి. భరణి నక్షత్రము. కర్కాటకలగ్నము. ౨౩ గడియలు ౩౦ విగడియలు.

జోస్యులు—సరి, సరి. ఇదో చక్రము వేసికొనెదను. (కొంచెము మీఁదఁ జూచి) ఊఁ - ఊఁ - సరి, సరి. కుమారునికి రమారమి యెనిమిది వత్సరముల యీఁడా?

హరిశ్చంద్రుఁడు—ఔ నౌను, సరిగా నెనిమిది సంవత్సరములే.

| | | | |
|---|---|---|---|
| | చంద్రుఁడు | కేతువు | |
| | రాశి చక్రము శుభము | | లగ్నము గురు |
| సూ - అం. శని | | | |
| బుధ | రాహువు | శుక్ర | |



జోస్యులు—జోస్యము సరిగా లేక పోవునా? అంతయును గణితమే కదా?

హరిశ్చంద్రుఁడు—ఔ నౌను. అది యేల తప్పును? ఈ జాతకమును గొంచెము గమనించి చూడుఁడు.

జోస్యులు—అట్లే కానిమ్ము. మొదట నీ జాతకమునకు గ్రహసంపత్తిని జెప్పెదము. కొంచెము చెవియొగ్గి వినుఁడు. షష్ఠభాగ్యాధిపతియైన గురువు లగ్నమునం దుచ్చుఁడుగా నున్నాఁడు. సుఖాధిపతియైన శుక్రుఁడు కళత్రకారకుఁడై, మాతృస్థానమందు శుభక్షేత్రఫలమును జెంది, లగ్నాధిపతి యైన చంద్రుని సప్తమకేంద్రమునుండి చూచు చున్నాఁడు. తృతీయ వ్యయాధిపతియైన బుధుఁడు షష్ఠస్థాన మైన ధనుస్సునందు నిలిచి యున్నాఁడు. రాహువు పంచమస్థానమునం దున్నాఁడు. ధనకుటుంబవాక్స్థానములకు నధిపతియైనరవియును బంచమ ధర్మకర్మాధిపతియగు భౌముఁడు నుచ్చతను జెంది, గురువును జూచు చున్నారు. సప్తమమందు ధనవాక్కుటుంబములకు సంబంధ పడిన పితృకారకుఁ డగు సూర్యునితోడను, గర్మపంచమాధిపతియు సహోదరకారకుఁడును నుచ్చస్థుఁడును నగు నంగారకునితోడను, నాయుష్కారకుఁడైన మందుఁడు సప్తమస్థానమునందుండి లగ్నమును జూచు చున్నాఁడు. లగ్నాధిపతియైన చంద్రుఁ డాయింటికిఁ గర్మ స్థానమయిన మేషమును జెంది, తత్స్థానాధిపతియగు నంగారకుని చేత సూర్యసంబంధముతోడఁ జూడఁబడు చున్నాఁడు. ఏకాదశస్థాన మయిన వృషభమునందుఁ గేతు వున్నాఁడు. ఈ గ్రహసంపత్తికిఁ దాత్కాలికఫలము:—షష్ఠభాగ్యాధిపతి లగ్నమునం దుచ్చుఁ డగుటచేతఁ గిరీటాధిపత్యమును వహింప వలసినస్థానమం దీజాతకుఁడు పుట్టి యుండ వలెను. సుఖము, విద్య, వాహనము, భూస్వాస్థ్యము,

వీని కధిపతి యగు శుక్రుఁడు, సుఖస్థానలగ్నాధిపతి యైనచంద్రుఁడు కర్మస్థానమునందు నిలిచి, కర్మస్థానమునకుఁ దనసప్తమ ధనాధిపతి యగు శుక్రుని లగ్నాధిపతి యగుచంద్రుఁడు చూచు చుండుటచేతఁ బ్రభుస్థానమునుండి తొలఁగి, తల్లితోఁ గొన్నిదినము లుండి పిదపఁ దండ్రినిఁ జేరును. ఇంకను రాహువుతోడ సంబంధపడుటచేత నాస్థానాధిపతి యగు నంగారకుఁడు తద్గృహంబునకుఁ దృతీయస్థానమునందు, ననఁగా మకరమందు, నిలిచి శుక్రునితో సంబంధపడి, తనకు విరోధి యైనగురువును జూచుటచేతను, భరణియందుఁ బుట్టిన యీ జాతకునకు జననకాలమందు శుక్రదశ యగుటచేతను, జాతకుఁడు

ద్విపదలు—భువిఁ గటకంబునఁ - బుట్టినవారిఁ
గవికష్టములఁ బెట్టి - కారించు నకట!
వరసంపదల మీఱి - వర్ధిల్లురాజ
వరులును గ్రమంది రా-భార్గవుకతన.

అనునట్లు ప్రభుస్థానపదవినుండి చ్యుతుఁడై యనేకమనఃక్లేశములుఁ గష్టములు మహాదారిద్ర్యము ననుభవించును. ఇవిగాక మాతృపితృవర్గములలోఁ గర్మమునుగూడ చూపును. అయ్యా! మేము చెప్పుటలో మీ కేదయిన యనుభవసిద్ధ మేర్పడినదా?

సత్యకీర్తి—ఆహా! సర్వమును సత్యమే. వెనుకఁ జెప్పుఁడు?

జోస్యులు—లగ్నమునకు నష్టమస్థానంబునఁ దత్స్థానాధిపతియు నాయుస్స్థానాధిపతియు నాయుష్కారకుఁడు నైన శనైశ్చరుఁ డాంత్య గలిగి యుండుటచేత, జాతకునికిఁ బెక్కు వేలగండములు గలుగుచుండును. (చుట్టుప్రక్కలఁ జూచి) జాతక మన్న నొకపెద్దశాస్త్రము. అది యున్న దున్నట్లే చెప్పునది. మంచివిషయములుగా నున్న నందఱకును సంతోషము. చెడుగులవలన మనస్సంకటము గలుగును.



అందులో దగ్గతించిన తలిదండ్రులు బంధువులు మున్నగు వారిముందట నట్టి వానిని విస్తరింపరాదు. అందులోను స్త్రీజాతు లున్నప్పు డట్టిదియును దెలుపరా దని శాస్త్రవిధి. అట్లే మాకు నుపదేశింపఁబడి యున్నది. స్త్రీజాతు లెవరు నిచ్చట లేరే?

సత్యకీర్తి—సమీపమునం దెవరును లేరు. ఉన్న దాని నున్నట్లు చెప్పుఁడు. అదె రాణిగారు బాలరాజుతోడ దవ్వున నె యున్నారు.

జోస్యులు—అయ్యో పాపము! స్త్రీజాతు లున్నఁ జెప్పరానివ్యసనమును జెందుదురు. వారు వచ్చిన నీసంగతిని బయటఁ బెట్టరాదు. ఏమి పాపము (మెల్లఁగా) శీఘ్రముగనే తండ్రి వియోగము చెందును.

(సత్యకీర్తియును హరిశ్చంద్రుఁడును గ్రీఁజూపులతో మనస్సునఁ గలఁతఁ జెందు చున్నారు.)

జోస్యులు—ఏమి చేయ వచ్చును! ఉన్న దున్నట్లు చెప్పు మనుటచేతఁ జెప్పితిని. కలఁతవలనఁ బ్రయోజన మున్నదా? మీ రేయి ట్లున్నఁ బాపము స్త్రీలు విన్న నే మగుదురు? వారి జీవములు శరీరమునందు నిలుచునా? ఏమియును జెప్పక మౌనముగా నుండుఁడు.

(చంద్రమతి దేవదాసునితోడ వచ్చు చున్నది.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఏల యింతకలఁతఁ జెందెదవు? నా కేవో రెండుకసరుకాయలను దెచ్చితివి? బాగుగా నుండ లేదు. ఏదో యొకటి కొంచెము బాగుగ నుండెను. వానిని జోస్యులవారి కర్పించి నీబిడ్డని జాతకమును జూచుకొంటివి. నే నేమిం చేయవలెను? లేచి పోయి మంచివిగా యింకను నాలుగుపండ్లను దెమ్ము?

(హరిశ్చంద్రుఁడు లేచు చున్నాఁడు.)

చంద్రమతి—ప్రాణనాథా! జాతకమా చూచు చుంటిరి? జోస్యు లేమి చెప్పిరి?

హరిశ్చంద్రుఁడు—సతీమణీ! మన కిదివఱకు సంభవించినవాని నన్నిటిని క్రమముగాఁ జెప్పిరి. కట్టకడపట—యు—ను—

చంద్రమతి—ముగియుకయుం దేమి సెలవిచ్చిరి? కొంచెము చెప్పుఁడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! అది యుండనిమ్ము. నీవు పొమ్ము. వ్యర్థముగాఁ గాలమేల కడపు చున్నావు.

చంద్రమతి—ప్రాణనాథా! తుదకు జోస్యులవా రేమి సెలవిచ్చిరి?

హరిశ్చంద్రుఁడు—కాంతామణీ! మనముద్దులపుత్త్రునికి నెన్నియో గండములు సంభవించు ననిరి.

చంద్రమతి—అయ్యో! గండములా? పిమ్మట? (చేతులను విఱుచుకొను చున్నది.)

హరిశ్చంద్రుఁడు—పిమ్మట నే మున్నది? "త్వరలోనే తండ్రి వియోగము గల్గు" ననిరి.

(చంద్రమతి మూర్ఛిల్లు చున్నది. హరిశ్చంద్రుఁ డుపచరించు చున్నాఁడు.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! అప్పుడే సన్న చేసి తొలఁగిపోవునట్లు చెప్పినాను. చెప్పరా దనియును జెప్పితిని. ఇప్పుడీపా టెవరు పడెదరు? వచ్చునది వచ్చియే తీరును. వచ్చువానిని రానీయక నిరోధించుట కెవరికి శక్యము? ఇట్లది మనస్సునం దుంచుకోఁ జాలక బయట వేసితివే! వల దనిచెప్పిన జోస్యులవా రెదుటనే యుండఁగా, నేను నడ్డగించు చుండఁగా, మీఱి చెప్పివేసితివే. ఆఁడువారి నోట మాట దక్క దందురు. అది యట్లుండ నేఁడు నీవలన మగవారి నోట మాట దక్క దనియు నేర్పడెనుగా. ఏమి పొమ్ము. ఎంత చెప్పినను వినవు. పడుము. పడుము. పడి చెడిననే కాని తెలియదు.

హరిశ్చంద్రుఁడు—నావ్రతమునకుఁ దగనిత్రోవ నెన్నండును మెట్టనోప. సత్యమునకు విరోధముగా నెన్నఁడును బల్కఁజాల.



క. అడిగినదానికి నుత్తర, మిడుసెడ నున్నది దొఱంగి - యెటు లేనిదియు
న్నడుపుదు? మునివర సత్యమె, తొడ వగు ధర్మాత్ములకది - తొలఁగఁగఁ జన్నే?

(చంద్రమతిని జూచి) సతీమణీ! కలఁగకుము. వచ్చునది రానిమ్ము. దీనికా మనము మనోవేదనను జెందుట? బిడ్డ యెవఁడు? నీ వెవతెవు? నే నెవ్వఁడను? యోజించి చూడుము.

చంద్రమతి—(ఎట్టకేలకు శోకంబు నణఁచి) ప్రాణేశా! ఈశ్వరునిచిత్త మట్టిది యైన మన మేమి చేయఁగలము? ఇఁక వీఁడు మనబిడ్డఁడు కాఁడు. అని తీర్మానించుకొనవలెను. ఔరా! ఇట్టికాలముకూడ సంభవించునా? ఎవ్వరి కేయపకారమును జేసితిమో?

(అంద ఱొక్కింత కలఁకఁ దీఱి, లేచి సాఁగు చున్నారు.)

నక్షత్రేశుఁడు—అయ్యా! జోస్యుఁడుగారూ? మా కేమి జోస్యము గీస్యము లేదా? నేనును రెండుపండ్ల నీయఁ జాలనా? తమ రిది వఱకుఁ దిన్నపండ్లు సైతము మాభాగముతోఁ జేరినవే గద! వంచన దగదు. ఇక్కడికి రండు, మాకుఁ జేర వలసినధనము చేరఁ గలదో లేదో కొంచెము చూడుఁడు.

(ఇరువురును జేరి మాట లాడికొనెదరు.)

నక్షత్రేశుఁడు—అయ్యా! ఈరాజు కొంచె మైనను ధర్మమార్గంబునకుఁ దప్పఁడు. మునివరునియభిప్రాయము కొంచె మైనను గొనసాఁగి రాన ట్లున్నదే. ఎంతసూక్ష్మపరిశీలనమందును వాఁడు ధర్మము తప్పక జాగరూకుఁడై సత్యముమీఁదనే దృష్టి యుంచి యున్నాఁడు. వాఁడు మాత్రమే గాక యతనిసహధర్మిణియు వానికన్నఁ బదిమడుంగు లధికస్థైర్యమును గొని యున్నదే! మఱియు నామంత్రికి సత్యకీర్తి యనునది సరియైన పేరు. ఈ మూవురిని దైవ మొకటిగఁ జేర్చి

యున్నది. వీరిని జయించుటకు మునివరునిచేతను గాదు; ముమ్మూర్తులచేతను గాదు.

జోస్యులు—సర్వమును నేనే ప్రత్యక్షముగఁ జూచినానుగా! మన మేమి చేయ వచ్చును? మనవలన నైనంత మట్టుకుఁ బ్రయత్నించెదము. ఒకటి యును బ్రయోజనపడినది గాదు. ఆమునినాథున కీవిషయముల నన్నిటిని వివరించి చెప్పెదను. మనమీఁదఁ గోపింతురు. కోపించిన మన మేమి చేయ వచ్చును? పోయి వచ్చెదను.

(నిష్క్రమించు చున్నాఁడు.)

ఇది నవమరంగము.

---

## దశమరంగము.

---

స్థలము: యమునానదీతీరము.

కాలము: మధ్యాహ్నము.

పాత్రములు: నక్షత్రకుఁడు, హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, తత్త్వశాస్త్రి, అష్టావధాని.

---

నక్షత్రకుఁడు—హరిశ్చంద్ర! ఇదిగో మనము యమునానదిఁ జేరితిమి. ఇఁక మన మిచ్చట నిలిచి పోవుదము. ఆఁకలిచేత మూర్ఛగ్రమ్మి చెవులు మూఁతలు పడుచున్నవి. కాళ్లో, పై యడుగుపెట్టనీయక తొట్రిలుచున్నవి. ఏమికష్టము? ఏమిశ్రమము? సాహాయ్యమునకయి ప్రాల్మాలిబడఁ గట్టుట యెప్పటికిని బ్రాణాపత్తు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! సంకటపడ వలదు. ఇఁక రెండుమూఁడు దినములలోఁ గాశీక్షేత్రమును జేరఁ గలము. అంతవఱకును దేవర వారు కష్టముల నెల్ల నోర్చి మన్నించి నాయెడఁ గృపఁ జూప వలెను.



నక్షత్రకుఁడు—ఇది యేమిటుమూర్ఖణము? మీతోడ నెన్ని దినము లిట్లలమటపడుట! ఏదైనఁ దగిన తిండి యున్నదా? నిద్ర యున్నదా? నిద్రాహారములు చెడినట్లయిన శరీరమున కేమిగతి? ఇదిగో నిరువురు బాటసారులు వచ్చు చున్నారు. వారియొద్ద మనన్యాయమును జెప్పుకొందము. (బాటసారులంగూర్చి) అయ్యలారా! కొంచె మిటు రండు. ఈ యన్యాయమును గొంచె మాలకింపుఁడు.

తత్త్వశాస్త్రి—ఏమయ్యా యది? మమ్ము నేల యీడ్చు చున్నారు?

నక్షత్రకుఁడు—వీ రయోధ్యకు రాజుగా నుండిరి. వీరు విశ్వామిత్రుల కప్పు నీయ వలసి యున్నది. దానిని నాయొద్దఁ జేర్చునట్టు లొప్పుకొని యున్నారు. ఇంకను దాని నిచ్చినపాటును లేదు. నేనో నిద్ర చెడి, యాహారము చెడి, వీరితో నడవు లనక కొండ లనక రాళ్లనక ముండ్లనక యెండ యనక గాలి యనక యన్నిటికి నోర్చి త్రిమ్మరి త్రిమ్మరి జాలిం బడితిని. వీరో కన్ననదులందును దోఁపులందును సత్రములందును జావడులయందును దిగి దిగి కాలము పుచ్చు చున్నారు. ఆఁకలి యన్న నిదె పండ్లను దెచ్చెద మని పయ్యెర గాలికి బూరుగుప్రత్తివలె పరువులు పెట్టుచున్నారు. ఇదేమి నీతి? పరిశీలించి సెలవిండు.

తత్త్వశాస్త్రి—(హరిశ్చంద్రునిఁ జూచి) మీ రేమి చెప్పెదరు?

హరిశ్చంద్రుఁడు—ధన మీయ వలసినయంశ మేమో నిజమే. నే నామొత్తమును నలువదిదినములలోపలనే చేర్చునట్లు వాగ్దానము చేసి విడుదలఁ జెంది వచ్చి యున్నాను. ఇప్పటి కించుమించుగ నిరువది దినములే యగు చున్నది. ఇఁకను రెండుమూఁడు దినములలోఁ గాశీక్షేత్రమును జేరి యిచ్చివేయున ట్లుద్దేశించి యున్నాఁడను. అంతకాలము కొంచె మోర్చికొని యుండుఁ డని వీరిఁ బ్రార్థించి కొనెదను. ఇదియే నా విజ్ఞాపనము.

తత్త్వశాస్త్రి—మీయిరువురిమాటలును విన మిగులవిచిత్రములుగానే యున్నవి. ధనమఁట—ఋణమఁట. ఈయవలసినదఁట. తీయవలసినదఁట. బాగు, బాగు; లోకమునందుఁ గనఁబడునట్టి వన్నియు మిథ్యలు. ఆధనము ననుభవింపఁ దగినయీశరీరమే మిథ్య యగునప్పుడు మఱేవస్తు వీ ప్రపంచమునందు సత్య మనఁ దగినది గలదు? ఇదియునుగాక మీరు సర్వమును వదలిన సన్యాసులవేషమునఁ గనఁబడు చున్నారు. "ఆధనము మునిపుంగవునకుఁ జేరవలసిన" దనెదరు. ఏధనము? ఆహా! ఇ దేమి జ్ఞానము? ఏమి తెలివి? (హరిశ్చంద్రునిఁగూర్చి) అది యుండ నిమ్ము. దీనికై మీ రేల పరితపించెదరు? ఏధన మెవరి కైనది? ఇదేల మీకుఁ దెలియ లేదు. "ధనము లేదు ద్రవ్యములేదు పోయి ర మ్మని" చెప్పి పంపుఁడు.

నక్షత్రేశుఁడు—ఓహో! మంచి మాధ్యస్థముగా నున్నది? అ ప్పడిగినందులకా యద్వైతతత్త్వములు? ఏమీ హరిశ్చంద్ర! ఇవ్విధముగా నా ముందే యొకమనుష్యుని జాగ్రత్తపఱిచి యుంటివా? వీరాడు మాటల ధోరణినిఁ జూడఁగా మీకనుకూలురుగాఁ గనఁబడు చున్నారు. మంచిది, వారియభిమత ప్రకారమే లే దని చెప్పుము. నేను వెడలెదను. నా కేల యీశ్రమము?

హరిశ్చంద్రుఁడు—స్వామీ? దాను నాలాగు భావింప రాదు. (తత్త్వశాస్త్రినిగూర్చి) అయ్యా! తమ రొక పెద్దలుగా వెలయు చున్నారు. జగత్తునందలి వన్నియును మిథ్య లగునా? మిథ్యయన్న తోడనే సత్య మొకటి యెదురుపడు చున్నదే. ఆసత్య మొకటియే సర్వులకు నుతిపాత్రమై యాదరణీయ మగు చున్నది. ఆసత్యమే సర్వశక్తిగల భగవంతుని సత్స్వరూపమై వెలుఁగొందు చున్నది. ఆకారణముచేత నాసత్యము నాశ్రయించి, దానిఁ జేవదలని వారికి శాశ్వతమగు



సౌఖ్యమునిచ్చు ముక్తి లభించు చున్నది. ఇది నిశ్చయము. తమ రీన్యాయమును దెలిసి యుండియు నిట్లు సెలవీయఁ దగునా?

తత్త్వశాస్త్రి—ఆహా! మంచి సిద్ధాంతమయ్యా యిది? మిథ్యకు సత్యము విరోధియా? అ ట్లైనచో మీయభిప్రాయమునం దుపనిషద్విదితమయిన 'సర్వమ్ మిథ్య' యను మహావాక్యము సత్యమా మిథ్యయా? మిథ్య సత్య మగుచో మిథ్యకు సత్య మెట్లు విరోధి?

హరిశ్చంద్రుఁడు—సత్య మెట్లు మిథ్య యగును?

తత్త్వశాస్త్రి—వేయిమాట లేల? మీరు సత్యమా మిథ్యయా?

హరిశ్చంద్రుఁడు—ఓహో? మీ రనుదానికి శరీరమునా లక్ష్యభూతము చేయుచున్నారు? అట్లయినచో మేను మిథ్యనేయౌదు.

తత్త్వశాస్త్రి—మఱిదేని కన్వయించు కొనెదరు?

హరిశ్చంద్రుఁడు—సత్య మనఁగా శరీరాదులు గావు. ఏయొక విషయము మనోవాక్కాయము లనుత్రికరణములయందు సమాన సంచారమును గలిగి యుండునో యట్టి విషయమునుగూర్చి చెప్పినాను.

తత్త్వశాస్త్రి—ఆఁ - ఆఁ - ఏమి యీ యనన్వితగ్రహణము! బాగు బాగు. సకల విధములగు—ఆఁ - పలుమాట లేల? ఆగామి సంచిత ప్రారబ్ధములకు లక్ష్యభూత మీశరీరము. ఇట్టి శరీరమును మిథ్య యని మీరే యొప్పుకొంటిరి గద? సంతోషము. అట్టి మిథ్యాశరీరమునందలి కరణ త్రితయము లెట్లు సత్యములు? వానికి విషయభూతము లౌవిషయములును మఱియెంత సత్యములు? యోజింపుఁడు. సర్వంమిథ్యా, మిథ్యైవ సత్యమ్. అన్నట్టు లన్నియు నసత్యములు. అసత్యమే సత్యము. మీరు వంధ్యాపుత్త్ర న్యాయమును సాహసించి స్థాపింపఁ గోరెదరు. కాఁబట్టి సత్యమే యసత్యము.

అసత్యమే సత్యము. సత్యాసత్యములు రెండు నొక్కటియే. మేము బోధించు నీసూక్తియే సత్యము. మీరు తలఁచియుండు తలంపే యసత్యము. సత్యావలంబముచేత ముక్తి లభించు ననెదరు. ఇ దేమి వెఱ్ఱితనము? మేము మఱి మఱి పరిశీలనము చేసి చూడక తక్కినది యొక తత్త్వశాస్త్రమును లేదు. అం దొక్కదాని యందైనను మీరు చెప్పిన న్యాయము గోచరించినది గాదు. రూపమే శూన్యమనునప్పుడు నామ మెక్కడిది!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! తత్త్వశాస్త్రావలోకనమునకు నిదియే కాఁబోలును ప్రయోజనము? ప్రపంచమునందు వారు వారు చేయు సుకృత దుష్కృతములకు ననుకూలముగాఁ బ్రభుఁడు సుఖదుఃఖముల ననుగ్రహించు చున్నాఁడు. ఈ యంశము మీ చిత్తవృత్తికి వచ్చినది కాదే?

తత్త్వశాస్త్రి—సుఖ మేది దుఃఖ మేది? ప్రభుఁ డెవఁడు? గిభుఁ డెవఁడు? ప్రపంచమే పాంచభౌతికము. ఈ లోకమునందలి ప్రతి చరాచరమును బంచభూతసంబంధియే. ఒక్కొక వస్తువును, మొదట జలమునుండి కలిగి తృణరూపమును జెంది యనంతరము కందమూలముల రూపమును జెంది యీఁపియై సరీసృపము లయి వన్యమృగము లయి రూపు మాఱి పిమ్మట, మనుష్య శరీరమునకు సమీపించిన క్రోఁతి యాకారము నాశ్రయించు చున్నది. ఆకారణముచేతనే క్రోఁతి యును వానరమని పిలువఁబడు చున్నది. అటుపిమ్మట మనుష్యాకృతి గలుగును. ఇవ్విధముగా జీవ మెనుబది నాల్గులక్షల శరీర భేదములలో మాఱి మాఱి సంచారమును జేయును. ఇదొక్కటియే మహాప్రపంచోదయమునకుఁ దగిన ముఖ్యకారణ మగును. ఈ శరీరము పోషించువఱకు నిలుచును. జీవము శరీరమునుండి వియోగ



మొందినంతన యాయాభాగ మాయాభూతములోఁ గలిసి పోవును. మన్నునఁ జేరిన భాగము స్థావరముల కాహార మగును. ఆస్థావరములు, పశుపక్ష్యాది తిర్యగ్జంతువులు మనుష్యులు మొదలగు జీవకోటులకు నాహార మగును. అదియే సత్తయి పిండోత్పత్తికిఁ గారణభూత మయి యాకారమును వహించి గర్భకుహరమునుండి నిర్గమించును. కొంతకాల ముజ్జీవించి యుండును? పిమ్మట మరణమును జెందును. ఇవ్విధముగానే "పునరపి జననమ్ పునరపి మరణ" మ్మనునట్లు, మాఱి మాఱి వచ్చునట్టి యోగ్యతను గలది. ఇట్టి సుప్రసిద్ధన్యాయమును దెలియమిచే లోకములకు మీఁద నొకఁడున్నాఁ డనియు, వాని యాజ్ఞానుసార మొకఁడు నొసట వ్రాయుచున్నాఁడనియు, మఱొక్కఁడు చీటిని జింపుచున్నాఁ డనియు, నొకఁ డంటఁ గట్టి యీడ్చుకొనిపోవు చున్నాఁ డనియు, నరకమునందుఁగాని మోక్షమునందుఁగాని పడఁద్రోయు చున్నాఁ డనియును, బురాణములు మొఱపెట్టుటను, దృఢముగా నమ్మి కొంద ఱంగీకరించు చున్నారు. ఇవన్నియు వ్యర్థాలాపములు. కట్టు కథలు. చనిపోయిన వెనుక శరీరికి శరీర మెక్కడిది! శరీర విహీనతచేత స్పర్శేంద్రియవ్యాపారము చెడును. స్పర్శజ్ఞాన విహీనతచే సర్వమును శూన్యతఁ జెందు చున్నది. దీని వదలి పనికి మాలిన తలంపులచేతఁ గష్టములకుఁ బాల్పడుట తెలివిలేమి. ఇప్పుడు మీ తెలివిలేమివలన నభివృద్ధి చెందిన యాపదను గూర్చి బాగుగా విమర్శింపుఁడు. మిమ్మును ఋణసముద్రమునందు ముంచినది యిదియే కాక మ ఱేది? మీవలెనే నిజమును సాధనముగా దృఢపఱిచికొని యున్నవా రిదిగో నున్నారు. వీరిగతిని వినుండు.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మీ రెవ్వరో? తమకు సత్యముచేత నేమి కీడు సంభవించినది? కొంచెము వివరముగాఁ జెప్పుఁడు.

అష్టావధాని—అయ్యా! నేనును మీవలెనే సత్యమే మహనీయ మని తలఁచి యుంటిని. కొంచెము సావధానముగా వినుఁడు.

ద్విపద. వారాణసీక్షేత్ర-వరమున నేను
గౌరవార్హుం డైన-త్వాను రేఖునికి
భూపాలకాళిసం-పూజితమతికిఁ
బాపౌఘతిమిరభా-స్వద్వియన్మణికిఁ
గొమరుండ నై పుట్టి - గోముగాఁ బెరిఁగి,
కొమరారఁగాఁ గళల్ - కొదవ లేక యుండ
సాంతంబు గాఁగఁ దూ-చా తప్ప కుండ
నెంతేఁ బఠింప న-హీనవైదుష్య
మలవడె నాషోడ-శాబ్దంబు నాఁడె.
చెలరేఁగి నను జనుల్ - శేముషీఖనిగ
వినుతింప జగమునఁ - బే రొందినాఁడఁ
దనరునాయష్టావ-ధానక్రమంబుఁ
బనిపూని యభ్యసిం-పంగ నే నంత
మనమునఁ గాంక్షించి, - మహిమ మీఱంగఁ
జతురంగమున సేనఁ - జతురత నడుప
గతిఁ జిక్కి జరుగ కే-కాయనుగాని,
యతివేలముగను, ష-హా చెప్పి నిల్పి,
మతిఁ దలపోసిన - మానవేంద్రునిన
భటునిచేఁ గట్టించి - పరిభవింపంగ
భటునికై చిక్కిన - పార్థివేంద్రునిని
బరసైన్యములఁ గూల్ప - బలసమగ్రునిఁగ
విరచింప నేర్చితి - విదిత మాప్రతిభ.
తిథివారనామముల్ - దెలిపినఁ జాలుఁ
బృథివిఁ దద్వర్షంబుఁ - బేర్కొని త్యాజ్య
కరణనక్షత్రముల్ - గడువింత దోఁప
గరిమఁ బంచాంగంబు - గణియించి చెప్పఁ



దెలిసికొంటిని గాని - తీవ్రమాప్రజ్ఞ.
పలుకుబోటికి వీఁడె - బంధువుం డనఁగ
బరుదార నేదేని - యక్కరం బొంది
కరము వ్యస్తాక్షరిఁ - గబ్బంబుఁ గూర్పఁ,
జిత్రప్రబంధముల్ - సెప్పినయట్లు
శ్రోత్రపర్వంబుగా - సారిదిఁ బఠింపఁ,
శతశతలేఖినీ-త్రాణుండ నౌచు
వితతపదౌఘముల్ - వేవేగఁ బల్కి
గతిమాఱుదల లేని - కబ్బము ల్సేయ,
శితికంఠకరుణ నే ర్చితి నెల్లబుధులు
నతులితుం డితఁడు వి-ద్యావాప్తి నంచు
నుతియించి నన్నుఁ గ-న్నుల నొత్తికొనఁగ.

ఇట్టి మేలిమిని జెందిననే నవధానమునం దొక చిన్నమాటను మార్చి చెప్పుటకుఁ బ్రాల్మాలి యీగతిని దెచ్చుకొంటిని.

హరిశ్చంద్రుఁడు—అవధానమునందు మార్చి చెప్పఁ దగినది యేది? అన్నియు నుండునవి యున్నట్లు చెప్పఁ దగినవే కదా?

అష్టావధాని—మీరు చెప్పుట యథార్థమే. అవధానమునందు నేను గృతార్థుఁడ నైనచోఁ బ్రభువులు నాకుఁ బదివేలదీనారములు బహుమతి చేయునట్లును, పరాభవము చెందితి నేని, నే నదివఱకుఁ బొంది యున్న బహుమానముల నన్నిటిని, బ్రభువులవారి కిచ్చివేయునట్లు నొక సమయమును జేసికొని, యవధానము నారంభించితిని. అన్నిటిని బాగుగానే జరపితిని. అపజయ మన్నది నాకు దేని చేతను సంభవించినది గాదు. అంతటిని బరిశీలించుచున్న ప్రభువులు పంచాంగము చెప్పుటలో నేను జెప్పిన దాని మార్చి వ్రాసికొని, యంతమందుఁ జదివి చూపి, నే నపజయ మొందినట్లు సెలవిచ్చిరి. దానికయి నే నెన్నో న్యాయములను జెప్పినను వా రొప్పుకొన్నారు గారు. అందుచేత నచ్చటనున్న మధ్యస్థు "లపజయ మొందిన

యెడల నే నిదివఱకుఁ బొందిన బహుమానములు నిచ్చి వేసెదను. నని చెప్పలే" దని నన్ను వాదింపు మని ప్రేరేచిరి. "అసత్యవాదుల నసత్యముచేతనే జయింప వలయు" నను న్యాయ మున్నప్పటికిని, నేను జెప్పినదాని మార్చి చెప్పుట కిష్టములేని వాఁడనైనందున, నాయొద్దనున్న ధనమునంతటిని బోఁగొట్టుకొని, పరదేశిగాఁ దిరిగితిని. పిమ్మట నీ తత్త్వశాస్త్రజ్ఞుల యభిప్రాయము సర్వోత్కృష్టమై యుండుటఁ గాంచి, వారితోఁ గలిసి వర్తించుచున్నాను. కాఁబట్టి మనుజుఁడు సమయానుకూలములైనమాటలను బలికి, యాపదలనుండి తొలఁగి, యే విధముననఁగాని సౌఖ్యమనుభవించుటకే ప్రయత్నింప వలెను. ఇప్పుడు తత్త్వశాస్త్రులు చెప్పినదానిని గొంచె మనుష్ఠించి చూడుఁడు. అందలి నిజము మీకే వ్యక్త మగును. అనుభవైకవేద్య మగుసిద్ధాంతమును సామాన్యమనఁ దగునా?

హరిశ్చంద్రుఁడు—ఏమిసిద్ధాంతమును జెప్పు చున్నారు? ప్రభుఁడు లేఁడు, కర్మము లేదు, సుఖము లేదు, దుఃఖము లేదు. అని చెప్పుచున్నారు. లోకమునందు మానవశరీరధారులలో ననేకులు కష్టముల మ్రగ్గుటయు, ననేకులు సుఖసంతుష్టులై వెలయుటయును దటస్థించి యున్నది. శిబికారూఢుఁడై వెలయుమానవునిని వానిని యానముతో భరించి తిరుగు మానవులను గూర్చి చర్చించినచో విషయము చక్కఁగ గోచరించును.

తత్త్వశాస్త్రి—సుఖదుఃఖములు కర్మాధీనములుగావు. సుఖ మధికారియొక్క ప్రయత్న విశేషముల ననుసరించి కలుగు చుండును. దుఃఖమునకుఁ గారణము సోమరితనమే. ఇఁకఁ గర్మముచేత శరీరము గలుగు చున్నదే యనిన, సాదిలోఁ గర్మము లేక దేహమెట్లు త్పన్న మయ్యెను? దీని ననుసరించియేకదా! విత్తనము మొదలా వృక్షము మొదలా యనెడి బీజాంకురన్యాయము తత్త్వమం దేర్పడి యున్నది. ఇట్లు సుకృత దుష్కృతముల కనువుగా శరీరములను బొందు చుండుటయే పద్ధతి గాఁగా నాత్మ యేతీరుగా విముక్తిని జెందును? కొంచెమైన నొకటి కొకటి కనుకూలపడని వాదమూని చిత్తచాంచల్య మేల పొంద వలెను? ఇంక జగత్తునం దుండువఱకు సుఖదాయక మగుమార్గముఁ జేరి సుఖించుటయే జన్మమెత్తినందులకు గొప్ప ప్రయోజనము. సూక్ష్మపరిశీలనముచే నాలోచింపఁగా నిజ్జగము నందుఁ గుడిచి కూర్చుండుటయే పరమసుఖంబుగఁ బరిణమించు చున్నది. యోజించి చూడుఁడు.



హరిశ్చంద్రుఁడు—అయ్యా! కర్మలేపనముచేత శరీరము మాత్రము వచ్చును. ఆత్మ నిత్యము. ఆయాత్మయొక్క కర్మము ననుసరించి శరీరాంతఃకరణ భువనభోగంబులు సర్వేశ్వరుఁ డనుగ్రహించు చున్నాఁడు. ఈయాత్మయును మొదటఁ దృణాద్యనేక రూపముల నాశ్రయించు చున్నది. పిమ్మట మానవశరీరమును బొంది, సుఖదుఃఖముల నెల్లఁ గాంచి, విముక్తిని జెందఁ గోరు చున్నది. ఈ రీతిని సుఖదుఃఖములను సమముగాఁ గాంచునట్టి వారే నిశ్చయజ్ఞాన సంపన్నులగుదురు. ఇతరులకు వలెనే నిశ్చయజ్ఞానులకును గర్మమనునది గలదు. ఆకర్మము సంచితము, ఆగామి, ప్రారబ్ధము, అని మువ్విధము లగును. వీనిలోపల జన్మములకు బీజరూపమయిన సంచితము జ్ఞానుల జ్ఞానాగ్నిచే దహింపఁబడి నశించును. ఆగామికర్మ మనిననో నిష్కామ్యక్రియాశూన్యముల నభిమానించిన సుజ్ఞానులను దగ్గఱదు. ఉన్నంతకాల మనుభవించియే తీఱవలసిన ప్రారబ్ధకర్మముమాత్రమే శేషించి నిలుచును. ఉత్తములాజ్ఞానమునే యూఁతగాఁ గొనిన సత్పురుషులను సేవించి వారి క్రియలసత్ఫల

ముల గ్రహింతురు. తుచ్ఛు లట్టి జ్ఞానసంపన్నులను దూషించి వారి దుష్కర్మఫలములను జెందుదురు. ఇట్టి సదసద్వివేకి సుజ్ఞాని యగును. సుకృత దుష్కృత రూపములగు కర్మములను యుక్తాయుక్త వివేచనాపరికరముచేత నంగీకార నిరాకారములను బూని చరించు ధీరుఁడు నిత్యానందముఁ బొందును. ఇంక మీ రేమి చెప్పినను సత్యమును జే వదలము. "సత్యము తల కాఁచు" నన్నది దృఢ వాక్యము. ఆకారణముచేతఁ జెప్పినట్లు చేయుటయే పెద్ద లొప్పం దగినయాచారము. అనుగ్రహించి మీయభిప్రాయము సెలవిండు.

తత్త్వశాస్త్రి—అట్లయినచో మీకు మేము చెప్పవలసిన దేమున్నది. తర్కశాస్త్రాభిప్రాయమును గొంచెము విస్తరించితిమి. విన్నతొంతల సుఖము గలుగును. ఇంక మీయిష్టము.

(నిష్క్రమించెదరు.)

నక్షత్రేశుఁడు—అయ్యా! శాస్త్రిగారులారా! ఏమి యేవేవో తత్త్వముల నుపన్యసించు చున్నారు. మాకొక్కటియు నర్థము కాలేదే. మాకు రెండు తత్త్వపుఁగూఁతలు నేర్ప రాదా?

తత్త్వశాస్త్రి—అట్టి వేమియును లేవు. లోకాభిరామము కొంచెము మాటలాడినాము. (మాటలాడుచు నక్షత్రేశుని దగ్గఱి) అయ్యా! ఆహరిశ్చంద్రుఁ డించుకంతైనను జలింపనట్టి హృదయస్థైర్యమును, గలఁత చెందని ధైర్యమును గలవాఁడుగాఁ గనఁబడు చున్నాఁడు. విని జయించుట కెవరితరము? మనమునిపుంగవులు కొంచె మైనను ముందు వెనుక లాలోచింపక శపథము చేసిరే! ముగియలేదే! నడిచిన సంగతులను బోయి వారికి మనవిచేసెదము.

నక్షత్రేశుఁడు—అట్లే చేయుఁడు. పోయి నాగతిని సైతము వారికి విన్నవింపుఁడు. మఱచిపోవుదుగో!



తత్త్వశాస్త్రి—పనిపూని సర్వమును బ్రత్యక్షమునఁ జూచినాఁడను గదా? చెప్ప కుందునా? ఏల మఱతును? పోయి వచ్చెదను.

(నిష్క్రమించు చున్నాఁడు.)

ఇది దశమరంగము.

## ఏ కా ద శ రం గ ము.

స్థలము : వారణాసియం దొకసత్రము.

కాలము : మాపు

పాత్రములు : హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, సత్యకీర్తి, దేవదాసుఁడు, నక్షత్రేశుఁడు.

---

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇదిగో సమీపమునం దొకనగరము గానఁబడు చున్నది. అది కాశికాక్షేత్రము గా వచ్చునో?

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఇదే కాశీనగరపు టెల్లతోఁ జేరిన వారాణసీ దివ్యక్షేత్రము. దీని దాఁటి పోయినంతన కాశీక్షేత్రమే.

హరిశ్చంద్రుఁడు—స్త్రీరత్నమా! ఇదిగో మనము వారణాసిఁ జేరితిమి. దీని నంటియుండునదే కాశీక్షేత్రము. మన మీక్షేత్ర మాశ్రయించి నంతన మనదుష్కృతము లన్నియుఁ దొలఁగి పటాపంచమగును. నాముద్దులకూనా! దేవదాసా! ఇదె కాశికి వచ్చితిమి. ఇఁక మన మొక్కవగ నడువవలసి యుండదు. నాయనా! వ్యాకులపడకుము.

చంద్రమతి—స్వామీ! ఇక్కడ నేదైన నొక సత్రమునందు దిగవచ్చునా?

నక్షత్రేశుఁడు—అల్లదె కనఁబడునది యొక సత్రమే. అక్కడ దిగుదము. ఇంక వైళమ మనము కాశిం జేరఁ గలము. ఇంకఁ గాసు లేవిధముగాఁ జిక్కఁ గలవో తెలియదు.

(అందఱును సత్రమునందు దిగెదరు.)

నక్షత్రకుఁడు—హరిశ్చంద్ర! ఇక్కడికి రమ్ము! వేగముగా రమ్ము! వచ్చితివా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఏమి, ఏమి! (వేగముగా బెదరి వచ్చుచున్నాఁడు. ఇతరులును బరుగెత్తి వచ్చుచున్నారు.)

నక్షత్రకుఁడు—ఆ. హరిశ్చంద్ర! ఏమి చేయుదును?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఏమి సంభవించినది? ఉన్నది యున్నట్లు చెప్పుఁడు.

నక్షత్రకుఁడు—ఆ. ఆ. ఓర్వ శక్యము గా లేదే! ప్రాణములు తొట్రిలుచున్నవే. ఏమి చేయుదును? దీనికా నన్నుఁబిలుచుకొనివచ్చినారు?

హరిశ్చంద్రుఁడు—(దుఃఖముతో) స్వామీ! ఏమి సంభవించినది? వృశ్చికము మొదలైన విషజంతువు లేవైనఁ గుట్టినవో? చెప్పుఁడు. మందు తెచ్చెదము.

నక్షత్రకుఁడు—లేదు, లేదు. విసపుఁబురు వేదియును గఱవలేదు. ఆ. ఆ. ఏమిహింస! ఏమిహింస!

సత్యకీర్తి—స్వామీ! మీ కేమిబాధ గలిగినది? సెలవిండు. తగినచికిత్సలను జేసెదము.

నక్షత్రకుఁడు—హరిశ్చంద్రా! సత్యకీర్తీ! ఏమో నాకుఁ దెలియలేదు. కడు పీడ్వఁబడి నొచ్చుచున్నది. రొమ్మడుచుచున్నది. ఊపిరి వదలుటకు సాధ్యపడ లేదే!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! కొంత యోర్చుకొనుఁడు. ఇదిగో నొక క్షణమాత్రములోనే యొకవైద్యునిఁ బిలిచికొని వచ్చెదము (తిరిగి) సత్యకీర్తి! మీరు శీఘ్రగమనముతోఁ బోయి యొక వైద్యునిఁ బిలుచుకొని రండు.

(సత్యకీర్తి నిష్క్రమించును.)



నక్షత్రకుఁడు—ఆ. ఆ. హరిశ్చంద్ర! వైద్యులవారు వచ్చిరా? ప్రాణము లేచి పోవునట్లు కనఁబడు చున్నదే. అయ్యో నాగురునాథులును సమీపమునందు లేరే. హరిశ్చంద్ర! ఇందులకా యీవిధముగా నన్ను వధించు చున్నావు. పొన్ను పొంద వచ్చి పుడమిపాలు గావలసి వచ్చినదే. ఆ. ఆ. నా కేమి గతి? వైద్యులు వచ్చిరా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇంకను రాలేదు. మనము వచ్చినది క్రొత్తయూరు. సత్యకీర్తియు నిచటికిఁ గ్రొత్త. వెదకి పిలుచుకొని రావలయును. కొంచె మోర్చుకొనుఁడు శీఘ్రముగానే వచ్చువారు.

నక్షత్రకుఁడు—ఓ. ఓ. హరిశ్చంద్ర! ఇ దేమో వంచనగాఁ గానఁబడుచున్నది. ఇట్లే వీఁడు నశించి పోవనిమ్మనెడి తలంపో! బ్రహ్మహత్య. బ్రాహ్మణాపకారము వలదు. ఆ. ఆ. భరింపరాని బాధ! ఈవ్యాధికి నీవే కదా కారణము?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! నేనే వంచనయును జేయ లేదే. ఇట్లు సెలవిచ్చినయెడల దాసుఁ డేమి చేయ వచ్చును.

నక్షత్రకుఁడు—ఒక్కటియును జేయలేదా? నిన్నుఁగూడి వచ్చిన యీ యిరువదిరెండుదినములు కాయగసరులను గందమూలములను దినుటచేఁ గదా యీబాధ నాకుఁ దటస్థించినది. ఆ ఆ. ఇనుపసలాకుతోఁ బొట్టలోఁ గ్రుచ్చునట్లు బాధ యెత్తు చున్నదే.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఏమి చేయ వచ్చును? కొంచె మోర్చుకొనుఁడు.

నక్షత్రకుఁడు—హరిశ్చంద్రా! మీయిరువురి కారణమున నాజీవములు పోఁగొట్టుకొనవలసి వచ్చున ట్లున్నదే. మునివరులకు రాజ్యమో లభించినది. ఇంక నీ ధనము దొరకినను దొరకక పో వయి

పోయిన నొక్కటే. అయ్యో! నీతో మాటలాడుటకును శక్యము గాకున్నదే.

హరిశ్చంద్రుఁడు—ఇం కొక్క క్షణములోనే వైద్యులు వచ్చి చేరుదురు. నొప్పిని గమనింపక కొంతపరాకు మీఁదఁ దాళుకొనుఁడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! నీవు ధనము చెల్లించుట కింక నెన్ని దినములు పట్టునో తెలిసినదిగాదు! నేను శీఘ్రముగా మరలితినా మాగురువర్యులు నాకుఁ దగిన యౌషధముల నిచ్చి స్వస్థపఱుతురు. వ్యర్థముగా నన్నేల చంపఁ జూచెదవు? వైద్యు లెట్లు దొరకఁ గలరు? ఒకవేళ దొరకిరిపో డబ్బుపెట్టక చికిత్స చేయుదురా? ఇది పనికి మాలిన ప్రయత్నమే కదా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఒకకీడును సంభవింపదు. మనము కాశీక్షేత్రమును జేరి యున్నాము. ఆపద యొకకాలమునందును దగ్గఱదు. మనము సత్యమును నమ్మిన సర్వమును మంచిదిగానే పరిణమించును. కొంచె మోర్చుకొనుఁడు. వైద్యులును రాఁగలరు. మఱి రెండుమూఁడు దినములలోనే మీధనము నిచ్చి పంపి వేసెదను. అంతవఱకు క్షమించి యనుగ్రహింప వలయును.

(కడుపు నణఁచి పట్టుకొని యుండును.)

ఇది ఏకాదశరంగము.

---



## ద్వాదశరంగము.

స్థలము : వారణాసియం దొకవైద్యునియిల్లు.

కాలము : మాపు.

పాత్రములు: వైద్యులు, సత్యకీర్తి.

---

(వైద్యుఁడు పుస్తకములఁ బట్టుకొని, చూచుచున్నాఁడు. గోడమీఁద నొకపలక గట్టఁబడి వ్రేలాడుచుండును. దానిపై వ్రాయఁబడినదాని సత్యకీర్తి చూచి, వైద్యునియొద్దకుఁ బోయి, వందనము చేయుచున్నాఁడు.)

# ఆయుర్వేదభాస్కరవైద్యశాల.

బీదలకు ధర్మవైద్యము చేయఁబడును.

వైద్యుఁడు—ఎవ రయ్యా!

సత్యకీర్తి—అయ్యా! నే నయోధ్యానగరవాసిని.

వైద్యుఁడు—ఏపనికై యిచ్చటికి వచ్చినారు?

సత్యకీర్తి—యాత్ర కారణముగా నిచ్చటికి వచ్చినారము. మాలో నొకరికి, కడుపుశూల గలిగినది. తమరు దయచేసి, కొంచెము వచ్చి చూడవలెను.

వైద్యుఁడు—మేము చేయునది ధర్మవైద్యము. మే మొకకాసు నైనను నాశింపువారము గాము. ధనసంగ్రహము చేయకయే వైద్యము చేయవలయు నని యాయుర్వేదముయొక్క యభిప్రాయము. వ్యాధిగ్రస్తుని నిచ్చటికిఁ బిలుచుకొని రండు. మేము రారాదు. మఱియును మావలెనే పెక్కువేలజను లిచ్చటికి వచ్చు చుందురు. అట్టిసమయమునందు మే మిక్కడ లేకుందుమేని ధర్మము గాదు. పొండు. పిలుచుకొని రండు. ఒకతెప్పపాటులో స్వస్థపఱిచెదను.

సత్యకీర్తి—అయ్యా! మీరు సెలవిచ్చిన వన్నియు నీప్రకటన ఫలకము చేతనే గ్రహింపఁబడినవి. వ్యాధిగ్రస్తు లిచ్చటికి వచ్చునంతటిస్థితి యందు లేరు. కాఁబట్టి మీరే యనుగ్రహించి యచ్చోటికి విజయము చేయవలెను. మిక్కిలి సమీపముననే యున్నారు.

వైద్యుఁడు—ఐన సరే, చూచెదము రండు. (వచ్చుచున్నారు.) ఏచోట దిగి యున్నారు?

సత్యకీర్తి—అయ్యా! ఈయూరి యుత్తరపుటెల్లలో నుండు సత్రము నందు దిగి యున్నాము.

వైద్యుఁడు—సరి; పోవుదము.

సత్యకీర్తి—అయ్యా! తాము చేయునది యనుభవవైద్యమా శాస్త్రవైద్యమా?

వైద్యుఁడు—మీకును వైద్యము తెలియునట్లు గనఁబడుచున్నదే.

సత్యకీర్తి—నాకు వైద్యము చేయుటకుఁ దెలియదు. వినికివలనఁ గొంత తెలియును.

వైద్యుఁడు—మేము చేయువైద్యము గొప్పగ్రంథముల ననుసరించినది. ఆయుర్వేద పారావారము, ధన్వంతరి, జీవరక్షామృతము, శిరోరత్నవైద్యభూషణము, వైద్యచింతామణి మొదలగు గ్రంథముల యందు మాకుఁ జాలపరిశ్రమ గలదు. కొంచెమైనను బ్రమాదము చెందక యశ్వగంధాది ఘృతము, షట్ఫలఘృతము, దూర్వాది ఘృతము, పంచగవ్యఘృతము, ఆర్ద్రికఘృతము, కూశ్మాండఘృతము, మొదలగు దివ్యఘృతములను; పంచాగ్నిచూర్ణము, మరీచ్యాది చూర్ణము, తాలిసచూర్ణము, బడబానలచూర్ణము, మాణిమండలచూర్ణము, ఏలాదిచూర్ణము, కర్పూరాది చూర్ణము, పంచబాణచూర్ణము మొదలుగాఁగలుగు చూర్ణంబులను; చించా



ర్ద్రిక లేహ్యము, కుద్రాభయాది లేహ్యము, పిప్పల్యాది లేహ్యము, బిల్వాదిలేహ్యము మొదలుగాఁగల లేహ్యంబులను; నారికేళాదిరసాయనము, గుడనాగాదిరసాయనము, శిగ్రుపుష్పరసాయనము, జాతుఫలరసాయనము, సుదర్శనరసాయనము, వారాహీరసాయనము, భల్లాతకీరసాయనము, విళంగాదిరసాయనము, అమృతరసాయనము, ఆదిగాఁగలరసాయనంబులను; శంఖపుంఖాదితైలము, లక్ష్మీనారాయణతైలము, లాక్షాదితైలము, ధన్వంతరితైలము, పంచార్కతైలము, పాశ్చాత్యనింబతైలము, విషముష్టితైలము, కేతకీతైలము, స్నేహార్కతైలము, వాతాంతకతైలము, భూనాగతైలము, భృంగామలకతైలము, మొదలగుతైలంబులను; నారికేళాంజనము, సౌవీరాంజనము, వీరభద్రాంజనము, నీలాంజనము, గరుడాంజనము, కర్పూరాంజనము మొదలగు నంజనంబులును; అగ్నికుమారకము, వాతరాక్షసము, చంద్రహాసము, కందర్పాంకురరసము, షణ్ముఖరసము, కాలాగ్నిరుద్రరసము, కాళికేశ్వరరసము, ప్రతాపలంకేశ్వరము, చాతుర్థికరామబాణము, విష్ణుచక్రము, జ్వరాంకుశము, స్వచ్ఛందభైరవము, భూపతి, చింతామణి మొదలైన దివ్యరసౌషధములను; ఇంకను గంధకముతోడను వసనాభితోడను జేయఁబడిన దివ్యౌషధములను; లోహభస్మము, తామ్రభస్మము, వంగభస్మము, శంఖభస్మము, స్వర్ణరజితప్రవాళాది భస్మములను సింధూరములను సర్వదా నాయౌషధాలయం బలంకృతంబై యుండును. అయ్యా! ఇంకను శాస్త్రశారీరస్థాన విశేషంబులంబట్టి యౌషధప్రయోగము చేయునేర్పును నాకుఁ గలదు. 72 నాడీభేదములను దెలిసి వాతపిత్తశ్లేష్మములయుల్బణంబుల వలనఁ గలిగిన త్రిశత షష్టిరోగములకుఁ దగుచికిత్సలను జేయఁ గలుగు

మును. అయ్యా! ఇట్టి యుత్తమౌషధంబుల ప్రయోగౌచిత్యము దెలిసి నేను చికిత్సచేయుటకుఁ బూనితినా యెంతటిరోగ మయినను బటాపంచలై పరుగు లిడవలెను. పరలోకయాత్రకై పాదమెత్తిపెట్టు జీవాత్మసైతము కొంతసేవు బొందిలో నిలిచియుండునట్లు మరలించి యున్నాను.

సత్యకీర్తి—ఆహా! అనేకశాస్త్రములను బరిశీలించి యున్నారు. ఔషధములు సుప్రశస్తములైనవి గానే కనఁబడుచున్నవి. మామంచి కాలమునకు మీరు దొరకితిరి. (సత్యకీర్తియును వైద్యుఁడును సత్రమును సమీపించుచున్నారు.) ఇదిగో వచ్చి చేరితిమి. ఈసత్రము నందే యిప్పటికి బస దిగియున్నాము.

వైద్యుఁడు—అచటఁ బండుకొనియుండువారా?

సత్యకీర్తి—ఔనయ్యా!

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! వైద్యులింకను రాలేదే నన్నీలాగున వేధింపవచ్చునా?

హరిశ్చంద్రుఁడు—(సత్యకీర్తితోడ మఱొకఁడు వచ్చుటను జూచి.) ఇదె వైద్యులును వచ్చిరి స్వామీ!

నక్షత్రేశుఁడు—వచ్చిరా? అయ్యా! వైద్యులుగారూ! కొంచెము చేయి చూడుఁడు. (వైద్యులుకూర్చుండి, నక్షత్రేశునికుడిచేతినిబట్టి వ్రేళ్లమటికలు విఱిచి, నాడిని జూచుచున్నారు. పైచూపులతోఁ గొంత యోజించుట నటించి, నాల్గువ్రేళ్లను భూమిపైఁ దట్టుచున్నారు.)

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వైద్యులుగారూ! ఇ దేమిరోగము? దేని వలన సంభవించినది? ఏమిచికిత్స చేయవలెను? దయచేసి యనుగ్రహింపవలెను.



వైద్యుఁడు—అయ్యా! ఇది వాతపిత్తశ్లేష్మనాడుల యెచ్చుతక్కువలవలన నుష్ణవాయువు ప్రకోపించి కఫసంబంధమును జెంది యున్నది. ఇది యకాలభోజనము, నిద్రాభంగము, దీర్ఘసంచారము, ఆహారశైత్యము, మొదలగువానివలన సంభవించి యుండవచ్చును. తగినమందియ్యకయే తీరదు. మీమంచికాలమునకే నన్నుఁ బిలిచితిరి. మమ్ముఁ బిలుచుకొని వచ్చినవా రెక్కడ? ఇట్లు రండయ్యా! (కొంచె మావలికిఁ బోవుచున్నారు. హరిశ్చంద్రుఁడుకూడఁ బోవును.)

హరిశ్చంద్రుఁడు—అయ్యా! నాడి యెట్లున్నది? కొంచెము వివరముగాఁ జెప్పుఁడు.

వైద్యుఁడు—రోగి యొక్క గుణదోషములను గూర్చిన విషయములను వైద్యులు బయలు పఱుపరాదు; అది యాయుర్వేద విధికి మిగుల విరోధము.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అవ్విధమయిన సందేహము మీకు మా యెడల వలదు. మే మెప్పటికిని సత్యమునకే యుత్తరవాదుల మగుదుము. అనుగ్రహించి చెప్పుఁడు.

వైద్యుఁడు—మీకుఁ జెప్పుటకు మాకు నేమాత్రము నాటంకము లేదు. ఇది రోగికిఁ దెలియరాదు. తెలిసినయెడల నయిదు దినములలోఁ బోవుజీవ మైదుగడియలకే పోవును. వాతనాడి యణఁగి పడి యున్నది. అది లేచిననేకాని ధైర్యము గలుగదు. ఇంక నేమియును జెప్పుటకు వీలుకాదు. ఇప్పటికే వాతనాడి యడఁగి యసాధ్యమునం దున్నది. ఇంక మాయౌషధము పనిచేసిననే బ్రదుకు. చూచితిరా! ఇది గుల్మరాజ గజాంకుశ మనెడి యౌషధము. సంజీవని. మూఁడుతౌరములు గలిసియున్నవి. దీనిని బ్రయోగించెదను. పిమ్మట మీయదృష్టము. ఐన నేను జెప్పినయంశములను

మాత్రము రోగికిఁ జెప్పవలదు సుండీ. మనము దూరముగవచ్చి మాట్లాడుటలను గూర్చి, వారు సందేహపడి వైద్యు లేమి చెప్పిరి యనఁగా, నదేమియు లేదు. శీఘ్రముగానే గుణ మగు నని చెప్పి తని ధైర్యము చెప్పుఁడు.

హరిశ్చంద్రుఁడు—ఈమాత్రకు ననుపాన మేదియో!

వైద్యుఁడు—అనుపాన మొక్కటియును లేదు. ఈమాత్రను నోటవేసి, చేరెఁడు నీళ్లు పోసినఁ జాలును. పోయి శీఘ్రముగా నిండు, నోరు తప్పి, చెప్పినసంగతిని బయటవేయకుఁడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఔషధ మొక్కటియును లేదా? ఏమో దూరముగాఁ బోయి మాటలాడు చున్నారే.

హరిశ్చంద్రుఁడు—ఇదిగో! మందును దీసికొనివచ్చెదము.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! శరీరస్థితి యె ట్లున్నదఁట?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! వాతనాడి యణఁగి—

వైద్యుఁడు—ఆఁ. ఆఁ. ఉండుఁడు. మాత్ర నిండు.

నక్షత్రేశుఁడు—అది యుండ నిమ్ము, వైద్యు లేమి చెప్పు చున్నారు?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! వాతనాడి యణఁగి యున్నదఁట. (వైద్యులు కోపముతోఁ జూచు చున్నారు.) అదిలేచిననే కాని నిశ్చయము చెప్పుటకుఁ గాదఁట. అది లేచుటకే యిప్పు డౌషధము నిచ్చుట. దీనిని సేవింపుఁడు. సర్వేశ్వరుని యనుగ్రహమువలన స్వస్థపడుదురు. కొఱ యేదియును దటస్థింపదు. (మందు నిచ్చు చున్నాఁడు.)

వైద్యుఁడు—ఎవరయ్యా మీరు? మేము ముందే రామని చెప్పినాము. బలవంతపెట్టి పిలుచుకొని వచ్చితిరి. మేము వలదని పెక్కుమాఱులు చెప్పినప్పటికిని దానిని సత్తచేయక, రోగి దిగులు చెందునట్లు చెప్పి వేసితిరి! ఇందుచే మా కెంతపాపము సంభవించినది! పుణ్య



మునకు వచ్చి పాపమును గట్టికొని పోయిన ట్లయినదే. మముఁగఁ బోయి పెనుఁగొంపిలో దిగఁబడిన ట్లయ్యెనే! ఇదేమి కాలము? కూడ దన్నదాని నేల బయలుపఱిచితిరి? భయమే యర్థప్రాణముల నాహుతి గొనునే? ఆహా! ఏమి, తెలియక యిట్లు వచ్చితిమి. స్థానాస్థానములను విచారింపకయే ముడుగత్తి పెట్టరాదు. పాత్ర మెఱిఁగి దానము గోత్ర మెఱిఁగి కన్య ని మ్మను సామెత వ్యర్థమైనదా!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మన్నింపవలయును. నిజమున కొకప్పుడును హీనత గలుగను. ప్రాణములకంటెఁ బరమార్థము సత్యమే. అబద్ధము లాడుట కెప్పుడును బొల్పడరాదు. ఆకారణముచేతనే నిజమును బయలుపఱిచితిని. మన్నింపవలెను.

వైద్యుఁడు—ఏమి మన్నించుట? ప్రాణములకంటెనా సత్యము గొప్ప? మీరాజీవములుగా నున్న మీకుఁ దెలియును, ఇతరుల ప్రాణము లేగతి నైన మీ కేమి? భయముచేతనే ప్రాణాపాయము గలుగునయ్యా యన్న వేదాంతములు మాట్లాడు చున్నారే, (నక్షత్రేశునిఁ జూచి) వీరిని గూడి మిమ్ము నెవ్వరయ్యా రమ్మన్నారు? మిమ్మును జీవములతోనే కాల్చి వేయుదు రని తోఁచు చున్నది. ఇప్పుడే మీయూరికిఁబోయి చేరుఁడయ్యా? మిమ్ముఁ జూడఁగా నుత్తములరని తోఁచు చున్నది.

నక్షత్రేశుఁడు—అయ్యో! హరిశ్చంద్ర! నన్నిట్లును హింసింపవచ్చునా? వైద్యులును జేయివదలిరి? ఇఁక నొకక్షణమైన మీతోడ నుండ రాదు. ఇతరుల ప్రాణములను రక్షించుటయే గొప్పపుణ్యము? దీనిని యోజించి నాకుఁ జేరవలసిన పైకమును జేర్పుము. నేను బోయి వచ్చెదను. అయ్యో! అనాథప్రేతమై పోవలసిన కాలము

తటస్థించిన ట్లున్నదే. నాగురునాథుల సమీపమున నాప్రాణమును వదలిన ట్లయిన నాకు సకలపదవులును సిద్ధించునే!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మీరు భయపడవలసిన పనిలేదు. భగవదనుగ్రహముచేత నొకతక్కువయును సంభవింపదు. ఇప్పుడు తాము సేవించిన యౌషధము గుణము చేయును. ఇఁక రెండుమూఁడు దినములలోఁ దమ్ముఁ బంపివేసెదను. మన్నింపవలెను.

నక్షత్రేశుఁడు—అయ్యా వైద్యులుగారూ! వింటిరా యీ న్యాయమును? ఇట్లు రండు. మఱొక్కతూరి ధాతువును బట్టి చూడుఁడు.

వైద్యుఁడు—(దగ్గఱి చేయిపట్టి చూచుచు) నక్షత్రేశా! మన మెంత ప్రయత్నించినను బ్రయోజనము కానమే! చిన్నయబద్ధముగా నొకటియును నతనివాక్కునుండి వెడలి వచ్చువైనముఁ గానమే! జగత్తునం దెంతటివారును రోగులవిషయమున దాఁచి మాట్లాడుదురు. అట్టిసందర్భమునందును వీనిమనస్సు చలించినది గాదు. ఇఁక మునీశ్వరు లేమని జయింపఁ బోవుచున్నారో! తెలియము. నేను బోయెదను.

నక్షత్రేశుఁడు—పొండు. పోయి సర్వమును విన్నవింపుఁడు.

ఇది ద్వాదశరంగము.





## తృతీయాంకము.

### ప్రథమరంగము.

స్థలము : గంగాతీరము-ఆలయము.
కాలము : ఉదయము.
పాత్రములు : హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, నక్షత్రేశుఁడు, రసవాది.

హరిశ్చంద్రుఁడు—సతీమణీ! చంద్రమతీ! ఇదె మనము గంగాతీరమును జేరినారము చూడుము.

గీ. సకలపాపప్రశమనంబు - సర్వపుణ్య
దాయకం బౌచు నెగడుతీ-ర్థంబు వొగడ
నలువ కైనను వేనోళ్ల-చిలువ కైన
నలవి కా దన నాబోఁటి - కగునె పొలఁతి?

కాంతామణీ! చూచితివా యీపజ్జఁ బ్రవహించుచున్న ప్రవాహము.

క. "రంగత్తరంగ, హిమవ
చ్ఛృంగోద్భవ, యంగజారి - శిరస్స్థితపూ
తాంగ, హరిపాదసరసిజ
భృంగ, కలుషభంగ, గంగ - యిదియే సుమ్మీ."

ఇఁక మన మీపుణ్యనదియందుఁ దీర్థ మాడి, యనుష్ఠానములను దీర్చికొని, యాలయమును జేరుదము. ఈగట్టునందుఁ గానఁబడునట్టి

యొక్కొక్క రేవు నొక్కొక్క ఘట్ట మనఁబడును. ఒక్కొక్క ఘట్టమునందు నొక్కొక్క విధమయిన ఫలప్రాప్తి గల దని యాత్రికులు ప్రతిఘట్టమునందును గృతస్నాతు లగుదురు. ఇది వరుణ ఘట్టము. ఇది చంద్రఘట్టము. అది పరమపతిఘట్టము. ఇఁక నెన్నో ఘట్టము లున్నవి. వీని నన్నిటికంటెను బరమపతి ఘట్టమే ప్రశస్తమైనది. యాశ్రితులపాశముల నన్నింటిని ద్రెంచి వైచి పరమగతిని గలిగించుమహిమ విశేషంబు గలది. దానియందే మనమును నీరాడుదము.

సత్యకీర్తి—సార్వభౌమా! విధేయుఁడ నావరుణఘట్టమునందు దిగి నీరాడెదను.

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే చేయుఁడు. (నక్షత్రేశునిఁ జూచి) స్వామీ మీరు కూడ దిగవచ్చునే!

నక్షత్రేశుఁడు—నేను గూడ దిగవచ్చునా? ఇందువలనఁ బ్రయోజన మేమియును లేదు. సొమ్ము వచ్చునట్టి మార్గమును వెదకుఁడు.

(స్నానమాడి యాలయమును జేరుచున్నారు.)

హరిశ్చంద్రుఁడు—కాంతాతిలకమా! కంటివా! గోపురదర్శన మగుచున్నది. ఇందలి యర్చావతారములనే స్థూలలింగమూర్తులని యందురు పెద్దలు? ముందుగా వారిని సేవింపవలయును. (నమస్కరించుచున్నారు.)

చంద్రమతి—నాయనా! దేవదాస! ఇదే యాలయము తెలియుచున్నది. చూడుము. చేతులను జోడించి నమస్కరింపుము. (అట్లు చేయుచున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తి! ఇదిగోఁ జూచితిరా? ఈయాలయము గోపురమంతయును స్వర్ణమయముగఁ గానఁబడుచున్నది. మనగురునాథులు స్వర్ణగోపుర మని చెప్ప విని యున్నాము గద? కాఁబట్టియే:—



మ. వనితాత్యంతవిభూతిగోపురము భా-స్వద్హేమప్రాబల్యముల్
వినుతాహస్కరనిర్మలాంశువుల వే - వేనింప దిఙ్మండలిన్
గనువార ల్భ్రమఁ గొందు "రద్దిర! కనం-గాఁ గ్రొత్తలయ్యె న్దివో
చనఁ డిబ్భంగి విహాయసంబు విడి తా-త్మా నొప్పు'నం చెప్పుడున్."

కాంతామణీ! ఇక్కాశికాపురి మాహాత్మ్యం బసదృశంబు. ముక్తిదాయకంబు లగుక్షేత్రరాజంబులలో నియ్యది యగ్రగణ్యంబు.

క. పంచాస్యమధ్య యిచ్చటఁ, బంచత్వముఁ బొందెనేనిఁ - బరికింపంగాఁ
బంచమహాపాతకుఁ డగు, పంచజనుం డైనఁ బంచ-బాణారి యగున్.

క. వారాణసి వారాణసి, వారాణసి యనుచు భక్తి-వశుఁ డై నరుఁ డం
భోరుహమిత్రోదయవే, ళారంభంబునఁ దలంప - నడఁగు నఘంబుల్.

చంద్రమతి—స్వర్ణగోపురదర్శన ఫలముచేత, మనకును స్వర్ణము లభించి, మునివరుల సొమ్ము నిచ్చివేయుట తటస్థించును. దాని కిది ముందు సూచనముగాఁ గనఁబడుచున్నది. ఇంతయేల? ఇయ్యవిముక్తక్షేత్రంబుఁ జేరిన వారికి ముక్తిసామ్రాజ్యంబు లభించుట యట్లుండ నైహికసుఖ దుఃఖంబులు దొలఁగుట యబ్బురంబా?

శా. తాత్పర్యంబున జాహ్నవీజలములం - దానంబు గావించుచున్
హృత్పద్మంబున భక్తి నివ్వటిల వి-శ్వేశు న్మహాదేవునిం
బత్పంకేజనతామరున్ గిరిసుతా - ప్రాణేశుఁ బూజించుసం
విత్పారీణులఁ దొట్టునే వగపు లు-ర్వీనాథచూడామణీ!

హరిశ్చంద్రుఁడు—వనితామణీ! ఆలయములో వినయసంకుచిత గాత్రవై వత్తువుగాక. (ఆలయముఁ జొచ్చి)

మత్త. శ్రీతనూజుఁడు శ్రీవరుండును - శిష్టు లౌసనకాదులున్
బాతకఘ్నులు కుంభసంభవ-భార్గవాదిఋషీంద్రులున్
జేతముల్ వృషరాజవాహనుఁ - జేర్చి యిందుఁ దపంబులన్
బ్రీతిఁ జేయుచు సిద్ధు లౌదురు - జేత్రి నొంది రహీనతన్.

గీ. పరమమా బ్రజ్ఞఁగంటివే! - పద్మనయన!
చెలఁగి దీనికి సామ్యమా - క్షేత్ర మెద్ది?
విశ్వనాథుని కంటెను - వేఱొకండు
దైవ మెవ్వాఁడు నరులకుఁ? - దథ్యమరయ.

(ఈశ్వరుని సాన్నిధ్యంబుచేరి చేదోయి మోడ్చి)

క. హైమవతీహృదయాంబుజ
ధామనిధీ! త్రిపురదైత్య-దమనా! సుమన
స్స్తోమార్చితపదపద్మా!
సోమా! రిపుభీమ! నిగమ-సూచితమూర్తీ!

గీ. శ్రుతులు తురగమ్ములుగఁ జంద్ర - సూర్యు లరులు
గా, విధాతసూతుండు గాఁ-గాంచనాద్రి
కార్ముకముగ, వెన్నుఁ డిషువు-గాఁగఁ గడఁగి,
త్రిపురదాహం బొనర్పవే - దివ్యవినుత!

గీ. కంజజాండంబు లెల్ల నీ-గర్భమందు
వెలయఁ దాల్చియు విశ్వేశ! - విశ్వమయుఁడ!
యణువుకంటెను నణువున - నణఁగి యుండి
వేడ్క సల్పుదు వీ వహో - విశ్వమూర్తి.

ఉ. ఇందలి సాధుసంఘముల - కిందొగి నిర్మల భక్తియుక్తి జా
నొందు విరక్తలోకముల - కొప్పెడు నీక్షితి తాపసాళి కా
నందము నొంది యిచ్చట న-నారత ముండెడు హంసకోటికి
వందముగాఁ శరణ్యుఁడవ - యాచు ఘటింతు తదీయవాంఛలన్.

లయగ్రాహి.

నీమమున మ్రొక్కెదను - హేమగిరిచాపునకు - సామజ జలంధర - ముఖామరవిరోధి
గ్రామమదహారి కభి - రామశుభనిర్మల సు-ధామయ శరీరునకుఁ - గామితవితీర్ణ
శ్రీమహిమశాలికి జ - రామరణదోష హరి-శామక నిజాంఘ్రియుగ-ళీమతికిఁ గాశీ
నామ పురధామునకుఁ - గోమలజటామకుట - ధామహిమ ధామునకు - భీమునకు భక్తిన్.

సీ. దుగ్ధాబ్ధి మంథనో - ద్భూత హాలహాలజ్వాలనమేచక కంఠ-శరణు శరణు
గిరిచాప నిష్ఠ్యూత - ఖరశిలీముఖ దగ్ధపుర గోపురాట్టాల - శరణు శరణు



సింధురాంధ జలంధ - రాంధక వ్యాఘ్రాదిసురకంటకధ్వంస - శరణు శరణు
విలయసంధ్యాకాల - వికటతాండవకేళి జర్జరబ్రహ్మాండ - శరణు శరణు
శరణు ఖేచరదేవతా - సార్వభౌమ, శరణు త్రైలోక్యసతత ర-క్షాధురీణ
శరణు వినుత వారాణసీ-స్థాన నిలయ, శరణు విశ్వేశ శంకర - శరణు శరణు.

సీ. గరళకూటవినీల - కంఠాయశంభవే మదనాంతకా యోన్న - మశ్శివాయ
కాద్రవేయాధిప - గ్రైవేయభూషాయ మధుభిత్సఖాయోన్న - మశ్శివాయ
దాక్షాయణీరమ్య - తనులతాపరిరంభ మహాలోలుపాయోన్న - మశ్శివాయ
వేదాదినిక్షేప - విద్యావధూమాలి మణికపాలాయోన్న - మశ్శివాయ
గంధదంతావళ జలంధ - రాంధకారి, విబుధపరిపంథివాహినీ - నిబిడవర్గ
బంధఘోరాంధకార సం-భారకిరణ, మాలినే శాశ్వతాయోన్న - మశ్శివాయ

ద్విపద. జయభక్తమందార - సజ్జనోద్ధార, జయసద్గుణాధార - సంసారదూర
జయహుతాశననేత్ర - జలజాక్షమిత్ర, జయసత్కృపాలోల - శాతత్రిశూల
జయమేరుకోదండ - జయవిష్ణుకాండ, జయనిర్జితానంగ - శశిధవళాంగ
చారుకోమలహాస - చతురవిలాస, గౌరీమనోలాస - కాశీనివాస
యీకాశికుని ఋణం-బీకాశిలోన, దీకొని తీర్పఁగాఁ - దెరువు గల్పింపు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఇ దేమి వ్యర్థపుఁ గాలక్షేపము. ప్రొద్దు పో లేదా! మీ కెక్కడ నున్న నేమి? నేనుగదా పాటు పడువాఁడను. 'కాశికిఁ బోయినను గర్మము వీడ' దనుసామెతను విన్నాఁడవు గావా? "ఉద్యోగినః పురుషసింహ ముపైతి లక్ష్మీ" యన్నట్లు ప్రయత్నింపక యే యూరక నీవు దేవాలయమునందు నిలిచి, మొత్తికొనుటవలనఁ బ్రయోజన మేమి? బయలు దేరుము. లెమ్ము, లెమ్ము. తత్త్వశాస్త్రులే మేమి చెప్పిరి? వాని నాలకించియును నీ కీవెఱ్ఱితనము వదలినది గాదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇదిగో వచ్చితిమి. 'తేన వినా తృణమపి న చలతి' యని పెద్ద లందురు. మన మందఱమును సర్వేశ్వరుని ద్రవ్యములము. వారిచేతి బొమ్మలము. వారు బొమ్మల మయిన మనలను గర్మమనెడి త్రాటిచేతఁ గట్టి యాడించు చున్నారు. ఆకా

రణముచేత నతని యనుగ్రహమును బొందిన వారికి సర్వము శ్రేయోదాయకముగ నుండును. ఇఁకఁ బోదము కదలుఁడు.

(అందఱును వెలుపలికి వచ్చుచున్నారు.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! ఈవాచా కైంకర్యము లన్నియు నటుండనీ. నీవు నమస్కరింపుము, వినమ్రుఁడవు కమ్ము. పదు. పాడు. నాకేమి? చేర్పవలసిన మొత్తమునకుఁ ద్రోవచెప్పుము. 'కాశీ కాశీ' యంటివి. కాశికిఁ గూడ వచ్చి యాయెను. ఋణమున కేమి చేయఁ బోయెదవు? ఇఁక నొకక్షణ మైనను నేను దాళుటకు లేదు. ఇచ్చువాఁడ వైతివా యిప్పుడే తెచ్చిపెట్టుము. లేదా, లేదు పొమ్మని చెప్పుము. నేను మరలెదను. దాక్షిణ్యము ధననాశము. ఇఁక నీయెడల దయ చూపుటవలనఁ బ్రయోజనము లేదు. నాగురునాథులును గోపింతురు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! కొంచెము తాళవలెను. ఇఁక నెట్టి యాటంకము నుండదు. ఏవిధముచేత నైనను వేగముగానే సొత్తును మొత్తముగాఁ జెల్లించెదను.

నక్షత్రేశుఁడు—సొత్తు మొత్తముగా ననినఁ దెలియలేదే. అఱగొఱగాఁ జెల్లించుటకు నభిప్రాయ మొకటి యున్నదేమొ! అట్లయిన దాని నైనను ముందుగా బయటఁ బెట్టుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మీ రీలాగు తర్కించినయెడల విధేయుఁడ నేవిధముగా బదులు చెప్పవచ్చును. నేఁటికిఁ గొంచెము రేపటికిఁ గొంచెముగా నిచ్చి యొప్పఁ జెప్పక, యొక్కతడవగానే మొత్తము నంతయు నిచ్చివేసెద నంటినిగాని వేఱుగాదు.

నక్షత్రేశుఁడు—అట్లయిన సరి. కాని, వేగిరముగాఁ జేయుము.

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే చేసెదను. మీరుమాత్రము కొంచెము మన్నింపవలెను. (కొంచె మావలికిఁ బోయి.) సత్యకీర్తి! మన



మీ కాశీక్షేత్రమును జేరి రెండుదినము లగుచున్నవి. మునివరుల ఋణమును దీర్చుటకుఁ బ్రయత్నించుట యొకటి యైనను, నీతరుపు కానిఁ దృప్తిపఱుచుటకు యత్నించుట యసాధ్యముగా నున్నది. గడువును సమీపించు చున్నది. సొమ్ము సేకరించుటకు మార్గమును వెదకవలసి యున్నది. ఏమి చేయుదము? సత్యకీర్తి!

సత్యకీర్తి—రాజేంద్రా! ఈచింత విధేయుని మనస్సునుండి కొంచెమైనను దొలఁగినది గాదు. మనము నగరు వదలిన దినమునుండి, దీనినే మనస్సున దృఢీకరించితిని. మనము మనదేశము మొదలయిన సకల సొత్తులను మునివరుల కర్పించితిమి. మనము ధరించియుండు నవియును బ్రాఁతగంతలు. మనకు ద్రవ్యములుగాఁ దక్కినవి మన శరీరములే. ఆశరీరమునే యెవ్వరికైనను దాస్యముచేయ నియోగించి, యందులకై సంచకారముగా ధనమును గ్రహించి, మునివరుల ఋణమునుండి విముక్తి నొందుటకుఁ బ్రయత్నింప వలెను. దానికయి మీసొత్తులన్నిటిలోను మిగిలి యున్న దేవరవారి విధేయుఁడ నగునేనే లోపడెదను. దేవరవా రాధనమును గొని మునీశ్వరుని యప్పునంతటినిఁ దీర్చివేయుదురుగాక; మఱియు ననేకవిధంబుల యోజించుటలోఁ బ్రయోనములేదు ప్రభూ!

హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తీ! నీవు చెప్పిన విషయములు సత్యములే! ఐనను, మీరు 'దాస్యము చేయునట్లు చెప్పింప వలయు' ననికాదు నేను జెప్పినది. మాయప్పునకయి మీ రొప్పుకొనియెద రన్నందులకయి చాల సంతోషించెదను. మునివరుని కష్టపడిన వాఁడను నేనే. ఆకారణమునుబట్టి నేనే యితరులకు దాస్యము చేయుటకుఁ బూఁటపడి యున్నాఁడను. అట్లుచేయక మిమ్ము దాస్యమునకు లోపఱుచుట యెన్నఁటికిని యుక్తము గాదు.

(రసవాది ప్రవేశించు చున్నాఁడు.)

రసవాది—అయ్యా! మీ రెవరు? ఏమో ద్రవ్య మనియు ధన మనియును, ధాన్యమనియు బంగార మనియును మాట లాడికొను చున్నారు. అదేమి? మేమును గొంత తెలిసి కొనవచ్చునా?

సత్యకీర్తి—అయ్యా! ధనము కాదు, ద్రవ్యము గాదు; ఏదో మాసంగతులను గూర్చి మాటలాడికొను చున్నాము.

రసవాది—అయ్యా! మీ రేమో దైన్యముతోడ మాటలాడుకొను చున్నారు. అంతకుముం దప్పుసొప్పులని యన్నట్లు చెవులఁబడినది. అది యిట్టిదని కొంచెము తెలిసిన యెడల, మేమేమైనను జేయఁగల మనుతలంపుఁగొనియే మి మ్మడిగినది. మఱొకటియును లేదు. క్షమింపవలెను.

సత్యకీర్తి—అయ్యా! మీకరుణకు నుపచారవాక్యములకును వందనములు. మీకుఁ దెలియఁదగని విషయములేవియును లేవు. మే మొక మునివరులకు ఋణ మచ్చుకో వలసిన వారము. దానికయి యోజించుకొను చున్నాము.

రసవాది—ఓహో! ఆలాగా! దానికే నేనును మిమ్మడిగినది. ఈ శ్వానమునకు సర్వేశ్వరుని యనుగ్రహవిశేషముచేతఁ గొంత ధనము గలదు. అది గురుకటాక్షమువలనఁ జేకూడినది. ఈ శునకము తనబాల్యము మొదలు పెద్దలశుశ్రూషల నొనరించి, యామహాత్ముల యనుగ్రహము వలనఁ గొంచెము సన్మార్గము నాశ్రయించినది. పిమ్మట నీ గోపురమును స్వర్ణమయముగాఁ జేసినదియు నీకుక్కయే. ఇప్పటికి నాప్రభువులయొక్క కట్టుదిట్టముల మేరకే కొంచెము పరోపకార మొనరించుచుండుటయును. రోగికి మాత్రమే మాత్ర గుణము చేయును. అట్టులార్తినొందిన వారికే యుపకారము ప్రయోజనవంత మైన దగును. మీ రున్నతస్థితినుండిన వారుగా



మీముఖ ములు చాటించి చెప్పుచున్నవి. మీలోఁగల యంతయును దెలిపిన యెడల యుక్తమును విచారింపవచ్చును.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! దిక్కులేనివారికి దేవుఁడే దిక్కనునట్లు మి మ్మిచ్చోటికి వచ్చునట్లు చేసినది భగవంతుని యవ్యాజకరుణయే. మేము విశ్వామిత్రమునివరులకు నూఱులక్షల వరహాల ఋణము చెల్లింప వలసియున్నది. ఇదొక్కటియే మాలోని పెద్దచింత.

రసవాది—ఓహో! మొత్తము కొంచె మధికముగానే యున్నది. నూఱులక్షల వరహాలా? ఐనప్పటికి నీ కుక్క కదియొక గొప్ప కార్యము కాదు. ఒకగడియ శ్రమమును నొక యావగింజంత ముఱికియునే వ్యయము. సరి. ఇందులకు మాఱుగా మీరుచూపఁదగినది యేదియో?

హరిశ్చంద్రుఁడు—అయ్యో? ధనమునకుఁ బ్రతిచూపుటకుఁ దగినసొత్తే దైన నుండిన మాకేల యీగొప్పచింత? మాశరీరములు దప్ప మాకేవిధమయిన సొత్తును లేదు. మీరుకనికరించి యీమొత్తము ననుగ్రహించిన యెడల, మాలో నొకరైన నందఱైనను మీకు బానిసలమై సేవించెదము. ఇదొకటియే మాకుఁ దోఁచిన మార్గము.

రసవాది—నూఱులక్షల వరహాలకు నీడొకటియును లేదా? మీ రేమి యీకుక్కకు బానిసతనమును జేయుట? మిమ్మును నిదానించి చూచిన శ్రమములకోర్చి పనిపాటులు చేయువారుగా భావింపఁబడరే.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అట్లు తలపోయకుఁడు. మీరనుగ్రహించి, ధనము నిచ్చినవెనుక మీరు కాలితోఁ జేయుమన్న పనిని జేతులతోఁ జేసెదము. పెట్టినదాని భుజించి కాలముత్రోయుదుము. దీనినిగుఱించి స్వల్పమైనను సందేహపడకుఁడు.

రసవాది—సరి. ఉండనీ. మాకును మనుష్యులావశ్యకముగఁ గావలసి యున్నవారు. మునివరుల కప్పుతీర్పవలసిన వారు మీలో నెవరు?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! విధేయుఁడను నేనే.

రసవాది—ఆహా! ఆలాగా! దాని నిచ్చుటఁ బుచ్చుకొను వారెవ్వరు?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అదిగో నిలుచున్నవారే సొమ్మును గైకొనుటకు మాతోడ వచ్చినవారు.

రసవాది—సరి, (నక్షత్రేశునిఁ గూర్చి) అయ్యా! స్వాములారా! ఇట్లు కొంచెము రండు.

నక్షత్రేశుఁడు—ఇదిగో వచ్చినాను. డబ్బువచ్చినదా?

రసవాది—ఆహా! డబ్బునకేమి? ఇదో యీశునక మొకత్రుటిమాత్రములో నిచ్చివేయును. మీకేమి నూఱులక్షలవరహాలా చేరవలయును.

నక్షత్రేశుఁడు—ఔనౌను. అంతమాత్రమే.

రసవాది—ఈ మొత్తమున కంతటికిని బసిమి బంగారము వలయునా? తెల్లని బంగారము వలయునా!

నక్షత్రేశుఁడు—ఏల, నల్లబంగారు నిచ్చివేయుఁడు. ఇంత పెద్ద మొత్తమున కెవ్వఁడైనను దెల్లబంగారు కోరునా?

రసవాది—సరి, పసుపు బంగారమునే యిచ్చెదము. అట్లయిన నొక విశేషము. మేముచేసియుండిన బంగారము సాధారణమయిన బంగారును బోలినది కాదు.

నక్షత్రేశుఁడు—ఏమేమీ! మీరు—చేసియుండిన బంగారమా?

రసవాది—ఔను, ఔను. ఈకుక్క చేసియుండిన బంగారమే, అది యెనిమిదవవన్నె, పదియవవన్నె, బంగారమును బోలినదికాదు.



సహస్రవర్ణముగల జాంబూనదమును మీఱినది. అదియే శివము. హిరణ్మయ జ్యోతిరాకృతిగల సూర్యబింబమునందలి కసటును బో నిచ్చి వెట్టను దిట్టముగాఁ దొలఁగించిన దాని యెదుటనే స్వర్ణము నిలుచును? ఇందులకై యే మహాత్ములందఱును బంచాగ్నిమధ్యము నందుఁ బరితపించుటలు. "హిరణ్మయి" యనఁగానేమి! హిరణ్యమును గలవాఁడే గద హిరణ్మయునిగలవిష్ణువు. వేఱెవ్వఁడు? ఈకుక్క యనేకమహిమాఢ్యుల నాశ్రయించి, వారుపెట్టిన యెంగిలిని గుడిచి, యూడిగములుచేసి, పొందిన యనుగ్రహమయ్యా, ఇందులకయి యడవులందును గొండలయందును ద్రిమ్మరి, కాయగసురులను మెసఁగి, కాచియుండి, కాలము దెలిసి, దీక్షచేసి, జయసీరము దించి, దానినే కాయకకల్పముగా భుజించి, జీవన్ముక్తపదివిని జెంది యున్నది. ఈ కుక్క యటువంటి యుత్తమ తపస్సుచేతఁ గలుగునట్టి బంగారము యొక్క రీతిని యోజించి చూడుఁడు.

నక్షత్రేశుఁడు—ఆహా! ఆలాగా! ఇవన్నియు నెవరికిఁ దెలియును? ఉండనిండు, దానివలన మీయభిప్రాయ మేమి?

రసవాది—అభిప్రాయమా? చెప్పెదను. మే మిచ్చునట్టి యొకవరహా యెత్తు బంగారమును సాధారణమైన నూఱువరహాలయెత్తు బంగారమునకు సమానంబుగా గ్రహింపవలెను. దీని కంగీకరించిన యెడల నిప్పుడే యిచ్చివేయుటకు సద్ధము లేదు. పాపము వారేల వృథా వ్యాకులపడవలెను?

నక్షత్రేశుఁడు—సరి, ఏమిచేయవచ్చును? ఇంకను నుండి పీంద్రకు నాప్రాణములను బలియిచ్చుటకంటె వచ్చినవఱకుఁ దీసికొని పోవుటయే మంచిది. ఇండు, ఇండు. ఇప్పుడే యెంచివేయుఁడు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఆవిధముగాఁ దక్కువఁగాఁ దీసికొని పోవలసిన పనిలేదు; ఆసొత్తునుజూచి, వారుచెప్పినట్లొప్పుకొనఁ దగినదైనఁ బుచ్చుకొనుఁడు. లేకుండిన వదలివేయుఁడు. మేము మఱె వ్వరికైనను బానిసలమై మీసొత్తును జేర్పించెదము.

నక్షత్రేశుఁడు—సరి, సరి. ఇఁక వీనినన్నిటిని దలపోయుటవలనఁ బ్రయోజనము లేదు. ఇచ్చివేయనీ. "వాదవుబంగారునకు వన్నె యధికము" అని మాగురునాథులునందురు. అయ్యా! మీ రిచ్చునది శుద్ధవాద స్వర్ణమే కద!

రసవాది—ఏమి యట్లుడిగెదరు? సందేహమా! ఇదో చూడుఁడు. ఒక తునుక! బొగ్గుల నూఁది యూఁది, కండ్లుచెదరి తామ్రమును గరఁగించి దానితో మాతృకవస్తువును మేళగించి, కొందఱు రసవాదులు కల్లపసిండిని జేయుచున్నారే? అట్లీకుక్కచేయదు. శోధించి చక్కఁగాఁ జూడుఁడు. (హరిశ్చంద్రునిఁ గూర్చి) అయ్యా! యిటు కొంచెము వత్తురా? (హరిశ్చంద్రుఁడు పోవుచున్నాఁడు. రసవాది రహస్యముగా) అయ్యా! బీదల నేమఱింపరాదు. ఉన్నదాని నున్నరీతిని జెప్పవలెను. మాగురుమూర్తి యనుజ్ఞయు నట్లే! ఈరహస్యమును బయలుపఱుపరాదు సుఁడీ. అంతయును దంత్రమే కదా! లోకమే మోహమగ్నము. మాయకాని దొకటియు నుండదు. ఆమోహమే మాయ, వింటిరా! ఈబంగారు మిగుల మేలయినది. వన్నెరంగు నయము మొదలైన విషయములలో దీనికి దీటయినది ప్రపంచమునందేదియు నుండదు. ఐన నొకటి. ఈగుణము లన్నియును రెండుసంవత్సరములవఱకును క్షీణింపవు. పిమ్మటఁ గొంచెము తెలుపిచ్చును. అప్పటికి నపరంజికి వెనుదీయదు. మునివరు లీబంగారమును రెండువర్షములకాలము పెట్టుకొని



యుండఁబోయెదరా? వారును సెలవు చేసికొనవలసినవారే గదా? వీనిని మీకు మాత్రముచెప్పి మఱి యియ్యవలయు నని మాయభిప్రాయము. ఎందుకనఁగా నేఁటికిమాత్రముండి రేపటికిఁ బోవు వారుగానుండిన నెట్లుచేసినను జేయవచ్చును. సదా మాకు లోఁగి యుండవలసిన వారలు. ఏలాగైనను మీకుఁ దెలిసిపోవును. అప్పుడు మీరు నావిషయమయి యొకతీరుగాఁ దలపోయవలసి వచ్చును. అందువలన మొదటనే చెప్పివేయుట మంచిదని చెప్పి వేసినాను. ఏమిచెప్పెదరు? ఇచ్చివేయవచ్చునా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! యిదిప్రగల్భవంచనము. కపటము. ఈకార్యమెట్టివారికిని దగదు. ఇట్లుచేయుటకంటె నొకఁడు తన ప్రాణములను వదలుట యుత్తమము. "వంచకుండు మోక్షు వంచితుండు" అన్నది నీతివాక్యము. వంచన పల్కులే దురితములు. తదాచరణమున నేమిసంభవించునో? తాము నిజము వక్కాణించి నందుల కొక కోటివందనములు సమర్పించెదను. మేము పోయి వచ్చెదము.

రసవాది—ఏమయ్యా! వెఱ్ఱివారుగా నున్నారు? మీవలె జగత్తునం దెవరినిఁ జూచి యుండలేదు. ఉండుఁడు చెప్పెదను. (సత్యకీర్తినిఁ గూర్చి) అయ్యా! మిమ్మునే! యిట్లురండు.

సత్యకీర్తి—అయ్యా! యిదో వచ్చినాను.

రసవాది—వీరేమి ప్రపంచజ్ఞానము చాలనివారుగా నున్నారు? కొంచె మిట్లు దగ్గఱకు రండు. ఆతరగరికి వినఁబడరాదు. స్త్రీలచెవులను బడరాదు. ఏమి. ఒకచిన్నవిషయము. ఈబంగారును జూచితిరా!

సత్యకీర్తి—ఔనౌను. బాలసూర్యునివలె భాసిల్లుచున్నది.

రసవాది—ఉన్నదికదా! అందు నొకచిన్న కొఱఁతగలదు. అదే మనఁగాః—రెండుమూఁడు సంవత్సరములకు వెనుకఁ గొంచెము వర్ణము మాఱిపోవును. అప్పుడు దానికిఁ దగినట్లు వెలకూడఁ గొంచెము తగ్గును. నేను నిజము నితనితోఁ జెప్పి దీని నిచ్చివేయ వచ్చు నంటిని. వీ రెంతమాత్రమును బనికిరాద నెదరు. మీరే వారికి హితబోధ చేయుఁడు.

సత్యకీర్తి—అయ్యా! వారికి హితబోధ చేయునంతటి వారమా మనము సత్యమే యీయాకృతితో నవతరించి యున్నదిగదా? వారికి నేను జెప్పుట యట్లుండనిండు. మనుజునికి వంచనము కించిత్తైనను గూడదు. మృగములు సైతము నిర్వంచకములుగా నుండవలయు ననుచో మనమా యాపనిని జేయుట. తగదు, తగదు. దీనికంటెను లేదని చెప్పుట సర్వోత్కృష్టమగు నే?

రసవాది—సరి, అలాగైనను జెప్పివేయవచ్చును. దీనికేమైన వ్రాఁత మూలకమైన పత్రము గలదా?

సత్యకీర్తి—అయ్యా! ఈక్రూరాక్షరములను మాచెవుల వేయకుఁడు. ఇయ్యవలసినధనము లేదని చెప్పువారెవరు? మనుష్యజన్మమెత్తిన వానికది తగునా? మోసము ముక్తినాశము. వ్రాఁతయున్నఁ గల దనియు, వ్రాఁత లేకున్న లేదనుటయు నెవరిచేఁత? ఆహా! యేమి కాలము? ఏమిలోకము? లోకమసత్యమనునది యిదియేకాఁబోలు అయ్యా! మమ్ము మన్నింపుఁడు. మీకు వ్యర్థశ్రమమును గలిగించి నారము. పోయి, యింకొకమార్గమున ద్రవ్యమును వెదకి మా ఋణమును దీర్చికొనెదము. (హరిశ్చంద్రునిఁగూర్చి) దేవరా! రండు పోదము.



రసవాది—అయ్యా! కోపమువలదు. నేను దమకు మంచిహితమును జెప్పితిని. ఇష్టముండినఁ జేయుఁడు. లేకున్న నాచెప్పినవిషయము నిచ్చోటనే వదలి పెట్టుఁడు. మరల స్మరింపకుఁడు. ఒకవేళ నాతర గరి యేమని యడిగిన నన్నీడ్చి నడువీధిని బెట్టకుఁడు. పుణ్యము చూడఁబోయి పాపపుసంకెలలఁ దగిలించుకొన్నట్లగును.

హరిశ్చంద్రుఁడు—(నక్షత్రేశునిఁ గూర్చి.) స్వామీ! రండు, పోదము.

నక్షత్రేశుఁడు—పోవుటయా? యెక్కడికి? సొమ్మెక్కడ?

హరిశ్చంద్రుఁడు—అది మీకుఁ బ్రయోజనపడదు. రండు.

నక్షత్రేశుఁడు—సొమ్ము ప్రయోజనపడదా? ఏమివిచిత్రము! నీ కప్పు తీర్చుట యందిష్టము లేదో? దీనికంటె లేదనిచెప్పుట కేమి యాటంకము? ఎవఁడో పుణ్యపురుషుఁడు సొమ్మిచ్చెదనని ముందుపడఁగా నది ప్రయోజనపడ దనెదవే. నీయభిప్రాయ మేమి? మనస్సు నం దొకటి పెట్టుకొని నన్నేల యిట్లు వధించెదవు? శుష్కోపచార ములు శూన్యహస్తము లనున్యాయము నీవిషయమునకు లక్ష్య భూతమగుచున్నట్లున్నది. బంగారేల ప్రయోజన పడద నెదవు? ఏమి సంగతి సత్యకీర్తీ?

సత్యకీర్తి—ప్రభువులవారే సర్వమును విశదపఱుపఁగలరు. అవసరపడిన నేకార్యమగును? స్వామీ?

నక్షత్రేశుఁడు—అవసరమా? నడుమ నొకమాటను బాగుగానే ప్రయోగించితివి. ఉండనీ! నా కాలవ్యత్యస్తమది. హరిశ్చంద్ర! ఆసంగతి యేమి?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మిమ్మును మేము వంచించుట ధర్మమగునా?

నక్షత్రేశుఁడు—బంగారమును మాకప్పగింపుమనఁగా, వంచింపవచ్చునా యనెదవే. వంచింపవచ్చును. వంచించిననేమి? ఇదెట్లు వంచన

మగును? నాకేమియును విశదపడలేదు. అన్నిటిని గూఢపఱిచి మాట్లాడెదరు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ? గూఢోక్తి యేమియులేదు. వారు బంగార మిచ్చుట కొప్పిరి. పిమ్మట

నక్షత్రేశుఁడు—పిమ్మట నేమి? ఇయ్యఁజాలననిరా?

హరిశ్చంద్రుఁడు—'ఇయ్యఁజాలను' అనలేదు.

నక్షత్రేశుఁడు—మఱేమి? నీకుఁ జెల్లింప మనసురాదా?

హరిశ్చంద్రుఁడు—అహో? అట్టి పద్ధతియును గలదా? వారిచ్చునట్టి స్వర్ణము రమారమి రెండుసంవత్సరములకుఁ బిమ్మట గుణమునందుఁ గొంచెము వెనుదీయు ననెదరు.

నక్షత్రేశుఁడు—వెనుదీసిన నేమి?

హరిశ్చంద్రుఁడు—అప్పటికి వెల సైతము తగ్గును గదా? అలాగు వంచింపనగునా? స్వామీ?

నక్షత్రేశుఁడు—ఆహా! హరిశ్చంద్ర! వీనినన్నింటిని గమనించుట వలనఁ బ్రయోజనము లేదు. సొత్తులు దినములపేరిటఁ గొంచెము గుణ హీన మగుట స్వభావమే. ఆకారణముచేత దానిని ధిక్కరింప వచ్చునా? అదిగాక రెండుసంవత్సరములవఱకు మనువారెవ్వరు మ్రగ్గువారెవరు? అట్లే యుండిరిపో, మునివరులీద్రవ్యమును జేతఁబెట్టు కొని వేడుకచూచుచునా యుండఁబోయెదరు? అనేకులచేతికి ననేక భాగములయి పోఁబోవుచున్నది. అప్పటికి నెవరినష్టము నెవరు గనఁబోయెదరు? వ్యర్థముగా నన్నుఁ దొందరలపాలు చేయకు. పుణ్యవంతుఁ డిచ్చెదనని చెప్పిన బంగారముతీసి నాచేతపెట్టు. నేను బోయెదను. నేనుగదా వలదని ధిక్కరింపవలసిన వాఁడను? నేనే



యంగీకరించెద నని యొప్పుకొను నప్పుడు నీకేమి యడ్డ మున్నది? కాసీ కాసీ దీనివలన నీకేమియును హాని లేదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మీరీలాగు చెప్పుట విధేయుని హృద యమును గాల్చుచున్నది. సొత్తులన్నియును దినములపేరిట నవ గుణమును జూపును. అట్టిహీనగుణము హిరణ్యమునకు లేదు; కాఁబట్టియే యది లోకమునం దుత్తమఖ్యాతిని జెంది, యందఱకును నుతిపాత్రమగుచున్నది. ఈబంగారమున కిట్టి సర్వోత్కృష్టగుణము లేదని తెలిసి మిశ్రమస్వర్ణము నర్పించుట వంచన యగును. అది గాక, రెండుసంవత్సరములలో నుండువారెవరు? పోవువారెవరు? అనెదరు. ఎవరున్న నెవరుచన్నను వారి వారి యార్జితములైన కీర్త్యపకీర్తులెన్నఁటికిని మఱుఁగవు. ఒకరిని వంచించి, దానివలని యపఖ్యాతిని లోకమున వ్యాపకపఱుచుట యిహపరముల హైన్య మొందుటకే. మఱియు నీద్రవ్య మనేకులకుఁ జేరఁగల దనుచో, నావంచన యొకరినేగాక పలువురను బోయి యాశ్రయించు చున్నది. ఇంతకంటెను మహానరకములందుఁ బడి మ్రగ్గుట మంచిది స్వామీ! కొంచెము మన్నించినఁ జాలును. సన్మార్గము ననే ద్రవ్యసంపాదనము చేసి యిచ్చెదను.

నక్షత్రేశుఁడు—నీవు బహుసామర్థ్యముతో మాట్లాడ నేర్చియున్నావు. దాని దానికిఁ దగినట్లొక్కొక్క న్యాయమును జెప్పెదవు. నాకేమి? దినముదగ్గఱించెను. పడరానిపాటు పడితిని. ఇంకను గొలఁది దిన ములు పడి తీర్చెదను. సొమ్మును సేకరింపు.

రసవాది—అయ్యా! బహుసమర్థులుగా నున్నారే! ఏమీ? ఈకాల మందుఁ బుణ్యము చూడఁబోయినవానికి దానిఫలము తత్క్షణమే భోగింపవలసియున్నది. నేనేదో మంచిని గూర్చి చెప్పఁగా, దానిని

మంటిలోఁ గలిపి, తుదకు నన్ను నడువీథికి లాగితిరి. మీకెవ్వఁడయ్యా సహాయపడును? పొండు, పొండు.

నక్షత్రేశుఁడు—(రసవాదినిఁగూర్చి.) అయ్యా! హరిశ్చంద్రున కేమి చెప్పితిరి? ఇట్లురండు.

రసవాది—ఔనౌను, చెప్పితిని గిప్పితిని. చెప్పినదా నడువీథికివచ్చినదే. (అనుచునే దగ్గఱించు చున్నాఁడు.) (అపవారితము) నక్షత్రేశా! ఏమి యిది సాధ్యమనియా భావించెదరు? నాబుద్ధి కొకటియును గోచరించినది కాదు. వీఁడేమి పీసమంతయును బొరపడుటగానమే వీని ననఁగా నేమఱించుటయనఁగా? దానివదలివేయుఁడు. వ్యర్థప్రయాసము.

నక్షత్రేశుఁడు—చూచుచున్నారు గద! ఇఁక నేఁ జెప్పవలసిన విషయ మొకటియును లేదే! పోయి మునివరులకు మనవిచేయుఁడు. నా గతిని గూర్చియును గొంత చెప్పుఁడు.

రసవాది—పూనికతో నంతటిని కన్నులారఁ జూచితినే, చెప్పకుందునా! పోయివచ్చెదను.

(నిష్క్రమించు చున్నాఁడు.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! తన్ను వెదకి తానువచ్చిన సొమ్మును వలదని పోఁదట్టి కొంటివి. ఇంక నేమి చేయఁబోయెదవు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! రెండొక్క దినములలోఁ జేర్పించివేసెదను. మీసొమ్ము నిలువదు. మన్నింపుఁడు.

నక్షత్రేశుఁడు—మన్నించు టట్లుండనీ. ఏవిధముగా నాకుఁ బైకము ముట్టఁజేయఁ దీర్మానించియున్నావు? అదియైనను దెలిసికోనీ ఘాతము. అగునో కాదో?



హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుఁడను బోయి, యీరాజ్యాధిపతి నాశ్రయించి, యొక యుద్యోగము సంపాదించుకొని, యందులకయి సంచకరువుగా మునివరులకుఁ జేరవలసిన ధనమును దీసికొనివచ్చి, సమర్పించెదను.

నక్షత్రేశుఁడు—ఆహా! బహువిచిత్రము! ఇది తత్క్షణము ధనము లభించు మార్గమే. హరిశ్చంద్రా! రాజన్యుఁడు రాజ్యంబుఁ గోల్పోయి మఱొక రాజన్యునికి నూడిగములు చేయుటయా! ఛీఛీ! ఈ విధముగాను నీమనసు తెగించినదా! ఆహా! యెంత తెగువ!

గీ. క్షుత్తునను గాత్ర మెంతయు - గ్రుక్కియున్న
బలవిహీనత జరచేత - బడలియున్న
కుంభమ స్తిష్కమును గాని - కుడువఁ బోని
సింహమదియెట్లు పుత్తేయఁ - జిత్త మిడునొ.

ఓహో, హరిశ్చంద్ర! అభిమానికెన్ని చేటులు గలిగినను మాన సంపదను గోలుపోనిచ్చుట యయుక్త మని పెద్ద లందురు. పోనీ. అట్లె యొప్పుకొందము. నీ వెప్పుడు మనవిపెట్టుకొనెదవు? దాని కని సంచకరువు తీసికొనుట యెన్నఁడు? ఇదేమి! ఎట్లు చూడఁబోయినను నిది మాశ్రమముల కే కారణమగుచున్నది. పట్టుమన్నను రెండుదినములు పట్టునే? పట్టినను బైకము వచ్చు ననుట కేమి నిశ్చయ మున్నది? నిన్నుఁ దెలిసినవా రిక్కడ నెవరు? నీకు నెవను సాహాయ్యము చేయువారలు? చేసిరి పో! ముందుగా నీకు నింతధనము నిచ్చువా రెవరు? ఒకటియును సుసాధముగాఁ దోఁపదే!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుఁ డీ కాశీరాజును సమక్షమునఁ జూచి, యాతనిస్థితిగతులను విజ్ఞాపించి, సంచకరువును గైకొని మీపైకము చెల్లించును. దానిచే మిగులఁ దామసము కానేరదు.

నక్షత్రకుఁడు—హరిశ్చంద్ర! ఏమి, నీమాట లన్నియును విచిత్రములుగా నున్నవి. రాజును సమక్షములో దర్శించెదవా? నీకు రాజ్యభ్రంశముతోడ బుద్ధిభ్రంశము కూడఁ గలిగెనే! తమ రాజ్యము వదలి మఱొకరాజ్యమున వసింపఁగోరువార లారాజ్యమునందున్న తమరాజ్యపుఁబ్రతినిధి యగువానికడఁ గదా మొదట విన్నవించుకొనవలెను. దీని నంతయు నీవు మఱచితివే?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మఱచినవాఁడను గాను. ప్రతినిధియంగీకారము గైకొన్నయనంతరమే రాజుగారిని సమక్షమున దర్శించెద.

నక్షత్రకుఁడు—ఓహో! అట్లయినయెడల త్వరగాఁ బోదము రమ్ము; నన్నింకఁ గష్టపెట్టకు. (నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రథమరంగము.

## ద్వితీయరంగము.

స్థలము : ప్రతినిధిగృహము

కాలము : ఉదయకాలము.

పాత్రములు : హరిశ్చంద్రుఁడు, ప్రతినిధి, నక్షత్రకుఁడు.

(హరిశ్చంద్రుఁడు ప్రతినిధిని గాంచి వందనము లర్పించుచున్నాఁడు.)

ప్రతినిధి—అయ్యలార! మీ రిరువు రెవరు?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! నే నయోధ్యానగరవాసిని.

ప్రతినిధి—అయోధ్యానగరవాసులా! రండు. ఇచ్చోటఁ గూర్చుండుఁడు. మీ రేయుద్దేశముతో నిచ్చటికి వచ్చితిరి?



హరిశ్చంద్రుఁడు—అయ్యా! నేను విశ్వామిత్రకులపతికిఁ గొంచెము ఋణముఁ దీర్పవలసియున్నది. దానిఁ దీర్చుటకీ రాజ్యాంగమునందు నేదేని యొకజీవిక సంపాదించికొనఁ దలఁచి, తమదర్శనము సేయఁ గోరి వచ్చినవాఁడను.

ప్రతినిధి—విశ్వామిత్రులకు ఋణ మచ్చుకొనవలయునా? ఓహో! తామే నా హరిశ్చంద్రుఁడను నృపాలుఁడు?

హరిశ్చంద్రుఁడు—ఔను! విధేయు నట్లే పిలుతురు.

ప్రతినిధి—ఆ! ఆ! ఇటు రండు. సమీపమునఁ గూర్చుండుఁడు. అకటా! రాజులకే యిట్టి స్థితి గలిగిన, సామాన్యజనసముదాయములకుఁ జెప్పవలయునా? మునీంద్రులకు రాజ్య మొసఁగినవారలు తామే గద! ఏమి తమ యౌదార్యము! తమ్ము దర్శించినదే మామనస్సు కరఁగి నీరగుచున్నది. ఏమి చేయవచ్చును? విధిప్రేరణ యట్టిది. మంచిది. ఈ రాజ్యమునం దుద్యోగమును దాము వేఁడెదరు. మేమును మాచే నయిన యత్నములఁ జేసెదము. అభ్యంతరము లేదు. అయినను, అధికఋణస్థులకు రాజకీయోద్యోగము లిప్పింపఁబడ వనుట ప్రభుత్వ మొనరించినమీ రెఱుఁగనిదే? కాఁబట్టి, యీధనము ఋణముఁ దీర్చుట కనుమాటను దాఁచియుంచుటయే గాక, యయోధ్యనుండి వచ్చినట్లును జెప్పరాదు. అప్పునకుఁ గాదని చెప్పునెడల, మేమే రాజునొద్దకుఁ బోయి తమ యభీప్సితము నెఱవేర్చుటకు వలయు సన్నాహముఁ జేసెదము. అయోధ్యావాసులము గామని చెప్పుచో మఱొక ప్రతినిధిమూలమున నుద్యోగ మిప్పించెదము. వీనిలో నేదేని దృఢపఱచికొని సెల విచ్చిన, నందులకుఁ దగినట్లు యత్నించెదము. అక్కటా! మీకును నిట్టి దుర్దశ రానగునా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! తా మనుగ్రహించి సెలవిచ్చిన రెంటిలో దేనిని గాని యీయకొనుటకు నావలనఁ గాదు. నిజముఁ దప్ప మఱొకటి చెప్పుటకు సాహసింపఁజాలను. నే నయోధ్యనుండి వచ్చినవాఁడనే! మునివరునికి నధమర్ణుఁడనే! వీనిలో నొక యుత్తరమునుగాని మార్చి చెప్పుటకు నామది యొల్లదు. నా సత్యసంధతకు నీషత్తయినను లోపము గలుగని యేకార్యంబునైనను జేసెదను.

ప్రతినిధి—ఇది పొల్లుగాదు, పొర్లింపుగాదు. తాము గోరు ధన మెందుల కని యడిగిన, నప్పున కని చెప్పకుఁడు. ఇంతే గద?

హరిశ్చంద్రుఁడు—అప్పు దీర్చుటకయి కోరెడి ధనము నందులకుఁ గాదని సెప్పుట యెట్లు? అట్లు చెప్పుట యసత్యమే కదా. అసత్యవాదినై భూతలమునందు జీవింపవచ్చునా? అది నాకెంతయు సరిపడదు.

ప్రతినిధి—అది పోనిండు. అప్పుదీర్చుట కనియే చెప్పుఁడు. వేఱుదేశస్థుల మని చెప్పుటచే నేమి ప్రమాదము?

హరిశ్చంద్రుఁడు—అదియు బొంకే కదా. నాదేశము వాస్తవముగా నయోధ్యయై యుండఁగా, దానిని మఱుఁగుపఱచి మఱొకటి యనుట న్యాయ్యమగునా? అట్లు చెప్పుట బొంకాడుటయే కాక, తాను జన్మించిన మాతృభూమికి వంచన యొనర్చుటయు నగును. ఒకఁడు తనతల్లిదండ్రులను మఱచుటకంటెఁ దనజన్మభూమిని మఱచుట మహాపాతకం బగును. జ్ఞానహీనుఁడును జన్మభూమియందు మిగుల వాత్సల్యము గలవాఁడై యుండ, నేను జన్మదేశమును మఱుఁగుపఱచి వేఱొక్కటిని జెప్పితినేని, నన్ను జను లట్టివానికంటె హీనునిగానే తలంతురు గదా. తమకడకు వచ్చినందులకుఁ దా మిట్టి బుద్ధి చెప్పవచ్చునా? బాగుగా నున్నది మీయుపదేశము!



ప్రతినిధి—అయ్యా, తాము దేనికిని లోపడివచ్చువారలుగాఁ గనఁబడరు. మీరు లోకమెఱుంగరు. కాఁబట్టియే కదా తమకుఁ గలసమస్తము పోఁగొట్టుకొంటిరి. పొండు, పొండు. మావలన నేమియుఁ గాఁజాలదు.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! కోపింపకుఁడు. పోయివచ్చెదను. నమస్కారము.

(వెలుపటికి వచ్చెదరు.)

నక్షత్రకుఁడు—"దరిద్రునకుఁ దలనిండుగఁ దలంపులు" అందురు. అట్లు నీ వేమేమొ యోజించెదవు. ఒక్కటికిని లోఁబడి వచ్చువాఁడవుగాఁ గనఁబడవు. రాజ్యాంగమునం దుద్యోగమును గోరికొనియెదవు దానికిఁ దంత్రములు మిక్కుటముగా వలయును. అవి నీకు సరిపడినవి గావు. ఇట్టి నీకొకవేళ రాజకీయోద్యోగము లభించిన దనుకొనుము. దాని నెట్లు కాపాడుకొనఁగలవు? జీవనగౌరవమునుబట్టి సమయోచితములుగ ననేకతంత్రములఁ బన్నవలసి వచ్చును. అంతేకాక, రాజ్యాంగమునందుఁ జేయఁగల రాజతంత్రములు పెక్కులు. ఇవన్నియు నీకొడఁబాటుగానిచో, నీవు చేయఁగల దేమున్నది? నీకీజగమే విరుద్ధముగా నున్న, జగత్తునందలి జను లెట్లు నిన్ను మోదింతురు? నీకు హితబోధ సేయ నెవనితరము? నీ యిష్టానుసారము చేయవచ్చును? నాపైకము ముం దక్కడఁ బెట్టివేసి, యావల నడు గెత్తిపెట్టుము. వచ్చినది కాలితోఁ దన్నుచున్నావు. ఇఁక నొకనిమిషమైన నే సైఁపఁ జాలను. ఏమి చెప్పెదవు? రెంటిలో నొకటి—ఉన్నదా? లేదా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! అసత్యాలాపముల నాడుమన్న నేమిచేయవచ్చును? "యథార్థవాదీ లోకవిరోధీ" యను సూక్తిరత్నము

హాస్యాస్పదమా? అట్టి యాథార్థ్యము నవలంబించినవాఁడు లోకవిరోధి యగుచున్నాఁడు. నశ్వరంబయిన జగత్తువలనిపని యేమి? తుట్టతుద మననడచిన నడవడికలచేత సర్వసాక్షియగు సర్వేశ్వరుని మెప్పింపవలయునుగాదే. ఈమిథ్యాలోకంబును నమ్మి, సత్యప్రపంచంబును జేయివదలరాదు. అసత్య మసత్యవాదినే యాశ్రయించెడును అట్టి యసత్యవాదినే యసత్యలోకము గౌరవించును. ఆయసత్యప్రపంచంబు సత్యసామ్రాజ్యమున కత్యంతవిరుద్ధము. స్వామీ, యెట్లయినను దమద్రవ్యము నిచ్చివుచ్చెదను. అనుగ్రహించి కొంచె మోర్చికొనుఁడు.

నక్షత్రేశుఁడు—ఓర్చుకొనున దేమిటి? 'ఓర్చుకొను. ఓర్చుకొను' మని పలుమాఱు పలికెదవు. ఓర్చికొనకయే యిన్నిదినములు గడచెనా? ఎట్టు లియ్యఁగలవు? నీప్రయత్నంబులయం దొక్కఁడేనియు ఫలమునకు వచ్చినది గాదు. అన్నివిధములఁ బ్రయత్నించితివి. ఏదియుఁ గొనసాగినదిగాదు. ఇఁక దాస్యవృత్తికి లోపడుటయే శేషించియున్నది. ఈదేశమున బానిసలఁ గొనువారు పెక్కుఱు గలరు. ఇది సంపన్నులచే నిండిన నగరము. యోజించి చూడుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ, మీరు సెప్పిన వన్నియు వాస్తవములే! అట్లు బానిసతనమునకు లోపడి యేనియుఁ దమద్రవ్యమును జెల్లించుట కభ్యంతరము లేదు. సత్యమునే సహాయముగ నమ్మినవార లెట్టి దశ ననుభవించినను జింత లేదు. జ్ఞానవంతులకు దొరతనంబును, బిచ్చమెత్తుటయు నొక్కటె. కాఁబట్టి, యెవరి కేనియు బానిసతనమునకు లోపడియైనను దమకుఁ జెల్లింపవలసిన ధనము త్వరలోఁ జెల్లించెద నని నిక్కపు మాటలను నిండుమనసుతోఁ బలికెదను.



ఐన నొకటి. మా కీనగరము క్రొత్త కాఁబట్టి, యెవరికి బానిసల మగుట యని పర్యాలోచించెదము. ఇదొకటే మాయాలస్యమునకుఁ గారణము.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్ర! మాకు నీయెడల జాలి యొకప్రక్కను, నధికకోపము మఱొకప్రక్కను సంభవించుచున్నవి. నీకష్టములను గాంచిన మాహృదయమునకుఁ దోఁచు పరితాపము మితి మీఱినది. మాపడుశ్రమమునుగూర్చి తలంచినచో, హృదయవీథిం దోఁచు కోపదవానలం బుపశమింపరానిది. ఐనను దయారసమే బలీయమయి, కోపాగ్నిని జల్లార్చుచున్నది. నీయొద్దఁ జొక్కుపొడి యేదైనఁ గలదో తెలిసినది గాదే! ఉండనిమ్ము. ఈ నగరము మీకుఁ గ్రొత్త యనుట నిజమే! నీకు మావలననయిన సాహాయ్య మొకటి చేసెదము. కొంచె ముండుము. ఈ నగరమునందు నాకుఁ దెలిసిన ధనాఢ్యు లెవరయినను గలరా? యని యోజించెదను. (కొంచె మావలికిఁ బోయి, ముక్కుమీఁద వ్రేలుంచుకొని పైకి దృష్టి సారించి) ఇప్పు డేమి చేయవచ్చును? ఈమార్గమునను వీఁడు మోసపోవునట్లు గానఁ బడఁడు. వీ రీనగరమునందు మఱొకరికి బానిసలైరేని మనకార్యము బొత్తిగా నశించును. వీరిగుణగణంబుల కట్టివారును ధనసాహాయ్యమును జేయ సమకట్టుదురు. అట్లు వీరిని వదలరాదు. వీరికి మేలుసేయువానివలె నేను నటించి, వెలుపలికిఁ జని మనలోని యొకనిఁ దెచ్చి, వానికి బానిసలఁ జేయవలయును. పిమ్మట వీండ్రను యుక్తియుక్తముగ సవరించుకొనవచ్చును. మన పెట్టు బాములకు లోపడి, వీరు మనమునినాథునిపంతము జయించు పద్ధతికే యనుకూలించిరాఁగలరు. (మరలి వచ్చి) హరిశ్చంద్రా! నేను బోయి, యెవరినైనఁ దగినవారిని సరిపఱిచి పిలుచుకొని వచ్చె

దను. ఏమి చేయుదును. మాధనమునిమిత్తము నేను శ్రమపడవలసి యున్నది. నిన్నుఁ గూర్చి యెంతశ్రమపడెదనో చూడుము! అన్నియు నవరించెద. పిమ్మట నన్ను మఱచిపోకుము సుమా! జ్ఞాపక ముండ నిమ్ము! పోయివచ్చెదను.

హరిశ్చంద్రుఁడు—అయ్యా, యట్లే పోయిరండు. ఒకరి కొకయాపద వచ్చినపు డది యొరులను గూడ బాధించును. అట్లె మాకాని కాలముచే మాదగ్గఱకు వచ్చిన మీకును గొంత శ్రమము గలుగు చున్నది. పోయిరండు. వందనము చేసెదను.

(నక్షత్రేశుఁడు నిష్క్రమించును.)

(యవనిక జాఱును.)

ఇది ద్వితీయరంగము.

~~~~~~~~~~~~

## తృ తీ య రం గ ము.

స్థలము: కాశీనగరమందలి వీథి.

కాలము : పూర్వాహ్ణము.

పాత్రములు: హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, దేవదాసుఁడు, సత్యకీర్తి, నక్షత్రేశుఁడు, కాలకంఠయ్య.

(నక్షత్రేశుఁడు కాలకంఠయ్యను జూచుచున్నాఁడు.)

కాలకంఠయ్య—నక్షత్రేశా! జయమేకదా?

నక్షత్రేశుఁడు—జయమా! ఊఁ అదంతయు నేమి లేదు. అంతయు నిష్ఫలముగానే యున్నది.

కాలకంఠయ్య—అదేమి యట్లంటివి? ఇంద ఱెన్నివిధంబులఁ బ్రయత్న పడియునా కార్యము నిష్ఫలముగా నున్నది?



నక్షత్రేశుఁడు—ఎంద ఱెన్నిమాఱులు ప్రయత్నపడిన నేమి? ఆతని మనస్సును ద్రిప్పుట కెవఁడు చాలును? ఆతఁ డటుండ నిమ్ము. ఆతనిభార్య యతనికంటెఁ బదింత లెక్కువగా నున్నదే! చాలని కొఱఁతకు సత్యకీర్తియుఁ జేరి యున్నాఁడు. వాఁడు వీరందఱికంటె నసాధ్యుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. వీరంద ఱొక్క యెత్తు. సత్యకీర్తి యొకయెత్తు. వీరలో వయసు వచ్చినవారు; వ్యవహార జ్ఞానముగలవారు; విధినిషేధంబుల నెఱిఁగినవారు. ఆ దేవదాసుఁడు బాలుఁడు; నోటఁ జనుఁబాలవాసన యుడఁగినది కాదు. వాఁడుసైతము గదా సత్యము దప్పక నిల్చి యున్నాఁడు. అకుటుంబమే యపరసత్యావతారమో యనఁదగి యున్నది. నేనును నాచే నైనంతవఱకుఁ బోరాడితిని. ఒక తృణమంతయైనను వాని డెందము మాఱదుగా. ఇఁక వారిని నెడఁబాపిన నొకవేళ నేమైనను వారిమనస్సు మార్పనగు నని తోఁచెడిని. దానికి నొక యుపాయంబు పన్నితిని. దానినిమిత్తమే నే నిప్పుడు తమకడకు వచ్చినాఁడ.

కాలకంఠయ్య—ఓహో, ఆలాగా! మునివర్యుఁడును దీనిం దలఁచియే నన్ను నీకడ కంపెను. మంచివేళ, నిన్నిక్కడనే చూచితిని. నీవు చెప్పునది చూడఁగా నేమియుఁ బస లేనట్లున్నదే.

నక్షత్రేశుఁడు—నేను జెప్పుటేమి? మఱెవ్వరును జెప్పలేదా?

కాలకంఠయ్య—అవునౌను. చెప్పిరి. మునీంద్రుఁడును నొక్కొక్క టియు విని, మిక్కిలి సంతాపము నొందెను. ఇప్పుడు మనము హరిశ్చంద్రుని సంకటపెట్టఁబోయి, మనము సంకటపడుటయే గొప్పగానున్నది. మనశ్రమ యట్లుండఁగా, నామునివర్యునికి రేయింబగళ్లు నిద్దుర యనునది లేదు. అకటా! ఒక్కొక్కఁడును దన
~~~~~~~~~~~~

యత్నంబు విఫలం బయ్యె నని చెప్పునప్పుడు మునీంద్రుఁడు మోము వెలవెలఁ బాఱఁ బండ్లు బిగఁ బట్టుకొని పడు పరితాపంబునకు మేరయే లేదు. విప్పఁబోయి ముడి వేయించుకొన్న సామెతగా నున్నది. తుదకు హరిశ్చంద్రున కొకకష్టమైన, మునివర్యున కష్ట కష్టము లని తోఁచెడి. మనమే యోజింతము. అసత్య మెట్లు సత్యమును జయించును? సరి. అయినదైనది. మనమేమి చేయనగు? మనచే నైనంతవఱకు మునీంద్రునికై పాటుపడవలయును. నీ విప్పుడు నాతోఁ జెప్పఁదలఁచిన దేమి? అట్లే నేనును జేసెదను.

నక్షత్రేశుఁడు—అదియంతయు నుండనిమ్ము. తమ యొద్దఁ బైకమున్నదా?

కాలకంఠయ్య—ఆహా! కావలసినంత యున్నది. మహారాజు హరిశ్చంద్రునిబొక్కస ముండఁగాఁ బైకమునకుఁ గొదవ యేమి! పైక మెందుకు?

నక్షత్రేశుఁడు—చెప్పునంతలో నవసరమా తమకు? వారు ముగ్గురొక్కటిగాఁ గూడియుండుటవలన నొక్కటే మనోధైర్యంబుఁ బూని యున్నారు. వారిని నెడఁబాపినచో, మనకార్యము సుఖసాధ్యంబు గావచ్చును. ఇప్పుడు వా రేనికైన బానిసతనమునకుఁ గుదిరియైనను మునీంద్రునిపైకము నిప్పింప సిద్ధపడి యున్నారు. మఱెవ్వరికైనను వారు బానిసలైనచో, మన ప్రయత్నంబు నిష్ఫలంబగును. కావునఁ దాము వచ్చి విశ్వామిత్రమునీంద్రునికిఁ గల ఋణము దీర్చునట్లుగా నొప్పుకొని, వారిలో నా సాధ్వినే బానిసగాఁ జేసికొన నిర్బంధింపుఁడు. అట్లు వారొప్పుకొందురేని, పిల్లవానినిగూడఁ బంపుమని యడుగుఁడు. పిదపఁ దమరు దల్లిని బిడ్డనుగూడ వెంటఁబెట్టుకొనిపోయి, మునీంద్రుని మాటప్రకారము చేయుఁడు. వా రిరువురు నెడఁబాయుటవలననే మనకార్యము



వెంటనే యనుకూలింపఁగలదు. అప్పటికిని గానిచో నా మంత్రిని హరిశ్చంద్రునియొద్దనుండి వేఱుపఱచి, యాతని నొంటి చేసియైనను బొంకింప వచ్చును. ఇదియే సరియైన పద్ధతి. తమ కేమి తోఁచుచున్నది?

కాలకంఠయ్య—ఆహా! దాని కేమి? నీవు చెప్పినదే సరి. వారితోడ నిన్నిదినంబులుగా మెలఁగియున్నవాడవు. నీకు వారిస్వభావ మిట్టిదని బాగుగాఁ దెలియును. కావున నీమాటవలన మునీంద్రునికి జయము గలుగవచ్చు ననియే నమ్మెద.

నక్షత్రేశుఁడు—అయిన, సరి. రండు పోదము. దగ్గఱనే. అదిగో కనఁబడుచుండు నా సత్రమే.

(నక్షత్రేశుఁడు కాలకంఠయ్యను దోడ్కొని హరిశ్చంద్రుఁడు మున్నగువా రుండుచోటికి వచ్చుచున్నాఁడు. హరిశ్చంద్రుఁడు వారిని జూచినంతటనే లేచి వందనము నేయుచున్నాఁడు.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా, యిదిగో యాతనిని బిలుచుకొని వచ్చితిని. ఇతఁ డొక బ్రాహ్మణుఁడు. ఈ కాశీపట్టణపుఁ బురోహితుఁడు. సుగుణగణయుక్తుఁడు. ఇతని కొక నౌకరి గావలెనఁట. నీవు చక్రవర్తివైయుండి, సామాన్యముగా నొకనికి బానిసీఁడవగుట యన నామనంబు సంతాపము నొందుచున్నది. (గుడ్డికంటె మెల్ల శ్రేష్ఠ' మన్నట్లు బ్రాహ్మణుఁడుగా నుండినఁ గొంచెము మేలని తలఁచి, మిక్కిలి ప్రయాసపడి యీబ్రాహ్మణుని వెదకి వేసారి తెచ్చితిని. నన్ను మఱవకుము. ఈతనితోఁ దగిన తెఱంగున మాట్లాడి కార్యసిద్ధి యగునట్లు చేసికొనుము.

హరిశ్చంద్రుఁడు—చిత్తము. అట్లే చేసెదను.

(కాలకంఠయ్యగారివైపు చూచి) అయ్యా! నమస్కారములు.

కాలకంఠయ్య—"సుఖీ భవ. సమస్తసన్మంగళాని భవన్తు" నృపాలా, యేమి విశేషము?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! నేను విశ్వామిత్రమహామునికిఁ జెల్లింపఁదగిన పైకమును జెల్లించి, మమ్ముఁ దమసేవకులనుగాఁ జేసికొనఁ గోరెదను.

కాలకంఠయ్య—ఊరక యప్పనిన గూఢముగా గదా యున్నది. అది యింత మొత్తమని చెప్పిన బాగుండును.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! వారికి నేను బడిన యప్పు మొత్తము నూఱు లక్షల వరహాలు. ఆ యప్పు మీ రొప్పుకొనవలయును.

కాలకంఠయ్య—అబ్బబ్బో! ఎంత? నూఱులక్షలవరహాలా! మొత్తం కొంచెముగానే యున్నదే! ఉండనీ. దీనికేమి యేర్పాటు?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! తా మొసఁగు ధనంబునిమిత్తమై నేనును, నిదిగో నాచేరువ నిలిచి యుండు నాధర్మపత్నియు, నాముద్దులకుమారుఁడును దమకు దాసులమై తామానతిచ్చు పనిపాటులు సేయుచుఁ దమయిడిన యన్నంబుఁ గుడుచుచుఁ దమకడనే యుండఁగలవారము.

కాలకంఠయ్య—(సత్యకీర్తిం జూపి) ఈయన యెవరండీ? మీతో సంబంధించినవారు కారా?

హరిశ్చంద్రుఁడు—ఆతఁ డీ దాసునిచెలికాఁడు. ఆతనికిని నీ మాదాస్యమునకును నెట్టి సంబంధమును లేదు.

కాలకంఠయ్య—ఇదంతా యుండనీ. మొత్తము చూస్తే గొప్పగానున్నదే. మా తాతముత్తాతలు చేర్చిపెట్టియుండే సొమ్మంతా చేర్చినా యింత మొత్తం ఉంటుందో యుండదో యని సంశయం వేస్తున్నది. ఉంటే ఉండనీ. మాయింట్లో నా భార్యతో మాటాడే తోడు లేదు.



దానికి ఒక ఆడతోడు కావలె. పోనీ తోడుగా ఉంచుం దని చూస్తే నీపెండ్లాము పని కాఁ గేమనిషిగాఁ గనిపించదు. ఏమిచేసేది! ఊరక మాటాడుచూవున్నా చాలును.

నక్షత్రకుఁడు—ఆమె గొప్ప యంతస్తులో నుండిన యాబిడ. అందుల కామె మిగులఁ దగినది. మంచిసహవాసముగాను నుండును.

కాలకంఠయ్య—నాకున్ను అదే యోచన. మాయింటిది నిండాపసిది. అది యాడతోడు లేక, అట్టె యొకమూలలో కూర్చుండి యుంచుంది. నేనో, పనులమీఁద బయటవెళ్లవలె. అప్పుడీబిడ వార్తలు చెప్పుకుంటూ తోడుగా ఉంటుంది. సొమ్ము పోయినా పోతుందికాని, నాకు మగవాళ్లక్కరలేదు. ఈబిడ చేసేటందుకు మాయింట్లో నేమి పను లుంటవి. మేము రెండు ప్రాణాలము. వంటచేసేది, తినేది, నిద్రపొయ్యేది. ఇంతే మాయింటి పనులు. దీని కెందుకు నౌకర్లు? మాయిద్దఱకు వంట చేసుకొనేటందుకే మాయింటావిడకు ఉసురసు రగుతుంది. ఇంకా వీళ్లకంతా అంబలైనా కాచి పోయవలెఁ గదా.

నక్షత్రకుఁడు—ఏమి హరిశ్చంద్రా! నీమనసున నుండునది చెప్పవచ్చునే. ఊరక తామసము చేయుటచే ఫల మేమి? (చేరఁబిలిచి) దీనిని గూడఁ బోఁగొట్టుకోకుము. ఎవ రెచ్చట నుండిన నేమి? ఈ బ్రాహ్మణుఁడు పేరాసగలాఁడు. ఏమో, యాతఁ డొప్పుకొన్నదే మన కొక యదృష్టకాలము. వేగిరముగాఁ బని ముగించుకో. కడపట నన్ను మఱచిపోకు.

హరిశ్చంద్రుఁడు—(కాలకంఠయ్య వైపు చూచి) స్వామీ! తమయిష్టప్రకారము చేయుఁడు. నాభార్యను మాత్రము తాము పనికత్తెనుగా నుంచుకొని, మాఋణము చెల్లింపుఁడు.

కాలకంఠయ్య—ఏమి వింత! చెల్లింపండీ యంటే యేలాగు చెల్లించడం? దానికని చీటీ గీటి యేమి యక్కఱ లేదా? ఇదంతా యేమి మోసంగా ఉన్న దే!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మోసము కొంచెమైనను లేదు. దాస్య పత్రము వ్రాసియిచ్చెద. దాని కాటంక మేమియు లేదు. తమయుద్దే శము తెలిపించిన నట్లే వ్రాసికొనవచ్చును.

కాలకంఠయ్య—నాయభిప్రాయం ఏమిటి? అది యందఱికి నేర్పడిన దే గదా. అట్లే పత్రము వ్రాయండీ.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! యివ్విధముగాఁ బత్రము వ్రాయవలె నని తెలిపిన, యోజించి పత్రము వ్రాసి యియ్యవచ్చు నని దాసుని తలంపు. దాస్యపత్రము వ్రాయఁబూనుటకు దాసుని కిదియే మొదటి తడవ. కాఁబట్టి యట్లడిగితిని. మన్నింపవలయును.

నక్షత్రేశుఁడు—తామే తమయభిప్రాయమును సెలవిండు. కొనువారి యభిప్రాయముతో నేకీభవించుట యవశ్యము కదా.

కాలకంఠయ్య—ఆలాగా సరే! చేస్తాను. వినండి.

ఫలాని సం॥ ఫలానినెల, ఫలాని తేదిలో ఫలాని వారికిఫలాని వారు వ్రాసియిచ్చిన దాస్యపత్రము.

ఫలానికారణముకుఁ గాను, ఫలానివారివద్ద ఫలానివారు పుచ్చు కొన్న రొక్కము రూపాయలు ఇన్ని. దీనికిఁగాను ఫలాని ఫలాని వారు దాసులుగా నుంపఁబడి యున్నారు. వారు ఫలానివారు చెప్పు యావత్తు పనుల నడ్డుచెప్పకుండా చేయవలసినది. పైకమును మళ్లీ ఫలానివారు ఫలానివారికిఁ జెల్లించినయెడల, నా తేది మొద లా దాస్యపత్రము రద్దుచేయఁబడును. అప్పుడు ఫలానిఫలాని



వారిని ఫలానివారు దమస్వాధీనము చేసుకోవచ్చును. ఈ ప్రకా రము ఫలానివారు తమమనఃపూర్వకముగా సమ్మతించి వ్రాసి యిచ్చిన దాస్యపత్రము.

ఇట్లు:

అని వ్రాసియిచ్చేవారు సంతకము చేయవలయును. పిమ్మట సాక్షులు చేవ్రాళ్లు చేయుదురు. ఇంతేకదా. దీని కేమి యోచన. ఇది యందఱికిఁ దెలిసినవిషయమే కదా. ఈ యూరిలోఁ బసిబిడ్డ నడిగినా యీసంగతి చెప్పునే.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! తాము చెప్పినయంశములలో విధేయునికి రెండుసంశయములు గలుగుచున్నవి. ఆసంశయములను దయచేసి తీర్పవలయును.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా, చూచితివా నీప్రాఁతకవిలె మఱల విప్పి తివే. అవేవియు వలదని మునుపే చెప్పితిని గదా. ఇవన్నియు వెఱ్ఱిసంశయములు. ఆయనయో బ్రాహ్మణోత్తముఁడు. ఏమియు నెగుడుదిగుడుగాఁ జెప్పఁడు. అయిన నాయన యేమియు విస్తరించి చెప్పలేదే. ఇట్లిట్లనియే కదా చెప్పినాఁడు. దీనిలో నీ కేమి సంశ యము వచ్చినది?

కాలకంఠయ్య—అదేమి! ముందే మీరేదో మాట్లాడుకొన్నట్లు న్నదే. మీలో మీ కేదైన నాంతర్య మున్నదో? ఉంటే చెప్పండీ. బ్రాహ్మణుని వంచన చేయకండీ. మిమ్ము నమ్మినాను. నమ్మినవానికి ద్రోహము చేసినయెడల మహాదోషము సంభవించును.

నక్షత్రేశుఁడు—అట్టి దేమియు లేదు. ఇతఁడు రాజుగా నుండిన యాతఁడు గదా. సంగతి విశదముగా నుండవలయు ననుటయే

యీతనితలంపు. లోకములో నంద ఱట్లుండుదురా? దానికే చెప్పితిని. అది తప్ప మోస మేమియు లేదు. అందును బ్రాహ్మణునా మోసపుచ్చవలెను.

కాలకంఠయ్య—ఏమిటి దయ్యా సందేహము తమకు? చెప్పండీ చూస్తాము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! తమరు చెప్పిన విషయమునందు, "ఫలాని ఫలానివారిని దాసులనుగా నుంచి," అనియు, "చెప్పినపను లన్నియుఁ జేయవలయును" అనియుఁ దమ రానతిచ్చితిరి.

కాలకంఠయ్య—అవును. దానిలోఁ దమ కేమి సంశయము?

హరిశ్చంద్రుఁడు—మఱి యేమి విశేషము లేదు. తాము విధేయుని భార్యను మాత్రము దాసిననుగాఁ గొన నొప్పుకొంటిరి. ఇప్పుడు "ఫలాని ఫలానివారిని" అనిన, ఒకరికంటె హెచ్చుమందిని యని తోఁచుచున్నదే; అట్లయినచో, విధేయునిఁ గూడ దాసునిగా నుంచుకొనవలె నని తమయుద్దేశమా తెలియఁ గోరెదను.

కాలకంఠయ్య—నక్షత్రేశా, వింటివిగాదా సంగతి. అరేరేరే. అహ, హ, హ. (హరిశ్చంద్రునివంకకుఁ దిరిగి) హరిశ్చంద్రా, "ఫలాని ఫలానివాళ్లు" అనఁగా, "నిన్ను, నీ భార్యనున్ను" అనియా యర్థము చేసివేస్తివి. ఆహా! ఏమి నీ వెఱ్ఱితనము! ఇది విపరీతముగాఁ గదా ఉన్నది. పాపము! అగర్భశ్రీమంతుఁడవు. లోక నడవడి యొక్కటియుఁ దెలిసినవాఁడవు కావు. అయ్యా, యది యట్లు కాదు. నీ భార్యను మాత్రమే దాసిననుగాఁ జేసికొనుట యని యర్థము. నీ భార్యను బనికత్తెనుగా నేర్పఱచుకొన్నఁ బిన్నవాఁడు కూడా కదా రావలెను. ఇది తెలియదా నీకు,



హరిశ్చంద్రుఁడు—పిన్నవానిని గూడఁ బనికిఁ బెట్టుకొన్నచోఁ గదా వాఁడు కూడ రావలెను. అటుగాకున్న, వాఁడు దాసునితోనే కదా యుండవలెను.

కాలకంఠయ్య—అది యట్లు కాదు. లౌక్యం తెలియక మాట్లాడుతావు. ఇప్పు డొకఁ డొకయావును గొంటాఁడని యెంచుకో. దానిదూడ తల్లితోఁ గూడ వచ్చునుగదా. అట్లె తల్లిని గొంటే దానితోఁ గూడ బిడ్డయు సహజముగా రావలసినదే. దీనినిగూర్చి యేమి వ్యాజ్యము. అట్లు సమ్మతి యుంటే చూడు. లేనిచో నీ వ్యవహారము నిల్పివెయ్యి.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా! లోకమర్యాదకు విరుద్ధముగా నెవ్వఁడును నడచుకోరాదు. ఇది నీకే కాదు, అందఱికిఁ గలిగినదే. చాలు, చాలు. అడ్డములు చెప్పకు. నామాట వినుము.

కాలకంఠయ్య—నక్షత్రేశా, నీ వేల[1] యాతనిని నిర్బంధిస్తావు. వారి వారికష్టములు వారివారికిఁ దెలుసును. నీ వూరక ఉండు. వారికి ధైర్యం ఉంటె చెయ్యనీ. లేకపోతే పోనీ.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! తమయిష్టానుసారమే చేయుఁడు. నలుగురికిఁ గలది నాకును. లోకులతోఁ గూడఁ గలసిమెలసి మనుటయే యుక్తము. అట్లే కానిండు.

కాలకంఠయ్య—సరి యీసంగతి తీరినది. మఱియొక సందేహమేమో ఉన్నది యన్నావే. అదేది? దానిని నిప్పుడే చెప్పి వేయుము. పిమ్మట జగడము వద్దు.

హరిశ్చంద్రుఁడు—అవును స్వామీ! యదియు ముఖ్యమయిన యొక సంగతియె.

కాలకంఠయ్య—సరే. అ దేమిటి?

హరిశ్చంద్రుఁడు—"చెప్పినవి యన్నియుఁ జేయుట" యంటిరే. అదేమి? అది కూడ వివరించి తెలుపవలెను.

కాలకంఠయ్య—ఏదిపట్టినా విపరీతముగా ఉన్నదే! పనికి వచ్చినప్పుడు చెప్పిన పని చేయ నక్కఱలేదా? దీని నెట్లు వివరించి చెప్పేది? నాకుఁ దెలియలేదే.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా, పనికిమాలిన యాక్షేపము లేల? ముం దొక్కటి యడిగితివి. దానివలన నేమైన లాభము గలిగినదా? పని కొప్పుకొన్నప్పుడు చెప్పిన పని యంతయుఁ జేయఁ బని లేదా. నీవు రాజవుగా నుండినప్పుడు, నీయొద్ద నొక్కఁడు కొలువునకుఁ గుదిరినయెడ, వాఁడు నీవుచెప్పినపని చేయవలయునుగాదా? ఇది యొక యాక్షేపణయా? ఏమిపో! ఇట్లును నీకు బుద్ధి ముసించునా! ఎత్తిన దంతయు సందేహాస్పదముగా నుండినఁ బని యెట్లు ముగియును?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! కోపపడకుఁడు. ఒకఁడొక యుద్యోగమునకుఁ గుదిరిన, నాతని కీయాపని చేయుట విధి యని యేర్పాటు గలదు. అట్లే పనికిఁ గుదిరినను, వారి కీయా పనులు చేయుట యను నేర్పాటు గలదు. "చెప్పిన పనులన్నియుఁ జేయుట" యనిన, అపయశఃపాపములకు లోనైన పనులు గూడఁ జేయవలె నని చెప్పినట్లు గదా యర్థ మగును. అట్లయినచో, నవి యెట్లు చేయుట? ఇ దొక్కటె దాసునికిఁ గలిగిన సందేహము.

నక్షత్రేశుఁడు—ఈతఁడు బ్రాహ్మణుఁడు. అందును బురోహితుఁడు. దేశమునకు సేమ మరయువాఁడు. అట్టియాతఁడు పాపభూయిష్ఠంబు లగు నింద్యకృత్యంబులఁ జేయింప సాహసించునే? యోచించి చూడుము.



కాలకంఠయ్య—ఆరంభములోనే యీలాటి సందేహములైతే, వీ రేలాగు మాయింట్లోఁ బనులు సేతురు? నా కక్కఱ లేదు పోయి రండి.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! యాగ్రహంబు వలదు. మన్నింపుఁడు. "చెప్పినవి యన్నియు" అనినందున దాసు కా సందియము గలిగినది. లేకున్న దాసుఁ డట్లడిగియుండునా?

కాలకంఠయ్య—ఏదీ! మీ రెట్లు చెప్పెదరో చెప్పండీ చూస్తాం.

హరిశ్చంద్రుఁడు—పెద్దలచేతను, శాస్త్రములచేతను నిషేధింపఁబడిన చెడ్డపనులు దప్పఁ దక్కిన యేపనులనైనను" అని వ్రాయుట మంచి దని దాసునితలంపు.

కాలకంఠయ్య—"చెడ్డపను" లనఁగా నా కర్థము బోధపడలేదే. ఇంచుక వివరించి చెప్పండీ.

హరిశ్చంద్రుఁడు—"చెడ్డపను" లనఁగా - చౌర్యము, హత్య, బొంకు, ఓర్వలేమి, ఱంకు, పరనింద మొదలగునవి. ఇవి యెల్ల మానవునిఁ బాపనిందలపాలు చేసి, కడపట నరకకూపంబునఁ బడఁద్రోయు నవి. కావున నట్టి నిషిద్ధకృత్యములఁ బోఁద్రోచి, తక్కిన యేపనుల నైనను జేయుట కొప్పుకొందుము.

కాలకంఠయ్య—ఈలాటి పాపాలను గూడ నెవరు చేయుమని చెప్పఁగలరు. అయ్యో! వలదు, వలదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! తా మట్టి నిషిద్ధకృత్యంబులఁ జేయుమందు రనెడి సందియము నా కించుకైన లేదు. "చెప్పినపను లన్నియు" ననుమాటనుబట్టి విధేయుని కా సందియము గలిగినది. వ్రాఁతయం దిట్టి సంశయము లున్నచోఁ గడపట నిట్టి యవస్థలు రావచ్చును. దానింబట్టియే దాసుఁ డింతతడవు తర్కించినది.

కాలకంఠయ్య—అవును వాస్తవమె. రాజవుగా నుండినవాఁడవు గదా. ఈలా గంటివెన్ని విషయములు చూచియుందువు! కాబట్టియే, నీకు సందేహము. ఇవన్ని మాకు తోస్తుందా. సరి సరి. ఇది తప్ప వే ఱేమిన్ని యాక్షేపము లేదు గదా.

హరిశ్చంద్రుఁడు—ఇంచుకైన నాక్షేపము లేదు, స్వామీ!

కాలకంఠయ్య—అట్లయితే, మీరు చెప్పినట్లే వ్రాసేదేగా! తాటాకు గంటము తెచ్చియిస్తునా? తమరు వ్రాయఁగలరా? వారు వ్రాయఁగలరా? మధ్యస్థుఁడుగానుండు నాతఁడు వ్రాసిన నుభయకక్షుల వారికిని మంచిది.

సత్యకీర్తి—ఆహా, అట్లే వ్రాసెద నండీ.

కాలకంఠయ్య—ఏమి నక్షత్రేశా, మీరు వ్రాయవచ్చునే?

నక్షత్రేశుఁడు—వలదు. వారినే వ్రాయనిండు. నేను సాక్షీచేవ్రాలు వేసెదను.

కాలకంఠయ్య—అయితే, అట్లే కానీవచ్చును?

(తాటాకును గంటమును కాలకంఠయ్య తెచ్చి సత్యకీర్తిచేత నిచ్చుచున్నాఁడు అతఁ డవి తీసికొని వ్రాయఁబూనుచున్నాఁడు.)

సత్యకీర్తి—స్వామీ! తాము చెప్పిన తెఱఁగుననే కదా వ్రాయవలయును?

కాలకంఠయ్య—అవునవును. అట్లే. వారన్న మాటకూడఁ జేర్చుకొం డేమీ! లేకున్న మఱొక్కటి వ్రాయవలసిన శ్రమము గలుగును.

దాస్యపత్రము.

ద్వాపరయుగము ౧౦౩౬౭౭ సంవత్సరములకు సరియైన క్రోధి సంవత్సరము మాఘ శుద్ధ దశమీ శుక్రవారము కాశీనగరమున వసించు బ్రాహ్మణకులము, శైవమతము, పురోహితము జీవనము, విశ్వేశ్వరుని కుమారుఁడు బ్రహ్మశ్రీ, కాలకంఠయ్యగారికి అయోధ్యానగరవాసి ప్రస్తుతము కాశీనివాసి, క్షత్రియకులము, శైవమతము, త్రిశంకుమహారాజుపుత్రుఁడగు హరిశ్చంద్రుఁడు వ్రాసియిచ్చిన దాస్యపత్రము ఏమనఁగా:—



నేను విశ్వామిత్రమునీంద్రునికిఁ జెల్లింపవలసిన యప్పు నూఱు లక్షలవరహాలకుఁగాను, నాకుఁ బత్నియుఁ, గన్యాకుబ్జదేశాధీశుఁడగు దయామతి యనంబరఁగు జ్యోతిష్మంతనృపాలునికుమార్తెయునైన చంద్రమతినిని, నాపుత్రుఁడు చిరంజీవి దేవదాసునిని పైకనఁబఱచిన బ్రాహ్మణోత్తమునకు దానిసీలం జేసి, ముందుచెప్పఁబడిన నూఱులక్షలవరహాలను నేఁడు రొక్కము గైకొంటిని. ఈదినము మొదలు నాపత్నియు, నాసుతుండును పైబ్రాహ్మణునికి దానిసీలై, పెద్దలచేతను, శాస్త్రములచేతను నిషేధింపఁబడిన చెడ్డ పనులు తప్పఁ దక్కినపనులు వారు చేయుచు రావలయు ననుటకు నే నొప్పుకొనుచున్నాఁడను. పైకనఁబఱచిన మొత్తము నేదినము నేను జెల్లించెదనో, యాదినమే నాయాలుబిడ్డలను స్వాధీనపఱచుకోఁ గలవాఁడను. ఆదినమువఱకు వీరు పైఁజెప్పిన చెడ్డపనులు తప్పఁ దక్కిన పనులు లాబ్రాహ్మణుఁడు చెప్పినవి మనఃపూర్వకముగాఁ జేయుచు, నాతఁ డిడినది భుజించుచు, నాతనియింట నుండఁగలవారలు. ఇట్లు నేను మనఃపూర్వకముగా సమ్మతించి వ్రాసియిచ్చిన దాస్యపత్రము.

సాక్షి నక్షత్రేశుఁడు. } ఇట్లు: అ - త్రి. హరిశ్చంద్రుఁడు.

ఈ దాస్యపత్రము వ్రాసినది సత్యకీర్తి.

(సత్యకీర్తి చదివి వినిపించుచున్నాఁడు. కాలకంఠయ్య నక్షత్రేశుఁడు నన్నిటికి సరే సరే యని తలయూఁచుచున్నారు.)

కాలకంఠయ్య—హరిశ్చంద్రా, సమ్మతమే కదా.

హరిశ్చంద్రుఁడు—సమ్మతమే స్వామీ.

కాలకంఠయ్య—నీ భార్య నడిగినావా? ఆమె నోరు గూడఁ దెఱవలేదే. (చంద్రమతిం జూచి) ఏమమ్మా, యీ విషయము నీకు సమ్మతమే కదా?

చంద్రమతి—సమ్మతమే స్వామీ!

కాలకంఠయ్య—సరి. సాక్షిచేవ్రాళ్లు చేసియయిందా. నక్షత్రేశా, చేవ్రాలు చేసివేసినావా?

నక్షత్రేశుఁడు—ఆహా! అప్పుడే చేసివేసితిని.

కాలకంఠయ్య—వారు చేవ్రాలు వేసియైనదా?

నక్షత్రేశుఁడు—వారే కదా వ్రాసినది. చేసివేసెదరు.

సత్యకీర్తి—స్వామీ, నేనును జేసివేసితిని.

కాలకంఠయ్య—సరి. వ్యవహారం పైసలైనది. ఇఁక సంచి విప్పవలసిందేకదా! ఇపుడు పైకము పుచ్చుకొనేవా రెవ్వరు?

నక్షత్రేశుఁడు—అదేమి! యెవ రనెదరు? నేనే.

కాలకంఠయ్య—అయ్యో! హరిశ్చంద్రా! పైకము నీవు తీసుకో. పిమ్మట యెవరికైనా యిచ్చుకో. న్యాయముగా నీవద్దనే పైక మియ్యవలసినది. ఇదిగోనండి. తీసికొండి. బద్రము, బద్రము.

హరిశ్చంద్రుఁడు—అట్లె, తీసికొంటిని స్వామీ.

కాలకంఠయ్య—నూఱులక్షలవరహా లున్నవా బాగా చూచుకో. నీవు పిచ్చివానిలాగుంటావు. లోకవ్యవహారము నీకింకను దెలియదు. సరిగా నెంచుకో.



హరిశ్చంద్రుఁడు—(నక్షత్రేశుం జూచి) అయ్యా, తా మీ పైకమును స్వీకరింపుఁడు.

నక్షత్రేశుఁడు—దీనికే కదా యింతకష్టము.

(పైకము తీసికొనుచున్నాఁడు.)

కాలకంఠయ్య—హరిశ్చంద్రా, మాయాహ్నికాలకు వేళ యతిక్రమించిపోతున్నది. ఇంట్లో మాకంటి యొంటరిగా నుంటుంది. ఇఁక వీరిని బిల్చుక పోవచ్చునుగదా.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! యిఁక నాయభిప్రాయ మెందుకు? వీరు తమయొక్క సొత్తులు. పిల్చుకొని పొండు. (చంద్రమతిం జూచి.) ఓ కాంతామణీ! నీవును, మనముద్దులబిడ్డఁడును నీ బ్రాహ్మణుని గృహంబున కేగి, యతఁ డానతిచ్చెడు పనులు నిండుమనంబుతోఁ జేసి, పెట్టినది గుడుచుచు నుండుఁడు. హా! సుందరీ, చింతిల్లకు. అంతయుఁ బరమేశ్వరుని యాజ్ఞయే.

చంద్రమతి—నాప్రాణనాథా, యేమి చేయుదు! తమసుందరముఖారవిందమును జూడక యెట్లుండఁగలను? పతిఁ బాసిన కులసతి బ్రదుకనేల? కటకటా! పరమేశ్వరా! యిది నీయనుగ్రహము? పూర్వజన్మమున నే దంపతుల నెడఁబాపితినో తెలిసినది కాదు! ప్రాణనాథా! ఇట్టి యిడుమలపా లగుటకు నే నేమి తప్పిదము చేసితిని? (చేతు లెత్తిపట్టుకొని) ఈ కరములను నే నెట్లు మఱతును.

మ. అకళంకంబగు ధర్మదండనము నేహస్తద్వయంబూని వా
రకప్రత్యర్థినికాయ మేకరములన్ రాజిల్లఁ గాక్షేయముల్
వికలత్వం బొకయింత లేక యడఁపన్ బెంపొంద నాబాహువు లే
నొకనాఁ డేమఱవన్ మహాత్మ యిఁక నెట్లుండున్ వియోగంబుచేన్.

శా. ఓ ప్రాణేశ్వర రోగభీరజలధీ రోధైర్యహేమాచలా,
యోప్రాలేయ మరీచిరూపవిభవా యోరాజచూడామణీ

యో ప్రత్యర్థిమదేభపాటనహరీ యో నిత్యసత్యవ్రతా
యో ప్రాభాతదినేశతేజ నిను నే యోజం బెడం బాయుదున్.

శా. దీపింపంగ నొనర్తు వెల్లపుడు నర్థిన్ మన్ననో మోదయుల్
కోపంబింతయుఁ జూప నోడుదువు పెక్కుల్ నేరముల్ గల్గినన్
నా పూర్వంబగు కర్మ మెట్టిదియొ సంతాపంబుపాలంబడన్
బాపెం దైవము నేటితోడ నను నీ పాదాంబుజద్వంద్వమున్.

(అని మూర్ఛ చెందుచున్నది.)

హరిశ్చంద్రుఁడు—(చంద్రమతిని లేవఁదీసి, కౌఁగిటఁ జేర్చి) ప్రాణేశ్వరీ, చింతింపకు. అన్నియు మనమంచికే యగును. మనగ్రహచార మిట్లుండ నెవ్వ రేమి చేయఁగలరు? వ్యసన మొందిన ఫలమేమి? దానివలనఁ గాఁబోవునది లేదు. ఎన్నిత్రిప్పటలు పడినైనను మునీంద్రుని ఋణము మాటదప్పక చెల్లించినది యొక్కటే యాపర మేశుని దయావిశేషము. ఇది మనసునఁ దలఁచికొని యాదుఃఖముం బాయుట మేలు. కన్నీరు దుడువుము. వ్యాకులపడకుము. ధైర్య మవలంబింపుము. మనపుత్రరత్న మిదిగో దిగులుపడి నిలిచి యున్నాఁడు చూడుము.

చంద్రమతి—ప్రాణనాథా, వివేకంబు లేని మృగపక్షులు సైతము తవ తమ సహచరులం బెడఁ బాయక, యనురాగవశంబున మునిఁగి యున్నవి. అక్కటా! అంతమాత్రము సుఖము మన కనుగ్రహింపమి భాగవంతుని యెడ నేమి పాప మొనరించితిమో! ఆవిధి యిట్లు మనలఁ గష్టపెట్టుటకంటె నొక్కతూరి మనప్రాణములను గొనిపోయిన బాగుండునే? కటకటా! ప్రాణనాథా, ఉత్తమకాంత లెంతసంపద దొఱఁగినను, ఎన్నియిడుమలం బడినను, తమమగలం బాయకుండిన, నా వంతలన్నియు మనంబులఁ దలఁపరు. ఎంతకలిమి యున్నను, దమ మగలను వారు విడనాడి యున్నచో, నట్టి వారి



జన్మ మేల? హా! దేశముఁ బాసి, సర్వసంపదలఁ గోల్పోయి, తల్లి దండ్రుల విడనాడి, యన్ని తెఱఁగుల దిక్కుచెడి, యెట్టి యిడుమలం బడినను, మనస్సున నించుకేనియు వంత దోఁచినది కాదు. ఇప్పు డన్ననో, నానయనచకోరచంద్రుఁడగు నాప్రియుం బెడఁబాపి నన్నిట్లు బాధపెట్టుప్రతికూలదైవము నేమని దూఱుదు. హా! హా!

ద్వి. పుడమిని బోలఁతియై ♦ పుట్టఁగా రాదు
పొడమిన లేవడిఁ ♦ బొందఁగా రాదు
దారిద్ర్య మొందినఁ ♦ దనజీవితేశుఁ
గ్రూరతఁ బెడఁబాసి ♦ కుందఁగా రాదు.

అనునట్లు స్త్రీజన్మమే వ్యర్థము వ్యర్థము. దానికి నేనే తార్కాణ. హా! దైవమా! యివ్విధంబుగాను మమ్ము శోధన చేయనగునా!

(హరిశ్చంద్రునిమీఁది కొఱఁగుచున్నది.)

హరిశ్చంద్రుఁడు—(చంద్రమతి నానుకొని) హృదయేశ్వరీ, బ్రాహ్మణోత్తముఁడు గాచియున్నాఁడు. ఇవ్విధంబుగా శోకించుట బాగు గాదు. ఎవ్వెవ్వేళలలో నేది యేది నడవవలయునో, అవ్వెవ్వేళలలో నది యది నడచును. దానిం దప్పింప నేరికిని సాధ్యము గాదు. జన్మాంతరసంచితప్రారబ్ధకర్మము ననుభవముచేతనే క్షీణింపఁజేయవలెను. “అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభం। నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి” అని స్మృతు లుద్ఘోషించుచున్నవి గదా. అటుగానిచో నది జన్మజన్మమునను వెంబడించుచుండును. కాఁబట్టియే ప్రాజ్ఞులు సైతము తమతమ సంచితకర్మముల నప్పుడప్పుడే యనుభవించి తొలఁతురు. జన్మాంతరమందుఁ జేసిన సత్కర్మ మన్నింటి నొసఁగును. దుష్కర్మ మన్నింటిని బోఁగొట్టును. పరమేశ్వరునియనుగ్రహ ముండిన మన మిరువురము మరలఁ

గలియకపోము. నీవు మనోవ్యాకులత్వముఁ బాసి, యీపాఱుని వెంబడి చని మనముద్దులకుమారుని మెలఁకువతోఁ జూచుకొనుచుండుము. పోయి రమ్ము. తామసించిన నాబ్రాహ్మణుని కాగ్రహము కలుగును.

కాలకంఠయ్య—హరిశ్చంద్రా, యిదేమి దురవస్థగా ముగిసినది. ఈలాటి మనిషి యేలాగు పనిచాయపోతుంది. ఈలాగే యేడుస్తూ వుంచుందా? మాకంటి గదా నన్ను విడిచి యెక్కడికైనా పోవలెనంటె సంతోషముతో గంతులు వేయుచు పోతుందే. మగవాళ్లను తోలిచివేసి పోవలెనంటె ఆడవాళ్లకు బహుసంతోషముగా కదా ఉంటుంది. ఈ యబ్బుర మేమో నాకేమి బాగుగా లేదు. నాసొమ్ము నాకు పాఱవేయి. మీ రేలాగైనా పీకులాడుచు పడియుండండీ. నా కక్కఱ లేదు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! యదంతయు నేమి లేదు. పరిణయమాదిగ నీ చిన్నది నన్నెడఁబాసి యుండినది కాదు. కాఁబట్టి, నన్ను విడిచి రా వగచుచున్నది. ఇదిగో పంపుచున్నాను. వీరిని దాము గరుణతోడ రక్షింపవలెను. తామే వీరికిఁ దల్లిదండ్రులు గురువు దైవమును. ఈ పసిబాలుని కేమియుఁ దెలియదు. వీనిమీఁద నించుక దయ యుంచవలయును. వీరిని బిలుచుకొని పొండు.

దేవదాసుఁడు—ఊఁ, ఊఁ. నే నమ్మతోఁ గూడఁ బోను. నే నిక్కడనే యుందును. నాకుఁ బండ్లు కోసియిండు. చాలును. అవి తిని మీ వెంబడే యుండెదను.

హరిశ్చంద్రుఁడు—(కన్నులనీరు గ్రమ్మ) ఓరీ నాయనా! నీ వమ్మతోఁ గూడ వెళ్లి యచ్చటనే యుండుము. నేను వెనుక వచ్చెదను. ఇదిగో



యీయన యున్నాఁడు. ఈయన నీకుఁ దినుబండములు కొనిపెట్టును. నాయనా పో. ఏడ్వకు.

దేవదాసుఁడు—నాకుఁ దినుబండము లక్కఱలేదు. పండ్లుండినఁ జాలును. అమ్మనుగూడ నిచ్చటనే యుంచుకొందము.

హరిశ్చంద్రుఁడు—హా! పరమేశ్వరా, ఈ పిల్లవాని కేమి చెప్పి యొప్పింతును! నాయనా, వలదు. అమ్మతోఁ గూడఁ బో.

చంద్రమతి—నా ముద్దులనాయనా, రారా. మనము పోదము.

హరిశ్చంద్రుఁడు—ద్విజుఁడు వేచియున్నాఁడు. పోయిరండు. దైవమంతయు మేలుగానే ముగించును.

చంద్రమతి—ఈ చరణారవిందదర్శనము దొరకుట నాకిఁక నెన్నటికో (అని పాదములమ్రోలఁ బడి లేచి, పిదపఁ గరములఁ బట్టి) ఈ కరకంజాతముల నిఁక నే నెన్నఁడు చూతును. (అని కరములను కన్నుల కొత్తికొని ముద్దువెట్టుకొనుచున్నది.) ప్రాణనాథా, వచ్చెదము. దీనిని మఱవకుము. పోయివచ్చెదము. ఓ సత్యకీర్తీ! పోయి వచ్చెదము. నీవె నామనోవల్లభునిఁ గాచియుండవలయును.

సత్యకీర్తి—పతివ్రతాతిలకమా, వీఁడు తమసేవకుఁడు. కాచుకొని యుండెదను. అప్పుడప్పుడు వచ్చి ప్రభువుగారి క్షేమవృత్తాంతంబులఁ దెలిపెదను. తల్లీ! వగవకుము. ఈ చిన్ని దొరను బదిలముగాఁ గాపాడుచుండుము.

చంద్రమతి— హా! దైవమా! ఇంకను నా చిన్నిదొర. బానిసీఁడయ్యె దొర యనుపేరా?

సత్యకీర్తి—కలిమిలేములు కావడికుండలు. కలిమి యనిన వెంబడే లేమియు నున్నది. లేమి యనిన వెంబడే కలిమియు నున్నది. ధని దరి

ద్రుఁడగు. దరిద్రుఁడు ధని యగు. కాల మొక్కతీరున నుండదు. వగవఁ బనిలేదు.

(హరిశ్చంద్రుఁడును సత్యకీర్తియుఁ గలవరపాటుతో నిలఁబడియున్నారు. చంద్రమతి కన్నీరు విడుచుచునే తిరిగి తిరిగి మనోనాయకునిఁ జూచి పలవించుచుఁ బోవుచున్నది. అది చూచి కాలకంఠయ్య)

కాలకంఠయ్య—హరిశ్చంద్రా! ఇదేమి వెళ్లేటప్పుడే అవశకునముగా వున్నది. కంటి చూస్తే తిట్టుతుంది. ఇదల్లా సరిపడదు. మీరును మాటిమాటికి వస్తామని చెప్తారు. అప్పుడును ఈలాగే వుండును. కంటికి సబబులు చెప్పుటకు నావల్లకాదు. మీరొక్కతూరైనా యింటితట్టు తలచూపఁగూడదు. ఇందులకు మీకు సమ్మతమా చెప్పండీ. ఆలాగు లేకపోతే దాస్యపత్రము రద్దుచెయ్యండీ. ఇదేమి రాత్రిపగలరవైగడియలు త్యాజ్యముగా వున్నది.

హరిశ్చంద్రుఁడు—అయ్యా, మే మొక్కర మచ్చటికి వచ్చునది లేదు. తాము పిలుచుకొనిపొండు. ఎంత యణఁచిపెట్టినను స్త్రీలకు మనం బోర్వదు. ఇది తమ రెఱుఁగనిది కాదే.

కాలకంఠయ్య—స్త్రీలస్వభావం నాకూ తెలుసును. ఇంట్లో మనకంటికి తెలుసునా? ఆపెను గదా తృప్తిచాయవలె? మనదేం వుంది, సంపాదించి తెచ్చివేసేవాళ్లం కాని వాళ్లు కాదా అధికారం చేసేవాళ్లు. మగవాళ్లు ఆడవాళ్లకు లొంగికదా వుండవలె. పోయివస్తాము.

(నడచుచున్నారు. దారిలో)

కాలకంఠయ్య—చంద్రమతి!

చంద్రమతి—స్వామీ!

కాలకంఠయ్య—మనయింటి సమీపానికి వస్తిమి. నా పెండ్లానికి ధనాశ యెక్కువ. ఎక్కువ సెలవుచేస్తే నాలిక పీక్కుంచుంది. ఇంతడబ్బు



పోసి మిమ్ములను కొన్నానంటే నామీఁద మండిపడుతుంది. జగడానికీడుస్తుంది. వంటచేయకుండా కూడా వుంచుంది. నీకు వక సంగతి చెప్తాను. ఆలాగే నీవున్ను సరే అంటే, అదిన్ని సరేయంటుంది. ఆలాగు చెప్పివేస్తావా?

చంద్రమతి—అయ్యా, అదేదో తెలిపినచోఁ జెప్పఁగూడినదైన నట్లే చెప్పెదను.

కాలకంఠయ్య—అదేమి యట్లు తలుస్తావు. చెప్పతగనిది కూడా నిన్ను చెప్పమంటానా? ఇదేం వెఱ్ఱితనంగా వున్నది!

చంద్రమతి—అయ్యా, విధేయురాలిని దేవరవారు మన్నింపుఁడు. తాము చెప్పఁబోవునది యిది యని యిది యెఱుఁగదు. ఎఱుఁగక మును పట్లే కానిమ్మని వాగ్దానముచేసి, పిదప నది చేయఁ దగినది కానిచో నేమి చేయుట. అప్పుడు ముందుచెప్పినది యాడితప్పుటగాఁ గదా పర్యవసించును. కావున నట్లంటినయ్యా!

కాలకంఠయ్య—ఆఁ, ఆఁ, ఆఁ. బాగా చెప్తితి. విశేషా లేమి లేవు. ఇంట్లో కంటి యడుగును. అప్పుడు నేను "అంతా ఒకవేయి బంగారు వరహాలిచ్చికొన్నాను" అని చెప్పెదను. సిన్నడిగితే, నీవున్ను అట్లే చెప్పవలసింది. ఇదే నేం జెప్పమన్నది.

చంద్రమతి—ఇందులకె యిది మును పట్లు చెప్పినది. స్వామీ దేవరవారు గొప్పమొత్తము వెట్టి మమ్ముఁ గొన్నది నే నెఱుఁగుదు. అది మఱుంగు పఱిచి వేయిబంగారువరహాలే యని చెప్పు టెట్లు? అది బొంకాడుట యగును. నిజము కల్లగాఁ జెప్పుట యెవరికిని మంచిది కాదండీ. ఇందులకై విధేయురాలిని మన్నింపవలెను. నన్నడిగినచో నున్నది లేదనుటకు నామనసు తెగింపదు, స్వామీ.

కాలకంఠయ్య—ఇదేం ఆరంభంలోనే హంసపాదిగా వున్నదే. ఇట్లా నిర్దాక్షిణ్యంగా వుంటే సంసారంలో యేలాగు జరుగుతుంది. ఒక సంసారం అంటె ఇట్లా అట్లా కూడా వుండవలె. ఏమి చేసేది. కొనిమైంది. ఇంక కులం మాట్లాడితే ఫల మేమి? రాండీ రాండీ.

(ఇల్లు చేరుదురు.)

## తృతీయరంగము.

---

## చతుర్థరంగము.

---

స్థలము : కాశీపట్టణంబునం దొక సత్రము.

కాలము : అపరాహ్ణము.

పాత్రములు : హరిశ్చంద్రుఁడు, సత్యకీర్తి, నక్షత్రేశుఁడు, వీరబాహువు.

---

హరిశ్చంద్రుఁడు—స్వామీ! చేరవలసిన పైకమంతయుఁ జేరినదిగదా!

నక్షత్రేశుఁడు—అవును; అవును; నాకుఁ జేరవలసిన తరగు తక్కఁ దక్కిన మునివరుని పైకము మాత్రము చేరినది.

హరిశ్చంద్రుఁడు—తమకుఁ జేరవలసిన తర గెక్కడిది స్వామీ! దయచేసి, తెలుపుఁడు.

నక్షత్రేశుఁడు—ఆఁ, ఆఁ. ఏమికాలము?

సీ. ఒక్కమాటకె కదా యొప్పుకొంటివి నీవు, పక్కణంబులు గ్రామపట్టనములు
భూషణాంబరయుతభోగంబులే కాక, హెచ్చుగా సవనార్థ మిత్తునన్న
మూల్లక్షలవరాలనుం గూడఁ జెల్లించి,తివి నీదువెంట నటవులు గిరులు
నాక నీతోఁగూడ నాపదంబులు వాఁచ, నాడాడఁ జుట్టిన యట్టిబాధ



తే. లెల్ల నీమది కెఱుకగు నివియు గురుల
కార్యమని యెంతువేని మీకష్టములను
గాంచి నగరంబు గాలించి కడకు నొక్క
సద్ద్విజుని వెంటఁ దెచ్చితి సాహసించి.

అట్లు తెచ్చి వానిచే ద్రవ్యమిప్పించినది కాక యప్పుడప్పు డొక సారికి రెండుసారులు "నన్ను మఱవవలదు నన్ను మఱవవలదు" అని యూని చెప్పితినికదా. ఆపలుకు లాలించినదియే కాక నాప్రయాసంబు సర్వము గాంచియుండియుఁ దరఁగెక్కడిది యని యడుగుచున్నావె! ఇది నీకు ధర్మమా?

తే. వినవె యప్పులిప్పించెడు జనుల కెల్ల
రెండు మూఁడును నాల్గు నూటింటి కిచ్చు
నదియ తర గనఁబడును సహజము దీని
లేదటంచును జెప్పినఁ బోదు నేను.

ఏమియు లేదు. ఈ చేతినుండి యాచేతికి బదులిప్పించినవారికిఁ గదా నూటికి రెండు మూఁడు తరగు లభించుచున్నది. లేదని చెప్పినఁ బోయెదను. అట్లు పోయి, నా తరగు తక్కఁ దక్కినది యొసఁగితివని చెప్పెదను.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! చింతిల్లకుఁడు. తాము చెప్పినది జ్ఞప్తికి వచ్చెను. తమకుఁ దరగుకై చేరవలసినది యెంతయో యనుగ్రహింపవలయు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా, మాకుఁ బేరాస లేదు. పేరాస పెను నష్టము. నీవో చేత డబ్బులేనివాఁడవు. ఎందైన బానిసీఁడవైయే యీవలెను. గ్రామములోనివారు నూటి కెనిమిది పది తీసికొనెదరు. ఇట్టి ప్రయాసమున్నచో నూటికిఁ బదునైదును బుచ్చుకొందురు. మూఁ కంత యక్కఱ లేదు. నూటి కాఱుంబావువంతున నైనను

సరిపెట్టినచో నొక్కవిధముగా నొప్పుకొనవచ్చును. పిమ్మట నీ యిష్టము. ఇదంతయు నిచ్చువారి యభిమతంబు ననుసరించినది.

హరిశ్చంద్రుఁడు—స్వామీ, తా మిప్పు డానతిచ్చినచొప్పుననే దాసుఁ డేరికినైనఁ గొల్వునకుఁ గుదిరియైనఁ దమకుఁ జేరవలసిన ధనం బొసఁగ వలయును. తాము మునుపటి యట్లు చని మఱియొకనిఁ దోడ్కొని వచ్చి నన్నాతని కొసఁగి, తాము మున్నొనర్చిన యుపకారమునకును బ్రకృతము పడుప్రయాసమునకును జేరవలసిన పైకంబుఁ గైకొనఁ గోరువాఁడు. ఇదియే దాసునిమనవి.

తే. మున్నొనర్చిన యుపకారమునకుఁ బ్రకృత
మునఁబడు ప్రయాసమునకునై మొత్తముగను
జేరవలసిన పైకంబు శీఘ్రముగను
దాను నాతనికి విలిచి తీసికొనుఁడు.

నక్షత్రేశుఁడు—ఆ! ఆఁ! తుద కట్టులా ముగించితివి. అయ్యో పాపము! నీవుమాత్ర మేమి సేతువు. నాధనమునకును నేనే ప్రయత్నపడవలెను. కానిమ్ము అట్టులే యొనర్చెద. ఎవ్వరైనను దోషము లేదు గదా!

హరిశ్చంద్రుఁడు—ద్రవ్య మొసఁగువారెవరైనను దోషము లేదు. అనుగ్రహించి తాము తోడ్కొనిరండు.

నక్షత్రేశుఁడు—సరి అట్లే చేసెదను.

(నక్షత్రేశుఁడు వెళ్లి వీరబాహువును సంధించుచున్నాఁడు.)

వీరబాహువు—ఓహో! నక్షత్రేశయ్యగారూ! రండు, రండు. అదృష్టవశంబున నెదురుగానే వచ్చితిరి. మునివర్యులు మిమ్ముఁ గలిసికొమ్మని యానతిచ్చిరి. ఎక్కడ వీరిని సంధింపవచ్చునని తలఁచుచునే వచ్చుచున్నాను. ఎదుటనే కనఁబడితిరి. సంతోషము. ఏమి సంగతి?



మహాకార్యము లన్నియు ముగింపునకు వచ్చినట్లున్నది. ఆలుబిడ్డలను వేఱుపఱచితిరి. ఇఁక నేమి యాటంకము జయంబు గలుగుటకు?

నక్షత్రేశుఁడు—ఆలు వాసిన నేమి? బిడ్డఁ డెడఁబాసిన నేమి? మనోధైర్యంబును సత్యసంధతయు వాని విడిచిపోవునవిగాఁ దోఁపవు. జయ మెచ్చటనుండి వచ్చును? మునివరుం డెద్దియో, వ్యర్థాభిప్రాయముఁ గొనియున్నాఁడు. ఆయన కిచ్చటఁ గలిగెడి యిడుమలలోన నించుకైనఁ దెలియ నవకాశము లేదు. మీరు నప్పుడప్పుడు వచ్చి పోవుచున్నారు. నాపడుపాట్లు మీకెట్లు తెలియును? తెలియదు, తెలియదు. రేయుంబవలు నేను వానితోడం బెనఁగులాడుచు నెవ్విధంబులగు తంత్రము లొనర్చినను, నేమియు ఫలంబు గానిపింపదుగదా! ఏమి చేయనగును? నీవు వచ్చియున్నాఁడవు గదా. నీవైనను వానిని సజ్జనస్వభావమునుండి యించుక పొరలునట్లు చేయుము చూతము.

వీరబాహువు—నక్షత్రేశయ్యగారూ, ఏమట్లు సెలవిచ్చెదరు? తమ కష్టమునే తాము గొప్పగాఁ దలఁచెదరు. లోకంబున నొక్కొక్కఁడును దనకష్టమునే యెక్కుడుగా నెంచును. అది యుండనిండు. మన మునివరుం డనుభవించుమనోవైకల్య మొక్కనికి నుండదు. మన మెంత ప్రయత్నించినను, తుదను గలిగెడి మానమో, లేక యవమానమో యాతనిదే గదా! మనకు శ్రమ మొక్కటి మాత్రమే. వారి కపకీర్తియుఁ బాపంబును గదా పర్యవసానమగును. ఇది మాత్రమా? దీనివలనఁ గలిగెడి యవమానంబునకు మేర గలదా? ఇవి యన్నియుఁ బరికించిన నాతఁడు పడు శ్రమమును, మనోవిచారమును, యోచనయు నింతమాత్రమని చెప్ప నేరి కగును? ఒక్కొక్కతడవను బలువిధంబులఁ దలపోసి, యెదో యొకటి మనసునకుఁ దెచ్చు

కొని, మాకది బోధించి పంపుచున్నారు. మేము మరలిపోయి, కోరికి కొనసాగలేదని విన్నవించునపుడు వారు పడునవస్థ మహాదురవస్థగానున్నది. మాకో, వారానతిచ్చినట్లు చేసి, వారికిఁ దృప్తి గలుగు విధంబున నడచుట పెనుగష్టముగాఁ దోఁచెడి. ఇప్పుడొక దృష్టాంతము జరిగియున్నది.

నక్షత్రేశుఁడు—అట్టి దేదో! ఇంచుక యనుగ్రహించి చెప్పుము. విందము.

వీరబాహువు—అట్లడుగుఁడు. చెప్పెదను. మునివర్యుఁడు నావశంబున నపారధనం బొసఁగి, దానిచే నీ కాశీపురంబునందలి యాగశాలలను బితృవనంబులుగ మార్చివేయ నా కానతి యొసఁగిరి. ఎక్కువ దేహప్రయాసమున కోర్చి యాకార్యం బెల్ల యొనరించి కృతార్థుఁ డనైతిని. నాతోడ వల్లభునిఁ దోడ్కొని వచ్చితిని. అంతియకాక యొక కన్యను నాపత్నిఁగాఁ దోడ్కొనివచ్చియున్నాఁడ. సన్న్యాసినైనను నీ పీడ తొలఁగలేదుగా. కాశికిఁ బోయినను గర్మము తొలఁగదని పెద్ద లందురు! దానికి నేన తార్కాణము. ఏమి చేయుదు! గురునాజ్ఞ నావంతయైనను మీఱి నడువరాదు.

నక్షత్రేశుఁడు—ఓహో, యింతదూరము పనులు జరిగియున్నవా? సరిసరి యది యుండనిమ్ము. ఈ పట్టణమున శ్మశానము లేదా? నీ వెట్లు లీ నగరంబున శ్మశానము నిర్మింపఁగలవు? అట్లు చేయుటచే మీ యుద్దేశమేమి? ఏమియుఁ దెలియలేదే!

వీరబాహువు—నక్షత్రేశయ్యగారూ! మనపనులు రానురాను గడా చక్కఁబడుచున్నవి. ఇంతపర్యంతము మన మొనరించిన ప్రయత్నము లన్నిటను నిది మిగుల ముఖ్యమై యున్నది. దీని ప్రయోజనము ముందుఁ దెలియనగును. ఇప్పుడు శ్మశానమేర్పడిన తెఱఁ గెఱిఁగించెద నాలకింపుఁడు. మునీంద్రునికడ ధనంబు గైకొని, యీ నగ



రంబు చేరితిని. ఇక్కడనే మనకార్యము లన్నింటికి సహాయుఁడుగా నొక ప్రతినిధి యున్నాఁడుగదా. ఆతనిఁగాంచి యతనితో నా యభిప్రాయమును మునివరునియాజ్ఞానుసారంబుగ వెలిపఱచితిని. ఆయన యామీఁదఁ గాశీరాజున కెఱుకపఱచి యొక్క వల్లకాటిని నిర్మింప ననుజ్ఞ దీసి యిచ్చిరి.

నక్షత్రేశుఁడు—అది సరే. తొంటి శ్మశాన మేమాయెను? ఒకటి యుండఁగా, మఱియొక్కటి నిర్మింప ననుమతి యొసఁగుటకుఁ గారణ మేమి?

వీరబాహువు—ఓహో, మీ కీయూరి వాడుక తెలియనట్లున్నది. సరే. ఈ యూర శ్మశాన మనునదియే లేదు.

నక్షత్రేశుఁడు—ఇదేమి! శ్మశానములేని యొక నగరంబును గలదా! ఈ యూర నొక్కరు చచ్చుట లేదా?

వీరబాహువు—ఆహా! హాహా! లెస్సగాఁ బలికితిరి. బహు సూక్ష్మముగా సంగతి నెఱిఁగితిరే! అట్లుకాదు. ఈ నగరవాసులు మృతినొందిరేని, వారికళేబరంబులను గంగలోఁ బాఱవైచుట వాడుక. దాన నాజీవాత్మ సద్గతిఁ బొందఁగలదని మనవారినమ్మకము. అనేకులు తమమాతాపితలు మున్నగువారు మృతినొందిన పిమ్మట వారి యస్థుల గంగలో వైచి పోవుదురే! అది తమ రెఱుఁగరా! కావున నిచ్చటఁ బితృభూమియె లేదు.

నక్షత్రేశుఁడు—అట్లయినచో, మీ రెట్లు రాజుననుమతిఁ బొందితిరి.

వీరబాహువు—నే నీశ్మశానము నిర్మింప తేనికిఁ బలుకారణములఁ జూపుచు నీ నగరంబునందలి యనేకులు మృతులయిన తమదాయాదులకళేబరంబుల గంగానదియందుఁ బాఱవైవక సమాధియం దుంపఁ గోరుచుందురనియు, మఱియు బ్రహ్మజ్ఞానులు, మునులు మున్నగువారి

కళేబరంబులను సమాధిచేయుటయే శ్రేష్ఠతమంబగు నని[illegible] దెలిపితిని. ఆ కాశీపురనరపాలుఁ డుప్పొంగి, రాజ్యంబున నడచు చట్టములప్రకారము దండ్యులను దండించువారిలో ముఖ్యాధికారమును జెల్లించుటకును నొడఁబడితిని. కావున నేను వల్లకాటికాపరివేషము దాల్చి, వీరబాహు వను పేరఁ బరఁగ నెంచెదను. మునీంద్రుని యానతియు నిదె. ఇఁకఁ దమ రెవ్వరిని వెదకికొనుచు వచ్చితిరి? చెప్పుఁడు.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రుఁడు తన యాలుబిడ్డల నమ్మి మునీంద్రునికిఁ జేరవలసిన ద్రవ్యము పూర్తిగాఁ జెల్లించెను. పిదపఁ గొంచెము యోచించి, నాకును దరఁ గిప్పించవలెనని యడిగితిని. ఆతఁడు దానికిని సమ్మతించి, తన్నెవరికైనను లోఁబఱిచి, నాకుఁ జేరవలసిన తరగు నన్నుఁ గైకొమ్మని చెప్పెను. మనవారిలో నెవ్వరైన నెదురుపడుదురో యని తలఁచుచు నిటకే తెంచితి. మిమ్ముఁ గాంచితి. ఇంకను తమయేర్పాటుచే నంతరంగమున సంతసించితి. ఇఁక నీవు కాటివెట్టివిగా వచ్చుటే మంచిది. అతఁ డధముని కూడిగము చేయ వెనుదీసి, యొక్కవేళ తరఁగియ్యవలసినది లేదని చెప్పినను జెప్పును. మఱియు వాఁడు దానికిని దెగించిన నతనిని క్షణమైన నెడఁబాయని సత్యకీర్తిని నతనికడనుండి యెడఁబాపవలయును. సత్యకీర్తియుఁ దొలఁగి యా హరిశ్చంద్రుఁ డొంటరిగాఁ జిక్కిన, నాతని మనఃస్థైర్యము చలించును. దాని కావంతయేని సందియంబు లేదు. ఇదొక్కటె సరియైనదారి. రండు, రండు. పోదము.

వీరబాహువు—ఆహా! దాని కేమి? ఇఁక నిన్ని కార్యములు జరిగియుండ నీ హరిశ్చంద్రునిమనఃస్థైర్యము మాఱకయుండునా? ఉండదు. ఉండదు. అట్లును ధైర్యము వీడఁడేని, నే నతనిని వెట్టిపనికిఁ బెట్టి



పలువగలవ్యసనంబుఁ గలిగించి, యతనిని సత్యసంధత్వమునుండి తప్పునట్లు చేసెదను. మనయనుఁగుఁ జెలికాఁడు వల్లభుఁడు తోడుగా వచ్చియున్నాఁడే. ఆతని సామర్థ్యము తమరు చక్కఁగా నెఱుఁగుదురు గదా? ఆతఁడే యా హరిశ్చంద్రునిఁ బలుదుర్నీతులపాలగునట్లొక్క నిమిషములోపలఁ జేయఁగలడు. ఇఁక సందేహపడవలదు.

నక్షత్రేశుఁడు—అయిన సంతోషమే. తామిచ్చటనే యుండుఁడు. తమరు నా వెంబడి వచ్చుట తగదు. మఱి, దాసక్రయికు లెవ్వరును లేరని చెప్పితినేని, యొకవేళ వ్యసనమునఁ జిక్కి ముందుఁ జెప్పినది లేదని మార్చినను మార్చనగును. ఒక్కసమయము సత్యకీర్తి యనువాఁడు దాసక్రయికుల వెదకుచు నిచ్చటికే రావచ్చును. అప్పుడతనితో నుచితప్రకారంబున సంభాషించి కార్యము చక్కఁబఱచుకొనుము. అట్లుకాక నీ విప్పుడు నా వెంబడి వచ్చితేని, ఆ హరిశ్చంద్రుఁడు మనయందలి మర్మమును గనిపెట్టుట కవకాశము గలుగును. కావున నతఁడు మఱింత మనోనిశ్చయంబు గలవాఁడగును. నేను ముందు వెళ్లెదను.

వీరబాహువు—ఔ నౌను, తమరు వాక్రుచ్చునది వాస్తవమే. అట్లె యొనరింపుఁడు. కొనువారు లేరనిపక్షమున నొకవేళ నతని బుద్ధి మాఱినను మాఱవచ్చును. లేమి సకలదుర్గుణములకుఁ బుట్టినిల్లుగాదా? పొండు, పొండు.

(నక్షత్రేశుఁడు మాత్రమే వచ్చి హరిశ్చంద్రుని సంధించుచున్నాఁడు.)

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా! ఏ మందును? నీ హతవిధి యీలాగున్నది? ఈనగరమంతయుఁ జుట్టితిని. దాసులను గోరువా రొక్కరైనఁ గంటఁబడినవారు గారు. ఇది నీ దుర్విధిగాదు. నాయదియే. దుర్విధి యేమియు నీయదు. ఏమిచేయనగును? నా పాపెఱిఁగి, నీవె

యేరనైన వెదకికొని, సొమ్ముతీసి యిచ్చినఁ గైకొనెదను. లేదనిన, వచ్చినదారిఁ బట్టి పోయెదను. అయ్యో పాపము! నీవుమాత్ర మేమి చేయవచ్చును.

హరిశ్చంద్రుఁడు—స్వామీ? ఆయాసపడకుఁడు. దాసుఁడు కొనువా రెవరుగా నున్నను వారికి లోఁబడి తమకుఁ జేరవలసిన ధనంబు చెల్లింప నున్నాఁడు. ఇంచుక నీవు మన్నింపవలయును.

నక్షత్రేశుఁడు—కొనువారిని నాచే నైనంత దూరము వెదకి చూచితిని. ఇఁక మీరే ప్రయత్నపడుఁడు.

హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తీ! ఏమి చేయుదము? ఇఁక మనమే వెదకికొన వలయును. ఈ నగరము మనకుఁ గడుఁగ్రొత్తది. ఎవరికడకుఁ బోయి యడుగవచ్చును. ఇంచుక నే పట్లు తిరిగి వచ్చితిమేని, ఏదైననొక మార్గమేర్పడదా? పోదము.

సత్యకీర్తి—అట్లే చేయుదము. ఏ వైపునకుఁ బోవుట?

హరిశ్చంద్రుఁడు—మొదట భాగ్యవంతు లుండు గొప్ప వీథికిఁ బోవుదము.

సత్యకీర్తి—ఔ నౌను. అది మంచిది ప్రభూ! ఆ వీథి యేవైపున నున్నదో యెఱుఁగము. అదిగో ఒకఁడు తలారిమాడ్కిఁ గన్పట్టుచున్నాఁడు. వాని నడిగి తెలిసికొందము.

(వీరబాహువు సమీపించుచున్నాఁడు.)

సత్యకీర్తి—(వీరబాహువుం గూర్చి) అయ్యా! మీ రెవరు?

వీరబాహువు—నేనా! ఏంట్రయ్యా! నా దీవూరేయ్యో, నన్నడుగేరా! మీ దేవూరు?

సత్యకీర్తి—మేము పొరుగూరివారము. ఈ యూరిలో నెక్కువ డబ్బు గలవా రుండునది యే వీథి?



వీరబాహువు— పొర్గూరా; పొర్గూరంటే తెల్లేదే, మీ రేంటి కడిగే రయ్యా? బాఁగా శెప్పాలె. శెప్పండి. మేం యెన్క సెప్పేము.

సత్యకీర్తి—మే మయోధ్యాపురమున నుండువారము. ఇక్కడి కొక్క పనిగా వచ్చితిమి. అందులకే ప్రభువులయిండ్ల వెదకెదము. కాఁబట్టి మార్గముఁ జూపుఁడు. మే మేగెదము.

వీరబాహువు—ఆలా సెప్పండేమి. దొడ్డదొడ్డ పబువు లల్లా వుండారు. సరేకాని మీ రెంటి కడిగేరయ్యా? నేను అడ్గుతానని కోపం శాయ కండి. నా కీవూరిసంగతి శానాశానా తెల్సునయ్యా. అందుకే అడగడం.

సత్యకీర్తి—ఆలాగా! మంచిదే, మే మొకరి కప్పుపడియున్నాము. దాని నీ సాయంకాలములోపలఁ దీర్చివేయ వలెను. అందులకై యెవరి కైన సేవకులమై యాయప్పు తీర్చి వేయవలయునని మాకోరిక. కనుక వేగిరపడెదము.

వీరబాహువు—అ ప్పంటే యేం. అది యీ యాల లేకుంటే రేపియ్య గూడదా?

సత్యకీర్తి—కూడదు కూడదు. చెప్పినమాట తప్పక నేఁటికే యిచ్చి వేయవలయును.

వీరబాహువు—అ దుణ్ణీండి. మీరు యేంపని శేస్తారు?

హరిశ్చంద్రుఁడు—మమ్ము దాసులనుగఁ జేసికొన్నవారి యిష్టము చొప్పున నడఁగి మడఁగి నడచుకోఁ గలవారము. వారు న్యాయ పథంబుఁ దప్పక చెప్పెడు పనుల నన్నిటిని నిరభ్యంతరముగాఁ జేయఁ గలవారము. మా కవసరముగా నున్నది. కొంచెము వివరముగా దారి చెప్పుము.

వీరబాహువు—మీ రేం యిట్లు త్వరపడుతారే. మిమ్మల్ని చూస్తే బాగా బతికినోళ్లుగా వుండారు. మీ రేంపని చేయఁ బోతారు? అయ్యో పాపము!

హరిశ్చంద్రుఁడు—మా కప్పు తీఱవలసిన దే మొదటిపని. అదియు నేఁడు ప్రొద్దువాలుటకు ముందే తీర్చివేయవలయును.

వీరబాహువు—ఎంతప్పియ్యాలె?

హరిశ్చంద్రుఁడు—పదివేల మొహరీలు.

వీరబాహువు—ఓరబ్బో! ఎంత మొత్తం రా! ప - ది - వే - లు - అంటే (రెండుచేతులవ్రేళ్లను జూచి) ఇదిపైయెదు. ఇదిపైయెదు. ఇంత వేల మోహరీలా? ఆఁ ఆఁ. యెంత మొత్తం? అదుణ్నిండి. మీ రిద్దరున్ను పని చేస్తారు గదా?

హరిశ్చంద్రుఁడు—లేదు, లేదు. నే నొక్కరుఁడనే దాస్యమునకు లోపడువాఁడను. అప్పుపడియుండువాఁడను నే నొక్కరుఁడనే. ఆయన నాస్నేహితుఁడు. నాతో నెల్లప్పు డుండును.

వీరబాహువు—ఓ రబ్బో! మొత్తం చూస్తే ప దేలంటారు. పని కే శేది వక్కఁడంటారు. ఓరయ్యో కాన్కుండారా యీడాన్కి.

హరిశ్చంద్రుఁడు—ఏమి చేయ నగును? ఎంత కష్టపడినైనను, నేఁడు దీపము పెట్టునంతలోపల ధనము చెల్లించివేయవలెను. కాలయాపన మగుచున్నది. నాకు దారి చూపుము. మేము పోయెదము.

వీరబాహువు—వూర్కే తొందరేమయ్యా. మీరు బేపనోళ్లు, గాచోళ్లు, చెట్లు యీళ్లయిళ్లల్లో మట్కు పనిసేస్తాగో.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! ఏల యిట్లడిగెదవు? ఎవ్వరైన నేమి? నన్ను ఋణవిముక్తుం జేయువాఁ డెవ్వఁడైనను చాకిరి కొప్పుకొనువాఁడను.



వీరబాహువు—కాపోళ్లయిళ్లల్లో పనోళ్లు కొల్లకొల్లగా వుండుంటారు. నాను కూడా తోడుకో మనిసి కావలసి యిట్లా పోతావుండా.

హరిశ్చంద్రుఁడు—అయ్యా, మీ రెవ్వరు? మీ కేల పనివాఁడు కావలెను?

వీరబాహువు—నానీ వూరి తలారోణ్ని. మసానం కాడ కావలకుండేది నాపని. ఇప్పుడు చానా చానా పీనగలొచ్చి పడతావుండాయి. నాకూడా యింకో పిల్లో డుండాడు. మా యిద్దర్కి నరాలు తెగిపోతా వుండాయి. ఓ రైనా మనిసి సిక్కతాడే మో అని పోతావుండాను. మీలాటోళ్లు మా కాడ పని సేస్తారా?

హరిశ్చంద్రుఁడు—నాకు ఋణబాధ తీరవలసినది యొక్కటే ముఖ్యము. నామాట దక్కించుకోవలెను. దానినిబట్టే యప్పు తీర్చువా రెవరైనను, వారికి నేను దాసుఁడనై, వారు సెప్పెడిపనులు సేయుట కభ్యంతర మింతయు లేదయ్యా.

వీరబాహువు—ఏమాత్తరం అప్పేటి? యింకోపాలి సెప్పవయ్యా కోపం నేసుకోకయ్యా. నానచ్చరం తెలవని గుడ్డోణ్ణి. కొంచెం సెప్తాను.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! నేను జెల్లింపవలసిన యప్పు పదివేల నిష్కములు. అవి నేఁటిసాయంకాలములోపలఁ జెల్లింపవలయును.

వీరబాహువు—పదేలూ! (వ్రేళ్లను జూపి) ఓటి; రఁడు, మూఁడు, నాల్గు, ఐదు, ఆరు, ఆరున్నొక్కటి, యెనిమిది, తొమ్మిది, పది. అరే నాయబ్బా! ఇంత! ఆఁ! ఎన్ని. ఇన్నేలా? ఎన్ని యేలయినా పన్లు ముగించాల. ఏటయ్యా; కొంచెం యెల తగ్గించరాట్టయ్యా!

హరిశ్చంద్రుఁడు—వెల తగ్గింప వీలు లేదు. నేను జెల్లింపవలసిన మొత్త మంతియు. ఎంతమాత్రమును దగ్గింప వలనుపడదు.

వీరబాహువు—అయితే పోనీగాని, అప్పియ్యాల్చిందోరికి? ఆ రేడుండారు?

హరిశ్చంద్రుఁడు—అదిగో! అకనఁబడుచున్న సత్రములోననే యున్నారు. అచ్చటకుఁ బోయిన, వారినిఁ జూడవచ్చును.

వీరబాహువు—ఆఁ - ఆఁ. దగ్గిర్నే ఉండారే. అయితే నాను పైకం యిచ్చేస్తే నాకేటి దారి. పైకం అంతా తీసుకోని ఆ యెనక పోరా యెదవగాడిదా అంటే ఆ మీాద నానేటి సేయునూ! యివరం యిప్పుడే గట్టిసేసుకోవాల. నాను బీదోణ్ణి బాబయ్యో!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అట్లేమియు వంచింపము. అన్నమాట దప్పము. దాని కీడుగా దాస్యపత్త్రము వ్రాసియిచ్చెదము. అందు లకై మీా రెంతమాత్రమును భయంపడ నక్కఱలేదు.

వీరబాహువు—అదేటో నాకు తెల్దు. నాను సదువుకోనేదు. మాం బానిసోళ్లుగా పోతే మా అయ్యోర్లకి మాం రాసిస్తుండామే. ఆలా రాసియ్యాల.

హరిశ్చంద్రుఁడు—అట్లే వ్రాసియిచ్చెదమయ్యా. దానినే దాస్యపత్త్రి మందురు. బానిసచీటి యనియుఁ జెప్పుదురు.

వీరబాహువు—ఆఁ. అదే బానిసోళ్లసీటి. అట్లా సెప్పండయ్యా. మీా రేదేదో కలుపుతారే! బానిసోళ్లసీటి రాసిస్తారా? నేదా?

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే వ్రాసి యిచ్చెదము.

వీరబాహువు—యీా అయ్యోరు, పైకం సెల్లించుకుంటాడుగందా, అయ్యోరు సాచ్చిరాలు సేస్తాడా?

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే చేయుదురు. అందులకెంతమాత్రమును సందియము లేదు.

వీరబాహువు—అట్టయితే పోదాం పదండి.

(పోయి సత్రము చేరుచున్నారు.)



హరిశ్చంద్రుఁడు—(నక్షత్రేశుంజూచి) స్వామీా, నన్ను దాసునిఁగాఁ గొని, తమకుఁ బైకము చెల్లింపఁగల యొకరినిఁ బిలుచుకొని వచ్చి నాఁడను. దయచేసి దానికై దాస్యపత్త్రిము దగ్గఱ నుండి వ్రాయించి యిచ్చి తమకుఁ జేరవలసినధనమును బుచ్చుకొనుఁడు.

నక్షత్రేశుఁడు—ఆహా! అట్లైన సరియే మిగుల సంతోషము. ఇదిగో వచ్చెదను. హరిశ్చంద్రా! వీరా? ధనమును జెల్లించువారు.

హరిశ్చంద్రుఁడు—ఔను. స్వామీా! ఈపుణ్యాత్ములే.

నక్షత్రేశుఁడు—అయ్యా! మీారెవరు?

వీరబాహువు—నా నీవూరే.

నక్షత్రేశుఁడు—ఈ యూరనుట సరియే, మీాయుద్యోగ మేమి? ఎక్కడ వసించెదరు?

వీరబాహువు—అదంతా యాంటి కడిగేరు? అదంతా అప్పుడే సెప్పేశి నాను. అంతా వప్పుకొనే నన్నుమీా కాడికి పిలుసుకొచ్చినాడు.

నక్షత్రేశుఁడు—అది సరియే. హరిశ్చంద్ర! వీ రెవరు? ఏలాగు ముగించితివి?

హరిశ్చంద్రుఁడు—స్వామీా! వీ రీయూరిలోని శ్మశానవాటికకుఁ గావలి గాచు వారఁట. వీరి కొక దాసుఁడు గావలయునఁట. అందులకేను లోపడుదు నని యొప్పుకొన్నాఁడను. వారును దమకుఁ జేరవలసిన పదివేలు నిష్కంబులును జెల్లించున ట్లొడఁబడిరి.

నక్షత్రేశుఁడు—శ్మశానమును గాచువా రనినఁ దలవరివారే కదా. అక్కటా! పరమేశ్వరా! ఇట్టి పలుకులును జెవులఁ బడవచ్చునా? మహీపతి యేడ! తలవరి యేడ? ఏమి యన్యాయము! ఏమి బ్రతుకు! నామనస్సు నొప్పించుటకే యిట్లాచరింపఁ బూనితివో. అయ్యో! నాకు నిష్కంబులు వలదు, నీతులు వలదు. ఆహా! ఇ దేమి అన్యా

యము! వలదు. వలదు. నేను బోయెదను. ఒకవేళ నెవరేని యడిగినచో «పాప మా హరిశ్చంద్రుఁడు నేఁబడినపాట్లను గాంచి పదివేలునిష్కములిచ్చెద నని వాగ్దత్తము చేసెను. కాని ఇయ్యఁజాలక లేవన్నాఁడు. పాప మాతఁడు మాత్ర మేమి చేయఁగలఁడు» అని చెప్పెదను. (వీరబాహువుం జూచి) అయ్యా! మీరు పొండు. ఆయన ఋణ మచ్చుకోవలసిన యవసరము లేదు. అట్లున్నను, మీకు దాసుఁడుగామాత్రము గాఁజాలఁడు.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఇట్లు దాసుని నపకీర్తిపాలు సేయుట దమకుఁ బాడి గాదు. చెప్పినదానిని లే దనను. పలికి లేదనుటకంటెఁ బాతక మేది! ఆడి తప్పిన వానికి స్వర్గము కరము దూరస్థము. నేనెవరికి దాసుఁడనైన నేమి? తమకుఁ జేరవలసినపైకము తాము పుచ్చుకొని పొండు. తమకు దాసునికై వగచుటకంటె నపయశఃపాప సముద్రమునుండి వీని నుద్ధరించుటయే గొప్పయనుకంప. నా మనవి చిత్తగించి ధనము పుచ్చుకొనుట కంగీకరింపుఁడు.

వీరబాహువు—యీ అయ్యో రేటంటాడు. నా కాడ పల్లు సెయ్యొద్దంటాడా? యేటికి. యీ అయ్యో రప్పులోడే కదా. అప్పులోడప్పు రాఁబట్టుకోవాలగాని, యేంటి కయ్యా యీ పెత్తణం యీనకు. యీన బాపనోడా యేటి?

నక్షత్రేశుఁడు—ఊరక వట్టిమాటలతో నేమిప్రయోజనము? దూరముగాఁ దొలఁగిపొమ్ము.

వీరబాహువు—నా నెందుకు పోతానూ? నువ్వే పోవయ్యా బాపనయ్యా! అదాలా వుణ్ణీగాని; నా కాడ పన్లు సెయ్యొద్దొంటావేందేటి? మాం యెట్టిసేసీ ఓళ్లమనా? యెట్టోళ్లంటే నీకంత యేలాకోలంగా వున్నాదంటయ్యా! ఇగనోటి. జాతి జాతంటావే బాపనయ్యా! నీకేం పుట్టగతో నీ జా తొచ్చిందటయ్యా. పోసిగానికి నీకేం



మూ కన్న సుదట నూ ఉక్కళ్లున్నాయిటయ్యా! ఏమీ లేదే. మా కున్న ట్టే నీకూ కాళ్లున్నాయి. మా కున్న ట్టే నీకూ సేతు లున్నాయి. అన్నీ మాకూ నీకూ సమానమేగందా! మా వొంట్లో రగతం తెల్లగుంటాదా? నీ వొంట్లో రగతం యెఱ్ఱగుంటాదా? యేమీ నేదు గందా ఇక మాకూ నీకూ బేద వేఁటీ. మాం యెట్టి సేసుకునే వోళ్లం నువ్వు బాపనోడివి. ఇంతేగందటయ్యా మాకూ నీకూ బేదం. నా నొక్కమా టడుగతాను గందా బాపనయ్యా! నిజం సెప్పూ? ముత్తంమీద సూస్తే మనం యిద్దఱం అన్నదమ్ములం గావంటయ్యా. ఇలాగుంది గందా! అయితే యెందు కయ్యా నన్ను సూసి యీ వోరసలేకపోవడం? అని అడగతాన్లే!

నక్షత్రేశుఁడు—ఓరీ! యేమిరా అట్లు తబ్బిబ్బుగా మాటలాడుచున్నావు? నీవు శాస్త్రమునకు విరోధముగా మాత్రము నడువకుము. బ్రాహ్మణజన్మ మెత్తుట కెంతయో పుణ్యవిశేష ముండి తీరవలయును. శాస్త్రము లేమి ఘోషించుచున్నవో వినుము:—

చ. ఎనుబదినాల్గులక్ష లని యెన్నికఁ గాంచినజీవరాసిలో
మనుజశరీర మొందు టన మాటలతోడిది గాదు, దానికై
మును పొనరించినట్టిబలుపున్నియ ముండక తీర దట్టు లుం
డినను నతండు పుట్టు నొకనీచకులంబునయందు నెందునేన్.

సీ. అట్టినీచకులంబునందుఁ బుట్టినవాఁడు, కోటిజన్మములందుఁ గూర్చుకొన్న
పున్నె ముండినయేనిఁ బుట్టు సమ్మార్గుఁడై, యతఁడును నట్లె పుణ్యంబు చేసి
యారవ్యకులమునం దుద్భవించెడు నట్టి, వైశ్యుండు నట్లె తపం బొనర్చి
క్షత్రియుండై పుట్టుకను గాంచు నతఁడును, బలుతపం బొనరించి బ్రాహ్మణుఁ డగు

గీ. నట్టు పుట్టినవాఁ డయ్యు నంగలోప
మాదిగాఁ గల్గుదోసంబు లంట కుండఁ,
గర్మభూమితలమ్మునఁ గాంచి జన్మ,
ముత్తమబ్రాహ్మణుం డయి యొప్పు టరుదు,

వీరబాహువు—యేంటయ్యో! బాపనయ్యా! ఊరికే అలా పద్దిగాలు
సదుగుతున్నావు? నాను సదుక్కున్నా ననుకున్నావా యేటి?
నా సుట్టి గుడ్డోణ్ణిగందా కొంచెం యివరంగా యిప్పి సెప్పరాదం
టయ్యా! నాకు తెల్పీలాగా.

నక్షత్రేశుఁడు—ఆలాగున నడిగి మావలనఁ దెలిసికొనుము. భూలోక
ములోని యెనుబది నాలుగు లక్షల జీవరాసులలో మనుష్యజన్మము
దొరకుటయే కష్టపుఁబని. ఒకవేళఁ బుణ్యవిశేషంబున మనుష్య
జన్మము దొరకినను, తురుష్క, యవన, మ్లేచ్ఛాది నీచజాతుల
యందుఁ బుట్టక యుత్తమకులమందుఁ బుట్టుట కడుఁ గష్టము. అట్టి
నీచజాతులు కోట్లకొలఁదిగ జన్మము లెత్తి తపస్సు చేసి యాతపో
మహిమవలన శూద్రులై పుట్టుదురు. అట్టి సచ్ఛూద్రులు కోటి
జన్మము లెత్తి యాయాజన్మంబులయందుఁ జేసిన తపోవిశేషంబువలన
వైశ్యు లగుదురు. అట్టి వైశ్యులును నిట్లే కోటిజన్మము లెత్తి
యాయాజన్మములయందుఁ దమచేసిన తపస్సువలనఁ గలిగిన సుకృత
పరిపాకంబున క్షత్రియకులంబునఁ బుట్టుదురు. అట్టి క్షత్రియులు
కోటిజన్మము లెత్తి నిర్మల మైనయంతఃకరణము గలవారై చేసిన
తపంబుకతమున బ్రాహ్మణులై పుట్టుచుందురు. అట్లు బ్రాహ్మణ కులం
బునందుఁ బుట్టుక సంభవించినను గ్రుడ్డివాఁడుగనో, కుంటివాఁడుగనో
చెవిటివాఁడుగనో అవిటివాఁడుగనో మూఁగవాఁడుగనో మోటు
వాఁడుగనో పుట్టక శుభలక్షణములు గలవాఁడై పుట్టుట యన
సామాన్యమా? అట్లు పుట్టినను ఊషర మరు కాంతారాది ప్రదేశఁ
బులం గాక నదీమాతృక లగు దేశంబులం దుద్భవ మొందుట కడుఁ
గడు దుర్లభము. కనుక నేను బూర్వజన్మంబులం దెంతయో కష్ట
పడి తపస్సు మొదలగు పుణ్యకర్మములం బొనరించి తత్ఫలంబుగ



నిట్టి యుత్తమ జన్మంబు నార్జించికొంటిని. ఈ సంగతి నీకుమాత్రము
తెలియదా?

వీరబాహువు—ఇన్నానయ్యా! బాపనయ్యా! ఇంక సాలించవయ్యా.
ఇవన్నీ నీవోంటి బాపనోళ్లు రాసుకున్నవే గావంటవయ్యా. నీలాగే
నాగ్గూడా రెండచ్చరా లొచ్చాయంటే మాకులమోళ్లకి నీకన్నా
శానాశానా యెక్కువగా రాసిపెట్ట ననుకున్నావా? సాలు సా
లింకూరుకుండవయ్యా! నీతో నాకేం పనుంది? (హరిశ్చంద్రునివంకఁ
జూచి) ఏమయ్యోయి! నువ్వు మొదట సెప్పినపకారం పన్లు సెయ్య
డాని కొత్తావా రావా? సెప్పు. నాకిక్కడే పొద్దు పోతావుంది.
నా కింకా శానా పని వుండాది. మమ్మల్నెందుకయ్యా? నింద
సేస్తారూ! మాలాటిమాలోళ్లు లేకపోతే అప్పుడు మీపని తెలి
సొచ్చును లెండి. మీలాంటి గొప్పజాతోళ్లిలానడుచుకున్నా తప్పు
లేదు గంబోలు! మాం సేస్తేనేనా తప్పొచ్చింది? తాగడం, దొంగ
లాడ్డం, అబద్దాలాడ్డం, ఒగళ్ని సంపడం యిలాంటివే గదంటవయ్యా
పాపాలంటేను. ఇలాంటిపన్లు సెయ్యనోడు మాలోడైనా బేమ్మడే.
సేసినో డెంతబాపనోడైనా మాలోడే. మీరుసుల్లో యెందరో
మంది మాల్దానికీ, మాదిగిదానికీ పుట్టి బాపనోళ్లనిపించుకుంటా
వున్నారు గారా? ఇంకెప్పుడూ అలాంటి మాట్లాడఁబోకు బాప
నోడా! మీగుట్టు బైట పడతాది సుమా. ఏటనుకున్నావో?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! ఇదిగో వచ్చుచున్నాను. మాట యిచ్చిన
ప్రకారముగా నడుచుకొనువాఁడనే. (నక్షత్రేశునిఁ జూచి.) స్వామీ
తాము ధనము గైకొనుఁడు. ఈ విధేయునిగూర్చినచింత తమ
కక్కఱలేదు. ఈశరీర మెవ్వరకు లోపడిన నేమి? చిత్త మొక్కటి
మాత్రమే యీ జగద్రక్షకునకు లోపఱిచి యుంచినఁ జాలును. ఇప్పు
డీతఁడు సెప్పినచొప్పున నెవ్వ రపయశఃపాపకరంబు లగు పనులు

సేయుచుందురో వారే యుత్తమజాతివారు గాని తక్కినవారెన్నటి కిని గాఁబోరు. ఆవిషయముంగూర్చి చర్చించితిమేని జాతిసమయాభిమానములవలనం గలుగుహాని యింతింతని చెప్పుట కలవియే కాదు. ఎందులకును బనికిమాలినయీపాడుదురభిమానములే కదా దేశాభివృద్ధికొఱకగుసత్కార్యముల కన్నింటికిని బ్రతిబంధకముగా ముందు వచ్చి నిలుచుచుండును. తత్త్వవేత్త లీమార్గమును గనుంగొనుటకే కదా యరణ్యంబులందుఁ బ్రవేశించి యల్లాడుచుందురు? శీల మొక్కటియే యుత్తమకుల సూచకంబుగా నెంచవలయును. "ద్వి. కులము ప్రధానమా గుణము లేకున్నఁ, గలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు." అనియు "క. నీతియె, తోడ వెవ్వారికిన్" అనియు "ఆచారమే సత్పురుషులకు భూషణంబు" అనియుఁ గదా పెద్దలు సెప్పుదురు. ఏవస్తువునకుఁ గాని, జాతినిబట్టి మంచిసెడ్డ లేర్పడి యుండవు. తామర, బంగారము, ముత్యము, వింజామర, గోరోచనము, పాలు, తేనె, పట్టు, పునుఁగు, జవ్వాది, మొదలగు కొన్ని వస్తువులు పుట్టుకంగూర్చి గమనింపఁబడకుండనే యెక్కువగాఁ గొనియాడఁబడుచున్నవి కావా? ఆయావస్తువులకు స్వభావమునుబట్టి గుణ మేర్పడుచున్నదే కాని పుట్టుకంబట్టి యెంతమాత్రమును గాదు. కనుకఁ దాము వీ గొనఁగుధనమును గైకొని దాసుని ఋణవిముక్తుం జేయ వేఁడుచున్నాఁడను.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా! నీయభిప్రాయమే యట్లున్న నిఁక నే నేమి సేయఁగలను? "బుద్ధిః కర్మానుసారిణీ" అని కదా పెద్దలు సెప్పుచుందురు! అట్లే చేయుదము. ఇఁక మీఁదఁ జేయవలసినది చేసి ముగింపుము.

హరిశ్చంద్రుఁడు—చేయవలసినది యే మున్నది? దాస్యపత్త్రమొక్కటియే కదా!



నక్షత్రేశుఁడు—అయ్యా! దాస్యపత్త్రము వ్రాయవచ్చునా?

వీరబాహువు—రాపించండి. రాపించండయ్యా! బేగి నాను పోవాల.

నక్షత్రేశుఁడు—తమ పే రేమి? పత్త్రమునం దేమేమి వ్రాయవలయును?

వీరబాహువు—నా పేరా? నా పేరు మీ కెందు కయ్యా! ఆయనే గాదంటవయ్యా! నాకు రాసియ్యవాల్చింది. నా పేరడగతావేటయ్యా!

నక్షత్రేశుఁడు—వ్రాసి యియ్యవలసినది యాయనయే కాని "ఫలానా వారికి" అని వ్రాయ నక్కఱలేదా?

వీరబాహువు—ఔ నౌ నయ్యోయ్. నిజమే చామే. నా పేరీరబావంటారు చామే.

నక్షత్రేశుఁడు—ఏమీ బాగుగాఁ జెప్పుము. ఏమిపేరో?

వీరబాహువు—(గట్టిగా) ఈరబా వీరబా వయ్యో బాపనయ్య!

నక్షత్రేశుఁడు—"ఈరబావు" అంటే వీరబాహువేనా?

వీరబాహువు—ఆఁ. ఆఁ. అవు నవును చామే. యీరబావే. యిడిచి పెట్టకండి బాబో. మా బాగా పట్టినావయ్యా బాపనయ్యా! అందుకే బేమ్మడో బెమ్మదేముడో అంతారూ!

నక్షత్రేశుఁడు—సరి తెలిసినది. పత్త్రములో నేమేమి వ్రాయవలయునో చెప్పుము. వేగముగా వ్రాసి యిచ్చెదము.

వీరబాహువు—అదేంటి చామే నన్నడగతా వున్నావు? తమకి తెల్దాయేటి? నానంటే అచ్చరాల్రాని గుడ్డిముండావోణ్ణి గాని నువ్వు సదుగుకున్నావు గావంటవయ్యా! బాపనయ్యా.

నక్షత్రేశుఁడు—ఏమీ? నీకుఁ గన్నులు గనఁబడ వాయేమిటి? పాపము!

వీరబాహువు—బాగానే అడగతా వున్నావయ్యోయి బాపనయ్యా! నీపున్యాన్ని కళ్లు కనపడతానే వున్నాయయ్యా! గుడ్డో డంటే

కళ్లు కనపణ్ణోడే అనుకున్నావంటవయ్యా! సదువుకోనివోడుమాత్తరం గుడ్డోడు కాడనుకున్నావా? ఆడే మొదాటి గుడ్డోడు.

నక్షత్రేశుఁడు—ఆఁ. ఆలాగుననా? చదివినవారినిగూడఁ జూచియున్నావేమి నీవు!

వీరబాహువు—సదిగినోళ్లే గాని, గొప్పగొప్ప బాగ్గెమంతులే గాని వోళ్లైనా చరే కడాపట నాకాడికే గందా రావోల్చింది. ఆళ్ల సదువూ గిదువూ, బాగ్గేలు బోగ్గేలూ అన్నీ నాకాడనే గందటవయ్యా అప్పగించి పోవల్చింది? నాకళ్లెంతమంది మహామహాపబువులో మట్టిలో గలిసిపోవడం సూసున్నాయి. కాలి పిడికెడుబుగ్గయి పోవడం సూసున్నాయి. యీసెయ్యి యెంతమందినో పొడిసి పొడిసి కిందకీ మీదకీ పొల్లించి పొల్లించిబుగ్గి సేసింది కాదూ! కడాపటికి మీరంతాకూడా నాకాడికి రాకుండా పోతా రనుకున్నావంటవయ్యా! చరే ఆమాట యేరే చంగతి. అదాల గుండనిచ్చి పెకురుతం సేయవోల్చినపని సూడవయ్యా యీయేళ కెన్నిసపాలొచ్చి పడున్నాయో యేటో ముండా సొదా.

నక్షత్రేశుఁడు—పత్త్రములో నేమేమి వ్రాయవలయునో చెప్పుము.

వీరబాహువు—యేముందయ్యా రాయడానికి! మాం సెప్పింనంతా నేసొప్పగించాల సచ్చినగొడ్లని కొయ్యాల. ఇంకేంసెప్పితే అదల్లా సెయ్యాల.

నక్షత్రేశుఁడు—హా! విశ్వేశ్వరా! ఎట్టివాని కెట్టిగతి పట్టినది?

వీరబాహువు—యేటయ్యో బాపనయ్యా! ఆపన్లు సెయ్యొద్దంటావా? యేటి?

హరిశ్చంద్రుఁడు—దాని కేమిసంశయ మయ్యా! తాము చెప్పినపను లన్నియుఁ జేసితీరవలసియే కదా యున్నది.



వీరబాహువు—యీ నెవరయ్యా జగడాలమారిలా గున్నాడూ. యీనొద్దు గాని (సత్యకీర్తినిజూపి) ఆ యన్ని రాయనీ. అతగోడు మంచోళ్లా క్కనపడతా వున్నాళ్లే.

హరిశ్చంద్రుఁడు—మఱేమియుఁ గలహాము జరుగదు. కొంచెమునే పూరకుండుము. అన్నియుఁ దెలిసి యగును.

నక్షత్రేశుఁడు—సరి సరి. చేయువా నొప్పుకొనుచున్నప్పుడు మధ్యను నా కేమి పోయినది? తక్కినది గూడఁ జెప్పుము.

వీరబాహువు—ఇగ నేటున్నాదీ! కాటికాడికి తీసుగొచ్చిన సపానికల్లా నోట్లో యేసే బియ్యపగింజలు, మూరెడంత గుడ్డముక్క రెండణాలు డబ్బులూ కట్టవిస్తారు. అయిపుచ్చుగోని మాయింటికాడ సేర్చాల. ఆ బియ్యపనూకలే ఆయన వొండుకోని తినాల. ఆగుడ్డముక్కే ఆయన కట్టుకోవాల. సాలింతే రాయండి. ఆఁ. ఇగనోటి. నా నిప్పుడు మీకు సెల్లించే పైక వెంతో అదికూడా రాయండి. ఆఁ ఆఁ. మరిసిపోనాను. ఆయన నాపనో డనికూడా పత్తరంలో రాయండి. నాను సెప్పినవన్నీ దాన్లో రాయాల చుమండీ. మరిసిపోతారో యేటో చామే మీసిత్తం గందా. నా నుత్త మోళీ వోణ్ణి ఆపాపపున్నే లన్నీ మీయే గందా.

నక్షత్రేశుఁడు—హరిశ్చంద్రా! ఇప్పుడు వాడు సెప్పిన వన్నియు నీకుఁ దెలిసినవా? అవి యన్నియు నీకు సమ్మత మైనపనులే కదా!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! మొదటఁ దాను చెప్పినపను లన్నియును జేయవలయు నని కదా వా రనుచున్నారు. అందును "పెద్దలచేతను శాస్త్రములచేతను నిషేధింపఁబడిన పాపకార్యములు దక్కఁ దక్కిన పను లన్నియుఁ జేయవలయును" అని వ్రాయుట తగును. ఇది యొక్కటియే తక్కఁ దక్కిన దేదియు నేను విన్నవించుకోవలసిన విజ్ఞాపనము లేదు. తక్కినవాని కన్నింటికిని నా కంగీకారమే.

నక్షత్రేశుఁడు—అయ్యా! ఇప్పు డీయన సెప్పినమాటలు మీకుఁ దెలిసినవా?

వీరబాహువు—ఏటో రొవ్వంత తెల్చినట్టూ రొవ్వంత తెల్నట్టే తెల్చింది గాని అదేటో అంత బాగా తెల్లేచ్చామే. అంటిషం డొల్చిన్లాగ సెప్పాలగాని నేకపోతే మానాంటిమోలీవోళ్ల కేటి తెలుస్తాచ్చామే.

నక్షత్రేశుఁడు—అటులేని తెలియునటులు స్పష్టముగాఁ జెప్పెదను వినుము. పాపపుఁబనులు దక్కఁ దక్కినపను లన్నియుఁ జేయుటకు సమ్మతింతురు.

వీరబాహువు—రోంబాగా సెప్పినావయ్యా! పాపాలు సెయ్యాలని ఓళ్ళయ్యా సెప్పుతారు! ఆలాటిపల్లు సెయ్యొద్దునే. తతిమ్మాయి సెయ్యనాడి కేటీ బాదా?

నక్షత్రేశుఁడు—మిగిలినపను లన్నియుఁ జేయుటకు మొదటనే సమ్మతించిరి గదా!

వీరబాహువు—ఆటిమాట కేటి గాని; యీ అయ్యోరిపే రేటీ?

నక్షత్రేశుఁడు—వీరి పేరా? హరిశ్చంద్రుఁడు.

వీరబాహువు—అరిచిందుడ్డా? యేటీ. మల్లా సప్పయ్యోరూ!

నక్షత్రేశుఁడు—కాదు కాదు. హరిశ్చంద్రుఁ డందురు.

వీరబాహువు—(పకపక నవ్వి) యిదేటయ్యోయ్ బాపనయ్యా! అరిచిం దుడ్డంతావు. అరిచిందుడ్డోటీ, అరవందుడ్డోటీ వుంతాదటయ్యా! దుడ్డరుస్తాదా యేటి?

నక్షత్రేశుఁడు—తుదకు మంచియజమానుఁడవే దొరకితివి. దుడ్డును గాదు దూలమును గాదు. హరిశ్చంద్రుఁడు. హరిశ్చంద్రుఁడు. ఇఁక నైనను దెలిసినదా?



వీరబాహువు—అదేటో గోడ. పేరుమాట కేటిగాని; అదేటో రాపించం డింక.

నక్షత్రేశుఁడు—అయ్యా! సత్యకీర్తి? దాస్యపత్త్రము వ్రాయుదువుగాక.

సత్యకీర్తి—(తనలో) ఆహా! విశ్వేశ్వరా! ఇదియు నాపురాకృతకర్మమే కాఁబోలును. నాయేలిక బాలిశునివీలున నాలిబిడ్డలనుగూడఁ గోలు పోయి తుదకు మాలనికి దాసుఁ డగునంతటిదురవస్థను గన్నులారఁ జూచుటకును, ఆ దాస్యపత్త్రమును సయితము నేనే చేతులార వ్రాయుటకును బాల్పడవలయునా? అక్కటా! యింతకన్న ఘోరావస్థ యుండునే?

(వ్రాయుట నభినయించుచున్నాఁడు.)

దాస్యపత్త్రము.

ద్వాపరయుగము ౧౦౩౬౭ గతాబ్దంబులు గాఁగాఁ గ్రోధినామ సంవత్సర మాఘశుద్ధైకాదశీ మంగళవారము దినమున శ్రీకాశికా నగరంబున వసించు తలవరిపని శివమతము (పంచమకులము) మ-రా-రా-శ్రీ, వీరబాహు వనువారికి, అయోధ్యానగరము, క్షత్రియకులము, త్రిశంకుభూపాలుని పుత్త్రుఁడు, హరిశ్చంద్రుఁడు వ్రాయించి యిచ్చుదాస్యపత్త్ర మేమనఁగా:—

నేను బ్రహ్మశ్రీ, నక్షత్రేశులవారికిఁ దఱుగుమూలమునఁ జెల్లింప వలసియున్న పదివేలు నిష్కంబులకై నేనే పైనివ్రాయఁబడిన వీరబాహు వనువారికి దాసుఁడ నగుటకు సమ్మతించి పదివేలు నిష్కంబులు రొక్కంబుగనే పుచ్చుకొంటిని గాఁబట్టి యీదినము మొదలు మీఁద వ్రాయఁబడిన వీరబాహు వనువారికి దాసుఁడనయి పెద్దల చేతను, శాస్త్రంబులచేతను నిషేధింపఁబడిన చెడుపనులను విడిచి

మిగిలిన పను లన్నియు వారు చెప్పినచొప్పున శక్తివంచన లేకుండఁ జేయుచుండుటకై లోఁబడి యుండవలసినవాఁడ నయితిని. పైనుదాహరింపఁబడినపదివేలు నిష్కంబులు నేనాఁడు చెల్లింపఁగలుగుదునో ఆ నాఁడే విడుదలం గాంచు బాధ్యత గలవాఁడను. అంతవఱకును వారు పాపపుఁబనులను వినా గాఁ జెప్పెడు మిగిలినపనులు వారి యిష్టము ననుసరించి నామనఃపూర్వకముగా వంచన యించుకయు లేకుండఁ జేయుచుందును. ప్రతిపీనుఁగునకును నియ్యఁబడు డబ్బులును గుడ్డముక్కయు వారికే సమర్పించి పీనుఁగునోట వేయు బియ్యమునుమాత్రమే నాజీవికకై యుపయోగించుకోఁ గలవాడను. ఇవ్విధముగ నేను నామనఃపూర్వకముగా వ్రాయించి యిచ్చిన దాస్యపత్త్రము.

సాక్షులు. ఇట్లు:

నక్షత్రేశుఁడు. అ. త్రి. హరిశ్చంద్రుఁడు.

ఈ దాస్యపత్త్రము సత్యకీర్తిచే వ్రాయఁబడినది.

(సత్యకీర్తి చదివి వినిపించుచున్నాఁడు.)

నక్షత్రేశుఁడు—అయ్యా! వీరబాహువుగారూ! ఇవన్నియు మీమనస్సున కిష్టమైనవే గదా!

వీరబాహువు—చరిచరి. సదువుకున్నోళ్లు గందా మీనాటోళ్లు మోసం సేస్తారా యేటి? నాకనాంటి భయం నేదు బాబయ్యగోరు! యిదుగో పైకం నెక్కెట్టుకోండి. యెక్కువగానీ వుంటే నాకాసి పారెయ్యండి బాబూ! బీదముండావోణ్ణిగందా.

నక్షత్రేశుఁడు—మాకేల నీధనము? అల్లంతమాత్రమును మోసము జరుగదు.



వీరబాహువు—యీఅయ్యోరికి పైక మంతా ముట్టేసినాది గనక యింక నాయెంబణ్ణే రావయ్యోయ్. అయ్యోయూ?

హరిశ్చంద్రుఁడు—(నక్షత్రేశునిజూచి) అయ్యా! ధనము పుచ్చుకొని లెక్కపెట్టుకొనుఁడు.

నక్షత్రేశుఁడు—లెక్కపెట్టుకొంటిని. ఆహా! హరిశ్చంద్రా! నీగతి యిట్టు పట్టినందులకు నామన స్సంతము లేనిచింతను గొని వ్యాకులపడుచున్నది. ఈశ్వరసంకల్ప మిటు లుండఁగా మన మేమి సేయఁగలుగుదుము. నిన్ను నే నొకొక్కప్పుడు నాకు సంభవించినకష్టంబుల కోర్వఁజాలక నోరికి వచ్చినట్లెల్ల మాటలాడి యున్నాను. వానిని మఱచిపోయెద వని నమ్ముచున్నాను. ఇఁక నేను బోయెదను. నీవు పడినపాటు లన్నియు మునివరులతోఁ జెప్పెదను. నిన్నుఁ జూచిన కొలఁదిని నామనస్సు మఱింత పరితాపము నందుచున్నది. అక్కటా! నీ వొకదిక్కునను, నీభార్యయుఁ బుత్త్రుఁడును నొకదిక్కునను దిక్కుమాలి యుండవలసిన వారైతిరి గదా! ఆహా! యెట్టివారి కెట్టి యిక్కట్టు వచ్చినది! అందును నీవంటిమహానుభావునకు దాసవృత్తికూడ సంభవింపవలయునా? అక్కటా! యెక్కాలమునకు నీ కీదిక్కు తొలంగెడినో కదా! పోనిమ్ము గాని నేను నీకొక్కయుపాయము చెప్పెదను. నామాట త్రోసివేయక యట్లొనరించితివేని తప్పక నీకు మేలు సేకుఱును. తంత్రము చేసిననే కాని కార్యము నెఱవేఱదు. రాజ్యమేలుట యన సామాన్యపుఁబని కాదు. పెద్ద బరువు నెత్తిని బెట్టుకొంటిమే యని మునీంద్రుల కీపాటి తోఁపక పోదు. కావున మరల నారాజ్యము నాకుఁ గావలయు నని యడుగుము. నేను గూడ నీపక్షమును వహించి చాలదూర మాయనతోఁ జెప్పి నీరాజ్యము నీ కిప్పించెదను. ఇదివఱ కయిన దేమో యయి

నది. మించినదాని కెవరేమి చేయఁగలరు! ఇటువయి నేల వ్యర్థముగా హింసలపా లయ్యెదవు! నీమాట కేమి లెమ్ము నీవు మగవాఁడ వెట్లో కాలము గడపెదవు గాని పాప మానారీమణియు నాపసిబాలుఁడును నెట్టియిక్కట్టు పడుచున్నారో కదా! నీవు వారి నిద్దఱను బానిసలఁగాఁ జేసి బాధలపాలు గావించుట కడుంగడు నధర్మము. నీవే బాగుగా యోజించి చూడుము.

హరిశ్చంద్రుఁడు—వలదు స్వామీ! వలదు. దత్తాపహారంబునం గల్గు పాతకంబునకు మించిన దింకొకటి లేదని పెద్దలు సెప్పుదురు. దత్తము చేసినది చేసినదే యగుఁగాక. ఈ దేహ మెవ్వరికి దాస్య మొనర్చుచున్న నేమి లెండు. హృదయముమాత్రము నియమమును దప్పకుండ నుండినం జాలును. సత్యప్రవర్తనముతోడి జీవనమే జీవనము.

ఉ. సత్యముచేతనే రవియుఁ జంద్రుఁడుఁ గాలము దప్పకుండఁగా
నిత్యము నాకసమ్మునయి నేర్పుమెయిన్ విహరించుచుందు రా
సత్యముచేతనే జగము సర్వము నిట్టులు నిల్చియున్న దా
సత్యములో సమాన మగుసద్గతి వేఱొకఁ డుండఁ బోలునే.

చ. వెలయఁగ నశ్వమేధములు వేయిటి నొక్కెడ సత్య మొక్కెడం
దుల నిడి మున్ పితామహుఁడు తూఁపఁ గడంగుఁడు నప్డు సత్య మే
వలమున నుంచినాఁడొ యటువైపుననే బరువయ్యె నెంతయున్
జులకన యయ్యె జన్నములసొం పన సత్యపుఁబేర్మి యల్పమే.

కనుక దేవర వారీదాసున కట్టిచెట్టబుద్ధి యెట్టియిక్కట్టులు సంభవించినను గఱప కుండురుగాక యని కోరుచున్నాఁడను. మఱియుఁ దా మీదాసునిపట్ల నించుకంతయైన నీతి దప్పి ప్రవర్తించినట్టులు నామట్టుకు గనుపట్టుట లేదు. మీఁదుమిక్కిలి తామే యీనలువది దినంబులనుండియు మాతోపాటు సంచారక్లేశము లెన్నేని యనుభవించి వేళకు నిద్రాహారములనుగూడ నెఱుఁగక కడుంగడుఁ గృశించి



కష్టములపా లయినందులకై మమ్ములను మన్నింపవలయును. తా మాయాసమయములయందు నాకుఁ జెప్పినయవి హితోక్తులే కాని యహితము లెన్నఁటికిని గావు. అవ్వియే కదా తమ కియ్యవలసిన ద్రవ్యమును సకాలమునఁ దమకుఁ జేర్పఁగలుగుటకై నన్నుఁ బ్రేరేపించినవి. పెద్ద లొకప్పుడు చెడుగు లాడినను మా కవి హితోపదేశములే. "నిష్కపటహృదయులు వలుకుకఠినోక్తులును సత్సూక్తులే యగును" అని కదా పెద్దలు సెప్పుచుందురు.

వీరబాహువు—యేటయ్యా! బాపనయ్యలూ! యేటేటో మాటాడతానే వున్నారు! నాకిక్కణ్ణే పొద్దు పోతావుంది. ఇంకా చానా పనుండాది. చొమ్ముచేతిలో పడీదాకా బలే తొరపడ్డారుగందా! బాగుండాదా యిలామాట్లాడుకుంటా కూకుడోడం - ఇది మీలాటోళ్లకి దరమ్మయిన మాటేనా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! ఇదుగో వచ్చుచున్నాను. నాయాలస్యమును మన్నింప వేఁడుకొనుచున్నాఁడను. (నక్షత్రేశునివంకఁ జూచి) స్వామీ! ఇఁక నాకు సెలవా? మునిభగవానులవారికి నావందనము లందింతురు గాక.

నక్షత్రేశుఁడు—అటులే. పోయి వత్తునా? దయమాత్ర ముంచుము.

(నక్షత్రేశుఁడు నిష్క్రమించుచున్నాఁడు. వీరబాహునివెంట హరిశ్చంద్రుఁడును, సత్యకీర్తియుఁ బోవుచున్నారు.)

వీరబాహువు—(వెనుకకుఁ దిరిగి) యీ యయ్యోరు నీతోఁగూడా పనిపాట్లు సెయ్యడన్నావుగందా నీయెంబణ్ణే వొస్తావున్నా డేడకీ?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వారు నామిత్రులు. వారును నాతోడనే యుండఁదలంచి వెంట వచ్చుచున్నారు.

వీరబాహువు—ఓరబ్బా అని మీరిద్దరూ సక్కగా కూకోని మాట్లాడతా, ఆడతా, పాడతా యేడుగ్గా యిలాసంగా వుండొచ్చునని

తెలుసుగున్నారా యేటి? అనాటివి నాకాడ సాగవుచుమా యేటనుకున్నావో గాని. అనాగయితే నానిచ్చినచొమ్ము నామొగాన్ని పారేసి మీాయిట్టం వొచ్చినకాడి కెల్లిపొండి. నేదా నువ్వు మాత్తరవేఁ నాయెంబణ్ణిరా.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మే మాలాగు చేయువారము గాము. తమ యిచ్చకు నచ్చినమచ్చుననే నడుచుకొందుము గాని మాయిచ్చకు వచ్చినమచ్చున విచ్చలవిడిగాఁ బెచ్చుపెరిఁగి గచ్చులు ద్రొక్కువారము గామని నమ్మవలయును.

వీరబాహువు—ఆనాటిసెనబిసలు నాకాడ పనికిరావు. ఊఁ హూఁ. మాయయ్యతోడు. సెప్తావుంటే యినపడదా యేటి. అతగోణ్ణి పొమ్మని నువ్వు నాయెంబణ్ణిరా. చొమ్ము సేతులో పడీదాకా ఓమాటా పడ్డానకోమాటానా! అప్పుడంతా నాను సెప్పినపకారమల్లా యింతానన్నొప్పుకోని యిప్పుడేటయ్యా నానేతంటే నువ్వు పేతంటావు? ఇనాటిదేనంటయ్యా నాను సెప్పినట్టల్లా యినడం?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! కోపింపకుఁడు. మీా యిష్టము చొప్పుననే నడుచుకొందును. (సత్యకీర్తిని జూచి) సత్యకీర్తీ! నావిధి నేమని దూఱఁగలను? రాజ్యమునకుఁ బాపుటయే కాక తుదకు నాబహిఃప్రాణంబులరగు మిమ్మునుగూడఁ బాపుచున్నది. నన్ను దాసునిగాఁ గొని నాయప్పుదీర్చిన యీ నాయజమానునియనుమతిం గొని సంచరింపవలయునుగదా! నీ విప్పురంబుననే యేదే నొకసత్రమ్మున వసించుచుండుము. పిమ్మట భగవత్సంకల్పముప్రకారము గాఁగలకార్యము గాకతీఱదు. మన మేమిసేయఁగలము?

సత్యకీర్తి—ఆహా! సార్వభౌమా! విధేయునిం బోలిన పాపాత్ముఁ డింకొకఁ డీప్రపంచమునఁ గలుగునా? దేవరవారియెడఁ బాటు సైఁపఁ



జాలక నేను సర్వమును బరిత్యజించుకొని వచ్చినాఁడను. నాపురాకృత మందులకుఁగూడ నొప్పకపోయినది. కట్టా! రాజచంద్రమా! దేవరచిత్త మెట్లూఱటఁ జెందఁగలదు? నే నేమి చేయుదును? ఈపాపాత్ము నం దేనిఁ బొమ్మంటిరి. అయ్యో? ఇట్టి మిమ్ములను విడిచి పోవుట కడుగు ముందు పడకుండ నున్నది. హా! హా! దాసున కింతవఱకును గష్ట మనునది యెట్టిదో తోఁచుటయే లేదు. ఇపుడు గానున్నతమవియోగ మొక్కటియే హృదయమున శల్యమువలె వేధించుచున్నయది. ఓహో! పరమేశ్వరా! సత్యముకొఱకై పాటుపడుచున్నవాని కిటువంటిఫలమా సమకూర్చుచున్నావు? (తల క్రిందకు వంచుకొనుచున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—సత్యకీర్తీ! చింతిల్లకుము. అన్నియుఁ దెలిసికొన్న నీవుకూడ నిట్లు చింత కెడమీాయఁదగునా? లోకమునందలిజీవితము సంతలోని జనమువంటి దని యెఱుఁగవా? నన్ననుసరించిన నేమి ప్రయోజనము! ఎందేనిం బొమ్ము.

సత్యకీర్తి—(వీరబాహునిం గూర్చి) అయ్యా పుణ్యమూర్తీ! నాప్రభువు నెప్పుడును విడిచి యున్నవాఁడను గాను. తమరు నాయం దనుగ్రహించి వారమున కొక్కసారి యయినను వీరిని సందర్శించుటకై యనుజ్ఞ నీయవలయు నని కోరుకొనుచున్నవాఁడను.

వీరబాహువు—అదల్లా జరగని మాట. సెప్పాలగందా! అంత కావలిస్తే నెలకోపా లొచ్చి సూచి పోండి. అంతేకాని మరేటీ వొద్దు. (హరిశ్చంద్రునితో) సూసినావా పొద్దుపోతావుండాది. మాకోడలు నాకోసం యెనికెనికి సూస్తా వుంటాది. ఇంటికాడికి పోదా విఁక నెగు.

హరిశ్చంద్రుఁడు—ఇదిగో వచ్చుచున్నాను. అయ్యా! లెండు పోవుదము. (సత్యకీర్తిం జూచి) సత్యకీర్తీ! నీ విఁకఁ బోయి రమ్ము. అప్పుడప్పుడేని కంటికగపడఁ గోరెదను,

సత్యకీర్తి—సార్వభౌమచంద్రా! విధేయున కంతటి యదృష్టముగూడ నున్నదియా?

(సత్యకీర్తి చింతాకులహృదయుఁడై కన్నీరు దుడుచుకొనుచు నిలువఁబడును. హరిశ్చంద్రుఁడు వీరబాహునివెంబడినే పోవుచుండును.)

వీరబాహువు—మాయింటిది బలే మంచిమనిసి గాని కొంత కోపం మాత్తర మఁప్పుడప్పు డొస్తాది. ఇంటికాడి కెల్లగానే "మావాఁ! యేమిఁచ్చికొన్నా" వనడుగుతాది. ఇంతచొమ్మిచ్చి కొన్నానంటే నామీద మండిపడతాది. పెదమకోపంగదా నాయాలకి. నా న్దానికి బయంపడి నూరొరాలంటా. నా న్నేనప్పుడు నూసి నిన్నుగానీ అడుగుతాది. నువ్వుకూడా అనాగే సెప్పేం. నేకపోతే నాబుఱ్ఱ బద్దల్గొడతాది. బద్దరం ముందుగానే సెప్పుంచినాను గందా!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మీరు సెప్పుమనిన చొప్పునఁ జెప్పుటకు నాయంతరాత్మ యొప్పదు. కనుక నావిషయమై నన్ను మన్నింతురుగాక. ఒకవేళ నామె నన్నడిగినచో నున్నదున్నట్లు విన్నవింపక మాననుం.

వీరబాహువు—ఇదేటోస్సి బోలిడుచొమ్మిచ్చి పెద్దవీడం దెచ్చుకున్నాను. పోనీ గాని, నాను సెప్పమన్నట్టల్లా సెప్పడానికి నీకేటొచ్చిందయ్యా కట్టం. నానింతే యిచ్చినానంటా. నువ్వా ఔనని బుఱ్ఱా పెయ్యి. ఆమీద సూసుకుందాంలే.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! మీ రెట్లునడువ మని యాజ్ఞాపించిన నేనట్లు నడుచుకోవలసియే యున్నది. ఐనను, ఇది వట్టియసత్యము. సత్యమును మాటుపఱిచి యసత్యము చెప్పుటకు నాయంతరాత్మ యెంతమాత్రమును నంగీకరింపదు. కన్నులారఁ గన్నదియు, చెవులార విన్నదియు, మనస్సుచే నెఱిఁగినదియు నగుసంగతిని మార్చి చెప్పుటయే యసత్య మనిపించుకొనును. అది పంచమహాపాతకము



లను మించినది. అట్లసత్యమాడుటకై సంకల్పించుకొనుటయుఁ దప్పుపనియే. కావునఁ దామట్లు నన్ను నిర్బంధపఱిచి చెప్పకుందురుగాక. నిజము వల్కినచో నొకప్పుడు ముందుగా నిష్ఠురము వచ్చినను క్రమముగా మంచిగా మాఱకపోదు.

వీరబాహువు—ఓ! నాకే బుద్ది సెబతావున్నావే యీ యయ్యోరు. ఒగేళ మాకోడలికి తెలకుండా రొవన్ని కల్లునీల్లు తాగినా, పీనగ మీదొచ్చినడబ్బులు దానికి తెలవకుండా దాసుకున్నా అది నిన్నడిగితే సెప్పేస్తావు గావాలయ్యా! కొంపములిగిపోతాచ్చుమా! అబ్బో! పిల్లికూన్ని సంకనెట్టుకోని యెల్లినట్టుంటాది.

హరిశ్చంద్రుఁడు—తెలిసినదానిని దెలిసినట్లు చెప్పెదను గాని బొంకఁజాలను. అందులకై నన్ను మన్నింపవలయు నని విన్నవించుకొనుచున్నాఁడను.

వీరబాహువు—చరిచరి. మొదఠ్నే సెప్పేసినావునే. అదే మంచిది. దానిసిగ్గోసిరి, దానిమాటకేం గాని రా యెల్దాం.

(ఇరువురును వీరబాహునిగృహము చేరుదురు.)

ఇది చతుర్థరంగము.

## పంచమరంగము.

స్థలము: వీరబాహునిగృహము.

కాలము: సాయంకాలము.

పాత్రములు: వీరబాహువు, హరిశ్చంద్రుఁడు, వీరబాహునిభార్య వీరియును.

వీరబాహువు— ఒలే యీరిగుంట. ఓలిగుంటోయి, యేవేఁ పిలస్తావుంటే పలకవూ!

వీరి—యేందిరో మావాఁ! గాడిదిలా గారుత్తున్నావు. నిన్ను సూసి వొస్తావుంటే నీవేటోస్సి యీాదిలోనించే ‹ఓలీరీ! ఓలిగుంట›› అంటా పేగు లెళ్ళొచ్చీనాగారుస్తా వున్నావు. ఇదుగో వొచ్చిసాను, సెప్పింక. యేటి కుప్పలు కుప్పలుగా తీసుగొచ్చినావో సూపెట్టు.

వీరబాహువు—యేటే గుంటా! యేపికూన్నాగ బోఁయిబోఁయి మని మొరుగుతావున్నావు. ఇదో సూడే నంజా! పనికి మనిసోణ్ణి తెచ్చినానే.

వీరి—యేడి మావాఁ! యీాయయ్యోరేనా యేట్రో.

వీరబాహువు—సూడే నాయాలా! నీకోస వేఁలాటిపనిసేసీవోణ్ణి తీసుగొచ్చినాననుకున్నావో. మఱి నువ్వు పనంటే మొఱ్ఱోమని యేడుస్తా వుంటావే.

వీరి—ఇదో కుసింత యిటుముంటా రా. యేమాత్తరం యిచ్చి యీాణ్ణి కొనెత్తెచ్చినావు మావాఁ!

వీరబాహువు—ఓలేయ్! యీాయయ్యోరు బలే మంచోడే చాలా బాగా బతికినోడే యీానా. యీాలాటోళ్లు మన్లాటోళ్ళకి సిక్కతాడంటే గుంటా! సూడే నా నెంతకట్టబడి కొనుక్కొచ్చినానో ఆకట్టం యీా నాయాల కేటి తెలుస్తాది.

వీరి—ఇదేటే యీాడిలా బైసి సెడిపోతా వుండాడూ! యేమాత్తరం యిచ్చి కొనుక్కొచ్చినావురా మావాఁ అంటే యేటేటో రవిశ్శెం మాటాడతా వుండాడు.

వీరబాహువు—ఒలేయ్ నాయాలా! యెందికే అలా గొంతు సించుకుంటా వున్నావూ? అప్పిడే అన్నీ అయిపోనాయి. బానిసోళ్ళసీటి కూడా రాపించుకోవడం అయిపోనాది. ఇదేటే సూడే నంజా! (పత్త్రమును జూపుచున్నాఁడు.)



వీరి—ఆఁ యేటీ మనబానిసయ్యా యీాయయ్యోరు! పాప మీాన శానా బాగా బాగా బతికినోళ్ళాగ కనపడతా వుండాడే. మావాఁ యీా యయ్యోరిపేరేటీ?

వీరబాహువు—యేటే పేరా? సెప్తానుండే. మాయత్తల్లుడుండాడే, ఆడక్క కూతుర్ని సినమావఁ పెళ్లా వుఁండాదే, దానిమఱదిల్కి పెద్దకొడు కుండాడే, ఆడిపేరే యీాడిది.

వీరి—ఇదేటోస్సి యేటో మూరెడుబారెడు పేరేక రెడతాడు?

వీరబాహువు—(హరిశ్చంద్రునిం జూచి) అయ్యోర్యూ! నీపేరేటీ? రొవ్వంత సెప్పూ!

హరిశ్చంద్రుఁడు—నా పేరా? హరిశ్చంద్రుఁ డనియెదరు.

వీరి—ఓలమ్మో యిదేటే యిలాగుండాది పేరూ! పల్లుకూడా దూరకుండా వున్నాదీనపేరు నాను సెప్పనేను. నానోరట్టదు.

వీరబాహువు—ఒలేయ్ నువ్వు బలేబలే సెడ్డమనిసిలా గుండావే. ఇందాకా నాను సెప్పినాను గానూ! ఆడిపేరెట్టి పిల్దూ.

వీరి—అనాకొడకడిపేరు అశ్శందు గాడట్రా మావాఁ!

వీరబాహువు—అద్గో ఆనాగే పిలు.

వీరి—అలాయ్తే చరే. మనోళ్ళ కనాటిపేరే వుండాల.

వీరబాహువు—అయ్యోరా! యింకమీాద మాయింటిది నిన్నశ్శందూ! అంటా పిలిస్తే యేవఁమ్మా! అంటా పలాకాల. నేకపోతే ఆనంజ మా సెడ్డచ్చువమా. నీమీాదా నామీాదా బలే కోపం సేస్తాది. ఆమెన్క నా మొగంకూడా సూడకపోద్ది. బద్దరం! బద్దరం! సెప్పుండాన్చుమా!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అటులే నడుచుకొందును. ఇం దభ్యంతర మొంతమాత్రమును లేదు.

వీరబాహువు—ఓయయ్యా! అశ్శండూ! నువ్వు దినాపూఁ పొద్దున్నే నేఁటి యేశేటి సెయ్యాలో తెల్సునా?

హరిశ్చంద్రుఁడు—నా కెట్లు తెలియును? ఏమేమిచేయవలయునో చెప్పితి రేని యట్లు చేయుచుందును.

వీరబాహువు—అయితే యిను మఱి సెబతాను. పొద్దు దూరింది మొదల్కోని పొద్దుగుంకేదాకా పొగులూ, పొద్దుగుంకింది మొదల్కోని మల్లా పొద్దుదూరేదాఁకా రేతిరీ, నువ్వూ యింకోడుం డాడే యీరడు, ఆఁడూ మీరిద్దరూ కాటికాడ కానుగు పడుండాల. అదే చుమా అయ్యోర్రూ! మనబతుగు. దడాల్న యేల్నోరి నగరికాణ్ణుంచి వోరైనా వొస్తే యేగ్గిరంగా యీరణ్ణి నాకాడికి తోలేయ్. రెండింటా మూడింటా యేల్నోళ్లయింటికాడ ఆవులూ, దూడలూ, సస్తా వుంటాయినే. ఆట్నంటినీ యిక్కడి కీడుసుగొచ్చి కొయ్యాల. అదంతా వొంతులేసి బాగాలపకారం మాపాలోళ్లకీ ఆళకీ తలా యింత పంచిపెట్టాల. ఇటుముంటా రా. అశ్శండయ్యా! నువ్వే పంచిపెట్టాల. నెక్కా పక్కా నీకు బలేబాగా తెల్సుం టాదినే. వొంతులేస్తావే అప్పుడు నన్నుమాత్తరం మరిసిపోతావు చుమా. ఆ గుండీకాయా, తోడా, అదంతా యేశే రవిశ్శెంగా దానుంచి మరీ వొంతు లెయ్యాల. యీరడికంటికూడా తగల్నియొద్దు. అయిమాత్తరం యియ్యకుంతివా మాకోళ్లు మాసెడ్డది సాలా కోపం సేస్తాదిచుమా బద్దరం బద్దరం.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అంతయు సరియే. తాము సెలవిచ్చిన మచ్చునసే నడుచుకొనియెదను. చనిపోయినపశువులను, పెయ్యలను, కోడెలను, దూడలను, కోయుచుందును. కాని యందుఁ గొంచెము రహస్యముగా దాచి యుంచుటకుమాత్రము నే నంగీకరింపఁజాలను.



అది దొంగతన మనిపించుకొనును. అదియునుంగాక యితరులను మోసపుచ్చినట్లు కూడ నగును. అట్లు సేయుట మఱింత పెద్దపాపము. దానిని నే నంగీకరింపఁజాలనందులకు నన్ను మన్నింతురుగాక. ఇందులకే కదా నేను మొదట దాస్యపత్త్రము వ్రాయునప్పుడే చెప్పి యున్నాను.

వీరబాహువు—(చీకాకుపడినట్లు) ఇదేటోస్సి. యీడితో పెద్దవీణ్ణాగుంది. కాలికేస్తే మెడకీ, మెడకేస్తే కాలికీ యేస్తా వున్నాడు. ఈ చంగతిగానీ దాన్నెవులో పడ్డాదంటే యీణ్ణే నన్నూకూడా కరిసేస్తాది. ఐతే పొనీగాని మరి నువ్వు పోయి పని సూస్తావుండు.

వీరి—ఇద్గో మావాఁ!

వీరబాహువు—యేటే గుంటా అంటావూ?

వీరి—యీ పొద్దల్లా ఆ యావుగొడ్డు గడ్డి నేక మలమలమాడి సస్తా వుంది. పొద్దుటేల్నుంచీ పిడికెడు గడ్డిబరకలైనా దానిముంద రెయ్య నేదు. నానేటిసేసేదీ. యీడికి యింటిమీద కుసింతైనా దుట్టి నేదే! ఆడదాన్ని నానేటిసెయ్యనూ? అదెవత్తో గాడిదిని కట్టుకోని కాపరం సేసిందంట. నాబతు గలాగుండాది యీడితో.

వీరబాహువు—ఒలేయ్! యినాంటిపల్లు సెయ్యడానికి గాదంటే యీణ్ణి కొనుకొచ్చినాను! యేటే వూరికే అలా గొంతుగు బద్ద లేసుగుంటావూ! (హరిశ్చంద్రునిం జూచి) ఏవఁయ్యో అయ్యోర్రూ! అద్గో సూడూ, సూరోన్నికి దోవుండాదే కొడవలిగిద్ది. దాన్ని కుసింత సేతపట్టుకోని యెల్లి అల్లద్గో అవుపడతావుండాదే పొలంగట్టు, ఆణ్ణుండి సందిడన్ని గడ్డిబరకలు కోసుగొచ్చి అల్లాయావుముంగ లెయ్యయ్యా! పాప పేఁయూల పొద్దున్నకాణ్ణుంచీ ఉపారికే తొంగుడుండాది.

హరిశ్చంద్రుఁడు—ఆహా! అట్లే చేసెదను. (కొడవలి తీసికొని పోయి పచ్చిగడ్డిగలయొక చోటునఁ జేరి గడ్డికోయుట నభినయించుచుఁ దన లో) ఆహా! ఉమామనోహరా! ఇది యేమి కాలము వచ్చినది! దేశము వదలి, పట్టనము వదలి, బంధువులను వదలి, తుదకు భార్యను కుమారునిం గూడ నొకనికి బానిసలఁగాఁ జేసి నేను మఱియొకనికి బానిస నయి బహిఃప్రాణ మనఁ దగినసత్యకీర్తిని గూడ నెడఁబాసి యేకాకినై యిట్లు గడ్డి గోయుటకుఁ బాల్పడితిని. క్రిందటిజన్మములం దెంతపాపము చేసినాఁడనో కదా! ఏయుత్తములకాపురంబులకు భంగమును గలిగించి యుంటినో? యేసజ్జనులం జూచి పరిహసించితినో? అక్కటా! నాపురాకృత మిట్టిది యని యూహింపఁజాలకుండ నున్నాను. హా! పరమేశ్వరా! నీకు సత్యమే స్వరూప మని నమ్మి యేది యెట్లగుచున్నను దానినే యూఁతగాఁ గొని యున్నవాఁడను. ఇంతకన్న నెక్కుడు దురవస్థ తటస్థించినను దటస్థించుఁ గాక. ఇంచుకయు వెనుదీయను. అకటా! యీగడ్డి యెట్లు కోయవలయునో యెఱుఁగను. హా! విశ్వేశ్వరా! కోయునపుడెల్ల నీకొడవలి మొన యఱచేతికిఁ దగులుచున్నది. నాయజమానునితో నీసంగతికూడఁ జెప్పఁదగునా? కూడదు కూడదు. ఇంతగడ్డి గోసి దీసికొని పోయినను "ఇంతకొంచెముగానే తెచ్చితివా? యిది చాలదు" అందురో యేమో? యేమి చేయవచ్చును? సూర్యభగవానుఁడు నాయవస్థఁ జూడఁజాలనివాఁడో యనున ట్లస్తమించినవాఁడు. నా దుఃఖమువలెనే చీఁకట్లు నలుదిక్కులనుండియు వ్యాపించుచున్నవి. ఇఁక గాఢాంధకారము గ్రమ్మును. నేఁటి కిదియే తీసికొని పోయెదను. ఇది చాల దన్నచో రేపటినుండి చాలినంత కోసి తెచ్చుచుండు నని విన్నవించుకొనియెదను.



(మోపు గట్టి నెత్తిమీఁది కెత్తుకొని వీరబాహునియిల్లు సేరుచున్నాఁడు.)

వీరి—ఇదేట్రో రబ్బ! కసిన్నె తెచ్చినావు గడ్డిబరకలు. ఒక్కగుక్కకూడా సాలవే. యీటికేనా యింతసీక టొడీదాకా ఉన్నావు? నానెత్తే యీపాటి కింతకి పందింతల్తెచ్చేదాన్ని గందా! అల్లక్కడేసీసి పో. ఓరోరి కెంతెంత బాకీ వున్నావోఁ తీరసాల గందా. నువ్వేటి సేస్తావ్రా? నిన్ను కొనుక్కొచ్చినాడే, ఆడికి సెప్పాల. అల్లాయేసీసి పో. యేలికి మన్నంటకుండా తొంగుమండేవోళ్లని పనికి తెచ్చుగుంటే మరేటౌతాది. యింతే.

హరిశ్చంద్రుఁడు—అమ్మా! కోపింపకుము. రేపటినుండి కావలసినంత గడ్డి కోసి తీసికొని వచ్చుచుందును.

(హరిశ్చంద్రుఁడు మరలుచున్నాఁడు.)

వీరఁడు—(పరువెత్తుకొని వచ్చి వీరబాహునిగూర్చి) ఓరన్నా! యిలా రారా యిలా రాస్సి.

వీరబాహువు—ఏట్రా నాకొడకా! అలా కేకలేసుగుంటా పారొస్తున్నావు? సెవులు బద్దలయేనాగ.

వీరఁడు—అన్నా! యిలారాస్సి బలే అవచరం వచ్చినాది.

వీరబాహువు—ఏట్రా నాకొడకా సెప్పోస్సి.

వీరఁడు—ఆయయ్య వుండాడే మనదొర—

వీరబాహువు—యేదొర్రా?

వీరఁడు—మనదొరా. అద్దో, ఆమూలకాడ పెద్దమెల్లో వుండారే—

వీరబాహువు—యేటో సక్కగా సెప్పరాదట్రా నాకొడకా! యెనిపోతు కొచ్చిన న్నెళ్ళొచ్చినాయి గందా!

వీరఁడు—అద్దో వుండారే, ఆళ్లేనోస్సి. అల్లాపొద్దు జాతరనాడు బీదోళ్లందరికీ అంబలికూడా కాపించిపోసినారే, ఆళ్లింటికాడ మనం పొద్దల్లా కానుకోని పడుంటామే, సూడూ అల్లాపొద్దు తలగుడ్డకూడా యిసిరేసినారే ఆయయ్యోరోస్సి.

వీరబాహువు—వోస్సి. ఆ అయ్యోరట్రా! మనవోర. నగర్లోకొలువు కొలుస్తావుండారే. అలా సెప్పరాదంట్రా నాయాలా! ఆయన కే మొచ్చిందిరా?

వీరఁడు—ఆళ్ళింటికాడే వచ్చి—

వీరబాహువు—ఆళ్లింట్లో యెట్రా నాకొడకా! బేగి సెప్పరా?

వీరఁడు—పొద్దుటేల ఆరింటికాడ సిన్న పెయ్యోటి సచ్చిపోనాదని సెప్పినారు.

వీరబాహువు—నువు పోయి యీడ్సుకు రారాదంట్రా యీడకి. రెండు మూణ్ణాల్నుంచి జవ్వెవుఁకకూడా నంజుకోడానికి నేక మొగంవాసున్నానోస్సి. అది నేక కల్లునీళ్లుకూడా నోటికి పోనాయిగావు. బేగి పరుగెత్తుకుపోయి యీడ్సుక రారా.

వీరఁడు—అదంతా అయింది. అప్పుడే యీడ్సుకొచ్చినానోస్సి. మరెండు కనుకున్నావు యెగాదిగా రోజుకుంటా పరుగెత్తుకొచ్చినాను. నువ్వు బేగి కత్తొకట్టుకోని రారా అన్నా! బాగా లెయ్యి. కన్ను మాత్తరం నాకిచ్చియ్యాలగందా. నానీయెల సాలా కట్టపడ్డానోస్సి.

వీరబాహువు—ఇద్గో నాయాలా! అలా సేసేవు సుమా బద్దరం బద్దరం. కల్లునీళ్లతో కన్ను బలే గాటుగా వుంటాది. ఇదో సూడూ! మనమన్సి వుండాడే అశ్శందు. ఆణ్ణి యెంటేసుకోని పోయి నువ్వు దగ్గిరుండి సక్కగా కోయించి వొంతులేసి కన్నొగిటి బేగి పట్టుకోని పారా ర్రాయేఁ. అదేపించుకోని అంగడి కెల్దాం.

వీరఁడు—అన్నోయ్! ఓరన్నా! కొత్తగా వుండాడు యీడు.

వీరబాహువు—ఆడు మన బానిసోడు. నేటికిదా ఆణ్ణి కొనెచ్చినాను. ఆడు సెప్పినట్టల్లా సేస్తూ వుంౘ్రా నాకొడకా! తలబిరుసెక్కి నీ యిట్టవొఁచ్చినట్టల్లా సేసేవు చుమా! బద్దరం బద్దరం. ఆడి కేదన్నా పని తెలకుంటే నచ్చణంగా సెప్పు. ఎల్లెల్లు. (హరిశ్చంద్రుఁనితో) ఒరేయ్ అశ్శందూ! కుసిం తీరఁడితోకూడా యెల్లు. ఎల్లి సక్కంగా కోసి యీడిసేతి కిచ్చి బేగి పంపు.

(హరిశ్చంద్రుఁడు వీరనితోఁ బోవుచున్నాఁడు.)

వీరఁడు—అన్నా! ఇదిగాదా మనిల్లు. ఇక్కణ్ణే పెయ్యుండాది. నువ్వీణ్ణుండన్నా! నా న్లోనికెల్లి కత్తెత్తుగొస్తా.

(అని యాయుధములు దెచ్చి హరిశ్చంద్రునిచేతి కిచ్చి కోయుమనుచున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వీరయ్యా! యీదూడ నెట్లు గోయవలయునో నాకుఁ దెలియదు. దయచేసి నీవు కొంచెము చెప్పెదవేని నే నట్లే కోయుదును.

వీరఁడు—అట్టయితే నువ్వు దొర్లాగుండావే. నువ్వేటి కోస్తావు నానే కోసేస్తాను. నువ్వు సూస్తా కూకుడో.

హరిశ్చంద్రుఁడు—వీరయ్యా! అది యుక్తము గాదు. ఎంతరాజు లయినను బురాకృతకర్మవశంబున నల్పకార్యములును జేసితీఱవలయును. అంతమాత్రమున నొకకొఱఁత రాదు. మనయజమానులు నన్నుఁ గోయు మని కదా! ఆజ్ఞాపించిరి. వారియాజ్ఞ నతిక్రమించి నడువరాదు. నీవు దయచేసి చెప్పుచు వచ్చినయెడల నే నట్లే చేయుచుందును. పిమ్మటఁ గ్రమముగా నాకును దెలియును.

వీరఁడు—అంటేయేం. నాను సేసినా నువ్వు సేసినా అంతా ఓటేగందా. యేదీ కత్తి యిలాతే.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వీరయ్యా! అట్లు వలదు. యజమానుల యాజ్ఞ నించుకంతయినను మీఱి నడువరాదు. నాకుఁ జెప్పినపని నేనే చేయవలయును. అదియునుంగాక నే నెట్లు పని నేర్చుకొనుట?

ఈ దినమునకుఁ దప్పినను రేపయినను నేనే కదా చేయవలసినవాఁడను?

వీరఁడు—అర్తే కానీ. యిద్గో ముందత్తిగా పీక తెగ్గొయ్యి.

హరిశ్చంద్రుఁడు—(గొంతు కోయుచుఁ దనలో) ఓహో! పరమేశ్వరా ఇంతకు మించిన శోధనయుం గలదా?

వీరఁడు—యేటన్నా! నీలో నువ్వే యేటేటో గొణుక్కుంటా వున్నావూ?

హరిశ్చంద్రుఁడు—మఱియేమియును లేదు. నావిధినిగూర్చి తలంచుకొనుచున్నాను.

వీరఁడు—ఆయెనక శరమవఁంతా వొల్చేయి. పొట్ట సీల్చు. పేవు లిలా త్తోసేయి. గుండికాయ యేరే యెత్తుంచు. తిత్తి యీడిసి పేల్లే కుండా సుబ్బరంగా కడిగేయి. తొడ త్తెగ్గొట్టు. ఆయెనక, నా నంతా నరికేస్తుంటాపో. కడాకి బుర్రకాయ వొల్సీసరికి బాగాలె య్యొచ్చున్లే. అన్నా! అన్నోయి నాకాసి కుసింత సూడూ.

హరిశ్చంద్రుఁడు—ఏమీ?

వీరఁడు—ఇద్గో వుండాదే అదిగదా నేతికట్టు! దాన్ని కాల్చుకోని తింటే ఓరిబాబో ఉంటాదిగందా బలే రుసిగుంటాది. అదిమాత్తరం నాకాసిసిరె య్యన్నా! గుండికాయ గిండికాయ అదంతా అట్టనే వుణ్ణీ.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వీరయ్యా! ఇందులో రవ్వంత యైనను నే నెత్తి యీయఁజాలను. అన్నింటిని సరిచేసి యజమానులయెదుటను బెట్టెదను. పిమ్మట నీవు వారి నడిగి పుచ్చుకొనుము. యజమానులను ద్రోహము చేయరాదు గదా! అందును నిది దొంగతనముగూడ నగును.



వీరఁడు—అన్నా! ఆ డిదిగానీ నూ స్తే యిడిసిపెడతా డనుకున్నా వాయేటి? దానిపేరింటేనే నోరూరతాదిచుమా. పోనీగాని నువ్వా ర్డుకో అన్నా నా స్తీచుకుంటాను. అన్నా! నీకు బలే బలే పున్నె వుఁంతాది.

హరిశ్చంద్రుఁడు—దొంగతన మెప్పుడును జేయఁగూడదు. అందులను యజమానులకుఁ బ్రియమైనవస్తువులు వారిని వంచించి యపహరించుట మఱియును బాపము. ఎప్పటికిని సత్యప్రవర్తనమే వలయును. అదికాక యజమానులనుగూర్చి "వాఁడు, వీఁడు" అని యవమానకరముగా నేకవచనప్రయోగము చేయఁగూడదు. అది మహాదోషము. అట్టితరులు పలుకుచుండఁగా వినుచుండుటయు దోషమే యగును. మనము వారికి బానిసలమై యుండి యట్లు వంచింపఁ దలంచుటయు, హీనోక్తులఁ బల్కుటయు నుచితంబగునా! అయ్యా! వీరయ్యా! ఇఁకమీఁద నెప్పుడును నట్లు చేయఁబోకుము. పాపపుఁబనులను మనస్సునందును దలంపకుము.

వీరఁడు—అర్తే అన్నా! నీమన్సు. కోసి బాగా లెయ్యి. పొద్దు పోతావుండాది.

(హరిశ్చంద్రుఁడు కోసినదానిని పంతులు వేయుచున్నాఁడు. పని తీఱఁగానే వేఱువేఱుగాఁ గావడియం దుంచి యెత్తుకొనుచున్నాఁడు.)

వీరఁడు—అన్నా! నువ్విణ్ణే వుండు. నా నెత్తిగెల్లి యిచ్చే సాస్తా.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అట్లు వలదు. నేనే మోచికొని వచ్చెదను. నీవును వెంటనే రమ్ము. మనమిద్దఱమును యజమానుల కొప్పగించి వత్తము.

(హరిశ్చంద్రుఁడు కావడి మూఁపున కెత్తుకొని ముందు నడుచుచుండఁగా వీరఁడు వెనుకనుండి వచ్చుచున్నాఁడు.)

వీరబాహువు—ఇద్గో అశ్శండూ! అంతా అయినాదా? ఒబ్బిడి నేసి నావాఁ కన్నా, నేతికట్టూ పదిలంగా ధాసుంచినావు గందా?

హరిశ్చంద్రుఁడు—అన్నియు నున్నవి. ఒక్కటియును దగ్గలేదు.

వీరబాహువు—అలాగయితే యీడెక్కేసియ్యయ్యా! మీఁదోఁ బిడోచ్చి యెత్తుకెల్తాది. నువ్వెల్లి మసానంకాడికి యేణ్ణుంచైనా పీనగలొచ్చున్నాయేమో సూడు. ఆ డోరన్నా నేకుంతే దొరోళ్లు సూసినారంటే శానాకోపం సేసుకుంతారు. యెల్లు. యీరిగా! నువ్వెల్లి మాయీరిగుంట నంటేసుగురా.

(హరిశ్చంద్రుఁడు మరలుచున్నాఁడు. వీరఁడు పరుగిడువానివలెఁ గొంతవఱ కావలకుఁ బోయి హరిశ్చంద్రుఁడు కన్నుమేరదవ్వు దాఁటఁగానే మరలి వీరబాహునియొద్దకు వచ్చుచున్నాఁడు.)

వీరబాహువు—వీరా! హరిశ్చంద్రునిసంగతి యెట్లున్నది? మునీంద్రుల యత్నమేమాత్రమయినను ముందునకు వచ్చునట్లున్నదా?

వీరఁడు—ముందునకేమి వచ్చుటయేమి? నే నెంతో ప్రయత్నించి చూచితిని. కాని యణుమాత్రమయినను నాతనిఁ జలింపఁజేయుటకు నావలన సాధ్యపడినది గాదు. ఆదూడను గోయునపుడు చూచుచుండునామనస్సు మిగులఁ బరితపింపఁదొడఁగినది. పాప మారాజు తనదుఃఖమంతయు లోలోపలనే యిముడ్చుకొని సత్యమే యూఁతగాఁ గొని నేను జెప్పినచొప్పుననే కోఁత గోయుచుఁ దానుజేయవలసిన దంతయు నంతసేపులో ముగించెను. ఆపిత్తకోశము నాకిమ్మని యెన్నివిధములుగనో యడిగి చూచితిని. నాప్రయత్నము కొనసాగలేదు. వేయేల? అసత్యమే జీవనముగాఁగలవాని నెవ్వనినైన నాతనియొద్ద రెండుదినంబు లుంచినచో వానియాకృతి నంతనుం గూడ సత్యవిగ్రహముగా మార్చివైచుసామర్థ్యము గలవాఁడుగాని సామాన్యుఁడు గాఁడు. సత్యప్రవర్తనంబున కేమాత్రము విరుద్ధముగాఁ జెప్పినను వెంటనే యెత్తిపొడిచినట్లు బదులు చెప్పుచుండును.



ఈ దూడను గోయుటను సహింపఁజాలక వెనుదీసినచో దాస్యపత్త్రంబునకు విరుద్ధముగా నడచికొనె నని నిర్బంధపెట్టవచ్చు నని భావించి యీయూరంతయు వెదకుచుఁ దిరిగితిరిగి తుద కొకచండాలునియొద్దకుఁ బోయి యైదుదీనారంబు లొసంగి చచ్చిన యీదూడను గొని మఱియొకనిష్కము వాని కిచ్చి దానిం గోయువిధమంతయుఁ దెలిసికొంటిని. అందువలనఁ గలిగినప్రయోజన మేమున్నది? ఇటుమీఁద నతనిని బరీక్షించుట నిష్ప్రయోజనంబే యని తలంచుచున్నాను. మీరు సూచినంతవఱకెట్లుండెడివాఁడో చెప్పుఁడు.

వీరబాహువు—ఔనౌను. నిజమే. నే నాయనను బిలుచుకొని వచ్చునపుడు దారిలో "నాభార్య మహాకోపిని పదివేలు నిష్కములిచ్చికొన్నా నని చెప్పినచో మిగుల మండిపడును. కాఁబట్టి యొక్కవేయి నిష్కములే యిచ్చికొన్నట్లు సెప్పెదను. ఒకవేళ నిన్నడిగినచో నీవును నట్లే యని చెప్పుము" అని యనేకవిధములుగా బోధించి చూచితిని. కాని దాని కించుకేనియు నొడంబడకపోవుటటుండ మీఁదు మిక్కిలి నాకే బుద్ధులు చెప్ప మొదలుపెట్టినాఁడు. ఎట్టివారినైనను సన్మార్గప్రవర్తకులనుగాఁ జేయుచున్నాఁడు. ఈయన చిత్తమును జలింపఁజేయుటకు సర్వేశ్వరుఁడైనను జాలఁడనుచో నిఁక మునీశ్వరుఁ డనఁగా నెంత? మునీశ్వరుల కపజయ మెట్లును దప్పదు. వసిష్ఠులవారి శిష్యులతో వాదించిన మనముగూడ నోరుమూసికొని పడి యుండవలసినవారమే. ఈయన కింతటిస్థైర్యమే లేకున్నచో వసిష్ఠముని యట్లు మాట్లాడునురా? అందును వారి వీరియెదుటం గాదు. దేవేంద్రునంతటివానిసభలో, ఇఁక నేమిసేయవచ్చును? అందులకై చాల నీచమగు నీతలారివేసము వైచికొంటిమి. ఇంకను గొఱఁత లేకుండ నన్నియుఁ జేసి చూచి మఱియు వదలు

దము. మునీశ్వరు లింకేమేమి సేయుదురో చూతము. నీవు పోయి యాయనతోడనే యుండుము. నేనును ముందుసంగతి యాలోచించుచుందును.

(అని నిష్క్రమించిరి.)

ఇది పంచమరంగము.

~~~~~~~~

## షష్ఠరంగము.

స్థలము : కాలకంఠునిగృహము.

కాలము : పగలు.

పాత్రములు : కాలకంఠి, భాగీరథి, కాలకంఠుఁడు, దేవదాసుఁడు, చంద్రమతి.

(కాలకంఠి తనమగనిరాక కెదురుచూచుచుండును. అప్పుడు పొరుగింటి భాగీరథి యడుగుచున్నది.)

---

భాగీరథి—ఒసే కాలకంఠీ! అదేమిటే అది. అస్తమానం వాకట్లోకీ యింట్లోకీ రావడం పోవడంతోనే సరిపోతూ వున్నాదీ?

కాలకంఠి—ఒసే భాగీరథీ చూశావుషే మాయింటాయనసంగతి యెలా వుందో? అప్పుడనగా పోయి యింకా రావడంలేదే. యీబ్రాహ్మడెక్కడికి పోతాడో గాని “అయ్యో! పాపం యింట్లో పెళ్లాం ఒక్కర్తీ బిక్కుబిక్కుమని వుంటుందని కొంచెమయినా తోచదుగంబోలునే.

భాగీరథి—ఒసే యెందుకు చెప్తావూ? మొగాళ్ల దండరిదీ రాయిలాటి మనుసే. మాయింటాయనసంగతి చూస్తూన్నావు గావూ. ఆయనా యిలాగే చేస్తూవుంటారు. అదుగో ఆవస్తున్నాయన వైఖరి చూడగా మీయింటాయనలాగే కనబడుతూ వున్నాది.



కాలకంఠి—ఔనే ఆయనమాయింటాయినేనే. కూడా యెవరోగాని వస్తున్నారే. ఎవరు చెప్మా ఓ ఆడమనిషీ, ఓ పిల్లాడూనూ, ఇంక నువ్వింటికెళిపో. నేనుగూడా లోపలికిపోతా. గడపలో వుండడం చూస్తే ఆరుస్తాడు. (అని యథోక్తముగాఁ జేయుదురు.)

(తరువాతఁ గాలకంఠుఁడు, చంద్రమతి, దేవదాసుఁడును ప్రవేశించుచున్నారు.)

కాలకంఠుఁడు—(వీథితలుపు తట్టుచు) ఔనే! ఒసేవ్. యేమే యెంత పిలుస్తూ వున్నా తలుపు తియ్యవేఁమే.

కాలకంఠి—(తలుపు తెఱచి) పొద్దస్తమానం నన్నొక్కర్తినీ యిలా విడిచిపెట్టి మీమానాన్ని మీరు పోతూ వుంటే నావొక్కర్తికీ యెలా పొద్దుపోతుం దనుకున్నారేవిఁటి? ఓనాడా రెణ్ణాళ్లా రోజూ మీకిదే పన్లా వున్నాది లెండి. బాగానే వున్నాది.

కాలకంఠుఁడు—ఒసే యెందుకే యింటిగొచ్చేటప్పటికీలా కేకలేస్తావూ? యిలారావే. మాటచెప్తానూ.

కాలకంఠి—ఇదుగో వస్తున్నాను. వీళ్లిద్దరూ యెవరూ? ఆవునీ దూణ్ణీ యీడుచుగొచ్చి నట్టీడుచుగొచ్చారు?

కాలకంఠుఁడు—కాదే నీకోసమే వీళ్లని కొనుక్కొచ్చానే.

కాలకంఠి—వీళ్లెందుకూ నాకు. అదేమిటోగాని యింటికొచ్చిందగ్గిర్నుంచీ చిత్రవిచిత్రంగా మాట్లాడుతున్నారేవిఁటి?

కాలకంఠుఁడు—ఓసి వెఱ్ఱిదానా! చిత్తరాల కేముంది విచిత్తరాల కేముందే? యింట్లో నీవొక్కర్తికీ కష్టంగా వుంచుందనే కావలసిన పన్లు చేస్తూ నీకు తోడుగావుంచుందని కొనుక్కొచ్చాను.

కాలకంఠి—అదేమిటండీ అలా అంఛారూ? నాకు వీళ్లేమి పనిచెయ్యాలి? ఓనాటికోనా డీబ్రాహ్మడికి మతిపోతూంది గంబోలు. ఆవున్నసొమ్ము రొంతా తగలబెట్టి కొనుక్కొచ్చారా యేవిఁటి?
~~~~~~~~

కాలకంఠుఁడు—అలా యేమీ తగలెయ్యలేదు సొలపంగా నేయిచ్చి కొనుక్కొచ్చానే.

కాలకంఠి—(చంద్రమతివంకఁదిరిగి) ఔనే ఒసేవ్ నిజంగా చెప్పూ! యెంతిచ్చి నిన్నుకొన్నారో.

చంద్రమతి—అమ్మా! మే మొకరికి నూఱులక్షల నిష్కము లప్పుపడితిమి. ఆధన మిచ్చి వీరు మమ్ముల నిద్దఱను బానిసలంగాఁ గొన్నారు.

కాలకంఠి—అయ్యో! అయ్యో! మీబుద్ధి బుగ్గిగానూ? యిలాగ్గూడా మతిపోతున్నాదేం. నాకడుపులో చిచ్చెట్టినట్లాగ మండిపోతూందమ్మో! అదేవఁమ్మో యీబ్రాహ్మడి కిలా వెఱ్ఱెత్తుతున్నాదీ! ఇదేవఁమ్మో! సొమ్మంటే యితడికి కొంచెంకాకపోతే కొంచెవ్వూఁ లక్ష్యంలేకుండా వున్నాదీ? మన్ననుకున్నాడో యేవుఁటో. వీధులో పాతరేసున్నాదా దొడ్లో చెట్టుగానీ వున్నాదనుకున్నాఁడా? యెన్నాళ్లు పిడికిలమ్మికూడపెట్టానే, యెన్నాళ్ళనుంచి బొగ్గులమ్మి కూడపెడుతున్నానే, వోటికి రెండుగా నీళ్లు కలిపినచల్లమ్మి పాలమ్మి నేను కూడపెడుతూంటే ఆసొమ్మంతా గుమ్మరించి వొచ్చాడే అమ్మో! యింక నేనేం చేదునే మాతల్లీ! నీకేం వెఱ్ఱిగానీయెత్తిందా? యేంమాట్లాడవు. నీజిమ్మ పడిపోయిందా? కాపరం యెలాకాలిస్తే నాకేం, అయ్యో నాకాపరవాఁ? నాకేం దారమ్మో! యిలాటి మొగుణ్ణాకెక్కడ దాపరించాడే దేవుఁడా?*

కాలకంఠుఁడు—ఒసేవు అలాకాదే నామాట వినే. కోప్పడకే. నీకు నష్టం గలిగీపని నేనుమాత్తరం చేస్తాననుకున్నావుషే. యేమో అంఛావే. యిది పేడ పిసిగి పిడికిలు పెడుతుంది. ధాన్యం దంపుతుంది. యిల్లూ వాకలీ తుడుస్తుంది. నీళ్లు జల్లుతుంది, ముగ్గెడుతుంది. పాలు పితుగుతుంది. చల్ల చేస్తుంది. నీకూసుపోయీలాగ కథల్చెపుతూ వుంఛుంది. యింకా యేమేమో చేస్తూవుంఛుంది.



కాలకంఠి—అయితే సరే గాని యీగుంటడుకూడా యెందుకూ తిండి దండుకాక వీణ్ణోగణ్ణికూడా కొనుక్కొచ్చారు?

కాలకంఠుఁడు—అలాకాదే, యేమిటలా రుంజుకుంఛావు? కొంచెం శాంతంగా వింటే చెబుదును. ఆపిల్లాడు అడివికి పోతాడు, కావలసినన్ని మావిఁడాకులూ, ధర్భా, సమిదెలూ, మఱ్ఱాకులూ తీసుగొస్తూవుంఛాడు. నాకు చెయ్యీకాలూ నొప్పెడితే పిసుగుతాడు. మన ఆవునీ దూణ్ణీ మేపుగొస్తూవుంఛాడు. యింతాలోచనమీద నేను కొనుక్కొస్తే నువ్వారికే నోటిగొచ్చినట్టల్లా ఆరుస్తావు బాగుందీ!

కాలకంఠి—ఆలా అయితే సరేలెండి. వూరికే అంఛానే గాని మీరు మాత్రం కళ్లు మూసుగొని డబ్బంతా తగలబెడతారా యేవిఁటి తేశే తెచ్చారు. పడుంఛాకు వుణ్ణియ్యండి. వీళ్ల పేరేవిఁటి?

కాలకంఠుఁడు—దీనిపేరేవచ్చి మరి దీనిపేరా, ఆఁ జ్ఞాపకం వొచ్చింది. చంద్రమతి. ఆపిల్లాడిపేరు దేవదాసుఁడు.

కాలకంఠి—అదేవుఁటో నాకంతపెద్దపేరు నోటపట్టదు. మరేవచ్చి దాన్నిమాత్రం చెంద్రీ! అని పిలుస్తూవుంఛాను. వీణ్ణిమీకు తోచినట్టల్లా పిల్చుగోండి.

కాలకంఠుఁడు—నేను వీణ్ణి "దాసా" అని పిలుస్తూవుంఛాను. దానికేంలే. వాళ్లు మనబానిసిలే కనక యెలాపిల్చినా పిలవ్వొచ్చున్లే.

చంద్రమతి—స్వామీ! తమయిష్టము వచ్చినచొప్పుననే పిలుచుచుండ వచ్చును లెండు. అమ్మా! మీరు మానాయనగారిమీఁద నట్లు కోపపడఁ దగునా? మీరు కాలితోఁ జూపినపని నేను జేతులతోఁ జేయుచుఁ దమరు దయయుంచి పెట్టినది ప్రీతిపూర్వకముగా భుజించి పడి యుందుము. తల్లీ! దాసురాలు సేయఁదగినపనులు చెప్పిన యెడలఁ బ్రతిదినమును జేయుచుందును.

కాలకంఠి—ఇదేవిఁటమ్మా యిదింతపొందిగ్గా మాట్లాడుతూవున్నాదీ? యెక్కణ్ణేర్చుగున్నాదోగానీ, యేమే చెంద్రీ నువ్వు చెప్పే. మీ దేవ్రూరో యెవరో యేవిటో మీసంగతంతాను.

చంద్రమతి—అమ్మా! మాకొఱగాము లేమని విన్నవింపఁగలను!

కాలకంఠి—పోనిస్తూ కొఱలేకుండా యెవరుండగలర్లే చెబుదూ వింఛాను.

చంద్రమతి—అమ్మా! దాసురా లయోధ్యాధిపతియొక్క ధర్మపత్ని. రాజ్యము మొదలగు మావైభవమంతయు నొకమునీంద్రులకు దానముచేసితిమి. అదిగాక వారికిఁ జెల్లింపఁ బూటపడియున్న మఱికొంతధనము చెల్లింపవలసి యీపట్టనమునకు వచ్చి తమకు దాసులమై యీయప్పు దీర్చుకొంటిమి. ఇదియే మావృత్తాంతము. ఎందుల కడిగెదరు తల్లీ?

కాలకంఠి—అయ్యో! అలాగనా? అయోధ్ధిరాజంటే హరిచ్చందుడు గాడూ?

చంద్రమతి—(దుఃఖముతోఁ దలవంచికొని) అమ్మా! వారే యీదాసురాలిపెనిమిటి.

దేవదాసుఁడు—అమ్మా! ఇప్పుడు వారు చెప్పినది బాబయ్యగారిపేరే కాదఁటే. బాబయ్యగారి దగ్గరకు పోదాం రా.

కాలంకంఠి—విన్నావుగదా యీకుట్టికక్కగట్టు చెప్పింది. యెలావుందో చూశావా? అబ్బనిగాదా వెతుకుతాడు. బాగానే వున్నాది. ఒరే గుంటడా! బాబయ్యా గీబయ్యా అని యిక్కడెప్పుడూ అనబోకుమీ. జాగర్త తెలిసిందా?

దేవదాసుఁడు—(భయముచే వణఁకుచు) లేదు. లేదు. అమ్మా! యింకెప్పుడూ అనను.



చంద్రమతి—నాయనా! దేవదాసా! ఇఁక బాబయ్యగారిని దలఁచుకోకు. అమ్మా! బిడ్డఁ డెన్నఁడును దండ్రి నెడఁబాసినవాఁడు గాఁడు. కోపింపకుఁడు. ఇఁక రెండుమూఁడుదినములలోనే మఱచిపోవును.

కాలకంఠుఁడు—అదిగాదే. ఒసీ చెంద్రీ! యేమో పిల్లాడు గదా అని కొంచెం బెదిరిస్తే యింతట్లోకే అప్పిడే శిఫారుసు చెయ్యొచ్చావూ! బానిసయినపిల్లాడికి శిఫారుసేవిఁటే. తల్లెక్కడ? తండ్రెక్కడ? యీమీ దిలాటితారుమారుమాట లాడబోకేం. ఆవిడి కెదురు చెప్పకుండా గదా మీరుండాలి.

చంద్రమతి—స్వామీ! అలాగుననే అమ్మగారియాజ్ఞ కణుమాత్రమైన నతిక్రమింపక నడుచుకొనియెదము. మన్నింపవలయును. అమ్మా! దాసురాలి కేమియాజ్ఞ? ఏయేపనులు సేయవలయును? సెలవిత్తురుగాక. సిద్ధముగా నున్నారము.

కాలకంఠి—ఒసీ చెంద్రీ! బ్రామ్మర్లింట్లో యేంపల్లుంఛాయే. పొద్దుపొడవకమునుపే లేచీదీ ముంగిలి వూడిచీదీ ప్రాస్నిళ్లు జల్లీది ముగ్గ్రేసీదీ ఆతరవాతనేవచ్చి ఆవుకట్టు మొదట పెంటా గింటా తొక్కూ తోలూ లేకుండా వూడిచి సుబ్బరం చేసీది, అక్కడిపేడంతా వోచోట కూడేసీదీ ఆపేడ పిసిగి పిడికిలు పెట్టీదీ, మరేవచ్చి ఆమీద గోలిన్నిండా యిన్నినీళ్లూ కడుగూ చిట్టూ తవుడూ పోసీదీ కొంచెం వొడ్లు దంచి బియ్యం చేసి సుబ్బరంగా చెరిగి పెట్టీదీ, పాలు పితికీదీ, కూరగాయలతోటోటున్నాది. ఆతోట్లోకి వెళ్లి దినం విడిచి దినం మొక్కలకీ పాదులకీ నీళ్లు తోడిపోసీది పొలంలోకెళ్లి పసరానికింతగడ్డి గోక్కొచ్చీదీ. ఆ మీద నింట్లో కలిగిందింతగంజో కడుగో తాగీది కుంపటికుదుర్లా కూచునీదిన్నీ. యింతేనమ్మా నువ్వు చెయ్యవలసినపల్లు. శూద్దరాళ్లయింట్లోలాగ పొలం గిలం వెళ్ళాలా?

పొలంలో కలుపూ గాదం తియ్యాలా? యింట్లో పొద్దుగుఁకులూ పల్లూ పాటలూ చెయ్యాలా యేవేఁనేనా!

చంద్రమతి—అమ్మా! యెట్టిపని యైనను గొంచెమేనియు వంచనగాని సోమరితనముగాని లేకుండ సేవ సేయుటకు సిద్ధముగాఁ గాచుకొనియే యున్నాను.

కాలకంఠుఁడు—ఔనే వోసేవ్ కాలకంఠీ! యేవేఁ చెంద్రికి చెప్పవలసిన పల్లన్నీ చెప్పేవా లేదా?

కాలకంఠి—పల్లు పల్లంఛారుగాని యేవుఁన్నాయి మనింట్లో వూరికే పల్లు. వున్నవేమో చెప్పనే చెప్పేను.

కాలకంఠుఁడు—ఆపిల్లాడు చెయ్యవలసినపల్లుకూడా చెప్పి శావుగావూ మఱీ.

కాలకంఠి—పిల్లాడు చెయ్యడానికిమాత్తర వేఁంపల్లున్నా యూరికే. పొద్దున్నే లేచాపసరాల్ని పొలంలోకి తోలుకుపోయి కడుపారా మెయ్యనిచ్చి యింటికి తోలుకొచ్చి కట్టెయ్యడం తప్ప. యింతే గాదూ? యింతకన్నా మనింట్లోయేం పల్లుంఛాయి? మనింట్లో బిడ్డాపాపా లేదుగందా? యింత మనింట్లోకలిగింది తింఛాడు వోమూల పడుంఛాడు.

చంద్రమతి—అమ్మా! వీఁడు మిక్కిలి యర్భకుఁడు. వీనిని మీరుగాకింకెవ్వరిచ్చట నాదరించువారు? తల్లి యయినను మీరే తండ్రి యయినను మీరే.

కాలకంఠి—మంచిదేలే చెంద్రీ! యీలాటిబెల్లింపుమాట లలావుణ్ణీ. అవి శేపటికి పనికొస్తాయి దాచు. యీషుంగారపకట్ట తీసుగుని ముందాత్తే వీధివాకలి చక్కా చిమ్మి నీళ్లు చల్లి ముగ్గురేసి మరీరా.

చంద్రమతి—అమ్మా! అట్లే చేయుచున్నాను. (చీఁపురు పట్టుకొని యూడ్చుచునే తనలో) హా! దైవమా! యిదియు నీచిద్విలాసమే



కదా! సకలమతంబులును, సమస్తశాస్త్రంబులును "సత్యము సర్వశ్రేయము" అనువిషయమై యైక్యమును వహించుచున్నవి. అట్టిసత్యమునే మేము ముఖ్యసహాయమ్ముగా నమ్మి యున్న వారము. ఇట్టి మేము పురుషుఁ డొక్కదిక్కునను, స్త్రీ యింకొక్కదిక్కునను గా నెడఁబాటు నొంది దుఃఖపడుచుండుటకుఁ దొలుతటిజన్మంబులం దెటువంటిచెడుపనులు చేసియుంటిమో కదా! అహో! విధీ! యీచీఁపురుకట్ట చేతఁబట్టి యిట్టుల నీవీథి యూడువవలయు ననియు నానుదుట వ్రాసితివిగా! ఆగర్భశ్రీమంతురాల నైననేను, కష్ట మననెట్టిదో యణుమాత్రమైన నెఱుంగనినేను, ఒకరింట బానిసనైతెను గావలసివచ్చినది గదా! సంపన్నులయిండ్లఁ బుట్టినబాలికామణులు ధనాధిక్యమ్మునంజేసి ముద్దుముచ్చటల కాస్పదురాలయి సోమరితనముతోఁ గాలము గడుపరాదు. కట్టా! యేమి చేయుదును? యీ మాత్రపుఁబనికే దేహమంతయు నొచ్చుచున్నది. అన్నా! నడుము పడిపోవుచున్నట్లున్నది. చేతులు తీపు లెత్తుచున్నవి. శరీరము నొచ్చుచున్న దనినచో స్వామిచ్చి కొన్నవా రూరకుందురా? ఏమిచేయవచ్చును? మొదట రెండుమూఁడుదినములదాఁక నిట్లే యుండును. పిమ్మట నలవాటుపడును. అహహా! యీఁచీఁపురుకట్ట చేతితోఁ బట్టుకొన్నంతమాత్రముననే యఱచేతులు మండుచున్నవి. హా! విశ్వేశ్వరా! పగవారికైన నిట్టికష్టములు గలుగ కుండుఁగాక. హా! దయామయా! నీవిలాస మిట్లున్నది గదా!

కాలకంఠి—ఔనే వోసీ చెంద్రీ! అదేవేఁ అయితే ఆవాకల్రోంతా తుడిచి రావడానికేంటే యింతసేపూ! బాగానే వున్నాది. యిలా పల్లు చేస్తూంటే గబగబే అవుతాయి. నేనైతే యింతసేపనుకున్నావా యేవిఁటి నిమిషంలో యెంతయినా తుడిచీసొద్దును.

చంద్రమతి—అమ్మా! యీదినమే నేను బనులు సేయుటకుఁ బ్రారంభము. ఇఁక రెండుమూఁడుదినములలో నభ్యాస మగును. అంతవఱకును దాసురాలిని గొంచెము మన్నింపవలయును.

కాలకంఠి—తొలీనాడే యిలా చేస్తే మాయింటాయనూరుకోరునుమా! యిది బాగా లేదు. ఆపిల్లాడి కేదైనా పనిచెప్పఁబోతే వాఁడు చిన్నవాఁ డంచావు. మాకు కొవ్వెండి మీకేజన్మాన్కో అచ్చున్నట్టు బోలెడుసొమ్ము మీనెత్తిమీద గుమ్మరించి కొనుక్కున్నాం. చేస్తివా చెప్పినట్టల్లా పనిచెయ్యి లేకుంటే మాసొమ్ము మా మొఘాన్ని కొట్టి నీఖర్మాన్ని నువులేచి చక్కా వెళ్లు. అదేవోఁ పో. యింక నీయిష్టం ఆయనిష్టం. నావల్లగాదమ్మా!

చంద్రమతి—అమ్మా! కోపింపవలదు. ఇంకను జేయవలసినపను లున్నచో సెలవిత్తురుగాక. దాసురాలు చేయుటకు సిద్ధముగా నున్నది.

కాలకంఠి—అలాయితే సరేలే. అల్లా ఆవుకట్టుమొదటి కెళ్లి చక్కా తుడిచి పేడంతా వోచోటికి పోగుచేసి బాగా పిసిగి మరీపిడికి లెట్టు. జాగర్తా సుమా, ఆపిడికిలు మనింట్లోకొక్కాదు. యెవరికేనా కావలిస్తే అమ్మడానికి. చూడూ చెంద్రీ! పేడచక్కా పిసిగి వుస్తికాయంత లేసి వుండలుచేసి జల్లెడంతంత పిడికిలు పెట్టూ! భూమ్మీదనే పెట్టుగాని గోడకంటించకుమా? యెండగానే విఱిగిపోకుండా తీసెత్తి పెడదాం.

చంద్రమతి—అమ్మా! సాధ్యము కానిపనులు చేయుమని సెలవిచ్చినచో దాసురా లేమిచేయఁగలదు?

కాలకంఠి—ఔనే వొసీ చెంద్రీ! యేం కానిపని చెప్పేనే నీకూ? అంత మాత్తరం బానిసిపడ్డవాళ్ళు చీఁపురుగట్ట పట్టుగుని తుడవకూడదా? పిడికిలు పెట్టకూడదా? పనికొప్పగున్నవా ళ్ళదీ యిదీ అన్నమా



టేమీఁటి? యేపన్జెప్పినా యెదురు చెప్పకుండా చేస్తారు. నేనెక్కడా చూళ్ళేదమ్మా యిలాటిదాన్ని. డబ్బిచ్చితద్దినం కొంతెచ్చుగున్నట్టుంది. ఆపాడుబ్రామ్మడికి శాస్తి కావలిసిందేను. వోటా రెండా చేటతో చాటెడువరాలు దీనియెథాన్ని గొట్టి యీపాడుముండా పీడని కొని తెచ్చాడు. నాకడు బ్భగ్గుని మండిపోతూ వున్నాది.

కాలకంఠుఁడు—యేమిటే అస్తమానం వూరూరికే అలాతిట్టిపోస్తావూ? యేంసంగతి? నీకు మంచిదే గదా చేశాను. యెందుకూ అలా నాలిక పీక్కుంటావు?

కాలకంఠి—ఆహా! నాకు సాయం వుంచుందని కొనుక్కొచ్చారే దాని యేడుపు వినండి. వీధివాకలి తుడిచి పిడికిలు పెట్టవే అన్నాను. కానిపని చెబితే యెలాచేసీ దంటున్నాది. అదేంకానిపనో దాన్ని మీరే అడగండి.

కాలకంఠుఁడు—ఔనే వొసి చెంద్రీ!

చంద్రమతి—ఏమి సెలవు స్వామీ!

కాలకంఠుఁడు—అదేవేఁ ఆలా అంచున్నావమ? దానికేం గాని యింట్లోపనికత్తిగా వుంటే చీపురుగట్ట పట్టుగుని వాకలీ వూడచక పేడ పిడికిలూ పెట్టక గుండిలుమొయ్యా మింగి కూచోడవఁనుకున్నావా యేం. యిదంతా చెయ్యాల్నేకదా చీట్లో రాసుంది. రానేడప్పుడిదంతా చెప్పలేదనేనా చెప్పీ. పోయినసొమ్ము పోనేపోయింది.

చంద్రమతి—స్వామీ! నిష్కారణముగా దాసురాలిపైఁ గోపింపకుఁడు. నేను వాఁకిలి తుడుచుటగాని, పిడకలు తట్టుటగాని నావలనఁ గాదని విన్నవించుకొన్నదానను గాను. అమ్మగారు నా కుస్తికాయంతలేసి యుండలు చేసి జల్లెఁడంతంత పిడకలు పెట్టుమని యాజ్ఞాపించిరి. «అమ్మా! అది యసాధ్యపుఁబని. నే నెట్లు చేయఁగల నమ్మా»

యని మనవి చేసికొంటిని గాని మఱియొకవిధముగా నేదు రాడలేదు స్వామీ!

కాలకంఠుఁడు—ఆహాహా! యెలావుందిగదా అదిచెప్పడం నువ్వర్థం చేసుకోడమున్నా. కొంచికొంచెం అనడానికి గచ్చకాయంత అంది. ఇది నువ్వు వినలేదా యేవిఁటి? మనిషియేదైనా కావలిస్తే కొంచెంగా అనడానికి గచ్చకాయంతా వుస్తికాయంతా, నిమ్మకాయంతా అంచారే. అయ్యో! వెఱ్ఱిబాగుల్దానా? నీకు లోకవేఁ తెలియదూ!

చంద్రమతి—స్వామీ! యీలోకాభిరామము లగుమాటలు నేనును వినియున్నదానసే కాని జల్లెఁడంతంతపిడకలు పెట్టుటకు గుమ్మడికాయ యంతయుండ యున్ననుఁ జాలదు. అందులకై తాటికాయయంత యని చెప్పిన నది యొకమాదిరిగా నుండును గాని యుస్తికాయ యంత యన్న సరిపడునా? ఉస్తికాయకును గుమ్మడికాయకును నెంతతారతమ్యము గలదో తామే యోజింపుఁడు స్వామీ!

కాలకంఠుఁడు—చెంద్రీ! మీ అమ్మగారిసాభావం నీకు బాగా తెలియడం లేదు. అది మాటలుమాత్రం కఠినంగా మాట్లాడుతుంది. పెట్టవలసొచ్చినప్పుడు కడుపునిండా యింతతిండి పడేస్తుంది. దానికి లెక్కాపక్కా కూడా తెలియదు. ఊరికే నోటివట్టంమాటలాడి అరిచరిచి గయ్యాళిముండని పేరుబడ్డాది. దానితో యేమిల్లే. నువ్వెళ్ళి వాకలుడిచి పిడికిలు పెట్టు పోపో.

చంద్రమతి—స్వామీ! అటులనే చేయుచున్నాను. అమ్మా! పోయెదను.

కాలకంఠి—అదేవోఁ నాకు తెలియదమ్మా నువ్వు పోఛావో వుంఛావో? యిలా మొగాడు పనిదాన్ని వెనకేసుగొస్తే యింక వాళ్ళ కేంభయ వుండేను. యిలాయితే బాగానే వెలుగుతుంది కాపరం. యిది బాగుపడేకాపరం అయితేనా. యిదెలాగా తుదకారుమూడేను.



(చంద్రమతి వాఁకిలి తుడుచుటకుఁ బోవుచున్నది. కాలకంఠియుఁ గాలకంఠుఁడును రహస్యముగా మాటలాడుకొందురు.)

మిత్రమా! యీ చంద్రమతిని మన మెంతబాధపెట్టినను, ఆమె తనదృఢనిశ్చయమును విడుచునట్లు తోఁపదు. చెప్పినమాట కణుమాత్ర మయినను భ్రంశము లేకుండఁగనే నడుచుకొనుచున్నది. చూచితివా? సత్యాతిశయముపై దృష్టి యుంచి యుండువారినిశ్చయ పరిజ్ఞానమహిమ? మనమునిపుంగవుఁడు బాగుగా యోజింపక చేసిన ప్రతిజ్ఞకుఁ బ్రతిఫలంబుగ నిప్పు డెన్ని కష్టములు సంభవించుచున్నవో చూడుము. ఇతరులకష్టముల సంగతి యెట్లో యుండునుగాక. మన మునివరులకష్టమున కంతమే లేదు గదా! తుదకు మేకుఁ బెల్లగించినకోఁతికథ జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఏమో దీనిపరిణామము సంతోషాస్పదం బని నా కెంతమాత్రమును దోఁపదు.

కాలకంఠుఁడు—మిత్రమా! నీవు సెప్పినమాటలు నిజమే. అయినను మనముమాత్రము విసుగు చెందఁదగదు. "కార్య మారంభించినవారు విఘ్నములు గలుగునని భయంపడరాదు. దైవముమీఁదనే భారముంచి ప్రారంభించినచోఁ దుద కాకార్యము కష్టమాత్రమునకేని తగినకూలి యిచ్చును" అను న్యాయమును నమ్మి ప్రయాసపడి తీఱవలయును. సంసార మసార మని భావించి యనితరసాధ్యమైన జీవన్ముక్తిం గోరి తపోఽగ్నిజ్వాలాజాలంబులం గర్మప్రపంచమును భస్మీకరింప నుంకించుచున్నమనము గురుభగవానులవారి యనుమతి ననుసరించి వికృతంబుగ భార్యాభర్తలవేషము నవలంబించితిమి. తపశ్చర్యం గైకొన్నమన కీచర్య బాగుగనుండునా? బాగు గాని దానిఁ జేయఁ దగునా? ఇటువంటిజ్ఞానము గలిగియున్నను మనగురు భగవానులవారి ప్రతిజ్ఞను నెఱవేర్పఁదలంచి కదా యిచ్చోటునఁ

జేరితిమి. కనుక దీని నెట్లయినను సాధించియే తీఱవలయును. "యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్ర దోషః" అని కదా పెద్దలు సెప్పుదురు. ఆ హరిశ్చంద్రమహారాజునోరినుండి యసత్యాక్షరంబులు వెలువడకుండినను, చంద్రమతినోరినుండియేని వెలువడినం జాలును. అట్లు చేయఁగలిగితిమేని తప్పక విజయధ్వజము స్థాపించినవారలమే యగుదుము.

కాలకంఠి—చంద్రమతినోరినుండి యసత్యాక్షరమ్ములు వెలువడఁజేయఁ గలిగినంతమాత్రమున మనకెట్లు జయము లభించును?

కాలకంఠుఁడు—అయ్యో! నీకిదివఱకీన్యాయమే తెలియదా? పురుషులు చేసిన పాపములు స్త్రీల నంటవుగాని స్త్రీలు సేయుపాపములు తప్పక పురుషుల నంటును.

కాలకంఠి—అది యెట్లు? ఒకరు చేసినపాపము మఱొకరి కెట్లు చెందఁ గలదు.

కాలకంఠుఁడు—అది శాస్త్రవిహితము. దానికి న్యాయంబును గలదు. ప్రజలు చేసినపాపము రాజును, శిష్యులు చేసినపాపము గురువును, రాజు చేసినపాపము పురోహితునింగాని మంత్రినిగాని చెందినచందముననే భార్యచేఁ జేయఁబడినపాపము భర్తను జుట్టుకొనును.

కాలకంఠి—మిత్రమా! తెలియ కడుగుచున్నాను. ఏమికారణంబున నొకరుచేసినపాపము మఱొకరిని సంబంధించును?

కాలకంఠుఁడు—పైనిఁ జెప్పఁబడినవారలలో రాజేంద్రు నానతిచొప్పునఁ బ్రజలు నడువకుందురేని, గురూపదేశప్రకారముగా శిష్యుఁడు నడుచుకొనఁడేని, మంత్రిపురోహితులహితోక్తుల నాలించి మహీపాలకుండు సంచరింపఁడేని యతిక్రమణదోషమునకు బద్ధులయ్యెదరు. అట్లే భర్తృశాసనంబునకు భార్యయు నని యెఱుంగునది. కాఁబట్టి చేసినవారి కర్మఫలము చెప్పినవారి నాశ్రయించుచుండు ననుట యుక్తముగానే యున్నది. ఇదియే తద్విషయకమైన మర్మము.



కాలకంఠి—అట్లయినచోఁ జేయువారి సత్కర్మఫలముగూడఁ జెప్పువారి నాశ్రయించుంగదా!

కాలకంఠుఁడు—ఒక్క దుష్కర్ముల ఫలముమాత్రమే చేరుచుండును గాని సత్కర్ముల ఫలము చేరదు.

కాలకంఠి—అందులకు న్యాయంబేమి?

కాలకంఠుఁడు—లోకములోఁ దమ్ము నాశ్రయించినవారిని సత్కార్యాసక్తులనుగాఁ జేయవలయుననుట సజ్జనుల కవశ్యకర్తవ్యము. అందులకే కదా సామాన్యులుత్తముల నాశ్రయించుచుందురు. పెద్దలగువారు దమ్ము నుత్తమస్థితికిఁ దెత్తురనియే కదా చిన్నవాండ్రు వారిని సేవించుచుందురు. కాబట్టి సత్కర్ములఫల మాచరించువాండ్రనే యాశ్రయించును. దుష్కర్ములఫలమన్ననో "కర్తా కారయితా" యనున్యాయమునఁ జెప్పువారిని సగము చేయువారిని సగము నాశ్రయించుచుండును. ఈ న్యాయము ననుసరించిభార్య చేసినదోసమునుండి సగముదోసము భర్తకుఁ జేరుచుండును. కనుకఁ జంద్రమతియైనఁ గొంత దప్పి చరించినచో మనమే జయమును బొందినవార మగుదుము.

కాలకంఠి—సరి సరి, బాగుగనే యున్నది. ఇదియుఁ గొంతసహాయమే. అయిన నీ చంద్రమతినిమాత్ర మెట్లు దప్పి చరింపఁజేయఁగలుగుదుము? ఆమె హరిశ్చంద్రునిధర్మపత్ని గదా! నేను నాకాలమంతయు నడవులలోననే కడపితిని. లోకస్వభావ మిట్టిది యని తెలియదు. నీవన్ననో కొంతకాలమునకుముందు వచ్చి చేరితివి. నీకు లోకవృత్తమంతయునుం గాకున్నఁ గొంతయైనఁ దెలిసి యుండును.

అదిగాక నీవు మొదటినుండియు లోకజ్ఞానము గలవాఁడవు. లేకున్న నిట్టికార్యమునకు వలంతు లని యంపుదురా గురుభగవానులవారు? ఏవో నీవెఱిఁగిన తంత్రములం జెప్పుము. చాలసేపయినది. ఆమెను బాధ లొందింపఁ బోవలయును.

**కాలకంఠుఁడు**—హా! అదియే కూడనిపని. ఒకరి నధికముగా హింసింపరాదు. బాధలు పడుట యలవాటయినచో వెనుక వారల కాబాధలు బాధలుగాఁ దోఁపవు. వారు వానిని సుఖము లనియే భావించుచుందురు. మొట్టమొదటఁ జెఱసాలలో నుంపఁబడినవానికాస్థితి మిగుల భయావహముగా నుండును. అట్లు పలుమాఱు దటస్థించినచో వానికి మొదట నున్నంతభయ ముండక యొకవిధమున సహజమై కన్పట్టుచుండును. మనుష్యులకు సుఖదుఃఖములు మాఱిమాఱి వచ్చుచుండుటయుఁ గర్మములయొక్క చాతుర్యమే యనిపించుకొనును. కావుననే «గహనా కర్మణాం గతిః» అని పెద్దలు సెప్పుదురు. అది కారణముగాఁ దలపోసి, నీ వొకప్పుడు చంద్రమతియెడలఁ గటకటంబడినను మఱొకప్పుడు నిరుపమానంబుగ దయాళుత్వముం జూపుచుండునది. అట్టు లామెచేఁ బనిపాట్లు చేయించుకొనుచుండునట్లు ప్రవర్తింపుచుండుము. కనుక నిఁక నీ వామెయొద్దకుఁ బోయి పరితాపపడుచున్నదానివలె నటించుచుండుము. నేను వచ్చి తోఁటకు నీరు దోడు మందును. ఆమె చేతు లిప్పటికే చాలఁ గమలి యున్నవి. ఇంకను దాఁటినారత్రాటితో నీరు తోడుటకుఁ గష్టపడును. అపుడు నీవు సమీపవర్తినివై జాలి పడ్డట్టభినయించుచు «ఒశీచెంద్రీ! ఈపేళ కీ వల్ల కాటిపని చాలించే అమ్మా! రేపు చెయ్యొచ్చున్లే మించిపోయిందేవీఁ లేదు. అబ్రావ్మ డడిగితే అన్ని మొక్కలకీ, అన్ని పాదులకీ నీళ్లు తోడ్డం అయిందని చెప్పొచ్చున్లే» అని చెప్పుము. అప్పుడు బహుశః నీమాటలకు



లోఁబడవచ్చును. అదొక్కటియే మనకుఁ జాలును. ఇదియంతయు నామెయొద్ద నీవు మాటలాడుచాతుర్యమునందును, ఆమెవిషయమై నీవు చూపునక్కటికమునందును నున్నది. పొమ్ము పొమ్ము భద్రముగా నుండి యెట్లేని బొంకింపఁ బ్రయత్నించుచునే యుండుము.

**కాలకంఠి**—వీలయినంతలో నట్లే చేయుదును.

(నిష్క్రమించుచున్నది.)

చంద్రమతి—(వాకిలి తుడుచుచునే) హా! విధీ! యీదుర్వాసన నే నెట్లు సహింపఁగలను? చంపక మల్లీమరువక పారిజాతాదుల సువాసనాధిక్యంబువలని గాఢతకు నోర్వఁజాలని యీ నాఘ్రాణేంద్రియ మహో! నేఁ డిట్టిదుర్గంధము నాఘ్రాణింపవలసివచ్చినది. హేయభాజనం బయిన యీ యావుగట్టు మొదటఁ బేఁడ గూడ వైవఁగా నయినదిగదా! నాయదృష్టము. ఓహో! హతవిధీ! పూవులకై మాధవీలతికను వంచినంతమాత్రమున బాహులతికలు సత్త్వహీనంబులుగాను, పాణిపద్మంబు లరుణిమం జెందినవిగాను నుండెడినే నీకంటకితం బయినచీఁపురుకట్ట చేతఁబట్టుకొని యీ ప్రదేశంబంతయుఁ దుడిచి కసవు మొదలగున వొకయోరకుఁ బ్రోగు చేయవలసినదాన నైతిని. హా! సర్వేశ్వరా! ఆళీజనసహస్ర సంసేవితురాల నగుచు నంతఃపురములో నివసించు టెక్కడ? దుర్గంధభూయిష్ఠంబగు నీప్రదేశంబునఁ బరిచర్య సేయుచు మెలంగుదాస్య మెక్కడ? అక్కటా! విధీ! నే ననుభవించిన సౌఖ్యంబు లన్నియుఁ గలలోనివార్తలే కదా యయినవి? అదేమోకాని తలగిఱ్ఱుమని తిరుగుచున్నది. నడుము పడిపోవుచున్నది. చేతులు పడిపోవుచున్నట్లున్నవి. అహాహా? భగవంతుఁడా? నమ్మినవారి నిట్లు పరీక్షింపఁ దగునా! (పేఁడ యెత్తుచు) అక్కటా! చూచుటకుఁగూడ వీలుపడని యీపేఁడ యెట్లు చేతులతో స్పృశింపఁగలుగుదును? తిలక ముంచుకొనుటకై కస్తూరి మొద

లగువాని మెదవునవు డలసటను జెందు నాకరము లీపేఁడయుండలను జేయుటా? «అసూర్యంపశ్యారాజదారా» అనుసామెతగా మేడలపై హంసతూలికాతల్పంబునం బరుండి నిజనాథానులాలిత యగుపట్టమహిషియా యీపేఁడ యుండలు చేసి పిడకలు తట్టుట? కానిమ్ము. కస్తూరికాదుల మెదపిన నేమి? పేఁడ యుండలు చేసి పెంట లెత్తిన నేమి? సత్య మొక్కటిమాత్రము తప్పకుండినం జాలును. పరమేశ్వరా! పాలముంచినను నీళ్ళముంచినను నీదే భారముసుమా యని నమ్మి యున్నవారము.

(పేఁడ యుండలుచేసి పిడకలు తట్టుచున్నది.)

కాలకంఠి—యేవేఁ చంద్రమ్మా! పిడికిలు పెట్టడం అయిందిషే. పోనీ నీకంతకష్టంగా వుంటే చెప్పు పాపం నేనేనా సాయంచేస్తాను. ఆడదీ అనగానే తలవిరియబోసుకుని గెంతీ పిశాచమయినా జాలిపడుతుందిష గదా! ఆపాటీ చేశానుగానా యేవిఁటి నేను. నాకు పెథవఁకోపం కొంచెం వున్నాది. నాకు కోపంవస్తే మాత్రం మండిపడతానే గాని లేకపోతే నామన స్సెంతో మెత్తందిసుమా యేవఁనుకున్నావో? యింకా నాకు కొంచెం మనుషులమీద ఆశా పామరం యిలాటివన్నీ చాలా వున్నాయి. పాపం చాలాచాలా సంపత్తనభవించిన దానివి గదా నువ్వు. యిలాటిపల్లు చేసెరగవమ్మా నువ్వా? దొంగనుపట్టుగుని రాజులా చూడమంటే వాడిమొఘం వాడేవిఁటి చూస్తాడు? ఆలాగే నువ్వున్ను.

(కొంచెము దూరముగాఁ గూర్చుండును.)

చంద్రమతి—అమ్మా! ఇదిగోఁ జేసి ముగించుచున్నాను. ఆవుగట్టు మొదట నూడ్చితిని. అచ్చటికస వంతయు నొకమూరకుఁ జేర్చి పేఁడ పిసికి యుండలు చేసి పిడకలు చఱచుచున్నాను. అదియు ముఁడువంతులు ముగిసినది. ఇఁకఁ గొంచెము సేపులో మిగిలిన యుండలుగూడఁ జఱచి వచ్చెదను. దాసురాలుండఁగాఁ దమ కేల తల్లీ! శ్రమము.



కాలకంఠుఁడు—ఓసీ కాలకంఠీ! యేవేఁ దాంతో సవఁంగా కూచుని ఖులాసాగామాటలాడుతూవున్నావూ? ఔనే నీ కొంచెమైఁనా యింట్లోపల్లు కావాలని లేదా యేం. ఔనే ఓసీ చెంద్రీ!

చంద్రమతి—స్వామీ! యేమిసెలవు?

కాలకంఠుఁడు—యేవిఁచేస్తావే పొద్దస్తమానవుఁన్నూ? దినవఁంతా పిడికిలు పెట్టడంతోనే సరా యేవిఁటి? బాగానేవున్నాది.

చంద్రమతి—స్వామీ! ఇదిగో ముగిసినది. ఇఁక నొక్కరెండుమాత్రమే మిగిలి యున్నవి. అవికూడఁ బెట్టి వచ్చుచున్నాను.

కాలకంఠుఁడు—రెండే గదా వున్నాయి. సర్లే. అవి తట్టేసి ఆబిందిపట్టుగుపోయి పదిబిందిలనీళ్లు మాత్రం తోడి ఆపాదులకీ మొక్కలకీ పోసీ. మరేవచ్చి నీళ్లు లేక పాప మవన్నీ యెలా యెండిపోతున్నాయో చూడూ! ఆపిల్లాడేడీ నీకొడుకూ?

చంద్రమతి—స్వామీ! వీథిలో నాడుకొనుచున్నాఁడు. నేను బోయి తమ సెలవుప్రకారముగఁ జెట్లకు నీరు చేఁది పోసెదను.

కాలకంఠుఁడు—ఒసీ చెంద్రీ! ఆపిల్లాడూరికే ఆట్లాడి చెడిపోతూవున్నాడు. వాడిగ్గూడా యేదేనా పని చెబుతూ వుండరాదూ? ఊరికే కూచుని కుంభాలు చెల్లించడానికా మిమ్మల్ని కొన్నాం?

కాలకంఠి—బాగానే వున్నాది లెండి. అదేవిఁటి? వోనాటికోనాడలా రాయయిపోతూంది మీమనసు! పాపం చెంద్రి యెన్నిపల్లని చేస్తుంది? వణ్ణంకూడా తినొద్దన్నారా, యేవిఁటి? అయ్యో! పాపవాఁపిల్లాడుమాత్తర వేఁంపని చెయ్యగలడు? అదిగా కిప్పుడు

మనింట్లో యేంపల్లున్నాయి? అలా వాడిఖర్మా న్నాడుకుంటూ వుణ్ణియండి. అదేవోఁ గాని యెవరేనా వూరికే కూచుంటే మీకళ్ళు చిటచిటలాడుతాయి గంబోలు? బాగానే వున్నాది వోనాటి కోనాడు మీగుణం? యిన్నాళ్ళదాకా కాలకంఠి నలోమనేడింపించారు గందా! ఇప్పడిగ్గదా వీళ్ళిద్దరూ వల్లోపక్షుల్లాగ మీచేతుల్లో చిక్కేరు. యిఘను మీరెందు కూరుకుంఛారూ? మీ యిష్టం వొచ్చినట్టల్లా కాలుచుగు తినండి. అలోమని మీజీవానికి పడి యేడుస్తూ వుంఛారు.

కాలకంఠుఁడు—చెంద్రి తరవాత కుంభం రాదియ్యొచ్చున్లే మించిపోలేదు. ముందాత్తే మొక్కలకి నీళ్ళోసి రానీ. చెట్లన్నీ మలమల మాడి చక్కాపోతున్నాయి. ఆమీ న్నీ యిష్టం దానిష్టం.

(అని చెప్పి పోవుచున్నాఁడు.)

కాలకంఠి—(రహస్యముగా) ఒసే చంద్రమ్మా! ఆయనమాటలకేం లే యేదో వొగటి అంఘూనే వుంఛారు. మరేవచ్చి నువ్వు లేచి కాళ్లూ చేతులూ కడుక్కుని వణ్ణం తినమ్మా పాపం. ఆతరవాత నిమ్మళంగా మొక్కలకీ వాట్లకీ నీళ్లు తోడి ప్పొయ్యొచ్చున్లే. కావలసినంత పొద్దున్నాది. అప్పుడే యేం పుట్టిమునిగిపోయింది? ఆ మొక్కలేం పుయ్యాలా కాయాలా? ఆబ్రాహ్మ డూరికే «పూస్తాయి కాస్తాయి» అని యెదురుచూస్తూ వుంఛారు గాని యేదీ కనపడకుండా వుంది. నువ్వాలే మరి కాళ్ళూచేతులూ కడుక్కున్నా వణ్ణం తిందురుగాని.

చంద్రమతి—అమ్మా! మానాయనగారు చెప్పినమాట ధిక్కరింప వచ్చునా. మొదట వారు సెలవిచ్చినపనులుపూర్తి చేసి తరువాతను గదా రెండవపని చేయవలయును. మొక్కలకు నీరు పోసినపిదప భుజింపుమని వారును సెలవిచ్చియే యున్నారు గదా! పాపము వారు



సెలవిచ్చినట్లే మొక్కలును వాడి యున్నవి. కాఁబట్టి ముందుగా మొక్కలకు నీరు పోసి తరువాతనే భుజించెదను. ఈ లోఁగా బిడ్డనికిమాత్రము కొంచె మన్నము పెట్టింపుఁ డమ్మా! ఇంతలో నేనును బని పూర్తి చేసికొని వచ్చెదను.

కాలకంఠి—యేవేఁ వొసే చంద్రమ్మా! నువ్వు కొత్తదానివి. నీకు మా యింటాయనపెకురితి తెలియదు గాని నాక్కొత్త గాదుగందా! మరేవచ్చి ఆయ నెంతసేపూ వోపనిమీద మరోపని చెబుతూనే వుంఛారు. తనభోజనంమాత్రరవఁయితే చాలు. తతిమ్మావా ళ్ళేలా యేడిస్తే అయినక్కావాలి? అనుగో అక్కడ ఝూవాఁయి వణ్ణం పెట్టే వుంఛాను. పోయి తినిరా. ఆవెనక పోయి నీళ్ళు తోడుదువు గాని. యింతలో నేనుకూడా వచ్చి సాయం చేస్తాన్లే.

చంద్రమతి—అమ్మా! అట్లు వలదు. ఇఁకఁ గొంచెముసేపులో నేమి చెడిపోవును? నాయనగారి సెలవుప్రకారముగా నీళ్ళు పోసి వచ్చిన పిదపనే నేను భుజించెదను. అమ్మా! తాము నామేలుకొఱకుఁ బ్రేమపూర్వకముగాఁ జెప్పుచున్నమాటలు ధిక్కరించినట్లుమాత్రము భావింపకుందు రని కోరుచున్నాను. మానాయగారి యనుజ్ఞ నవజ్ఞపఱిచి చరింపరాదు గదా! మఱి.

కాలకంఠి—అయితే నీఖర్మం నేనేం చెయ్యగలను! యిది మంచి క్కాలం గాదు. నీకెలా తోస్తే అలాగే చెయ్యమ్మా నాకేవీఁ? నీవొంట్లో వున్నపచ్చినెత్తు రలా చేస్తుంది గాబోల్ను.

(చంద్రమతి బిందెకుఁ ద్రాడు గట్టి నీరు చేఁద బోయి లాగఁ జాలక తల్లడిల్లుచుఁ దొట్రుపాటుతో నొఱఁగుచుండును. అపుడు కాలకంఠి తొందరగా వచ్చి)

ఒసే చెంద్రీ! నీకు కొంచెం గాకపోతే కొంచెవూఁ బుద్ధున్నట్టు తోచదే. నే నప్పణ్ణుంచీ చెవి నిల్లుగట్టుకుని పోరినా నామాట

లక్ష్యపెట్టావు గావు. పాపం నీరసంచేత బిందిలాగలేకుండా వున్నావు. ఇదేంఖర్మవేఁ యిలాగ్గూడా వుంఘందిషే. యిలాటిమొండివాదం మానియ్యే. రావేఅమ్మా! నామాట వినిరా వణ్ణంతిను.

చంద్రమతి—అమ్మా! కోపపడవలదు. ఇదిగో వచ్చుచున్నాను. చేతులు నొప్పి యెత్తుచుండుటమాత్రము నిజమే. అయినను నింక నొకరెండు మూఁడుబిందెలనీరు చేఁదునప్పటికే యలవాటగును. పూనినపని తుదముట్టకుండ నెట్లు రావచ్చునమ్మా!

కాలంకంఠి—అయితే చెంద్రీ! అదేవిఁటే అలాటిమూర్ఖంపట్టూ? యింతమొండిపట్టు కూడన్నమా. వొద్దొద్దు. నామాట విను. వొచ్చి ఆవణ్ణంగోంతా తినేసి పో ''వణ్ణావోఁ ప్రాణావోఁ'' అంఘారు నువ్వు వినేలేదా యేవిఁటి పాపం. కడుపులో యింత పిండాకూడు పడందీ యెవళ్లూ కూచున్న దెగ్గిర్నుంచి లేవలేరు. అలాయితే నీయిష్టవఁమ్మా! వోబిందిణ్ణీళ్లు తోడ్డవఁయింది గందా! యింకేవిఁలే చాల్సు. మీబాబడిగితే తోడిపొయ్యేడ వఁయిందంటే తీరిపోఘుంది. రా యింక పోదాం, పాపం ఆపిల్లా డాకల్తో యేడుస్తున్నాడు. ఒసీ రా వేవేఁ నాకూ కాళ్లు నొప్పు లెత్తుతున్నా యమ్మా!

చంద్రమతి—అమ్మా! శాంతముగాఁ జిత్తగింతురేని మనవి చేసికొందును. ప్రాణము పోవునవస్థ తటస్థించినను సత్యము దప్పరాదు. మానాయనగా రన్నిటికిని నీరు చేఁది పోయు మని సెలవిచ్చి యున్నారు. ఇప్పు డొక్కబిందెఁడు నీళ్లు మాత్రమే పోసి యన్నింటికిని బోసితి నని చెప్పవచ్చునా? అది యసత్య మనిపించుకొనకుండునా? అసత్యము లాడి భూమిపై బ్రదికి యుండఁదగునా? ఇదిగో నమ్మా! అతివేగముగానే యన్నింటికిని నీరు దోడి పోసి వచ్చెదను. కొంచెము క్షమింపుఁ డమ్మా! దాసురాలి పట్టుదలను.



కాలకంఠి—నువ్వు చెడిపోతావు. నాబుద్ధితక్కువచేత నీకు చెబుతూ వున్నాను. నామాటంటే నీకొంచెపూఁ లక్ష్యం లేకపోయింది. అంతనామాటే నీకు లక్ష్యం లేకపోయాక నువ్వేలాపోతే నాకేం గావాలి. నీప్రాలుద్ధం.

(సగర్వముగా మరలి కాలకంఠునియొద్దకుఁ బోవుచున్నది.)

కాలకంఠుఁడు—ప్రియురాలా! మనప్రయత్న మేమాత్రమయినను ఫలోన్ముఖమునకు వచ్చున ట్లున్నదా?

కాలకంఠి—ఎక్కడిఫలము? యెక్కడియున్ముఖము? ఆమెమనస్సు చలించు ననుకొంటివా? ఆమె సామాన్యముగా స్త్రీ యన వలను పడదు. స్త్రీరూపమును ధరించి వచ్చిన సత్యాభిమానదేవత యని నమ్ముము. ఆమెచే నసత్యమాడించువా రెవరు? ఇంక వారిని జయించుట మనమునివరులచేతఁ గాదు గదా ఆబ్రహ్మదేవునిచేతనుగూడఁ గా దని ముమ్మాటికిని నమ్ముము. ఆమె తనప్రాణంబులనే యొక ప్రీతిపాత్రముగాఁ బరిగణింప లేదనుచో నింక నామె దేనికి లోఁగును? ఇఁక నీవే యేదైనను మఱొకప్రయత్న మాలోచింపుము.

కాలకంఠుఁడు—ప్రేయసీ! నే నీవిషయమం దంతగాఁ బ్రవేశింపరాదు. ఏమందువా? పురుషులు పరస్త్రీల డగ్గఱి మాటలాడుటయు మహాపాప మందురు. మఱియు రహస్యముగ హితము పల్కుచుండినను మఱింతపాపము చుట్టుకొనును. కావున స్త్రీలతో స్త్రీలే మాటలాడుచుండుట మంచిది. కావున నావిషయమై నీవే తగినప్రయత్న మాలోచింతువుగాక. మనసొంతపనులలో నామెను బ్రవేశింపఁజేసి తప్పొనరుచునట్లు చేయుటలోఁ బ్రయోజనము సుంతయుఁగానరాదయ్యెను. ఇతరులనిమిత్త మేపనులలోనైనను దప్పి నడుచునట్లు ప్రయత్నించినచో దాని కనుకూలించి నడుచునేమో యని తోఁచు

చున్నది. ఇఁకమీఁద నటుకూడఁ జేసి చూడుము. పిమ్మటిసంగతి యాలోచించుకొందము.

కాలకంఠి—అందులకై మనము సేయవలసిన దేమున్నది?

కాలకంఠుఁడు—ఇపుడు సూర్యాస్తమయ మయినది గదా! పాలు పిదికి యామె చూచుచుండఁగా నందులోఁ గొంచెము నీళ్ళు గలిపి యమ్మించుము. కొనవచ్చినవారితో "ఇప్పుడే పితికినపాలు" అని చెప్పుచుండు మనుము. అట్లు చెప్పుచుండు టందఱకును సహజమే. అందులకు[illegible]పడకుండ నున్నచో నావువెన్న పిల్లి తినిపోయినట్లు నటించి గేదెవెన్నయే యావువెన్న యని చెప్పులాగునఁ జేయుము. వాడుకప్రకారము మంత్రిగారియింటినుండి యావువెన్న దీసికొని పోవుటకై వచ్చినవానివలెనే నే నొకనిని సిద్ధముచేసి పంపెదను. అప్పు డావువెన్న గాదన్నచో మనబ్రదుకునకే హాని సంభవించు నని వ్యసనము నటించి యామెను వశపఱుచుకొని యట్లే మార్చి చెప్పునట్లు చేయుము. ఇది మిగుల సూక్ష్మ మయినయుపాయము. ఇందుల కామెయు జాగ్రత్త తప్ప వచ్చుననుకొనియెదను.

కాలకంఠి—ఔనౌను. ఇదియుఁ జక్కనియోజనలాగుననే కన్పట్టుచున్నది. మనకుఁ బొరపాటుగఁ జరింపవలయు నన్న వెనుదీయునే కాని మనమేలునుభావించి యొకానొకచిన్నపనియందు బ్రదుకుగొన సాఁగవలయు నని యెంచి తప్పి నడువవచ్చును. అందుల కామెయు సమ్మతింపవచ్చును. అట్లే చేసెదను.

కాలకంఠి—యేవేఁ చంద్రీ! ముంగిలి తుడవడ వఁయిందిషే.

చంద్రమతి—అమ్మా! తుడుచుటయే కాదు నీళ్ళు చల్లి ముగ్గు పెట్టుట కూడ నయినది.

కాలకంఠి—చాలాసంతోషం. అయితే యింకేం చెయ్యబోతావు?



చంద్రమతి—అమ్మా! నిన్నఁ జేసినప్రకారముగానే పసులదొడ్డి యూడిచి పేఁడ పిసికి పిడకలు పెట్టఁబోయెదను.

కాలకంఠి—దానిమాటకేం. అది అలా వుండనీ. తరవా చ్చెయ్యొచ్చున్లే. వాడికవాళ్ళు పాలకోసం వస్తారు. ఆవుపాలు పితికి అలా చోట దాచువో. ఆగేదిపాలు వేగిరంగా పితికి తీసుగురా. ఆవుపాలు యీవాళ మనయింట్లో కావాలి. గేదిపాలల్లో కొంచెం నీళ్ళు గలిపి నీదగ్గిర పెట్టుగుని వుండు. వాడికవాళ్ళు వచ్చి ఆవుపాలు కావాలని అడుగుతారు. వాళ్ళందరికీ గేదిపాలే ఆవుపాలని చెప్పి కొలిచి పోస్తూ వుండు.

చంద్రమతి—అమ్మా! పాలు పిదికి వేగముగానే తీసికొని వచ్చెదను. తాము సెలవిచ్చినప్రకారముగానే గేదెపాలలో నీళ్ళు కలిపెదను. కాని, యడిగినవారితో నీళ్ళు గలియనిపా లని కాని యావుపాలే యని కాని యెట్లు చెప్పవచ్చును? అది యసత్యాలాపముచే నితరులను వంచించుట యగునే తల్లీ!

కాలకంఠి—చంద్రీ యేవేఁ యిది లోకవంఁతా సాజంగా చేస్తానే వుంఛారు. నే నెలా చెబితే అలా చెయ్యవలసిందే గదా నువ్వు.

చంద్రమతి—అమ్మా! నే నెదిరించి మాటలాడుచున్నా నని మాత్రము కోపింపకుఁడు. న్యాయము కానికార్య మెట్లు చేయ నగును? లోకులు చేయుదు రంటిరి. అదియును నిజమే కావచ్చును. లోకములో ననేకులు చేయుకార్యములు పాపకార్యములే. న్యాయము దప్పకుండఁ బనులు చేయువారు కొందఱుమాత్రమే కలరు. అమ్మా! ఒకపడిపాలలోఁ గాలుపడి నీరు గల్పినంతమాత్రమున నేమి వచ్చును? అంతస్వల్పమునకై సత్యమును బోఁగొట్టుకొనవచ్చునా? అదియునుం గాక, రోగులు, బాలురు, వృద్ధులు మొదలగువారికిఁ బాలే

యుత్తమాహారంబుగ నుండును. మనకుఁ గల్గు స్వల్పలాభంబునకై యనేకులసుఖమునకు భంగమును గల్పించుటయు, వారిని రోగులనుగాఁ జేయుటయును మహాపాతక మని నాకుఁ దోఁచుచున్నది. తల్లీ! అట్టిపని మనస్సులోఁగూడఁ దలంపకుంటయే యుత్తమము గాదా? ఇందులకై దాసురా లెంతమాత్రమును లోఁబడఁజాలదు. మఱియు శిశువులకుఁ బాలు దానముసేయుట పుణ్య మని కదా పెద్దలు సెప్పుచుందురు. డబ్బు పుచ్చుకొని కూడ నిటువంటిపాలు వారి కిచ్చుట పాపము లన్నింటిలో నెక్కువపాతక మగును. ఇటుపయిఁ దమ రిటువంటిపనులు చేయకుందురు గాక యని తమపాదములమీఁదఁ బడి నమస్కరించుచున్నాను. నాప్రార్థన మంగీకరింపుఁడు తల్లీ!

కాలకంఠి—సరి సరి. అలాయితే నీయిష్ట వొఁచ్చినట్టల్లా చెయ్యి. నీకెంతమాత్తరవూఁ లోకం సంగతి తెలిసినట్టే కనబడదు.

కాలకంఠుఁడు—ఒసే కాలకంఠీ! యిదుగో మంతిరిగారింటినించి మనిషొచ్చి నట్టుంది చూడూ!

కాలకంఠి—ఎవరు వారు?

పనివాఁడు—యేవఁమ్మో! మాయయ్యోరింటికాడి కావ్వెన్న వాడిగ్గా యిచ్చీమాదిరిగా తీసుగురమ్మన్నారు. చాలా జరుగుడుగా వున్నాది. బేగియ్యాల.

(కాలకంఠి వెన్న తెచ్చుదానివలెఁ బోయి పట్టిచట్టిమాత్రమే తెచ్చి రహస్యముగా.)

కాలకంఠి—నేనేం చేతునే అమ్మా! ఇందులో యింతపిసరూ వెన్న లేదే. ఒసే ఒసే చెంద్రీ!

చంద్రమతి—అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను. (వరుగున వచ్చుచున్నది.)

కాలకంఠి—ఒసే అల్లరి చెయ్యకే. వూరుకోవే. యేవేఁ యిందులో



వెన్న పడే సుంచానే అమ్మా! నువ్వుకూడా చూశావుగాదుషే.

చంద్రమతి—అమ్మా! నేను జూచుటయే లేదు.

కాలకంఠి—అయ్యో అమ్మా! ఆవెధవపిల్లొచ్చి తినేసి పోయింది గంబోల్నే. అయ్యో అయ్యో! యిఖ నేనేం చేదునే. కొంచమైఁనా వుంచిందిగాదే. అంతా నాకేసి పోయిందే. లేదంటే వొల్లగాదే. వాళింటికీ వీళింటికీ గాదే మంత్రిగారింటికే అమ్మా! లేదంటే కొంప ములిగిపోతుందే. నేనేం చేదునే. ఇప్పుడు నువ్వు కొంచెం సాయపడాలే చంద్రమ్మా! ఆగేదివెన్న పట్టుగుపోయి ఆవువెన్నని చెప్పిచ్చి రావే మాతల్లీ! అంతమాత్రం నాయందు దయుంచి సాయం చెయ్యాలమ్మా! ఆబ్రామ్మడి చెవులోగూడా పణ్ణేయకే. పోఅమ్మా వాకిట్లో కాచుకూర్చున్నాడు.

పనివాఁడు—యేవఁమ్మోవ్. పొద్దు పోతా వున్నాది. అమ్మగార్నామీద కోపంసేసుగుంటారు.

కాలకంఠి—ఇదుగో తెస్తున్నా. (చంద్రమతినిగూర్చి) ఒసే చెంద్రీ! పోవే. ఇద్గో యింద పట్టుగుపో.

చంద్రమతి—అమ్మా! నామనసార నొకదాని నొకటిగా మార్చి చెప్పఁజాలను. మనస్సాక్షికి విరుద్ధముగా నడుచుట మంచిదిగాదు. మన మీఁద దోషము లేదు. దైవవశమున జరిగినదానికి మన మేమి చేయఁగలము? ఇటువంటి పొరపా టెవ్వరికైనను గలుగునదియే. జరిగినది జరిగినట్టు చెప్పి యిచ్చుటయే యుక్తము. గేదెవెన్న యావువెన్న యని యిచ్చుట వంచనమును, మోసమును నగును. వారా వెన్న యౌషధముకొఱకుఁ దీసికొనిపోయినను బోవచ్చును. వారి కుటుంబమే మనలను నమ్మియుండునట్లు గదా తాము సెలవిచ్చుచున్నారు. అట్టిపోషకులకు వంచనము సూపక నిజము చెప్పినచోఁ

గావలసినయున్న నాగేదెవెన్నయే వారు తీసికొనిపోవుదురు. అక్కఱలేనిచో విడిచి పోవుదురు. ఈదినమునకు మఱెక్కడనైనను దీసికొందురు. తీసికొననిండు తల్లీ!

కాలకంఠి—యేవేఁ వొసే చెంద్రీ! నాకే బుద్ధి చెబుతూవున్నావూ? బాగానే వున్నాది. పోవే. పో. యిలా అంతా చేసేగదా మొగాడో దిక్కునా, ఆడదో దిక్కునా పడి యేడుస్తూ వున్నారు. అయితే యేవేఁ చెంద్రీ! లోకంలో తంతరం లేకుండా యేపనైనా జరుగుతుందిషే. మరేవచ్చి నీలాంటిదాన్ని పనికత్తిగా పెట్టుకోవడం మొత్తుగున్నట్టే వున్నాది. నిన్నసవలసినపనే వుఁన్నాదీ? ఆపిచ్చిబ్రాహ్మణ్ణనాలిగాని. పోవే. పోయి ఆ బియ్యవేఁనా దంపు.

చంద్రమతి—అమ్మా! యిదుగోఁ బోయి దంపుచున్నాను.

కాలకంఠుఁడు—యేవేఁ పొద్దస్తమానవూఁ ఆరుస్తూనే వుంఛావు?

కాలకంఠి—బాగానేవుంది మద్దిన్నేనా ఆరుస్తూ వున్నాను? నాఆరుపంతా మీాయింటికార్యాలకే గాదూ!

కాలకంఠుఁడు—యేంకార్యవేఁ అదీ? అలాంటికార్యం వొచ్చిందంఛున్నావూ?

కాలకంఠి—మరిగంటేను ఆపిల్లాడూరికే మూడుపూట్లా పీకెమొయ్యామింగి ఆవీధీ ఆవీధీ తిరిగిరాకపోతే యేదైనా పఙ్జెపితే చెయ్యడూ? ఈకొంపలో అడిగేదిక్కు లేదుగాని!

కాలకంఠుఁడు—ఔనే! "ఆపిల్లాడిగ్గూడా యేదేనా పని చెప్పావుగావా" అని నిన్న నీతో అంటేవాణ్ణి వెనకేసుగొచ్చి "మనింట్లో యేంపల్లుంఛా" యన్నదానివే గదా, యేవేఁ అప్పుడే నీబుద్ధిలా మాఱిపోయిందీ? అయితే నీకెందుకే తఃణేతఃణే బుద్ధిలా మాఱిపోతూ వుంఛుందీ?



కాలకంఠి—బాగానేవుంది మీాఅడగడం చూడగానూ? నిన్నసేపీఁ వస్లేదుగనక పడుంఛాడన్నాను. అదీ తప్పేనాయేవిఁటి? తెల్లారితే వుగాదిపండుగొస్తూవుంది. రేపు సంవత్సరాదిపండుగ్గదా యిన్నిమావిఁడాకులూ, యింతదర్భా, యిన్నిసమిఁదిలు, యిలాంటివన్నీ తేవాలని కాలకంఠే చెప్పాలిగంబోసు.

కాలకంఠుఁడు—ఔనే వాడు పిల్లాడుగదా ఒక్కడూ అడివికెలా పోగలడే పాపం!

కాలకంఠి—యేమీా యిరుగుపొరుగుల పిల్లాళ్ళంతా వెళ్తారుగందామరి వీణ్ణిగూడా వాళ్ళతో జొతచేసి పంపగూడదూ? మిమ్మల్నికట్టుగున్నందు కెప్పుడూ యేడుపులూ మొత్తుగ్గాడాలే తప్ప అంతకంటే మరేవీఁ సుఖపడిచావలేదు నేను. చాలు చాలు.

కాలకంఠుఁడు—అలా మొదట్నే చెప్పరాదూ? యిలా మండిపడిఛావకుంటేనూ? పిలువాపిల్లాణ్ణిలా.

కాలకంఠి—ఆకక్కగట్టు వెళ్ళి తల్లికడుపులో దూరుకున్నాడు. నేను పిలవలేను. నావల్లగాదు మీారే పిల్చుగోండి.

కాలకంఠుఁడు—ఔనే వొసే చెంద్రీ! యిలారా! వస్తున్నావా?

చంద్రమతి—స్వామీా! యిదుగో వచ్చితిని.

కాలకంఠుఁడు—యేడే కనపడడాపిల్లా డెక్కడికెళ్ళేడే?

చంద్రమతి—ఇదిగో! ఇచ్చటనే యున్నాఁడు స్వామీా!

కాలకంఠుఁడు—ఒరే అబ్బీ! యెక్కడికి పోయావురా?

దేవదాసుఁడు—తాతగారూ! యెక్కడకును బోలేదు. మాఅమ్మదగ్గరనే యున్నాను.

కాలకంఠుఁడు—యీాపిల్లాడితిం డయిందే చెంద్రీ!

చంద్రమతి—స్వామీా! యింకను గాలేదు.

కాలకంఠుఁడు—ఔనే! ఒసేవు, కాలకంఠీ! పిలుస్తున్నానే నిన్ను.

కాలకంఠి—యెందుకలా వూరికే గొంతుగు బద్దలేసుకుంటారూ? ఇదుగో వచ్చింది వొల్లకాటికాలకంఠి ఆచెప్పేదేదో చెప్పండి.

కాలకంఠుఁడు—ఓసి తెలివితక్కువదానా! యెందుకే వూరికే అలా అరుస్తావూ? పోనీగాని ఆపిల్లాడికి వణ్ణంపెట్టావూ?

కాలకంఠి—అదుగో చూడండి ఆరాచ్చిప్పలో ఝూవాఁయి గుమ్మరించాను కుంభం. యీవేళ వణ్ణంలేదు. కొంచెం తోపవుంటే పడేశాను. దానమ్మకడుమ్మాడా ఆవెధవ పిల్లొచ్చి ఆవణ్ణం రొంతా తీసీసి పోయింది. అయితేనేవిఁలెండి ఆతోపే రెండునిమ్మకాయలంతంతున్నాది. చాల్నులెండి వాడుపడ్డపాటుకి. అదుగో అక్కడ బోర్లించున్నచల్లకుండలో వోఅరపణ్ణీళ్ళు పోసి గిలకొట్టి పోసుగుని పిల్లాడికింత బెట్టి తన్నింత తినవఁని చెంద్రితో చెప్పండి. యెలాగో యీవాళకి కడుపు నిండించుగోమ్మనండి. నాకేవోఁగాని తలొప్పిగా వుందినేపోయి పడుకుంటాను. నన్నస్తమానం పిలుస్తూ వుండకండేం.

కాలకంఠుఁడు—ఒసే చెంద్రీ! మీఅమ్మగారన్నమాటలు విన్నావుగందా! పోయి మీరిద్దరూ తిండి తిని ఆపిల్లాణ్ణిలా పంపు. ఆలిశ్యం చెయ్యక వేగిరం పంపేం?

చంద్రమతి—అహా? అట్లే పంపెదను స్వామీ!

కాలకంఠి—ఒసే చెంద్రీ? ఆబియ్యం తెల్లగా సుభ్భరంగా దంపేవా లేదే యింకానూ? యేవోఁనమ్మా నీయిష్టంఅయనిష్టం. మద్ధిన్నాకెందు కీనిష్ఠూర్యం?

చంద్రమతి—అమ్మా! ఇదిగోఁ గావచ్చినది. ఇఁకఁ గొంచెముసేపటికే బియ్యము బాగుగా దంచి తెచ్చుచున్నాను. ఇదిగోఁ బోవుచున్నానమ్మా!



(చంద్రమతి పోయి బియ్యము దంపుచుఁ దనలో)

అహో! విశ్వేశ్వరా! యేమి చేయుదును? ఎవరితోఁ జెప్పుకొందును! అయ్యో! హతవిధీ! భూమండలాఖండలుం డని పేరుపడి రాజాధిరాజులచే సేవింపఁబడుచు నేకచ్ఛత్రముగాఁ బ్రజలను బ్రజలచందంబునఁ బరిపాలించు హరిశ్చంద్రునంతటి సార్వభౌముని చేయి పట్టిన యీచేతితో నిట్లు లీరోకలి పట్టుకొని యీబ్రాహ్మణుని యింట నిట్లు బియ్యము దంపవలయు నని యీపాపాత్మురాలినుదుట వ్రాసితివిగా! అట్లు వ్రాసిననీచేయి యిట్లు వ్రాయుట కెట్లు సాహసింపఁగలిగినదో గదా! అక్కటా! గుండెలలో నొప్పి యెత్తుచున్నది. కడుపులో నొప్పిపుట్టుచున్నది. నడుము పడిపోవుచున్నది. అయ్యయో? చేతులు పొక్కులెక్కుచున్నవి. అన్నన్నా! పొక్కులు చిదికి నీరు గారుచున్నది. అహహా? యెట్లు మండుచున్నదీ? అయ్యో! దైవమా! యేమిచేయుదును.

(కన్నుల నీరు గ్రమ్ముకొనుచున్నది.)

దేవదాసుఁడు—అమ్మా! అమ్మా! యేమే?

చంద్రమతి—ఏమిరా! నాయనా! దేవదాసా! యెందుకమ్మా పిల్చుచున్నావూ?

దేవదాసుఁడు—అమ్మా! అన్నము తినకుండ ఊరకే యెందుకూ? అలాగున నేడ్చుచున్నావూ? అమ్మా! బాబయ్యగా రెప్పుడు వస్తారే? బాబయ్యగారు రాఁగానే నీవు బియ్యము దంపుచు నేడ్చితి వని చెప్పకమాననుసుమా అమ్మా!

చంద్రమతి—నాయనా! మన కంతటియదృష్టమటరా? బాబయ్యగారింత వేగముగా రారు. ఎప్పుడైనను వత్తురు. ఏఁడువఁబోకు నాయనా! నేనెప్పుడును నిఁక నేడ్వను.

దేవదాసుఁడు—నిన్నను పగలంతయు నూరకుండి సాయంకాలమపుడు గదా కొంచెము చద్దియన్నము తింటివి. రాత్రి తిన్నామో లేదో నాకు జ్ఞాపకమే లేదు. రా అమ్మా నా కాఁకలిగా నున్నది.

చంద్రమతి—నాయనా! ఇదిగో వచ్చుచున్నాను. బియ్యము దంపి బాగుగాఁ జేయుట యయినది. పోదము రమ్ము.

(బియ్య మెత్తిపెట్టి భుజించుటకుఁ బోవుదురు.)

దేవదాసుఁడు—అమ్మా! చద్ది యన్న మెక్కడనే యున్నది?

చంద్రమతి—నాయనా! చద్దియన్నము మిగుల లేదు. నేఁటి కిదే భుజింతము రా.

దేవదాసుఁడు—ఊఁ. హూఁ. నాకు వలదమ్మా! దీనిని జూచుటకుఁ గూడ నసహ్యముగా నున్నదమ్మా! తాఁకితే చేతి కంటుకొనుచు నున్నాదమ్మా. డోఁకు వచ్చుచున్నది. నేను తినలేను. నాకుఁ గొంచె మేదైన ఫలాహారము దెచ్చిపెట్టు తిందును.

చంద్రమతి—(తనలో) అయ్యో! దైవమా! అయ్యయ్యో! దుష్కాల గతీ! ఇపుడు బిడ్డని కేమి చెప్పుదును? వట్టిచంటికూన. మునుపు వీఁ డన్నమును దినుట కెన్ని వేడుకలు? ఎన్ని యాటలు? యెన్ని పాటలు? ఎన్ని పాటులు? ఎందఱు దాదులు? అహాహా! ఆ కాల మంతయును గలలోనివార్త యయిపోయినది. ఇపుడో యొక్క పూఁటకు స్వల్పాహారము దొరకుటయే దుర్లభ మగుచున్నది. ఆకాలమం దది వలదు. ఇది వలదు. అని యన్నము దినిపించునపు డెల్ల నిటునటు మోము త్రిప్పుచుండెడి యీనాముద్దులమూట యిప్పు డింత చద్దియన్నమునకే మొగమువాఁచి యున్నవాఁడు గదా! అయ్యో! యిప్పు డీతిండి వలదనుచున్నాఁడు. ఇంక నేనేమి చేయుదును?



"క. అతిథులు బాలకులును భూపతులును నల్లుండ్రు నాఁడువాండ్రును దమప్ర
స్తుతమునె కనుచుందురు గాని తక్కినవి సూడఁబోరు నిజము కుమారీ."

అనులోకోక్తి యిప్పట్టున యథార్థముగాఁ గన్పట్టుచున్నది. (బిడ్డనిం జూచి) ఓరీ! నాముద్దులకూనా! ఇప్పటి కెట్లో యిది తినుము. తరువాతను జూచుకొందము. నేఁటికి మనకు దొరకినది యిదియ. రేపు మంచిచద్దియన్నము దొరకునులే నాయనా! (తోఁపయుండ నీళ్ళు పోసి కలుపుచు.) అయ్యో! పరమేశ్వరా! యీ తోఁపయుండలు గలుపుటకు నాకే యసహ్య మగుచున్నది గదా! ఇఁక దీనిని నాముద్దులబిడ్డఁ డెట్లు తినఁగలఁడు? అద్దియుఁ గడుపునిండ లేకపోయినది. చాలీచాలనితిండియే యగును. ఇపుడిది యీ కాలమునకు సరిగానే లభించినది. ఏమిచేయవచ్చును? అక్కటా! యీ యంబలి మానగరిలోని పశువులుగూడఁ దిని యెఱిఁగి యుండవు. పాలలోనికిఁ జక్కెర వల దనుకాలము పోయి గంజిలోని కుప్పు లేకపోయెనే యని యేడువవలసినకాలము వచ్చినది. అన్నా! యిది యేజన్మములందుఁ జేసికొన్న పాపమో కదా! యీనాఁటికిఁ గట్టికుడుపుచున్నది. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ" మ్మని పెద్దలుసెప్పువాక్య మెప్పటికిని వ్యర్థము గాదుగదా!

(దేవదాసునకుఁ దినిపించుచున్నది.)

దేవదాసుఁడు—నాకు వలదమ్మా! పులుసుకంపు గొట్టుచున్నది. అయ్యో! ఉప్పు కూడ లేదే. అమ్మా! యేదైనఁ బచ్చడి యిమ్మని యవ్వగారి నడుగరాదూ? పోనీ రవ్వంత యూరుగాయముక్కయైన నిమ్మనుము.

చంద్రమతి—ఓరీ నాతండ్రీ! నే నేమి చేతునురా. ఏడువకు. ఎట్టులో మనసు పట్టి మెల్లఁగాఁ ద్రాగివేయుము. నేను గుండెలమీఁదఁ జేతితో నిమిరెదనులే. (కన్నీరు విడుచుచు గుండెపై నిమురుచున్నది.)

నాయనా! ఇదిగో నే నెట్లు త్రాగుచున్నానో చూడుము. అట్లే నీవును గన్నులు మూసికొని త్రాగి యొక్కమాఱు గుటుక్కున మ్రింగివేయుము. చూతము.

(త్రాగించుచున్నది. తానును త్రావుచున్నది.)

కాలకంఠుఁడు—ఔనే ఒసీ చెంద్రీ! తిండి తినడం అయిందా యింకా లేదే. పిల్లాణ్ణి వేగిరంగా పంపించే అంటే యింతసేపా? యిలాయ్తే బాగానే వున్నాది.

చంద్రమతి—నాయనగారూ! ఇదిగో నిప్పుడే భోజన మయినది.

కాలకంఠుఁడు—చూడూ చెంద్రీ! నీకొడుకు నిలా తీసుగురా.

చంద్రమతి—స్వామీ! యిదిగో వచ్చియున్నారము. ఏమి సెలవు?

కాలకంఠుఁడు—చెంద్రీ! రేపు వుగాదిపండుగనీ సంవత్సరాదిపండుగనీ తెలుసునా?

చంద్రమతి—కావచ్చును స్వామీ?

కాలకంఠుఁడు—రేపటికి మావిఁడాకులూ, దర్భా, సవిఁధెలూ, వెలక చెవికూరా, నెల్లికూరా, మావిఁడికాయలూ, వేంపువ్వూ యిలాటి వన్నీ కొంచెకొంచెమైఁనా కావాలనుకున్నావా అక్కర్లేదను కున్నావా? యివన్నీ తేవడాని కెవరూ పోయీవాళ్ళు లేరని నీకు తెలుసునా తెలియదా? మీపిల్లాణ్ణి యిల్లీదగ్గిర్లోనే వున్నఅడివికి పంపి తెప్పించాలని అనుకుంఘూ వున్నాను.

చంద్రమతి—స్వామీ! వీఁడు బొత్తిగాఁ జిన్నవాఁడు. అడవి కొక్కఁడును బోవుటకు భయపడును. సెలవైనచో దాసురాలే పోయి యన్నియుఁ దెచ్చుటకు సిద్ధముగా నున్నది.

కాలకంఠుఁడు—అలా యెంతమాత్తరం వల్లపడదు. నువ్వా వెళ్తావు? బాగానే వున్నాది. మరేవచ్చి నువ్వడివికెళ్తే యింట్లో చాకిరీ అంతా



యెవరు చేస్తా రనుకున్నావు? అదిగాని విన్నాదంటే మండిపడు తుంది. ఏవీఁ యీపిల్లాడికేం. యిరుగుపొరుగుపిల్లా ళ్ళంతా వెళ్తు న్నారు కారూ! వానిసపిల్లాడు పోడానికేంభయం? నాకేవీఁ తోఁచ కుండా వున్నాది. వాళ్ళంతా యింట్లో పనివాళ్ళున్నవాళ్ళే. అయినా సొంతంగా వాళ్ళపిల్లాళ్ళే పోతూ వున్నారు. వాళ్ళందరికీ లేనిభయం నీకొడుకొక్కడికేనా వచ్చింది? యేమఁయినా సరే వెళ్ళితీరవల్సిందే కాని యెంతమాత్తరం నువ్వడ్డుమాటలు చెప్ప గూడదు. ఇదిగాక వానిసాళ్ళపిల్లాడికి భయంకూడా వుంఘుందా అని అడుగుతా. నువ్వు లేచి దూరంగా వుండు. యిలా నువ్వు దగ్గిరా వుంటే పిల్లాడు చెడిపోఘాడు.

ఇది షష్ఠరంగము.

సప్తమరంగము.

స్థలము : కాలకంఠుఁడు నివసించియున్నవీథి.

కాలము : ప్రాతఃకాలము.

పాత్రములు : బ్రాహ్మణవటువులు, దేవదాసుఁడు, చంద్రమతి, కాలకంఠుఁడు.

శేషుఁడు—ఏమండీ! తాతగారూ! మీరు రారా యేమిటి? రేపు సంవత్సరాదిపండుగ గదా! మేమంతా వెళ్ళుచున్నాము లెండి.

కాలకంఠుఁడు—ఒరీ శేషా! కిష్టా, సీనిగా, వెంకా మీరంతా కలిసి యెక్కడికిరా వెళుతున్నారూ?

శేషుఁడు—తాతగారూ! మే మడవికి పోవుచున్నాము. మీకు సమిధలు, మామిడాకులు, దర్భ, వేఁపపువ్వు, ఇలాటివన్నీ అక్కఱ లేదా యేమిటి?

కాలకంఠుఁడు—ఔనర్రా మాకూ కావలిసే వున్నాయర్రా.

కృష్ణస్వామి—అట్లయితే మీరే వస్తారా లేక మాఅవ్వగారిని పంపిస్తారా అడవికి?

కాలకంఠుఁడు—అదేలా వస్తుందర్రా పాపం. దానికి రాత్తిర్నుంచి తలనొప్పిగదా!

కృష్ణస్వామి—ఆలాగా? అయితే మీరే రండి మనమందఱమును గలిసి వెళుదాము.

కాలకంఠుఁడు—ఓర్రా! యింట్లో మీఅవ్వ తలనొప్పితో పడుకునుంటే నేనెలా వచ్చేదర్రా దాన్నొక్కర్తినీ వొదిలిపెట్టి. నేను రావడానికి వల్లగాదుగాని యిద్గో యీపిల్లాణ్ణి పంపిస్తా మీతోకూడా తీసుగు పొండి. పిల్లాడు బొత్తిగా పసివాడుసుమండీ యెంతో జాగర్తాగా చూస్తూవుండండేం. (బాలునిం జూచి) ఓరీ అబ్బీ! నువ్వు వీళ్ళందరి తోటీ కూడా ఆడకుండా, పాడకుండా, వెళ్ళి వీళ్ళేవేవిఁ తెస్తారో అవన్నీ నువ్వుగూడా పట్టుగురా. లేకుంటే కొట్టిపోఘాను. మర్నీకు వణ్ణం పెట్టొద్దని మీ అవ్వతో చెప్పేస్తాను సుమా! జాగర్తా.

దేవదాసుఁడు—తాతగారూ! అట్లే పోయి కావలసిన వన్నియుఁ దెచ్చెదను. (తల్లియొద్దకుఁ బోయి) అమ్మా! తాతగారు నన్నడవికి వెళ్ళుమనుచున్నారు. నేనుగూడ నాబ్రాహ్మణ బాలురతోఁ గలిసి వెళ్ళెదనమ్మా!

చంద్రమతి—ఓరీ నాముద్దులకూనా! యేమిచేయుదునురా తండ్రీ! నిన్ను వదలి యెట్లుండగలనురా నాయనా! అడవిలో నీవేదైనను జూచి భయంపడినచో నిన్నోదార్చువా రెవరున్నారు బాబూ! అయ్యో! నాహృదయమూ చెలాచెదరై పోవుచున్నదే? అక్కటా! నే నేమి చేయఁగలను?



దేవదాసుఁడు—అమ్మా! యేడువకు. అడవిలో నాకేమియును భయముండదు. మనయూరినుండి వచ్చునప్పుడు త్రోవలో నెన్నియడవులు చూచినాము గాము? ఆలాగుననే కదా యుండును. నాకేమియు భయము లేదు లే. అమ్మా? నీకుఁగూడ మంచిమంచిపండ్లు గోసి తీసికొనివచ్చెదనూ.

చంద్రమతి—ఓరి నాతండ్రీ! నీ కేమిబుద్ధిశాలితనమురా? నిన్ను నే నడవి కెట్లు పంపుదునురా నాయనా! దేవదాసా! నే నేమిచేయుదును? ఏమయినను మనలను సొమ్మిచ్చి కొనుక్కొన్న యజమానుల యాజ్ఞాప్రకారము నడిచి తీఱవలయును గదా? నాన్నా! నీవుమాత్రము జాగ్రత్తగాఁ బోయి రమ్ము. నూతులు గోతులు నుండును. తొంగి చూడఁబోకుము. గట్టులు పుట్టలు నెక్కఁబోకుము. పండ్లకుఁ గాయలకును జెట్లెక్కకుము. ఆహా! నే నేమిసేయుదును. నిన్నడవికిఁ బంపి నే నొంటరిగా నిక్కడ నెట్లుండఁగలను? నాయనా! నీవు మరలి వచ్చువఱకును నాప్రాణము లన్నియు నీవైపే చుమా యుండును. హా! విశ్వేశ్వరా! యీనాచంటికూన నడవికిఁ బంపవలసి వచ్చుచున్నది గదా? అయ్యో! చంటికూన నొంటిగా నెట్లు పంపుదును. నేను బోయి కావలసిన వన్నియుఁ దెచ్చెద ననినను యజమాను లొప్పకపోయిరి. నావిధివ్రా లిట్లుండఁగా వారి నన నేమిలాభ మున్నది? యేమి వచ్చినను ననుభవించి తీఱక తప్పదు గదా?

(అని యేడ్చుచున్నది.)

దేవదాసుఁడు—అమ్మా? యూరక యెందుల కేడ్చెదవు? నా కేమియు భయము లేదమ్మా? నీవు చెప్పినట్లే జాగ్రత్తగాఁ బోయి మరల నతివేగముగా వచ్చెదను. అమ్మా! నిన్నుఁ జూడకుండ నేనుమాత్ర ముండఁగలనఁటే.

చంద్రమతి—(ఇరుగుపొరుగు బాలురం జూచి) అయ్యలారా! యీనా ముద్దులమూటను, ఈనాచంటికూనను, మాదేవదాసుని మీతోఁ గూడఁబంపుచున్నాను. నాయనలారా! మీరు వీనిని జాగ్రత్తగాఁ బిలుచుకొనిపోయి మాయజమానులు సెలవిచ్చిన వస్తువు లన్నియు సేకరింపఁజేసి మరల మీతోఁగూడఁ బిలుచుకొని వత్తురుగదా! మీయందఱకును వందలకొలందిగ వందనము లాచరించెదను. నాయనలారా! దిక్కుమాలినవాఁడు సుమండీ మీరే దిక్కు. వీనిపైఁ గొంచెము దయ యుంతురుగాక. వట్టి పసికూనసుమండీ.

శేషుఁడు—వాఁడు బ్రాహ్మణులపిల్లవాఁడు గాఁడా యేమిటి?

చంద్రమతి—కాదు కాదు నాయనా! మేము బ్రాహ్మణులము గాము. ఈ యింటి బ్రాహ్మణులకు దాసులము.

కృష్ణస్వామి—అటులనా? సరియేలే అమ్మా! ఒరే శేషా! నీవుగదా మాయందఱకును బెద్దవు. కావున నీవే యీపిల్లవానిని జాగ్రత్తగాఁ జూచుచుండవలయును. పాపము! బొత్తిగాఁ జిన్నవాఁడురా. చూడుము పాప మెంతముద్దువచ్చుచున్నాడో?

శేషుఁడు—అట్లే కానీ పో. అమ్మా! మీపిల్లవాని కేమియు భయము లేదు. మాతోడ రానిమ్ము.

చంద్రమతి—స్వామీ! తమయాదరణను నమ్మి తమవెంటఁ బంపుచున్నాను. మీరు మరలి వచ్చువఱకును నాప్రాణము లిచ్చట నుండవు. వేయేల? నాప్రాణములనే మీవెంటఁ బంపుచున్నా నని తలంతురుగాక. (కుమారునిం జూచి) నాయనా దేవదాసా! వీరి తోడనే పోయి జాగ్రత్తగా రమ్ము.

శేషుఁడు—కానీ యమ్మా! దానికేమి? మేమందఱమును బోవుచున్నాము గామా? మే ముండఁగా మీపిల్లవాని కేమియు భయము



రానీయములే అమ్మా! నీ వింటికిఁ బొమ్ము. మఱి మాకుఁ బ్రొద్దయి పోవుచున్నది. వేగముగాఁ బోయెదము.

(బాలు రందఱును బోవుచున్నారు.)

కాలకంఠి—ఒసీ చెంద్రీ! వోచెంద్రీ! ఔనే వొసీ చెంద్రోయి! యెక్కడికే పోయావూ పిలుస్తూ వుంటే వినబడదుషే నీకూ?

చంద్రమతి—అమ్మా! ఇదిగో వచ్చియున్నాను. ఎక్కడకును బోవుట లేదు. అమ్మా! బిడ్డని వారితో నడవికిఁ బంపి వచ్చుచున్నాను.

కాలకంఠి—వాణ్ణడివికి పంపడానికి నీవూసేవీఁటి? వాడికి తెలియదో? పోయీవాళ్ళంతా పిల్లాళ్లు గాక పెద్దవాళ్ళనుకున్నావా యేం. నీ పిల్లాడే గాని వాళ్ళుమాత్తరం అమ్మకడుపుని పుట్టలేదో? వాళ్ళం దరికంటే నీకొడుక్కొచ్చినకొమ్ములేవీఁటే అని అడుగుతా. మరేవచ్చి యింట్లో పల్లన్నీ అలా పడున్నాయిగందా యిదేవఁన్యాయవే! నీ యిష్టం వచ్చినట్టల్లా తిరుగుతూ వున్నావూ? బాగానేవుంది మాకొంపసంగతి. ఆపేడంతా పిసిగి పిడికి లెట్టేవా యింకా లేనే లేదా? అయితే మొక్కలన్నింటికీ నీళ్ళెప్పుడు తోడిపోస్తావు? యెంతపొద్దయిందో చూశావా?

చంద్రమతి—అమ్మా! కోపింపకుఁడు. ఇదిగోఁ బోయి చేసెదను. బొత్తిగాఁ జిన్నవాఁడు కాఁబట్టి బుద్ధి చెప్పి పంపఁబోతి నమ్మా!

కాలకంఠి—అదుగో మళ్ళీ ఆమాట మానవు. నువ్వేవీఁటి బుద్ధి చెప్పే దేవీఁటీ అంఛాను. ఆ పిల్లాళ్ళు పోతూ వున్నారే వాళ్ళకి తెలియదా యేవీఁటి వాణ్ణి తీసుగురావడం. బాగుంది నీవాళకవం తాను. ఛోఛో. పోయి ముందాత్తే పిడికిలు పెట్టి మరీ వున్నపని చెయ్యి.

(చంద్రమతి లోపలకుఁ బోయి పనిచేయుచునే తలంచుకొనుచున్నది.)

ఇది సప్తమరంగము.

## అష్టమరంగము.

స్థలము : అరణ్యమునం దొకప్రదేశము.

కాలము : పూర్వాహ్ణము.

పాత్రములు : సుశీలుఁడు, వివేకుఁడు, కరుణాకరుఁడు.

---

సుశీలుఁడు—వివేకా! మనగురుభగవానులవారా హరిశ్చంద్రమహారాజును బొంకించుటకై వంచింప మొదలుపెట్టిననాఁటనుండియు నియమములు, నిష్ఠలు మొదలగువాని నన్నింటిని వదలుకొన్నారు గదా! ఆసంగతి యటుండనిమ్ము. మన కుపదేశ మొనర్చుట యెంతమాత్రమును గనఁబడదు. ఏమిచేయుదము. మనజీవిత మంతయు నిట్లు వ్యర్థముగాఁ బోవుచున్నది గదా! ఇందులకా మనము సర్వసంగపరిత్యాగము చేసికొని దేహాభిమానము వదలి యీయన నాశ్రయించుట? తుదకు మనబ్రతుకు "ఉభయభ్రష్టము నుపరి సన్న్యాసము" ననుసామెతగా నున్నది.

వివేకుఁడు—సుశీలా! మన మేమిచేయుదము. మనపురాకృతకర్మ మట్టిది. దానికి వారుమాత్ర మేమిచేయఁగలరు? ఏమనఁగా:—

"ఉ. క్రిందటిజన్మమందు నొనరించినకర్మముఁబట్టి దేహి యం
దందు జనింపుచుండి స్వకృతానుగుణమ్ముగ మంచిచెడ్డలన్
బొందుచునుండుఁ గర్మ మనుభూతమె యై తెగుఁ గాని బ్రహ్మయే
నిం దిగఁద్రావఁ జాలఁ డన నేర్తురె తక్కినవారు దానినిన్."

అని కదా పెద్దలు చెప్పుదురు. మనము సంసారమును రోసి సన్మార్గప్రవర్తకులమై జీవన్ముక్తిం బడయఁ గోరి కదా సద్గురువుల నాశ్రయించితిమి. అటువంటివారే మనలను దుర్మార్గములం బ్రవేశపెట్టుచుండ మనము సేయవలసిన దేమున్నది? ఏమనఁగా:—



సీ. కన్నతల్లియె గొంతుకం గోయుచుండంగ వలదనిమాన్పించువారు గలరె?
ఆకాశమే బ్రద్దలై క్రిందఁ బడుచుండఁ బట్టుకోఁ దగినట్టివారు గలరె?
మేర మీఱి సముద్రమే లోకముల్ ముంప వారింపఁ జాలినవారు గలరె?
అధికారియే న్యాయ మరయక శిక్షింప బాగుగా దనునట్టి వారు గలరె?
గీ. వారు దమమదిలోన దయారసమ్ము, దాల్చి యోజింపవలెఁ గాక తక్కలేని
దిక్కుమాలినవాండ్రకు దిక్కు గలదె, మఱి చరాచరమైన బ్రహ్మాండమందు.

దాని కేమి? ఆసంగతి యటుండ నిచ్చి యిఁక నొకటి యాలోచింపుము. ఒకనిప్రాణమునకు వంచనమువలన ద్రోహ మాచరించుటకుఁ ద్రోవ దీయుట మహాపాతక మగునా కాదా? దానివలనఁ గలుగుపాపంబునకును, అపకీర్తికిని మితి గలదా? ఇటువంటితపోభంగంబున కేమిసేయవచ్చును. మనగోడవ యెవరితోఁ జెప్పుకొందము? ఎవరితోఁ జెప్పినను దానివలనఁ గలుగుఫలముమాత్ర మేమున్నది? ఏమయినను మనగురుభగవానులవారికిమాత్ర మా రాజఋషివిషయమున నిట్టిచెట్టపట్టుదల యెంతమాత్రమును గూడదు కూడదు కూడదు. ఇది వారు పొందియున్న బ్రహ్మర్షిత్వపదమునకుఁ దగినది కాదు కాదు కాదు.

సుశీలుఁడు—అవును. అది వారికిఁ దగినపని కాదే కాదు. కాని "ఈపని చేయఁగూడదు సుమండీ" అని వారికెవ్వరు చెప్పఁగలరు? ఎంతసేపయినను మనలో మన మనుకొనవలసినదే కాని వారితో ననఁగలమా? ఏమి సేయవచ్చును?

వివేకుఁడు—సుశీలా! కొంచెము తాళుము. అదిగో నావచ్చువా రెవ్వరో చూడుము. మన మిత్త్రునివలెనే కనఁబడుచున్నాఁడు.

సుశీలుఁడు—వివేకా! ఔను జుమూ బాగుగాఁ బోల్చితివి. మన మిత్త్రుఁడే. కణ్వభగవానులవారియొద్ద విద్దెల నభ్యసించుచున్న కరుణాకరుఁడు.

వివేకుఁడు—ఆహా! రానిమ్ము రానిమ్ము. మంచిసమయమునకే వచ్చుచున్నాఁడు. "కష్టసుఖములు వెళ్లఁబోసికొనుట కెవ్వరును లేరైరి" అని యిప్పుడే కదా మన మనుకొంటిమి. భగవంతుని ప్రేరణచేతనో యన్నట్టుగానే తగినట్టు మనమిత్త్రుఁడు కరుణాకరుఁడే తారసిల్లినాఁడు. ఇఁక మనకు విచారింపవలసినపని యేమున్నది? ఏమందువా?

"ఉ. వేఁకటి గల్గుటాది ప్రసవించెడుదాఁకను గల్గుకష్టముల్
ప్రాకట మౌచు నల్లప్రసవక్షణమందు సహింపరానిదౌ
శోకముఁ దల్లికిన్ మగనినుం గని చెప్పినమాత్ర విస్మృతం
బౌకరణిన్; స్వబంధువుల కదఱకున్ గడుదూరమౌచు నే
కాకిగ నుండి దుఃఖపడుకాలమునం దలవారు కంటికిన్
వే కనిపింపఁగానె యది వేగమె శాంతిని బొందకుండునే."

అనియును;

"క. అనుకూలమైనమిత్త్రము, తనకున్ లభియించెనేని తత్క్షణముననె
పెనునిధిదొరకిన తెఱఁగున, మన మానందాబ్ధిలో నిమగ్నంబె యగున్."

అనియును జెప్పుచుండుదురు గదా! సన్మిత్త్రముకన్న మిన్నయగున దింకొకటి యున్నె? రానిమ్ము సంభాషించుచుఁ గొంతకాలయాపనము సేయుచుందము.

(కరుణాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుశీలుఁడు—ఓహో! కరుణాకరునివలె నున్నాఁడు! నేఁ డేమిసుదినము! తలఁచుకొనితలంపుగ భగవంతుఁడు నిన్నుఁ దెచ్చి చూపి మాకు నేత్రపర్వ మొనరించినాఁడు. చాల దినంబులకుఁ గనఁబడితివి. క్షేమమా?

కరుణాకరుఁడు—అట్లే యనుకొనియెదరు. నేఁడు మీదిగాదు నాది సుదినము. ఆభగవానునియవ్యాజమైనదయవలన మిమ్ముల నిద్దఱను నొక్కచోటుననే చూడఁగలిగినందులకు నామనస్సు మిక్కిలిని



సంతోషించుచున్నది. ఎన్నాళ్ళయిననేమి? యెచ్చట నుండిననేమి? మనస్సుగదా ప్రధానము. ఏమందురో?

సీ. కొండపై నివసించుచుండు నెమ్మికి మీఁద నుండు మేఘుండు మిత్త్రుండు గాఁడె?
నీరిలోపల నుండువారిజమ్ములకుఁ బై నుండుసూర్యుండు మిత్త్రుండు గాఁడె?
మహి నుండుశశికాంతమణుల కెంతో మీఁద నుండుచంద్రుండు మిత్త్రుండు గాఁడె?
ఇలమీఁద నుండుభక్తులకుఁ బైలోకమం దుండుదేవుండు మిత్త్రుండు గాఁడె?
గీ. మనుజులకు దూర మగుఁగాక మానసమున
కించుకయు దూర ముండునే యెంచి చూడ
మీ రెఱుంగనిధర్మముల్ మేదినిపయి
నుండునే మిత్త్రులార! నే నొప్పఁ జెప్ప.

కావున మనము మొగము చూచుకొన్నముహూర్త మెట్టిదో కాని యప్పటినుండి యిప్పటివఱకును నాహృదయపద్మము మీకు నివాసస్థానముగాఁ జేయనేచేసితిని. మీదయవలన నేను సేమముగనే యున్నాఁడను. మీరందఱును క్షేమముగా నున్నారుగద?

వివేకుఁడు—మిత్త్రమా! కరుణాకరా! నీవన్నట్లు స్నేహితులొకచోఁ గూడియుండ నక్కఱయే లేదు. మనస్సులోఁ దలంచుకొన్నంతనే అమందమైనయానందము చేకూఱుచుండును. ఏమనఁగా:—

"క. ఆత్రముగ మదిఁ దలంచిన, మాత్రన వ్యసనముల నెల్ల మాయము సేయన్
మిత్రం బనియెడిమిగులఁ బవిత్రం బగువస్తుకన్న వేఱొకఁ డున్నే?"

అనునార్యోక్తి యెన్నటికైనను మృష యగునా? దాని కేమి! ఆసంగతి యటుండనిమ్ము. మీసిద్ధక్రియలన్నియుఁ గొనసాఁగుచున్నవి గదా!

కరుణాకరుఁడు—ఆహా! మీదయవలన నేలోపమును లేకుండ జపము తపము మొదలగుననుష్ఠానంబు లన్నియుఁ జక్కఁగా నెఱవేర్చుకొనుచు మాగురుభగవానులవారియనుగ్రహంబునం జేసి సర్వసిద్ధులును గ్రమక్రమముగాఁ బొందుచునే యున్నాను.

సుశీలుఁడు—నీవు సర్వసిద్ధులను బొందుచుండుట కేమభ్యంతరముం డును? కణ్వభగవానులవారిశిష్యుల కెందునేని లోప ముండునా? అదృష్ట మనఁ గణ్వశిష్యులదే యని చెప్పవచ్చును. ఏమయినను మావలె దురదృష్టవంతు లేలోకమునను నుండఁబోరు. పోనిమ్ము. మనలో నెవరు బాగుపడినను మంచిదే కదా!

కరుణాకరుఁడు—మిత్త్రమా! సుశీలా! యేమీ! అంతనిర్వేదముతోఁ జెప్పుచున్నావు! బ్రహ్మర్షి యనిపించుకొన్న విశ్వామిత్రునంతటి మహాత్ముని ప్రియశిష్యులరు గదా! మీరు. మీ కేమి లోపము వచ్చును? వివేకా! మనసుశీలుఁ డేల యంతవంతగాఁ బలుకుచున్నాఁడుఁ? చూడఁగాఁ జూడఁగా మీయుభయుల మోములయందును దేజోవిశేషంబునకు న్యూనత ఘటిల్లినట్టు కన్పట్టుచున్నది. కారణమేమి? నేను దెలిసికొనుటకుఁ దగి యుండెనేని—

వివేకుఁడు—కరుణాకరా! యేమీ? అట్లనుచున్నావు. ప్రాణమిత్త్రుఁడవగు నీకును దాఁపఁదగినది యుండునా? నీయెడ మా కట్టివంచన బుద్ధి యుండు నని కలలోనైన ననుకొనకుమా! మేము విశ్వామిత్త్రమునివరుల నాశ్రయించినది మొదలు చాలఁగాలము మిక్కుటముగ మేళ్ళనే యనుభవించుచు వచ్చితిమి గాని ప్రకృతము గొలఁది దినములనుండి యవాఙ్మానసగోచరముగా "శత్రులకేని రాఁగూడ" దనిపించునంతటికష్టములకు లోనై యేమియుఁ దోఁపక రాత్రింబవళ్ళంతములేని వంతం జిక్కి చింతిల్లుచున్నారము.

కరుణాకరుఁడు—ఆఁ. ఆలాగుననా! అదేమి చెప్పుము. నామనస్సు మిక్కిలి త్రొక్కటపడుచున్నది.

వివేకుఁడు—మిత్త్రమా! కరుణాకరా! చెప్పెదను సావధానముగా వినుము:-



మ. ఒకనాఁ డింద్రుఁడు దేవతల్ గొలువఁగా నొడ్డోలగం బుండ ను
త్సుకతన్ గౌతమ కణ్వ గాలవ వసిష్ఠుల్ శంఖ భృగ్వత్రి కౌ
శికముఖ్యుల్ ఋషివర్యు లుత్కటతపశ్శ్రీమూర్తులో నాఁగ నేఁ
గి కడున్ మన్నన గాంచి యున్నయెడఁ బల్కెన్ శక్రుఁ డవ్వారితోన్.

ఉ. ఓమునిచంద్రులార! పరమోగ్రతపోనిధులార! పేర్మిమై
భూమిని నెందునేనియును బొంకనిభూపతి యుండెనేని మీ
రామహనీయుసచ్చరిత మంతయు వింతగ నానతీయరే
నా మును లెల్ల వెల్ల నయి యట్టిటు చూచుచు మిన్నకుండఁగన్.

ఉ. చెచ్చెర లేచి యప్పుడు వసిష్ఠమహాముని తెల్లమబ్బుతోఁ
గచ్చెకుఁ గాలుద్రవ్వుతనగడ్డముచిక్కులు దీర్చికొంచుఁ దా
నచ్చట నున్నయందఱును నచ్చెరియంబుగఁ జూచుచుండఁగా
హెచ్చినసంతసమ్మున నహీనగతిం జిఱునవ్వు నవ్వుచున్.

మ. భళిరే! యెంతటిప్రశ్న చేసితి వహో! పాకాహితా! తిగ్మరు
క్కులపాథోనిధిపూర్ణచంద్రుఁడు త్రిశంకుక్షోణిరాట్సూతి ని
శ్చలచిత్తుం డలసత్యసంధుఁడు హరిశ్చంద్రక్షమాజాని వీ
నులకున్ విందొనరింపలేదొ యనె మౌనుల్ రిచ్చపాటొందఁగన్.

శా. ఆమాటల్ విని లేచి మాగురుఁడు విశ్వామిత్ర మౌనీంద్రుఁ డే
మేమీ? యిట్టిసభాంతరమ్మునను నీయిష్టప్రకారమ్ముగా
బూమెల్ పల్కుట కెట్లు నాల్క తిరిగెన్; బొంకింతు నీశిష్యునిన్
నామాహాత్మ్య మెఱుంగ వొక్కొ? యనునంతన్ బ్రహ్మపుత్త్రుం డనున్.

చ. తపమునఁ బోతరించి మునిధర్మము నెంచక మచ్చరించిన
ట్లపగతలజ్జమాననుఁడవై యిటు నోరికి వచ్చినట్లు నీ
చపుఁబలుకుల్ వచించుటకు సాహసముం గొనఁబోలునొక్కొ? ఆ
నృపమణి బొంకఁ జేయుటకు నీకుఁ దరమ్మగునొక్కొ? కౌశికా!

సీ. ఆమాట విన్నతోనే మాగురువుగారు నెయ్యిపోసినయగ్గి నెయ్యమునను
మండి తోడనె బాహుదండమ్ము పైకెత్తి శపథమ్ము పట్టె నిశ్శంకముగను
అటనుండి వచ్చి దుర్ఘటమౌప్రతిజ్ఞకు భంగమ్ము రాకుండఁ బలుతెఱఁగుల
మాయలు పన్ని యుపాయయుక్తుండును సత్యసంధుండు నా హరిశ్చంద్రనృపతి

గీ. కన్నిరో కష్టములఁ గూర్చ చిప్పటికిని
బట్టు వదలక మాయలు పన్నుచుండె
మచ్చరం బావహించిన మానవులకు
వింత మే యెందు లేని వివేకగరిమ.

మిత్రమా! ఆసంగతి యటుండనిమ్ము. ప్రకృత "మా హరిశ్చంద్ర మహారాజుకుమారుం డగు దేవదాసునకును గాశీరాజుకుమారునకును మీచేతి కిచ్చినవిష మెట్లో యెక్కించి యొక్కింతలోఁ జంపి రండు. మీరు మొదటినుండియు నాపూనినప్రతిజ్ఞకు సాయపడుచు నింతదాఁక నాచేయుకార్యములకుఁ బ్రోత్సాహముం గలిగించుచు వచ్చినందులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. కావున నీ చిన్నపనికూడ శక్తివంచనలేకుండఁ జేసి రండు. మీఁదిసంగతి చూచుకొందము." అని యనేకవిధము లైనయుపాయములను నేర్పి మమ్ముల నిద్దఱను నీమహాకార్యమునకుఁ బంపిరి. వారి యాజ్ఞను శిరసావహించి మేమును నట్టిదుఃఖరూపమయిన పని చేయుటకు సాహసించి యిందు వచ్చితిమి. మాగురుభగవానుల వారి యీ పనులన్నియు నాచంద్రతారార్కముగాఁ దెలిసికోఁదగినవియై యనేకభాషలలో ననేకులచే నాటకరూపముగా నటింపఁబడుచుండును. ఇఁక వారు మారూపములను దాల్చి యాయా స్థలములయందుఁ జేరి యాయారీతుల నటింపుచుండఁగా నాయా కాలములం దచ్చటకు వచ్చి చూచినవారు మాకార్యములను బ్రస్తావించుచు మమ్ములను నిందింపనివారే యుండరు గదా! తుదకు మాయదృష్ట మీలాగు పరిణమించినది. కట్టా! మాపుట్టు వెట్టిదో కాని యాచంద్రార్కమును నిందలపాలే కావలసివచ్చినందుల కెంతయుఁ జింతిల్లుచున్నవారము. ఏమయినను వారి యాజ్ఞకు వ్యతిరేకముగా నడిచితిమేని వెంటనే శపింపక మానరు గదా!



కరుణాకరుఁడు—మిత్రులారా! మనుష్యులు. కృతకృత్యు లగుటకై యవలంబింపఁదగినవి గార్హస్థ్యము, సన్న్యాసము నను రెండాశ్రమములే. అందును గొన్నికారణములంబట్టి యోజింపఁగా సన్న్యాసాశ్రమముకంటె గార్హస్థ్యమే ప్రశస్తతరము. ఏమందురో?

"గీ. బ్రహ్మచర్యాది చాతురాశ్రమ్యమందుఁ
గడమమూఁటికి లత కుపఘ్నంబుకరణి
నమరి యుండుటచేత గార్హస్థ్యమె కడు
మాననీయంబు సర్వథా మానవులకు."

అని పెద్దలు సెప్పుచుందురు. అదియునుంగాక.

"సీ. వినుము ఉషఃకాలంబుననె మేలుకొని యిష్టదైవమ్ము మదిని బ్రార్థనము చేసి
శౌచాదివిధులను జక్క నిర్వర్తించి స్నానమ్ము గావించి జపతపములు
నెఱవేర్చుకొని దేవునికిఁ బూజ గావించి యగ్నికార్యంబుల నమరఁ దీర్చి
పంచయజ్ఞములు గావించి యాపై నతిథులకును దన బంధుగులకుఁ బెట్టి
గీ. పిదప నాశేషము భుజించి వేదములఁ ద
దంగములను విమర్శించు చనుదినమ్ము
నుభయలోకమ్ములకు హాని యొదవకుండఁ
జేర్చి నుంటయె గార్హస్థ్యధర్మవిధము."

అనియెడి విధిప్రకారము వ్యత్యాస మొక్కింతయు జరుగకుండ గృహస్థాశ్రమమును నడిపించుకొనుచు వచ్చినయారాజచంద్రునకు, ఆసత్యసంధునకు, నిట్టి పట్టుదలఁ బట్టి దుఃఖములను గలిగించుట కొంచెమేనియుఁ దగనిపని యని పగవారి కైనను దోఁపనిసంగతి కాదు గదా! ఇటువంటిచెట్టపనులయందు మీయట్టివారు సంబంధించి యుండుదురేని మహాపాతకమును సంపాదించుకొన్నవారే యగుదురు. దొరకక దొరకక మనకు మానవజన్మము దొరకినది. అందును బురుషులమై పుట్టితిమి. ఆ పురుషత్వమునందును బ్రాహ్మణులమై వేదవేదాంగముల నభ్యసించుటకుఁ దగిన పుణ్యావిశేషమును గ్రిందటి జన్మములయం దేసుకర్మవిశేషంబుననో సంపా

దించుకోఁ గలిగితిమి. ఇటువంటి మనము సద్గురుపాదపద్మముల నాశ్రయించి సదాచారము నవలంబించి యుత్తమధర్మముల నాచరించుచు నుత్తమపదమును బొందవలసియున్నది. సర్వకార్యములసిద్ధికిని బాల్యమే తగినసాధనము. అట్టి యీ బాల్యమును దుర్మార్గపుఁ బనులయందుఁ బోఁ గొట్టుకొనుటకన్న నవివేక ముండునే. ఏమనఁగా :—

"గీ. జననమరణంబు లనియెడి సంద్ర మున్న
దీప్రపంచంబునందలి యొసఁగుదేహి
యందుఁ బడి తల్లడిల్లఁగా నధికహింస
దనరఁగాఁ బుణ్య మనియెడితరగ లేచి.

గీ. ముక్తినా నొప్పుదరిఁ జేర్చి ముదము గూర్చు
నట్లు గాకున్న దుష్కృతు లనెడిమీలు
చేరి దేహిని గఱచి హింసించు నకట!
కాన దొసఁగులచేతక్కై కడఁగ రోఁత."

అనునట్లొకానొకనికిఁ బురాకృతసుకృతవిశేషంబున సుజ్ఞానసంపద యొకప్పుడే తలచూపును. దానిని వాఁడు సేకొని ప్రయత్నించినచోఁ దనయాయుష్కాల మంతయు సుఖముగాఁ బుచ్చును. అట్లుగాక సోమరితనము నవలంబించి కాలము వృథ చేసికొన్నచోఁ దనయాయుష్కాల మంతయుఁ జింతలతోడనే చివికి చివికి యుండవలసి వచ్చును. గనుక మిత్రులారా! మీ రిట్టి దురాచారముల యందుఁ బ్రవర్తింపక తొలఁగియుందురేని సంతోషమును బొందఁగలుగుదురు. దీనినిగుఱించి మీకు విస్తరించి చెప్పు టనావశ్యకము. ప్రాజ్ఞులు గనుక మీరే యోచించుకొనుఁడు. నారాకకై మాగురుభగవానులవా రెదురు సూచుచుందురు. దయ యుంచుఁడు. పోయి వచ్చెదను. నమస్కారములు.

(అని కరుణాకరుఁడు నిష్క్రమించును.)



సుశీలుఁడు—మిత్రమా! వివేకా! ఇపుడు మనకరుణాకరుఁడు సెప్పిన యంశ మంతయుఁ జక్కఁగా గ్రహించితివిగదా! కట్టా! మన మెట్టిపాపమున కొడిగట్టుచున్నాము! మన మిపు డేమిసేయుదము! మునివర్యులయాజ్ఞ దాఁటుదమా? మఱి ప్రాణపరిత్యాగము సేయుదమా?

వివేకుఁడు—సుశీలా! అట్లు సేయుట యుక్తము గాదు. ఆజ్ఞోల్లంఘనము సేయవలసినచో మునివరు లానతిచ్చినప్పుడే చేసియుండవలసినది. "రోట బుఱ్ఱ పెట్టి రోఁకలిపోటునకు వెఱచె" నన్నట్టింతవఱకును బలుబాములకు లోనైతిమి. ఇటుపయిఁ జేయవలసిన దానికి జంకేలా? అదియునుంగాక, గురువులయాజ్ఞ మీఱుట శ్రేయస్కరమైనసంగతి గాదు. వారాజ్ఞాపించినప్రకారము మనము చేసియే తీఱవలయును. దానివలని మంచిసెడ్డలు వారికే చెందఁగలవు. అదియునుం గాక.

"క. సరిగా గుఱిగొని చటుకున
శరము ప్రయోగించినట్టిజగవిలుకానిన్
దరి కేఁగి నిందసేయక
శరమును నిందింప నేమిసార్థక ముండున్."

అన్నట్టు బాణమువేయువారు మనగురువుగారు. మనము బాణములము. కావున నిందు వచ్చునింద వారిదే కాని మన కేమి సంబంధించును? ఈ సంగతి యందఱకును దెలిసినవిషయమే. ఐనను, మన మిట్టిపనులయం దొడంబడకుండుట మంచిదే; కాని, ముందుగా "చేసెదము" అని యొప్పికొంటిమి గదా! ఇప్పు డేమి సేయవచ్చును? వారియాజ్ఞ కణుమాత్రమైన నిటుపై నతిక్రమించితిమేని తోడనే శపింపకమానరు. "నేరక తెచ్చుకొన్నముప్పు నేరిచి తీరుచుకోవలె" నన్నసామెతగా నెట్లో యిప్పటికీ కార్యము

నెఱవేర్చి యిటుపయి నెప్పుడుఁ గీడ్పొనర్చెట్ట సందర్భముల కొడిగి యుందము. దీనితో బుద్ధివచ్చినది.

సుశీలుఁడు—అట్లయిన సరి బాగుగనే యున్నది నీ వన్నట్లు కర్మముల వలనిఫల మాచార్యులవారిదే యైనయెడల మనకు లవలేశమును భయపడవలసిన యవసరమే లేదు. నీవు చెప్పిన చొప్పున మన మీపనిమాత్ర మెట్లో కొనసాగునటు జేసి పిమ్మటఁ గొంత తొలఁగి యుందము. నీయాలోచనము సరిగానే యున్నది. చాలఁ బ్రొద్దెక్కినది రమ్ము పోవుదము.

(నిష్క్రమించుచున్నారు).

ఇది తృతీయాంకము.





## చతుర్థాంకము.

## ప్రథమరంగము.

**స్థలము :** కాశీనగరపు బ్రాహ్మణవీథి.

**కాలము :** ఉదయము.

**పాత్రములు :** బ్రాహ్మణవటువులు, దేవదాసుఁడు,

కృష్ణస్వామి—ఒరే శేషా! ఆతల్లీబిడ్డ లెవరో అడిగి తెలుసుగున్నావఁటరా?

శేషుఁడు—అడిగి తెలుసుగోవడాని కేముందిరా! వాళ్ళే చెప్పేరురా.

కృష్ణస్వామి—అయితే యెవళ్ళురా వాళ్ళు?

శేషుఁడు—కాలకంఠుఁడుతాతగారింట్లో పని చెయ్యడానికి వచ్చియున్నవాళ్ళఁట! నువ్వొక్కడో చెవిటిపీనుఁగలా వున్నావురోయి! వాళ్ళు చెప్పినమాట నువ్వు వినేలేదా?

శ్రీనివాసుఁడు—ఇన్ని యోచన లెందుకురా దీనికి? ఆపిల్లవాణ్ణే అడుగుదాం. వాడే చెబుతాడు. అడిగితే తప్పా యేమిటి?

శేషుఁడు—(దేవదాసునివైపు తిరిగి) అబ్బాయీ! యిలారా. నీపేరేమ్టిరు?

దేవదాసుఁడు—స్వామీ! నాపేరు దేవదాసుఁడు.

శేషుఁడు—దేవదాసుఁడా! పేరేమో బాగానే వున్నాది. మీ రెవళ్ళు? యింతకుముం దెక్కడుండీవారు? మీసంగతి కొంచెం వివరంగా చెప్పగలవూ?

దేవదాసుడు—స్వామీ! మాబాబయ్యగారు, అయోధ్యాపట్టణమును పాలించిన హరిశ్చంద్రచక్రవర్తి.

శ్రీనివాసుఁడు—ఓహోహో! వారా? తరువాతను చెప్పు. బాగుగానున్నది. ఏల యిట్లు వచ్చితిరి?

దేవదాసుఁడు—స్వామీ! మారాజ్యమును మాబాబయ్యగారు విశ్వామిత్రమహామునికి దాన మిచ్చిరి.

కృష్ణస్వామి—ఒరే శేషా! నేను ముందే చెప్పినాను గానఁటరా. ముఖం చూడగానే తెలియలేదఁటరా. బానిసపడినాగాని మహారాజులముఖవర్చస్సుకి భంగం వస్తుందనుకున్నావా యేవిఁటి?

శ్రీనివాసుఁడు—ఆసంగతి అలా వుండనీయరా. వూరికే అడ్డదిడ్డంగా మాటలాడుతావు పాపం! ఆపిల్లవాడిసంగతి విచారిద్దాం రారా! ఒక్కొక్కటే అడుగుతే వాడు కలవరపడకుండా చెబుతాడు. మనం నలుగురం నాలుగువేపులా అడుగుతూ వుంటే వాడు తెల్లబోయి యెవరికీ జవాబు చెప్పలేక వూరుకుంటాడు.

శేషుఁడు—రాజ్యం పోతే యేమి? మీ రిక్కడి కెందుకు వచ్చి వున్నారు?

దేవదాసుఁడు—మాబాబయ్యగారు ఆమునికి అప్పు తీర్చవలసి వచ్చినది. అందుకుగా మేమీనగరము చేరి మాఅమ్మ నేను తాతగారింట పనులు చేయుట కొప్పుకొని వారిదగ్గర ధనము పుచ్చుకొని ముని కిచ్చి అప్పు తీర్చివేసితిమి.



కృష్ణస్వామి—అదివుండనీగాని మీతండ్రిగారు మునులవారి కెందు కప్పుపడ్డారు?

దేవదాసుఁడు—స్వామీ! ఆసంగతి అంతయు మాఅమ్మ నడిగినచో బాగుగా తెలియును. నేను చిన్నవాఁడను గదా నా కెలాగు తెలియును?

శేషుఁడు—ఉండనీ. అయ్యో! పాపం! మహారాజులై వున్నవారే చూశావా యెలాబానిసలైపోయినారో! ఒరే కృష్ణా! వీణ్ణి జాగ్రత్తగా పిలుచుగుపోయి వాళ్ళతల్లిదగ్గిర చేర్పించవలెరా.

కృష్ణస్వామి—వీడితల్లి మనతో మొదటనే చెప్పిందిగాదఁటరా! మనమున్ను అందుకు వప్పుకొన్నాం. వప్పుకున్నప్రకారం చెయ్యకపోతే బాగుంటుందామరి.

శేషుఁడు—ఒరే శ్రీనివాసా! ఒరే కృష్ణా! యిలా రండర్రా అడివి దగ్గిరికి వచ్చేశాము. యెవళకి కావలసినవస్తువులు వాళ్ళువేగంగా సేకరించుకోండి. ఒరే కృష్ణా! నువ్వీపిల్లవాణ్ణి పిలుచుగుపోయి వీడికి కావలసినదర్భా, సమిధలూ, అన్నీ చూపిస్తూరా. వాడే కావలసినవి సేకరించుకుంటాడు.

ఇది ప్రథమరంగము.

---

## ద్వితీయరంగము.

---

స్థలము : కాశీపురపరిసరారణ్యము.

కాలము : పూర్వాహ్ణము.

పాత్రములు : దేవదాసుఁడు, బ్రాహ్మణవటువులు, సర్వార్థసిద్ధి.

---

కృష్ణస్వామి—ఒరే దేవదాసా!

దేవదాసుఁడు—స్వామీ! ఇదిగో ఇక్కడనే ఉన్నాను.

కృష్ణస్వామి—ఇక్కడకిరా. చూడూ యిదే దర్భ, యిలాగే మరో గడ్డికూడా కనపడుతుంది. ఒకవేళ అదే దర్భని కొయ్యఁబోతావు. జాగ్రత్తగా చూసుగో.

దేవదాసుఁడు—ఔను స్వామీ! చక్కఁగా చూచుకొన్నాను. మఱచిపోను. జ్ఞాపక ముంచుకొనెదను.

కృష్ణస్వామి—ఇలా తిరిగి చూడు. దర్భ వుంటుంది. వేగం కోసుగుని వచ్చి మాతో చేరేం.

దేవదాసుఁడు—స్వామీ! యింక నేమేమి కావలయును?

కృష్ణస్వామి—సమిధలు కావాలి, మావిడాకులు కావాలి, యింకా చాలా కావాలి గాని పాపం నువ్వు వెతకలేవు. పోనీ మేమందరం నీకు కొంచెకొంచెం యిస్తాఁవులే. నువ్వు సమిధలుమాత్రం యేర్పరుచుకో. అవే చాలాకావాలి.

దేవదాసుఁడు—స్వామీ! మీ రన్నట్టు ముందుగా సమిధలు వెదకి సేకరించుకొని వచ్చెదను. స్వామీ! సమిధల కేపుల్లలయినను సరియేనా లేక "ఫలానఫలానా" అని విభజనగా నుండవలయునా?

కృష్ణస్వామి—ఆహాహా! అలా వల్లకాదు. మేడి, గావి, జువ్వి మఱ్ఱి, ఉత్తరేణి, మోదుగ, చంద్ర, మావిఁడి, జమ్మి, వీటిసమిధలు పనికి వస్తాయి గాని ప్రతిచెట్టుసమిధలూ పనికిరావుసుమా.

దేవదాసుఁడు—స్వామీ! సమిధ లనఁగా నేమి? అవి యేమిచేయుదురు?

కృష్ణస్వామి—సమిధ లంటే యిందాకా చెప్పినతొమ్మిది దిన్సులున్నూ. అయితే అవన్నీ నవగ్రహహోమాలకి పనికొస్తాయి. అంతేగాక అందులో కొన్నిమాత్రం కొన్ని కార్యములకు కావలసివుంటాయి. రేపటిదినం వుపాకర్మగనక ముంజికి దర్భా, హోమానికి మోదుగ సమిధలుమాత్రమే కావలసివుంటాయి. అదుగో చూడూ! ఆకనపడుతూవున్నదే దర్భ. వెళ్ళి కోసుగురా. నేనున్నూ పోయి నాకు కావలసినవి సేకరించుకుని వస్తాను. వాళ్ళందరూ ముందుగానే వెళ్ళివున్నారు. ప్రొద్దు చాలా అయిపోతూవుంది.



దేవదాసుఁడు—స్వామీ! అట్లే చేసెదను. కాని నన్నుమాత్రము మఱచి యీయడవిలో విడచిపెట్టి వెళ్ళిపోయెదరు సుమండీ!

కృష్ణస్వామి—ఓరి వెర్రివాడా! అట్లుకూడా చేయుదుమా. అందుకేనా యింతప్రయాసం?

దేవదాసుఁడు—స్వామీ! సరియె పోయిరండు. (తనలో) నేను ముందుగా మోదుగసమిధలు సేకరించెదను. అవియే చాల సేకరింపవలయు నని వీరు చెప్పిరిగదా! బహుజాగ్రత్తగా వెదకి యేర్పరించుకొనవలసియున్నది. ఆవచ్చుచున్న క్రొత్తాయన యెవరో?

(సర్వార్థసిద్ధి ప్రవేశించుచున్నాఁడు.)

సర్వార్థసిద్ధి—అబ్బాయీ! నీ వెవరిపిల్లఁడవు?

దేవదాసుడు—(నమస్కరించి) స్వామీ! విధేయుఁ డొకానొక బ్రాహ్మణుని బానిసబాలుఁడు.

సర్వార్థసిద్ధి—ఆహా! యేమినీతి! యేమియణఁకువ! యేమిమర్యాద! అబ్బాయీ! యిప్పు డిక్కడ నేమిచేయుచున్నావు?

దేవదాసుఁడు—స్వామీ! నేను మా కాలకంఠయ్యతాతగారికిఁగా సమిధలు సేకరించుచున్నాను.

సర్వార్థసిద్ధి—ఇంకను ఏమేమి సేకరింపవలయును?

దేవదాసుఁడు—దర్భ యొక్కటియే యిఁక సేకరింపవలసి యున్నది స్వామీ!

సర్వార్థసిద్ధి—ప్రొద్దయిపోవుచున్నదే. ఇంక నీ వెప్పుడు దర్భఁగోసికొనియెదవు?

దేవదాసుఁడు—స్వామీ! యేమయినను, ఇటుపయినిగదా దర్భ కోసికొనవలయును.

సర్వార్థసిద్ధి—అబ్బాయీ! నీవు మంచిగుణవంతుఁడవుగాఁ గనఁబడుచున్నావు. ప్రొద్దుపోయినతర్వాత దర్భ కోయఁగూడదు. అదే ముందుగాఁ గోసి తెచ్చుకొమ్ము. ఇప్పుడు నీవు సేకరించిన సమిధలు సుమారుగా నెనిమిదివేలహోమమునకుఁ జాలును. నీవు మాతోడ రమ్ము. మేమే నీకుఁ గావలసినంత దర్భ గోసి యిచ్చెదము.

దేవదాసుఁడు—స్వామీ! తమ కేల అంతశ్రమ. దయచేసి నాకుఁ జూపించినచో నేనే కోసి తెచ్చుకొందును.

సర్వార్థసిద్ధి—అట్లయిన సరిలే. ఈత్రోవనే వత్తువుగాక. ఈదర్భ చూడు. ఎంతగోముగాఁ బెరిఁగి యున్నదో! ఆదిబ్బమీఁదను జక్కఁగాఁ గా లూఁతసేసికొని యాదర్భ పట్టుకొని లాగుము. వలయునంత సేకరించుకొనవచ్చును.

దేవదాసుఁడు—(కాలుదిబ్బపైఁ బెట్టి వెనుకకు లాగికొనుచునే) అయ్యయో స్వామీ! కాలిలో ముల్లు గుచ్చుకొన్నది. అన్నన్నా! యెంతలోఁతుగా దిగఁబడినదో, హా! అమ్మా! (అని యేడ్చుచుండును.)

సర్వార్థసిద్ధి—అబ్బాయీ! యేడ్వకు, ఏడ్వకు. ఇదిగో మేము వచ్చి ముల్లు తీసివేసెదములే. భయపడకు. (పరుగునఁ బోయి కాలు పట్టుకొని) అబ్బాయీ! నీ వటునిటు గదలకుము. మేము మెల్లఁగా ముల్లును బైకిఁ దీసెదము. (అదిమి గ్రుచ్చుచున్నాఁడు.)



దేవదాసుఁడు—అన్నన్నా! ప్రాణములు పోవునట్టు నొచ్చుచున్నదే. నే నేమిచేయుదును. ఆహా! అమ్మా! రక్తము ప్రవహించుచున్నది గదా!

సర్వార్థసిద్ధి—అబ్బాయీ! రక్తము నిలిచిపోవుటకును, నొప్పి తెలియకుండ నుండుటకును, మందు పెట్టెదను. ఏడువకు మాగుండె నీరయిపోవుచున్నది. అయ్యో! పాప మెంతలోఁతుగా దిగఁబడినదో! (తనసంచినుండి మందు తీసి ముల్లుగ్రుచ్చుకొన్నచోటఁ బెట్టి విషమెక్కించి) అబ్బాయీ! మందు వేసితిని. కొంచెము సేపు పండుకొనుము.

(పరుండఁబెట్టి పరుగెత్తి పాటిపోవుచున్నాఁడు.)

దేవదాసుఁడు—అన్నన్నా! అోమ్మెమోకాని అడఁచుచున్నదే! ఓ బ్రాహ్మణులారా! యేమిచేయుదును! ప్రాణము లెగిరిపోవుచున్నవి. ఓఅమ్మా! అమ్మా! ఆహాహా! అ...మ్మా!

శేషుఁడు—ఒరేకృష్ణా! యేమిరా అటువైపునుండి యేడుపుగొంతుగు వినఁబడుతూవున్నాది. ఆపిల్లవాఁ డెక్కడున్నాఁడురా?

కృష్ణస్వామి—ఇంతసేపూ యిక్కడనే వున్నాడురా. అప్పుడే యెక్కడికిపోయినాడోగాని కనపడకుండా వున్నాడురా. ఒరే దేవదాసా! ఓ దేవదాసోయి! ఒరే శేషా! వా డెక్కడికి పోయాడో గాని యెంతపిలిచినా పలక డేమిటి రా.

శేషుఁడు—ఒరే శ్రీనివాసా! ఆపిల్లవాఁడుగానీ అటువే వున్నాడేమో చూశావురా.

శ్రీనివాసుఁడు—ఎక్కడికి పోయాడోగాని యిటువేపు లేడురా.

శేషుఁడు—అయ్యో! యేమయిపోయాడో చూడ్రా పాపం వ్వాడి గొంతుగులాగే వినపడ్డాది!

కృష్ణస్వామి—ఒరే శేషా! చూడరా పాపం, యిక్కడ పడిపోయాఁడు. అయ్యయ్యో! పరుగెత్తి రండర్రా! నోట్లోనుంచి నురగ లెలా వొస్తున్నా యోనర్రా! అయ్యో! పాపం వూపిరే లేదురా యేఁమో గాని!

(అందఱును గోలలువైచికొనుచు నొకచోఁ గుంపుగాఁ గూడి దొరలించి దొరలించి చూచి ప్రాణము పోయె నని నిశ్చయించుకొని భయమును దుఃఖమును, అభినయింతురు.)

శేషుఁడు—ఏమిరా కృష్ణా! వాణ్ణెందుకురా ఆవేపు పంపినావు?

కృష్ణస్వామి—ఇంతసేపూ యిక్కడనే వుండివుండి యిప్పుడే అలా వెళ్ళినాడురా. ఇంతలో వాడి కింతగతి పడుతుందని యెవరికి తెలుసునురా పాపం!

శేషుఁడు—ఏమిజరిగివుండునని ఆలోచించావురా నువ్వు?

(ఈబాలురమాటలచప్పుడు విని పామొకటి పొదలోనుండి పుట్టలోఁ దూఱుచున్నది.)

కృష్ణస్వామి—ఒరే శేషా! చూశావురా. అదుగో పాము పుట్టలో దూఱిపోయిందిరా. అదేన్రా వీణ్ణి కరిచేసింది. ఆహా! యెంత నాగుబామురా అది! దానిపడగచూశావా యెంత పెద్దదో? అయ్యో! అప్పుడే విషం తలకెక్కిపోయిందిరా. కళ్ళిప్పుడే నల్లగా గాజుపారిపోయినాయి చూడర్రా పాపం! ఇంకేంజేసినా లాభం లేదు. సరి ప్రాణాలే పోయినాయి. వేగం వెళ్ళి వాళమ్మతో చెబుదాం పదండి పాపం! అప్పుడే అస్తమానం అవుతూవున్నాది.

శేషుఁడు—మీా కేమిరా పోయింది. ఆవిడ వాణ్ణి నాకు గదటరా అప్పగించింది. నన్నడిగితే నేనావిడి కేంబదులు చెప్పఁగలనురా? అయ్యో! పాపం యీా సంగతి వింటే ఆవిడ వెంటనే ప్రాణాలే విడిచిపెడుతుం దనుకుంటాన్రా! దానిప్రారబ్ధం యిలావుంటే యెవ



రేమి చేయఁగలరు? సరే మనం యిక్కడ వుండిమాత్రం యేమి చెయ్యగలం పదండి వూళ్ళోకి పోదాం.

కృష్ణస్వామి—అయ్యో! పాపం, ఆవిడ పంపేటప్పుడే భయపడ్డాది. ఆవిడనుమానంపడ్డట్టుగానే కొస కలాగే జరిగిపోయింది. పాపం ఆవిడికి వీ డొక్కడే కాఁబోల్ను కొడుకు. యేంకాలం! క్షణంలో యెలా మాఱిపోయిందో చూశావా?

శ్రీనివాసుఁడు—ఒరేకృష్ణా! కొసకి మనకూడా యిలాగే గదా అవుతుంది. వాళ్ళవాళ్ళకి బ్రహ్మదేవుఁ డెన్నాళ్ళాయువు పోస్తాడో అన్నాళ్ళదాకానే గదా బ్రతికి వుండవలసినది. ఆరోంత ఆయువూ అయిపోగానే అందరూ యిలాగే అయిపోతారు. ఛీ పాడుముండా సంసారం!

శేషుఁడు—యీా వేదాంతాలన్నీ ఒగళ్ళకి కష్టం వచ్చినప్పుడుమాత్రం మనకి జ్ఞాపకం వస్తాయి. ఆ కష్టం మనకే కలిగితే మనకీ దుఖ్ఖం గానే కనపడుతుంది. అయ్యో! పాపం వాళమ్మ యేమనుకుం టుందో యేవిఁటో? యీా సంగతినిగుఱించి మన వాఁ విడతో యేవఁని చెప్పగలం!

కృష్ణస్వామి—మన వేఁంచేస్తాంరా, ఆవిడతో జరిగింది జరిగినట్టు చెప్పుదాం. మనం కనపడగానే "మా పిల్లవాడేడి నాయనలారా!" అని అడక్కమానదు. మొదటినుంచీ జరిగినసంగతంతా చెప్పే దాం. యేడుస్తే యేడుస్తుంది. యేడిస్తే యేవుఁంది. కొట్టుగుంటే యేవుఁంది. యేంచేసినా యేవీఁ లాభం లేదు. పోదాం లెండి. అస్తమాన వఁయిపోతూ వుంది. యింకా సంధ్య వారుచుకోలేదు. మానాయన కోప్పడతాడు.

(అందఱును నిష్క్రమించుచున్నారు).

ఇది ద్వితీయరంగము.

## తృతీయరంగము.

స్థలము : కాలకంఠుని యిల్లున్న వీథి.

కాలము : సాయాహ్నము.

పాత్రములు : కాలకంఠుఁడు, కాలకంఠి, చంద్రమతి, బ్రాహ్మణబాలురు.

(చంద్రమతి చెట్లకు నీరుపోయుచునే తలఁచుకొనుచున్నది.)

చంద్రమతి—(తనలో) హా! దైవమా! మమ్ముల నెన్నివిధములుగా శోధించుచున్నావు! పిల్లవాఁ డేమిచేయఁగలఁడు? నగరిలోని గదిలోనికిఁ బోవుటకే సాయము గోరుచుండెడివాఁడు. హా! యెనిమిదేండ్రపిల్లవాఁ డెక్కడ? కటకటా! కంటకాహితఘోరాటవి యెక్కడ? అయ్యో! వాఁడు దేని నని వెదకఁగలఁడు? దర్భ, సమిధలు, మామిడాకులు మొదలగునవి యిట్టివి యని వాని కేమితెలియును? వెంట నున్న బ్రాహ్మణకుమారులు దయ దలంచి యవి యన్నియుఁ జూపించి సేకరించి యియ్యకుందురా? యేమనఁగా:—

"ఉ. భూసురకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టినతోడనె పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహితసమ్మతబుద్ధియుఁ జిత్తశాంతియుణ్
మానమదప్రహాణము సమత్వము సంతతవేదవిద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముణ్ గరుణాపరత్వమున్."

అని కదా పెద్దలు సెప్పుచుందురు. కావున నెంతపసిబాలురైనను బ్రాహ్మణకుమారు లగుటచే నంతమాత్ర మయినను సాయము సేయకుందురా? నేను జెప్పి వచ్చితినిగదా! హా! విశ్వేశ్వరా! నా ప్రియకుమారుఁడు నాముద్దులమూట వచ్చి చేరున ట్లనుగ్రహింపుము. ఇదియే మాకు మహోపకారము.



కాలకంఠి—ఒసే చెంద్రీ! యేం చేస్తూ వున్నావే? పన్లన్నీ చేయడవఁయిందా యింకా లేదా? వూరూరుకే యేవోఁ తడబిడలాడుతున్నావులే. పిడికలన్నీ పెట్టడవఁయిందా? మరేవచ్చి పాదులకీ మొక్కలకీ నీళ్ళు తోడి పోశావా? యెంతపొద్దు పోయిందో చూశావా? తెల్లారింది మొదలస్తమానం పడీదాకా నువ్వేంచేసినట్టూ అని అడుగుతాన్లే. ఆపిల్లాణ్ణడివికిపంపింది మొదలుకుని నువ్వేవోఁ ఆవతిన్నపసరంలా వూరికే గుంజుకుంటున్నావులే. అదేవీఁ అని అడుగుతా. అడివికీ వెళ్ళక కొండకీ వెళ్ళక యెన్నాళ్ళిలా గుండెలుమొయ్యా మేపి కూచోపెట్టా లనుకున్నావు. యింతా అంతా బోలెడు సొమ్ముగదా మీాయధాన్ని గుమ్మరించి కొనుక్కున్నాం.

చంద్రమతి—అమ్మా! పిడుకలు పెట్టుట యయినది. పాదులకును మొక్కలకును నీరు దోడుచున్నాను. తల్లీ! యిఁక రెండుమూఁడు మొక్కలకుమాత్రమే నీరు తోడవలయును. వేగముగా వానికిఁ గూడ నీరు తోడిపోసి వచ్చుచున్నాను. కోపపడవల దమ్మా!

కాలకంఠి—అదలా వుణ్ణీ. అదేవోఁగాని నువ్వస్తమానం వీధులోకి వెళతావు, ఇంట్లోకి వస్తావు, వీధిలోకి వెళతావు, ఇంట్లోకి వస్తావు. అదేవిఁటీ అని అడుగుతా. యిలా నీయిష్టంవచ్చినట్లల్లా తిరుగుతూవుంటే యింట్లో పన్లెవరుచేస్తా రనుకున్నా వేవిఁటి!

చంద్రమతి—మరేమియును లే దమ్మా! బిడ్డఁడు వచ్చుచున్నాఁడేమో యని చూచుటకు వెళ్ళితిని.

కాలకంఠి—యింటి కొచ్చేవాడికి తోవతెలియదా అని అడుగుతా. పోయినవా ళ్ళంతా వస్తే మీాగుంటడూ వస్తాడు రాకేం అడివిలో కాపరంగానీ వుంటాడనుకున్నావా యేవిఁటి? యింట్లో పన్లూ

పాటలూ మానేసి నువ్వెందుకలా వీథులోకెళ్ళి తొంగితొంగి చూస్తావూ?

చంద్రమతి—అమ్మా! ప్రొద్దు ప్రాలి చాలఁ గాల మయినది. పోయి నవాం డ్రింకను వచ్చిన ట్లగపడదు. చీఁకటిపడినయెడల బిడ్డఁడు భయంపడును. ఎప్పుడును నన్ను విడిచి యొక్కడకును బోయిన వాఁడు గాఁడమ్మా! తల్లీ! తమ రనుగ్రహించి యఱగడియ సేపు సెలవు దయచేయించితిరేని యీవీథికొసవఱకైనను బోయి చూచి వచ్చెదను.

కాలకంఠి—అదేవోఁగాని చెంద్రీ! నీమాట లంతకంతకి వింతగా వున్నాయిసుమా! అదేవోఁ నాకు తెలియదమ్మా నీసంగతి చూడగా వోనాటికోనాడు కొత్తకొత్తగా కనపడుతూవున్నాది. యిలాగయితే నావల్లగాదమ్మా. మీా రున్నారు. మిమ్మల్ని కొనుక్కొచ్చిన ఆబ్రాహ్మడున్నాడు. పోనీగాని చెంద్రీ! పొద్దస్త మాన వఁయిందిగండా వీథిగుమ్మం తుడిచి రొండునీళ్ళు చల్లి రొంత ముగ్గుపెట్ట తల్చుకున్నావా లేదా! యింకా వొత్తులెప్పుడు చేస్తావు? దీపా లెప్పుడు వెలిగిస్తావు?

చంద్రమతి—అమ్మా! ఆపను లన్నియుఁ జేసినతరువాతనే పోయి చూచివచ్చెదను. అందులకే తమయనుమతి వేఁడుకొనుచున్నాను.

కాలకంఠి—ఒసే చెంద్రీ! వూరూరుకే నన్ను చెడ్డదాన్ననిపించడాని గ్గానీ లేకపోతే యింట్లోపల్లన్నీ అయాక వూరికే కూచోడవేఁ గాదుషే. అలాటప్పుడు చూసొస్తే పోయె యెవరొద్దన్నారు? ఇంతలో వాఁడుమాత్రం రాక అట్టేవుంటాఁడా యేవిఁటి?

చంద్రమతి—అమ్మా! బిడ్డఁడు వచ్చినపోఁ బోవుట కవసరమే లేదు. ఒకవేళ రానియెడల నాకనుజ్ఞ దయచేయింపవలయును.



కాలకంఠి—అబ్బా! అలాగే కానియ్యే నీయిష్టం. వూరికే కాల్చు గుతినేస్తూవున్నా వదేవోఁగాని. నేనూ చాలామందిమనుషుల్ని చూసున్నానుగాని నీ లాటిఆడదా న్నెక్కడా చూళ్ళేదమ్మా! యెప్పుడుచూసినా కొంపలో అల్లరీ కేకలూ కొసకి కాలకంఠి మంచి దిగాదనిపించి నామొగం కాలిపించడవుఁన్నూ.

చంద్రమతి—(నిర్ణీతకార్యము చేయుచునే తనలో) అయ్యో! దైవమా! యింకను బిడ్డఁడు రాఁడాయె. సమిధలకై చెట్టెక్కినప్పుడు కాలుజాఱి పడియున్నాఁడో యేమో? ఏనూతులోఁ బడిపోయినాఁడో? మఱి యేడొంకలలోనికిఁ బోతే యేపురుగు కరచినదో? యేమి సేయుదును? నాకేమోకాని మనస్సు బెగిలిపోవుచున్నది. కన్నులు చీఁకట్లు గ్రమ్ముచున్నవి. పోనిమ్ము పిలుచుకొనిపోయిన బ్రాహ్మణకుమారులైనను వచ్చినట్లు కనుపట్టదు. నేను దలంచు కొన్న ట్టే దైనను సంభవించియున్నచో నొకరైనను పరుగెత్తు కొనివచ్చి చెప్పరా. కాదుకాదు "స్నేహము పాపశంకి" యను సామెతగా నేనేదో నాప్రేమచేత నిట్లుతలంచుచున్నాను. కాని వాఁడు బరువు మోయఁజాలక త్రోవలో నక్కడక్కడ బరువు దించుకొనుచు నుండుటచే నింతయాలస్యమైనది. వానికై పాప మాబ్రాహ్మణకుమారులును నాఁగవలసివచ్చుచున్నది. ఇఁక నీపను లన్నియు వేగముగా ముగించి కొంతదూర మెదురుగాఁ బోయి యాబరువు నానెత్తిమీాఁదఁ బెట్టుకొని నాముద్దులపట్టిని జంకఁబెట్టుకొని వేగముగా నింటికిఁ బరువెత్తి వచ్చెదను. (పనులు ముగించి కాలకంఠియొద్దకుఁ బోయి) అమ్మా! తాము సెలవిచ్చిన పనులన్నియుఁ జేసితిని. పోయి యిక్కడనున్నట్టుగానే వచ్చెదను.

కాలకంఠి—ఒసే చెంద్రీ! నాకుతెలియ కడుగుతానుగదా యిప్పుడింత వేగంగా పల్లెలా చేశేవే? వోసెమ్మా నేనెక్కడా చూళ్ళేదే.

కొడుకుమీద నీకింత ప్రావేఁవిఁటే. యెంతచవఁతకారవైఁన ఆడదానివే మాతల్లి కానా! నీ అవుసరంవొస్తే వోలాగా అవుసరంరాకపోతే వోలాగాగదా పన్లు చేస్తున్నావు. నీసంగతంతా క్రవఁంగా తెలుస్తూందిలే. యీమీద నేనూ జాగర్తాగానె వుంటాను.

చంద్రమతి—అమ్మా! తాము తలంచినట్లు నే నెప్పుడును వంచన బుద్ధితోఁ బనులు చేయుదానను గాను. నే నమాయికముగనే యొడలు వంచి పనులు చేయుచున్నాను. మాదినములవంకరను బట్టి తమ రాలాగునఁ దలంచితిరి. పోనిండు నేనేమిచేయఁగలను? మనస్సు చాలఁ దొందరపడుచున్నది. అనుజ్ఞ యైనచోఁ ద్వరగాఁ బోయివచ్చెదను.

కాలకంఠి—యింకపోవే. పో. చూడూ మరేవచ్చి యింకా యెన్నో పన్లు అలా పడున్నాయి నువ్వుమాత్రం యిక్కడున్నట్టు రావాలి సుమా!

చంద్రమతి—అమ్మా! అట్లే వచ్చెదను. నాకచ్చట నాలస్యము చేయవలసినంతపని యేమున్నది. బిడ్డని తీసికొని వచ్చుటయే కదా! (అని నిష్క్రమించుచుఁదనలో) చీఁకటి నలువైపులను గ్రమ్ముచున్నది. ఇంకను వచ్చుజాడ గన్పట్టకుండనున్నది. పోనీ యొక్కమాఱు గట్టిగాఁ గేకవైచి పిలిచెదను. (పైకి) నాయనా! దేవదాసా! (తేరిచూచి) బాలురు వచ్చుచున్నారు. ఆఁ. అవును. నెత్తిమీఁద మూటలు మొదలైనవి పెట్టుకొని వచ్చుచున్నట్లున్నది. వీరితోడనేకదా మానాయనయు రావలయును. వేగముగా నెదురుగాఁబోయెదను. (వేగముగఁ బోయి బ్రాహ్మణబాలురం జూచి) నాయనలారా! మాపిల్లవాఁ డెక్కడ నున్నాఁడు? అయ్యో! వాఁడు మీలో నగపడఁడేమీ? నన్ను దుఃఖపెట్టుటకు దాఁగియున్నాఁడేమో?



శేషుఁడు—లేదులేదు. (తనలో) అన్నా! యీమెతో యీపాపపు సంగతి చెప్పటకు నోరెలావస్తుంది?

చంద్రమతి—నాయనా! మఱి యేమిసంభవించినది? అయ్యో! నా పుత్త్రరత్నమున కేమిజరిగినది? స్వామీ! వేగముగాఁ జెప్పఁడు నాయొడలు వడఁకుచున్నది బాబూ!

కృష్ణస్వామి—అమ్మా! యేడవకుండా వింటానంటే చెబుతాను. వినండి. మేమంతా కలిసి అడవికి పోతిమి. మీపిల్లాడున్నూ మాతోనే వున్నాఁడు. తరవాత మేమంతా తలోవైపునకూ సమిధలు తెచ్చుకోవడానికి పోతిమి. వాడోమూలకి సమిధలకోసం వెళ్ళిపోయినాడు. పోయినకొంతసేపటికల్లా ప్రాణాంతమైన యేడుపుచప్పుడు వినపడ్డాది. మేమంతా పరుగెత్తిపోయి చూచేటప్పడికి మీపిల్లాడు పడిపోయివున్నాడు. ఆచుట్టుపక్కలన్నీ బాగా చూశాం. వాడిదగ్గిర్నుండే నాగుబాఁవొకటి పుట్టలో దూరిపోయింది. వెంటనే వాణ్ణిటూఅటూ దొర్లించి చూశాం. అప్పటికే విషం తలకెక్కిపోయింది. నోట్లో నురగలు కనపడ్డాయి. ప్రాణాలు లేవు. ఒట్టికొయ్యై పడివున్నాడు. దైవయత్నానికి మనవేఁం చెయ్యగలం తల్లీ. మేంమాత్రం యేదీ యీడుచుగుపోకుండా యిన్నాకులకొమ్మలు విరిచి మీద కప్పి వస్తిమి.

చంద్రమతి—అయ్యో! అయ్యో! అయ్యో! నాపుత్త్రరత్నమా! ఇఁక నేనేమి చేయుదునురా తండ్రీ! (అని పడిపోయి, లేచి నెత్తి మొత్తుకొనుచు నేడ్చుచున్నది.) ఓరీ నాతండ్రీ! నాతండ్రి! ఇంక నే నీప్రపంచకములో నెట్లుండఁగలనురా నాయనా! నాయనా! నాబాబూ! నాబాబూ! నా వెలలేని మాణిక్యమా! నామాణిక్యమా! నాముద్దులమూటా! నాముద్దులమూట! నావరహాల

మూటా! నావరహాలమూట! నాచిన్నారిచిలుకా! నాచిన్నారి చిలుక! అయ్యో! నాయనా! దగ్గర నేడ్చువారు సయితమును లేక అనాథప్రేతమవై పడియున్నావా! నాతండ్రీ! నాబాబూ! అక్కటా! యెంతకష్టము సంభవించినది! (ముఖమును జేతులతో గట్టిగా మూసికొని) స్వామీ! నాకుమారుఁ డెచ్చటఁ బడియున్నాఁడో దయచేసి కొంచెము చెప్పితిరేని పోయి శవమునైనను జూచుకొని యేడుచుచు మొత్తుకొనుచు నాచేతులారఁ బెంచిన నాచిన్నికుమారుని నాచేతులార నేనే కాల్చి వచ్చెదను. అయ్యో! నా వెలలేనిమాణిక్యమా! యీపని నాచేతులారఁ జేయుటకా నేను బ్రదికియున్నాను! అయ్యో! యేమిచేయుదును. నా ప్రాణేశ్వరుఁ డైనను లేకపోవలసి వచ్చినదిగదా! దైవమా! నన్నీయాఁడుజన్మ మిందులకా యెత్తించితివి. అయ్యో! నాయనా! తుదకు దిక్కుమాలినపీనుఁగ వై పోతివిరా! నాకొడుకా!

శేషుఁడు—అమ్మా! యేడుస్తే ప్రయోజన మేమున్నాది? యింకేం జేసినా సార్థకం లేదు. ముందుజరిగించవలసినపనులు చూడండి. చూడండీ! యీతోవనే నాలుగుగడియలదూరం పోతే పెద్ద బ్రంహాండమైన మఱ్ఱిచెట్టొకటి కనపడుతుంది. ఆ చెట్టుకిందే మీవాడిశవం పడివున్నాది. మీరు వెళ్ళండి. మేమున్నా యిళ్ళకిపోయి యింకా స్నానాలుచేసి సంధ్యవారుచుకోవాలి. యింకా రాత్రిరైపోతే నక్కలేనా యేవైనా వచ్చి శవాన్నీడ్చుకుపోతాయో యేవుఁటో? వేగంగా వెళ్ళి శవాన్ని కాలిచి రండి. యెందు కేడుస్తా రమ్మా! వూరుకోండి,

శ్రీనివాసుఁడు—అమ్మా! వాడి కంతే ఆయువున్నాది. లేకుంటే "ఒరే సమిధలుమాత్రం సేకరించుకో, మేమందరవూఁ నీకు దర్భా, ఆకులూ, అన్నీ కొంచెంకొంచెం యిస్తాం" అంటూవుంటే



వాడే దర్భకోసుకురావడానికి వెళ్ళవలెనా? వాడివిధి వాణ్ణలా యీడ్చుకుపోయింది. మనవేంచెయ్యగలం తల్లీ! యేడవక వేగంగా పోయిరాండి.

చంద్రమతి—అయ్యో! హతవిధీ! పాపాత్మురాల నగు నన్నుఁ దీసికొనిపోరాదా? నే నందులకుసయితము పనికిరాకపోతినా? నా ముద్దులకొడుకా నీకంటి కగపించినవాఁడు! అయ్యో! యిట్టిమాట వినియును నాగుండె నూఱుముక్కలయినను గాకపోయినది. అక్కటా! యేమిచేయుదును. వెళ్లి చూచివచ్చుటకైనను యజమానులయనుమతి కావలయును. వెళ్ళి యేడ్చుచు వారినే బ్రతిమాలుకొనియెదను.

(ఏడ్చుచునే యింటికి వచ్చినది.)

కాలకంఠి—ఒసే చంద్రీ! నువ్వు వెళ్ళి యెంతసేపే అయిందీ? యిక్కడున్నట్టురావే అని నేనంటే నువ్విదివరదాకా యేం చేస్తున్నావే. బాగానే వున్నాది నీసమాచారం. ఇలా అయితే వల్లపడదుసుమా అంటాను.

చంద్రమతి—(గద్గదస్వరముతో) అమ్మా! నాగతి యేమని చెప్పఁగలను?

(అని యేడ్చుచుండును.)

కాలకంఠి—యేవుఁటో చెప్పకుండా అదేవిఁటే అలా యేడుస్తున్నావు. చెప్పే సంగతేవుఁటోనూ, నువ్వొక్కడో మొద్దులావున్నావు సుమా!

చంద్రమతి—అమ్మా! నాకొడుకు—

(అని పైఁటచెంగుతో మొగము గప్పుకొని గోలున నేడ్చుచున్నది.)

కాలకంఠి—వాడి కేవేఁ వెఱ్ఱిమొగవాఁ! ఆపిల్లాళ్ళతోగూడా అడివికి పోయాడు వాళ్ళతోగూడా మళ్ళీ వస్తాడు. అడివికిపోయినవాళ్ళు

రాత్తి రింటికి రాక అక్కడగానీ కాపర వుంటా రనుకున్నావా యేవిఁటి?

చంద్రమతి—(గద్గదస్వరముతో) నాకొడు కెట్లురాఁగలఁ డమ్మా! పామునోటిలోఁబడిపోయినాఁ డమ్మా నాకొడుకూ! అడవిలోని పెద్దమఱ్ఱిచెట్టుక్రిందను బడియున్నాడఁటమ్మా! నానాయనా! నే నింక నెట్లు బ్రదుకఁగలను దల్లీ.

(అని యేడ్చుచుఁ గాలకంఠి పాదములదగ్గరఁ బడిపోయినది.)

కాలకంఠి—అయ్యో! అయ్యో! ఓరి పాపాత్ముఁడా! మమ్మల్ని మోసంచేశావుట్రా మాకొంపముంచేశావుట్రా! ఓరిగుంటపాడ గట్టా! అయ్యో! నాకడుపు భగ్గున మండిపోతూవుందమ్మయ్యో! యెన్నాళ్ళు కూడబెట్టినసొమ్ము వీడియథాన్ని గుమ్మరించేవేఁ మాతల్లీ! అదంతా బూడిదిలోపోసిన పన్నీరయిపోయిందే మా అమ్మా! నువ్వెందుకే యేడుస్తావు చంద్రమ్మా! సొమ్ముపోయిన వాళ్ళం చచ్చేదాకా మేవేఁడుస్తావేఁ నాతల్లీ. నువ్వూరుకోవే చంద్రీ! అయ్యో! అయ్యో! ఆపాపిష్ఠిబ్రాహ్మడికి అంతేకావాలి, ఇంకాకావాలి. వాడిసిగతరగా నేనోరు కట్టుకుని పేడమ్మి, పిడిక లమ్మి, చల్లమ్మి, చవుఁరమ్మి కూడబెట్టుకున్నానే తల్లీ! నేనింట్లో లేకుండా చూసి నాకు తెలియకుండా పట్టుగుపోయి గుమ్మరించి కొనుక్కొచ్చాడే మాఅమ్మా! నన్నడుగుతాడా చేస్తాడా చెందు తాడా ఏవేఁనేనా! తన కేంతోస్తే అదే చేస్తాడు. పోనీగదా ఇంట్లో ఆడముండాకూతు రుంది దాంతో చెప్పి మరీచేదాం అన్న జ్ఞానం లేకపోయిదంమ్మా మొగాడికీ, వీడేళ్ళేత్తుగుమండా వీడి కెళ్ళినే ళ్ళేవరికెళ్ళేయోనూ! నాకడుపులో ఏవోఁగాని అంతకంతకీ మంటెక్కువయిపోతూ వున్నాది దేవుఁడా! నే నేంచేతును భగ



వంతుఁడా! నాకిలాటిమొగు డెక్కడదాపరించేడోనమ్మా వీడి మొగం మొద్దుల్లోపెట్టేసిరానూ! వీడిశ్రార్థం చెట్టుకింద పెట్టా వీడిపిండాకూడు పిల్లులకు పడెయ్యా నాగొంతుగు తెగీతెగనికత్తితో కోసీశాడే వీడు మొగుడు గాడే నాపాలింటిమృత్యువుదేవతే మా అమ్మా! యెంతసొమ్ము గంగలో కలిసిపోయిందే అమ్మయ్యో! పోరునష్టం పొందులాభం అని యెంత చెవి నిల్లుగట్టుకొని పోరినా నామాట చెవిని బెట్టేడు గాడే అమ్మయ్యో! రాత్రీ పొగలూ వూరికే పోరు పోరు పోరునాబతు గాదినుం చంతెందాకా పోరు తోటే తెల్లారిపోయిందమ్మా! ఆబ్రాహ్మడితోనే చెప్పదాం. ఔనా ఏవఁండోయి! ఆఁ. ఇలా చూస్తురూ. వినిపించుకోరేం. మిమ్మల్నే. ఇలా వొక్కమారు రండి నామొగంకాల్చేశారు. నాకాపరం గంగలోకలిపీశారు.

(కాలకంఠుఁడు ప్రవేశించును.)

కాలకంఠుఁడు—(తొందరగా) యేవొఁచ్చిందే అలా రుంజుకుంటూ వున్నావూ! చెప్పవేవేఁ. ఇప్పడి కిప్పడే యింతలో నీపుట్టేం మునిగిపోయిందే బొనిసిముండా! రాత్రీ పొగలూ నీఅల్లరితోనే సరిపోతూ వుందిలే.

కాలకంఠి—మునిగేదేదో మీాధర్మాన్ని మునిగే పోయింది. ఇంకే వుఁన్నాది మునిగిపోడానికీ అంటాను.

కాలకంఠుఁడు—ఏం మునిగిపోయిందే సంగతేవుఁటో చెప్పకుండా వూరికే నీయిష్టంవొచ్చినట్టల్లా రుంజుకుంటావెందుకూ అనడు గుతా. చెప్పఘోరించరాదూ, అదేవుఁటోను.

కాలకంఠి—యీాగోష వినండి. నేం చెప్పలేను. నాకడుపు కిరసనాయి ల్నూనిపోసి ముట్టించినట్టు భగ్గూభగ్గూమండిపోతూవున్నాది. మీారుచేసిన అన్యాయంచేతనేకదా నాబతు గిలాకాలిందీ అంఛాను.

కాలకంఠుడు—చెంద్రీ! చెంద్రీ! ఒసేచెంద్రీ!

చంద్రమతి—స్వామీ! ఈ...ఈ...ఈ...(అని యేడ్చుచున్నది)

కాలకంఠుడు—చెంద్రీ! ఏవే అలా ఏడుస్తావున్నావూ? కాలకంఠి గానీ కొట్టిందా ఏవిఁటే, లేక తిట్టిందా? వూరుకో దాన్నో నేవిఁటి! ఇది వోనాటితో తెల్లారుతుందా?

చంద్రమతి—స్వామీ! నన్నుఁ దిట్టుటగాని కొట్టుటగాని లేదు బాబయ్యా! నాకొడుకు స్వామీ! ఈ...ఈ...ఈ.

కాలకంఠుడు—నీకొడుకా, అడివికి పోయాడు. గడియో గడియో వస్తాడు. తోటివాళ్ళంతా వచ్చినప్పుడుగదా రావాలి. వాళ్ళొస్తే వాఁడొకడుమాత్రంరాక అక్కడేవుంటాఁడా ఏవిఁటి?

చంద్రమతి—స్వామీ! వెళ్ళినవా రందఱును రానే వచ్చిరి. నా కొడుకును పాముకఱచినదఁట బాబో! అడవిలో పెద్దమఱ్ఱిచెట్టు క్రిందఁ బడిపోయియున్నాఁడఁట నాయనా! అయ్యో! నాముద్దుల కూనా! నీకెవ్వరూ దిక్కు లేకపోయిరఁటరా? అయ్యో! నాచంటి వాఁడా! నే నేమిచేయఁగలను విశ్వేశ్వరా!

కాలకండుఁడు—ఔనా ఔనా! నేను గుమ్మరించినసొమ్మంతా పోయిందీ? అయ్యో! అయ్యో! ఔనే చెంద్రీ! సొమ్ముపోయిన వాళం మేవేఁడవాలిగాని మద్దిని నువ్వెందుకే అలా ఏడుస్తున్నావూ? ఏవిఁనష్టం వచ్చినా మాకుగాని నీకేంపోయిందే. ఎంత సొమ్ము గుమ్మరించాను! నీకేమీ అంచాను. నువ్వెందుకూ అలా వెక్కి వెక్కి ఏడుస్తావు? అయ్యో! అయ్యో! ఎంతసొమ్ము నష్టం వచ్చిందీ! ఆకక్కుగట్టుతాన్నాడని నేనంతసొమ్ము గుమ్మరించాను గాని లేకపోతే నేనుకొన్నేకొన్ను. ఏవఁయితేనేం లే, కొంప మునిగిపోయుంది. మావొయ్యాలల్ల రే అనుకున్నానుగాని ఇలా నా కొంపమునిగిందని యెరక్కపోయానురా దైవమా!



చంద్రమతి—స్వామీ! అమ్మా! నాపుత్త్రుఁడు చనిపోయి దిక్కులేక అనాథప్రేతమై యడవిలోఁబడి యున్నాఁడు. వానిమరణముచేఁ దమద్రవ్యమునకు నష్టము వచ్చినట్టుగా భావింపకుఁడు. నాకంఠమున జీవముండున్నంతలో నాయెముకలు కఱఁగించియైనను మీ కూడిగము సేయుటకు వెనుదీయుదానను గాను. ఇఁక మీ దనాకుఁ దమయుభయులపాదారవిందములే గతి. మీరే నాకుఁ దలిదండ్రులు.

కాలకంఠుడు—అయితే చెంద్రీ! ఇప్పుడేం చెయ్యాలంటావే.

చంద్రమతి—స్వామీ! నాకొడుకు గతిలేనిప్రేతముగా నడవిలోని పెద్దమఱ్ఱిచెట్టుక్రిందను పడియున్నాఁడు. దయచేసి యుత్తరు విచ్చిన యెడల నిప్పుడే పోయి వెదకి వానిశరీరమును సంస్కరించి వెంటనే వచ్చెదను.

కాలకంఠుడు—ఆహాహా! బాగుంది బాగుంద న్యాయం! యేనాడు మాకు బానిసపడ్డాడో ఆనాడే నీకొడుకు కాడు. ఆమాట నాడే పోయింది. వాడు చచ్చిపోతే మాగ్గదా నష్టం వచ్చిందీ అంచాను. చచ్చినవాడితల దక్షిణంగావుంటే యేం, ఉత్తరంగా వుంటే యేం, వాడు వాడిదారి చూసుగుని వెళిపోనే వెళిపోయాడు. వున్నవాళ్ళు చక్కగా వుండాలిగాని యేంచేస్తే యేవుంది. ఇంక మా దండుగేవోఁతీరేది కనపడదు. అప్పిడే యీపాటి కేనక్కో వొచ్చి యీడుచుగునే పోతుంది. నువ్వెందుకు పోవాలీ అంచాను. అదంతా పరిపడదు. యీఅర్థరాత్త్రివేళ నువ్వొంటిగా అడివికి పోతే నిన్నే దేనా చంపేస్తే మాసొమ్ముమాట! అలా వల్లగాదు. యిలాటప్పు డడుగుతీసి అడుగావలపెట్టడానికి వల్లగాదు, పోపో. యింట్లో పనీపాటూ చూసుగో, పో

కాలకంఠి—మీరు పుట్టిపిచ్చిబ్రాహ్మడివి. మీ కోపిస్సరైనా లోకం తెలియదు. అలాగ్గాదు. ఇందులో యేదో మర్మం వుందిగాని లేకపోలేదు.

కాలకంఠుఁడు—అదేమిఁటే అలాఅంటున్నావు? నామట్టు కేమీఁ తోఁచకుండావున్నాది.

కాలకంఠి—ఆకక్కగట్టు నక్కడెక్కడో దాగివుండమని చెప్పింది, వాడు చచ్చిపోయాడని మిషపెట్టి తానుకూడా మెల్లిమెల్లిగా కాలికి బుద్ధిచెప్పి యిద్దరూ ఒకటిగాచేరి పారిపోడానిక్కానీ ఆలోచించుగున్నారు గంబోలును. అంతే అంతే.

కాలకంఠుఁడు—వోహో! ఔనుసుమా నువ్వన్నట్టే జరిగుంటుంది. ఆసి నీబుద్ధి బంగారంగానూ యేంమంచిమాట చెప్పేవే. యేం మంచి యుక్తి చెప్పేవే. నే నింకా అమాయికంగా వింటూ వున్నానే, యేమేఁ చెంద్రీ! వున్నమాటేనా! చూశావా నీమాయ లెంతలో కనుక్కున్నాదో మీఅమ్మ. యేమఁయినా "పాముఁకాళ్ళు పాముఁకే తెలియూ" లన్నసామెఁతగా ఆడవాళ్ళమాయలూ మర్మాలూ ఆడవాళ్ళకే తెలుస్తాయి. చూడూ నీపన్నాగమేఁతా మాయింటిది నిమిషంలో యెలా పోల్చేసిందో మఱి.

చంద్రమతి—స్వామీ! తమ కిట్టిచెట్టతలంపు పుట్టుటకు నేను గత జన్మములలో నెట్టిపాపము చేసియున్నానో తెలిసికోఁజాలనుగదా! ఇట్లు మోసపుచ్చుటకుఁ గూడఁ దలంపు గొనువా రెందైన నుందురా? మాపిల్లవాని నడవికిఁ దీసికొనివెళ్ళిన బ్రాహ్మణబాలురుగదా నాతో నీవార్త చెప్పిరి. అంత నామాటయందు నమ్మకము లేనిచో వారిని పిలిచి యడుగరాదా! అయ్యో! నా యిహపరముల కాధారమైననాముద్దులాఁడు చచ్చిపోనిదే చచ్చి



పోయె నని చెప్పుటకు నాకు నాలుక యెట్లు తిరుగు ననుకొంటిరి స్వామీ! అనుగ్రహించి యనుమతి దయచేసినయెడల నేనిపుడే పోయి వానిని సంస్కరించి వీలయినంత వేగముగా మరలి వచ్చి తమయూడిగములు చేయుదును స్వామీ!

కాలకంఠుఁడు—ఒసే విన్నావు గదా చెంద్రి అంచూన్నమాటలు!

కాలకంఠి—విన్నా విన్నా అంతా విన్నాను. అలాగే, దొంగవాళ్ళెప్పుడైనా నిజం చెబుతారకున్నారా ఏమిఁటి? మీ సత్తిగాలం యెన్నాళ్ళకీ వొక్కలాగే వున్నాది. ఔనే చెంద్రీ! నాకు తెలియ కడుగుతానుగందా బానిసపడ్డవాడికి మువ్వొళ్ళి చేసీదేమిఁటీ అంఛాను. మెత్తమెత్తగా వూరుకుంటూ వుంటే అంతకంతకి ముదురుతూందిలే నీసంగతంతాను. ఏం చిత్తరవిచిత్రాలుగా మాటాడుతున్నావే మాతల్లికానా! నువ్వే మాయతెరుగుదు వను కున్నావు గంబోలును. ఔనా! ఆచెంద్రి చెప్పీమాటలు మీరే వినండి బోలెడుసొమ్ము తగలఁబెట్టి కొన్దెచ్చుకున్నారు. నేలోపలికి పోతాను. పనుంది.

చంద్రమతి—అమ్మా! వాఁడు బానిసపడ్డవాఁడే యయినను "నా పుత్త్రుఁడు" అను మోహపాశము నన్ను బంధించుచున్నది. దానినుండి నే నెట్లు తొలఁగఁగలను? వానికై మేము చేసిన మహత్తరములైన తపములు, పూజలు, పడ్డకష్టములును మే మెట్లు మఱచిపోఁగలము తల్లీ! అయ్యో! అమ్మా! "పుత్త్రశోకం నిరంతరం" అనియును. "పుత్త్రశోకం మహత్కష్టం" అనియును, "పుత్త్రశోకమున కేశోకమ్ము తుల్య మ్మగున్" అనియును బెద్దలు చెప్పుచుందురు. తమ రెప్పుడును వినియుండలేదు గాఁబోలును. వినుటకుఁ దమ కేమవసర మున్నది?

కాలకంఠి—ఒసే చెంద్రీ! అపురూపపు బిడ్డడంటూవున్నావు. తపాలు చేశావంటావు. జపాలుచేశావంటావు. పూజలు చేశావంటావు. పునస్కారాలు చేశావంటావు. దానాలు చేశావంటావు. ధర్మాలు చేశావంటావు. ఏవోఁ అంటావు. ఏవోఁ అంటావు. ఏం విచిత్తరంగా మాటలాడ్డం నేర్చుగున్నావే నాతల్లికానా! పిల్లల్ని కన్నవాళ్ళని నేనూ చూశేవున్నానుగాని నీలా బడాయి కబుర్లు చెప్పడం యెవత్తినోటంటా వినలేదే. పోనీగాని పిల్లలకి తపాలెందుకు జపాలెందుకు, దానాలెందుకు ధర్మాలెందుకు. చాలించే యిలాటి బొల్లిబొల్లిమాటలు! అంత వెళ్ళాల్నంటే నాలుగుబిందెలనీళ్ళు తోడి ఆతొట్టినిండా పోసి మరీవెళ్ళు. ఒహ వేళ అద్ధరాత్తిరప్పుడు దూడ దప్పిగేసి అల్లాడగలదు. పాపం!

చంద్రమతి—అమ్మా! ఆలాగుననే చేసి పోయెదను.

(అని నిష్క్రమించుచున్నది.)

కాలకంఠి—అక్కటా! పాపము! ఆమె కిది ఏటిశోధన! ఆమె నీరు తోడుట మొదలగుపనులు చేయునపుడు నామనస్సే వెన్నవలెఁ గఱగిపోవుచున్నది.

"ఉ. మండెడిశేసవిన్ జలముమాదిరిగాఁ గనుమాయునంతలోఁ
గొండలవంటిసంపృతులు కోట్లకొలందిగ నెట్లొ మాయమౌ
చుండెడి నెంతకాఁపుదలయున్నను లాభము లేదు కాలనా
థుం డొనరించుచున్నబలుదుండగముల్ గడువంగ శక్యమే?"

అనునట్లహాహా! యెట్టివారికిని బురాకృతకర్మమనుభవించిననే కాని యది యూరక పోవునది కాదని స్పష్టపడుచున్నది. అక్కటా! ఎంతకష్టము! ఎంతకష్టము! కొంతకాలమునకుముందు సార్వభౌమపదము ననుభవించిన హరిశ్చంద్రమహారాజు నంతటి పుణ్యాత్ముని పట్టపుదేవినే మన మిప్పుడు బానిసనుగాఁ జూచుచున్నాముగదా!



అక్కటా! యిట్టిపుణ్యాత్మురాలియెడ హింసాచరణ ముపయోగపఱచుట యటుండఁగా మనస్సులో నయినను దలంపవచ్చునా? ఆమెకష్టంబులం జూచినచో వజ్రముకన్నఁ గఠినమగుడెందము గలవారికైనకు గొంచెముగాకున్నఁ గొలఁదిగ నైనను జాలి పుట్టకుండునా? శివశివా! యెంతకష్ట మనుభవించుచున్నది! యీ కష్టములు మనుష్యమాత్రులచే ననుభవింపఁ దగినవియా? అందును నిట్టికష్టములు బ్రహ్మసృష్టిలో నొక్కమాఱుగా నెవరైనను ముందుగాని వెనుకఁగాని యనుభవించువా రుందురా? ఇఁక నింతకన్నను శోధన యుండునా! మునీశ్వరునిపంతము నెఱవేఱుచిన్నె లొక్కింతయైనను గానరావు. వారిసంగతిమాట కేమి? అది యట్టు లుండనిండు. మీరందఱును వశిష్ఠభగవానులవారి శిష్యులతో వాదులాడి యున్నారుగదా! మీపంతములుమాత్ర మేమిసార్థకమునకు వచ్చినట్లు? "ఆత్మావై పుత్త్రనామాసి" అను వేదవాక్యము చొప్పునఁ దానే శరీరాంతరము నొందినట్లున్న తనతనయుఁడు మృతినొంది నప్పటికిని పాప మామె తనసహజమైన పాతివ్రత్యమునే యూఁతగాఁ గొని ధైర్యస్థైర్యములను విడిచినదే కాదు. అయ్యో! నేను స్త్రీజన్మ మెత్తినను మనస్సును ఱాయి చేసికొని యామె నాడరానిమాట లాడితిని. అట్టిమాటలు మనుష్యజన్మమెత్తిన వారినోటినుండి రావలసినవేనా? నాచేసినచెడుపను లన్నియు ముందు నాకేమిచేయనున్నవియో కదా! ఇంతకును నీమునివరులేకదా కారణము! మోహావేశముచే వీరినాశ్రయించిన మనము పునరావృత్తిరహితమైన మహారౌరవాదినరకములను సంపాదించుకొనుటా! ఏమిచేయవచ్చును?

కాలకంఠుఁడు—అట్లు కాదు. (ఆలోచించి) కాని నీవు తలఁచినదియుఁ గాదన వీలును లేదు. అయినను, మనము బుద్ధిపూర్వకముగా

నెట్టిదియైననేమి? ఒకానొక కార్యమునందుఁ బ్రవేశించితిమి. ఇపు డెంతవిచారించిన నేమిలాభ మున్నది? అదియునుంగాక యింత మాత్రమున వారేమి తప్పించుకొన్నట్టు? ఇదియే సమయము. ఆమె యిప్పు డెంతధైర్యవంతురాలైనను తబ్బిబ్బు లాడకతీఱదు. నేను జెప్పెదను వినుము. ఇపుడు చేయవలసినది యొకటే తంత్రము. దీనిం బ్రయోగించినచోఁ దప్పక కార్యము సిద్ధింపకతీఱదు.

కాలకంఠి—మీ రన్నింటికిని నిట్లే చెప్పుచున్నారు. ఇదివఱ కెన్ని పరిశోధనలు కాలేదు? అట్టిసమయములయందుసైత మిట్లే కదా చెప్పుచుండెడివారు. పోనిండు. ఆమె వచ్చుసమయమైనది. వేగముగా మనకార్యమును సిద్ధింపఁజేసెడి యాప్రబలతంత్ర మేదో చెప్పుఁడు. విని సంతోషించెదను.

కాలకంఠుఁడు—ఆమె పోవుటకు నన్ను సెలవడుగును. నేను గొన్ని పనులు చెప్పి యవి చేసిన వెనుకఁ బోయి రమ్మనియెదను. "చేసియే పోయెదను" అని బదులుచెప్పును. నేనే దోపనిమీఁదను బోయి నట్లు పోయెదను. తోడనే ఆమెను మంచిగాఁ బిలిచి మంచిమాటలాడి "నీవు పో, ఆయన యడిగినచోఁ బనులన్నియుఁ జేసియే వెళ్ళినది" అని చెప్పెదనులే, అని బోధపఱుచుము. ఇట్టి సమయమం దామె సమ్మతించి వెంటనే బయలుదేఱి పోవును. సమయ మట్టిదిగా నున్నది. "పుత్త్రశోకా న్మహ త్కష్టం నభూతం నభవిష్యతి" అన్న ట్టిప్పుడామెకు బుద్ధిస్థైర్య ముండఁజాలదు. కాబట్టి యిట్టిపట్టున జాగుసేయక తట్టున నేను జెప్పినతంత్ర ముపయోగించి చూడుము. తప్పక జయమును బొందినవారలమే యగుదుము. ఇందు సందియ మించుకంతయును లేదని మమ్మాటికిని నమ్ముము.

కాలకంఠి—ఔనౌను. మీరు చెప్పినయుక్తి మిగుల సందర్భముగానే యున్నది. మంచియుక్తి తోఁచినది. దీనితోఁ దప్పక జయము



గలిగితీఱును. సమయోచితప్రతిభ గలుగుట యెంతయోపుణ్యము గదా! అహా! యీనాఁటికి మనపట్టుదల నెఱవేఱును. మునివరులు మనలను జాల వాత్సల్యముతోఁ జూచుచుందురు. మీరు చెప్పిన యుక్తినే ప్రయోగించెదను.

చంద్రమతి—(ప్రవేశించి) అమ్మా! తొట్టినిండ నీఱు తోడి పోసితిని.

కాలకంఠి—అలాయితే సర్లే పోయిరా. భద్రం, అడవిసుమా! ఏవఁనుకున్నావో భయపడక జాగర్తాగా వెళ్ళి వేగంరా, నీఁకోస వెఁదురు చూస్తూవుంటాను సుమా!

చంద్రమతి—స్వామీ! తామును అనుజ్ఞ దయచేయ వేఁడుచున్నాను.

కాలకంఠుఁడు—బాగానే వున్నాది నీసంగతంతాను. "అమ్మా! అమ్మా!" అని మెల్లిగా దాన్ని స్వాధీనం చేసుకోనే చేసుకున్నావు. ఇంక నేనేమి? వుత్తరు వేమి? ఏడిచినట్టే వుంది నాసెలవ్వూ నాపెత్తనమూనున్నూ.

చంద్రమతి—స్వామీ! తా మట్లు సెల విచ్చిన నే నేమనఁ గలను? తమయుభయులనే తలిదండ్రులనుగా నమ్ముకొని యున్ననాకు, ఒకరిని గౌరవపఱిచి మఱొకరిని లాఘవపఱుచుట తగునా? తా మట్లు తలపోయక దయ దలఁచి యనుజ్ఞ యీయవలెను.

కాలకంఠుఁడు—అదంతా నాకు తెలియదు. బట్టలన్నీ పొద్దున్ననగా తడిపి పడేసున్నాయి. పోనీ వాటిల్లుబంగారంగానూ చివికిపోతూ వున్నాయి. పోనీ. రేపటికి మడిబట్ట లేదు. ఆబట్టలన్నీ చక్కఁగా వుతిగి ఆదండెంమీద యెండేసి మరీపో.

చంద్రమతి—స్వామీ! దేవరవారు సెలవిచ్చినమచ్చునే బట్ట లుదికి యెండవైచి మఱియును బోయెదను.

కాలకంఠుఁడు—మంచిది. నేను కొంచెంపనిమీఁద బైటికి వెళ్ళి వస్తాను. నేను వొచ్చేటప్పటికి చాలా సే పవుతుంది. నువ్వాపని మాత్రం చేసి వేగంగా పోయి యిక్కడున్నట్టుగా యింటికి వస్తావు గాదూ?

చంద్రమతి—ఆహా! స్వామీ! అట్లే చేసెదను.

(నిష్క్రమించుచున్నది.)

కాలకంఠి—వొసే చంద్రీ! ఎక్కడనే వున్నావు? ఏంచేస్తూవున్నావు? ఆబ్రాహ్మడిబట్టలా వుతగపోతావు?

చంద్రమతి—ఔనమ్మా! నాయనగారు బట్టలన్నియు నుదికి దండెము మీఁద నెండవైచి వెళ్ళు మని సెలవు దయచేయించిరి.

కాలకంఠి—ఇలారావే వెఱ్ఱిదానా! ఎంతబానిసవైనా నువ్వున్నూ వొక ఆడజన్మం యెత్తిందానివే. ఇలారా మాట చెబుతాను. పట్టిందే పట్టా?

చంద్రమతి—అమ్మా! ఇదిగో వచ్చితిని. ఏమి యాజ్ఞ సెలవిత్తురుగాక.

కాలకంఠి—మొగాళ్ళ దెప్పుడూ రాతిమనస్సని యెరగవూ? "కన్న కడుపో క్రంతలో" అంటారే. అది వాళ్ళకి తోస్తుందా యేమేఁ నేనా? పాపం నువ్వావేఁ బిడ్డణ్ణి మృత్యువుదేవత కప్పగించి దుఃఖసముద్రంలో మునిగున్నావు. ఇలాటప్పుడు బట్ట లుతకడానికి నీకు మనుసెలా వస్తుంది? వుతక్కపోతేనేంలే. వూరికే పిడిచేసి దండెంమీద పడేసి పో. ఆయన యిప్పుడే బైటికి పోయినారు. ఆయనగానీ వచ్చి నిన్నడిగితే "బాగా వుతిగి యెండవేశాను" అని చెప్పు. మించిపోయిం దేమీ లేదులే. నన్నడిగితే నేనూ అలాగే చెబుతాను. వేగంగా నువ్వు పోయిరా.



చంద్రమతి—అమ్మా! ఏది ఎట్లయినను నేను మానాయనగారు చెప్పిన మాట దాఁటఁజాలను. అదిగాక, చేయనిపని చేసితి నని యెట్లు బొంకవచ్చును? పుత్త్రుఁడు పోయినను బొంకుమాట నోట రా నీయఁగూడదు గదా! ఇంతమాత్రమునకై నన్నుఁ గొన్నయజమానులమాట అనలేశ మైనను దప్పఁదగునా? నేను వారు సెలవిచ్చినమచ్చున వస్త్రములన్నియుఁ దెల్లఁగా నుదికి యెండవైచి మఱియుఁ బోయెదను.

కాలకంఠి—అలా అయితే నీయిష్టం. నీదుఃఖం చూస్తే నామనసు తాళకుండా వున్నాది. అంచేత చెప్పేను. అదేమోఁగాని నేనెంత గొడ్డుదాన్నయినా వొకరు దుఃఖపడుతూ వుంటే చూళ్ళేనమ్మా! బిడ్డనుకన్నదానివై వుండీన్నీ నీమనసు రాయిచేసుగుంటూ వున్నావు. నువ్వెక్కడి ఆడదానివోగాని నాకు తెలియదమ్మా! ఆభగవంతుడు నీమనసు సెంతకఠినంగా చేశాడోకాని, నిన్ను చూస్తూ వుంటే లోకంలో ఆడవాళ్ళలా కనపడవు. నువ్వు రాక్షసివో భూతానివో గాని నాకు తెలియదమ్మా! నామాట విని. పో. పట్టు మానియ్యి.

చంద్రమతి—అమ్మా! ఇంతమాత్రమునకే కోపము తెచ్చుకోవలయునా? (బట్టలుదుకుచుఁ దనలో) నాయనా! దేవదాసా! అనాథప్రేతవుగానా పడి యున్నావు? అయ్యో! హతవిధీ! ఇదియును నీకుఁ జిహ్వలాసమా? నీ వింతచలముపట్టి మమ్ముల నేడ్పింప సమకట్టినచో నిఁక మేమేమి సేయుదుము? (బట్ట లుదికి తెచ్చి దండెముపై నారవైచి) అమ్మా! బట్ట లుదికి యెండవైచితిని. ఇఁక వెళ్ళి వచ్చుటకనుజ్ఞ దయచేయుము.

కాలకంఠి—యిప్పుడా చాలాసేపాయి నీకుత్తరువయింది. పోయిరా

జాగర్తాగా. చూడూ చాలాప న్లట్టేవున్నాయి యిక్క డున్నట్టు వేగిరంగా రాయేం.

చంద్రమతి—అమ్మా! ఆలాగుననే చేసెదను.

(నిష్క్రమించుచున్నది.)

(కాలకంఠుఁడు బైటినుండి యింటఁ బ్రవేశించుచున్నాఁడు.)

కాలకంఠుఁడు—మనయుపాయ మేమయినను ఫలోన్ముఖమునకు వచ్చినదా?

కాలకంఠి—ఆహా! వచ్చినది వచ్చినది.

కాలకంఠుఁడు—వచ్చినదా? వచ్చినదా? ఏమదృష్టము! నిజముగా వచ్చినదా?

కాలకంఠి—"వచ్చినది" అన్నానుగదా!

కాలకంఠుఁడు—నిజముగానే వచ్చినదా? ఏమిపుణ్యము! ఎట్లు? ఎట్లు. చెప్పుము. ఏమిజరిగినది?

కాలకంఠి—మీ కింకను బట్టినపిచ్చి వదలినది కాదుగదా! రానూ వచ్చినది. పోనూపోయినది. ఎందుల కాసంతోషము? మీరు చేసినతంత్రము లన్నియు నామెయెడ బూడిదలోఁ బోసినపన్నీరు చందమే యయినవి. ఇఁక మీతంత్రము లెందులకును బనికిరావు రావు గావు. ముమ్మాటికిని బనికిరావు. నే నెంతోప్రీతిపూర్వకముగా నెన్నో మంచిమాట లాడితిని. ఎంతచెప్పినను తాను మాత్రము బట్ట లుదికి యెండవైచి మఱియు వెళ్ళినది. మన మింతగాక మఱింత చిక్కులుపెట్టినను ఆమె సత్యము నొక్కింతయును దప్పదు తప్పదు తప్పదు. ఇఁక మనము గాదుగదా మన మునివరులైనను ఆమెచే సత్యమును దప్పింపఁజాలరు. ఇప్పటితో నిట్టిచెట్టపట్టుదల చాలించి పోయి మునివరులతోఁ జెప్పివేయుదము.



ఏల వారూరక మనస్సును వ్యాకులపెట్టుకొనుట? మన మెందుల కిట్లు శ్రమపడుట?

కాలకంఠుఁడు—అయ్యయ్యో! కొనకలాగా ముగించినది. ఇఁక మన మేమిచేయఁగలము? చూతముగదా! మునివరు లింక నేదైన నొకమార్గ మాలోచింపకుండ నుందురా?

కాలకంఠి—ఆహా! అట్టితపశ్శాలి యగునామునివరు లిట్టిచెట్టపట్టుదల పట్టుటకు సమకట్టవచ్చునా? వారు పొందిన బ్రహ్మర్షిత్వమున కిది యొప్పైనపని యగునా? సర్వసంగపరిత్యాగ మొనరించుకొని వైరాగ్యము నొందియు నంతశ్శత్రువు లగు కామక్రోధలోభమోహమదమత్సరముల జయింపఁజాలినట్టు కనుపట్టదు. ఇది యన్యాయము. ఇట్టి జీవహింస యెవ్వరికిని దగదు. తుద కీదుష్కృతముల కన్నింటికిని ఉత్తరవాదియై భగవత్సన్నిధానమం దుత్తరము లీయవలసివచ్చినప్పు డెట్లు తప్పుకొందురో? వారితోపాటు మనముకూడ నట్టి యన్యాయమున కొడిగట్టుకొని యున్నారము. "కర్తా కారయితా చైవ సమానఫలభాగ్భవే" త్తన్న ట్టిది వారికిని మనకును గూడఁ జాలును. ఇప్పటి కైనదేమో అయినది. ఇటుపై నైనను బుద్ధి దెచ్చుకొని నిలుకడఁ జెందుట మంచిది. ఎందులకు వ్యర్థముగా నిట్టికష్టము!

కాలకంఠుఁడు—కానిమ్ము. తక్కినవానినిగూడఁ బ్రయోగించి చూతము. మన మింతమాత్రమునకే పట్టువిడుచుట మంచిదికాదు. ఏమనఁగా—

"ఉ. కాపురుషుండు విఘ్నములు గల్గునొ యేమొ? యటంచుఁ జేయఁబోఁ
డేపనినైన; విఘ్న ముదయించుడు మానును మధ్యముండు; బల్
తేపలు విఘ్నజాల మరుదెంచుచునున్నను గాని యుత్తముం
డాపురుషుం డహా! విడుచునా తనచేయఁగడంగుకార్యమున్."

అనికదా పెద్దలు చెప్పుచుందురు. కావున మన మింతమాత్ర మునకు భయపడక ముందుపనులుగూడఁ జేసిచూతము.

(నిష్క్రమించుచున్నారు.)

ఇ ది తృ తీ య రం గ ము.

~~~~~~~~~~~~~~~~~~~~

## చ తు ర్థ రం గ ము.

**స్థలము:** కాశికాసమీపారణ్యము.

**కాలము:** రాత్రి.

**పాత్రములు:** చంద్రమతి, సర్వార్థసిద్ధి, సోమసుందరుఁడు.

---

చంద్రమతి—అక్కటా! యీరాత్రివేళను ఇట్టియడవిలో నాముద్దుల కూన నెక్కడఁ గనుఁగొనఁగలను? ఎచ్చట నున్నాఁడని వెదకుదును? ఈపాటి కేమయిపోవునో కదా! హా! విశ్వేశ్వరా! నీపాదములే నమ్మితిమి. దిక్కుమాలినమాకు నీవే దిక్కు. కట్టా! ఏమృగ మీఁడ్చుకొని పోయినదో? ఏపక్షులుదగ్గరఁగాఁ జేరి వజ్రకర్కశంబు లగుతమముక్కులతో సుకుమారశరీరుం డగు నా ముద్దులకూనను పొడుచుకొని తినివేసినవి కాఁబోలును? అయ్యో! నాప్రాణములారా! ఇట్టికఠినురాల నగునన్ను విడిచి మీరైనను బోరాదా! మీరును ఇప్పుడే పట్టు పట్టవలయునా? మి మ్మన నేలా? ఈపాపాత్మురా లింకను నెన్నికష్టము లనుభవింప నున్నదో? అయ్యో! ఇంతకన్నఁ గష్ట మింకొకటి యుండునా? హా! దైవమా! మమ్ముల నిట్లు పరిశోధించుచున్నావుగా! నీకిది యెంతమాత్రము తగదుసుమా. అక్కటా! యేదిక్కున నున్నాఁడో? నే నెక్కడ వెదకుదును. ఎట్లు పోవుదును. ఈకటికచీఁకటిలో దారి



కూడఁ దెలియదు. ఆహా! నేఁ డెట్టిఘోరమైన దినము వచ్చినది! నా చిట్టికొడుకా! నీ వెట్టులున్నావురా! ఈసంగతి వినఁగానే మీ బాబయ్య యెట్లు బ్రతుకఁగలరురా నాతండ్రీ! నాప్రాణమైనను బోదాయెనురా నాముద్దుకొడుకా! నాయనా! నాయనా! కొనకు నీమొగమైనను జూపకుండఁ బోతివా నాబాబూ! యెంత పిలిచినను బలుకవేమిరా దేవదాసా! పాము గఱచినప్పుడు మీబాబయ్యగారిని నన్నును నీ వెన్నిసార్లు పిలిచితివో కదరా నానాయనా! మునియప్పు తీర్చఁజాలని తలిదండ్రులకు నీ వప్పుతీర్చి పోతివఁటరా! మాయప్పా! నాయనా! దేవదాసా! "అమ్మా!" అని పిలువవేమీ! నామీఁదను గోపమా?

సీ. ఎదురుగా రావేమి కదిసి పల్కవదేమి నిన్నేమి యంటిరా కన్నవాఁడ!
దయమాలి యీమాలదైవమ్ము నను మాని నిన్నేల వెదకెరా కన్నతండ్రి!
పున్నమచందురుం బోలిననీమోము నాకుఁ జూపింపవేరా కుమార!
ఎన్నినోములో నోచి నిన్నుఁ గన్నందుల కీలాగు చేసితివేర తండ్రి!
గీ. అన్న! పాపాత్మురాల నే నన్ను మాని, నిన్ను నేటికిఁ గఱచెరా పన్నగంబు,
నాయనా! నిన్ను నెడఁబాసి హా! యిఁకెట్టు, బ్రదుకుమంటివో చెప్పవేరా కుమార!

దైవమా! తొల్లిటిజన్మములం దెంతపాపము చేసితినో కదా! నే నిపు డేమిచేయఁగలను? ఇట్టిసమయమున నే నెవరితోఁ జెప్పుకొందును? ఆహా? యెంతకష్టము!

సీ. తనవంశజుఁ డగుబాలునిమృతికై యబ్ధిస్నానంబుఁ జేయ భాస్కరుఁడు వోయెఁ
చేదసాదలపాలఁ బెనుభూతమై సంజమంచు దిక్కుల నీట ముంచఁ దొడఁగెఁ
బుల్గులమూల్గులుఁ బులిబొబ్బరింతలు నడవిచీరండలయార్పు లొదవెఁ
గొఱవిదయ్యంబుల మఱపించుమంటలు పరికళ్ళములయున్కి దెలుఁగఁజేసె
గీ. నంతకంతకుఁ జీఁకటి యలముచున్న, దింక నేత్రోవఁ బోదు నే నేమిసేతు
నెవరి నడుగుదు నాపట్టి నెచటఁజూతు, నెట్లు బ్రదుకుదు నింక నా కేదిదారి.

ఆహా! యీగాఢాంధకారములో నీఘోరారణ్యములో మార్గముఁ జూపువా రెక్కడనుండి వత్తురు? అక్కటా! నాకర్మపరి
~~~~~~~~~~~~~~~~~~~~

పాక మిట్లు మాఱినదా! నాయనా! దేవదాసా! తుదకు నీముద్దులు మూటగట్టుమొగమైనను జూచుటకు నోచనైతినా! అయ్యో! ఎంతదౌర్భాగ్యురాలను! సర్వమంగళామనోహరా! నీపాదపద్మములయందు నిర్వ్యాజమైన భక్తిగలదానికా యిట్టిదుఃఖము సంప్రాప్తించుట? భక్తులవిషయమై నీకున్నదయ యిట్టిదా? అయ్యో! పగలైనను ఎట్లో దారితెలియును గదా! ఎంతనడిచినను మార్గము దీర్ఘమగుచున్నదే కాని తఱుగుట కన్పింపదు. (బ్రాహ్మణబాలురు సెప్పిన యానవా లింకను నెంతదూరమున నున్నదో కదా! ఓమాల దైవమా! నాముద్దుకుమారునిప్రాణములు నీవు తీసికొనిపోతివిగదా! శరీరమునైనను జూపవా! అంతమాత్రమునకును నోచకపోతినా? ఓమృత్యుదేవతా! నీకైనను దయరాదా! నేనిట్లు దుఃఖపడుచుండుట చూడ వేడుక యగుచున్నదా? కట్టా! యెట్టివారికిని నాయట్టికష్టములు రాకుండ నుండునుగాక. హా! పరమేశ్వరా! కరుణాసముద్రా! ఇట్టిసమయమునఁ బరమనిర్భాగ్యురాల నగునాకు సాయపడవా? నాప్రియతనయా! దేవదాసా! నీ వెచ్చోటనురా పడియున్నావు? నాపిలుపు నీచెవికి వినఁబడలేదఁటరా నాయనా! “అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను. ఏడువకు” అని యెదురుగా రావా? తండ్రీ! “ఓసిపాపాత్మురాలా! చంద్రమతీ! నీవంటినిర్భాగ్యురాలికఁటే నావంటి పుత్త్రరత్నము దొరకును? నీ వంతటి మంచినోములు నోచితివఁటే” అని నన్ను విడిచితివా? అక్కటక్కటా! యేమిచేయుదును. “మఱ్ఱిచెట్టుక్రిందను పడియున్నాఁడు” అనికదా బ్రాహ్మణబాలురు చెప్పిపోయిరి. ఈగాఢాంధకారములో నిది యీచెట్టని యెట్లు తెలియును? అయ్యో! పుత్త్రరత్నమా! నీ వేనక్క కెర వైతివో కదా! ఏపులివచ్చి తినిపోయినదో



దైవమా! ఓహో! ఇటువైపునఁ బక్షులకలకలధ్వని వినవచ్చుచున్నది. ఇదియే యాపెద్దమఱ్ఱిచెట్టు కావచ్చును. ఈచెట్టుక్రిందనే కాఁబోలును నాపట్టి పడి యున్నాఁడు? (ముందుగాఁ బోయి) ఇది యేదో కుప్పగాఁ గన్పడుచున్నది. ఇదియే కాఁబోలును వారు చెప్పినయానవాలు. (ఆకులు తొలఁగించి శవమును జూచి) హా! పుత్త్రా! దేవదాసా? ఆ...ఆ...ఆ...ఆ...(అని యేడ్చుచు మీఁదఁ బడుచున్నది.) అయ్యో! నావెలలేని మాణిక్యమా! ఆహా! (మోమున మోము చేర్చి ముద్దులాడుచున్నది.) నాయనా! దేవదాసా! నిదుర పోవుచున్నావా! నేను బిలిచినను బలుకవా? అడవికిఁ బంపితి నని నామీఁదఁ గోపము వచ్చినదా? ఇఁక న న్నమ్మా యని పిలువనే పిలువవా? “అమ్మా! యేడువకు” అని నన్నోదార్పవా? నాయనా! దేవదాసా! అన్నము తెచ్చితిని. తినియెదవుగాని లెమ్ము. తామరఱేకులవంటి నీకనులు విప్పి మీయమ్మ నీకొస మెట్లేడ్చుచున్నదో చూడవా? నాయనా! మీ బాబయ్యగారివలెనే నీవును జక్రవర్తివయి యఖండసామ్రాజ్యమనుభవింతు వనుకొంటినిగాని యీయడవిలోఁ బాము గఱచి దిక్కుమాలిన ప్రేతవై యుండెద వని కలలోనైనను దలంపకపోతినిరా తండ్రీ! నాయనా! నేను మీయమ్మను చంద్రమతిని తండ్రీ! ఒక్కసారి నావైపు చూడవు! “అమ్మా!” అని పిలిచి నాచెవులకు విందు చేయవు! నీకు నాపై నింతకోపముతగునా? “అమ్మా! నీకును పండ్లు తెచ్చెదను” అని చెప్పి యేడుచుచున్ననన్ను నవ్వించి పోతివిగదరా తండ్రీ! “ఏడిచితే బాబయ్యగారితోఁ జెప్పెద” నంటివి గాదఁటరా బాబూ? ఇంక నీ కాఁకలి దప్పికలు లేవా నాయనా! నానాయనా! లోకనింద లింక నిన్నంటవా కొడుకా! నాకొడుకా! పుట్టెఁ డాస నీమీఁదను బెట్టుకొంటి

మిరా పట్టీ? నాపట్టీ! మాయాశ లన్నియు నట్టేటఁ బడఁగలిపితి వఁటరా నాయనా! నాయనా! నే నెలాగు బ్రదుగుదునురా నాతండ్రీ! నాతండ్రి! ఎన్నాళ్ళు తలఁచుకొందునురా కన్న వాఁడా! ని న్నెట్టు మఱతునురా కన్నతండ్రీ! ఇంత చిన్న తనమున నీ కెంతబుద్ధిశాలితనమురా దేవదాసా!

గీ. శీతవాతాతపంబులఁ జిక్కి యహహ!
ఘోరవనవాటికలయందుఁ గూడు లేక
యలయుచో స్రుక్కి వొక్కింత హా! తనూజ!
యిట్టిదుస్థితితోఁ జత్తువే కుమార!

గీ. విధివశమ్మున వంశాటవీవసంత!
హా! తనూజాత! యనదవై యడవిఁ ద్రెళ్ళి
దొరలుచున్నావె మేనెల్ల ధూళి బ్రుంగ
నెవని నే నమ్మి జీవింతు నింకమీఁద.

(ఎత్తి తొడపై నిడికొని)

అహహా! నాప్రాణధనమా! మన మీ కాశీపట్టణమునకు వచ్చుచున్నపుడు మార్గములోఁ బ్రచండమార్తాండకిరణముల వేఁడి మికి వాడియున్నను, వాతముచేఁ గంపము నొందినను నీశరీర మున గ్లానియన నెట్టిదో కానవచ్చినదిగాదు. అప్పుడు మాకన్నులయె దుట నీవు మరణించినను నీశరీరమును యథావిధిగా సంస్కరించి యుందుమే. నాయనా! ఇప్పుడీఘోరమైనయరణ్యములో దుష్టో రగదష్టుఁడవై నీసౌకుమార్యమును సౌందర్యమును దానివిషాగ్ని జ్వాలలో నాహుతి చేసితివిగా!

సీ. కొనసాగువంశమందున నాణిముత్తెమవై పుట్టి తని ముద్దులాడుచుండు
వీరప్రసూతి వై తే రమణీ! యని సొంపు పెంపార నక్కఁ జూచుచుండు
సామంతరాట్సమక్షమునందు నిన్ను భావిప్రభునిగను జూపించుచుండు
నీదుసౌజన్యంబు మోదంబులోఁ జూచి నావంక గర్వించి నవ్వుచుండు



గీ. నట్టి నీతండ్రి సర్వంసహాధినాథుఁ, డిట్టినిఁ జూచెనేని తా నెట్టు బ్రతుకు
చూడవేమిర తండ్రి! మాటాడవేమి, యొంటిగా నేల పడక నాచంటికొడుక.

ఓహో! మహనీయమైన మాతపఃఫలమా! మాజీవరత్న మా! సర్పాకారమును బూనివచ్చినమాదుష్కర్మఫలము బుస్సు మనుచు మీఁదఁబడి కఱచినప్పు డెంతభయపడితివో కదరా నాయ నా! యేమని యేడ్చినాఁడవో కదరా తండ్రీ! విషజ్వాలలు భయం కరముగా శరీరము నుడికించుచున్నప్పు డెట్టుపరితపించినాఁడవో కదరా బాబూ! నాయనా! మే మెవరినినమ్మిరా యింకను దుఃఖభూయిష్ఠమైన యీమిథ్యాప్రపంచములో మేనులు మేకొని బ్రతికియుండెదము?

గీ. ఈవు తొల్లింటిపదవిని నీల్గితేని
యెట్టు లేడ్చుచునుండునో పట్టణంబు,
ఇచట దిక్కరి నీ విట్టు లీల్గుకతన
గృధ్రనిచయాదు లెంతయుఁ గేరియాడు.

నాయనా! దేవదాసా!

గీ. గర్భమున వైచినప్పుడే కడఁగి విధియు
నీదృశావస్థ నినుఁ జెంద నెంచినాఁడొ
దండధరుదండనీతికిఁ దార్చి యేర్చ
శ్రీవిశాలాక్షిచిత్తేశుచిత్త మిదియొ?

ఓరీ మాయాశాలతాంకురమా! నీ వుండఁదగిన యునికియం దుందువేని నీకీపాటి యెన్నెన్నిమేల్కొలు నడుచునో? ఎందఱు వైద్యులు మందు లిచ్చుచుందురో? నీదుర్మరణంబునకు రాజ్య మంతయు నెంతగా వంతలపాలై చింతించుచుండునో? అహో! అట్టికళవళం బేల యని యిట్టిపక్షులరొదకు నాశ్రయుండ వైతి వఁటరా! నీ కీగతి యిట్లు సంభవింపవలయు నని యామాలదైవము గర్భమునం దున్నయప్పుడే వ్రాసియున్నాఁడు కాఁబోలును.

"శ్లో. ఆయుః కర్మచ విత్తంచ విద్యా నిధన మేవచ,
పంచైతాని విలిఖ్యన్తే గర్భస్థస్యైవ దేహినః"

అనికదా పెద్దలు చెప్పుచుందురు. కాక యిది యంతయు మాతొలుతటిజన్మంబులందుఁ జేసికొన్నకర్మమా? మఱి యీ విశ్వేశ్వరుని దివ్యచిత్తముయొక్క విలాసమా? హా! మాటమాత్రమునకు సర్వస్వమును సంయమీశ్వరునకు దాన మిచ్చిన సత్యసంకల్పులకు సత్పుత్త్రుఁడవే. అన్నా! మీతండ్రిసత్యమైనను నిన్నుఁ గాపాడినది గాదాయెను. అయ్యో! నీకా యిట్టిగతి! ఓహో! విశ్వేశ్వరా! మాయందు నీకృప యిట్టులున్నదిగా! భగవంతుఁడా! నిన్నన నేల? మాపురాకృతకర్మ మీలాగునఁ గట్టికుడుపుచున్నది. నాయనా! దేవదాసా!

ద్విపద. కన్నీరు మున్నీరుగాఁ బాఱుచుండఁ
గ్రన్నన గుండియల్ గడగడ వడఁక.
మోవి బీటలువాఱ మోము వ్రీలంగ
భావించి యెలుఁగు రాల్పడఁ బ్రలాపించి.
హా! పుత్త్ర! సూర్యవంశాంభోధిచంద్ర!
హా! పుత్త్ర! హా! వత్స! హా! తనూజాత.
అంచుఁ బేరెలుఁగున నక్కటా! చీర
నించుకేనియుఁ బ్రతి యెలుఁగీవదేర?
ఓడ కోడకు మంచు నూఱట వల్కి
పాడిమై నోదార్చువా రెవ్వ రింక.
నీమోముచందురు నీటుగాఁ జూపి
నీమంజులాలాప నిస్వనాంబువుల.
హృదయాటవి దహించునీశోకవహ్ని
పొదలనీ కార్పవా పుత్త్రరత్నంబ!
నామీఁదఁ గోపమా నాకన్నతండ్రి
నీమోము చూపవా నీతల్లి కింక.



నాయనా! సూర్యవంశాంభోనిధిరాకాచంద్రా! దేవదాసా! నే నీయర్ధరాత్రంబున నేకాకినినై యీ ఘోరారణ్యమధ్యంబున నోదార్చువా రైనను లేకుండఁ గన్నీరు మున్నీరుగా నేడ్చుచున్నాను. నీవో నాయందలిప్రేమ యంతయును నొక్కమాఱుగా మఱచి నన్నిట్లు వెతలపాలు చేయ సమకట్టుచున్నావు. నాయనా! దేవదాసా! పలకవూ? నామీఁదను గోపమా? ఒక్కమాఱు నాకు నీ ముద్దులుమూటగట్టు మొగము చూపి నీయమృతము లొలుకు పలుకులచే నావీనులకు విందు సేయవఁటరా! దేవదాసా! దేవదాస! నే నెంతపాపాత్మురాలనురా తండ్రీ!

మ. అహహా! పుత్త్ర! త్వదీయదుఃస్థితి మనంబారంగ వీక్షింపమో
మహి నేఁ బొల్చితి మానినీతనువునన్ బ్రమ్మన్ గదే కోర్కులన్
రహి మీతండ్రి మఱల్చుకోఁ దలఁచిరా రాపట్టి! నిన్గూర్చి దు
స్సహసంతాపము ప్రబ్బ నేమనుదురా సర్వంసహాభర్తకున్.

గీ. లోకు లెల్లరుఁ దననీతి లోఁ దలంప
విహితసత్యాదృతిత్వంబు వెలయఁ జేయు
పుడమి ఱేనికిఁ బట్టివై పొదలునీకుఁ
దోఁచెనే నందనా! యిట్టి దుర్మరణము.

నాతండ్రీ! దేవదాసా! నీయవస్థను జూచుచుండుటకా నే నింకను బ్రదికియున్నాను. అయ్యో! నీతండ్రి సుంతయైన ధర్మము తప్పకుండ నందఱును సంతస మందునట్లుగదా రాజ్యమేలిరి. అట్టి సార్వభౌమునకుఁ బట్టివై పుట్టిన నీ కిట్టిగతియా తుదకు సంభవించినది! నాయనా! మీతండ్రి నన్నీదాస్యంబునుండి విడిపించి కొనిపోవునప్పుడు "మననాయన యేఁడీ?" అని అడిగినప్పుడు నన్నేమనిరా బదులు చెప్పమన్నావు. బాబూ! నామాటలకు జవాబు చెప్పవఁటరా!

గీ. "ధరను ముప్పది రెండునై ధర్మవితతి
దనరునది" యంచు నార్యులు దలఁచుచుందు
రం దొకం డేని తప్పక యవని నేలి
నెఱిని మీఱక నీతిని నిల్పలేమొ?

గీ. కరము లధికము లిం డని కాఁపుజనుల
బాధ లొందించి పల్లాఱు బడలనీక
పన్ను లాఱింట నొకటిగాఁ బడసి ప్రజలఁ
గన్నబిడ్డలచందానఁ గాంచలేమొ?

గీ. బీద లర్థంబులను గోరఁ బెట్ట మనము
దీనులను గాంచి యెక్కుడు దెప్పలేదు
కవులచిత్తంబు లెన్నండుఁ గసలనీము
సజ్జనులు చెప్పుసంగతుల్ చలుప మనము.

హా! మదీయవంశాటవీవసంత! జ్ఞానవృద్ధులు సంభావించుచుండు ముప్పదిరెండుధర్మములలో నొకటియేని విడనాడి యెఱుంగమే. అయ్యో! విశాలాక్షీమనోహరా! కాఁపులయొద్దఁ దొల్లింటి పగిదిని షష్ఠాంశమే పుచ్చుకొనుచుంటిమికాని యణుమాత్రమేని యధిక మపేక్షించుచుంటిమా? అర్థిజనులమనోరథములఁ బూర్తి సేయకుంటిమా? దీనులం గాంచి పరిహసించి యెఱుంగుదుమా? సభాప్రదేశంబున సత్కవీశ్వరుల కవమానము గలిగించినవారము కామే. సజ్జనులు చేయుహితోపదేశంబులు విననివారమా? ఇట్టులే యెల్లవారలకుఁ బ్రియ మగునట్లు మెలఁగుచునే యుంటిమి. అయినను, ఇట్టిగతి యేకారణముచేతఁ దటస్థించినదో తెలియదుగదా! ఏమిచేయుదునురా తండ్రీ!

గీ. అన్యరాష్ట్రంబులను గొల్లలాడి వచ్చు
దండులను గోరి బలములఁ దార్ప మెందు
రాణువను బ్రజ్ఞ లేని దుర్మంత్రివరులఁ
జెట్టలను జేయుకాఁపులఁ జేర్ప మెందు.



అక్కటా! హతవిధీ! అన్యాయముగా నన్యరాష్ట్రంబులం గొల్లగొట్టివచ్చునట్టి దుష్టసైన్యంబుల దండులోఁ జేర్చుకొనువారము గాము. రాజ్యతంత్రవిశారదులుగాని మంత్రులను రాణువకు రానిచ్చినవారమే కాము. ద్రోహులతో ప్రజలను బట్టనంబునఁగాని రాజ్యంబునఁగాని రాష్ట్రంబునఁగాని కాలూననిచ్చినవారముగాము. ఇట్లుధర్మము దప్పకుండ నడుచుచున్నను, హా! పరమేశ్వరా! హా! ధర్మదేవతా! మే మీగతిని దుఃఖములపాలయి దిక్కుమాలి పరిదేవన మాచరింపవలసివచ్చినదిగా! ఓరీ! నామురిపములమొలకా! పున్నమచందమామ వన్నెను తలదన్ను చక్కఁదనాలమొగమును, చూతారుణపల్లవకోమలంబులగు పాణులును, బంగారుకాంతులఁ బరిఢవిల్లుమైదీవయుఁ గలనీమనోహరగాత్రము పుడమిపైఁ బొరలుటంజేసి ధూళిధూసరితమై మాలిన్యము నొందియుండుటను గాంచియు వజ్రముకన్నఁ గఠినమగు నాహృదయము నూఱుముక్కలయి శరీరమునుదొఱఁగి నీవేఁగినలోకంబునకు రాఁజాలకున్నదాన నైపోతినా? నాయనా! ఈభూలోకంబున నాకన్న మిన్నయగు పాపాత్మురా లుండునా? అయ్యో! నామనస్సు దావాగ్నిశిఖాజాలంబునం జిక్కిన లతాంతంబుంబోలె మ్రగ్గుచున్నది గదరా నాయనా! దేవదాసా! ప్రేవులుడుకెత్తి చెప్పరాని వ్యథకుఁ జేడ్పడుచున్నవి. ఏమిసేయుదును? ఎవరితోఁ జెప్పుకొందును.

గీ. నందనా! దేవదాస! నీ వంద మొందఁ
బెరిఁగినాఁడవు గావె మా పేరురముల
నేఁడు పోఁడిమి వీడి యీపాడుటడవి
ధూళి బ్రుంగంగ నవదవై తూలి పడితె?

గీ. ఘూకగోమాయు వితతుల ఘోరరవళి
భయము గొల్పెడి వనములో వనరుచున్న

వలదు వలదంచుఁ బల్కవా వదన మెత్తి
నాయనా! ప్రేమ విడుచుట న్యాయమఁటం.

దేవదాసా! మాయుత్సంగసీమలందును, ఉరస్థ్సలంబునను బొదలి యాడుకొనుచుండిన పుత్త్రరత్నమా! నీ వీవేల నీలీల ధూళి బ్రుంగ నేలఁ గూలి క్రాలువాఁడ వైతివఁటరా! తండ్రీ! అతిభీకరంబగు ఘూకగోమాయు భేకాదులరవళిఁ బ్రతిధ్వను లీను నీఘోరారణ్యమధ్యంబున వ్యథాకలితాంతరంగనై యేడ్చుచున్న దానను. "అమ్మా! యేడువకు" అని యొకమా టయినను బల్కరింపవా? నీముఖపంకజము నావంకకుఁ ద్రిప్పి:—

గీ. దండశూకవిషాగ్నికిఁ దనువుఁ దొఱఁగు
తనయు వెన్నాడి రా వహో! తల్లి వౌదె?
కఠినమూఁ గాదె నీయెద గనఁగ రోఁత
యనుచుఁ బల్కవో? యరయవో హా! కుమార.

అయ్యో! కుమారా? నీయధరపల్లవంబులు గదలి యాడున ట్లొకపల్కను బల్కవుగా! ఇది నీకు మంచిమాటయే కదా! ఇఁక నీపాపాత్మురాలిని జూడఁ దలంచుకోలేదా? ఓరీ నాముద్దుల కూనా? నీ విట్లనాథునిగతిఁ జచ్చి పడియుండుటను గాంచియు ఱాతిగుండె నవలంబించి బ్రతికి యున్నానని నామీఁదను గోపమఁటరా? అయ్యో! నాముద్దుఁగూనా! నోరుదెఱచి యొకపలుకైన నిఁకఁ బలుకవఁటరా! (పామును జూచి) ప్రతివారికిని భయంకరుఁడై నయాదుష్టముని విశ్వామిత్రునకుఁ బాపాత్ములమైనమే ముభయులమును జేసినయపరాధ మేమున్నది? ఆయనకు మే మేదైన నపరాధము చేసిననేకదా! తా నిట్టికార్యము చేయుట తగును. అట్లేమియు నపరాధము చేసి యెఱుఁగమే. ఊరక మా కెందుల కింతవంత కలిగించవలయును? అయ్యో! పుత్త్రుని బలియిచ్చిన



మహాపాపాత్మురాల నైతినా? అయ్యయ్యో! నాజీవితేశ్వరుఁడు వచ్చి "కుమారుని బలి యిచ్చియును నీపాపాత్మురాలు జీవించి యున్నదిగా! యెంతకఠినాత్మురాలు!" అని నామోము చూడకయే మరలిపోవును గదా! హా దైవమా? నన్ను దిక్కుమాలిన దానినిగాఁ జేసితివా? ఏమి సేయుదును? ఓహో! కాశికాధిపతీ! విశ్వేశ్వరా! ఇది యంతయును నీకపటనాటకమే కదా! అయ్యో! అర్ధరాత్రసమయ మయి యున్నది. అక్కటా! ఇట్టిసుగుణఖని మరణమును జెందినమీఁదటనుగూడ నిట్టియిక్కట్టుల కిక్కనై జీవించి యుండినను నేమిసార్థక మున్నది? ఈనాముద్దులమూటతోడనే నేనును బ్రుగ్గి మన్నగుదునా? అయ్యో! నాకంతటి పుణ్యము గూడనా? కట్టా! నాజీవితేశుఁ డేచ్చోటున నుండునోకదా! ఈసంగతి యాయనచెవిని బడినచో నేమగుదురో? నన్నేమని యెంతురో? అహా! యెట్టులైన నేమి తుట్టతుదకు నేను దౌర్భాగ్యురాలనే అయితినిగా! ఆలంబన మొక్కింతయును లేని యీనాపాడుజీవన ముండుటవలన నేమిప్రయోజన మున్నది? క్షణమాత్రముననే వదల వచ్చును. అయ్యో! నే నట్లు బలవంతముగాఁ జచ్చినచో మాయ పూర్వతపఃఫలంబగు నీముద్దులకూనను సంస్కరించువా రెవరున్నారు? అదియునుం గాక త్వరగా వచ్చిచేరుదు నని యజమానులతోఁ జెప్పి వచ్చితినిగదా! తనయుఁడు మృతి నొందినను వారితో నన్న మాట తప్పవచ్చునా? హా! దైవమా! ఇఁక నీసుకుమారశరీరము నెత్తికొని పోయి దహనము గావించి చెప్పినచొప్పున యజమానుల యొద్దకుఁ బోవుటయే యుత్తమము. హావిశ్వనాథా! నీవే గతి. ఈయర్ధరాత్రసమయమున శ్మశానవాటిక యెక్కడ నున్నదో నే నెట్లు గుర్తింపఁగలుగుదును? మార్గ మెట్లో తెలియదే? పోనీ; ఉదయమున వచ్చి సర్వమును నెఱవేర్త మని తలంచుటకైనను

వలనుపడకుండ 'వేగముగా వచ్చి చేరెదను,' అని యొప్పుకొని వచ్చితిని. ఎన్నికష్టములు సంభవించినను అన్నమాటకు వ్యతిరేకముగా నడువరాదు. అసత్యమే యేమిచేసినను జేయునుగాక. దానినే యూఁత గొనికదా యున్నాము. ఏమిచేయనగును? విశ్వేశ్వరా! "దిక్కుమాలినవారికి దేవుఁడే దిక్కు" అనునట్లు నిన్నే నమ్మి చక్కఁగాఁ బోయెదను. నీ యిచ్చకు వచ్చినమచ్చునఁ జేయుము. మఱేమి చేయుదును?

(ఎత్తుకొని పోవుచున్నది.)

అయ్యో! యీగాఢాంధకారము పరమహంసవలె నిర్ద్వంద్వంబై మిట్టపల్లముల నొకటిగాఁ జేయుచున్నది. సంసారగహనమధ్యంబునం బరిభ్రమించుపామరునకుంబలె ముందువెనుకలు గోచరింపకుండ నున్నవి. మహాపాపాత్ములహస్తంబులు పరకాంతలయెడలంబలె నీశాఖాజాలంబులు నాకచగ్రహణము నొనర్చుచున్నవి. కంటకలతాజాలంబులు దగిలి శరీరము చీరుకొనిపోవుచున్నది. మృగములు పక్షులు మొదలగువన్యజంతుసంతానంబులు నిశ్శబ్దంబుగా నిద్దుర పోవుచున్నవి. మృగాదులవలనిభయ మొక్కింతయు లేకున్నను మిట్టపల్లములభయముమాత్రము తప్పకుండ నున్నది. హా! కాలకంఠా! యీగాఢాంధకారము నీకంఠకాలిమ నతిక్రమించుచున్నది. ఈచిమ్మచీఁకటిలో నీయర్ధరాత్రమున నీఘోరారణ్యమధ్యంబున నెవ్వరిని మార్గ మడుగుదును? ఇచట నెవ రగపింతురు?

సర్వార్థసిద్ధి—ఎవ్వ రక్కడ? ఒంటిగాఁ బోవుచున్నట్లున్నది. మానినియా లేక మహాపిశాచికయా?

(సమీపించుచున్నాఁడు.)

చంద్రమతి—అయ్యో! ఇదియేమి యాశ్చర్యము! ఎవరోకాని పురుషునికంఠధ్వని వినవచ్చుచున్నది. ఇఁక నీయడవిలో నేమి సంభవింపవలసియున్నదో కదా! హా! పరమేశ్వరా! నీపాదారవిందములే దిక్కు. నీ వరక్షకరక్షకుండ వనుమాట యథార్థమేని యిట్టి సమయమున నీ దాసురాలిని రక్షింపుము.



సర్వార్థసిద్ధి—ఎవ రక్కడ? బదులు చెప్పరేమి?

చంద్రమతి—అయ్యా! నే నొక దిక్కుమాలినదానను.

సర్వార్థసిద్ధి—ఆఁడుదానవా? అయ్యో! పాపము! అమ్మా! నీ వెవ్వరు? యెందుల కిట్లు రోదనము చేయుచున్నావు?

చంద్రమతి—అయ్యా! నా సంకటము చెప్పెదనుగాని ముందుగాఁ దా మెవ్వరో సెలవిత్తురు గాక.

సర్వార్థసిద్ధి—అమ్మా! భయపడవలదు. మే మీవనమధ్యంబున నుండు తపోధనులము. సిద్ధపురుషులము. పేరు సర్వార్థసిద్ధి యందురు. నీ సంకట మెట్టిది? చెప్పుము.

చంద్రమతి—మునిచంద్రమా! ఏపాపఫలముగా నీయాఁడుజన్మ మెత్తితినో యెఱుఁగరాదు. ఇపుడు చెప్పుటకు వీలుగాని మహాదుఃఖాంబుధిలో మునిఁగి దరి గానక యున్నాను.

సర్వార్థసిద్ధి—

ద్విపదలు.

వినవమ్మ చెప్పెద విశదపద్ధతిని, మనకర్మఫలములు మనలనే చేరి
కీడుమేళ్ళుగఁ దోఁచి క్రీడించెడిని, పాడిమైఁ బరికింప ఫలితార్థ మిదియె
పటుతర మాశక్తిఁ బరఁగుఁ బ్రారబ్ధ, మటు గాన దుఃఖించు నానంద మొంద
నందంబుగా దంచు యమిచంద్రు లహహా!, చెందినసుజ్ఞానశీలచేఁ బొదలి
నిఖిలకాలంబును నిర్ద్వంద్వు లగుచు, సుఖముల కింపొంది సొగసి సౌఖ్యకరయు
పరఁగుకష్టాళికిఁ బరితపింపకయుఁ, దిర మైనమతిపేర్మి దీపించుచుండి
అర్తిలి సమముగా నరయు చన్నిటిని, కర్మజాతమ్మును గాల్తురు నూవి

ధీ యనుకమనీయతీక్ష్ణశస్త్రమునఁ, బాయనివ్యామోహపాశమ్ముఁ ద్రెంచి
వైచి మించినవారివరవైభవాళి, దోఁచఁగా మామదిఁ దోరంబు గాఁగ
నెక్కడిబాంధవు లేటిసన్మిత్రు, లెక్కడిభార్యాదు లేటిపుత్త్రకులు
సన్నుతి కెక్కినసర్వభాగ్యంబు, లెన్న వ్యర్థము లంచు నెక్కటి నాచు
విన్నాఁడ శాస్త్రముల్ విశదంబు గాఁగఁ, గన్నాఁడ క్షేత్రముల్ గడు రక్తి మీఱ
సంకల్పములు చేసి సద్భక్తి నెఱయఁ, గ్రుంకు లిడినవాఁడఁ గోరి తీర్థముల
సుఖపరిణామముల్ సుకృతాళి యనుచు, సుఖము భారంబె యా నూరి కటంచు
సత్కర్మముల నెల్లఁ జాలించి మించి, యుత్కంఠ దీపింప నొయ్యన నంత
హేమాచలంబును హిమవన్నగంబు, కామనీయకవింధ్యగ్రావంబు, పారి
యాత్రంబు కైలాస మనుదివ్యధరము, యాత్రలఁ గ్రుమ్మటి యాయాయిచోట్ల
నిరశనస్థితితోడ నిలుచుచు నొకటఁ, గర మరుదారఁగాఁ గందమూలముల
మే నిల్పఁ భావించి మెసవుచు నొకట, నే నిట్లు తప మొంది యేర్చి పాపముల
అవధరించితె? అమ్మ! ఆవలికథయు, నవనాథసిద్ధులనవవాక్యసరణి
గ్రహియించి ధీశక్తిఁ గ్రమ మొప్ప నంత, మహి మించినాఁడ సమాధియోగమున
అణిమాదు లనఁ బొల్చు నష్టసిద్ధులును, గణుతింప నితఁడె కా! ఘనుఁ డంచుఁ దలఁచి
మనమున మోదించి మమ్ము సేవించె, ననుపమాంగిరో! విను మాయద్భుతంబు
అణిమ న న్గూడుచో నతివ విన్నావె?, అణుమాత్రదేహి నై యతిశయిల్లుదును
మహిమ నాఁ బరఁగుసమంచితసిద్ధి, మహి మమ్ముఁ బొందఁగా మహిమ లొందితిమి
గారాబమునఁజేసి గరిమ మముఁ జేర, గౌరవంబునఁ జేర్తిఁ గన్నార మమ్మ!
లఘిమ దా మముఁ గూడి లాలిత్య మొంద, లఘురూపమునఁ బొల్చి లాఘవస్థితిని
తూలికవలె మేము తూలినా మొకట, శ్రీలలితం బౌచుఁ జెలఁగులోకమునఁ
బ్రాపించినారము ప్రాప్తి ప్రాప్తింప, నీపృథ్వియాసల నెల్లఁ గూల్చితిమి
ప్రాకామ్య మనుసిద్ధి పరిఢవిల్లుదును, లేక లొంచ్చొకయింత లీనత్వ మొందఁ
నీశత్వ మనుసిద్ధి యెలమిఁ దళ్కొత్త, నీశుండ నై మించి యెల్లలోకముల
నేలుచు విలసిల్ల నెమ్మి వశిత్వ, మోలి మమ్మును జేర నొప్పారి యంత
చిదచిత్తు లన్నియుఁ జెలఁగ నావశము, పదఁపడి నాపనుల్ పడఁతిరో! వినుము
నెలఁగి యీయొడలిదౌ జీవుఁ బెకల్చి, వెలయ నిర్జీవియౌ వేఱొండుతనువు
మోపి లోకాళికి మోదంబు పెంచ, వే పరకాయప్రవేశంబు చేయ
నీటిపై నడయాడునేర్పరితనము, పాటించి యగ్గిపైఁ బవ్వళించుటలు



కడఁక బంతులవలె క్ష్మాధరరాజి, నడుపథంబున మీటి యొయ్యనఁ బట్టి
వారిదౌఘముఁ గూర్చి వర్షింపఁ జేయ, నీరీతి నొకకొన్ని యిచ్ఛకు వచ్చు
చిద్విలాసమ్ములఁ జేసితి మమ్మ!, తద్వైఖరుల నెల్లఁ దవిలి పోఁ ద్రోచి
అమ్మరో! తవిలినా మాస్వర్ణవిద్య, యెమ్మెయి దాని సాధించినా మనదో?
చతురగిరిం జేరి సరగఁ దత్సార, మతివేలముగఁ బిండి యాపసరు దెచ్చి
మేరుసానువుఁ జేరి మేళగించితిమి, ఆరూఢి దీక్ష మే మంత వహించి
రేయుంబవళ్ళుగా రీతు లారయుచు, నోయన క్షారం బహో! బయల్దేఱి
చతురత దీపింప జయనీరు దించి, యతివేగముగఁ బొంగునాశ్రీశుకరుణ
గాంగేయసిద్ధిని గాంచినా మమ్మ!, గంగాజటాజూటుకారుణ్యమునన
చింతింపకయ కొన్ని జీవమంత్రముల, యంత్రమ్ములను గాంచి యతిశయించితిమి
కమలాసనుండు నాకాలకంధరుఁడు, శమనుండు మముఁ జూచి జడియున ట్లొగిని
మరణ మొందినయట్టిమానవకోటిఁ, గరుణమై బ్రదికించి కాపాడినాము
భక్తి మాయెడఁ జేరుపరమశిష్యులకు, రక్తి దీపింప విరక్తులఁ గఱపి
యుద్ధరించుచు నెవ్వ డుందు మివ్వనిన, సిద్ధపూరుషు లేము చేడెరో! యిపుడు
దిక్కఱి నీయేడ్పు దీననిస్వనము, లక్కటా! చెవి సోఁకి యలమటింపంగ
వచ్చితి మీదిక్కు వంచన వలదు, మచ్చెకంటిరో! చెప్పు మదిలోనిచిక్కు.

అమ్మా! సంకోచింపక నీసంగతులన్నియు విస్తరించి చెప్పుము. ఏడువవలదు. నెమ్మదిగా నుండుము. భగవంతుఁడు నీ కించు కంతయుఁ గొఱఁత రానీయఁ డని నమ్ముము.

చంద్రమతి—స్వామీ! యీగాఢాంధకారంబుతో డినడికి రేయిని తమ రిట్టి నిర్జనారణ్యమధ్యంబునకు విచ్చేయున ట్లొనర్చినది దైవమే యగును. ఇఁక నాసంగతు లేమని విన్నవింపఁగలను? అక్కటా! కాశీనాథా! తుదకు నాబ్రతు కెట్లుమార్చితివి? నే నేమిచేయుదును?

సర్వార్థసిద్ధి—అమ్మా! నీ వెంతమాత్రమును సంకోచపడకుము. ఏడిచి నంతమాత్రమున నేమిలాభ మున్నది? పరులు దుఃఖపడుచుండుట

చూచితి మేని మాచిత్తము స్వాయత్తముగాక తత్తరిల్లును. మే మడిగినంతమాత్రమున నీచిత్తమునకు వ్యసనము గలిగెనేని మే మింక మాఱుమాటాడక వెళ్ళెదము.

చంద్రమతి—స్వామీ! ఇందు సంకోచించుట కేమున్నది? దుఃఖాతిశయమున నాలుక రాకుండ నున్నది. అయినను; ఒకమాదిరిగాఁ జెప్పెదను. సావధానముగాఁ జిత్తగింపుఁడు.

సర్వార్థసిద్ధి—ఆహా! అట్లే వినుచున్నారము. దుఃఖపడక మనస్సునకు ధైర్యము దెచ్చుకొని సవిస్తారముగా నీవృత్తాంత మంతయుఁ జెప్పుము. నీ వెంతవఱకుఁ జెప్పినను సావధానముగాఁ జిత్తగించుచుందుము. పిమ్మట మే మేదైనను జేయవలసిన ప్రతిక్రియ యున్నయెడల యోజించి చేయుదుము. కావున వదలివేయక సంగతి యంతయు మాతో విన్నవింపుము.

చంద్రమతి—

ద్విపదలు.

వారిధిమేఖలావలయితం బగుచు, గౌరవం బందు నీక్ష్మాకాంత కెన్న
హారనాయకమణి యనఁగఁ జెన్నొంది, పేరు గాంచును కాదె పేర్మిఁ గనోజి
దాని కధీశుఁడై తనరు మాతండ్రి, మానాథుభక్తుండు మర్యాదగలఁడు
ఆత్మజాని తా ననపత్యుఁ డగుచు, వీక్షించి శాస్త్రాళి విశ్వాళబుద్ధి
సకలవ్రతంబుల సర్వదానముల, నకలంకముగఁ జేసి యతిశయించుడును
నిర్విధికం బగునిష్ఠకు మెచ్చి, సర్వేశ్వరుండు నాజన్మ మొసంగె
దినములపేరిట దీపించువయను, ఘనముగాఁ దోఁచినఁ గడఁగి మాతండ్రి
తగునాథుఁ గూర్పఁగాఁ దలఁచి చిత్తమున, నొగి లేఖలను బంపె నుర్వీశులకును
నలుదిక్కులను జాటె నాస్వయంపరము, వెలయ విశ్వాధిపుల్ వే వచ్చి చేర
గుణమున రూపునఁ గులమున విద్య, ధనమున వయసునఁ దగునస్త్రవిద్యఁ
బుల శేనివరుఁ డెందుఁ దోఁచునో యనుచుఁ, దలఁచి యోజింప నాధరణీశులంద



కూరవరేణ్యసంస్తూయమానుండు, నారూఢసత్కీర్తి యాహరిశ్చంద్ర
ధరణీతలేంద్రుఁ డుత్తమధర్మవేది, వరుఁడుగాఁ దలపోసి వరియించినాను
దీపంబుఁ దత్కాంతి దేహంబు నీడ, తాపంబుఁ దపనుండుఁ దనరున ట్లేను
నాజీవితేశుండు నయగుణజ్ఞుండు, రాజిల్లుచో నుమారమణుసత్కరుణ
నీతనూజాతుం డహీనగుణాఢ్యుఁ, డాతతి సంతోష మలమ జన్మించె
భూలోకమే స్వర్గపురముగా నెంచి, కాలంబు గడపుచోఁ గౌశికఋషియుఁ
గుతలేశులకు మేలు గొనసాగుపొంగెఁ, నతివేగముగ నిష్టి నాచరించుటకుఁ
జాగంబు నూఱులక్షలసువర్ణముల, బాగొప్పఁ గాంక్షింపఁ బతి యిచ్చె నపుడ
దాని మాయొద్ద యుంచి దక్కించి చనియె, క్ష్మానాథుఁ డొకనాఁడు సరగ నాఖేట
వ్యసనంబు దళ్కొత్త నడవి కేఁగుటయు, వెస మునికన్యకల్ విభు డగ్గఱించి
పతిభిక్ష వేడ నాపడఁతులఁ గాంచి, హితబోధ పచరించి యేఁగించె నంత
మానినీమణులదుర్మార్గంబు గాంచి, మానర్మసఖుఁడు సమాత్సర్యుఁ డగుచుఁ
దలిరుఁబోఁడు లటంచు దయ నెంచలేక, యలిగి దండింపఁగా నంతఁ గౌశికుఁడు
కోపంబు దీపింప గొబ్బున వచ్చి, క్ష్మాపతి నీక్షించి చటులతఁ జూపి
రాజ్యమ్ముఁ గైకొన రాజ్యసంపదలఁ, ద్యాజ్యంబు చేసి మే మడవి కేఁగంగ
మాయొడళ్ళ వెలుంగుమాభూషణాళి, నోయన నొలిపించి యొనరఁ దాఁ గొనియె
నారీతిఁ బనివిని యరుగునానాథుఁ, గోరి తెమ్మని పల్కెఁ గోటినిష్కముల
నలువొంద నలువదినాళ్ గడు వొంది, యిల మించి రంజిల్లునీకాశిఁ జేర
విలిచె నన్నును బుత్త్రు విప్రవర్యుండు, పలుకు నిల్పుటపొంటెఁ బార్థివేంద్రుండు,
నానువర్ణంబుల యమియప్పు దీర్చి, వాసి చేడ్పడ నెందు వఱలుచున్నాఁడో?
అక్కటా! దుర్విధి యలమటింపంగ, నిక్కుమారుండు నే నీవిప్రునింట
బానిసతనమునఁ బడినార మగుట, నూనికమై వారియుడిగంబు లెల్ల
తుంత్తుల కలాకక సొమ్మలఁ బడక, చిత్తమ్ము వేసటచేఁ గుందనీక
దినముల నొకరీతి దీనతఁ గడప, వనమున కావీథిబాలురు సనఁగ
వారిబాసటఁ గూర్చి బాడబోత్తముఁడు, దేరకుఁ దేరఁగాఁ దే దర్భవితతి
నక్కటికంబు రవ్వంతయు లేక, నిక్కుమారుని బంపె నీకానక కట!

అక్కటా! యీబిడ్డఁ డట్టులే వచ్చి, చిక్కి నాహతవిధిచిక్కుల న్రుక్కి
కాలభుజంగంబు కాటువేయంగఁ, గాలగతిం జెందెఁ గా నీనుతుండు
అని విప్రబాలకు లనుకంప నింప, వినిచిన దిగు లొంది విప్రునిల్ చేరి
అవధి యొసంగుఁడీ యయ్య! తనూజు, శవమును గాల్చి చనుదెంతు నంచు
వచ్చినదాన నీవనవాటి కయ్య! చెచ్చెర శోకాగ్నిచేఁ గ్రాఁగి యేడ్వ
వచ్చేసినా రీరు విశ్వేశుఁబోలెఁ, బొచ్చెంబు లేనినాపుణ్యంబుకతనఁ
బొగిలెడిఁ జిత్తంబు పుత్త్రశోకమున, వగఁ బాపి యిబ్బాలు బ్రదికింపరయ్య
జీవింపఁ జేయుఁడీ జీవంబు లొసఁగి, జీవింపఁ జేయుఁ డీచిన్నారిబిడ్డఁ
దమపాదపంకజాతములకు భక్తి, నమనంబు లొనరింతు నాదుఃఖమార్ప.

(సోమసుందరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సోమసుందరుఁడు—అమ్మా! దుఃఖింపకుము. నీవు దుఃఖపడుచుఁ జెప్పుచుండుటచేతను స్పష్టముగా నీయుదంతము తెలియరాకుండ నున్నది. నేనును నిపుడే యిచటికి వచ్చితిని. కొంచెము ధైర్య మవలంబించి నెమ్మదిగాఁ జెప్పుము. మాగురుభగవానులవారు తగినయుపకృతి చేయుదురు. అందులకే నిష్ఠాగరిష్ఠులై జపియించు చున్నారు. ఇఁక నేడ్వవలదు. నీసంగతి యంతయు సవిస్తారంబుగాఁ జెప్పుము.

చంద్రమతి—స్వామీ! నేను గన్యాకుబ్జధరణీశునిపుత్త్రికను.

సోమసుందరుఁడు—ఆహా! అలాగుననా! అక్కటా! యెంతసంతాపకరము! ఎంతటిపాపము! అమ్మా! విచారింపకుము. పిమ్మటి సంగతి చెప్పుము.

చంద్రమతి—వారు చాలఁగాలము సంతతిలేక చింతించుచుండిరి. తద్దోషపరిహారార్థంబుగా ననేకసత్కార్యంబు లొనరించుచుండుటయే కాక ఘోర మగుతపంబుఁగూడ నొనర్చి నన్నుఁ గన్నారఁట! నేను శైశవమునుండియు నతిగారాబముగాఁ బెంపఁబడితిని. అట్లు దినదినప్రవర్ధమాననై యుక్తవయస్సును జెందుటఁ గాంచి మాతండ్రి నాకుఁ బాణిగ్రహణమహోత్సవంబు సేయుటకై పెక్కండ్రు రాజకుమారులకు లేఖలు పంపి నాస్వయంవరవృత్తాంతమును నలుదిక్కులను జాటింపించెను. ఉద్దిష్టకాలంబునకుఁ దప్పక రాజకుమారులు వచ్చి స్వయంవరమంటపము నలంకరించి యుండిరి. పిమ్మట నేను బుణ్యనదీజలంబుల మంగళస్నానం బాచరించి సఖీజనంబులు గొల్వ దివ్యమణిభూషణాలంకృతాంగినై వివాహమంటపముం జేరితిని. అచట నాపూర్వపుణ్యఫలంబునను, తమవంటిపెద్దలయమోఘాశీర్వచన ప్రభావంబువలనను, హరిశ్చంద్రనరేంద్రునిఁ బతిగా వరించితిని.



సోమసుందరుఁడు—అహాహా! హరిశ్చంద్రసార్వభౌమునిపట్టమహిషివా? పుట్టినచోటును మెట్టినచోటును బ్రశంసింపఁదగినదియే. అటు తర్వాతను?

చంద్రమతి—తరువాతను బూవులు తావివలె మాదంపతులమనంబు లేకమై యొప్పుచుంటిమి. పిమ్మట మాతపఃఫలంబు మూర్తీభవించెనో యన నీపుత్త్రరత్నముం గాంచితిమి. అక్కటా! హతవిధి పాలుచేసితిమి.

(అని యేడ్చుచుండును.)

సోమసుందరుఁడు—అమ్మా! యేడువకుము. నీ శోకశాంతియుఁ దటస్థింపదు మిగతసంగతులు గూడఁ జక్కఁగాఁ జెప్పుము.

చంద్రమతి—స్వామీ! మేమారీతిని భూలోకసౌఖ్యము లనుభవించుచు దినములు గడపుచుండఁగా నొకానొకదినంబున విశ్వామిత్రమునివరేణ్యులు రాజసభామంటపంబునకు విచ్చేసి సార్వభౌము నాశీర్వదించి యొక మహామఖంబు నాచరించుటకై ధనము గోరిరి. కాని దాని నాకాలంబుననే కైకొనక వలయుసమయంబునఁ

దీసికొనిపోవుదు మని చెప్పి పనివినిరఁట! తరువాత నొకకొన్ని దినంబులు గడచినవెనుక నాపెనిమిటి ప్రజలకు సౌఖ్యము సంపాదింప నెంచి వేఁట కేఁగిరి. అడవిలోఁ జాలఁగాలము మృగయాసక్తులై యుండి యలసి రాజచంద్రు లొకమహీరుహచ్ఛాయను విశ్రమించిరి. అప్పు డిరువురు జవ్వను లేతెంచి చక్రవర్తివీనులకు విందగునట్లు పాడిరఁట! ఆపాట విని హృదయరంజనము నొందినయిలాతలేశులు మణిహారాదులను గానుకగా దయచేయఁ బోఁగా నాయీగి నాజవ్వనులు తిరస్కరించిరి. పిమ్మటఁ జక్రవర్తి "మీ కేమికావలయును?" అని యడుగఁగా వాండ్రు చక్రవర్తి పాణిగ్రహణమును గోరిరఁట!

సోమసుందరుఁడు — అహహా! యేమి తెగువ! ఏమిసాహసము! ఆస్త్రీలా మహారాజును బలాత్కరించిరేమి? ఏమికాలవైపరీత్యము!

చంద్రమతి—ఔను స్వామీ! అప్పు డవనీకాంతుఁ డప్పడంతులకు నీతివచనంబులచే హితము బోధించి యచ్చోటునుండి మరలిరి. అంత వాండ్రు దమమనోరథము పూర్తిగాకుండుటకై మిగులఁ బరితపించి చక్రవర్తిని దూషించిరఁట! ఆదూషణవాక్యములు వినుచుండినమానర్మసఖుఁ డొక్కరుఁడు వాండ్రను బట్టి దండించెనఁట!

సోమసుందరుఁడు—అమ్మా! ఆసంగతి యట్లుండనిమ్ము. ఇపుడు చెప్పిన మాట లన్నియు మీపెనిమిటి చెప్పఁగా విన్నవే కాని ప్రత్యక్షముగా మీ రెఱుఁగరుగదా!

చంద్రమతి—విన్నవే కాని ప్రత్యక్షముగా నెఱిఁగినవి గావు. ఐనను; నాపెనిమిటివాక్యంబులంగూర్చి దేవరవారు సందేహింప నక్కఱ లేదు. వా రెప్పుడును సత్యమునకు దూరముగాఁ బలుకువారు గారు. తము రనుగ్రహించి యిఁకఁ దక్కినసంగతులుగూడ నవధ



రించితి రేని యందలిసత్యాసత్యంబులు తమకే గోచరము గాఁ గలవు.

సోమసుందరుఁడు—అటులేని సరియే మిగతసంగతులుగూడఁ జెప్పుము. లోకములో స్త్రీలు పురుషులను బలాత్కరింతు రనుమాట అంతగా నమ్మఁదగి యుండదు. అట్లొకానొకతె బలాత్కరించినను పురుషుఁడు వారిప్రార్థనంబు నిరాకరింపఁజాలఁడు. ఇది తుదవఱకును మాఱుపడి కదా యున్నది. ఇప్పటికిని మీపెనిమిటిచిత్తవృత్తిని మీరు బాగుగా నెఱిఁగియే యుందురు. మా కేమి తెలియును? పిమ్మటివృత్తాంతము చెప్పుము.

చంద్రమతి—స్వామీ! దాసురాలు చెప్పుమాటలలో దేవరవారు కొంచెమైనను సందేహింపవలసినది లేదు. మేము సత్యమునకు వ్యతిక్రమముగాఁ గొంచెమేనియుఁ జెప్పువారమే కాము.

సోమసుందరుఁడు—ఆలాగుననా? అటులయిన సరి. ఇఁక మేము సందియపడి మరలమరల నడుగము. మిగిలినసంగతులు చెప్పుము.

చంద్రమతి—స్వామీ! అట్లు నర్మసఖుఁడు వాండ్రను దండించిన సంగతిని గ్రహించి చక్రవర్తి నర్మసఖునకు హితము బోధించుచుండఁగా నప్పుడే విశ్వామిత్రమునీశ్వరులు కోపాయత్తచిత్తులయి నేత్రంబులనుండి కోపాగ్నిహోత్రకణంబుల రాల్చుచుఁ జక్రవర్తిపై నాగ్రహించిరి.

సోమసుందరుఁడు—ఏల? కారణ మించుకయును లేకుండఁగనే?

చంద్రమతి — కారణము లేదని యెట్లు చెప్పవచ్చును? ముందుగా సొంపుమై పాటలుపాడిన జవ్వనులు వారిచేఁ బంపఁబడినవారఁట! వాండ్రను రాజుగారియుత్తరవును బొందియే నర్మసఖుఁడు దండించినట్లుగా గ్రహించి వచ్చి కోపించిరి. అప్పుడు చక్రవర్తి యావిశ్వా

మిత్రమునివరులకు నమ్రు లయి మన్నింప వేఁడిరి. మునివరులు "సంపదవలనిమదము చేతనుగదా యిట్లు దౌష్ట్యంబునకు లోఁబడితివి!" అనిరి. అందులకు సార్వభౌముఁడు "స్వామీ! యీనా రాజ్య మొకానొకభారమే కాని సార మిం దెంతమాత్రమును లేదు" అనిరి. ఆమాట విన్నతోడనే మునిచంద్రుఁడు హరిశ్చంద్ర రాజేంద్రునిఁ జూచి "భారంబుగాఁ దోఁచుట నిజమైనచో మా కారాజ్యము నిచ్చివేయవచ్చునే" అనిరి. అంత రారాజు మునిరాజుం గాంచి "ఈ భూభార మంతయుఁ దాము వహింప నెంచినచో సంతోషపూర్వకముగా నిప్పుడే తమకు సమర్పించెదను" అని చెప్పి రాజ్య మాయన కర్పించిరి. ఈ సంగతి యంతయు నా పెనిమిటి చెప్పఁగా విని తెలిసికొంటిని.

సోమసుందరుఁడు—మునివరుఁడా మనసార రాజ్యము గావలయు నని కోరినవాఁడు. అదియును నొకమాటమాత్రమునకుఁ దగినయట్లే యున్నది. తరువాతఁ దరువాత?

చంద్రమతి—పిమ్మట మేము వానప్రస్థాశ్రమమును బరిపాలింపఁ గాననంబునకుఁ బోవఁ బ్రయత్నించితిమి. అప్పుడు ఋషిచంద్రుఁడు వానప్రస్థులకు భూషణాదులతో నేమిపని యన నధిపుఁడు వాని నన్నిటిని నామునివర్యునకే యొసఁగి యాపుణ్యాత్ముఁ డొసఁగిన కావివస్త్రంబులు గట్టుకొని యడవికిఁ బోవ సమకట్టితిమి. తోడనే యావిశ్వామిత్రమహాముని సార్వభౌమునివంకఁ జూచి "ముందు నీయొద్ద దాచియున్న నూఱులక్షలునిష్కంబు లిచ్చి పొమ్ము" అని యడుగఁగా నాపెనిమిటి "స్వామీ! అవియును బొక్కసమునందే కదా యున్నవి" అనెను. "రాజ్యము దత్తము చేయునపు డాసంగతి వివరింపవైతివి గావున నందలిసొత్తంతయు మాదే యయినది. ముందు చేసినవాగ్దానప్రకారముగా మానిష్కం



బులు మాకు సమర్పించెదవా లేవనియెదవా?" అని యడిగిరి. అన్నమాట తప్పఁగూడదని దాటచే "అట్లేని మునిచంద్రమా! నలువదిదివసంబులు గడువు దయచేసితిరేని తమ కాధనము సమర్పించుకొందుము" అని యొప్పికొనిరి.

సోమసుందరుఁడు—అహాహా! ఇది యేమియాశ్చర్యము! మునివరుల సంగతి మొదటినుండియు మోసముగానే కనఁబడుచున్నది!

చంద్రమతి—స్వామీ? ఇందులో మోస మిసుమంతయును లేదు. పద్ధతిప్రకారముగా మే మీయ నొప్పుకొన్నది యెట్లయినను నిచ్చితీరవలసినదే కదా?

సోమసుందరుఁడు—ఇది మఱియు బాగుగా నున్నది! మీరేమి యాధనమును వేఱుగనా యెత్తి యుంచితిరి. అట్టి దేమియును లేదే. వారి కిచ్చెద మని వాగ్దత్తముచేసినధనము ధనాగారములో ననేకదా యుంపఁబడినది. ఇందుకా మొండివ్యాజ్యము! మునీశ్వరునకు బాగుబాగు.

చంద్రమతి—స్వామీ! రాజ్య మప్పగించుసమయమునం దాధనము సంగతి చెప్పి యప్పగింపవలయుట యుక్తమే కదా! అట్లు గుర్తింపక ప్రమాదపడుటచేత నియ్యవలసినదిగానే యేర్పడినది.

సోమసుందరుఁడు—మీరే యట్లు భావించినయెడల నిఁక మునివరుఁడు ధనమును బుచ్చుకొనుట కేమభ్యంతరము? అయ్యయో! పాపము! ఏమిదారి? తరువాత నేమిజరిగినది?

చంద్రమతి—స్వామీ! మే మడిగినగడువులోఁగా నాధనమును బుచ్చుకొనుటకు మాతోడ నక్షత్రేశు లనువారి నొకరిని బంపిరి. అట్లు మేము నలుగురమును రాజ్యమును వీడి బయలుదేఱితిమి. అపుడు పౌరులపరితాప మేమనిచెప్పఁగలను స్వామీ? మేము వారి నించుక

యోదార్చుచుండుట గాంచి ఋషిభగవానులవారు "ఇఁక నొక క్షణమేనియు మీ రిచ్చట నుండవలనుపడ" దనియు "మరల మీ రీరాజ్యమునకు రాఁగూడ" దనియు నాజ్ఞాపించిరి. మేము వారి యాజ్ఞ నట్లే శిరసావహించి వెడలితిమి. తరువాత మఱి రెండుదినములకు మామంత్రి సత్యకీర్తి మమ్ముల నెడఁబాసి యుండుట కోర్వఁజాలక వచ్చి మమ్ములను గలిసికొనెను. పిమ్మట మే మేపురమును గష్టముల కలుకుచు నులుకుచు నన్నపానములకు మొగము వాచి కాయగసురులు మెసవుచుఁ గాలినడకనే యెట్లో యీకాశీక్షేత్రమునఁ జేరితిమి. మునినాథులయప్పు దీర్చుటకుఁ బెక్కువిధములఁ బ్రయత్నించినను గొనసాగకపోవుటచే దిగులుచేతను గుందుచు నొకానొకసత్రంబునఁ బ్రవేశించితిమి. అటువెనుక మాపడుచున్నపరిశ్రమ లన్నియుఁ గన్నులారఁ జూచుచున్ననక్షత్రేశులవారు పట్టణములోనికిఁ బోయి వెదకి యొకానొకవిప్రవరుని వెంటఁబెట్టుకొని వచ్చిరి. ఆవృద్ధబ్రాహ్మణుఁడు తమ కొకయాఁడుది బానిసగాఁ గావలయు నని చెప్పి నన్నును నాయీకుమారుని బానిసలనుగాఁ గొని మునినాథుల కీయవలసినపైకము నిచ్చెను. పిమ్మట మమ్ము బానిసలనుగాఁ గొన్నయింటికి నాపెనిమిటి లోనగువారు రాఁగూడ దని యాబ్రాహ్మణుఁడు చెప్పఁగా విని నాహృదయేశులు వ్యాకులపాటు నొందుచు మంత్రిపుంగవునిఁ గూడి యెటకో యేఁగిరి. నేను బుత్త్రునితోఁగూడ ద్విజోత్తమునియిల్లు చేరి వారు చెప్పినపనులు చేయుచు వారుపెట్టినది తినుచుఁ గాలముగడపుచుంటిని. అయ్యో! దైవమా! నా కెన్నిపాట్లు గలిగించుచుంటివి?

(అని యేడ్చుచున్నది.)



సోమసుందరుఁడు—అమ్మా! పిమ్మట నేదో క్రొత్తసంగతి సంభవించె నని యోజింప నగుచున్నది. సరిలే దుఃఖపడక చెప్పవలసినసంగతు లన్నియుఁ జెప్పుము.

చంద్రమతి—స్వామీ! ఇఁక నే నేమని చెప్పఁగలను? నేఁటియుదయమున మాయజమానులు "రేపు కార్య మున్నది. కావున దర్భ మొదలగునవి కావలయును" అని చెప్పి యావీథిలో నుండుబ్రాహ్మణబాలురతోఁగూడ నాకుమారు నడవికిఁ బంపిరి. స్వామీ! యేమని చెప్పుదును? నాముద్దుకుమారుఁడు పాముగఱచుటచేఁ జచ్చి పడియున్నట్లు వెంట వెళ్ళినబ్రాహ్మణబాలురు వచ్చి చెప్పిరి. అక్కటా! ఇదిగోఁ బీనుఁగుగాఁ బడియున్నవాఁడు వీఁడే నాకొడుకు. స్వామీ! యేమిచేయుదును? నాపెనిమిటి యెందున్నదియుఁ దెలియదు. దిక్కుమాలినయీశవమును గాల్చుటకై శ్మశానవాటికకుఁ దీసికొనిపోవుచున్నాను. శ్మశాన మెక్కడ నున్నదో తెలియరాకుండ నున్నది. ఇట్టిగాఢాంధకారమున ఘోరారణ్యమధ్యంబున నీకాశీపతియే మిమ్ములను దోడు చూపించె నని యెంచుచున్నాను. స్వామీ! యేమిచేయుదును? తమరే దిక్కు. అక్కటా! దిక్కుమాలినదానను.

(అని యేడ్చుచున్నది.)

సోమసుందరుఁడు—అయ్యో! తల్లీ! నీ కేమిదుఃఖము సంభవించినది? బ్రహ్మసృష్టిలో నెవరికైనను మీకువలె దుఃఖపరంపర గలిగెనని విందుమా! ఏమయిన నేమి? "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అనునట్లుగా నేమివచ్చినను దప్పక యనుభవించియే తీరవలయునుగదా! అది యట్లుండ నిమ్ము. అమ్మా! మీకు మంచికాలము తటస్థించుటచేతనే మా కగపించితిరి. కాని నీకుమారుని పాముగఱచుట నిజమే యగునా?

చంద్రమతి—స్వామీ! నే నేమిచెప్పఁగలను? నేనుమాత్రము సాక్షాత్తుగాఁ జూచినదానను గాను. బిడ్డనిఁబాము గఱిచె నని బ్రాహ్మణబాలురు చెప్పఁగా విన్నాను.

సర్వార్థసిద్ధి—(కన్నులు తెఱిచి) దేనిచే మరణము తటస్థించినను జింతింపవలసినపని లేదు. మేము ముందు చెప్పినచొప్పుననే "అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము" అనునష్టసిద్ధులను బొంది పరకాయప్రవేశము మొదలగునద్భుతచర్యలను దెలిసికొని తుదకు జీవకారుణ్యముచేఁ జచ్చినవారిని బ్రదికింపఁజాలిన మహిమాతిశయంబునం జేసి "సర్వార్థసిద్ధులు" అనుసార్థకనామమును వహించి యున్నాము. అది పోనీ కాని యిప్పుడు శరీరమునందుఁ బ్రాణ మున్నదా లేదా! దేహమంతయుఁ జల్లఁబడినదా లేక యుష్ణముగా నున్నదా?

చంద్రమతి—స్వామీ! శరీరమునందుఁ బ్రాణ మెక్కడిది? కట్టెవలెనే కదా యున్నది శరీరము! మఱియు దేహమునం దుష్ణ మను మాటయే లేదు. తామే కటాక్షించి బ్రదికింపలవయును.

సర్వార్థసిద్ధి — విషమయినను మఱియేమయినను మళ్ళింపవచ్చును. అదియునుంగాక, ఇవు డర్ధరాత్రముగూడఁ గాలేదు. సకలవాయువులును శరీరమునుండి తొలఁగినను ధనంజయ మనువాయువు మాత్రము శరీరాభిమాని యగుటచేఁ ద్వరగాఁ దొలఁగునది కాదు. చూతము. భగవద్విలాసము గదా! ఉండనీ; మఱియొక విషయము..................

చంద్రమతి—స్వామీ! "దిక్కుమాలినవారికి దేవుఁడే దిక్కు" అను మాట యిప్పుడు యథార్థ మైనది. ఈ బిడ్డని బ్రదికించుభారము దేవరవారియందే యుంచుకొంటిని. మూర్తీభవించిన దయా



రసమో యనునట్లున్న దేవరవారిఋణ మెట్లు తీర్చుకోఁగలనో? యెఱుఁగరాకున్నది.

సర్వార్థసిద్ధి—అది యట్లుండుఁగాక. ఏదో భగవంతునిమీఁదనే భారముంచి యాయన కృపావిశేషంబునఁ గార్యము ముగించెదము. నీవు భయపడకుము. ఈ బాలుని బ్రదికించినపిమ్మట మీ రిరువురును మాసన్నిధినే యుండి శుశ్రూష చేయుచుండవలయును. ఇందులకై నీవు సమ్మతించితివేని తత్కార్యమ్మున కిపుడే ప్రయత్నించెదము. సమ్మతింపవేని..................

చంద్రమతి—స్వామీ! మాపడినయిడుమ లన్నియుఁ దమసన్నిధిని ముందుగానే విన్నవించుకొంటిని. తాము సావధానముగాఁ జిత్తగించితిరి. ఇట్లుండఁగా నేను దేవరవారి కెట్లుశుశ్రూష చేయఁగలను? దేవరవారిపాదపద్మముల నహర్నిశంబును మననము చేసికొనుచుందును. తమ్మునే మాయిలువేల్పుగా భావించుచుండెదను. మాప్రకృతపుదాస్యము తీరినతోడనే సకుటుంబముగాఁ దమచరణారవిదంబులకు దాసులమై యుందుము. ఇంతకన్నను మాకు సంతస మేముండును? తాము కరుణించి యీబాలుని సజీవునిగాఁ జేయవేఁడెదను. ఇటుపయిని దమపాదారవిందములే గతి.

(అని పాదములపైఁ బడుచున్నది.)

సర్వార్థసిద్ధి—అమ్మాయీ! ఇవు డీమాటలతో నేమిప్రయోజనము? నీకుమారుని బ్రదికించుట కెంతమాత్రమును అభ్యంతరము లేదు. కాని మీరిరువును మాసన్నిధిని శుశ్రూష చేయుచుండక తీరదు.

చంద్రమతి—స్వామీ! తా మట్లు సెలవిచ్చిన నిఁక నే నేమి మనవి చేయఁగలను? దేవరవారిచిత్తవృత్తికి విశదము గానిసంగతి యుండునా? మా కీదాస్యము తొలఁగిననేకాని మాకు మాదేహములపై

స్వాతంత్ర్యము లేదు. ఏమిచేయుదును? నాజీవితేశుఁడు వచ్చి మమ్ములను విడుదలచేసినక్షణముమొదలు దేవరవారియాజ్ఞను శిరసావహించి యూడిగంబు చేయుచు జీవితశేషమును గడపుకొందుము. స్వామీ! తాము దయ దలఁచి కటాక్షింప వేఁడుకొనుచున్నాను.

సర్వార్థసిద్ధి—సరియే కాని; మీ రిప్పుడు మరలి పోకున్నచో నాబ్రాహ్మణుఁ డేమిచేయఁగలఁడు? "కొడుకుతోపాటు తల్లిగూడఁ జచ్చినది కాఁబోలు" నని భావించును. కాఁబట్టి మీరు భయపడకుండ మాసన్నిధిలోననే యుండవచ్చునే.

చంద్రమతి—స్వామీ! ఎవరిని గనుఁబ్రామినను గనుఁ బ్రామవచ్చును గాని—

" చ. ఖరకిరణుండు చందురుఁడు గాడుపు హవ్యముదాల్చువేల్పు నం
బరమును భూమియు౯ జలము మానసము౯ మఱి యంతకుండు వా
సరములు రాత్రులు౯ మఱియు సంధ్యలు రెండును ధర్మువు౯ నిరం
తరము జనుల్ పొనర్చుసుకృతంబును పాపముఁ గాంచుచుండ్రుగా."

అని పెద్దలు చెప్పినసుద్ది చొప్పున నాదేవతాదుల నెవరు కనుఁ బ్రామఁగలరు? ఇంత యేల? తామే సర్వసాక్షిగా వెలయుచున్నారు. స్వామీ! "నేను త్వరగానే వచ్చి చేరుదును" అని నమ్మించి వచ్చియున్నదానను. కాఁబట్టి త్వరగాఁ గృప యుంచి నాబిడ్డని బ్రదికింప వేఁడుకొనుచున్నాను.

సర్వార్థసిద్ధి—అట్లయినచో మావలన సరిపడదు. అది మాగురుభగవానులవారియానతి. దాని నతిక్రమించుట దుస్సాధము. మీరు తప్పక శుశ్రూష చేయ నొప్పుకొన్నచో మే మిప్పుడే నీబిడ్డని బ్రదికింతుము. లేనిచో నిదిగో నిపుడే వెళ్ళు. ...............



చంద్రమతి—(వానిపాదములమీఁదఁబడి) స్వామీ! అందులకు మాత్రము మన్నించి యనుగ్రహము చూపవలయును. ఇఁకఁ దమపాదపద్మములకన్న వేఱుదిక్కు లేదు. ఆదైవమే యీదిక్కుమాలిన యాఁడుదాని మొఱ్ఱాలకించి దేవరవారి నిచ్చోటికిఁ బంపియుండఁగాఁ దాము నాబోటిదిక్కుమాలినబోటిని గరుణింపక యెట్లుపేక్షింపఁగలరు? నావిన్నపమును మన్నించి నాబిడ్డని బ్రదికించి పుణ్యము గట్టుకొనుఁడు. దేవరవారిచరణములే శరణము. ఎప్పటికిని మరువఁజాలను. స్వామీ! నాముద్దులొలుకు బాలునిమోముఁ జూచియైనను దాము ప్రేమాంతరంగు లగుదురుగాక.

సర్వార్థసిద్ధి—అమ్మాయీ! నీపడినపాట్లు వినుటచేతను, ప్రకృతము నీయవస్థను గనులారఁ జూచుచుండుటచేతను మామనస్సు ద్రవీభావమును బొందుచున్నది. కావున నింకొకమాట చెప్పెదము. వినుము. ఎవరైనను "చచ్చిన నీకుమారుఁ డెట్లు బ్రదికెను?" అని యడిగినచో చావలేదు. మూర్ఛిల్లి పడియున్నాఁడు. నేను బోయి యెత్తి కూర్చుండఁ బెట్టి చల్లనినీరు దెచ్చి త్రాగించితిని. అంతట సేద దేఱి లేచెను." అనిమాత్రము చెప్పుము. కాని మేము వచ్చి బ్రదికించితి మనిమాత్రము తుదకు నీభర్త వచ్చి యడిగినను జెప్పఁగూడదు.

చంద్రమతి—స్వామీ! అట్లనఁదగునా? అన్నను దైవ మోర్చునా? అట్లు పలికినచో నసత్యమాడినదానను గాకుందునా? అదియునుంగాక, కృతఘ్నతాదోషముగూడఁ దటస్థించునే.

" శ్లో. మిత్రఘ్నశ్చ కృతఘ్నశ్చ యస్తు విశ్వాసఘాతుకః,
త్రయ స్తే నరకం యాన్తి యావచ్చంద్రదివాకరమ్,,

అనికదా తమవంటిపెద్దలు చెప్పుదురు. ఇఁకఁ దా మట్లు సెలవిచ్చినచో నీదిక్కుమాలిన యక్కుపక్షి యేమిచేయఁగలదు? హా! కాశీనాథా! నా మొఱ్ఱాలింపవా?

సర్వార్థసిద్ధి—అమ్మాయీ! ఇవి యన్నియు నెందులకును బనికిరాని మాటలు. చచ్చినవానిని బ్రదికించుట భగవంతునికేని సాధ్యము గాదు. అది యెట్లో మాగురుభగవానులవారి కారుణ్యాతిశయమున మాకు లభించినది. ఇది యెవ్వరికిని దెలియఁదగినసంగతి కాదు. ఒకరికిఁ దెలిసిన లోకమునం దంతటను వ్యాపింపకమానదు. ఎవ్వరికిని దెలియనీయరాకుండుటచేతనే మిమ్ముల నిద్దఱను మాయొద్దనే శుశ్రూష చేయుచుండవలయు నని యంటిమి. నీ వట్లొడంబడఁజాల కున్నావు. కాఁబట్టి లోకు లెవ్వరైన నడిగినచో నీవిషయము గొంచెము మార్చి చెప్పవలయు ననుచుంటిమి. అందులకును నీవు లోఁబడఁజాల ననుచున్నావు. నీకర్మగతి యిట్లుండఁగా మేము చెప్పుచున్నహితోక్తులు నీమనస్సున కెందులకుఁ బట్టును. పోనిమ్ము కనిపెంచిన బిడ్డనియందు నీ కేఅంతప్రేమ లేనప్పుడు మాకేమిగావలయును? మాకేల యిట్టియర్ధరాత్రంబున నిచట నుండి వ్యర్థముగా శ్రమపడుట! కనుక నీయిచ్ఛకు వచ్చినమచ్చునఁ జేయుము. మే మింక నిమిషమాత్రమయినను నిచట నుండము. ఇదిగో నిప్పుడే పోవుచున్నాము.

(అని వేగముగాఁ బోవుచున్నాఁడు.)

చంద్రమతి—(వెంబడించి) స్వామీ! స్వామీ! కనికరించి యనుగ్రహింపరా! నాబిడ్డని బ్రకిందిపరా! అగతికను గదా! తమపాదంబులపైఁ బడి బ్రతిమాలుకొనుచున్నను దయరాదా? ఇది తమబోటితపోధనులు చేయవలసినపనియేకదా?

సర్వార్థసిద్ధి—కాదు కాదు. మావలనఁ గానేఱదు. మేము ముందన్నవానిలో నేదేని యొకటి చేయుట కంగీకరించితివేని బ్రదికించెదము లేదేని వృథగా మమ్ముల నేల యాయాసపఱిచెదవు?

(కొంచెము దూరమున నిలువఁబడును)



చంద్రమతి—స్వామీ! నాయందుఁ గొంచెము కరుణించుఁడు.

" చ. ఉరుతరపర్వతాగ్రమునసుండి దృఢం బగురాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హతంబుగఁ జేయుట మేలు గాలిమేఁ
పరిదొరవాతఁ గే లిడుట బాగు హుతాశనమధ్యపాతముం
వర మగుఁ గాని శీలగుణవర్జన మర్హము గాదు చూడఁగన్."

అని పెద్దలు చెప్పినయొప్పున స్వామీ! మమ్ములను బాపాపకీర్తులకుఁ బాత్రముగాఁ జేయక మఱి యేమిచేయుమన్నను దమయాజ్ఞను శిరసావహించి చేయుటకు సిద్ధులమై యున్నాము. మిమువంటిమహర్షులు నిషేధించినచెడుకర్మములను జేయుట కెట్లొప్పుకొన నగును? దయదలఁచి యిక్కుమారుని బ్రదికించి పుణ్యము గట్టికొనుఁడు. విధేయురాలను. నమస్కరించుచున్నదానను.

(అని పాదములపైఁ బడుచున్నది.)

సర్వార్థసిద్ధి—అమ్మాయీ! మే మేమిచేయఁగలము? మాగురుభగవానులవారియాజ్ఞను మీఱి చరింపరాదు. ఒకవేళ నీదుఃఖము చూడఁజాలక యేమేని ప్రతిక్రియ చేసినను లాభము గలుగదు. ఏమిచేయవచ్చును? నిజమైనసంగతి చెప్పెదము వినుము. బ్రదుకువారిని జంపువారును జచ్చినవారిని బ్రదికించువారును లేరు. ఇఁక మేము చేయవలసిన దించుకయు లేదు. మేము పోవుచున్నాము.

(వేగముగాఁ బోవుచున్నాఁడు.)

చంద్రమతి—స్వామీ! స్వామీ! నావిన్నపమును మన్నింపరా? దిక్కులేక తత్తరపడుచున్నాను. శ్మశానమును జూపువారైనను గానరారు. ఏమిచేయుదును?

సర్వార్థసిద్ధి—(నిలువఁబడి) అమ్మాయీ! నీవు నిలిచియున్న చోటినుండి తిన్నఁగాఁ బోయినయెడల నెదుట నగ్నిజ్వాలలు గన్పించును. అదియే శ్మశానవాటిక సూటిగాఁ బొమ్ము.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

చంద్రమతి—(తనలో) అయ్యో! దైవమా! విశ్వేశ్వరా! ఇట్టి దుష్కర్మమును గలదా? మాదుఃఖమున కుపమాన ముండునా? "పడిన కాలికే పాటు, చెడినకాపురమునకే చేటు" అనులోకోక్తికి మేమే కదా దృష్టాంత మగుచున్నాము. అక్కటా! హతవిధీ! చేతి కందించి నోటి కందనీయవైతివిగా! నీ వేమిచేయుదువు? మాయొనర్చిన పూర్వజన్మకర్మ మట్టిది. మొదట ననుకొన్నప్రకారముగానే యీబిడ్డని శ్మశానవాటికకుఁ దీసికొనిపోయి సంస్కరించి యజమానుని గృహము చేరెదను. నాయనా! పుత్త్రరత్నమా! అంత కంతకు బరువైపోవుచున్నావా? పాదములకు ముండ్లు గ్రుచ్చుకొనుచున్నవి. అయ్యో! నిన్నెత్తుకొని పోవుటకును దేహములో రవంతయైనను శక్తిలేకుండ నున్నది. ఆహా! ఇఁక నేమిచేయుదును? నాహృదయేశ్వరుఁ డెక్కడ నుండునో కదా! పుత్త్రుని మొగము చూచుటకును నోచకపోవలసి వచ్చినదా? అహో! పరమేశ్వరా! నీలీల యీలీలనా పరిణమించుచున్నది? ఇపు డాసర్వార్థసిద్ధి చెప్పిన చొప్పుననే ప్రజ్వలించుచున్న యగ్నిజ్వాలలు గానవచ్చుచున్నవి. అదియే శ్మశానవాటిక గావచ్చును.

(అని నిష్క్రమించుచున్నది.)

ఇది చతుర్థరంగము.

~~~~~~~~~~~~~~~

*



## పంచమరంగము.

---

**స్థలము :** ఉద్యానవనము.

**కాలము :** సాయాహ్నము.

**పాత్రములు :** పరమానందుఁడు, విశ్వనాథుడు, (కాశీరాజపుత్త్రుఁడు.)

(పరమానందుఁడు విశ్వనాథునుపాధ్యాయునివేష మూని యుద్యానవనములోఁ బ్రవేశించుచున్నాఁడు.)

---

విశ్వనాథుఁడు—అయ్యా! నన్ను వెదకుచునా యిచటికి వచ్చి చేరితిరి? నాకుఁ దోడుగా వచ్చినసంప్రతిని ముందుగా విద్యామండపమునకుఁ బంపి యచట నన్నింటిని సిద్ధముచేయు మని చెప్పియున్నాను. కొంచెము తాళుఁడు పోవుదము.

పరమానందుఁడు—విశ్వనాథా! నేఁడు నేను గొంచెముముందుగాఁ బోవలసియున్నది. ఏమనఁగా నేఁడు విశ్వేశ్వరునియాలయములో మహాభిషేకము జరుగును. కావున నచట నాటలుపాటలు మొదలగు వినోదములు కూడ జరుగు నని జనులు పలువిధములుగాఁ జెప్పుకొనుచున్నారు. అందుచే నే నచటికిఁ బోవుటకై క్రొత్తపాఠములను శీఘ్రముగా ముగించి త్వరితముగా నిచ్చోటికి వచ్చిచేరితిని. నీవును వేగముగా రమ్ము.

విశ్వనాథుఁడు—అయ్యా! నేఁ డాలయములో నంతవిశేషమా! అట్లయినచో నేనును మీతోడనే వచ్చెదను. నేఁడు పాఠము చదువవలదు.

పరమానందుఁడు—విశ్వనాథా! నీ వచ్చుట యిప్పటికి సాధ్యపడునది గాదు. నేను శీఘ్రముగాఁ బోవలయును.
~~~~~~~~~~~~~~~

విశ్వనాథుఁడు—అయ్యా! ఏల యట్లు చెప్పెదరు? నేను క్షణమాత్రములోననే వచ్చెదను.

పరమానందుఁడు—అది యెట్లు వీలగును? నీవు వచ్చుటకు నీ తలిదండ్రులయనుమతి గావలయును. తరువాతను రాజచిహ్నములతోఁడ రావలయును. అంతవఱకు నభిషేకసమయ మాఁగఁజాలదు. ముందుగాఁ బోయిననే మహాభిషేకమును నేత్రపర్వముగాఁ జూచి యానందింప వీలగును.

విశ్వనాథుఁడు—అట్లేమియు నక్కఱలేదు. ఈ యుపవనంబునఁ గొంచెముసేపు విహరించుటకై మాతలిదండ్రులయొద్ద ననుమతిఁ గొంటిని. కావున నిచటినుండియే మీతోఁగలిసి వచ్చుట కేవిధమయిన యభ్యంతరమును లేదు. ఇచటి కాలయముగూడ సమీపమందే యుండుటచేత నడిచియే వచ్చెదను.

పరమానందుఁడు—అట్లయినచో సరియే బయలుదేఱుము పోవుదము. కాని నీవు పాదచారివై వీథులవెంబడిని వచ్చు టంతయుక్తముగాఁ గన్పట్టదు. కావున రాజమార్గము విడిచి యడ్డుదారి గుండఁ బోవుదము రమ్ము.

విశ్వనాథుఁడు—ఆహా! అట్లే చేయుదుము. మీ రన్న ట్లెవరికంటికిని నగపడకుండఁ బోయివచ్చుటయే మంచిది.

(బయలుదేఱుచున్నారు.)

పరమానందుఁడు—(సన్ననిదారి చూపి) విశ్వనాథా! యీదారినే పోవుదము రమ్ము.

విశ్వనాథుఁడు—అయ్యా! అట్లే వచ్చెదను. ఇచ్చటి కాలయ మెంత దూర ముండును?

పరమానందుఁడు—దగ్గఱగానే యున్నది. అదిగోఁ జూచితివా? తోఁట కన్పడుచున్నది! ఆతోఁట దాఁటఁగనే యాలయ మున్నది.



విశ్వనాథుఁడు—ఆలాగుననా? చాలదూరముగా నుండు నని తోఁచుచున్నదే, రాజమార్గమునఁ బోయిననే సమీపమేమో?

పరమానందుఁడు—రాజమార్గమునఁ బోయితిమేని మఱియును దూరము. నీవు బండిపైఁ గూర్చుండి వెళ్ళుచుందువు గనుక సమీపముగా నున్నట్లు కన్పట్టవచ్చును. అంతియేకాని మఱియేమియును లేదు. ఈకాలిదారియే మిగుల సమీపము.

విశ్వనాథుఁడు—కావచ్చును. అయ్యా! నే నింతదూరము కాలినడకతో వచ్చుట కిదియే మొదటితూరి. కాళ్ళను గొంచెముకొంచెము నొప్పిపట్టుచున్నవి. దప్పి యగుచున్నది. ఇచట సమీపమున నేదేని జలాశయ మున్నచోఁ గొంచెము నీరు ద్రావి డప్పి తీర్చుకొందును. అంతకంతకు డప్పి యధిక మగుచున్నది.

పరమానందుఁడు—ఆలాగుననా? అదిగో నక్కడ నొకసరస్సు గన్పట్టుచున్నది. నీ విచ్చటనే కూర్చుండుము నేను బోయి వేగముగా నీరు దెచ్చి యిచ్చెదను.

(పోయి నీరు ముంచికొని దానిలో మూర్ఛిల్లఁజేయువిషమును గలిపి దెచ్చి యిచ్చుచున్నాఁడు.)

విశ్వనాథుఁడు—(ఆతురతగా నీరు ద్రావుచునే) అయ్యా! నీరు కొంచెము చేఁదుగా నున్నదేమీ?

పరమానందుఁడు—ఔనౌను. నేను నగరిలోనికి వచ్చునప్పుడు మార్గమున నున్నవైద్యునియింటికిఁ బోయి యీపాత్రముతోనే మందు ద్రావితిని. ఆమం దే మాత్రమయినను దీనియం దున్న దేమో? ఉన్నను బాధలేదు. దానివలనలాభమే కాని నష్టము లేదు. తిన్నయన్నము వేగముగా జీర్ణమగును. కావలసినంత నీరు ద్రాగుము.

(విశ్వనాథుఁ డింకను గొంచెము నీరు ద్రాగుచున్నాఁడు.)

విశ్వనాథుఁడు—(కొంచెము దూరము నడిచి) అయ్యా! ఏమో కాని నాకుఁ గొంచెము తలతిరుగుచున్నది. మైకముగా నున్నది. ఇఁక నడువఁజాలను. అడుగుదీసి యడుగు వేయుటకును నావలన సాధ్యపడదు.

పరమానందుఁడు—చన్నీళ్ళు ద్రావ వాడుకపడినవాఁడవు గావు. కావున నట్లున్నది. కొంచెమునే పిచ్చటను బరుండుము. మైకము తీఱఁగానే పోవుదము.

(విశ్వనాథుఁడు పరుండి తెలివి దప్పుచున్నాఁడు. పరమానందుఁడు వానిభూషణంబులఁ గైకొని యెఱ్ఱపట్టుబట్టఁ జుట్టి వాని నెత్తికొని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది పంచమరంగము.

## షష్ఠరంగము.

స్థలము : శ్మశానము.
కాలము : అర్ధరాత్రము.
పాత్రములు : చంద్రమతి, హరిశ్చంద్రుఁడు, వీరఁడు.

చంద్రమతి—(తనలో) హా! పరమేశ్వరా! ఇదియే శ్మశానవాటిక యని తోఁచుచున్నది. హా! దైవమా! యేమిగతి యిఁకను! అక్కటా! నాకుమారుని సంస్కరించుటకును దిక్కులేనిదాననై యుండవలసి వచ్చినది. దుఃఖాతిశయముచే బుద్ధికిఁ గర్తవ్యాంశము దోఁచకుండనున్నది. హా! విశ్వేశ్వరా! నీకృపాతిశయమున నెట్లో యిచ్చోటికి వచ్చిచేరితిని. ఇల్లుబయలుదేరునపుడే యజమానుని నడిగితినేని వారు వీనిని సంస్కరించుటకుఁ దగినపద్ధతి చెప్పియుందురు. ఇఁక నిప్పు డీయోజనలతో నేమిప్రయోజనము?



భూమిలోఁ బూడ్చుటకుఁ దగినసాధనములు లేవు. దహన మైనచో నొకవిధముగా నెఱవేర్ప నగును. ఇవిగో! ఎన్నియో శవములు దహింపఁబడినవి. ఈచుట్టుప్రక్కల వెదకినచోఁ గొన్నికట్టెలు చిక్కకపోవు. ఆకట్టె లేర్చికొనివచ్చి యిచ్చటఁ జితి పేర్చి నాచేతులతో నాముద్దుఁగుమారుని దహించెదను. అక్కటా! ఇక్కట్టెలతోఁ జక్కఁగా దహన మగునో కాదో కదా! ఆహా! యేమి కాలము తటస్థించినది? మునుపటిస్థితియందుండి మృతి నొందినచో నెన్ని యగురుకాష్ఠంబులు, ఎన్నిచందనకాష్ఠంబులు, ఎంతకర్పూరము, ఎంతయావునెయ్యి తెచ్చి దహింతురు! అక్కటా! యిక్కట్టెనిఁ గాల్చుట కిక్కడఁ గట్టెలుగూడఁ జిక్కుట దుర్లభ మగుచున్నది. హా! పరమేశా! యీశవమును నీకప్పగించి వెళ్ళెదను. దైవమా! దిక్కులేనిమాకు నీవే దిక్కు. (కట్టెలను వెదకి తెచ్చి చితి పేర్చి) అయ్యో! అయ్యో! ఎంతముద్దుగాఁ బెంపఁబడినశరీరము ఇది! అక్కటా! హంసతూలికాతల్పమునఁ బరుండినను నెట్టగాఁ గందెడియీమే నిచ్చోటను దొర్లాడుచున్నది. అయ్యో! ఇప్పు డీశరీరము కాష్ఠములతోడఁ జేరుచున్నదే!

(చితిపైని శవము నుంచుచున్నది.)

హా విశ్వేశ్వరా! ఇదేమిజీవితము! దీనిపరిణామ మంతయుఁ దుదకుఁ గట్టెలలోఁ బెట్టి కాల్చుటకే కదా! హా! ఇఁక నే నేమి చేయవలయును? అగ్ని నిడి ప్రజ్వలింపఁజేయుటయే కదా! శేషము. అక్కటకటా! నే నీచితి కగ్ని నంటించుటకు ముందుగానే చింత నాయొడలి నేర్చి పేర్చుచున్నదిగదా! ఓరీ నాప్రియతనూజా! దేవదాసా! అయ్యో! నీతండ్రి తుదకు నీమొగముచూచుటకును నోచుకొనక పోయిరి గదరా నాయనా! (పతిని తలంచుకొని ఖాఁదికి

దృష్టి సారించి) హా! నాపవిత్రజీవితాధిదైవతమా! సార్వభౌమాగ్రగణ్యా! ఇదిగో నీవంశాంకురమును నీపుత్త్రరత్నమును నీముద్దులమూట నగ్నిభగవానున కర్పించుచున్నాను.

(అని యేడ్చుచుఁ జితికి నిప్పు తగిలించుచున్నది.)

హరిశ్చంద్రుఁడు—వీరయ్యా! వీరయ్యా!

(అని నిదురనుండి లేపుచున్నాఁడు.)

వీరఁడు—యేంటిరా అన్నా! మంచినిద్దర పాడుశాస్తావున్నావూ?

హరిశ్చంద్రుఁడు—వీరయ్యా! లెమ్ము లెమ్ము. శ్మశానమునం దేమో కాని రోదనధ్వని వినఁబడుచున్నది. నిప్పు రగిలిరగిలి మండుచున్నది. అటువైపు వెళ్ళి చూచి రమ్ము.

వీరఁడు—ఇదేట్రా! అద్దరాత్తిరప్పుడుకూడా నిద్దరోకుండా పాడుముండాపీణ్ణాగున్నాది? ఇదేటో స్సీనాకిరీ.

(పోయి చుట్టుప్రక్కలఁ జుట్టివచ్చి చంద్రమతిని జూచి దూరమునందే నిలువఁబడి)

ఓరబ్బా! యిదేట్రో? నానెప్పుడూ సూణ్ణిచంగతి అగపడతావున్నాది. ఆఁ. యెవరోగాని ఆడమనిసినా గున్నాది. వోరక్కడ? ఆఁ.

చంద్రమతి—అయ్యా! నే నొకస్త్రీని.

వీరఁడు—తిరీయా! బూతవాఁ బేతాలవాఁ!

చంద్రమతి—అయ్యా! నేను భూతమును గాను భేతాళమును గాను. ఒకానొక దిక్కుమాలినయాఁడు దానను.

వీరఁడు—ఆడదానవా? యెందు కొచ్చినా వీయద్దరాత్తిరికాడ యీమసానంలోకి అని అడుగుతా.

చంద్రమతి—అయ్యా! మరణించిననాకుమారుని దహనపఱుచుటకై వచ్చినదానను.



వీరఁడు—యిదేటోరబ్బా పీణ్ణాగున్నాది. అయితే నీతోకూడా వొచ్చినోళ్ళంతా యేరీ? యెక్కడున్నారు?

చంద్రమతి—అయ్యా! నాతో నెవ్వరును రాలేదు. మొదటనే చెప్పలేదా "దిక్కుమాలిన యాఁడుదాన" నని. నాకుమారుఁడు మమ్ముల నందఱను దుఃఖసముద్రములో ముంచివేసి వెళ్ళిపోయినాఁడు. వానిని దహనపఱుచుటకై నేనొక్కతెనే వచ్చితిని.

వీరఁడు—ఒక్కత్తివీనా వొచ్చినావు? సచ్చినోణ్ణెవురు మోసుగొచ్చినారూ అనడుగుతా.

చంద్రమతి—నేనే బుజముపై వైచి మోసికొని వచ్చితిని.

వీరఁడు—నువ్వు సెప్పిందంతా వోరికి నమ్మకం? యేటో గాని యిందులో మోసవేఁ మాత్తరవోఁ గాని వుండాదికావాల్ను. నిజం సెప్పు. యేదీ మాకియ్యవోలసినమామూలు? మాం నిద్దట్లో వుండేతప్పు డొచ్చినావు. అదేటో యివరంగా సెప్పు.

చంద్రమతి—అయ్యా! నే నొకరియింట దాస్యము చేయుచున్నదానను. నాకొడుకు కడవిలోఁ బాము గఱచుటచేఁ జచ్చిపోయినవాఁడు. నే నేకాకినిగాఁ బోయి యాశవమును వెదకి తీసికొనిరావలసివచ్చినది. అందుచేతను జాల రాత్రి గడచినది. నాకు శ్మశానవాటిక యిచ్చోటున నున్నదని తెలియదు, వచ్చుచుండఁగాఁ ద్రోవలో నెవరో మహానుభావుఁ డగపడి త్రోవ చెప్పఁగా నిక్కడకు రాఁగలిగితిని. ఆపీనుఁగును బుజముపై వైచుకొని యిచ్చటికిఁ దెచ్చి యీచుట్టుప్రక్కలను వెదకులాడి యిచ్చటఁగాలఁగా మిగిలిన కొఱకచ్చులను పోగుచేసి చితి పేర్చి శవము నాచితిపైఁ బెట్టి యగ్గి దగిలించితిని. ఇంతలో మీరును వచ్చితిరి.

వీరఁడు—యేఁటేటీ? బాగున్నా దినాయం! యేటమ్మా! యేటిలా సెప్తావుండావు? మావీఁణ్ణే రేతిరీ పొగులూ కాసుకూక్కుకున్నావుఁ.

మాతో సెప్పాలేదు సెయ్యాలేదు. మాకు రావాలిసినపన్నాగిన్నా అదంతా సెల్లించానేదు. మాకాడ సెలవుసీ టుచ్చుగోనూ నేదు. నీయిట్టవాఁచ్చినట్టు శవాన్ని తెచ్చినావు. కఱ్ఱలు గిఱ్ఱలూ అదంతా యీడవే సేరుచుకున్నావు. ఆటిమాట కేంనే. ఆటిచిగ్గోసిరి. ముందాత్తిగా మాకట్టం మాకిచ్చీ. మీరు మాటాడ్డం సూడగా కాపోళ్ళనా కృనపడతావుండాది. యిట్టాకూడా అన్యాయం సేయొచ్చునా అనడుగుతాన్లే.

చంద్రమతి—అయ్యా! నే నొకరియింటిబానిస నని ముందే మనవిచేసియుంటినిగదా! ఈపీనుఁగును గాల్చుటకై కఱ్ఱలకు గతిలేక కొఱకచ్చులను జేర్చి చితి పేర్చితిని. మీకుఁ గట మిచ్చుటకు సొమ్మెక్కడినుండి తేఁగలను?

వీరఁడు—అమ్మా! ఆచంగతంతా మాకెందుకూ? మాదొర సెప్పినట్టు పీను గొక్కంటి కోరూక, మూరెడంతగుడ్డపాత, నోటిబియ్యపనూకలు అయన్ని యిచ్చేసి మరీ యెల్లు. నువ్వేవైఁనా సేసుగునిపో. మాకేటికావాల?

చంద్రమతి—అయ్యా! మీ రడిగినట్టు డబ్బిచ్చుశక్తి నాకున్నచో నీయర్ధరాత్రమున నేకాకినిగా శవమును మోసికొని వత్తునా? కాలఁగా మిగిలినకొఱకచ్చులు వెదకి చేర్చి చితి పేర్చుకొందునా? ఆయీసంగతు లన్నియు నాలోచించి నాకుమారుని దహనపఱుచుట కనుమతి నొసంగ వేఁడుకొనుచున్నాను. అదియునుంగాక; ఈ యూరిమర్యాద యొక్కింతయు నెఱింగినదానను గాను. ఎఱింగినచో నిట్లేల చేయుదును? దీనింబట్టి మీరే యోజించుకొందురుగాక.

వీరఁడు—ఇదేటోస్సి మాసెడ్డశసగా వుండాది. ఒగిటీ లేకుండా పీనుగుని కాల్చెయ్యాలంట! యేటమ్మా! నాను సెప్పినపకారం సెయ్యి.



మాకిచ్చీసామ్ము మామొగాన్నే సేయి. నేకపోతే నీపీనుగునెత్తుకోని నీయిట్ట వాఁచ్చినకాడి కెల్లు. మరి సూసుకో నాకొక్కవ వాఁచ్చినాదంటే నా నూరుకోనేవోణ్ణిగానుసుమా యేవఁనుకున్నావో? నాను మాసెడ్డోణ్ణి.

చంద్రమతి—అయ్యా! నన్నెందులకు బాధింపఁజూచెదవు? నాయొద్ద నేమియు లేదు. ఈ పీనుఁగు నెత్తికొని యెచటికిఁ బోవుదును? దయదలఁచి యీశవమును దహనపఱుచుట కాజ్ఞ దయసేయ వేఁడుకొనుచున్నాను. నేను వట్టిరిక్తురాలను. మీ రింతగా నడుగవలయునా?

వీరఁడు—యేటమ్మోయి పీనుగుని తీసుగుపొమ్మంటే యేటేటో సెప్తావుండావు. మాట్లాడక నీశవాన్ని నువ్వు తీసుగుపోతావా పోవా? ఇదుగో నీశవం - యెత్తుగుపో. నీయిట్టవాఁచ్చినకాడికి తీసుగుపోయి కాలుసుగో.

(శవము తూలిపడునట్లు చితిని తన్నును.)

చంద్రమతి—(త్వరితముగాఁ బోయి శవమును బట్టి యెత్తుకొని) అయ్యో! అయ్యో! కుమారా! నీ కిట్టిగతి పట్టుచుండఁగాఁ జూచుటకు నే నెంతపాపము చేసితినిరా నాయనా! అయ్యో! దైవమా! యిట్టి సుకుమారగాత్రమును శ్మశానపుఁగావలివాఁడు కాలిత్రోఁదన్ని త్రోయునంతటిగతియు సంభవింపఁజేసితివిగా! ఇటువంటి యవస్థ కన్నులారఁ జూచియు నామొండిప్రాణ మీపాడుశరీరమును వదల దాయెఁగదా! నావంటి పరమపాపాత్ములరా లేలోకమునం దైనను నుండునా? ఓరీనాజీవరత్నమా! నాయనా! దేవదాసా!

(అని యేడ్చుచున్నది.)

వీరఁడు—(హరిశ్చంద్రుని దగ్గరకు వచ్చి) ఓయనోఁయి! అరిసెప్పా

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వీరయ్యా! ఏమిసంగతి?

వీరఁడు—యేటన్నా! ఒకయేలంతాడది కొడుకు సచ్చినాడంట. ఆణ్ణి బుజాన్నేసుగోని వొంటిగా యీ అద్దరాత్తిరికాడ మసానంలో కొచ్చి అక్కడ పడున్నకొఱకంచులన్నీ యేరి పోకసేసి ఆశవన్నందిమీద నెట్టి ముట్టిస్తావున్నాదన్నా! నాను దబ్బుదబ్బున యెల్లి మాకట్టం యిచ్చి మరీ కాల్చమ్మా అంటే నే దంటాదన్నా నా నెంతసెప్పినా యింటేనా. కడాపట ఆశవాన్ని కాల్తో తన్ని సాదమీదనుండి తిరగతోసీసి పారొచ్చినా నన్నా! అన్నా! యింక నువ్వే యెల్లాలగాని నావొల్ల గాదు. ఆమనిసి యేటేటో మాటాడతా వుంది.

హరిశ్చంద్రుఁడు—వీరయ్యా! మన కియ్యవలసినకట్ట మియ్యకుండనా దహించుచున్నది? నీవు కట్ట మడిగి యియ్యనందులకుఁ దన్ని తిరుగఁద్రోసియా వచ్చితివి? అయ్యో! సర్వేశ్వరా? యేమిపరితాపము అయ్యా! వీరయ్యా! శివున కవమతి గలిగించినను శవమున కవమానము గలిగింపరాదు. జీవుఁ డున్నశరీరముకంటె జీవుఁడు లేనిశరీరమునే గౌరవింపవలయు నని పెద్దలు చెప్పుచుందురు. నీ వాశవమును దన్ని తిరుగఁద్రోసితి వన్నసంగతి విని మిగులఁ బరితపించుచున్నాను. వీరయ్యా! ఇటుపై నెప్పుడును నటువంటి దుష్కార్యమునుమాత్రము చేయకుమా. రమ్ము పోయి చూతము. (తనలో) ఏమి యిది? ఇట్టిగాఢాంధకారమున నేస్త్రీ శ్మశానవాటికకు రాఁగలదు? ఈసంగతి మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. పోయి చూచి యడుగుదము. (చంద్రమతిని సమీపించి) అమ్మా! మీ రెవ్వరు?



చంద్రమతి—అయ్యా! నే నొకయాఁడుదానను. ఒకానొకబ్రాహ్మణునియింటను బానిసతనము చేసి జీవించుచున్నదానను.

హరిశ్చంద్రుఁడు—ఏమీ? బానిసతనము చేసి జీవించుచున్నదానవా? యేబ్రాహ్మణునియింట?

చంద్రమతి—ఈ యూరియందలి యగ్రహారంబున "కాలకంఠుఁ" డను నొక బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. నేను వారియింటి బానిసను.

హరిశ్చంద్రుఁడు—అయ్యో! పరమేశ్వరా! ఈయర్ధరాత్రంబున నిచ్చటికి రావలసినంతటి ప్రయోజనమేమీ?

చంద్రమతి—అయ్యా! నా కొకకుమారుఁడు గలఁడు. వాని నాబ్రాహ్మణుఁడు దర్భలు మొదలగునవి తెచ్చుటకై యావీథిలోనికొందఱు బ్రాహ్మణబాలురతో నడవికిఁ బంపెను. సాయంకాలమగునప్పటికిఁ గూడఁ బోయినబ్రాహ్మణబాలురు మరలి వచ్చి నాకుమారుఁడు పాముకాటు దగిలి చచ్చిపడి యున్నాఁ డని చెప్పిరి.

హరిశ్చంద్రుఁడు—అయ్యయో! కాశీనాథా! తరువాతఁ దరువాత?

చంద్రమతి—పిమ్మట మమ్ము బానిసలనుగాఁ గొన్నయజమానుల యొద్ద నుత్తరువు పొంది యడవిలో నందందు వెదకి తుద కాశవమును గనుఁగొని బుజముపై వైచికొని దహనపఱుచుటకై యిచ్చోటికిఁ దీసికొని వచ్చితిని.

హరిశ్చంద్రుఁడు—అయ్యో! నాప్రియకుమారా! దేవదాసా! నీవా పాముకాటు దగిలి చచ్చిపోయితివి?

(శవముపైఁబడుచున్నాఁడు.)

చంద్రమతి—హా! నా ప్రాణేశ్వరా!

(భూమిపైఁ బడి యేడ్చుచున్నది.

హరిశ్చంద్రుఁడు—హా ! నా ముద్దులకూనా ! దేవదాసా ! నందనా ! మమ్మును వీడి యెట్లు పోతివి? అయ్యో ! దైవమా ! యేమిచేయుదును? తండ్రీ ! దేవదాసా ! నిన్నును మీయమ్మను బ్రాహ్మణునకు బానిసలనుగాఁ జేసితి నన్నకోపముచేతనా యిట్టిమరణమే శరణమని యెంచితివి? ఓరీ! నాపుత్త్రరత్నమా! ఆసర్పము చూడ శక్యముగాకుండఁ బడగ యెత్తి బుసగొట్టుచుఁ గఱచునప్పు డేమని చింతించితివో కదరా నాయనా ! ఎట్లు బిచ్చపా టొందితివో కదరా ! తండ్రీ!అయ్యో! యిట్టిబాల్యదశయందే ఘోరాటవులలోఁ ద్రిమ్మఱి కాయగసరులను మెసవి బానిసతనమునకుఁ బాల్పడి తుదకంతకుని కఠోరమైనయానకు లోఁబడితివఁటరా ! నాయనా ! నాకుఁ బుత్త్రుఁడవై పుట్టినందుల కీవొందినసౌఖ్యం బిదియే యగునా ? బానిసపడిన కాలంబున నాముసలిబ్రాహ్మణుఁడు బలముమై నీచేయి పట్టిలాఁగఁగా నేను గన్నులారఁ జూచుచుండియు ఱాతిగుండెగలవాఁడనై యూరకుంటి నని తలఁచి మరణమునే శరణముగా నొందితివా? "నాడునగరములను విడిచి కుడుపునుడుపులకు గతిలేనివీఁడు మమ్మెట్లు విడుదల చేయఁగలఁ" డని తలఁచి మరణమును శరణు చొచ్చితివా? తండ్రీ ! అయ్యో ! నందనా ! దేవదాసా ! నిన్నీయవనికి బలి యిచ్చి యిఁక నెట్లురా జీవింపుమనియెదవు? అయ్యో ! అయ్యో ! ఇంక నా కెక్కడిమనుగడ? మట్టిగడ్డ. తనకన్నబిడ్డఁడు ధరణిని విడిచి చనిన వెనుక బ్రదికియున్న నేమి చచ్చిన నేమి? హా ! దేవదాసా ! దే...వ...దా............

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

చంద్రమతి—హానాథా ! నాప్రాణేశ్వరా ! నీ కేమి యిట్టిగతి పట్టినది !



ద్విపదలు.

హా నాథ ! హా ! అయోధ్యాప్రియకాంత, భూనాయికాకాంత ! భూపాలమౌళి
ఓసార్వభౌమ ! నీ వున్న యీకాఁడు, భానురరత్నసభామంటపంబె ?
పటుభూతభేతాళపంక్తులు వీర, భటపరివారకప్రకరంబె నీకు ?
పెను పొందఁ జితివహ్ని భీకరశిఖలు, ఘనతరకరదీపికాసహస్రంబె ?
చదలఁ గ్రిక్కిఱిసినశవధూమపుంజ, మది భవత్కేళినీలాతపత్త్రంబె ?
శూలకీలితనరస్థూలశిరోజ, జాలంబు లాఖేటసమయచామరలె ?
కరమర్థి నరశిరఃకఠినపాత్రములు, సరసత మంగళాచారకుంభములె ?
జ్వలనప్రదేశనిజవ్యంజనములు, తళతళల్ దళుకొత్తుతాళవృంతములె ?
ప్రజ గుంపుగా బరాబరి సేయ మత్త, గజములు నీవెంటఁ గదలి రా వేల ?
ఓజలోఁ బడి వాఁగె నొప్పుసాంబ్రాణి, తేజీలు నీవెంటఁ దివిచి రా వేల ?
వల నొప్పు దండెల వజ్రాల మించుఁ, దొలకాడుచున్నయాందోళిక లెచట ?
పసిఁడితీవలకీలుపంజాలడాలు, పసగుల్కు ముత్యాలపల్లకీ లేడ ?
ఆతేజ మారూప మాభుజాగర్వ, మాతెల్వి యాభాగ్య మారాజసంబు
నెక్కడ నుడివోయె నెక్కడ డాఁగె, నెక్కడితుద మొద లీదురవస్థ
కక్కటా ! కుటిలాత్ముఁ డౌవిధి నేఁత, కిక్కుమారుఁడు చిక్కి యీల్గెఁ జూచితివె?
ముందు నీతొడలపై ముదమార నిద్ర, సెందినగతి నేఁడు చిత్తంబు పొగులఁ
బన్నినచితిమీఁదఁ బడి దీర్ఘనిద్ర, నున్నాఁడు మేల్కాంచఁ డొకయింత యైన
నాపుత్త్రరత్నంబు నాపాటు చూడ, నోపక త్రెళ్ళి తా నున్నవాఁ డిచట
కాటిలోఁ గనుఁగానఁగాఁగానియట్టి, చోటని యిట నున్న శోకాబ్ధి ముంపఁ
దలఁచి మమ్మిటు దెచ్చి దైవంబు నీకుఁ, దెలియఁజేసెను గాదె! దినకరాన్వయుఁడ!

హా ! ప్రాణేశ్వరా ! దినకరాన్వయకలశవారాశిరాకానిశాకరా ! శోకింపకుఁడు. శోకింపకుఁడు. తమకుఁ దెలియనిసంగతి యిందేమున్నది ? మీరే యిట్లు మనశ్చాంచల్య మొందిన నిఁక నోదార్చువా రెవ్వ రున్నారు ? సముద్రమే రగిలి జ్వాలాభీలంబుగ మండుచున్నప్పు డద్దాని నేనీటితోఁ జల్లార్ప నగును ? హృదయేశ్వరా! ఈ యిహలోకజీవనమున కెక్కడిస్థైర్యము ! శరీరమునకుఁ జావుపుట్టువులు సహజము లన్నసంగతి తమ రెఱుంగనిదియా ? పుట్టువారి

నడ్డుపెట్టువారును, చచ్చువారిని నిలుపువారును నెవరు? ఇంతమాత్రమునకే ధైర్యము గోలుపోయి యిట్లు దుఃఖింప నేల? మీరిట్లేల యూరక వ్యథ చెందెదరు? వలదు వలదు. గతించినవారికై యెంతపరితపించినను లాభ మొక్కింతయైన నున్నదా? శరీరికి మరణము ప్రకృతి యనియు జీవితము వికృతి యనియును గదా పెద్దలు చెప్పుదురు. ఇట్లుండుటచేఁ బ్రాణి క్షణమాత్రమయినను జీవించి యుండుట తటస్థించెనేని యంతమాత్రముచేతనే లాభము గలదని సంతోషింపవలసినది గదా! మూఢులు ప్రియజననాశమును హృదయమం దుంపఁబడినశల్యమును గాఁ దలంతురు. తమవంటిపండితులో ప్రియజననాశము గలిగినపు డాశల్యమునే యుద్ధరింపఁబడినదానిగాఁ దలంతురు. కావున నిట్టిసమయమందు మీరు పామరునివలె దుఃఖింపకుందురుగాక. తమకుఁ దెలియనియంశ మెందేనిఁ గలదా? నా విన్నపము మన్నించి ధైర్య మవలంబింపుఁడు.

(పెనిమిటికన్నులనీరు పైఁటచెఱఁగుతోఁ దుడుచును.)

హరిశ్చంద్రుఁడు—అహో! ప్రాణేశ్వరీ! ఇంక మన కెక్కడిజీవితము? అక్కటా! నే డెట్టిఘోరము తటస్థించినది?

చంద్రమతి—నాథా! తాము సెలవిచ్చినది సత్యమే. వారువారు తమతమకర్మముల ననుసరించి చచ్చుచుఁ బుట్టుచు నుందురు. సూక్ష్మదృష్టిం బరికించినచో జీవున కెవ్వఁడు చుట్టము? భార్యాపుత్రాదులు శరీరబంధువులే కాని జీవునకుఁ గారు. జీవునకు సత్యము దక్కఁ దక్కిన దేదియు బంధువు గాదు. "దానిని జంపివేయక బ్రదుకుటయే మనకు ముఖ్యకర్తవ్యము" అని తమరు పలుమాఱు ప్రస్తావించుచునే కదా యుండిరి.



హరిశ్చంద్రుఁడు—ప్రాణేశ్వరి! నేను నక్షత్రేశుల తఱుగుధనము చెల్లింపవలసివచ్చినందున నందులకై యీశ్మశానవాటిక కధికారి యగు నొకానొకతలవరికి బానిస నైతిని.

చంద్రమతి—అక్కటక్కటా! హా! జగదీశా! ఇదియును దటస్థింపఁ జేసితివా?

(మీఁదనొఱగుచున్నది.)

అయ్యో! హతవిధీ! అఖండమహీమండలాఖండలత్వ మెక్కడ? ఈపాడు వల్లకాటితలవరికి బానిస యగుట యెక్కడ? ఇట్టివిధియును గలదా?

(ఏడ్చుచున్నది.)

హరిశ్చంద్రుఁడు—కాంతామణీ! ఇందాక నాకూఱట పల్కిననీవు మాత్ర మిపు డేల యీలాగునఁ బామరత్వము నవలంబించుచున్నావు? నాయజమానుఁ డొక్కొక శవమునకు మూఁకయు మూరెఁడు బట్టయును గట్టముగాఁ బుచ్చుకొని తనకుఁ జేర్చునట్లును, ప్రేతబంధువులు పీనుఁగునోట వేయుబియ్యముతో నాజీవయాత్ర వెళ్ళించుకొనుచుండునట్లును నా కాజ్ఞాపించియున్నాఁడు. నోటవైచుబియ్యము లేకున్నను మూఁకయు మూరెఁడుబట్టయు వారికిఁ జేర్పవలసి యుండును. అవి పుచ్చుకోకుండ నేశవమును దహనపఱుపనీయ వలనుపడదు. కాఁబట్టి యోసుగుణఖనీ! నీ వతివేగముగా నీయజమానునియొద్దకుఁ బోయి యవి యడిగి తీసికొని రమ్ము. ఆలస్యము చేయక శీఘ్రముగా రమ్ము.

చంద్రమతి—ప్రాణేశ్వరా! అట్లే పోయి వారి నడిగి తెచ్చెదను. వేకువజాము కావచ్చినది. ఇపుడే పోయి వచ్చెదను.

హరిశ్చంద్రుఁడు—కొంచెము చీఁకటిగా నున్న దని వెనుకఁదీయక యతివేగముగా వచ్చి చేరుదువుగాక.

వీరఁడు—యేటన్నా! యిది మనబిడ్డా యేటి?

హరిశ్చంద్రుఁడు—ఔనయ్యా! మనబిడ్డఁడే.

వీరఁడు—అయ్యో పాపం! ఆయమ్మ నీపెళ్ళావాఁ యేటన్నా!

హరిశ్చంద్రుఁడు—ఔనయ్యా! అది నాపెండ్లమే.

వీరఁడు—అలాగయితే ఆయమ్మ నెక్కడికన్నా పంపుతా వున్నావు?

హరిశ్చంద్రుఁడు—మన కీయవలసిన కట్టముగాక మూరెఁడుగుడ్డయును వేగముగాఁ దీసికొని రమ్మని పంపుచున్నాను.

వీరఁడు—ఓరబ్బో అని, యిదేటన్నా! నీకు పిచ్చీగిచ్చీగానీ వొట్టిందా యేటి? మనబిడ్డ అని సెబుతా వున్నావే. దానిక్కూడానా అన్నా! గాక కట్టం మూరెడుగుడ్డ పాతానున్నా? అమ్మా? నువ్వూరుకుండమ్మా! యీాన సేసేదంతా యినాటిదే యెప్పుడూనూ. అయ్యో! అన్నాయం! నానుకూడ కాల్తో తన్ని కిందికి తోశీసినాను. నానేటిసేసీది? తెలక సేసినాను.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వీరయ్యా! అట్లు చేయుట సరికాదు. మనబిడ్డఁడైన నేమి? ఒరులబిడ్డఁడైన నేమి? యజమానుని యాజ్ఞను మీఱి చరింపరాదు. ఒకవేళ నట్లు చరించితిమేని యది మోస మనిపించుకొనును. అట్లు చేయుట చాలఁ దప్పిదము. (భార్యవంకఁ జూచి) కుటుంబినీ! నీకీమాటలతో నేమిప్రయోజనము? వేగముగఁ బోయి చెప్పిన చొప్పున రమ్ము.

(చంద్రమతి పోవుచున్నది.)



వీరఁడు—యాటమ్మోయి! యీాయన్న యేది సెప్పినానున్నా యింటాడా యేవేనానా? నువ్వూరకుండవమ్మా! నాను సెప్తాను మరి నువ్వైనాయింతావా యినవా? ఇదంతా నానే శాస్తాను నువ్విలా వొచ్చి కూకుడో.

చంద్రమతి—అయ్యా! వలదు వలదు. అట్లెప్పుడును వలదు. న్యాయమునకు విరోధముగా నొక్కటియుఁ జేయరాదు. పద్ధతిప్రకారము మీకీయవలసినదంతయు నిచ్చియే తీఱవలయును. నేను క్షణమాత్రములోననే వచ్చి చేరుదును. నా కుమారునిమాత్రము భద్రముగాఁ జూచుచుండినఁ జాలును. ఈయర్ధరాత్రసమయమున నీకటికచీఁకటిలో నేదైనను వచ్చి యేమిచేయునో? నేను వచ్చువఱకును మీదే భారము.

(చంద్రమతి పోవుచున్నది. వీరఁడును కామెవెంటఁబోయి కొంచెముదూరమున నిలువఁబడి.)

వీరఁడు—(మెల్లఁగా) వోయమ్మా! వోయమ్మోయి! యిట్రాఅమ్మా! నువ్వేనమ్మా! యిట్రా.

చంద్రమతి—(తిరిగిచూచి) అయ్యా! ఏల నన్నుఁ బిలిచితివి?

వీరఁడు—అమ్మా! నిన్ను సూస్తే జాలేస్తావున్నాది. నీకంటే ముందరొచ్చినాది గాదా పీనుగ. ఆపీనుగుని దెచ్చినా ళ్ళాపీనుక్కట్టవిచ్చినారు గారూ మఱి. ఆరూకా గుడ్డపాతా నాకాణ్ణే యింకా వున్నాయి. ఆచంగతి మాయన్నెరగడు. అయి తెచ్చి రవిస్సింగా నీశేతి కిచ్చేస్తాను. "ఇయిగో అయ్యో రిచ్చినారు తెచ్చినాను" అని సెప్పి ఆడి కిచ్చీయమ్మా! దిక్కులేనిపీనగలా గిడిచి పోఁబోకమ్మా! నానయి తెస్తాను. నువ్విక్కణ్ణే నిలబడు.

చంద్రమతి—అయ్యా! అట్లెన్నడును జెప్పఁబోకుము. అట్లు వలదు. ముందుగా వచ్చి యుండునది మీయజమానులకుఁ జేరవలసినదిగా

నుండును. దానిని మీ రపహరించుట చాలఁ దప్పుపని. అట్లెన్నఁడును జేయరాదు. అది నీయొద్దఁ బుచ్చుకొని మరల మీ కే యిచ్చుట మఱియు మోస మనిపించుకొనును. కాఁబట్టి యట్లెన్నఁడును జేయవలదు. నేను నన్ను బానిసనుగాఁ గొన్న యజమానుని యొద్దకుఁ బోయి వారి నడిగి పుచ్చుకొని యతివేగముగానే వచ్చి చేరుదును. నీ విప్పుడు నావిషయమయి చూపినపరితాపమునకు నే నెంతయుఁ గృతజ్ఞురాల నగుచున్నాను. నీ వనుగ్రహించి ప్రేతమున కేవిధమయినహానియుఁ గలుగకుండఁ జూచుచుండుము. నాకదియే చాలును. మఱియు నేను వచ్చువఱకును నాహృదయేశు లేడువకుండఁ జూచుచుండుము. వారొకవేళను దుఃఖింప మొదలిడినచో నీవు వారిని మంచిమాటలుచెప్పి యోదార్చుచుండుము. నే నతి త్వరితముగాఁ బోయి మాటాడునంతలోననే వచ్చిచేరుదును.

వీరఁడు—అమ్మా! అలాగయితే నీ యిష్టం. యెల్లు మఱి, నువ్వ మాత్ర మాయయ్యాపెళ్ళానివిగావా? సామాన్యురాలివా, అబ్బో యేం పట్టుదల? పోయిరా బేగి.

(చంద్రమతి పోవుచున్నది. త్రోవలో నొకపీనుఁగు కాలికిఁ దగులఁగా తొట్రుపాటుతోఁ జూచి.)

చంద్రమతి—ఇది యేమిటి శవమా కాలికిఁ దగులుకొన్నది? (కూర్చుండి చూచి) హా! పుత్త్రకా! ఇది యేటిమాయ! ఇపుడు నిన్నాశ్మశానవాటికయం దుంచికదా వచ్చుచున్నాను. ఇంతలో వారియజాగ్రత్తచేత నేదేని యొకానొకమృగము నోటఁ గఱుచుకొని పోవుచుండఁగా నిచటఁ బడిపోయి యుండునా? ఆహా! హతవిధీ! మరణమొందినను ఘటప్రారబ్ధము శరీరమును వదలినది కాదు. ఏమికష్టము సంభవించినది? అకటా! నాపట్టికిఁ బంచముగ



పాదతాడన మొకటియే కాక మెకములు ఛిన్నభిన్నముగాఁ జేసి తినుటకుఁ దెచ్చుట కూడ సంభవించినదిగా! యేమి కాలవైపరీత్యము! హా కాశీనాథా! నీయనుగ్రహము భక్తులపై నిట్లా పరిణమించుచున్నది?

(అని యేడ్చుచున్నది.)

ఇది షష్ఠరంగము.

సప్తమరంగము.

స్థలము : కాశీనగరములోని వీధులు.

కాలము : సాయంకాలము.

పాత్రములు : ఆరక్షకభటులు వీరభద్రసెట్టి, వేలాయుధాచారి, చంద్రమతి.

రక్షకభటాధికారి—రంజిత్ సింగ్! నేఁడు ప్రొద్దుగ్రుంకకుమునుపు నాలుగుగడియలు మొదలుకొని మనమహారాజావారి ప్రియపుత్త్రుఁడు కనఁబడుట లేదఁట! కాఁబట్టి భటులను నలుదిక్కులకును బంపి వేగముగా వెదకింపుము. ఏమియాపత్తు తటస్థించినది! మహారాజావారికుమారుఁడే యగపడకపోయినచో నిఁక నేమున్నది? పరుగెత్తు పరుగెత్తుము. జాగ్రత్త. వేగముగాఁ గనిపెట్టకపోయినచో మనపాట్లు భగవంతునికే యెఱుక. జ్ఞాపక ముంచుకో.

ంజిత్ సింగ్—ఇదో పోతాం సామీ! అయ్యా! యింతకంటె మాకేం పనున్నాదీ? సిటంలో కనిపెట్టివేస్తాం సూడండి. (పోవుచు) యేరం బాల్ సింగ్! ఇలా రా బేగి రావాల. మనమారాజావోరికొడుకు నాలుగుగడియలకాణ్ణుంచి కనపడ్డం లేదంట. యేడకి పోనాడో

తెలవలేదంట. అరగడియలో కనిపెట్టవాలంట. లేకపోతే మనతలకాయలు పోతాయంట. అరేఅబ్బా! మనతలకాయలే పోవడానికి సిద్ధమయిందే! మారాజుకొడుకు యేడకిపోయి వుండును? యిదంతా మాయంగా వుండాదే?

రంబాల్ సింగ్—అదంతా సెప్పడంలో కార్యం వుండాదా? యిప్పట్లో.

రంజిత్ సింగ్—యేడకి పోవడం గుంటా, బాయీ, యిలాటాట్లోగానీ పడిపోనాడేమో? లేకపోతే బస్తీలో కెళ్ళి దారి తెలవక తారుమారుగా తిరగతా వున్నాడో యేటో పాపం నాకేటీ తోఁచకుండా వుండాది. ఆఖరికి మనకి పీకలమీంది కొచ్చింది.

రంబాల్ సింగ్—ఒరే రంజిత్ సింగ్! రాననగరికాడ బాయీ గుంటాగానీ లేదుగదా! యీడు లెంటగాని పోయుంటే యీపాటి కెవళ్ళైనా యెత్తుకోని వచ్చి వొప్పసెప్పరంట్రా? నాకు బలే గుమానము వుంది యీయిషయంలో. వోరైనా నగలకాసపడి బిడ్డ యేమూరుండడం సూసి యెత్తుగుపోయుండవాల.

రంజిత్ సింగ్—అట్టయితే మనం యేడకిపోయిరా యెతకడం?

రంబాల్ సింగ్—యిలాంటిచంగతులన్నీ కల్లంగడికాడా, జూదవాఁడేసోటా, యీలాటితావుల్లోకి పోయి ఆసోకీ కనిపెట్టవాల. యిప్పటికి మనం కల్లంగడికాడికి యెల్దాంరా.

(కల్లంగడిలోఁ దూఱుచున్నారు. వీండ్రవెంట నొకశిష్యుఁడు సెట్టివేషము వేసికొని యంగడిలోనికిఁ దూఱుచున్నాఁడు. ముగ్గురును గూర్చుందురు.)

రంజిత్ సింగ్—అయ్యో! పాపం! సిన్నపిల్లోడు. యేడెనిమిదేళ్ళుంటాయి కావాల. మారాజు కొక్కడే పిల్లోడుగందా! యేంకష్టం వొచ్చిపడిందిరా దైవమా!



వీరభద్రసెట్టి—అయ్యా! మహారాజా వారికొమారుఁడా? అతడి కేమీ అని అడుగుతా.

రంజిత్ సింగ్—అల్లంతపొద్దుకాణ్ణుంచి పిల్లోడు కనపడ్డం లేదటయ్యా! పాపం!

వీరభద్రసెట్టి—యెనిమిదేళ్ళపిల్లోడా? ఆఁ. యేటీ. వుండుండు. నాను సెబుతాను. ఆఁ. జ్ఞాపక మొచ్చినాది. నాలుగుగళ్ళకిందటనే వొకపిల్లోణ్ణి యెంటబెట్టుకుని వొకాడది కంసాలోళ్ళయీదిలో పోతూవుండగా నాను సూశినాను. పిల్లోణ్ణి సూడగా రాజుకొడుకులాగే వున్నాడు. యేమందమైనపిల్లోడూ! వొంటినిండా నగలు కూడా వున్నాయి. వొకవేళ ఆపిల్లోడే అయితే కావొచ్చునని తోస్తూవుంది.

రంబాల్ సింగ్—ఆడదా యెంటబెట్టుకోని పోతావుండాది? కంసాలీదినా పోతావున్నాది? నువ్వు సూశినావా? నిజమేనా?

వీరభద్రసెట్టి—ఔ. ఔ. నాను నాకళ్ళారా సూసినసంగతే చెబుతూవున్నాను.

రంబాల్ సింగ్—అయ్యా! మీ రెక్కడ మకాం వుంటారు?

వీరభద్రసెట్టి—నే నల్లసత్తరువులోనే బసచేసున్నాను.

రంబాల్ సింగ్—అయ్యా! మీ రెన్నాళ్ళదాకా అక్కడ బసచేసుంటారు?

వీరభద్రసెట్టి—నే నింకా రెండు యెచ్చయితే మూడ్రోజుల్దాకా వుంటాను లెండి. కొంచెం యేపారానికి కాశీపట్టు కొనుక్కుందాం అని వొచ్చున్నాను. పట్టుపిసరు కొనుక్కునిగదా పోవాలి.

రంబాల్ సింగ్—ఆలాగా? అయ్యా! మీపే రేంపేరండీ?

వీరభద్రసెట్టి—నాపేరా? నాపేరు క. ప. మ. యీరబద్దరసెట్టి అంటే వూరందరికీ తెలుస్తాది. నన్నెరగనోళ్ళే లేరు.

రంబాల్‌సింగ్—సరి. సరి. క. ప. మ. యీారబద్దరసెట్టిగోరా?

(ఆరక్షకభటులు కంసాలివీథిని బోవుచున్నారు. కంసాలివేషముతో నొకశిష్యుఁడు వీథియరుగుమీఁదను గూర్చుండి యుండును.)

రంజిత్‌సింగ్—అయ్యా! బత్తుడూ! యెంతసేపణ్నుంచి నువ్విక్కడ కూకడున్నావయ్యా!

వేలాయుధాచారి—నే నొకఝాముసుం చిక్కణ్ణే కూచునివున్నాను.

రంబాల్‌సింగ్—షూమారు నాలుగ్గడియలాయీామద్ధినిగానీ యెవరైనా వొకరు పిల్లోణ్ణెంటేసుగుని పోవడం సూశినారా?

వేలాయుధాచారి—పిల్లవాఁడా?

రంబాల్‌సింగ్—ఔనయ్యా!

వేలాయుధాచారి—పిల్లవాడికి వయ స్సెంతుంటుంది?

రంబాల్‌సింగ్—యేడేళ్ళో తప్పితే యెనిమిదేళ్ళో వుంటాయి.

వేలాయుధాచారి—అవు నవును. చూశే వున్నాను. ఒకఆడది యిక్కడికే పిల్లవాణ్ణి వెంటఁబెట్టుకుని వచ్చింది.

రంబాల్‌సింగ్—ఆహా! సరిసరి బత్తుడూ! ఆళ్ళెలాపోయినారో ఝెరుగుదువా?

వేలాయుధాచారి—ఆయమ్మ యిక్కడికే వచ్చింది. నాచేతికి కొన్ని నగ లిచ్చింది. అవన్నీ కరిగించి వేరేనగలు చేసి యిమ్మన్నాది.

రంబాల్‌సింగ్—బత్తుడూ! ఆవేవేంనగలు?

వేలాయుధాచారి—పిల్లలనగలు. తాను వెంటఁబెట్టుకుని వచ్చిందే, ఆపిల్లడినగలనే తోస్తుంది. రాళ్ళు వేరుగాను బంగారం వేరేగాను పెల్లగించి పెట్టమ్మని చెప్పింది. నేనూ అలాగ్గానే కొంచెంచేసినాను. కొంచెం చెయ్యలేదు. పొద్దుపోయిందని అవి అట్టే వుంచేసినాను.



రంబాల్‌సింగ్—ఆయమ్మా పిల్లోడూ యెలాపోయినారు?

వేలాయుధాచారి—యీలాగునే పోయినారు. యెక్కడికి పోయినారో నాకు తెలియదు.

రంబాల్‌సింగ్—చరి, ఆచంగతంతా అలావుండనీగాని, యిప్పుడానగలన్నీ యెక్కడున్నాయి?

వేలాయుధాచారి—ఆసంగతంతా మీాకెందుకూ? ఒకరిచ్చింది మరొకరికి చూపించవచ్చునా? ఆలాచూపించడానికి వల్లపడదు. అలా వుండేటప్పుడు నేనెలా చూపించేది?

రంబాల్‌సింగ్—భేష్, భేష్, సూపరాదు, యివ్వరాదు, అనికదా అంటావు. దొంగసొమ్ము తీసివున్నావుకావాల్ను బత్తుడూ! గనకనే సూపరాదు వల్లగాదు. అని అంటున్నావు కావాల. సూపకపోతే నీయిల్లంతా సోదా యేస్తాం. బద్దరం బద్దరం, వుసారుగా వుండు. మా వేఁవరనుకుంటున్నావేటి?

వేలాయుధాచారి—అయ్యయ్యో! యిదేం పాపమయ్యా! మద్దినా కాపదగా వున్నాదే! నాకేమి? యిదుగో యిప్పుడే తెచ్చి యిచ్చేస్తానయ్యా! సోదాగీదా చేయకండి మీాకు పుణ్యముంటుంది. నేనేమోఁ యీావూళ్ళో నలుగుర్లోనూ కుసింత గౌరవంగా కాలం యెళ్ళబుచ్చుకుంటూ వున్నానయ్యా!

(నగలు తెచ్చి చూపుచున్నాఁడు.)

రంబాల్‌సింగ్—చరిచరి యియే నగలు. యేరే పికరేవుఁన్నాదీ? బుత్తుడూ! రాళ్ళుకూడా యెళ్ళబీకీసినావే అప్పుడే. కొంచెం నిన్నడుగుతాం నిజం సెప్పాల. యియెంతసొమ్మిచ్చి కొన్నావయ్యా!

వేలాయుధాచారి—అయ్యా! భటులారా! నేను కొన్నవి కావు. యీానగలు చరిపి వేరే నగలు చెయ్యమని చెప్పి ఆయమ్మ యిచ్చి

పోయిందని మొదట్నే చెప్పినాను గానా? సరే అని నేను తీసి వుంచినాను. యింతకన్న నాకేమీ తెలియదండీ! వూరూరికే నన్నెందుకయ్యా యీడుస్తారూ. నిజం చెప్పీసినానుగందా నామీ దేం నేరవుంది?

రంబాల్‌సింగ్—బత్తుడూ! నువ్వు బయంపడకు. నిన్ను మావేఁమీ యీడవలేదే. రండి చంగతి మాత్తరం వున్నది వున్నట్లు సెప్పాల. అంతే. మిమ్మల్ని మాం సాక్షిగా యెస్తాం. యేవఁయినా దాస్తి రంటే మరెఱుగుదువుగదా అవతల మాతమాషా ఊఁ. కబడదార్ తెలిసిందా?

వేలాయుధాచారి—అయ్యా! తొందరెందుకు పడతారూ! కొంచెం మనిషిసంగతి తెలుసుగుని మరీ మాట్లాడండి. నేనేవైఁనా ఊఁ.— చూసుగుంటానులెండి.

రంబాల్‌సింగ్—బత్తుడూ! అదంతా చరిపడదయ్యో! సూడ్డంగీడ్డం అదంతా పనికిరాదు. యిది అక్కడిదీ యిక్కడిదీగాదు. మారాజావారింటికాడి చంగతిచుమా యేవఁనుకున్నావోగాని, కడావరికి నిజం సెప్పకపోతివా నీపీక పోతుంది చుమా.

వేలాయుధాచారి—అయ్యా! అయ్యా! నేనేం చేసీదీ? పనివాణ్ణు యెవరేవిఁచ్చినా చేసి యివ్వవలసిందేకదా! ఆమనిషి యిచ్చింది. నేను తీసి పెట్టుకుని వున్నాను. యింతకంటే నేనెంతమాత్రం యెరగను.

రంబాల్‌సింగ్—యిప్పుడు నువ్వు తప్పించుకోవాలనివుంటే ఆమనిషిని మాయెదట సూపించెయ్యి. లేకపోతే అమాంతంగా నువ్వు దొరుక్కుంటావు చుమీ. తరవాత మాం సెప్పలేదనుకునేవు.

వేలాయుధాచారి—నే నెక్కడున్నా దని చూపించీదయ్యా! ఆపాపాత్మురా లెక్కడికిపోయిందో యేవోఁ? నాకేవిఁటయ్యా తెలుస్తుంది?



రంబాల్‌సింగ్—బత్తుడూ! యెందుకలా దాసిపెడతావూ? నీకా డాయమ్మకి ముందూ యెనకా పరిచయం లేకుండానా వుంది? అంతమాత్తరం పరిచయం లేకపోతే నీనమ్మకం ఆయమ్మ కేటుంటాది? నీకాడికి తెచ్చి అట్టే నగలన్ని యిచ్చీసి పోతాదంటే యెవరైనా నమ్ముతారనుకున్నావా? అవేం అల్పం సొల్పం నగలనుకున్నావా? మీరే సెప్పండి బత్తుడూ! యింతయిలవైన నగ తెచ్చి యెవత్తయ్యా కంసాలోణ్ణి నమ్మి యిచ్చీసి పోతాది? నీమాటలెవరయ్యా నమ్ముతారు? రా. రా లెగు. యిక్కణ్ణే బాగా పీటం యేసుక్కూకున్నావులే. మరి లెగు.

వేలాయుధాచారి—అయ్యో! యిలాకూడా వుండునా నావిధి.

(లేచి ముువ్వురును బోవుచున్నారు.)

రంబాల్‌సింగ్—అయ్యా! బత్తుఁడూ! యెలా పోయినారో సెప్పవయ్యా. ఊఁ. బేగి సెప్పేడువు. తిరిగితిరిగి కాళ్ళకి రగతం దిగింది సూసినావా? యెందుకు మమ్మల్ని సంపుతావు?

వేలాయుధాచారి—అయ్యా! యదార్తంలో నాకేవీఁ తెలియదయ్యా. ఈదారినే కాఁబోలును పోయినట్టుంది.

రంజిత్‌సింగ్—యేవఁన్నావూ? "యీదారినే కాఁబోలును పోయినట్టుంది" అనేనా? చల్లే నువ్వే దొరుక్కుంటావు. లేదా తిన్నగా సెప్పేయి. వుండేతావు నిజంసెప్పు. మమ్మల్నెందుకు నిసకారణంగా తిప్పి సంపుతావున్నావు?

వేలాయుధాచారి—అయ్యా! నామీ దెందుకంతకోపం? మీరడగ్గానే యెంటనే నగ తెచ్చి మీయెదట పడెయ్యలేదా? ఆయమ్మ యెళ్ళినతావు తెలిసుంటే చెప్పీసుండనా? రాత్రి చాలా అయి

నట్టుందే. నన్నిడిచిపెట్టండి. మీ ధర్మవాఁఅని యింటికి పోయి తిండి తింటాను. మధ్యాన్నవఁప్పుడు తిన్న మెతుగులు. నాకు చాలా ఆకలవుతూవుంది.

రంజిత్ సింగ్—బత్తుడికి తాఁబూలం తలకొచ్చీసినాది. పాపం ఆక లెత్తుతూందంట అవునవును. అంతాకిలిగావుంటే బేగి సెప్పీయ రాదా యీడున్నాదో? నువ్వేందుకు శవఁపడతావు. మమ్మల్నెం దుకు శవఁపెడతావూ.

వేలాయుధాచారి—అయ్యా! నే నెంతనమ్మకంగా చెప్పినా మీరు మళ్ళా ఆమాటే అడుగుతూ వున్నారు. మీకు ధర్మవేఁనా? నగలు పుచ్చుకున్న పాపం వొక్కటి తప్ప మరి నాకేఖర్మవూఁ తెలియదు. తెలియనిసంగతికి నే నేతావని చెప్పఁగలను? అంతకి తప్ప నాకు మరేవీఁన్నీ తెలియదు. నన్నూరూరికే యెందుకలా యీడిచికొడ తారయ్యా! ఇదిమీకు నాయమైఁనపనేనా? యెన్నితావులని వెతికేదీ? రేపు వెతగ్గూడదూ? ఈఅద్ధరాత్తిరప్పు డెక్కడని వెతకడం.

రంబాల్ సింగ్—బత్తుడూ! నువ్వు సజమైఁనజాగా చూపించుంటే మనం శవఁపడి వెతకడవేఁ అక్కర్లేదు. హాఁ నీమాటల్లోనే అంతా ఆసోకీ దొరకతా వుంది. రేపెతుగుదాం అని సెప్పేసి "యీలోగా ఆమనిసిని దాసేదాం" అని కావాల ఆలోసిస్తా వున్నావు. అదంతా చరిపడుతుందనుకోకేం.

వేలాయుధాచారి—అయ్యయ్యో! ఇదేంఖర్మవఁయ్యా నోరు తెరిస్తే తప్పుగా వున్నాదే. అయ్యా! మీయిష్టం వొచ్చినట్టల్లా వెతకండి. అంచేత నాకేంకష్టం? ఆకలేస్తూంది నీరసంచేత నడవలేక నేనలా అన్నానేకాని మీరిలా అర్థంచేసుగుంటారని నేననుకోలేదయ్యా. చూశారా నాదినములవంకర యెలా వుందో చూస్తూండ



గానే అపకీర్తి నామీది కెలావస్తూవుందో చూడండి. అయ్యో భగవంతుఁడా? పాపాత్ముణ్ణి నేనానగ లెందుకు తీసుగోవాలీ. తీసుగుంటినిపో, విసురుకైనా ఆమింటికం యింటి నడిగి తెలుసుకోరాదా? రేపు మళ్ళా వస్తా నన్నాది గదా అని వూరుకున్నాను.

రంజిత్ సింగ్—మంచియిలమైననగలు సెయిసిక్కనాయిగందా బత్తుడూ! యింక నువ్వేందుకు పేహూ వూహూ అడుగుతావూ? సిక్కింది గందా అని సంక లెగరేసుకున్నావు గావాల.

వేలాయుధాచారి—అయ్యా! మీయిష్టం వొచ్చినట్టల్లా అనండి. యిప్పుడు నేను మీచేతుల్లోనుగదా చిక్కన్నాను. నేనేవఁనడానికీ వొల్లగాదు. అధికారం అంతా మీదిగందా? అయ్యోదైవమా! తెల్లవారుజాముకూడా అయినట్టుందే. (తనలో) ఈపలపళ్ళు నన్ను కిట్టించివేస్తారింక.

(నెత్తిమొత్తుకొనుచున్నాఁడు.)

రంబాల్ సింగ్—ఒరే రంజిత్! వూరుకో వూరుకో. కేక లెయ్యబోకు యేదో సందడినఁబడతావుంది. ఆడ నెవురోకాని కూకు దున్నట్టున్నాది. అదో సూడూ బాగానిదానించి సూడోస్సి.

రంజిత్ సింగ్—ఒరే రంబాల్! అవున్రోయి. బద్దరం బద్దరం. నాయెనకాల్నే వుసారుగా నువ్వరా. నాను ముందాత్తే యెల్తా. బత్తుడూ! నువ్విక్కణ్ణే నిలబడేం.

(రంబాల్ సింగ్ వెనుకనుండి వచ్చి చంద్రమతిని బట్టుకొనుచున్నాఁడు.)

రంబాల్ సింగ్—ఒరే రంజిత్! ఓరంజీత్! నువ్వు బేగి పాఁరారోయి.

(రంజిత్ సింగ్ పరుగున వచ్చుచున్నాఁడు.)

చంద్రమతి—అయ్యో! దైవమా! ఎవరోకాని వెనుకనుండి వచ్చి నన్నుఁ బట్టుకొనుచున్నారే. అయ్యో! కుమారా! నేనేమిచేయుదునురా నాయనా?

(అని యేడ్చుచుండును.)

రంబాల్‌సింగ్—ఒరే రంజీత్! ఖూనీ సేసిందింత సేపటికి దొరికినాదిరా. ఇడుగో మారాజాకొడుకేన్రా.

(ఆరక్షకభటు లిరువురును నిరుప్రక్కలను నిల్చియున్నారు.)

చంద్రమతి—అయ్యా! నన్నెందులకు మీరు పట్టుకొనియెదరు?

రంజిత్‌సింగ్—యేవఁందాయిత్తురా మాట! బలే పొంకంగా వుందిరా యెందుకుపట్టుగున్నావఁనా అడుగుతున్నావు పాపీ! మమ్మల్నీ. మామా రాజుకొడుకుని సంపేసినపాపీ! రాయే తిన్నగా మాయెంటా. సూదువుగాని తమాసా సూపిస్తావ్రూఁ.

చంద్రమతి—అయ్యో! కాశీనాథా! శిశుహత్య చేసిన దనునపకీర్తిని గూడఁ గలిగించుచున్నావా? అయ్యో! అయ్యో! నేనేమిచేయుదును? అయ్యలారా! నేనేమియు నెఱుఁగను. మృతి నొందిన నాకుమారుని జేతులమీఁద నుంచుకొని యేడ్చుచున్నాను. ఇంతకన్న నేనేమియు నెఱుఁగను.

రంబాల్‌సింగ్—యేటీ నీకొడుకా? ఓలి బాగా సూడే పాపీ! బలే మాయలమల్లి నాగున్నావే. మామా రాజుకొడుకుని సంపేసి నీకొడుకనా బొంకులాడుతున్నావు? నెగునెగు. రా మాయెంట నడవ్వేం?

చంద్రమతి—అయ్యయో! ఇది యేటిమాయ! నాకుమారునివలెనే యున్నాఁడే. ఇంతలోనే మఱియొకమాదిరిగా మాఱిపోయినాఁడే? ఆహా! భగవంతుఁడా! ఇది యేమికాలమహిమ!



రంజిత్‌సింగ్—చరిచల్లే. ముందాత్తిగా నాకొడుకన్నావు. యెంటనే నాకొడుకులాగే వున్నాడంటావు. దీంతోనే నీచంగతంతా బోదపడిపోనాదినే. నడువు నడువు. యెందుకూ యినాటిమాటలన్నీ పెంచుతావు? అయ్యో! రంబాల్! బిడ్డమీద గుట్టలుకూడానేవురా.

రంబాల్‌సింగ్—అవున్రా అయే కనుక్కోవాల్రా. (చంద్రమతినిజూచి) ఒలే మాయలమల్లి! యీబిడ్డడివొంటిమీది గుడ్డలన్నీ యేటిసేసినావే? సెప్పే.

చంద్రమతి—అయ్యా! నా కేమియును దెలియదు. నాబిడ్డఁడేమోయని వీని నెత్తితినయ్యా.

రంబాల్‌సింగ్—ఓలేయి నోరుమూసుగోయే. వూరోళ్ళబిడ్డడు నీబిడ్డడంటే యెవురే నమ్ముతారనుకున్నావూ?

చంద్రమతి—అయ్యా! నిన్నటిదినము నాకుమారుఁడు పాము కఱచుటచే మృతి నొందినాఁడు. వానిని దహనపఱుచుటకై శ్మశానవాటికకుఁ దీసికొని పోతిని. అచ్చటివారు చిన్నరూక మూరెఁడుగుడ్డముక్క తెమ్మన్నారు. అంతట నే నాపీనుఁగు నచ్చటనే విడిచి రూక గుడ్డముక్క తెచ్చుటకై వెళ్ళుచున్నాను. త్రోవలో నీపీనుఁగు కాలికిఁ దగిలినది. ఇది నాబిడ్డనిశవమే యని భావించి యెత్తుకొని యేడ్చుచున్నాను. ఇంతకుఁదక్కఁ దక్కినసంగతి యొక్కింతయు నాకుఁ దెలియ దయ్యా. మీరే యాలోచించి చూడుఁడు.

రంజిత్‌సింగ్—ఒలేయి! యెందుకే ఆమాయమాటలన్నీనీ. ఆలోచించీదేటే. ఒక్కనినఁసంలో నువ్వే బోదపరిసీసినావు కావంటే. ఆడదానివైనా బలేగట్టాడదానివే నువ్వు. ఇందర్ని సూసినాంగాని నీలాటాడదా న్నెక్కడా సూళ్ళేదే. కూనీ సేసీసినా నన్నదిగు

లేనా వున్నాదేవోఁ సూడూ. మాకయేవీఁ అక్కర్లేదు గాని యీబిడ్డడిగుడ్డ లెక్కడ దాసినావో సెబుతావా సెప్పవా?

చంద్రమతి—హా! కాశీనాథా! నీవిలాస మిట్లా పరిణమింపఁజేయుచున్నావు? అయ్యా! నాకేమియును దెలియదు. నన్నెందుల కూరక పీడించెదరు? దైవము సాక్షి.

రంబాల్‌సింగ్—దొంగలాడేవోళ్ళకి దైవంకూడా వున్నాడంటే. గుడ్డల్దాసినజాగా సెప్తావా సెప్పవా? నగల్దాసినసోటు ముందాత్తిగానే కనుక్కున్నాం. యేంబత్తుడూ! యీమనిసి నీకు తెల్సునా సూడూ?

వేలాయుధాచారి—యెందుకు తెలియదూ? యీయమ్మ నిన్న సాయంకాలవఁప్పుడు యీబిడ్డ నెంటేసుకుని మాయింటి కొచ్చి నాచేతి కొన్నినగలిచ్చి అవన్నీ చెరిపి కొత్తనగలు చెయ్యమన్నాది. ఇంతే అయ్యా! నాకు తెలుసును. (తనలో) అయ్యో! కొంచెంపీజుకి ఆశపడ్డాను. అది యింతవరకి తెచ్చింది.

(నెత్తి కొట్టుకొనుచున్నాఁడు.)

రంబాల్‌సింగ్—దీనిమాట కేంసెప్తావే మాయలమల్లీ! యిప్పుడైనా సెప్తావా సెప్పవా గుడ్డలెక్కడ దాసినావో.

చంద్రమతి—అయ్యా! నా కేమియును దెలియదు. నన్నెందులకు వృథాగాఁ గష్టములపాలు చేయుచున్నారు? పూర్తిగా మీరే ఆలోచింతురుగాక.

ఇద్దఱును—ఆలోసించేదీ గీలోసించేదీ యేవుఁన్నాదీ. అపరాదం సేసి నావు దొరుక్కున్నావు. యింకేటాలోసించే దుంది? సెప్పు సెప్పు గుడ్డ లెక్కడ దాసినావో? యెందుకు నిసకారణంగా మమ్మల్ని శవఁపెడతావూ?



సన్న్యాసి—అయ్యా! మీ రెవరు? ఈయాఁడుదాని నెందుల కిట్లు బెదరించుచున్నారు? పాపము!

ఇద్దఱును—సామీ! యీమనిసి మామా రాజుకొడుకుని సంపేసింది. గుడ్డలన్నీ యెక్కడో దాసీసింది. నగలుమాత్రం దొరికినాయి.

సన్న్యాసి—అహహా! యెంతటిపాపపుసంగతి వింటిమి. హత్యలన్నింటిలోనను శిశుహత్యకదా గొప్పది! మహానరకమునకుఁగదా పోవలసి యుండును దుదకు? యేమికాలమహిమ! ఒకస్త్రీ తెగించి శిశువును జంపినది. అందును సామాన్యుల శిశువుకాఁడు. మహారాజుకుమారుఁడు. యేమన్యాయము! ఎంతసాహసము! ఇట్లు పంపుఁడు మేముకూడఁ గొంత విచారించి చూచెదము. (చంద్రమతింగూర్చి) అమ్మా! యిటురండు.

(కొంచెము దవలకుఁ బోయి చంద్రమతిని విచారించువానివలె నటించుచున్నాఁడు.)

అయ్యా! భటులారా! ఆపిల్లవానిబట్ట లిక్కడనే పాతిపెట్టితినని యీయమ్మ చెప్పుచున్నది. వెతకి చూడుఁడు. నిజమేమో?

ఇద్దఱును—(వెదకి చూచి త్రవ్వి తీసి) ఆహా! దొరికినాయి దొరికినాయి. చరే అంతా చరిగ్గానే యేర్పాటైపోనాది. రండింకపోదాం ఒలే మాయల్దానా! తిన్నగా నడుస్తావా నడవ్వా?

చంద్రమతి—ఓహో! భక్తార్తిభంజనా! కాశీపతీ! కాళ్ళు పడిపోవుచున్నవి. నడుము నిలువకుండ నున్నది. ఇట్టిమహాపఖ్యాతికిఁ బాత్రురాలి నగునంతటిపని నేనేమిచేసితిని? కష్టపరంపర యిట్లు వచ్చుట యెవ్వరైన నెఱుఁగుదురా? కానిమ్ము. ఇంక నేమి గానున్నదో? ఏయపరాధమును జేసి యెఱుఁగనిన న్నీవిధమునఁ బాపాపకీర్తుల పాలు చేయుచున్నారే. హా! సర్వసాక్షీ! భగవంతుఁడా! నీకుఁ

దెలియనిసంగతి యొక్కింతయును లేదుగదా ! నీవే సాక్షివి. నే నేపాపమును నెఱుఁగనుగదా !

(ఆరక్షకభటులు తమయధికారియొద్దకుఁ బోవుదురు.)

రంజిత్ సింగ్—అయ్యా ! యిదో మనమారాజుకొడుకుని సంపినాడ దాన్ని పట్టితెచ్చినాం. యింక మామీద దోసంలేదు. మీాయిష్టం.

అధికారి—శివశివా ! హత్యయా జరిగినది ! సరియే అది యటుండనిండు. సంగతి యేమి? ఎట్లు విచారించి తెలిసికొన్నారు మీారు?

రంబాల్ సింగ్—అయ్యా ! బిడ్డడు కనపడ్డంలే దనగానే మాకు సంశేఘం గలిగింది. కూనీ గానీ యెక్కడైనా జరిగిందంటే కల్లంగడి కాడా జూదవాఁడేసోటా యిలాటితావుల్లో ఆసోకీ దొరకడం మామోమ్మలు. యీచంగతి తమకిన్నీ తెలిసే వుంటుంది. ఆమామోలుపకారం మావిఁద్దరం వోకల్లంగట్లో దూరినాం. మావెఁల్లేతప్పడి కోమనిసి మరోమనిసితో మాటాడతా వున్నాడు. ఈచంగతి క్రమంగా ఆసోకీ కట్టినాం.

అధికారి—ఆమనుష్యుఁడేమని చెప్పుచున్నాఁడు? ఒకఁడు మాటాడిన సంగతులు మీారు చెప్పునప్పుడు వాఁడామాట యెట్లు చెప్పెనో మీారును అట్లే చెప్పవలయును. అనుసంగతి మీాకును దెలిసియే యుండవచ్చును.

రంబాల్ సింగ్—ఔనౌను మాకూ తెల్సునయ్యా! ఆలాగే సెప్తాం. వొకమనిసితో యింకోమనిసి "నేఁటిదినం సాయంకాలవఁప్పుడు నాలుగ్గడియలపొద్దుఁదనఁగా ఒకాడది వొకపిల్లవాణ్ణి యెంటఁబెట్టుకుని కంసాలవీదిలో పరమటివాడలో వున్నమూాడోయింట్లో దూరింది. పిల్లా డెలావున్నాడో తెల్సునా? రాజుగారిపిల్లవాడో



యేమో? నగశిగపర్యంతం నగలతో నిండున్నాఁడు" అని సెప్పినాడయ్యా.

అధికారి—ఆమనుష్యుఁడు నివసించి యుండుతా నెక్కడనో ఆమనుష్యున కేమి పనియో మీా రడిగి తెలిసికొన్నారా?

రంజిత్ సింగ్—ఆకల్లంగడికాడ పక్కనే వున్నచత్తరంలో మకాం సేసి వున్నాడంట! అతగోడు పట్టుయేపారం సేస్తాడంట. ఇంకా రెండుమూాడ్రోజుల్దాకా యీావూళ్ళోనే వుంటాడంట.

అధికారి—సరియే. అది యట్లుండనిండు. పిమ్మట మీారిద్దఱును ఆమాటలు విని యేమిచేసితిరి?

రంజిత్ సింగ్—ఆయెనక మావిఁద్దరవూఁ సక్కా అక్కణ్ణుంచి లేచిపోనాం ఆమనిసి సెప్పినగురుతులపకారం తిన్నగా కంసాలీదికి పోయి సూసేతప్పడికి ఆయీాదిలో వొకఅరుగు మీాదను వోబత్తుడు కూకున్నాడు. ఆయ న్నడిగినాం. "ఔ నవును. ఒకఆడమనిసి పిల్లవాణ్ణి వెంటఁబెట్టుకుని వచ్చింది. ఆపిలవాడివొంటి నున్ననగలన్నీ తీసి నాచేతి కిచ్చింది. యివన్నీ కరిగించి వేరే నగలు చేసిపెట్టమన్నాది. రాళ్ళన్నీ వేరుగాను బంగారం వేరేగాను చేసుంచండి. యీావాళ సాయంతర మఁయిపోయింది. రేప్పొద్దున్నే వస్తాను. అని చెప్పి వెళ్లిపోయింది" అని సెప్పినాఁడు. ఆయెనకనేవచ్చిమావాఁనగలన్నీ సూపించమని అడిగినాం. అతగోడు లోనికిపోయి నగలెచ్చి మాకు సూపించినాడు. అయి సూడగానే మనమారాజుకొడుకునగలనే పోలుసుగున్నాం. ఆయెనక రాతిరంతా సుట్టిసుట్టి యెతగడ మాఁరంబించినాం. ఆఖరికి కోడికూతజావఁప్పుడు అల్లావాక్కాడ యీాపిల్లోణ్ణి సంపీసి వొళ్ళో యెట్టుకొని యీాఆడమనిసి కూకుడున్నాది. మావిఁద్దరం యెనకాలే యెళ్ళి అమాంతంగా

రెక్కొట్టుగున్నాం. యీపిల్లోడిబట్టలే యనడిగినాం. వోఁడంతట గాని సెప్పినాడే కాదు. కడావరి కెలాగయితేనేమీ వోఁతావున పాతిపెట్టినట్టు సెప్పింది. మాం తవ్వి తీసినాం. ఆయెనక నయన్నీ పట్టుకుని మీకాడికి తీసుగొచ్చినాం.

అధికారి—ఆయమ్మ బిడ్డనిగుడ్డలు తానే పాతిపెట్టి యుంచుట యథార్థమే యగునా?

రంజిత్ సింగ్—సామీ! ఆలాగే మన వఁనుకోవాల.

అధికారి—అట్లయినచో ఆపని యథార్థముగా జరిగినదే యని తోఁచుచున్నది.

రంజిత్ సింగ్—(రహస్యముగా) మిగతాచంగతంతా నిజవేఁగాని బట్టలుమాత్రం ఆమనిసి దాసినట్టుగా సెప్పనేదు. అక్కడికోసన్నాసి వచ్చినాడు. ఆయనగోరు రవిస్సింగా ఆయాడమనిసిని పిలిచి అడిగినాడట. ఆయమ్మ సెప్పిందని జాగా సూపించినాడు. ఆయెనక మావెళ్ళి తవ్వినాం. గుడ్డలేవోఁ దొరకడం నిజవేఁ. సామీ! అక్కడే మనం కొంచెం సరిసేసుగోవాల. నేకపోతే కేసు యెట్టా ముందుకొస్తాదీ? తవుఁ రెరగరా!

అధికారి—భటులారా! మీరు తలఁచిన ట్టిదియెంతయును బొఱపాటు. అపరాధిని పట్టుకొని పోయిసాక్షులను సిద్ధపఱిచి నేరము చేసినవాం(డను దండనకు యోగ్యులనుగాఁ జేయుట గాదు మనపని. ప్రజల సేమమును గోరుచునే మనము ప్రయాసపడవలయును. ముందుగా నేరముచేసిన వాం(డగుణాగుణములు యుక్తప్రకారముగాఁ దెలిసికొని సత్యమైనసంగతిని న్యాయాధికారియెదుటఁ బెట్టవలయును. దానిని న్యాయాధిపతి గ్రహించి తగురీతిని తీర్పు చేయును. నేరముచేసినవాం(డు దండింపఁబడిననే మనకు ఖ్యాతి యని యనుకొనుటచాలఁ బొఱపాటు. అట్టియూహలకుఁ ద్రోవ గన్పడినచో ఆరక్షకభటులే యనేకవిధములుగా మోసమును గల్పించి యుండుట కేవిధమయిన యభ్యంతరమును నుండదు. అది మహాపాతకము. రాజ్యాంగమువారు మనలను నియమించినది యట్టియవినీతులకుఁ గాదు. ఆరక్షకభటు లెప్పుడును సత్యమైనమార్గమును దప్పక జరిగినది జరిగినట్టుగానే చెప్పవలయును. నేరము చేసినయీయాఁడుది తా నొప్పుకొని తీసి యియ్యనిసంగతి యొప్పుకొని తీసియిచ్చిన ట్లెట్లు చెప్పవచ్చును? యథార్థముగా నాయాఁడుది చెప్పియున్నచో మనేమును జెప్పవచ్చును. మనమే యట్లు చేసినచోఁ గంచెయే చేను మేసినట్లగును గదా. అదియునుంగాక; న్యాయాధికారి మనము గూర్చినసాక్షులను గౌరవించి వారిమాటలనే యాధారముగాఁ గొని విమర్శించుచుండును గాఁబట్టిని మనమెంతసత్యవంతులమై యుండవలయునో మీరే బాగుగా నాలోచించి చూడుఁడు. నేరము చేసినవాం(డజీవనము మనమాటలలోనే కదా యుండును. కాఁబట్టి మనయుద్యోగములు మిగుల నుత్తరవాదమును జెందినవి. ఆనేరము చేసినయాఁడుది తననోటితోఁ జెప్పియున్నచో మన మంగీకరింపవచ్చును. లేకున్నచో నెట్లంగీకరింప నగును?



ంబాల్ సింగ్—ఆహా! దానికేం. తమరివ్వుత్తరవయితే సాల్ను. ఒక్కగడియలో రప్పించేస్తాం. కొంచెం పూజ సూపినావఁంటే వొచ్చేస్తుంది. దానికేమభ్యంతరం?

ధికారి—అయ్యయ్యో! భటులారా! నేనింతవఱకుఁ జెప్పినసంగతులు మీమనస్సునకుఁ బట్టనే లేదు కాఁబోలును? ఒప్పుకొనఁజేయవలయునన్నమాటకు మీ రిట్టిదని తెలిసికొన్నారే కారు. మీరు

చెప్పుచున్న మాటలనుబట్టి యాలోచింపఁగా మీరు చేయునదియే యధికమైనయకార్యముగా నున్నట్టు కన్పట్టుచున్నది. దేశమునందు జరుగుచుండుదుర్నయములను బోకార్చి న్యాయము కొనసాగుచుండునట్లు చేయుటకే యజమానులు మనలను నియమించియున్నారు. అట్టిచో మనమే యక్రమంబుల కొడిగట్టుచున్నచో మనలను దైవము మెచ్చునా? అధికారము చేతిలో నున్నదిగదా యని యన్యాయమున కొడిగట్టవచ్చునా? కావున నేరము చేసినవాండ్రను గష్టములపాలు చేసి బలాత్కారముగా నొప్పుకొనునట్లు సేయరాదు. అందులకుఁ దగినవిధులను జెప్పెదను సావధానముగా వినుఁడు. ఒకయపరాధి తాను జేసిననేరమును దానే యొప్పుకొనునట్లు చేయవలసివచ్చినచో ఆరక్షకోద్యోగులు, ఆయపరాధియెడల నేవిధమయిన హింసలను గాని తంత్రములను గాని ప్రయోగింపరాదు. ఇటువంటియక్రమంబులచేత నపరాధిని దనయపరాధము నొప్పుకొనునట్లు చేయుటలో, అపరాధమును విమర్శించి తెలిసికొని కనిపెట్టవలసినయుక్తియు, సామర్థ్యము, గౌరవము, మొదలయిన సద్గుణము లారక్షకభటులయెడఁ గొంచెమేనియు లేవనియెడి యపకీర్తి దేశమంతటను వెల్లడి యగును. అదియునుంగాక; ముందు చెప్పఁబడినరీతి నవలంబించి యన్యాయమున కొడిగట్టుకొని యొకనిని దనయపరాధము నొప్పుకొనునట్లు చేయవలయు నన్నయెడల నట్టిపని యెంతమూఢుఁడైనను సర్వజనసాధారణముగాఁ జేయఁగలిగి యుండును. అప్పటి కట్టిసర్వోత్కృష్టమైన న్యాయమును సంస్థాపించుటకై యధికారులును, ఉద్యోగులును ఏర్పడియుండుట యనావశ్యకమే యగునుగదా! ఆరక్షకోద్యోగు లపరాధిజీవనము మొదలగువానిని జక్కఁగా విచారించి తెలిసికొని తగినప్రశ్నల



చేత నపరాధి యేమార్గమునను దప్పుకొనుటకు వీలుపడకుండుటను గ్రహించి వాఁడే యొప్పుకొనునట్లు చేయుటయే ఆరక్షకాధికారికి ముఖ్యకర్తవ్యము.

రంజిత్ సింగ్—సామీ! నేరం చేసినోడు తననేరాన్ని తానే వొప్పుకుంటాడే అప్పట్లో యేటి సెయ్యాల!

అధికారి—అవును. అట్లడుగుము. అదికదా బుద్ధిమంతులకు లక్షణము. అపరాధి తననేరమును దానే యొప్పుకొన్నను మన మాయాధారము నొక్కదానినే కైకొని వానిని దండింపఁజేయుట పొఱపాటే యగును. అపరాధి యొప్పుకొనఁదగిన నేరమును స్థాపించుటకై యితరమైనయాధార మున్ననేకాని వానియొప్పుదలనుమాత్రమే సాధనముగాఁ గొని యారక్షకులు వానిని దండనార్హునిగఁ జేయరాదు. కాఁబట్టి మీ రిదివఱకుఁ జెప్పినది మఱియును న్యాయమునకు దూరముగా నున్నది. అదియునుం గాక; మనవృత్తికిని విరోధ మయినచర్య యనిపించుకొనును.

రంజిత్ సింగ్—సామీ! సాక్షులంతా చరిగానే వున్నారు.

అధికారి—అట్లయినచో సరియే. నేరము చేసినయాఁడుది బిడ్డనిజంపినట్టుగాని, గుడ్డలు పాతిపెట్టినట్టుగాని, యొప్పుకొన్నదా?

రంబాల్ సింగ్—సామీ! నేరం చేసినో ళ్ళెప్పుడైనా వొప్పుకుంటారా? తవుఁరెరగం దేటున్నాది?

అధికారి—ఆసంగతియే యడుగుచున్నాను. ఇఁక నాయొద్ద జరిగినది జరిగినట్లే చెప్పవలయును. ఒక్కక్షరమైనను మార్చి చెప్పరాదు. ఆసంగతి యట్లుండనిండు. మీరు సంపాదించియున్నసాక్షుల నందఱను రప్పింపుఁడు తెలిసికొందము.

రంబాల్‌సింగ్—అంతా యీడనే వొచ్చున్నారు సామీ!

అధికారి—మొదటిసాక్షి యెవరు?

రంబాల్‌సింగ్—మొదటిసాక్షేవొచ్చి యీరబద్దరసెట్టి. అయ్యా! యీరబద్దరసెట్టీ! మాయజమానులు పిలుస్తావున్నారు. యిలాగొచ్చి మీకు తెల్చినచంగతులన్నీ తెల్చినట్టు సెప్పెయ్యండి. అంతా గ్యాపకం సేసుకోండి.

అధికారి—అది యేమిరా అట్లు ముందుగానే సూచన చేయుచున్నావు? ఇదివఱకే నీ వాసాక్షి కేమయినను పాఠము చెప్పి వల్లెవేయించియున్నావా యేమి?

రంబాల్‌సింగ్—(చేతులు జోడించుకొని) అయ్యా! అదంతా యేటీ లేదు. మామాట నమ్మకం నేకపోతే ఆళ్ళనే అడిగి తెల్సుకోండి. మీకే తెలుస్తాది.

అధికారి—అయ్యా! మీపేరేమి? మీకీయూరిలో నేమిపని యున్నది.

వీరభద్రసెట్టి—అయ్యా! నాపేరు వీరబద్దరసెట్టి అంటారండి. పట్టు యేపారం చేస్తూ వుంటానండి. పట్టుదారం కొనుక్కుందావఁని యీవూరు వచ్చివున్నానండి.

అధికారి—ఈ యాఁడుదానిని మీ రెప్పుడైనను జూచియున్నారా?

వీరభద్రసెట్టి—ఈయమ్మ నిన్నసాయంకాల వఁప్పుడు వొకపిల్లవాణ్ణి వెంటఁబెట్టుకుని అల్లాకంసాలి నిలబడ్డాడే అతడింట్లో దూరుతూ వుండగా నేను చూశాను.

అధికారి—సరి సరి. ఆబత్తుఁ డెక్కడ! అయ్యా! బత్తుడూ! ఇలాగు రండి. ఈవిషయమై మీ కేమి తెలిసియున్నదో అది యంతయు



జరిగినది జరిగినట్టు చెప్పండి. మీకేవిధమయినభయమును లేదు. దాచఁగూడదు సుమండీ.

వేలాయుధాచారి—అయ్యా! నిన్న పొద్దుగుంకేవేళయి వుంటుంది. అప్పట్లో యీయమ్మ వొకపిల్లకాయని యెంటఁబెట్టుకొని మాయింటికాడికి వచ్చింది. కొన్నినగలు నాచేతి కిచ్చి అవన్నీ కరిగించి వేరేనగలు చేసిపెట్టమన్నాది. అందుకుగాను రాళ్ళు యేరేను బంగారం యేరేను తీసి వుంచమంది. "యిప్పుడు చీకటి పడుతూంది రేపొద్దున్నే వస్తాను" అని చెప్పి యెంటనే ఆపిల్లకాయని యెంటఁబెట్టుకొని యెల్లిపోయింది. యింతేనండి నాకు తెలిసినసంగతి. యింతట్లో నే నరుగుమీద కూచునుండగా యీయిద్దరూ నాదగ్గిరకి వచ్చి నన్నడిగితే జరిగింది జరిగినట్టు చెప్పి నగలు తెచ్చి యిస్తిని.

అధికారి—సరిసరి మంచిదే. ఆనగలన్నియు నెక్కడ నున్నవి?

రంజిత్ సింగ్—సామీ! యియిగో (నగలిచ్చుచున్నాఁడు.)

అధికారి—అప్పుడే రాళ్ళుగూడఁ దీసివేయఁబడినవా? ఏమంతయవసరము వచ్చినది? సరిలే. అవి యట్లుండనీ. మూఁడవ సాక్షియెవరు?

రంబాల్‌సింగ్—ఇదో వున్నారు. యీసోవిఁగోరు. సన్నాసయ్యగోరు.

అధికారి—స్వాములవారూ! యిటు రండు. తమ కీవిషయమయి యెంతవఱకుఁ దెలియును?

సన్న్యాసి—అయ్యా! మే మీదినము వేకువజామునఁ గాల్యకృత్యములు నెఱవేర్చుకొనుటకై పోవుచున్నాము. అప్పు డీభటులిద్దఱును ఈయాఁడుదానిని బట్టుకొని హింసించుచు నేమో యడుగుచుండిరి. అది యేమీ యని విచారించితిమి. విచారింపఁగా నీభటులు బిడ్డనిగుడ్డ లగపడుట లేదని సమాధానము చెప్పిరి. పిమ్మట

మేము మంచిమాటలాడి యాస్త్రీని జాటునకుఁ దీసికొనిపోయి నిజము చెప్పు మంటిమి. ఆమె మే మడుగఁగానే యాగుడ్డలను భూమిలోఁ బాతి యుంచితి నని చెప్పినది. వెంటనే వచ్చి యాసంగతి మే మీభటులకుఁ జెప్పితిమి. వీరిద్దఱును త్రవ్వి చూడఁగా నామె చెప్పినచొప్పుననే గుడ్డలు దొరకినవి. అవి పట్టుకొని మమ్ములను గూడఁ దీసికొని యిట్లు వచ్చిరి.

రంజిత్ సింగ్—సామీ! యీగుంపులో యింకా వకరు నిన్నసాయంతరంవేళని సూసినా నని సెప్తా వున్నారు.

అధికారి—వా రెవరు? వారినిగూడ నిచ్చటకు రమ్మనుము. (వచ్చుచున్నాఁడు.) అయ్యా! మీ రెవరు?

పట్టువ్యాపారి—అయ్యా! నేను పట్టుయేపారం సేసేవోణ్ణి. యీ యీదికి పోయి పట్టుయేపారం సేసేది నాపని.

అధికారి—ఆలాగుననా? యీయాఁడుదానిని మీ రెఱ్ఱుఁగుదురా?

పట్టువ్యాపారి—నిన్న సాయంకాలం యీయమ్మ నాకాడ రెండు గజాలపట్టు మెలిచ్చి పుచ్చుకుంది.

అధికారి—ఆపట్టులో మిగతది మీయొద్ద నున్నదా?

పట్టువ్యాపారి—ఆహా! వుంది దేవరా! వుంది. తొలీతిగుండా ఆయమ్మే బోణీ చేసినాది. కడందంతా అలాగే పడున్నాది.

అధికారి—మొత్తె మిది యెన్నిగజములపట్టు? ఒకకట్టలో నెన్నిగజము లుండును?

పట్టువ్యాపారి—పన్నెండుగజాలండి దేవరా! అందులోవి రెండు గజాలే యీయమ్మ కిచ్చినాను. తతిమ్మాపదిగజాలు అట్లనే పడున్నాది గాని యింకా కరుచుకాలేదు దేవరా!

అధికారి—ఈపట్టు బిడ్డనిమీఁదఁ గప్పఁబడినపట్టు రకమున కొక్కటియే యేమో చూడుము.



రంజిత్ సింగ్—సామీ! మాం సూసే వున్నాం. రెండూ వొక్కటే. యిందులో యేమీఁ షందేఘం లేదు.

అధికారి—మీరందఱును పంద్రెండుగడియలకు న్యాయస్థానమునకు వచ్చియుందురుగాక.

సాక్షులు—మేనంతా యేదో యేపారం సేసుకొని బతికేవోళ్ళం మాబతుకులు పోతాయే.

అధికారి—నేఁటికే విచారణ యంతయు ముగిసిపోవును. ఇది మహారాజా వారితాలూకు వ్యాజ్యము. కనుక మీ రాలస్యముచేయక సరిగా వచ్చి యుండక తీఱదు. స్వాములవారూ! తాము గొంచెము శ్రమను సహించి యావేళకే దయచేయుదురుగాక.

సన్న్యాసి—మా కేల యిటువంటిశ్రమ? ఎవరు బాగుపడిన మా కేమి? యెవరు చెడిపోయిన నేమి?

అధికారి—స్వాములవారూ! తా మట్లు భావింపఁ దగునా? లోకములో న్యాయము కొనసాగుచుండుటకై తమవంటిమహాత్ములు వీలయినంతలో సహాయముగా నుండవలయును గదా! గొప్పగొప్ప మహర్షులు స్వార్థమునందు మనస్సుంచక లోకోపకారకముగా నెన్నోశాస్త్రములను రచించి ప్రపంచమున కనుగ్రహించుట యిందులకేకదా! తప్పక దయచేయక తీఱదు.

సన్న్యాసి—మీ రంతనిర్బంధముగాఁ జెప్పుచున్నారు గావున నట్లే వచ్చెదము లెండు.

(అధికారి నేరముయొక్కస్వభావమును వ్రాసి పంపుచున్నాఁడు. అందఱును నిష్క్రమించిరి.)

ఇది సప్తమరంగము.

## అష్టమరంగము.

స్థలము : న్యాయస్థలమునం దపరాధిన్యాయవాదికార్యాలయము, కైదీల నుంచుకొట్టు.

కాలము : పూర్వాహ్ణము.

పాత్రములు : అపరాధిన్యాయవాది, చంద్రమతి, భాస్కరుఁడు, సేవకుఁడు.

(భాస్కరుఁడు అపరాధియొక్క న్యాయవాదిని వానికార్యాలయమునందు సంధించుచున్నాఁడు.)

---

భాస్కరుఁడు—(న్యాయవాదిని సమీపించి) అయ్యా! నిన్నటిదినము జరిగినహత్యవిషయమై యపరాధిప్రక్కను వాదించునట్లు రాజ్యాంగమువారు మిమ్ము నియమించి యుండునట్లు విని యున్నాను. ఆసంగతి నిజమా?

అపరాధిన్యాయవాది—అవును. నిజమే. ఇప్పు డాసంగతి యేల?

భాస్కరుఁడు—మఱేమియును లేదు. పాప మాయమ్మ యిందులో నేవిధమయినపాపమును నెఱుఁగదు. ఈ యూరికావలివాండ్రు వ్యర్థముగా నాయమ్మమీఁదను నేర మారోపించిరి. కాఁబట్టి తాము కొంచె మనుగ్రహించి శ్రమ యని యాలోచింపక యేలాగున నైనను దమరామెను విడుదల చేయింపఁ బ్రయత్నింప వేఁడుచున్నాను. అందులకు వలయుసాక్ష్యములను నేను జాగ్రత్తచేసి యుంచితిని. నేను వారిని బిలుచుకొని వచ్చెదను. తమరుమాత్ర మీయభియోగములోఁ గొంచెము శ్రమపడవలసి యుండును.



అప. న్యాయ—అవును గాని; అదేమి కొంచెము ప్రయాసతో ముగియఁదగిన యభియోగముగానా యున్నది? అపరాధిని మహారాజావారిపుత్త్రుని హత్యచేసి యున్నది. ఈ విషయమై సాక్షు లందఱును సరిగానే యేర్పడి యుండునపుడు మన మేమిచేయఁగలము? రాజ్యాంగమువారు మమ్ము నియమించి యున్నంతమాత్రమున నే మగును? వా రేమయినను మాకుఁ గనకాభిషేకముగానీ చేయుదురా? అందుల కని యొకకట్టముమాత్ర మేర్పాటుచేసి యున్నారు. అదిమాత్రమే యిత్తురు. ఆస్వల్పలాభముకొఱ కెవరితల పగులఁగొట్టుకొన మనుచున్నారు? ఇది విడుచుకొని మఱియొకయభియోగమును గమనించినను వలసినంతలాభము గలుగును. మాకును బనులు చాలినన్ని యున్నవి. ఇదిగాక నీక నేదేని లాభించునది యున్నచోఁ జెప్పుఁడు.

భాస్కరుఁడు—అయ్యా! తమరు ధనమువిషయమై కొంచెమైనను సందేహపడ నక్కఱలేదు. ఎంతధనము గావలసి యున్నను సమర్పించుట కెంతమాత్రమును నభ్యంతరము లేదు. నేఁటిదినము తమకుఁ గలిగియున్న యితరాభియోగములపైఁ జిత్తమును మరల్పక నామనవి చిత్తగించి యీకార్యమునే ముఖ్యముగా గమనించి యేలాగున నైనను నామె విడుదల యగునట్లు కటాక్షింపవలయు నని పదేపదే తమ్మును బ్రార్థించుచున్నాను.

అప. న్యాయ—సరిసరి. బోధపడినది. మీ రేమాత్రము ధన మియ్యఁగలరు? మిమ్మును మీమాటలును జూడఁగాఁ జాల మంచివారివలెఁ గనఁబడుచున్నారు. కాఁబట్టి యడుగుచున్నాను. ఈయభియోగ మాలాటిది యీలాటిదియుఁ గాదు. హత్యతో సంబంధించిన యభియోగము. అందును మహారాజావారికుమారుని హత్యజరిగించుట గాని సామాన్యమైనదికూడఁ గాదు. వేయివరా లీయఁ

గలరా? చూడుఁడు నిమిషమాత్రములో నామెకు విడుదల యగు మార్గ మాలోచించెదము. ఇంకొక చిన్నరహస్యము. న్యాయాధిపతి మనకుఁ గావలసినవాఁడు. సమీపబంధువు. అట్లే కాకున్నచో నిందఱు న్యాయవాదు లుండఁగా నీయభియోగము మాకేల యిత్తురు? దీనిచేతనే సంగతి యంతయును మీరు గ్రహించుకొందురు గాక!

భాస్కరుఁడు—సరియే కాని వారిప్రక్కను సాక్షులు బలముగా నున్నారే. మన మావిషయమై యేమిచేయవచ్చును?

అప. న్యాయ—ఆవిషయమై చింత మీ కెందులకు? నే నొక్కవిషయముమాత్రము మీతోఁ జెప్ప నున్నాను. అప్రకారముగా నాయపరాధిని నడుచుకోవలసి యున్నది. అట్లు నడిచినచో న్యాయాధిపతి విరోధిగా నున్నను మనయభియోగమునకు భయము రాదు. సాక్ష్యము వారిప్రక్క నెంతబలముగా నున్నప్పటికిని లేనట్టే యగును. ఉన్నను, ఆసాక్ష్యమువలనఁ గించిత్తయినను లాభ ముండదు. వారు "బిడ్డఁ డగపడుట లేదు" అన్నసమయము మొదలుకొని యుదయమువఱకును నీమె నేరము జరిగించినదన్నచోటికిఁ జాల దూరమునం దున్నట్టుమాత్రము మనము ఋజువుచేయించవలసి యుండును. ఇంతమాత్రమే మన కితరులవలనఁ గావలసినసాయము.

భాస్కరుఁడు—అయ్యా! సరియే. ఈవిషయమునే యాయమ్మచేఁ జెప్పించి యెట్లుగా నైనను విడుదల చేయింపవలయును. ఇదిగోఁ దాము కోరినవెయివరాలును బుచ్చుకొనుఁడు. అభియోగము పోయినతోడనే తమకు మఱియును సంతోషమును గలిగింపఁగలను.

అప. న్యాయ—సరి. రండు పోవుదము. ముందుగా నాయపరాధము చేసినస్త్రీతో మాట్లడుదము.



(న్యాయస్థలమునం దపరాధుల నుంచుచోటికిఁ బోయి కావలివానిం జూచి)

ఈముద్దాయితో మాటలాడుటకు న్యాయాధిపతిగారి యనుజ్ఞను బొంది వచ్చియున్నాము. ఈయభియోగములో ముద్దాయిపక్షమున వాదించుటకు మమ్మును నియోగించియున్నా రన్నసంగతి నీకును దెలిసియే యున్నది గదా!

కావలివాఁడు—తెలుసునయ్యా తెల్సును. పోయి అలాగే మాట్లాడుకొండి.

అప. న్యాయ—(చంద్రమతింగూర్చి) అమ్మా! మీమీఁదను మోపఁబడినయభియోగమువిషయమై మమ్మును మీపక్షమున వాదించుటకై రాజ్యాంగమువారు నియమించియున్నారు. ఏమైనను జెప్పుకోవలసినసంగతు లున్నచో మాతోఁ జెప్పుకోవచ్చును. ఆసంగతు లన్నియు మేము న్యాయాధిపతికి బాగుగా బోధపఱిచి మీరపరాధము చేయ లేనట్టు ఋజువుపఱిపించి మిమ్మును విడుదల చేయించెదము. జరిగినది జరిగినట్టుగా మాత్రము మాతోఁ జెప్పవలసి యుండును.

చంద్రమతి—అయ్యా! నా కేమియును దెలియదు. అక్రమముగా నామీఁద నీయపరాధము నారోపించుచున్నారేకాని నా కేపాపమును దెలియదు.

అప. న్యాయ—అవును గాని మీరు పట్టువడినయాచోటికి రాఁ గారణ మేమి? యని యడిగినప్పు డేమి చెప్పవచ్చును?

చంద్రమతి—అయ్యా! అటులేని చెప్పెదను వినుఁడు. నాకుమారుఁడును నేనును నీయూరిలో నివసించియుండు కాలకంఠు లను బ్రాహ్మణునియింటను దాసీతనము చేసి పొట్టపోషించుకొనుచున్నాము. నిన్నటియుదయమున నాకుమారుని దోడిబాలురతోఁ

గూడ సమిత్కుశాదులకై యడవికిఁ బంపించిరి. అట్లు పంపఁగా వాఁడు తోడిబ్రాహ్మణబాలురతోఁ బోయి యాయడవిలోఁ బాముకాటు దగిలి మరణించినవాఁడు. తోడఁబోయినయాబాలుర వలన నాఘోరమైన మరణవార్తను విని యా యింటియజమానుల యొద్ద ననుమతిఁ బొంది యడవికిఁ బోయి పీనుఁగును వెదకి వెదకి తుదకుఁ గనుఁగొని యాపీనుఁగును బుజముపై వైచుకొని యర్ధరాత్రసమయమునకు శ్మశానవాటికిం గొనిపోతిని. అచ్చటికావలివాండ్రు "చిన్నరూకయు, మూరెఁడుగుడ్డముక్కయు నియ్యకుండ శవమును దహింపనీయము" అనిరి. నాయొద్ద నేమియు లేమిం జేసి మమ్ముఁగొన్న యజమానులయింటికిఁ బోయి యవి తెచ్చుటకై బయలుదేఱితిని. ఇంతటఁ ద్రోవలో నొకశవము కాలికిఁ దగిలినది. దానిని జూచి నాకుమారుని నేదో జంతు వీడ్చుకొని వచ్చి యచ్చట వదలిపోయిన దని యోజించి చేతులతో నెత్తి యొడిలో నుంచుకొని యేడ్చుచుండఁగా రక్షకభటులు వచ్చి నన్నుఁ బట్టుకొనిరి. ఇదియే యథార్థము. వాండ్రేమేమో చెప్పుకొనిరి. నాకింతకన్న నేమియుఁ దెలియదు.

అప. న్యాయ—అహా! ఆలాగుననా? సరి సరి. ఈయభియోగమును ద్రోసివేయించుట కొకక్షణము చాలును. అట్లనఁగా వాండ్రు చెప్పునట్టికాలమున మీ రానేరము జరిగినచోటున నున్నట్లేర్పడ లేదు. అట్లేని మీ రాబ్రాహ్మణుని యింటినుండి బయలుదేఱిన దెప్పుడు?

చంద్రమతి—దీపములు పెట్టినతరువాత నొకగడియరాత్రి యయి యుండును.

అప. న్యాయ—మీరు శ్మశానవాటికకుఁ జేరునప్పటి కెంతరాత్రి యయి యుండునో చెప్పఁగలరా?



చంద్రమతి—అర్ధరాత్రమునకుఁ బైఁగానే యయి యుండు నని తోఁచుచున్నది.

అప. న్యాయ—ఆమధ్యకాలమునం దేమి చేయుచున్నారు?

చంద్రమతి—అయ్యా! అడవిలోఁ బీనుఁగును వెదకుటకును, అక్కడనుండి శ్మశానవాటికకుఁ బోవుటకును నంతసే పయినది.

అప. న్యాయ—ఆ సంగతి యట్లుండనిండు. శ్మశానవాటికకు మీరు పోవునప్పటి కచ్చట నెవరెవ రున్నారో చెప్పఁగలరా?

చంద్రమతి—అయ్యా! అచ్చట నాపెనిమిటియును; మఱొకకావలివాఁడును నున్నారు.

అప. న్యాయ—మీపెనిమిటి యచ్చటనే యున్నప్పుడు మీరేల రూకకును బట్టకును బోవలసివచ్చినది?

చంద్రమతి—అయ్యా! వారు శ్మశానవాటిక కధికారి యగువీరబాహువనెడితలారివానికి బానిసపడి యున్నారు. ఆ హేతువుచేత "వారిది" అని చెప్పుట కేమియును లేదు.

అప. న్యాయ—ఓహో! సరిసరి. మిగుల బాగుగ నున్నది. కాని యిందొకయంశము సందేహాస్పదముగాఁ గనఁబడుచున్నది. మీరు దీపములు పెట్టినమఱియొకగడియకు మీయజమానుని గృహము నుండి బయలుదేఱి యర్ధరాత్రమునకు శ్మశానవాటికకుఁ జేరితి నంటిరి. ఇట్లు చెప్పినచో నింతసే పేమిచేయున్నా రని సందేహము గలుగునే.

భాస్కరుఁడు—అవునవును. అందులకై యీబిడ కొంచెము కాలమును మార్చి చెప్పినయెడల నేవిధమయిన సందేహమునకును జోటు గలుగదు. అదెట్లనఁగా—అయ్యగారి యింటినుండి బయలుదేఱి యడవికిఁ బోయి పీనుఁగు నెత్తికొని తిన్నఁగా శ్మశానవాటిక

కేడెనిమిది గడియలకే వచ్చిచేరినట్లు చెప్పవలసి యుండును. శ్మశానమునం దున్న వాండ్రును నట్లే చెప్పినయెడల మఱొకవిధముగా నెవ్వ రెంత చెప్పినను మనకు భయము లేదు. అమ్మా! తెలిసినదా? ఒక్కటే సంగతి.

చంద్రమతి—అయ్యా! జరిగినది జరిగినట్లు చెప్పవచ్చునే కాని మార్చి చెప్పుట కంతరాత్మ యెట్లొప్పఁగలదు? జరిగినదే చెప్పినచో నేమి హాని యున్నది? ఇది గాక శ్మశానమునం దున్న నాపెనిమిటియు మార్చి చెప్పుట కొప్పుకొనరు.

భాస్కరుఁడు—అయ్యయో! ఇదేమమ్మా పిచ్చితనముగా మాట్లాడుచున్నారే. మిమ్ముల నెవరు మార్చి చెప్పుమన్నారు? రెండుగడియలు వెనుక ననుదానిని ముందుగా నని చెప్పు మనుచున్నాము. దీనికేమీ! ఇంతమాత్రమునకుఁగూడ నొప్పుకొననిచో నభియోగ మెట్లు జయప్రద మగును?

చంద్రమతి—అయ్యా! అభియోగము జయప్రదమైన నేమి కాకున్న నేమి? నిజమునకు విరుద్ధముగా నే నెన్నఁడును జెప్పఁజాలను.

అప. న్యాయవాది—అయ్యయో! ఈయమ్మ చూడఁగా మిగుల వెఱ్ఱిదానివలె నగపడుచున్నదే. అమ్మా! మేము చెప్పుచున్నసంగతిని బాగుగా వినుము. ఇప్పు డాయన చెప్పిన దంతయుఁ దుదవఱకును సత్యమే యని మీమనస్సునకుఁ జక్కఁగా గోచర మగుచున్నది గదా! పూర్ణముగా నసత్య మాడువాండ్రయొద్ద స్వల్పముగా దేనినైనను ముందు వెనుకలుగాఁ గొంచెము సరిపుచ్చుకొని చెప్పుటలో దోష మేమున్నది?

భాస్కరుఁడు—ఈయంశమునుగుఱించి నేను శ్మశానములో నున్నవారితోఁ జెప్పి సరిచేసి వచ్చెదను. మీరుమాత్ర మిప్పుడు వీరు చెప్పిన చొప్పుననే చెప్పక తప్పదు.



అప. న్యాయ—ఇంకేమి? మీపెనిమిటికూడ నొప్పుకొని చెప్పవలసిన రీతిని జెప్పుట కొప్పుకొందురఁట. మ తేమిబాధ యున్నది?

చంద్రమతి—అయ్యా! ఎందుల కట్లు చెప్పెదరు? ఇవి యన్నియును వ్యర్థప్రయత్నములు. సత్యమునకు విరుద్ధముగా నొక్కటియరమైనను జెప్పుటకు వీలుపడదు. అందువలన నేమివచ్చినను వచ్చుఁగాక. అక్కటా! అసత్యమును జెప్పి భూమిపై నుజ్జీవింపవచ్చునా?

అప. న్యాయ—అహహా! ఈసంగతి చూడఁగా మఱియు బాగుగా నున్నది. ఇటువంటికక్షిదారు లున్నచో న్యాయవాదులు విశేషముగా నభియోగములను జయింపఁగలుగుదురు. ఇఁకఁ బేరునకు లోప మేముండును? వచ్చుబడిమాట చెప్పనే యక్కఱలేదు. బంగారుకోటలు గట్టవచ్చును. ఇటువంటిమూర్ఖురా లీహత్య జరిగించియుండినను నుండవచ్చును. ఇట్లయినచో నీయభియోగము మనవలనఁ గాఁజాలదు. (మరలుచు భాస్కరునివంకఁ జూచి) ఏమయ్యా! మీరు చెప్పినది? ఈయాఁడు దింతమూర్ఖతను బట్టుదలను బూని యున్నదిగదా! ఇఁక మన మేమిచేయఁగలము?

భాస్కరుఁడు—అవును. తను రేమిచేయఁగలరు? సరియే. ఈబిడ నిట్లే పడియుండనిండు. తుద కాశ్మశానమునం దుండువారినైనను గనుఁగొని సరిపఱుచుకొందము. వాండ్ర నిచటికిఁ బిలుచుకొని వచ్చినచో నీయమ్మ యొకవేళ వాండ్రనుగూడఁ దన కనుకూలముగాఁ జెప్పనీయకపోవునేమో? వాండ్రును దమస్త్రీకి విరుద్ధముగాఁ బ్రవర్తించువారు కాకపోవచ్చును. నేను వెంటనే పోయి కాలకంఠుని వానిభార్యను దీసికొనివచ్చి యీయంశమును బుజువుచేయించెదను. అందులకై మీరు విచారింపవలసిన యావశ్యకము లేదు.

అప. న్యాయ—ఆమాట కేమిలెండు. చూతము. మావలన నైనంతవఱకుఁ బ్రయత్నించి చూచుటలో నెంతమాత్రమును నభ్యంతరము లేదని నమ్మవలయును. మీరుమాత్ర మీవిషయమై భయపడవలదు. ఇంతకంటెను జిక్కైనయభియోగముల నెన్నింటినో గెలిపించియున్నాము కామా? అందులో నిది యనఁగా నేపాటి? ఎందులకైనను మంచిది. మీరుమాత్రము కొంతసొమ్ము మీయొద్దనే సిద్ధముచేసి యుంచుకొనుఁడు. అట్లు కాదేని మాలేఖకునియొద్ద నొకయయిదువందలవరాలుమాత్ర మియ్యవలయును. అవసరపడినచో ననుకూలించును. మీకును మాటిమాటికిని శ్రమ కలుగకుండ నుండఁగలదు. అటుపయిని మీయిష్టము. ఇప్పుడు మేము చెప్పినసంగతి యెట్లయినను ముఖ్యముగా గమనించి తీఱవలయును జుమండీ. ఏమో మే మూరక చెప్పిన ట్లుపేక్షింతురేమో?

భాస్కరుఁడు—ఆహా! అందుల కేమిలెండు. మీ రెంతమాత్రమును సొమ్మువిషయమై సందేహపడ నక్కఱలేదు. నేనే కావలసినన్ని వరాలు మూట గట్టుకొని తమయొద్దనే యుండెదను. ఎప్పు డేమి కావలసినను నేనే యిత్తును. ఆభారమంతయు నానెత్తిమీఁదనే యున్న దని తాము నమ్ముదురుగాక.

అప. న్యాయ—అటులయినచో సరియే. మా కేమిగావలయును? న్యాయాధిపతి వచ్చువేళ సమీపించినది. మనము వేగముగా న్యాయస్థానమునకుఁ బోవుదము రండు.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది యష్టమరంగము.

---



## నవమరంగము.

---

స్థలము: న్యాయస్థానము.

కాలము: పూర్వాహ్ణము.

పాత్రములు: న్యాయాధిపతి, ఆరక్షకభటాధికారి, ఆరక్షకభటులు, దేశరక్షకాధికారి, న్యాయవాదులు, భాస్కరుఁడు, రాజ్యాంగలేఖకుఁడు, సేవకులు మొదలగువారు.

---

రాజ్యాంగలేఖకుఁడు—(లేచి నిలువఁబడి యపరాధినిని జూచి) చంద్రమతి యనుపేరుగలనీవు క్రోధినామసంవత్సర వైశాఖబహుళైకాదశీ నాఁటి సాయంకాలము మొదలుకొని మఱునటి దినముదయము లోఁగా నీకాశికానగర మహారాజుకుమారుని దొంగతనముగాఁ దీసికొనిపోయి హత్య చేసితి వని నీమీఁదను నేరము స్థాపింపఁబడియున్నది. నీ వీ విషయమై యేమి చెప్పుకొనియెదవు?

చంద్రమతి—అయ్యా! నా కేకర్మమును దెలియదు. నే నీనేరముసంగతి కొంచెమేనియు నెఱిఁగినదానను గాను.

రాజ్యాంగలేఖకుఁడు—హత్య జరిగించితి వన్ననేరము మోపఁబడినని న్నిప్పుడు పరిశీలించుటకై మధ్యస్థు లేర్పఱుపఁబడుదురు. వారు తమకు నియమింపబడిన స్థానమునం దాసీను లగుటకు ముందుగా నీపక్షమునందును, రాజ్యాంగమువారిపక్షమునందును నెనమండుగు రేసి మధ్యస్థులు కారణనిరూపణము లేకుండఁగను, తగినకారణములను నిరూపించుచుఁ దక్కుంగల పలువురు మధ్యస్థులును నాక్షేపణ సేయవచ్చును.

(మధ్యస్థులనామములు చీట్లపైని వ్రాసి కుదిలించి యొకటొకటిగాఁ దీసి చదివి పిలుచుచున్నాఁడు.)

నీలకంఠశాస్త్రులు!

రాజ్యాంగలేఖకుఁడు—(చంద్రమతిని జూచి) వీరు మధ్యవర్తులుగా నుంటడు నీకు సమ్మతమే యగునా? కానిచో సమ్మతి లేదని చెప్పఁకో వచ్చును.

అప. న్యాయ—(అపరాధినియనుమతి నొంది) ఆహా! సమ్మతమే.

రాజ్యాంగలేఖకుఁడు—రెండవవారు కృష్ణనాథదత్తుగారు.

కృష్ణనాథ—ఆహా! ఇదుగో నిచ్చటనే యున్నానయ్యా!

రాజ్యాంగలేఖకుఁడు—మూఁడవవారు లక్ష్మీనాథప్రసాదుగారు.

లక్ష్మీనాథ—అయ్యా? నే నిచ్చటనే యున్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—నాల్గవవారు కుమారశర్మగారు.

కుమారశర్మ—అయ్యా! సిద్ధముగానే యున్నాఁడను.

రాజ్యాంగలేఖకుఁడు—ఐదవవారు మహాదేవమేతగారు.

మహాదేవమేత—అయ్యా! ఉన్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—ఆఱవవారు గోపీనాథటాకూరుగ ...

గోపీనాథ—అయ్యా! హాజరుగానే యున్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—ఏడవవారు మునిలాల్ సింగుగారు.

మునిలాల్—అయ్యా! ఉన్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—ఎనిమిదవవారు మోహనరాయిగారు.

మోహన—ఉన్నానయ్యా! ఉన్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—తొమ్మిదవవారు పండరీనాథఛటర్జీగారు.

పండరీనాథ—ఇదిగో నిక్కడ నున్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—ఆర్యులారా! ఇప్పుడు మీరు తొమ్మండ్రును నీయభియోగములో మధ్యవర్తులుగా నిర్ణయింపఁబడి యున్నారు. మీలో నెవరినైనను నొకరిని మీరే మధ్యవర్తినిగా నియమించు



కొని యీయభియోగము విచారించు సమయములో నేదైన సందేహము గలిగినచో దానిని మీరు నిర్ణయించుకొనియున్న యధికారిమూలముగా నడిగి తెలిసికొనవచ్చును.

మధ్యస్థులు—అయ్యా! మేమందఱమును నేకీభవించి యీనీలకంఠ శాస్త్రులవారిని మాకుఁ బెద్దగా నిర్ణయించుకొనుచున్నాము.

రాజ్యాంగలేఖకుఁడు—ఆర్యులారా! ఈవిచారణమునం దేర్పడు సంగతులను లెస్సగాఁ బరిశీలించి యేమాత్రమయినను బక్షపాతము వహింపక తీర్పు చేయఁగలందులకై న్యాయాధిపతి సన్నిధియం దొకొక్కరు వచ్చి ప్రమాణము చేయవలయును. ఆపద్ధతి యంతయు నేను జెప్పెదను. అట్లే మీరందఱును జెప్పవలయును.

మధ్యస్థులు—ఆహా! అట్లే చేయుచున్నామయ్యా!

(రాజ్యాంగలేఖకుఁడు చెప్పినట్లే చెప్పుచున్నారు.)

నీలకంఠశాస్త్రి—భూతదయాపరుఁడును శక్తియుక్తుఁడును నగుపరమేశ్వరుని సన్నిధానమున నీలకంఠశాస్త్రి యను పేరుగల నేను కాశీకానగర మహారాజావారికిని, న్యాయస్థానమున నిలువఁబడియున్న యీప్రతివాదినికిని మధ్యవర్తినిగా నుండి యీయభియోగపువిచారణ నంతయు మనఃపూర్వకముగను బాగుగాను విమర్శించి సాక్ష్యముల ప్రకారము దైవమునందు భారము నుంచి ముగింపును జెప్పుట కొప్పుకొనుచున్నాఁడను.

(ఇట్లే తక్కినవారును జెప్పుచున్నారు.)

రాజ్యాంగన్యాయవాది—(లేచి మధ్యస్థులను జూచి) ఆర్యులారా! ఇదిగో నెదుట నిలువఁబడియున్న చంద్రమతి యనుపేరుగల యీయాఁడుది నిన్నటిసాయంకాలము మొదలుకొని నేఁటియుదయము

లోపలను రాజ్యాంగచట్టమునకు విరుద్ధముగా శిశుహత్య చేసిన దనునేర మారోపింపఁబడి యున్నది. ఆవిచారణము తొలుదొల్త సాక్ష్యములను మీయెదుట విమర్శించుటవలన మీకు విశద మగును. ఈయభియోగపు విచారణమునకై యేర్పడినసాక్షు లేడుగురు. అందు మొదటిసాక్షి, హత్య చేయఁబడిన బిడ్డఁడు నిన్నటి సాయంకాల మిరువదియైదు గడియల వఱకును నగరిలోననే యున్నట్లును, రెండవసాక్షి, నేరము చేసినయాఁడుది హత్య చేయఁబడిన బిడ్డని దనతోడఁ బిలుచుకొని పోయినట్లును, మూఁడవసాక్షి, బిడ్డని నగలను దీసి నేరము చేసినది తనయధీనము చేసినట్టును, నాల్గవసాక్షి యపరాధిని బిడ్డని గుడ్డల నన్నింటిని దీసి యొకచోటునఁ బాతిపెట్టిన సంగతి తనతోడఁ జెప్పి చూపించునట్లును, వాని నాప్రకారముగానే త్రవ్వి యాచోటనుండి తీసినప్పుడు తాను జూచినట్లును, ఐదవ సాక్షి, తుదకుఁ బ్రేతస్వరూపముగా నున్నయాబిడ్డనిమీఁదఁ గప్పఁబడినవస్త్రము దనయొద్ద నీముద్దాయీ వెలకుఁ బుచ్చుకొన్నట్లును, ఆఱవసాక్షియు నేడవసాక్షియు ముద్దాయీ హత్యచేయఁబడిన బిడ్డను జేతులతో నెత్తుకొని పోవుచున్నట్లును జెప్పుదురు. ఇఁక నీయంశములన్నియును విని తుదను నేరము చేసినదాని పక్షమున న్యాయవాది వాదించునట్టి యంశములను మీఁదను ధర్మాధికారి గారు సెలవిచ్చునంశములను బాగుగాఁ బరిశీలించి తెలిసికొని సాక్షికమును జూపక తోఁచినట్లు తీర్పు చెప్పుదురుగాక.

(కూర్చుండును.)

రాజ్యాంగలేఖకుఁడు—మొదటిసాక్షి లాల్ మోహనప్రసాద్.

సేవకుఁడు—సాచ్చి లాలుమోహాన్ పరసాద్! సాచ్చి లాలుమోహాన్ పరసాద్!!



లాల్ మోహన్‌ప్రసాద్—ఇదిగో నిక్కడనే యున్నానయ్యా!

సేవకుఁడు—అయ్యా! యిలారండి. యీగూట్లో నెక్కండి.

(ఎక్కుచున్నాఁడు.)

రాజ్యాంగలేఖకుఁడు—అయ్యా! నేను జెప్పినప్రకారముగానే చెప్పుదురుగాక. సర్వశక్తి యగుభగవంతుని యెదుట నేను జెప్పునది యంతయు నిజము. అసత్యము గాదు. నిజము తప్ప నసత్య మొక్కక్షరమైనను నుండదు.

(లాల్ మోహనప్రసా దట్లే చెప్పుచున్నాఁడు.)

రాజ్యాంగన్యాయవాది—మీరు చేయుపని యేమిటి?

లాల్ మోహనప్రసాద్—నేను మహారాజావారినగరిలోఁ గలపనులను గమనించు చుండు కార్యనిర్వాహకుఁడను.

రాజ్యాంగన్యాయవాది—ఈ యభియోగము విషయమై మీ కేమి తెలియును?

లాల్ మోహన్‌ప్రసాద్—నిన్నటి సాయంకాలము సుమా రిరువదియైదు గడియలవఱకును శ్రీమహారాజావారి చిరంజీవులు నగరిలోననే యున్నారు. మఱికొంచెము సేపటికి నెచ్చట వెదకినను గనఁబడలే దని యనుకొన్నారు. పిమ్మటను గావలి యధికారులకుఁ దెల్పితిమి. వారీ యుదయముననే చిరంజీవుల ప్రేతమును వారి భూషణాంబరములను, న్యాయస్థలమున నదిగో నిలువఁబడియున్న యాయాఁడుదానిని నగరికిఁ దీసికొనివచ్చి ప్రేతవిచారణను జేసిరి. ఇంత మాత్రమే నే నెఱుఁగుదును.

రాజ్యాంగన్యాయవాది—ఆనగలును, వస్త్రములును నిప్పు డెచ్చట నున్నవి?

లాల్ మోహన్ ప్రసాద్—ఇదిగో రాజ్యాంగలేఖకుని బల్లమీఁద నున్నవియే యీ భూషణాంబరములు.

రాజ్యాంగన్యాయవాది—సరిలే.

(అని కూర్చుండును.)

అపరాధి న్యాయవాది—ఈసాక్ష్యమున కెదురువిమర్శ యేమియును లేదు.

రాజ్యాంగన్యాయవాది—రెండవసాక్షి వీరభద్రసెట్టి.

సేవకుఁడు—సాచ్చి యీరబద్దరసెట్టీ ఈ! ఈ!! సాచ్చి యీరబద్దరసెట్టీ ఈ!! ఈ!!!

వీరభద్రసెట్టి—అయ్యా! ఇదుగో వచ్చినాను.

సేవకుఁడు—యిలారండి. సాచ్చిగూట్లో యెక్కి నిలబడండి.

(ఎక్కి నిలువఁబడుచున్నాఁడు.)

రాజ్యాంగలేఖకుఁడు—నేను జెప్పినప్రకారముగానే చెప్పుము. సర్వశక్తుఁడగు భగవంతునియెదుట నేను జెప్పున దంతయు నిజము. నిజమే యంతయును. నిజము తప్ప నసత్య మొక్కటియైనను నుండదు.

(సెట్టియు నట్లే చెప్పును.)

సాక్షి విమర్శ.

రా. న్యాయ—అయ్యా! మీ కేమిపని?

వీరభద్రసెట్టి—నేను యేపారం చేసుకునే వాణ్ణండి.

రా. న్యాయ—ఈయాఁడుదానిని నీ వెప్పుడైనను జూచియున్నావా?

వీరభద్రసెట్టి—ఆహా! చూచి యున్నానండి.

రా. న్యాయ—ఎప్పుడు? ఎక్కడఁ జూచితివి.



వీరభద్రసెట్టి—అయ్యా! నిన్నటిదినం సాయంకాలంవేళ యీయమ్మ వాకచిన్నబిడ్డణ్ణి యెంటబెట్టుకుని కంసాలివీధులో వాకబత్తుడింట్లో దూరుతూ వుండగా నేను చూచివున్నాను.

రా. న్యాయ—ఇంతకుముం దెప్పుడైనను జూచియున్నావా?

వీరభద్రసెట్టి—లేదండి నే నెప్పుడును చూసివుండలేదండి.

రా. న్యాయ—సరియే. నీవు చూచితి నంటివే. ఆబిడ్డ కెంతవయస్సుండునో చెప్పఁగలవా?

వీరభద్రసెట్టి—చిత్తం. యేడెనిమిదే ళ్ళుంటాయండి.

రా. న్యాయ—ఆబిడ్డ యేవిధమయిన యుడుపులను ధరించియుండునో చెప్పుము.

వీరభద్రసెట్టి—యెఱ్ఱపట్టుబట్టలు కట్టుకుని యున్నట్టు గ్యాపకమండి.

రా. న్యాయ—ఇంకను నీ వాబిడ్డయం దేమేమి గుర్తించి యున్నావు?

వీరభద్రసెట్టి—అయ్యా! వొంటినిండా ఇలవలేనినగ లున్నాయండి.

రా. న్యాయ—పిమ్మట నాబిడ్డను మరల నెచ్చటఁ జూచితివి?

వీరభద్రసెట్టి—తరవాతనండి, వూరికావలివారు ప్రేతవిచారణ చేసేటప్పుడు ముందు చెప్పినబిడ్డ ప్రేతస్వరూపంగావుండగా చూసున్నానండి.

రా. న్యాయ—సరి సరి.

(కూర్చుండును.)

ఎదురువిమర్శ.

అప. న్యాయ—మీ రీయూరిలోననే నివసించువారా?

వీరభద్రసెట్టి—లేదండి నేను కాళీఘట్టంలో వుంటానండి.

అప. న్యాయ—మీ రీయూ రెప్పుడు వచ్చియున్నారు?

వీరభద్రసెట్టి—నే నీవూరు వచ్చి మూఁడ్రోజు లయిందండి.

అప. న్యాయ—నిన్న నీయమ్మను జూచుటకు ముందుగాని వెనుకఁగాని పోయినవాండ్ర నిట్టివా రని గుర్తింప మీవలన నగునా?

వీరభద్రసెట్టి—అయ్యా! నావల్ల గాదండి.

అప. న్యాయ—ఈయమ్మను మాత్రమే గుర్తించి జ్ఞాపకమునం దుంచుకొనుటకుఁ గారణమేమి?

వీరభద్రసెట్టి—బిడ్డ డందంగా వుండడంచేతను, చాలా యిలవగలిగున్న నగలు బట్టలూ ధరించి వుండడంచేతను ఆబిడ్డణ్ణి బాగా గుర్తుపట్టి గ్న్యాపక వుంచుకొన్నానండి. ఆకారణంచేత నీయమ్మను గూడా గుర్తించి గ్న్యాపకంగా వుంచుకొన్నానండి.

అప. న్యాయ—సరికాని; ఆసమయమం దీయమ్మ యెటువంటిబట్ట కట్టుకొని యున్నదో జ్ఞాకమునం దున్నదా?

వీరభద్రసెట్టి—అయ్యా! యిప్పుడు కట్టుకునివున్న కాయిరంగుబట్టే అప్పుడూ కట్టుగుని వున్నాదండి.

అప. న్యాయ—ఆయమ్మ శరీరముపై నేమేమి యాభరణంబు లున్నవో యెఱుఁగుదువా?

వీరభద్రసెట్టి—ఆయమ్మ వొంటిమీద వొక్కనగైనా లేదండి. యిప్పుడున్నట్టే అప్పుడూ వున్నాదండి.

అప. న్యాయ—ఆయమ్మవెంట నాబిడ్డఁడు పోవుచుండఁగా మీ కేమయినను సందేహము గలిగినదా? కలుగనే లేదా?

వీరభద్రసెట్టి—నా కేమీఁ సందేఘం కలగలేదండి.

అప. న్యాయ—తల్లి యింతహీనస్థితిలో నుండఁగా బిడ్డఁ డట్లమూల్యాంబరాభరణములు ధరించి యుండుట చూడఁగా నెటువంటివారికిని సందేహము కలుగకమాన దే!



వీరభద్రసెట్టి—అవునుగానండి; నే నాయమ్మని ఆబిడ్డడికి తల్లిగా భావించుంటే నాకూ సందేఘం కలగవలసిందే గాని నే నలా భావించుకోలేదు. ఆయమ్మవచ్చి ఆబిడ్డడిదాదిగా భావించానండి.

అప. న్యాయ—తుదకు వీ రెక్కడ నగపడ్డారు?

వీరభద్రసెట్టి—యెక్కడా గాదండి, వొకబత్తుడింట్లో దూరుతూవుండగా చూశానండి.

అవ. న్యాయ—ఈసంగతినిగూర్చి మీ రెవ్వరితోడనైనను బ్రస్తావించి యున్నారా?

వీరభద్రసెట్టి—అవునండి ప్రస్తాపించే వున్నానండి.

అప. న్యాయ—ఎవరితోడఁ బ్రస్తావించితిరి? ఏల ప్రస్తావించితిరి?

వీరభద్రసెట్టి—యీవూళ్ళో వున్న కాళికా అమ్మావారి దేవాలయం దెగ్గిర యాత్రకు వొచ్చినవారొకరు నాతో మాట్లాడుతూవుండగా వొకాడది నిన్నట్రాత్తిరి వేళ కాళికాదేవిగుడికి వొచ్చినట్టున్ను, చిన్నరాజుగా కావలసిన తనకొడుకు చచ్చిపోయినట్టున్ను, వాడికి జీవబిచ్చం యిస్తే మరోరాజుకొడుకుని తీసుగొచ్చి బలిచ్చేటట్టున్ను ప్రార్దన చేసుగున్నాదనిన్ని, ఆమాటలన్నీ ఆసమీపంలో పడుకునివున్న ఆయాత్రవాళ్ళు వింటూవున్నట్టున్ను నాతో చెబితే నే నందు కామీద యిట్లు యిద్దరున్నూ చేరి పోయినసంగతి చూచినట్లు వారితో చెప్పడం తటస్థించింది.

అ. న్యాయ—సరియే. మీ రిప్పు డాయాత్రికులను జూపఁగలరా?

వీరభద్రసెట్టి—ఆహా! చూపగల్నండి. వా రాదేవుఁడుగుడి దెగ్గిర్నే కొన్నాళ్ళదాకా వుంటామని చెప్పున్నారండి.

అప. న్యాయ—సరి చాలును. (భాస్కరునివంకఁజూచి) ఏమయ్యా! ఇది యిట్లు మాఱుచున్నదీ?

భాస్కరుఁడు—ఆదేమియును లేదయ్యా! ఇపుడీసాక్షి చెప్పినదంతయు వట్టియబద్ధము. కావలయునన్నచో నాయాత్రికులను మన పక్షమున సాక్ష్యము చెప్పుటకుఁగా రప్పించి యడుగవలయును. ఆసాక్షుల సాక్ష్యముతోడనే యీయమ్మకు విడుదల కాఁగలదు.

అప. న్యాయ—సరియే కానిండు తొందరయేల ? అన్నింటిని జూతము గదా !

రాజ్యాంగన్యాయవాది—మాఱువిమర్శ యక్కఱలేదు.

అప. న్యాయ—సరి పోండు.

(కూర్చుండును.)

రాజ్యాంగలేఖకుఁడు—మూఁడవసాక్షి వేలాయుధాచారి.

సేవకుఁడు—సాచ్చి యేలాయుదాసారీ ఈ ఈ! సాచ్చి యేలాయుదాసారీ. ఈ ఈ ఈ!

వేలాయుధాచారి—ఇదుగో వున్నాను. (పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.)

సేవకుఁడు—యిద్గో యీగూట్లో యెక్కండి.

రాజ్యాంగలేకుఁడు—నేను జెప్పునట్టుగానే చెప్పవలయును. సర్వశక్తియగు భగవంతునియెదుట నేను జెప్పినదంతయు నిజము. అంతయును నిజము. నిజము దప్ప మఱేమియును లేదు.

(బత్తుఁడును నట్లే చెప్పును.)

రాజ్యాంగ న్యాయవాది—ఈ యభియోగముం గూర్చి మీ కేమి తెలియును ?

వేలాయుధాచారి—యీయమ్మ నిన్నటిదినం సాయంతరవఁప్పుడు వొకబిడ్డణ్ణి యెంటబెట్టుకుని మాయింటికి వొచ్చింది. తరవాత ఆ బిడ్డడి వొంటిమీదుండే నగలు తీసి నాచేతి కిచ్చింది.



రాజ్యాంగ న్యాయవాది—ఏమనిచెప్పి యిచ్చినది ?

వేలాయుధాచారి—ఈ నగలన్నీ చెరిపేసి వేరే నగలు చెయ్యవలసిందని చెప్పి యిచ్చిందండి.

రాజ్యాంగ న్యాయవాది—తరువాత నేమి జరిగినది ?

వేలాయుధాచారి—ఆయెనక నాయమ్మ మళ్ళీ బిడ్డణ్ణి యెంటబెట్టుకుని యెల్లిపోయింది. నాలుగ్గడియ లయేటప్పడికల్లా వూరికావలోళ్ళు వొచ్చి నన్నడిగినారు. అప్పుడు నేను జరిగినసంగతంతా వాళ్ళతో చెప్పీశాను. నగలు తెమ్మని నన్నడిగితే అవన్నీ తెచ్చి యిచ్చేస్తిని. ఆదివరకే కొన్ని నగల్లోవున్న రాళ్ళన్నీ పెల్లగించీసి వున్నాను. వాట్నికూడా అడిగితే యిచ్చేస్తిని. తరవాత నాయమ్మెలా పోయిందని నన్నడిగితే పోయినదారి చూపించీశాను. "యెక్కడికి పోయింది" అని నన్నడిగినారు. "అయ్యా! యెక్కడికి పోయిందో నాకు తెలియ" దన్నాను. తుదకి నన్నుకూడా యెంటబెట్టుకుపోయి రాతిరి తెల్లవార్లూ అక్కడా అక్కడా తిరిగి తిరిగి యెదికినారు. దొరకలేదు. కడాసరికి వూరికి, వుత్తరంగా వొక కాలిదోవ పోతుంది. అక్కడ యీయమ్మ చచ్చిన యీబిడ్డణ్ణి చేతులుమీద పెట్టుకుని పోతూవుంది. అప్పుడే యీకావలోళ్ళు మెల్లిగా పోయి చటుక్కున పట్టుగున్నారు.

రాజ్యాంగన్యాయవాది—ఆతరువాత నేమిజరిగినది ?

వేలాయుధాచారి—ఆతరవాతనేవచ్చి కావలోళ్ళు "బిడ్డడిమీదిగుడ్డలెక్కడున్నాయి" అని అడుగుతుండిరి. ఆయమ్మ తన కేవీఁన్నీ తెలియదని చెప్పింది. ఆయెనక నాతోవనే యెవరో సన్నాసి పోతూవుండిరి. ఆయనవచ్చి ఆయమ్మ నడిగేటప్పటికల్లా ఆబట్ట

లన్నీ వొకచోట పాతిపెట్టినట్టు చెప్పింది. యెంటనే ఆయమ్మ చెప్పినచోట తవ్వఁగానే బట్టలు దొరికినాయి.

రాజ్యాంగన్యాయవాది—ఆబట్ట లిప్పు డెక్కడ నున్నవి?

వేలాయుధాచారి—ఆబట్టలన్నీ యిప్పుడు యిక్కడ రాజ్యాంగలేఖకుడుగారి మేజాబల్లమీఁదనే వున్నాయండి.

రాజ్యాంగన్యాయవాది—ఆబిడ్డని మీయింటిదగ్గరనేకాక యిఁక నెక్కడనైనను జూచితిరా?

వేలాయుధాచారి—ఈయమ్మ ఆబిడ్డణ్ణి పీనుగ్గా చేతులమీద పెట్టుకుని వుండగా చూసున్నానండి.

రాజ్యాంగన్యాయవాది—మరల నెక్కడనైనను జూచితిరా?

వేలాయుధాచారి—వూరికానలోళ్లు ప్రేతవిచారణ చేసేటప్పుడు కూడా చూశానండి.

రాజ్యాంగన్యాయవాది—సరి. చాలును.

(కూర్చుండును.)

ఎదురు విమర్శ.

అప. న్యాయ—అయ్యా! మీకు జీవనమేమి?

వేలాయుధాచారి—నే నొకపెద్దయేపారిని. నేను లచ్చలకొద్ది దీనారముల మదింపుగల రత్నాలనగలు కొని వాటిని పెద్దపెద్దపెభువులు రాజులు మొదలైనవారి నగళ్ళకు తీసుగుపోయి యేపారం చేసుగుంటూవుంటాను. కొత్తనగలమ్మేదిన్నీ పాతనగలుకొనేదిన్నీ, పాతనగలకి కొత్తనగలు మారుచుకునేదిన్నీ. ఇదే నాయేపారం.

అప. న్యాయ—మీ రీయూరిలో నెంతకాలమునుండి యున్నారు



వేలాయుధాచారి—నే నంతా సొల్పకాలంనుంచే యీవూళ్ళో వచ్చి వున్నానండి.

అప. న్యాయ—స్వల్పకాల మనఁగా నెలలకొలఁదియా? దినముల కొలఁదియా?

వేలాయుధాచారి—దినాలకొలదినే అయి వుంటుందండి.

అప. న్యాయ—ఎన్నిదినములనుండి యిక్కడ నున్నారు?

వేలాయుధాచారి—ఒకవారంరోజు లవుతుందండి యిక్కడున్నాను.

అప. న్యాయ—ఈయమ్మను మీ రింతకుముందు చూచియున్నారా?

వేలాయుధాచారి—నే నీవూ రొచ్చిన కొన్నిరోజులకల్లా అనేకమంది మాయింటికి వస్తూపోతూ వుండడం కద్దు. ఈయమ్మకూడా వచ్చుంటే వుండవచ్చును. నే నంతగా గవఁనించలేదండి. నిన్నను మాత్రవేఁ గవఁనించానండి.

అప. న్యాయ—ఈయమ్మయంతర మిటువంటి దని మీకుఁ దెలియునా?

వేలాయుధాచారి—నా కేం తెలుసునండీ? అయ్యా! నాకు తెలవదండి.

అప. న్యాయ—అట్లు తెలియకుండ నుండునప్పుడు మీ రాయమ్మ యిచ్చిన వెలగలనగలను బుచ్చుకొనవచ్చునా? "ఈనగ లెక్కడివి? ఎవరివి?" అని యైనను మీ రడిగితిరా?

వేలాయుధాచారి—నేను పెద్దయేపారి నని మొదట్నే చెప్పలేదండీ? నేను పోతూ వస్తూవుండే రాజ్యాల్లో నాయేపారం తొరగా ముగించుకొని పోతూవుండడం వాడుకండి. కాబట్టిన్ని; నే నీవూరొచ్చిన కొద్ది దినాల్లోనే అనేకులు పెభువులు నాయింటికొచ్చి యేపారం చేస్తూవుండడం బట్టిన్ని; వొకొక్కరితోనల్లా చాలాసంగతులు

మాట్లాడుతూ వుండడానికి నాకు చాలినంతవకాశం లేదండి. కాబట్టి యీయమ్మ నగత్తెచ్చినప్పుడున్నూ అడగడానికి నాకవకాశం లేకనే అడగడం లేదండి.

అప. న్యాయ—ఔను గాని మీరు పెద్దవ్యాపారులంటిరే మీయొద్ద సుమారెన్నివేల దీనారములు మదింపుగల రత్నాభరణము లున్నవి.

వేలాయుధాచారి—(తనలో) విసురుగా చెప్పినదాన్నంతా యీపలపడు గట్టిగా పట్టుకొని నాప్రేణాలు కిట్టిస్తూవున్నాడే. కానీ చూదాం. (పైకి) అయ్యా! నాదగ్గిర అయిదులక్షుల మోరీల మదింపు గల రత్నాభరణా లున్నాయండి.

అప. న్యాయ—మంచిది. ఈయమ్మ బిడ్డని గుడ్డలను బాతిపెట్టినట్లును, సన్న్యాసి యడుగఁగాఁ జెప్పినట్లును జెప్పితిరిగదా! అట్లామె చెప్పుచుండఁగా మీరు మీచెవులార విన్నారా?

వేలాయుధాచారి—ఆయమ్మ చెపుతూవుండగా నేను వినలేదుగానండి, ఆయమ్మ నేను చెప్పినట్టే సన్నాసిగారు చెపుతూవుండగా నాచెవులారా వినున్నానండి.

అప. న్యాయ—సరి. ఆయమ్మ చెప్పుచుండఁగా మీరు వినలేదు. గుడ్డలు పూడ్చినచోటునుండి యాయమ్మ తానే పెల్లగించి తీసినదా?

వేలాయుధాచారి—ఆయమ్మ తవ్వి తీయలేదండి. అయితే ఆయమ్మ గురుతు చెప్పినచోటునుంచి వూరికావలోళ్ళే పెల్లగించి తీశారండి.

అప. న్యాయ—సరి. చాలును.

(కూర్చుండును.)



**మఱువిమర్శ.**

రాజ్యాంగన్యాయవాది—గుడ్డలు భూమిలోఁ బాతి యుంచిన ట్లాయమ్మ చెప్పునప్పుడు మీరు విననేలేదా?

వేలాయుధాచారి—నేను వినలేదండి.

రాజ్యాంగన్యాయవాది—ఆయమ్మ చెప్పిన దని సన్న్యాసి చెప్పునప్పుడును, పాతిపెట్టినబట్టలు భటులు తవ్వి తీయునప్పుడును మీతో నాయమ్మ యేమిచెప్పినది?

వేలాయుధాచారి—ఆయమ్మేమీఁ చెప్పనే లేదండి. వూరికే మౌనంగా కూచున్నాదండి.

రాజ్యాంగన్యాయవాది—సరి. చాలును.

(కూర్చుండును.)

రాజ్యాంగలేఖకుఁడు—నాల్గవసాక్షి పరమానంద యోగి.

సేవకుఁడు—సాచ్చి పరమానందవోగీ ఈఈ! సాచ్చి పరమానంద వోగీ ఈఈ!!

పరమానంద యోగి—ఇదిగో నిచ్చటనే యున్నాను.

సేవకుఁడు—సోవీఁ యీసాచ్చిగూట్లో యెక్కండి.

పరమానంద యోగి—గూడా యిది? ఈగూడు ఆగూటిమీఁదనా యెక్కవలసినది. సరిసరి బాగానే వున్నాది.

రాజ్యాంగలేఖకుఁడు—అయ్యా! యోగిగారూ! నేను జెప్పినట్లే తాము జెప్పుదురుగాక.

పరమానందయోగి—మేము మాకుఁ దెలిసినసంగతిని జెప్పుటకుఁగదా వచ్చితిమి. మీరుచెప్పినట్లే చెప్పుట కెట్లు సరిపడును?

రాజ్యాంగలేఖకుఁడు—అట్లు గాదండి. తాము చెప్పిన దంతయు నిజమే యనుటను సూచించుటకై ముందుగాఁ బ్రమాణము చేయవల

యును. అది న్యాయస్థలములయందలిపద్ధతి. సాక్షిగా వచ్చిన తరువాత నెవరైనను బోనులో నిలువఁబడి ప్రమాణము చేసియే తీఱవలెను.

పరమానందయోగి—ప్రమాణమా? అట్లయినచో మే మప్రమాణముగానా చెప్పుటకు వచ్చితి మనుకొనుచున్నారు. అది యేమ్మాట. మే మెందు కప్రమాణముగాఁ జెప్పుదుము.

రాజ్యాంగలేఖకుఁడు—అట్లు గాదండి. స్వామీ! న్యాయస్థానమునందఱును నొక్కరీతిగానే కదా చూడఁబడుచుందురు. అసత్యవాదులును నిచ్చటికి వచ్చుచుందురే. అందఱును దమవలెనే న్యాయమైనదానినే చెప్పవత్తురా? కావునఁ జెప్పుఁడు "సర్వశక్తి యగు భగవంతునియెదుట నేను జెప్పునదంతయు నిజము. నిజమే యంతయును. నిజముతప్ప మఱేమియును లేదు."

(యోగియు నట్లే చెప్పును.)

రాజ్యాంగన్యాయవాది—అయ్యా! తమనామధేయ మేమిటండి?

పరమానందయోగి—మమ్మును పరమానందయోగి యందురు.

రాజ్యాంగన్యాయవాది—ఈయభియోగమునుగుఱించి తమ కేమి తెలియునండి?

పరమానందయోగి—ఈదినము ప్రాతఃకాలమున నీయూరియుత్తరపు దిక్కున నీస్త్రీని పెక్కుమందియారక్షకభటులు చుట్టుకొని నిలఁబడి యేమేమో అడుగుచున్నారు. మేమా మార్గముగా వచ్చుట తటస్థించినది. అప్పుడు వాండ్రమధ్యను మే మీస్త్రీని చూచియుంటమి.

రాజ్యాంగన్యాయవాది—తమ రచ్చోటునకు వచ్చినతరువాత నేమి జరిగినదండి?



పరమానందయోగి—మే మచ్చటకు వచ్చునప్పటికి భటు లాస్త్రీని గూర్చి "హత్యచేయఁబడిన బిడ్డఁడు నీదగ్గిరనే వున్నాఁడు గదా! యీబిడ్డనిగుడ్డ లెక్కడ నున్నవి?" అని యడుగుచున్నారు. అందుల కామె మౌనము నవలంబించి కూర్చున్నది. అటువంటిసమయమందు మేమాస్త్రీని రహస్యమునకుఁ బిలిచి "అమ్మాయీ! హత్య చేయనూ చేసితివి. దొరకనూ దొరికితివి. యింక దాపరిక మెందుకు? అటువంటిపని చేయకూడదు. ఇప్పుడైనను జరిగినది జరిగినట్టు చెప్పుటే మంచిది" అని బోధపఱిచితిమి. మామాటలు విని యాబిడ తా నాబట్టల నొకచోటఁ బాతిపెట్టినట్లు మాతోఁ జెప్పఁగా మేము కావలివాండ్రకు బహిరంగపఱిచితిమి. పిమ్మట వాండ్రు బట్టలు పాతినచోటునుండి తవ్వి తీసికొనిరి.

రాజ్యాంగన్యాయవాది—కావలివాండ్రే బిడ్డనిగుడ్డల నడిగిరి. అని మీరు తెలిసికొంటిరి. ఇంతే కాదండీ?

పరమానందయోగి—ఔను. ఆబిడ్డచేతులలో నొకబిడ్డఁడు ప్రేతమై యుండఁగా వాండ్రాబిడ్డనిగుడ్డలే యడిగిరి.

రాజ్యాంగన్యాయవాది—స్వామీ! తాము మరల నాప్రేతము నెక్కడఁ జూచితిరి?

పరమానందయోగి—ఆరక్షకోద్యోగులు ప్రేతవిచారణము చేయునప్పుడా పీనుఁగును మరలఁ జూచుట తటస్థించినది.

రాజ్యాంగన్యాయవాది—స్వామీ! తాము చూచితి మంటిరే, ఆబట్టలిపు డెక్కడ నున్నవి?

పరమానందయోగి—అదిగో రాజ్యాంగలేఖకుని బల్లమీఁద నున్నవే. అవియే యాగుడ్డలు.

రాజ్యాంగన్యాయవాది—సరి. చాలును.

(కూర్చుండును.)

ఎదురు విమర్శ.

అప. న్యాయ—అయ్యా! మీరు యోగీశ్వరులా?

పరమానంద యోగి—ఔను. మమ్మట్లే చెప్పుచుందురు.

అప. న్యాయ—మీరు నివసించుస్థల మెక్కడనండి.

పరమానంద యోగి—సన్న్యాసుల కొకచోటని నిశ్చయ మేమిటి? మా కెక్కడఁ జిత్తమునకు విశ్రాంతిగా నుండునో అచ్చట నుందుము.

అప. న్యాయ—నిన్నటిరాత్రి తా మెచ్చట బస చేసియుంటిరి?

పరమానంద యోగి—ఈయూరి కుత్తరముగా నున్న దేవాలయములో నివసించితిమి.

అప. న్యాయ—సర్వసంగపరిత్యాగము చేసికొని దేహాభిమానమును గూడఁ బరిహరించి సంచరించుతమబోటి సన్న్యాసులకును లోక వ్యవహారములయందు సంబంధ ముండవచ్చునా?

పరమానంద యోగి—అన్నింటియందును వైరాగ్యము కలుగుటచేతనే మేము తుర్యాశ్రమమును స్వీకరించితిమి.

అప. న్యాయ—తా మాబిడతో మాటలాడితిరా?

పరమానంద యోగి—ఆహా! మాటలాడితిమి.

అప. న్యాయ—విషయబంధములను దెగఁగోసికొని పరమైకాంతులుగా నుండు సన్న్యాసులకుఁ దమ కిటువంటి విషయములయం దెందుకుఁ బ్రసక్తి గలిగినది?

పరమానంద యోగి—సన్న్యాసులకు ముఖ్యముగా భూతదయ యుండవలయునుగదా! ఒకజీవము హత్యచేయఁబడి యున్నది. అదియొకటి. రెండవది యొక్కస్త్రీ దిక్కులేక యనేకులమధ్యను జిక్కికొని మానమునకును బ్రాణమునకును హాని నొందునవస్థలో నున్నది. ఈ



రెండు ప్రబలకారణములచేతను మే మీవిషయమున సంబంధము కలుగఁజేసికొనక తప్పినదికాదు. ఇంకను మాకు రాజ్యాంగమువారి జ్ఞానులసాయము గావలసి యున్నది. అదియునుంగాక, రాజనఁగాఁ గేవలమును మనుష్యమాత్రుఁ డని యెంచవలనుపడదు.

"శ్లో. నాదేవాంశో దదా త్యన్యం నారుద్రః క్రమపాతకః,
నానృషిః కురుతే కావ్యం నావిష్ణుః పృథివీపతిః."

అనికదా పెద్దలు చెప్పుదురు. కావున రాజనఁగా విష్ణుమూర్తియే యని యొప్పక తప్పదు. మాకు మోక్షము దక్కఁ దక్కిన దక్కఱ లేదు గనుకను,

"శ్లో. ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే ల్లక్ష్మీ మిచ్ఛే ద్ధుతాశనాత్,
ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛే న్మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్."

అని మే మెఱింగినవార మగుటంజేసి మోక్షప్రదుఁ డగువిష్ణుని యంశచేత నవతరించినరాజునకు సాయము చేయుట కుపక్రమించితిమి. ఇంతకన్న మా కేమికావలెను?

అప. న్యాయ—"బట్టలు పాతిపెట్టితి" నని యీబిడ చెప్పిన దని తాము భటులతోఁ జెప్పినప్పు డీబిడ యే మన్నది?

పరమానంద యోగి—మఱి యేమియు ననలేదు. ఉన్నసంగతి కేమనఁ గలదు?

అప. న్యాయ—సరియే. చీఁకటిసమయముగదా! అది. అప్పుడు తా మాపీనుఁగు నంతగా నేల గమనించితిరి?

పరమానంద యోగి—మొదటనే చెప్పితిమిగదా "సన్న్యాసులకు ముఖ్యముగా భూతదయ యుండవలయు" నని. అందుచేతనే మాకు గమనించక తీఱినదికాదు.

రాజ్యాంగన్యాయవాది—మఱువిమర్శ లేదు.

రాజ్యాంగలేఖకుఁడు—ఐదవసాక్షి ధన్నాజీరావు.

సేవకుఁడు—సాచ్చి దన్నూజీరావూ! ఊ! ఊ!! సాచ్చి దన్నూజీ రావూ! ఊ! ఊ!!

ధన్నాజీరావు—ఇదిగోనండి వస్తున్నాను.

రాజ్యాంగలేఖకుఁడు—ఇదిగో యీసాచ్చిగూటిలో నిలువఁబడు.

(ఎక్కి నిలువఁబడును.)

నేను జెప్పినట్లే చెప్పుము. “సర్వశక్తియగు భగవంతుని యెదుట నేను జెప్పున దంతయు నిజము. నిజమే యంతయును. నిజము తప్ప నేమియును లేదు.

(అట్లే చెప్పును.)

రాజ్యాంగన్యాయవాది—మీ కేమిపని?

ధన్నాజీ—పట్టుయేపారమండి.

రాజ్యాంగన్యాయవాది—మీయంగడి యెక్కడ?

ధన్నాజీ—నా కొక అంగడంటూ లేదండి. నే నొకూళ్లోనే వుండి యేపారం చేసేవాణ్ణి గానండి. పట్టుబట్టలు మూటగట్టుకుని వూరూరికీ పోయి యీదులంట తిరిగి అమ్ముకునే వాణ్ణండి.

రాజ్యాంగన్యాయవాది—ఓహో! సరిసరి. నీ వీయమ్మ నెప్పుడైనను, ఎక్కడనైనను జూచియున్నావా?

ధన్నాజీ—నేనాండి. నిన్నటిదినం నే నీయమ్మని అల్లాదక్షిణ యీదిలో మూటబుజాన్నేసుకుని తిరుగుతూవుండగా చూశానండి.

రాజ్యాంగన్యాయవాది—నీ కీబిడ కనుపడిన దంటివే. అప్పు డెంత వేళగా నుండును?



ధన్నాజీ—నిన్నటి సాయంకాలమప్పుడండి నాలుగైదు గడియలు పొద్దుంటాదండి.

రాజ్యాంగన్యాయవాది—ఈయమ్మను నీ వేల గమనించితివి?

ధన్నాజీ—యీయమ్మండి నాకాడ నాలుగుమూళ్ళ పట్టుగుడ్డకొన్నాదండి. అంచేత గమనించానండి.

రాజ్యాంగన్యాయవాది—అమ్మగా మిగిలిన పట్టుగుడ్డ నీదగ్గర నున్నదా?

ధన్నాజీ—లేదండి. మిగతావున్న పట్టుగుడ్డంతా యీవూరికావలోళ్ళు పుచ్చుకున్నారండి.

రాజ్యాంగన్యాయవాది—ఈయమ్మ కమ్మఁగా మిగిలినగుడ్డ యెన్నిమూర లుండును?

ధన్నాజీ—యీయమ్మకేవచ్చండి మొదట్నే నాలుగుమూళ్ళమిక్కమ్మినానండి. తతిమ్మా యిరవైమూళ్ళగుడ్డా అలాగే వున్నాదండి.

రాజ్యాంగన్యాయవాది—ఆమాదిరిబట్ట యిచ్చట నున్నదేమో చూడు.

ధన్నాజీ—చూశానండి. ఇదిగో వున్నాదండి.

రాజ్యాంగన్యాయవాది—(గుడ్డచూపి) ఇదియేకదా నీ వమ్మితి నన్నముక్క. బాగుగాఁ జూడు.

ధన్నాజీ—అవునండి. ఇదేనండి నే నాయమ్మ కమ్మినపట్టుగుడ్డ.

రాజ్యాంగన్యాయవాది—ఇదేనా నీ వమ్మఁగా మిగిలినగుడ్డ?

ధన్నాజీ—అవునండి. ఇదేనండి మిగతాగుడ్డ.

రాజ్యాంగన్యాయవాది—నీ వాయమ్మ కమ్మిన తరువాత నాగుడ్డ మరల నెచ్చటనైనను జూచితివా?

దన్నాజీ—చూశానండి.

రాజ్యాంగన్యాయవాది—ఎక్కడఁ జూచితివి?

ధన్నాజీ—వూరికావలిబంట్రోతులు ప్రేతవిచారణ చేసేటప్పుడండి ఆశవంమీాదుండగా చూశానండి.

రాజ్యాంగన్యాయవాది—సరి. చాలును.

(కూర్చుండును.)

ఎదురువిమర్శ.

అప. న్యాయ—వీథులలోఁ దిరిగి పట్టుగుడ్డ లమ్ముకొనుటా నీపని?

ధన్నాజీ—అవునండి.

అప. న్యాయ—ఇంకను నీ వీయూరిలో నెవరెవరికి గుడ్డ లమ్మియున్నావు?

ధన్నాజీ—వొగరికన్న మాటేవిఁటండి. చాలామంది కమ్మినానండి. యెవరెవరికమ్మినా వనడిగితే యిప్పుడు నేనేం చెప్పగలుగుదునండి.

అప. న్యాయ—మంచిది. ఈయమ్మనుమాత్రమే నీ వెందుకు జ్ఞాపకముంచుకొంటివి?

ధన్నాజీ—నాకాడ గుడ్డలు కొన్నవారిపేర్లు చెప్పమంటే నావల్లకాదుగానండి మనిసిని చూస్తే కొన్నవారో కొనని వారో పోల్చగలనండి.

అప. న్యాయ—(మఱొకమాదిరిపట్టుగుడ్డ చూపి)ఇది నీ వమ్మినపట్టే కదా!

ధన్నాజీ—(కొంచెము సేపు నిదానించి చూచి) కాదండి. ఇది నే నమ్మలేదండి. అల్లదిమాత్రవేఁ నే నమ్మిన పట్టుగుడ్డండి.

అప. న్యాయ—ఇంతకుముందు సాక్ష్యము చెప్పినవారిలో నెవరైనను నీకుఁ దెలిసినవా రున్నారా? లేక వారిలో నెవరైనను నీయొద్దను పట్టుగుడ్డ కొన్నారా?

ధన్నాజీ—నే నెవర్నీ యెరగనండి. నాకాడ నెవరూ కొన్లేదండి.

అప. న్యాయ—సరి. చాలును.

(కూర్చుండును.)



రాజ్యాంగలేఖకుఁడు—ఆఅవసాక్షి యూరికావలి రంజిత్ సింగ్.

సేవకుఁడు—సాచ్చి వూరుకావలి రంజీత్ చింగూ ఊఁడూ! సాచ్చి వూరుకావలి రంజీత్ చింగూ ఊఁ! ఊఁ!!

రంజీత్ సింగ్—ఇదుగో వున్నానండి.

సేవకుఁడు—యీసాచ్చిగూట్లో యెక్కండి.

(ఎక్కి నిలువఁబడును.)

రాజ్యాంగలేఖకుఁడు—చెప్పు. "సర్వశక్తి యగుభగవంతుని యెదుట నేను జెప్పునదంతయు నిజము. నిజమే యంతయును. నిజము తప్ప వేఱులేదు."

(అట్లే చెప్పుచున్నాఁడు.)

ఆరక్షకభటుల విమర్శ.

రాజ్యాంగన్యాయవాది—నీ కేమిపని?

రంజీత్ సింగ్—నే నీవూరికావలివాండ్రలో నొకణ్ణండి.

రాజ్యాంగన్యాయవాది—బిడ్డఁ డెప్పటినుండి యగపడలేదు? అది నీకెట్లు తెలిసినది?

రంజీత్ సింగ్—నిన్నటిసాయంకాలం మాయజమాని చెప్పగా తెలిసిందండి.

రాజ్యాంగన్యాయవాది—నీయజమాని యేమని యుత్తరవు చేసినాఁడు?

రంజీత్ సింగ్—నలుగురూ నాలుగుదిక్కులకూ పోయి వెతికిబిడ్డడిజాడ కనిపెట్టిరండని మాకుత్తర విచ్చినారండి.

రాజ్యాంగన్యాయవాది—నీతో నింకెవ రెవరు వచ్చిరి?

రంజీత్ సింగ్—రంబాల్ సింగు అనే ఆయనొకరుమాత్రవేఁ నాతో వొచ్చారండి.

రాజ్యాంగన్యాయవాది—మీరిద్దఱును వెళ్ళి మొట్టమొదట నేమి చేసితిరి?

రంజీత్ సింగ్—వూరంతా వెతికి చూశావఁండి.

రాజ్యాంగన్యాయవాది—తరువాత నేమిచేసితిరి?

రంజీత్ సింగ్—తరవాతండి మాకో ఆసోకీ సిక్కిందండి. ఆపెకారంగానే మావిద్దరవూఁ కలిసి వొకబత్తుడింటికి పోయినావఁండి. అక్కడ యీనేరస్థురాలు బిడ్డణ్ణెంటబెట్టుకుని వచ్చి నగలన్నీ తీసిచ్చినట్టు తెలియవచ్చిందండి. యెంటనే మావాఁనగలన్నీ పుచ్చుకున్నావఁండి.

రాజ్యాంగన్యాయవాది—తరువాత నేమిచేసితిరి?

రంజీత్ సింగ్—ఆయెనక బత్తుణ్ణెంటబెట్టుకుని వూరంతా సుట్టిసుట్టి యెతిగినావఁండి. కడాపటికి వుత్తరందిక్కుగా పోయేదోవలో యీయమ్మ శవంగా వున్న బిడ్డణ్ణి చేతుల్లో యెట్టుకోని పాతిపెట్టడానికి యత్నం సేస్తా వున్నాదండి. అప్పుడే మాం పట్టుకున్నావఁండి.

రాజ్యాంగన్యాయవాది—అటుతరువాత నేమి జరిగినది?

రంజీత్ సింగ్—యీనేరస్తురాల్ని పట్టుకోని "యీ బిడ్డడిగుడ్డలే" యనడిగినావఁండి. మా వెఁంతడిగినా సెప్పిందే గాదండి. యింతట్లో అక్కడికో సన్నాసిగా రొచ్చినారండి. ఆయన నేరస్తురాల్ని దూరంగా పిల్చుకోనిపోయి యేవోఁ అడిగినారండి. అప్పు డాయమ్మ తాను గుడ్డలు పాతిపెట్టినచోటు సూపించేసిందండి. యెంటనే మాం తవ్వితీసినావఁండి.

రాజ్యాంగన్యాయవాది—అటుపిమ్మట నేమిజరిగినది?

రంజీత్ సింగ్—ఆయెనకనండి అక్కడున్నసొచ్చుల్నీ నేరస్తురాల్నీ యెంటబెట్టుకోని సచ్చిపోయినబిడ్డణ్ణి ఆబిడ్డడిగుడ్డలు నగలు తెచ్చి



మాయజమాని కొప్పసెప్పినావఁండి. వారు రాననగరికి తీసుకుపోయి ప్రేతవిచారణ చేశారండి. అక్కడ మారాజావారు ఆరిదగ్గిరున్నోళ్ళు అంతా ప్రేతంగావున్న బిడ్డడు రాజుగారిబిడ్డడే అంటాసెప్పినారండి. గుడ్డలూ నగలూకూడా ఆబిడ్డడివే అన్నారండి.

రాజ్యాంగన్యాయవాది—ఆనగలును గుడ్డలును నిపు డెక్కడ నున్నవి?

రంజీత్ సింగ్—అవన్నీ యిద్గో యీరాజాంగలేఖకుడుగారిబల్లమీదున్నవేనండి.

రాజ్యాంగన్యాయవాది—సరి. చాలును.

(కూర్చుండును.)

ఎదురు విమర్శ.

అప. న్యాయ—మహారాజావారిబిడ్డఁ డగపడలేదు కాఁబట్టి యాబిడ్డని గనిపెట్టవలయు నను నక్కఱ నీకధికముగాఁ గలదు గదా!

రంజీత్ సింగ్—అవునండి. నాకు కలదండి.

అప. న్యాయ—మఱొకరిబిడ్డఁ డగపడకుండినప్పుడు నీవు పడవలసిన ప్రయాసముకంటెను నీవిషయమై యెన్నోమడుఁగు లధికముగాఁ బ్రయాసముపడి యుండవలెను గదా?

రంజీత్ సింగ్—అవునండి.

అప. న్యాయ—అందుల కేమికారణము?

రంజీత్ సింగ్—మారాజావారిబిడ్డడు గనకనే అంతశమ పడవలసొచ్చిందండి.

అప. న్యాయ—"దీనిని గనిపెట్టినయెడల రాజ్యాంగమునందు మంచిపేరును, ఎక్కువయుద్యోగమును పొందనచ్చును" అనునమ్మకము చేతనే కదా నీవంతగా శ్రమపడవలసివచ్చినది?

రంజీత్ సింగ్—అలాటియోచనేవీఁ లేదండి. మాపని మాం సరిగ్గా సేయాలనే యోచనమాత్రవేఁ గలిగిందండి.

అప. న్యాయ—నీవు చేయుపని యేమిటి?

రంజీత్ సింగ్—వూళ్ళో యెవురయినా తప్పు సేస్తే దాన్ని వున్నదున్నట్లుగా తెల్సుకోని మాయజమానిగారితో సెప్పడవేఁ మాపనండి.

అప. న్యాయ—మీరు పట్టుకొన్న నేరములో ముద్దాయీ శిక్షింపఁబడినయెడల మీకు జయము గలిగినట్లుగదా తలంతురు?

రంజీత్ సింగ్—అలా యేవీఁలేదండి. నాయం బయటికొస్తే సాల్నండి. అంతే మాతలపండి.

అప. న్యాయ—నీకటువంటితలంపు లేకున్నను మీయజమాని యైనను "ఈనేరమును గనిపెట్టినయెడల గొప్పయుద్యోగము నిప్పించి గౌరవింతు"మని చెప్పకుండ నుండునా?

రంజీత్ సింగ్—అలా మాయజమానిగా రెప్పుడూ చెప్పడం లేదండి.

అప. న్యాయ—ఆసంగతి యట్లుండనీ. "ముద్దాయీపక్షమునం దేమైనను సాక్ష్యముగలదా" అని విచారించితివా?

రంజీత్ సింగ్—లేదండి. మాం విచారించలేద్దు.

అప. న్యాయ—ఎందుకు విచారించలేదు?

రంజీత్ సింగ్—సాక్షులు వొకరున్నా లేరండి. అదోటి. రెండోది నేరంచేసినమనిషి నేరంతోటే దొరికినాదండి.

అప. న్యాయ—ఈముద్దాయీ బిడ్డని హత్యచేయుచుండఁగా నీవు కన్నులారఁ జూచియున్నవా?

రంజీత్ సింగ్—నేను సూడలేదండి.



అప. న్యాయ—ముద్దాయీని నీవు చూచునప్పటికి బిడ్డఁ డేస్థితిలో నున్నాఁడు?

రంజీత్ సింగ్—సచ్చి శవ వఁయి వున్నాడండి.

అప. న్యాయ—బిడ్డనిగుడ్డలు పాతిపెట్టినట్లు నీతో ముద్దాయీ తానే యొప్పుకొన్నదిగదా!

రంజీత్ సింగ్—ముద్దాయి వొప్పుకోలేదండి. ముద్దాయీ సన్నాసిగారితో సెప్పిందండి. మాతో ఆసన్నాసిగారే సెప్పినారండి.

అప. న్యాయ—అప్పుడు మీరు ముద్దాయీపక్షమున సాక్ష్యములను విచారించియున్నచో నిప్పు డేర్పడినవిషయములకు మాఱుగాఁ గొన్నియంశము లేర్పడియుండవచ్చునుగదా.

రంజీత్ సింగ్—మారుగానూ వుండొచ్చునండి. అనుకూలంగానూ వుండొచ్చునండి.

అప. న్యాయ—మాఱుగాఁగానీ యేర్పడినయెడల నభియోగము చెడిపోవు ననుతలంపుచేత నేకదా అట్లు మీరు విచారించుట మానివేసితిరి?

రంజీత్ సింగ్—అబియోగం సెడిపోతుందని గాని బాగుపడుతుందని గాని మాకు తలపేలేదండి. నిజవేఁర్పడితే అంతే సాల్ననే మాం తలసుకున్నావండి.

అప. న్యాయ—అట్లయినచో ముద్దాయీపక్షమున మీ రేల సాక్ష్యములను విచారింపమానితిరి?

రంజీత్ సింగ్—సాక్ష్యము లున్నాయని మాకు తెలియనే లేదండి.

అప. న్యాయ—సాక్ష్యము లున్నవని ముద్దాయీ మీతోఁ జెప్పుటలేదా?

రంజీత్ సింగ్—మాతో ముద్దాయీ సెప్పలేదండి.

అప. న్యాయ—మీరు ముద్దాయీని పట్టుకొన్నప్పు డామె మీతో నేమి చెప్పినది?

రంజీత్ సింగ్—“నేనేపాపమును నెఱుఁగను. నా కేమియును దెలియదు” అన్నాదండి.

రాజ్యాంగన్యాయవాది—ఈసాక్షియే కాక మఱొక సాక్షి గూడఁ గలఁడు. ఆసాక్షియు నీసంగతినే తెల్పును గనుక న్యాయాధిపతికిని మధ్యవర్తులకును వ్యర్థముగా శ్రమ కలుగకుండ నుండుటకై యా సాక్షిని విచారింపక వదలుచున్నాము. ఇష్టమున్నచో నాసాక్షిని గూడ నెదురువిమర్శ చేసికోవచ్చును.

ఎదురువిమర్శ.

అప. న్యాయ—నీపేరు రంబాల్ సింగా?

రంబాల్ సింగ్—అవునండి.

అప. న్యాయ—బిడ్డఁడు ముద్దాయీదగ్గర నుండఁగా నీ వెప్పుడు చూచితివి?

రంబాల్ సింగ్—ముద్దాయీని మాం పట్టుకున్నప్పుడే సూసినావండి.

అప. న్యాయ—అప్పుడు మీతో నింకెవ్వరైనను గలరా?

రంబాల్ సింగ్—యేలాయుధాసారనే బత్తు డొక్కడే వున్నాడండి.

అప. న్యాయ—పట్టుకొన్నప్పుడు మీరు ముద్దాయీని విచారించితిరా?

రంబాల్ సింగ్—విచారించినావండి.

అప. న్యాయ—అప్పుడు ముద్దాయీ యేమిచెప్పినది.

రంబాల్ సింగ్—“నేనేపాపమును నెఱుఁగను” అన్నమాటే యెంతడిగినా సెప్పేదండి.



అప. న్యాయ—ముద్దాయీయొద్ద బిడ్డఁడు బ్రతికియున్నట్టుగాఁగాని, ముద్దయీ బిడ్డనిదేహమునుండి నగలు, గుడ్డలు తీసినప్పుడుగాని నీవు ప్రత్యక్షముగాఁ జూచియుండలేదు గదా!

రంబాల్ సింగ్—నేను చూడ్డం లేదండి. ఆసంగతంతా సాక్ష్యంమీదనే తెలుసుగున్నావండి.

అప. న్యాయ—ముద్దాయీపక్షమున సాక్షులను వెదకి మీరేల వాఙ్మూలము పుచ్చుకోలేదు?

రంబాల్ సింగ్—సాక్షు లున్నారని మాకు తెలవడవేఁ లేదండి.

అప. న్యాయ—ముద్దాయీని మీరు పట్టుకొన్నది మొదలుకొని మీతో నేమైనను జెప్పుచు వచ్చినదా?

రంబాల్ సింగ్—“నా కేమియుఁ దెలియదు. నేనేమీచేయలేదు” అన్న మాట తప్ప వేరే మాతో యేవీఁ అనలేదండి.

అప. న్యాయ—ముద్దాయీ నేరముచేసిన దని యేర్పాటయినచో మీ కనుకూలమేకదా!

రంబాల్ సింగ్—మాకనుకూలవూఁ లేదండి, పెతికూలవూఁ లేదండి.

అప. న్యాయ—అట్లయినచో మీయభిప్రాయ మేమిటి?

రంబాల్ సింగ్—నిజం యేర్పడ్డవేఁ మాఅబిప్రాయంగానండి మరేవీఁ లేదండి.

అప. న్యాయ—పట్టువ్యాపారము చేయువానిని మీ రెక్కడఁ గనిపెట్టితిరి?

రంబాల్ సింగ్—మాం కనిపెట్టలేదండి. ఆయనంతటాయనే వొచ్చి సంగతి చెప్పినాడండి.

అప. న్యాయ—ఏమని చెప్పినాఁడు?

రంబాల్‌సింగ్—“నిన్న సావద్ద యీయమ్మ నాలుగుమూరలపట్టుగుడ్డ కొన్నారే. ఆయమ్మనా యిలాఅల్లరి చేస్తూవున్నారు?” అన్నాడండి.

అప. న్యాయ—అట్టికాలమందునఁ బట్టుగుడ్డ వానిదగ్గర నున్నదా?

రంబాల్‌సింగ్—లేదండి.

అప. న్యాయ—తరువాత నేమిచేసితిరి?

రంబాల్‌సింగ్—ఆ తరవాతనండి ఆగుడ్డముక్క, అతఁడిదగ్గిరున్న గుడ్డముక్కతో సరిపెట్టి సూసినావఁండి. సరిగ్గానే వున్నాదండి. అంచేత ఆ రెండూ తీసిపెట్టుకున్నావఁండి.

అప. న్యాయ—సరి. చాలును.

(కూర్చుండును.)

రాజ్యాంగ న్యాయవాది—మఱువిమర్శ యక్కఱలేదు.

అప. న్యాయ—(మధ్యవర్తులను జూచి) ఆర్యులారా! ఇప్పుడు రాజ్యాంగన్యాయవాదిగారి పక్షమున వచ్చిన సాక్షులు చెప్పిన యంశములలో ముఖ్యముగా రెండంశములు గమనింపవలసి యున్నవి. ఆ రెండును బైని గనఁబఱచిన సాక్షులు చెప్పినయంశముల కనుకూలించి యున్నచో నేరము స్థిరపడును. మారుపడ్డచో సాక్షులు చెప్పినమాటలన్నియు నసత్యము లగును. అప్పుడు ముద్దాయీమీఁదను నేర మారోపించుటకు వీలుండదు. ఆ రెండంశములును నెవ్వి యనఁగా:—మొదటిది “బిడ్డఁడు రాచనగరిలో నగపడని సమయమున ముద్దాయీ యెక్కడ నున్నది?” అనియు, రెండవది “కాళికాదేవి గుడిదగ్గర ముద్దాయీ ప్రార్థనచేసినదా” అనియును. ఈ రెండంశములే యీయపరాధమున కాధారములు. ముద్దాయీపక్షపుసాక్షులవలన నీరెండును ననుకూలించినచో నిపు



డీసాక్షులు చెప్పిన దంతయు నసత్యమే యగును. కాలనిర్ణయమునకై యిద్దఱుసాక్షులును, కాళికాదేవిని ప్రార్థించినదియు లేనిదియుఁ దెలియుటకై యొకసాక్షియు నేర్పడియున్నారు. వారిటు పయిని సాక్ష్యము చెప్పుదురు. ఆవిషయమును గూడ మీరు పర్యాలోచించి పిమ్మట మే మెత్తి చెప్పువిషయములను, వెనుక రాజ్యాంగన్యాయవాదిగారి యభిప్రాయమును జక్కఁగా నాలోచించి మీ యభిప్రాయమును బ్రకటింతురుగాక. (సేవకునిజూచి) కాలకంఠుఁడుగారిని బిలువుము.

సేవకుఁడు—సాచ్చి కాలకంటుడుగారూ ఊ ఊ! సాచ్చి కాలకంటుడుగారూ ఊ! ఊ!!

కాలకంఠుఁడు—ఇదుగో వచ్చాను.

రాజ్యాంగ లేఖకుఁడు—స్వామీ! యీగూటిలో నెక్కి నిలువఁబడుఁడు.

(కాలకంఠుఁ డెక్కుచున్నాఁడు.)

అయ్యా! నేను జెప్పినట్లు చెప్పఁడు. సర్వశక్తియగు భగవంతునియెదుట నేను జెప్పునదంతయు నిజము. నిజమే యంతయును. నిజముతప్ప మఱేమియును లేదు.

(అట్లే చెప్పుచున్నాఁడు.)

అప. న్యాయ—అయ్యా! మీ కెట్లుజీవనము?

కాలకంఠుఁడు—నాకు సుకజీవనమేను.

అప. న్యాయ—ఈయమ్మ యెవరు?

కాలకంఠుఁడు—ఇది మాయింట్లో బానిసపనిచేసే మనిషి.

అప. న్యాయ—ఈయమ్మ మీయింటియొద్ద నెన్నాళ్ళనుండి బానిసపడి యున్నది?

కాలకంఠుఁడు—యెన్నాళ్లో కాలేదు. అంతా స్వల్పకాలవేఁ అయింది. వోవారవఁవుతుంది.

అప. న్యాయ—నిన్నటిదిన మీయమ్మ బయటికిఁ బోవుటకు మీ రనుమతించితిరా?

కాలకంఠుఁడు—అవును. అనుమతిచ్చాను.

అప. న్యాయ—మీ రనుమతించితి నంటిరే అప్పు డెంతవేళగానుండును?

కాలకంఠుఁడు—పరవఁట నాలుగ్గళ్ళ పొద్దుంఛుంది గాబోల్ను.

అప. న్యాయ—బాగుగా గమనించి చెప్పుఁడు. ఈయమ్మ మీయింటి నుండి బయటికిఁ బోవునప్పుడు వెలుతు రున్నదా లేదా?

కాలకంఠుఁడు—వెలుతు రెలావుంఛుందీ? అస్తమానం కాలేదు. అందుకు ముందాత్తిగానే బయటికి పోయింది.

అప. న్యాయ—ఎచ్చటికిఁ బోవుటకు మిమ్ముల నుత్తర వడిగినది?

కాలకంఠుఁడు—దీన్తోకూడా దీనికొడుకున్నూ మాయింట బానిసపడి వుండేవాడు. వాణ్ణి నేను యిరుగుపొరుగుపిల్లాళ్ళతోకూడా అడివికి పంపేను. అక్కడ వాణ్ణి పాంగరిచింది చచ్చాడు అని వాళ్ళు దీన్తో చెప్పేరవ! అందుగ్గాను నన్ను వుత్తరవడిగింది.

అప. న్యాయ—ఆబాలురు వచ్చి చెప్పునప్పటి కెంతప్రొద్దున్నది?

కాలకంఠుఁడు—ఉదయవైఁ యిరవై గళ్ళవుతుంది.

అప. న్యాయ—ఆబాలు రడవి కెప్పుడు పోయిరి?

కాలకంఠుఁడు—వాళ్ళు పోయేటప్పడికి వుదయవైఁ నాలుగ్గళ్ళపొద్దెక్కివుంఛుంది.

అప. న్యాయ—ఊరి కావలివాండ్రలో నెవరైనను మీయింటికి వచ్చియున్నారా?



కాలకంఠుఁడు—మాయింటి కెవరూ రాలేదు. యిప్పుడు న్యాయస్థానంనుంచి వుత్తర వయిందే కాని అంతకుమునుపు నాకేవీఁ తెలియనే తెలియదు.

అప. న్యాయ—మహారాజావారి పుత్త్రుఁడు చనిపోయినవాఁ డనఁగానే మీకు వ్యసనమే కదా!

కాలకంఠుఁడు—వొక్కనాకే అన్నమాటేవిఁటీ? వూరందరికీ వెసనవేఁను. అందులోనూ నాకు మరీ వెసనంగా వుంది. యేవఁంఛారా బోలెడుసొమ్ము గుమ్మరించి కొనుక్కున్నమనిషి యిలాగయిపోయింది. ఆపిల్లాడు చావనే చచ్చాడు. మాకొంపంతా మాపీశాడు. మాకొచ్చిన నష్టంసంగతి యెవరితో చెప్పుకోము?

రాజ్యాంగన్యాయవాది—ఎదురువిమర్శ యక్కఱలేదు.

అప. న్యాయ—రెండవసాక్షి కాలకంఠి.

సేవకుఁడు—సాచ్చి కాలకంటీ ఈ! ఈ!! సాచ్చి కాలకంటీ ఈ! ఈ!!

కాలకంఠి—(వచ్చి) యింతమంది మొగాళ్ళుండగా నేనెలా రావడం?

రాజ్యాంగలేఖకుఁడు—అమ్మా! యీగూటిలో నెక్కి నిలువఁబడవలయును. (అట్లుచేయును) అమ్మా! నేను జెప్పినప్రకారముగానే చెప్పవలయును. “సర్వశక్తి యగుభగవంతుని యెదుట నేను జెప్పినదంతయు నిజము. నిజమే యంతయును. నిజముతప్ప మతేమియును లేదు.

(మెల్లఁగా నట్లే చెప్పుచున్నది.)

అప. న్యాయ—అమ్మా! మీ పేరేమిటి?

కాలకంఠి—అయ్యయ్యో! యెలా వున్నాది గదా! నేనెలా చెప్పేది? అది మాయింటాయనపేరు గందా!

అప. న్యాయ—అందుల కేమియు దోషములేదు. న్యాయస్థలము నందుఁ జెప్పవచ్చును.

కాలకంఠి—ఆయనపేరే నాపేరున్నూ. కడవర్ని టి అంటే సరిపోతుంది.

అప. న్యాయ—కాలకంఠిగారా?

కాలకంఠి—అవును. అలాగే నన్నంతా పిలుస్తారు.

అప. న్యాయ—(చంద్రమతిని జూపి) అమ్మా! యీయమ్మ యెవరో మీరెఱుఁగుదురా?

కాలకంఠి—అయ్యో! నాకా తెలియదు? యెలా మారిపోయిందో చూశావా? అది మాయింట్లో బానిసిదిగాదూ?

అప. న్యాయ—ఈయమ్మ నిన్నటిదినము దీపములు పెట్టినతరువాత నెన్నిగడియలకు మీయింటినుండి బయటకుఁ బోయినది?

కాలకంఠి—దీపాలు పెట్టకమునుపే మమ్మల్నడిగే పోయింది.

అప. న్యాయ—ఎంతపొద్దుండునో చెప్పఁగలరా?

కాలకంఠి—దీపా లింకా నాలుగ్గళ్ళకు పెడతారనగా ముందర్నే.

అప. న్యాయ—ఈయమ్మ మీయింటిలోనిపనికత్తె యున్నారుగదా! యీబిడగుణము నడవడి యెట్టివో యెఱుఁగుదురా?

కాలకంఠి—యిప్పుడిప్పుడే కదా వచ్చింది మాకొంపకి. ఆయువడారం వారంరోజులయిందో లేదో దానిగుణాలు నడవడికలు మాకప్పుడే యేం తెలుస్తాయి? యింట్లో పనిపాట్లు చేసుగుంటూ “ఇదేమికష్టముగా నున్నది. ఎట్లయినను వీరిఋణముతీర్చివేసి బానిసతనము నుండి విడుదలకావలయును” అని మాత్రం అస్తమానం గొణుక్కుంటూనే వుండేది. “అలాగే చెయ్యే అమ్మా! యెవరొద్దన్నారు?” అని నేనున్నూ అంటూవుండేదాన్ని.

అప. న్యాయ—సరి. చాలును.

(పోవుచున్నది.)



తరువాతను కాళిదాసును బిలువుము.

సేవకుఁడు—సాచ్చి కాలిదాసూ ఊ! సాచ్చి కాలిదాసూ! ఊ!! ఊ!!!

(వచ్చుచున్నాఁడు.)

రాజ్యాంగలేఖకుఁడు—ఈగూఁటలో నెక్కి నిలువఁబడుము.

(అట్లే చేయును.)

సర్వశక్తియగుభగవంతునియెదుట నేను జెప్పున దంతయు నిజము. నిజముతప్ప వేఱేమియు నుండదు.

(అట్లే చెప్పును.)

అప. న్యాయ—అయ్యా! మీ కేమిపని?

కాళిదాసు—నే నొకయాత్రికుఁడను. ప్రతియూరికిని బోయి యచ్చటచ్చట వుండే కాళికాదేవాలయములు దరిసెనం చేస్తూవుంటాను.

అప. న్యాయ—నిన్నటిరాత్రి యెచ్చట బస చేసితిరి?

కాళిదాసు—నే నెప్పుడూ కాళికాఅమ్మావారి ఆలయంలోనే బసచేసేవాడుక. అలాగ్గానే నిన్నటిరాత్తిరిగూడా కాళికాఅమ్మావారి గుళ్ళోనే బసచేశాను.

అప. న్యాయ—నిన్నటిరాత్రి యెప్పుడుమొదలుకొని యెప్పటివఱకును నచ్చట నుంటిరి?

కాళిదాసు—సాయంకాలం మొదలు తెల్లారీదాకా అక్కణ్ణే వున్నాను.

అప. న్యాయ—నిన్నటిరాత్రి యచ్చట నేమి జరిగినది?

కాళిదాసు—తొలీజావఁప్పుడు అమ్మావారికి పూజలన్నీ జరిగనవి. తరవాత యెవరో వోఆడది అమ్మావారిగుడిదగ్గిర కొచ్చి “అంబా! సమవయస్కుండగునొకరాజకుమారుని దెచ్చి నీకు బలియిచ్చెదను. నాకుమారునికి జీవబిక్ష యిప్పించుము” అని వేడుకుంది.

అప. న్యాయ—అప్పు డెన్నిగడియ లయి యుండును?

కాళిదాసు—రాత్రిరి సుమారుగా సగమైఁ వుంటుందని తోస్తుంది.

అప. న్యాయ—ఆస్త్రీతో మఱెవరున్నారు?

కాళిదాసు—మఱెవరూ కూడా లేరు. ఆయమ్మ వొకర్తే వచ్చింది.

అప. న్యాయ—ఆస్త్రీ యెవరో మీ రానవాలు పట్టఁగలరా?

కాళిదాసు—ఇదుగో యిక్కణ్ణిలుచున్నాదే. యీయమ్మేను.

అప. న్యాయ—సరి. చాలును.

(కూర్చుండును.)

### ఎదురువిమర్శ.

రాజ్యాంగన్యాయవాది—ఆయమ్మ వేఁడుకొన్నసంగతి మీకెట్లు తెలిసినది?

కాళిదాసు—నే నప్పు డాగుళ్ళో వోమూలని పడుకుని విన్నాను. కాఁబట్టి ఆవిడన్నమాటలన్నీ నాకు స్పష్టంగా వినపడ్డాయి.

రాజ్యాంగన్యాయవాది—మగవాఁడే యన్నాడో? ఆఁడుదే యన్నదో మీ రెట్లు పోల్చఁగలిగితిరి?

కాళిదాసు—పొట్టపొగల్లాగ దీపాలు వెలుగుతూవున్నాయి కనక బాగా మనిషే కనపడ్డాది.

రాజ్యాంగన్యాయవాది—ఆయమ్మను మరల నెక్కడ నైనచు జూచితిరా?

కాళిదాసు—ఇదుగో యిక్కడ చూస్తూనే వున్నానే. యిది రెండో మాటు చూడ్డం.

రాజ్యాంగన్యాయవాది—సరి, చాలును.

(కూర్చుండును.)



### మఱువిమర్శ.

అప. న్యాయ—అయమ్మ యప్పు డెటువంటిబట్ట కట్టుకొన్నదో చెప్పఁగలరా?

కాళిదాసు—ఇదుగో యిప్పుడు కట్టుకున్నబట్టే అప్పుడూ కట్టుకుని వున్నది.

అప. న్యాయ—(మధ్యవర్తులనుగూర్చి) ఆర్యులారా! ఇప్పు డీయిద్దఱు సాక్షులును జెప్పినయంశములు బాగుగా విన్నారు గదా! మే మాసంగతులన్నియు నొకటిగాఁ జేర్చి యందేర్పడియున్న సాధక బాధకములగు విషయములను జూపి సమాధానము చెప్ప మొదలిడ వలసియున్నది. పిమ్మటఁ జెప్పుటవలన ననుకూలముగాను మొదటఁ జెప్పినచోఁ బ్రతికూలముగాను నుండు ననుట తెలిసినయంశమే కదా! యెందుల కనఁగా:—న్యాయస్థలముయొక్క నిబంధనల చొప్పున మేమే ముందు చెప్పవలయును. అట్లే మేము క్రోడీకరించి చెప్పుటకు ముందుగా మీరు మొట్టమొదటఁ జేసియున్నప్రమాణ మేదిగలదో దానిని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాము. మీరు మధ్యవర్తులుగా నుండి సత్యమును గ్రహించి చెప్పుట మీయుత్తరవాద మని చక్కఁగాఁ దెలిసికొనియే యుందురు. ఈవిషయమై సర్వశక్తియగు భగవంతునియెదుటను బ్రమాణము చేసి యాయనయనుగ్రహమును వేఁడుకొన్నవారుగదా! ఇదిగాక మహారాజావారు తమ పుత్త్రరత్నమును బోఁగొట్టుకొన్నయంశమువిషయమున వ్యసనము మనయందఱకును సమానమే. అయినను న్యాయస్థానమునందు నయినవారును గానివారును నన్నమాటల ననుసరించి తీర్పు చెప్పుట యెట్టివారికిని సాధ్యము గాదు. ధనవంతులు, దరిద్రులు, పండితులు, పామరులు, అల్పులు, ఘనులు మొదలగువారికందఱ

కును జట్టు మొక్కటియే. శిక్షయు నొక్కవిధముగానే యుండును. అట్లగుటం జేసి యిందలి హెచ్చుతక్కువలనుగూర్చి పర్యాలోచింపక న్యాయప్రవర్తనమున కనువైనమార్గమునుమాత్ర మాలోచించి తీర్పు సెప్పవలసియున్నది. మీకు మాటమాత్రముతో సరిపోవును గాని ముద్దాయీకిఁ బ్రాణనష్టమువఱకును బరిణమించును. కావున నిందువలనఁ గలుగుపాపాపకీర్తులనుసైతము బాగుగా జ్ఞప్తియందుంచుకొని మఱియుఁ దీర్పుచెప్పుదురుగాక. మీ రీవిషయమై బాగుగా దీర్ఘాలోచనమును జేయుఁడు. ఇఁక నీయభియోగమునందలి యంశములను జెప్పెదము వినుఁడు. ఇప్పుడిచ్చటికి వచ్చి సాక్ష్యము చెప్పినవారందఱును నీనగరమునందే వసించువారుగాఁ గానరాదు. తన యేకపుత్త్రుఁడు మృతినొందఁగా శవసంస్కార మొనర్చుటకు గతిలేక యుండఁగా మఱొకరిబిడ్డని జంపుట కెట్టివారికిని మనస్సురాదు. మఱియు నీహత్య చేయుటకుఁ దగినకారణాంతరములును గానరావు. ఒకవేళ నట్లేర్పడినట్లు గనఁబడినను దానిటువంటిదుఃఖమునందు మునిఁగియుండఁగా "చేసియుండవచ్చును" అని యాలోచించుటకును వీలు చాలదు. ఇప్పుడు చెప్పినసాక్షు లందఱును మహారాజావారిపుత్త్రుఁడు గదా యనువేదనముతోఁ జెప్పినట్లే యగపడుచున్నది. ఈసంగతి మీ రందఱును జక్కఁగా గమనించినయంశము గానే యుండవచ్చును. ఈయమ్మను మిగుల గొప్పమొత్త మిచ్చి కొన్నవారుసైతమును విరుద్ధముగా సాక్ష్యము చెప్పునంశముకంటె వేఱె యేమిదృష్టాంతము గావలయును? ఈవిషయమై యూరికావలివాండ్రు మిగుల శ్రమపడి వారివారికి బాగుగా నేర్పియున్నట్లే స్పష్టపడుచున్నది. ఒక్కొక్కరొక్కొక్కయంశమును జెప్పి యభియోగపత్రమును సంపూర్తి చేసినట్లు వారు చెప్పినసాక్ష్యముల



చేతనే చక్కఁగాఁ దెలియవచ్చుచున్నది. ముద్దాయీ యేమియును జెప్పకుండుటకుఁ గారణ మేమనఁగా హఠాత్తుగాఁ దనమీఁదఁ బెద్దయపకీర్తి వచ్చిపడినదే "తలమునిఁగి మూరెఁడుప్రవాహమువచ్చిననేమి బారెఁడుప్రవాహమువచ్చిననేమి" అన్నసామెతగా స్తబ్ధురాలై యూరకున్నది యనువిషయము మీమీమనస్సుల కిదివఱకే గోచరమై యుండవచ్చును. సర్వసంగపరిత్యాగ మొనర్చుకొన్నసన్న్యాసి యిట్లు న్యాయస్థానమునకు వచ్చి సాక్ష్యము చెప్పుటయనునది మిగులఁ గానిపనిగదా! యిదివఱకీయభియోగమునందలి యథార్థాంశముల నొకరీతిగా సంక్షేపించి వ్యక్తపఱిచితిమి. ఇఁక దీనికి సంబంధించిన చట్టమువిధులంగూర్చికూడఁ గొంచెము, చెప్పెదము.

అన్నినేరములలోనను మిగులఁ బ్రధానమయిన "హత్య" యను నేరమును జేసినయొకనిని విచారించుటలోఁ బ్రత్యక్షముగాఁ గనులారఁ జూచినవారిసాక్ష్యములు లేనిచో ననుమాన సాక్ష్యములం గొని తగవు జరుపవలసి యున్నది. అట్టి సందర్భములయం దనుమానసాక్ష్యములు ముద్దాయీపైని నేరమును దృఢముగా స్థాపించుటమాని మఱేవిధమయిన సందేహమునకుఁగాని చోటిచ్చునవి గాలేక యుండవలయును. అట్లేదేని సందేహమున కాస్పదమయినచో నభియుక్తుఁడుగా నేర్పడిన హత్యజరిగించినవాఁడు మరణదండనకుఁ బాత్రుఁడు గాఁగూడదు. ఈతగవులో నింకొకసందేహము గూడ నిష్పన్నమగుచున్నది. అదేమనఁగా నిప్పుడు మృతినొందిన బిడ్డఁడు ధరించియున్న యాభరణములనెల్ల మూఁడవసాక్షియైన వేలాయుధాచారి యధీనములో నున్నట్లు తెలియవచ్చుటంజేసి యతఁడే యీహత్య చేసి యుండవచ్చును. అందులకు సందేహాస్పద మయినయంశ మేమనఁగా గొప్పవర్తకమును రాచనగళ్లలోఁ

జేయుటయే తన ముఖ్యకార్యముగఁ జెప్పినవాఁడును, వెలగలరత్నాభరణములు విక్రయించుటకై సిద్ధముగా నుండునని చెప్పినవాఁడును, ఈముద్దాయీ తెచ్చియిచ్చిన నగలను దనపద్ధతిమేరకుఁ దాను మార్చుకొన్నట్లుగాఁ నైనను జెప్పక యారత్నములనే యుపయోగించి యాబంగారముతోనే వేఱే నగలు చేసి యిచ్చునట్లొప్పుకొని తీసికొన్నట్లును సాక్ష్యము చెప్పియున్నాఁడు. ఆర్యులారా! మీరందఱును జక్కఁగా గమనించి పర్యాలోచింపవలసినవిషయ మింకొక్కటి కూడఁగలదు. అంత గొప్పవర్తకముచేయునట్టి యొకసంపన్నుఁడు కూలిచేయుట కొప్పుకొనునా? అంతగొప్పమొత్తముమీఁదఁ బెద్ద లాభమున కెదురుచూచువాఁడు కూలిపైకముతో నెట్లు తృప్తి నొందఁగలఁడు? ఇంకను వినుఁడు. "అట్లారక్షకభటులు వేలాయుధాచారియొద్దనున్నవి యాభరణంబులు" అని కనిపెట్టి వాండ్రతనియొద్ద కీనగలు వచ్చుటకుఁ గారణము విమర్శించినచో నీనేరమునంతను నేమియు నెఱుఁగనియాఁడుదానిపై నారోపించి యిట్టిపన్నుగడ పన్ని యుండవచ్చును గాని కల్పనాచాతుర్యధురీణులయి క్షణక్షణమును గ్రొత్తక్రొత్త తగవులను సృష్టిసేయునీకావలివాండ్ర కెంతొధనము నీయాచారి లంచమిచ్చి తన కీసమయమున సాయపడవలసిన దని బ్రతిమాలుకొని యుండవచ్చును. ఇందుల కుపబలముగా నాఱవసాక్షి యైనయూరికావలిభటుఁడు రంజీత్‌సింగనువాఁడు తానును రంబాల్‌సింగను తనతోడిభటుఁడును ముద్దాయీని బట్టుకొన్నకాలమున నీమె యాశవమును బాతిపెట్టుటకుఁ బ్రయత్నించుచున్న దని చెప్పియున్నారు. అట్టిప్రయత్నమున కుపబలముగా సాధనములను గూర్చి తెచ్చుటయును లేదు. పేర్కొనియు నుండలేదు. ఇది భటులాచారికి సాయపడి యుందు రనునంశమునఁ దప్పక పర్యాలో



చింపవలసినముఖ్యాంశము. మఱియును, రెండవసాక్షి యగువీరభద్రసెట్టియును నైదవసాక్షియగు ధన్నాజీరావును వృత్తినిబట్టి చూడఁగాఁ బట్టువ్యాపారము చేయువారుగాఁ గనఁబడుచున్నారు. ఇదియునుగాక, ఆచారివలెనే దేశములందుఁ దిరుగుచుండువాండ్రు. అందయిదవసాక్షి రెండుగజములబట్ట ముద్దాయీకిమాత్రమే విక్రయించి తక్కినబట్టయంతయు భటులయధీనము చేసినయంశములో ముందువెనుకల నెవ్వరికిని నాబట్ట విక్రయింపక మొత్తముబట్టయంతయు నట్టే పెట్టుకొని యుండుటయు విచారణీయాంశమే. కాఁబట్టి యీయిద్దఱుపట్టువ్యాపారులును వేలాయుధాచారిపరికరము లనుటకు సందియ ముండదు. ఇంకను నాలుగవసాక్షియును, కాళిదాసనువతఁడును నిల్లువాకిలిలేనియాత్రికులు. వీండ్రు రాజానుగ్రహమునకుఁ బాత్రులు గావలయు ననియు నారక్షకభటుల పన్నుగడమాటలకు లోఁబడియు, ఆచారివలనఁ గైకొన్న యుపహార విశ్వాసముచేతను బ్రాల్మాలియే యిట్లు సాక్ష్య మిచ్చి రని యూహింపవలసి యున్నది. మఱియు మొదటిసాక్ష్యమువలన బిడ్డఁ డగపడకపోయినకాలము తెలియవచ్చినది. ముద్దాయీ యీబిడ్డని నపహరించుకొనిపోయినట్లుగాని తనయుత్తరోత్తరకార్యసాధనముల కొఱకును బిడ్డనికొఱకును రాచనగరికి రాకపోకలు చేసినట్లుగాని వ్యక్తపడదు. రెండవసాక్షియు నైదవసాక్షియు మూఁడవసాక్షికిఁ బరికరముగా భావింపవలసి యున్నదిగదా! ఇఁక నాలుగవసాక్షియు ముద్దాయీపక్షమున వచ్చినమొదటిసాక్షియు సాక్ష్య మిచ్చుటకు నిరూపింపఁబడినవారుగా నూహింపఁబడుదురు. ఇంక నాఱవసాక్షియు ముద్దాయీయొద్ద బిడ్డఁ డున్నట్లు చెప్పిరిగాని హత్యాజరిగిన దనుటకుఁ బ్రత్యక్షసాక్షులు గారు. "ఆబిడ్డని బాతిపెట్టుట కుప

క్రమించుచున్నది'' అని వారు చెప్పిన యంశములోఁ దత్సూచకము లగుపరికములు లేకుండుటం జేసి యదంతయును గల్పితమే యగును. కాఁబట్టి యనుమానసాక్ష్యములను స్థాపనచేయుటకై కల్పితము చాలదు. మఱియు ముద్దాయీపక్షమున వచ్చిన రెండవమూఁడవ సాక్షులు చెప్పిన చొప్పున నీబిడ దీపములు పెట్టుటకు నాలుగయిదు గడియలు ముందుగానే యుత్తరవును గొనిపోవుటయే నిజమయినచో నీమె తనబిడ్డని మరణవార్తను భరించుకొని రాజపుత్త్రాపహరణమునకై దారికాచి యుండునా? లేక పుత్త్రుని వెదకుటకై యడవికిఁ బోయి యుండదా? ముద్దాయీ కాళికాదేవిని ప్రార్థించిన సమయమువఱకు బిడ్డనినెచ్చట దానియుంచి యుండును? ఇట్లు న్యాయాంశములను క్రమముగాఁ బర్యాలోచింపఁగా ముందు వెనుకలు గోచరింపక చిక్కులఁ బెట్టుచుండును. కాని ముద్దాయీ నేరముచేసిన దనుట కవకాశ మొక్కింతయు నుండదు. ఇంకను ముద్దాయీని దండనకుఁ బాత్రముగాఁ జేయుటయే రాజ్యాంగమువారి భారము గాదు. సరియైనన్యాయమును గనుఁగొని నీతిని స్థాపించుటయే వారి భారమయి యున్నది. కాఁబట్టి రాజ్యాంగన్యాయవాది తన కిష్టులగు కొందఱు సాక్షులనుమాత్రము సంగ్రహించి యెత్తికొనుట న్యాయపద్ధతి కెంతమాత్రమును ననుకూలించునది గాదు. తమ కనుకూలించునది యైనను, గాక ప్రతికూలమును గలిగించునది యయినను వారు తమసాక్షులనుగా భావించి వారి నందఱను న్యాయము వెల్లడి యగుటకు సాంతముగా విమర్శింపవలయును. అట్టివారికృత్యంబును మేము పూని మాపక్షమున సాక్షులుగ నీకడపటి మువ్వురిని విచారించినందులకై తగవునకుఁ దుదను విన్నవింపవలసిన యీయంశముల నన్నింటిని మొదటఁ జెప్పవలసి



వచ్చినది. అయినను, "ఈహత్య యెట్లు జరిగియుండవచ్చును?" అను నొక పెద్దసందేహము మీమీమనస్సులకుఁ దోఁచవచ్చును. కాని; తగవునందలి సాధకబాధకములను సమాధాన పూర్వకముగా నెత్తి మీమీమనస్సుల కెక్కునట్లు విషయమంతయు విశదపఱిచి "ముద్దాయీ హత్యచేసినది కాదు" అని నిర్ణయించి యామె నీయాపదనుండి తప్పించుటయే ప్రకృతము మేము చేయవలసినపని గాని యితరవిధము లయినసందేహములకు సమాధానముల నెత్తి యుపన్యసించుట మాపని గాదు. అట్లు హత్యచేసినవాండ్రంగూర్చి రూపించుటయు మాయిప్పటి యెత్తికోలు గాదు. కాఁబట్టి "యీతగవునం దెంతసందేహము కలిగినను ముద్దాయీకే యంతకంత యనుకూలించిన సందర్భమగును" అనునది చట్టముయొక్క పద్ధతి యగును. కనుకఁ బైని మాచే స్పష్టముగా సూచింపఁబడిన సందేహముల నన్నింటిని మీమీమనస్సులకుఁ దెచ్చుకొని విషయవివేచనచే నేరము "ఇదమిత్థమ్" అనుతీర్మానమునకు వచ్చినయెడలఁ బరిణామము ముద్దాయీ విడుదల యగుటయే న్యాయాంశమైన తేఱుగడ యొకరొక్కరి హృదయమునకును బొడకట్టక మానదు. అనుసంగతిని మేము దృఢముగా నమ్ముచున్నాము.

(కూర్చుండును).

రాజ్యాంగన్యాయవాది——(మధ్యవర్తులనుగూర్చి) ఆర్యులారా! ఇప్పుడు ముద్దాయీపక్షమునఁ జెప్పఁబడినవాని నన్నింటిని దామే గ్రహించి యుందురు. అయినను; అందులో "నిచట నివి ముఖ్యమైనవి యివి ముఖ్యముగానివి" అని మే మెత్తి నిరూపించుటకు ముందుగా మీకుఁ గొన్నియంశముల నుపపాదించుట ప్రథమకర్తవ్య మగుచున్నది. మొదటిది:——ముద్దాయీపక్షపు న్యాయవాదిగారు జాలి

కలుగునట్లుగా నేమేమో గొప్పగా నుపన్యసించి యున్నారు. ఆయుపన్యాసమును మీమీమనస్సులలోఁ బాదుకొల్పి న్యాయమును విడువరాదు. అనుసంగతిని ముందుగా నొక్కి వక్కాణించుచున్నాము. వారు మొదట నుపన్యసించిన ప్రకారముగాఁ జట్టము, శిక్ష యందఱకును నొకటే యను నంశము మిగులఁ దగియున్నది. వారనంతరము చెప్పుచు వచ్చిన విషయముల కన్నింటికిని గ్రమక్రమముగా నభ్యంతరముల నెత్తి చూపెదము. వానినన్నింటిని తామోర్పుమెయి నాలకించి తుదకు న్యాయాధిపతిగారు సెలవిచ్చు నభిప్రాయమును విని చక్కఁగాఁ బర్యాలోచించి తీర్పు చెప్పెద రని ప్రార్థించుచున్నాము. సాక్షులందఱును విదేశీయు లనుట విస్పష్టమేకదా! ముద్దాయీ చక్కఁగా యోజించియే తనకార్యము లన్నియును నీయూరివారివలన సమకూర్చుకొన్నది గాదని తెలియవచ్చుచున్నది. "ఈయూరివారైనచోఁ దననేరము వెంటనే బయటఁబడి కొనసాగపోవుటయే కాక యట్లు బయటఁ బడునపుడు రాజకీయోద్యోగులకు భయపడి నిజమును దత్‌క్షణమే చెప్పివేయుదురు" అనుసంగతిని ముద్దాయీ బాగుగా నాలోచించియే యీచెడుకార్యమును జేసినది. రెండవది:—హత్య చేయుటకుఁ గారణము లేదనియెదురు. ముద్దాయీపక్షమున వచ్చిన రెండవసాక్షివలన ముద్దాయీ తనయింటఁ బనులుసేయునపుడు "ఎట్లయినను ధనమునిచ్చివేసి విడుదల నొందవలయును" అని గొణుగుకొనుచుండి నట్లేర్పడుచుండుటవలన ముద్దాయీకి ధన మవసరముగా నున్నది యనుతలంపు, మూఁడవసాక్షివలన మృతినొందిన తనపుత్త్రునకు జీవము గలుగవలయు ననుతలంపుచేఁ గాళికాదేవ్యాలయమున రాజకుమారుని బలి యిచ్చునట్లు వేడుకొనుచున్నట్లును నేర్పడుటచే రాజ



పుత్త్రుని బలియియ్యవలయు ననునుద్దేశమును నేర్పడె నని చక్కఁగాఁ దెలియవచ్చుచున్నది. ఈరెండింటిలో ధనమును సేకరించుట యనునది దినక్రమమునఁ గొనసాగించుకొనఁజాలి యుండినను, మృతినొందినకుమారుఁడు జీవించుటకై బలినిమిత్త మీహత్యను ద్వారలోనే నెఱవేర్పవలసిన దాయెను. కనుకనే మహారాజపుత్త్రుని హత్యచేయుటకుఁ గావలసినకారణములు పైని జెప్పినవియే యగును. ఇంతేకాక యీహేతువులు రెండును "ముద్దాయీ పుత్త్రశోకములో మునిఁగి యుండుకాలమునం దెట్లితరులబిడ్డని హత్యచేయఁ దెగించును!" అను సందేహమును దొలఁగించుచున్నది. మఱియు నమితముగా ధనము గుమ్మరించి కొన్న తమబానిస నేవిధముగానైనను దమధనమునకు నష్టము గలుగకుండుటకై కాపాడఁజూతురే కాని యీవిధముగాఁ దామే చూపి యియ్యరు. అందును స్త్రీలయెడ స్త్రీలకు జాలి యుండుట నైజము. అదియునుంగాక తమద్రవ్యమునకు నష్టము గల్గునపుడు రోదన మారంభింతురు. పురుషులకంటె స్త్రీల కిది నైసర్గికమేకదా! ఆకారణమునుబట్టి ముద్దాయీ పక్షమున సాక్ష్యము చెప్పిన రెండవసాక్షి యాత్మలాభమును సయితము దిగఁద్రోచి యథార్థమునే చెప్పినదని తెలిసికొనుటయే యుక్తముగా నుండును. ఇట్లే సన్న్యాసియు, యాత్రికుఁడును జెప్పిన సాక్ష్యములును సర్వోత్కృష్టముగా నంగీకరింపఁదగినవియే యగుచున్నవి. ఎందుల కనఁగా:—ఆపూజ్యు లైహికసుఖము లన్నింటిని దూష్యములుగానెంచి వైరాగ్యము నవలంబించి యాత్మయొక్క సుగతికై యనవరతమును గోరుచుండు వా రనుటకు సందేహము లేదుగదా! భూతదయాపరులను, ముముక్షువులును సాక్షిగా నిచటికి విచ్చేసినట్టివారి యనుగ్రహాతిశయమును గుఱించి

పర్యాలోచింపఁగా న్యాయాధిపతిగారికి సత్యనిరూపణము చేయు భారము నొకదానిని మాత్రము పూని విజయంచేసినవారే కాని నుఱేమియును గాదు. అట్లగుటంబట్టి యూరికావలివాండ్రు లంచగొండులయి యీనేరము నిట్లు సృష్టించి తెచ్చిపెట్టి రనుటయు నసత్యమే యగును. ఇది యిట్లుండఁగా; ఒక్కొక్కరును ఒక్కొక్క విషయమును బ్రత్యేకము ప్రత్యేకముగాఁ జెప్పినవా రన్నచో నీముద్దాయీయొక్కపనితన మట్లుండె నని తెలియవచ్చునే కాని సాక్షులయెడమాత్ర మెటువంటిలోపములును గానరావు. ఏల యనః—తన కృత్యములలో ముద్దాయీ యొక్కొక్క పని నొక్కొక్కరుదప్ప నధికముగా గ్రహింపకుందురుగాక యని యాలోచించి యుండవచ్చును. ఒకవేళ నేరము బయటఁబడినచో నొక్క రు చెప్పినమాట సత్యమయినను సత్యముగా గ్రహింపఁబడ రాదను లోకోక్తిని గొని లేదని చెప్పివేయవచ్చు ననుతలంపే దానికనువైనహేతు వగును. ఇఁకఁ జట్టములో సూచింపఁబడిన పద్ధతులను గూర్చియుఁ గొంత పర్యాలోచింతము. పైని జూపించిన న్యాయములచేత ముద్దాయీ యీయాఁడుదియే యని స్పష్టపడుచున్నది. కనుక నాచారిమీఁదను మోపఁబడిన దోషము తలసూపక తొలఁగిపోవును. అట్లది తీఱినతోడనే యనుమానప్రమాణముగా నంగీకరింపఁబడిన సాక్ష్యములయందును సందియ మిసుమంతయు నుండఁబోదు. ఆకారణముచేత ముద్దాయీ కనుకూలించుభాగ మొక్కటియు నిందుఁగానరాదు. కాఁబట్టి మీరందఱును రెండుపక్షములవారివాదములను సమానముగాఁ దూఁచి విమర్శించి చూచినచో ముద్దాయీ నేరముచేసినదే యని తీర్పు చెప్పఁగలరని నమ్ముచున్నాము.

(కూర్చుండును.)



న్యాయాధిపతి—(మధ్యవర్తులంగూర్చి) ఆర్యులారా! మీ రిదివఱ కుభయపక్షమువారు చెప్పినయంశములను దెలిసికొని యభియోగవిషయము నంతను జక్కఁగా గ్రహించియే యుందురు. మే మిఁక నీయభియోగమును సంబంధించిన సాధకబాధకముల నెత్తి చూపి మీరందఱును నేకీభవించి యిచ్చుతీర్మానము ననుసరించియే తీర్పు చెప్పవలసియున్నది. ఇప్పు డీయభియోగమునందలి యంశముల ననుసరించి యచ్చటచ్చట నేర్పడియున్న విషయములు వెల్లడి యగునట్లు సూచించుటకుఁ బూర్వము చట్టప్రకారము 'హత్య' యన నేమో వివరింతుము. "మరణము గలిగింపవలయు నన్న యుద్దేశముతోఁగాని, యెట్టిశారీరకహింసను జేసినచో మరణము సంభవించునో యట్టిహింస నాచరించుతలంపునఁగాని, యిట్టిపని చేసినచోఁ జరమదశ గలుగు నని తెలిసికొని కాని యొకహత్య జరుపఁబడెనేని యట్టిహత్యను జేసినవాఁడు లేక అది, "అన్యాయమరణమును గల్పించుట" అను హత్యాదోషమును జేసినవాఁడు లేక అది, యగును. అందులో నీయంశమును గొని పర్యాలోచింపఁగా బిడ్డఁడు హత్య చేయఁబడినవిషయమును గూర్చి యుభయపక్షములవారును నొప్పుకొనియెదరు. ఆహత్య యిప్పు డిచట నేరము మోపఁబడిన స్త్రీచేఁ జేయఁబడినదా లేదా యనునంశము తీర్మానింపవలసి యున్నది. నిన్నటిదినము ప్రొద్దు గ్రుంకుటకు ముందు నాలుగుగడియలవఱకును బిడ్డఁడు భూషణాంబరములను ధరించి చక్కఁగా నున్నట్లు నగరినిర్వాహకుఁ డగు మొదటిసాక్షి చెప్పిన సాక్ష్యమువలన వ్యక్త మగుచున్నది. పిమ్మట బిడ్డఁ డగపడలే దనుసంగతి యారక్షకభటవర్గమునకుఁ దెలుపఁబడినది. వాండ్రలోఁ బెక్కుమంది నానాదిక్కులకును బోయి విమర్శించునపు డొకతెగ

వారికి దీని ననుసరించినపోఁబడి తెలియవచ్చినది. వా రాపోఁబడి ననుసరించి సాక్షి వేలాయుధాచారియింటికిఁ బోయి విచారింపఁగా ముద్దాయీ బిడ్డని వెంటఁబెట్టుకొని తనయింటికి వచ్చి యాబిడ్డఁడు ధరించిన నగలు తీసి తనచేతి కిచ్చినట్లే యాసాక్ష్యమువలన స్పష్టమగుచున్నది. కావలివాండ్రనంతరము వెదకుచుఁ బోయి ముద్దాయీని జూచినప్పుడును, హత్య సేయఁబడిన బిడ్డఁడు ముద్దాయీ చేతిలోఁ బ్రేతముగా నున్నట్లు తెలియవచ్చుచున్నది. మఱియు ముద్దాయీ సన్న్యాసితోఁ జెప్పినచొప్పుననే బిడ్డఁడు ధరియించిన గుడ్డలు ముద్దాయీ చెప్పినచోటునుండియే తీయఁబడియును నున్నవి. ఇది యిట్లుండఁగా, ఆకాలమునందు బిడ్డనిపైఁ గప్పఁబడి యున్నపట్టుగుడ్డను సాక్షి వీరభద్రసెట్టి దగ్గరనుండి ముద్దాయీ తీసికొన్నట్లు ఋజువగుచున్నది. ఆగుడ్డనుమిగత గుడ్డతో జోడించి చూడఁగా దానిలోనిండి చింపఁబడిన ట్లాసాక్షియొక్క వాఙ్మూలమును మఱింత బలపఱుచుచున్నది. ఇదిగాక ముద్దాయీపక్షమున వాదించిన న్యాయవాదివలనఁ దేఁబడిన సాక్ష్యములలో మొదటియిరువురిసాక్ష్యమును రాజ్యాంగ న్యాయవాదియొక్క సాక్షుల వాఙ్మూలములను సంపూర్ణముగా దృఢీకరించుచున్నది. ఇంతే కాక ముద్దాయీపక్షమున వచ్చిన మూఁడవసాక్షి చెప్పిన సాక్ష్యమును, ఆరక్షకభటుల సాక్ష్యమును మిక్కిలిగా బలపఱుచుచున్నది. ఇవియే యీయభియోగము నం దేర్పడినసాక్ష్యముల వలనఁ దేలిన విషయములు. ఇంక నిట్టివిషయములలో నెంతవఱకు సత్యము? ఎంత వఱ కసత్యము? ఎంతవఱకు సందేహాస్పద? మనుసంగతియంతయు మీమీఁదనున్నది. ఇందులో మీకు సందేహాస్పదము లయిన కొన్ని కొన్ని సంగతులు మీలో మీరే తర్కించుకొని నిజము గ్రహించు



కొనవలయును. ఇపుడు రాజ్యాంగన్యాయవాది చెప్పిన చొప్పున "ముద్దాయీ తనకార్యముల నన్నింటిని నీయూరివారికిఁ దెలియకుండునట్లు పొరుగూళ్ళనుండి వచ్చి యిచ్చట రెండుమూఁడు దినములవఱకును నుండువారివలన నెఱవేర్చుకొన్నది" అన్నన్యాయాంశముగూడ మిక్కిలి గమనింపవలసిన దగును. రాజ్యాంగము వారిపక్షమున సాక్షిగా వచ్చిన వేలాయుధాచారి దీనితో సంబంధపడి యుండినచోఁ గావలివాండ్రడిగినప్పుడు నిజమును డాఁగురించియే యుండవచ్చును. ఇదిగాక; ఆభరణముల నపహరించియు నుండవచ్చును. పదియాఱువన్నె బంగారమును, మట్టిగడ్డను సమానముగా భావించి సంచరించు పరమయోగులకు భూతదయాపరులకు నందఱును సమానముగానే యుందురు. అటువంటి మహానుభావు లెవరిమాటలనుగాని యెవరిసంపదనుగాని ఘనముగాఁ జూచువారు గారు. అట్టిమహాత్ములవచనములు తప్పకుండ నొప్పుకోవలసి యున్నవి. ఇవి యన్నియు నొకతట్టున నుండఁగా ముద్దాయీ పక్షమున వచ్చిన సాక్షులలో మొదటి యిద్దఱును ముద్దాయీని జాలధన మిచ్చి కొన్నట్టుగాఁ గనఁబడుచున్నది. ముద్దాయీ నేరము చేసిన ట్లేర్పడినచోఁ దమయిచ్చిన ధనమంతయుఁ బూర్తిగా నష్టమగును. అనునంశమును వారు చక్కఁగా గ్రహించియే యుందురు. అట్లుండియు వారు రాజ్యాంగము వారిపక్షపుసాక్షుల సాక్ష్యముల కుపబలముగానే సాక్ష్య మిచ్చియున్నారు. తక్కిన విషయము లన్నిటిలో బిడ్డఁడు నగరిలో నగపడకపోయినప్పుడు "ముద్దాయీ తమయింటనే యున్నది" అను నొక్కమాటయే ముద్దాయీని నేరమునుండి విడుదల చేయఁజాలి యుండఁగా నంతయు దాచిపెట్టక వారు చెప్పియుండుటచేత వారిసాక్ష్యము సామాన్య

మయినదిగా భావింపరాదు. ఇది యొప్పిదము గాదని త్రోసివేయుటకును సందర్భ ముండదు. మఱియు ముద్దాయీపక్షమున వచ్చిన సాక్షులలోఁ గడపటి యిరువురును ముద్దాయీ హత్యసేయుటకుఁ దగినహేతువులను ముందే కొని యుండునట్లు దెలుపఁదగిన సాక్ష్యముల నిచ్చియున్నారు. కాఁబట్టి యిఁక దీనియథార్థమును బరిశీలించి తీర్పు చెప్పుట మీభారమై యున్నది. అట్లు నిర్ణయింపఁ గలుగుసమయములయందు న్యాయాంశములలో మీ కేదేని సందేహము నిష్పన్న మయినచో దానిలాభమును ముద్దాయీ యనుభవింపవలసినదే యనుట చట్టముయొక్క తాత్పర్య మగును. అట్లుగాక యీసాక్షులు చెప్పినది నిజమని మీరు గ్రహించి యీయపరాధమును జేసినది యీస్త్రీయే యని మీకుఁ దోఁచినచో నీమెను నేరముచేసినదానిని గావించినవార లగుదురు. కాఁబట్టి మీ రీ తగవునందుఁ గలసాధకబాధకము లగు నంశములను జక్కఁగాఁ బర్యాలోచించి మీయభిప్రాయమును బ్రకటింతురు గాక.

(మధ్యస్థు లందఱును నొక గదిలోనికిఁ బోవుదురు.)

నీలకంఠశాస్త్రి—ఆర్యులారా! ఏమితీర్పు చెప్పెదరు?

తక్కినవారు—మే మందఱమును మిమ్మునే యగ్రేసరులనుగాఁ బెట్టి యున్నామే. ఇంకేమీ? తామే చెప్పివేసినఁ జాలునే.

నీలకంఠశాస్త్రి—హా! హా! అట్లగునా? ఇదేమి యల్పకార్యమా? మన మందఱము జక్కఁగాఁ బర్యాలోచించి చెప్పవలసి యున్నది.

కృష్ణనాథదత్తు—న్యాయాధిపతియభిప్రాయమున "ముద్దాయీయే యీనేరము చేసి యుండవచ్చును" అనునట్లుగా వచ్చెడిని. అట్లే చెప్పివేయవచ్చునే.



కుమారశర్మ—అట్లే చెప్పివేయవచ్చునేని మధ్యవర్తు లేల నిర్ణయింపఁబడవలయును? "న్యాయాధిపతియుఁ గొన్ని సందర్భములలోఁ బొఱపాటుపడి యుండవచ్చును" అనుటకైయే కదా మధ్యవర్తులం గోరి కొనుట. అందులకుఁ దగినట్టు గదా మనమును యోజించి చెప్పవలయును.

మునిలాల్‌సింగ్—నాకేమో యొక్కటియు నేర్పడినది గాదు. హత్య చేసినవారిచిహ్నములే ముద్దాయీముఖమునందుఁ గనఁబడుట లేదు. చూడఁగాఁ బశువువలె నున్నది పాపము!

పండరీనాథదత్తు—ఈపురాణకథలతో నెంతమాత్రమును బ్రయోజనము లేదు. "హత్య ముఖమున వ్రేలాడును, కాలిమీఁద వ్రేలాడును" అని చెప్పినయెడల కట్టుకథలుగా భావన యగును. అటువంటి మాటలు విడిచిపెట్టి తీర్పుసంగతినిగూర్చి యోజింపుఁడు.

మహాదేవమేత—న్యాయస్థానములో సాక్షులు చెప్పిన మాటలలోని యంశములను గొనియే మనము తీర్మానింపవలయును. వేఱే యేమున్నది? మన మేమి దేవతలమా దివ్యదృష్టితోఁ జూచి చెప్పుటకు!

గోపీనాథటాకూర్—సాక్షులు చెప్పిన వాఙ్మూలములను బట్టి చూడఁగా ముద్దాయీ హత్య చేసినట్టుగానే పొడకట్టుచున్నది.

మోహనరాయి—ముద్దాయీపక్షమున సాక్ష్యము చెప్పినవారును ముద్దాయీకిఁ బ్రతికూలముగానే చెప్పియున్నారు. ఇంతకంటెను గావలసిన దేమున్నది?

నీలకంఠశాస్త్రి—లక్ష్మీనాథప్రసాదులుగారూ! అందఱును దమతమ యభిప్రాయములను వెల్లడి చేసిరి గదా మీరొక్కరుమాత్రమే యేల యీలాగున మౌనముద్ర ధరించి యున్నారు? మీయభిప్రాయమునుగూడఁ బ్రకటింపుఁడు.

లక్ష్మీనాథప్రసాద్—నాయభిప్రాయమున కేమున్నది? సాక్షులు చెప్పినమాటలనే యాధారముగాఁ జేసికొని తీర్పు చేయవలయును. నేరము చేయలేదు. అని చెప్పుటకేమో తగిన యాధార మొక్కటియు నగపడకుండ నున్నది.

నీలకంఠశాస్త్రి—అట్లయినచోఁ దీరుమానముగఁ జెప్పుఁడు. ఇప్పటికే చాలఁ గాలహరణ మయినది.

అందఱును—నేరము చేసినది. నేరము చేసినది. నేరము చేసినది.

నీలకంఠశాస్త్రి—అట్లయిన సరి. "అందఱును నేరము చేసినది యని చెప్పుచున్నారు" అని చెప్పవచ్చును గదా! ఆహా!

అందఱును—అందుల కభ్యంతర మేమున్నది? అట్లే చెప్పవచ్చును.

నీలకంఠశాస్త్రి—సరి. అట్లయినచోఁ బోవుదము లెండు.

(అందఱును న్యాయాధిపతియొద్దకుఁ బోవుదురు.)

రాజ్యాంగలేఖకుఁడు—(మధ్యవర్తులంగూర్చి) మీరందఱును జెప్పునభిప్రాయ మేకీభవించిన తీరుమానమే యగునా?

నీలకంఠశాస్త్రి—ఆహా! అవునండి. మేమందఱము బాగుగా యోజించి యేకీభవించియే తీరుమానమును న్యాయాధిపతిగారితో విన్నవించుటకై వచ్చితిమి.

రాజ్యాంగలేఖకుఁడు—మీయందఱియొక్క యభిప్రాయ మేలాగున నున్నది?

నీలకంఠశాస్త్రి—"ముద్దాయీ హత్య యనునేరమును జేసినది" అనునదే మాయందఱియొక్క యభిప్రాయమును నయి యున్నది.

న్యాయాధిపతి—(ముద్దాయీనిగూర్చి) అమ్మాయీ! మధ్యవర్తులందఱును నేకీభవించి నీవు మహారాజపుత్త్రుని హత్యచేసినట్లు తీరుమానించియున్నారు. సాక్షులు చెప్పినమాటలను బట్టి యోజింపఁగా



మాకును నట్టియభిప్రాయమే కలుగుచున్నది. హత్యయను నేరమునకుఁ జట్టమునందుఁ జెప్పఁబడియుండు దండనను మేము నీ కేల విధింపఁగూడదో యనుటకుఁ గారణము లెవ్వియైన నున్నచోఁ జెప్పుకోవచ్చును.

చంద్రమతి—

ద్విపదలు.

దురితతమోర్కుమై తోఁచుదోషాళి, గరిమఁ బోకార్పఁగాఁ గడఁగి తళ్కొత్తు
న్యాయస్థలంబ దేవాలయం బగును, పాయక యీపీఠిఁ బరిఢవిల్లుచును
వెలయుచుం డెడితాము మనుజులే యైయుఁ, జెలఁగుమనీషావిశేషంబుకతన
దైవోపమానులై తనరారుచుంద్రు, భీవివర్జితబుద్ధిఁ బృథులత్వ మొంది
సత్యంబె తమకుఁ బ్రశస్తమౌ నంచు, సత్యమే మది నమ్మి సత్యమే కొలిచి
యత్యంతభారంబు ననువొందఁ దాల్చి, సత్యాకృతిం బోల్చి సరవిఁ జెందుదురు
అట్టినిష్పాక్షికం బగుబుద్ధిచేత, నట్టియీర్ష్యాహీన మగుబుద్ధిచేత
నలరారుచున్నట్టి యానీతిపతియు, వలనొప్పుధర్మదేవత యనరాద
ఆధర్మదేవత యాకర్మసాక్షి, ఆధర్మదేవత యాసర్వసాక్షి
అదియె తోడగు నంచు నత్యంతభక్తి, విదితంబుగా మది విశ్వసించెదను.

నే నిప్పుడు నాపైఁ నారోపింపఁబడిననేరమును జేసినదానను గాను. నాపయిని జెప్పినసాక్షులే కారణముచేతనో, అమితముగా నపోహములు గలుగునట్లుగా నీన్యాయస్థలమున నసత్యాలాపములను బలికియున్నారు. ధర్మదేవతయొక్క ప్రతినిధి యయినన్యాయాధిపతులచే నలంకరింపఁబడిన యీన్యాయస్థలంబే పరిశుద్ధ మయిన యొక యాలయము. అచ్చో నాసీనుఁడయి వెలుఁగొందున్యాయాధిపతి సర్వోత్కృష్టుఁ డయినపరమేశ్వరున కొక్కనికేఁ దక్కఁ దక్కిన వారికి భీతిల్లి న్యాయవంచనము చేయుట దగదు. దిక్కుసెడిన వారల నాదరించి, వాండ్రకొఱఁతలను హృదయస్వాస్థ్యముతో విని, వాండ్రను రక్షించు పరమేశ్వరుఁడే యీయాకృతిందాల్చి రంజిల్లు

చుండును. మఱియును, సర్వసాక్షి యైనధర్మదేవతనే నాయాత్మకు గొప్పసహాయముగ భావించికొని యున్నాను.

న్యాయాధిపతి—నీచే హత్యచేయఁబడినట్లు సాక్షులచే నిరూపింపఁబడియుండు నీగొప్ప నేరమును తగ్గించునంతటి యవకాశ మేమియు నగపడినది గాదు. అయినను; అందులకు బదులుగా హత్య సేయఁబడిన బిడ్డఁడు ధరించియుండిన యాభరణంబుల నపహరింపవలయు ననుదురభిలాషచేతను, నిరపరాధి యగు నాబిడ్డని గాళికకు బలియియ్యవలయు నను మూఢభక్తితో ముందే యభిప్రాయపడి యీ హత్య నాచరించినట్లు పరిష్కారముగ నేర్పడుచున్నది. చట్టప్రకార మీనేరమునకు నేర్పడియుండుదండనమును నీకు విధించియే తీఱవలయును. కాఁబట్టి, "నీజీవము శరీరమునుండి వియోగ మొందునట్లు శిరశ్ఛేదము చేయఁబడవలయును" అనుట యీన్యాయస్థలము వారితీర్పగుచున్నది.

[న్యాయాధిపతి మొదలగువారు గదలుచున్నారు. న్యాయస్థలంబునందున్న తక్కుంగలవారును వెడలిపోవుచున్నారు. చంద్రమతి యాతీర్పును విని ప్రజ్ఞ దప్పి క్రిందఁబడుచున్నది. కావలిభటు లామెను జేతులమీఁద వైచికొని యావలికిఁ దీసికొనిపోవుదురు.]

అప. న్యాయ—(భాస్కరునింజూచి) ఏమయ్యా! మీమాట యొక్కటైనను గొనసాగినది గాదు. వ్యర్థముగా మే మవమానపడవలసి వచ్చినది. ఒక్కప్రయోజనమును గానరాదు. ఇట్లే కక్షిదారులు "అంతయును సరిగా నున్నది, వలసినన్నిసాక్ష్యములు గలవు, అందఱును మన కనుకూలముగఁ జెప్పువారలే. తమ కేవిధమయిన శ్రమమును లేదు." అని న్యాయవాదిని మోసగించి, పది యిచ్చెదము. ఎనిమిది యిచ్చెదము, అనియును, తగవు మనపక్షముగాఁ దీర్మానింపఁబడినచో నెత్తికనకాభిషేకమును జేసివేసెద" మనియు



పట్టిచేతులతో మూరలఁ గొల్తురు. పిమ్మట నొక్కటియు నుండదు. ఇప్పుడు చూడుఁడు. ఎంతశ్రమము పడితిమో? పోనీ పడినశ్రమకుఁ బ్రయోజనంబుగఁ దగవైనను జయించినదా? లేదుపో, తగినలాభమయినను లభింపఁబోవుచున్నదా? న్యాయవాది కందఱును మోసపోవుదురు. ఇప్పుడు న్యాయవాది గదా మీయొద్ద మోసపోవలసి వచ్చినది. మీపక్షమున వచ్చిన సాక్ష్యము మీకే విరోధమును జెప్పెనా? ఇదేమి యక్రమము? వాఙ్మాత్రము సరిగాఁ జెప్పియుండినయెడల, హత్య గిత్య యంతయు గాలిలోని దూదివలెఁ బటాపంచలై పోయి యుండునే. అందులో మహారాజావారికే విరోధమయిన తగవు. ఇందులో జయమునుబొంది యున్నచో జగత్తునే జయించి వేసినట్లు గదా? చూచినారుగద! నేను జెప్పుచుండిన యంశములను నెంతగా గమనించి యాలకించుచుండిరో న్యాయాధిపతి? అట్లుండినను వారేమి చేయుదురు? సాక్ష్యము లన్నియు నావలిపక్షమునందు బలమయిపోయినవి. పోండయ్యా! పోండు, పోండు! చాలును.

భాస్కరుఁడు—అయ్యా! అయ్యా! కోపింపకుఁడు. నా కేమిదెలియును? నిజమును జెప్పుదు రని తలఁచి యేమఱితిని. ఇంకనైనను, ఒక మార్గమును జెప్పుఁడు. రేయియంతయు శ్మశానమునం దుండినట్లు చెప్పించవచ్చును. శ్మశానమునం దుండునతఁ డాయమ్మ పెనిమిటియే. అచటనే యున్నమఱొకఁడును, అతనికి లోఁబడి నడుచుకొనువాఁడే. ఈ యిరువురును దగినసాక్షులుగా నుందురు. ఈ తీర్పును మార్చుట కేదయిన మార్గ ముండినచోఁ దోడనే చేసివేయవచ్చును. తమకు శ్రమమని యాలోచింపవలసిన పని లేదు. నేను మఱచిపోవువాఁడను గాను. ఇదో! యిపుడే యీ యైదువందలు స్వర్ణంబు లిచ్చెదను. అంగీకరింపుఁడు. పిమ్మట వలసినంత

యిచ్చెదను. కొంచె మనుగ్రహించి ప్రయాస మెత్తుకొనవలయును.

అప. న్యాయ—ఆహా! అందుల కభ్యంతర మేమి? వారిరువురును సాక్ష్యము చెప్పుటవలన నొక్కక్షణమాత్రములోననే తీర్పును మార్చివేయవచ్చును. ఒక్కటియు నుండదు; ఈ యమ్మ రేయి యంతయును శ్మశానమునం దుండినయట్లు రెండుసాక్ష్యములను గనుపఱిచి మహారాజావారి కొకమనవిని బెట్టుకొనినయెడల మహారాజావా రొక్కక్షణంబుననే తీర్పును మార్చివేయుదురు. ఇట్టి విషయంబులయందు న్యాయస్థలమునందలి తీర్పులను మార్చివేయుటకు మహారాజావారి కధికారము గలదు. మహారాజావారు మిగుల దయాళులు. తమపుత్త్రుని మరణంబును సైత మెదకుఁ దెచ్చికొనక న్యాయంబునకు బద్ధు లగుదురు. సాక్ష్యముమాత్ర మేర్పడవలయును.

భాస్కరుఁడు—సాక్ష్యము లున్నవి. మీరుమాత్రము దగినట్లు చెప్పి యేర్పాటుచేయవలయును. ఇట్టి తీర్పును మాఱునా? యనుసందియముచేత నీమెపెనిమిటియు నొకవేళ వెనుదీయును. అతనికిఁ దగినట్లు ధైర్యమును జెప్పి, కార్యసాధక మగునట్లు చేయించవలయును. ఇదయే తమవలనఁ గాఁదగిన యొకపెద్దయుపకారము. తమమే లెప్పటికిని మఱువను. ఆఁడుది యని యైనను జాలి తలంపుఁడు.

అప. న్యాయ—ఆహా! ఆలాగే! కావలసినంతవఱకును జెప్పెదము. పిమ్మట మమ్మునుమాత్రము మఱచిపోదురేమో? కార్యము తీఱఁగానే కైవదలుట ప్రపంచపద్ధతి లెండు. అట్లు మీరును జేసివేయఁబోయెదరు సుమండీ.



భాస్కరుఁడు—అట్లును గలదా? నాలుక యొకటియా రెండా? చెప్పిన దానిఁ దప్పినడుచువాఁ డొకమనుష్యుఁడా? ధనమునకై యాలోచింపకుఁడు. ముమ్మాఱును జెప్పెదను. వారికిఁ జెప్పవలసిన ధైర్యోక్తులను జెప్పి, సాక్ష్యము చెప్పునట్లు చేసి తీర్పును మార్చివేయునట్లు చేయవలయును. నేనును వారికిఁ జెప్పవలసినమాటలు చెప్పి సరిపఱిచెదను. అయినను దమమాటలచేతనే కాని వారికి ధైర్యము కలుగదు.

అప. న్యాయ—సరి. ఆలాగే కానిండు; పోదము.

(ఇరువురును నిష్క్రమించెదరు.)

ఇది నవమరంగము.

---

చతుర్థాంకము సమాప్తము.





# పంచమాంకము.

## ప్రథమరంగము.

స్థలము : శ్మశానప్రాన్తము.
కాలము : సాయాహ్నము.
పాత్రములు : విశ్వామిత్రుఁడు.

(విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశ్వామిత్రుఁడు—(స్వగతము) ఆహా! వ్యర్థముగా నేనెంత శ్రమము గలిగించుకొంటిని? ఱాతిని గ్రుమ్మినఁ జేతికి వేదన యన్నట్లు హరిశ్చంద్రు నసత్యవంతునిగా రూపించుపొంటె నివ్విధంబు లగుకష్టపరంపరలం జిక్కి పరితపింపవలసి వచ్చినది. చక్కఁగా నాలోచించి చూచినచో శ్రమంబు లన్నియును విశేషముగ నాతలపైననే కదా యున్నవి. ఱోఁటి కొకప్రక్క దెబ్బలయిన మద్దెలకు రెండు ప్రక్కల దెబ్బలన్నట్లు, హరిశ్చంద్రున కొకవిధ మయినకష్టము. నాకో మితిలేని కష్టములు. అక్కటక్కటా! నామాట కేమి? నన్నాశ్రయించి నాకు శుశ్రూష లొనర్చుచు, సన్మార్గమును బొందఁదలఁచి, వచ్చిన శిష్యుల నెన్నిశ్రమలకు లోఁబఱిచినాఁడను? ఆ



నక్షత్రకుఁడు వీరి వెంటనుబోయి, పడినశ్రమ యింతింతని చెప్పవలను పడునా? అహహో! కష్టమ్ - కష్టమ్! తక్కుంగలయంతేవాసుల నెన్నిదుర్గమప్రదేశంబులఁ జొప్పించితిని? ఎన్నిదుష్కరకార్యసమాచరణంబులఁ బ్రేరేచితిని? వాండ్రైహికేచ్ఛల ధిక్కరించి ముముక్షుత్వం బపేక్షించి నన్నాశ్రయించి యుండఁగా, నేను వాండ్రను గేవలైహికేచ్ఛ గల సంసారులనుగాఁ జేసివైచితిని. ఇది యొక విధమయినను, అయ్యో! అయ్యో! పరమేశ్వరా! కన్నియలుగానుండి కామ్యాదులయందలికాంక్షలపై విరక్తి చెంది, నన్నాశ్రయించి 'సద్గతికిం జేసి శుశ్రూషావిధానంబుల మెలంగుచున్న మునికన్యకలను గేవలమును వెలయాండ్రవలెఁ జేసి, కృత్రిమమైనవలపు చూపి మెచ్చుగులుకునట్లు నటింపఁజేసితిని. విరిబ్బోణులకుఁ గలసహజవ్రీడావి[illegible]ంబులకుఁ బ్రత్యక్షప్రతిస్పర్ధిగ హరిశ్చంద్రుని "గాంధర్వవిధిని పరిణయమగుము" అని ప్రార్థించునట్లు బోధించితిని. ఇంతటితో వదలక, సహోదరభావము పరిఢవిల్లుశిష్యులకు భార్యలుగా మెలఁగుటను నటించునట్లు చేసితిని. ఇంతకంటెను వలయునే దుశ్చరితము మఱొకటి? ఇదేమి? యేమాత్రము? ద్విజాగ్రగణ్యులయి వేదాధ్యయనపవిత్రు లగువారిని పంచమస్థితికిఁ దార్చితిని, పంచతఁ జెందిన పశ్వాదులను ఛేదింపఁ జేసితిని. పరేతభూమిని నిల్పి ప్రేతంబుల దహింపఁజేసితిని. అనేకసందర్భములయం దసత్యము లాడునట్లు ప్రోత్సాహపఱిచితిని. తలంపునకుఁగూడఁ దెచ్చుకోఁగూడని శిశువుల మరణప్రాయుల నాచరించునట్లు, ప్రేరేచి, యాహత్య కటాకటా! ఆగర్భశ్రీమతియు మహాపతివ్రతాతిలకంబు నైన చంద్రమతిపై నారోపింపఁజేసితిని. అయ్యయ్యో! గణుతింప గుణుతింప నెన్ని పాపకార్యములు నాసమా

చరించినవి దోఁచుచున్నవి? దుష్కార్య మణుమాత్రంబయినను నది యధికోన్నతాహార్యమునుంబోలె ప్రవృద్ధిం జెందునందురే, యిదియే దానికి నిదర్శనమేమో? చేయుకాలంబున నొకటి రెండుగా మనస్సునకు గోచరించినవి. ఇపుడు వానినన్నిటిని లెక్కపెట్టిన నూఁటికంటె నతిశయించునట్లున్నవే. ఇట్టి గొప్పగొప్ప కష్టంబుల నన్నిటిని నోర్చికొని యుండు మనస్థైర్యముగల వాని నేమని చెప్పవచ్చును? వానిని జగధీశుఁ డనియే చెప్పవలయును. జగదీశుఁ డన్న రాజమాత్రుఁడుగ నర్థమిచ్చును. పరమేశ్వరుఁ డనియే చెప్పి పూర్వోక్త పదమునందలి నేయూర్థమును విధ్వంసము చేయవలెను. అహాహా! సద్గతికై తన్ననుసరించిన శిష్యులవలన దుష్కృత్యముల సమాచరింపించు నాచార్యుఁడు నరకకూపంబునఁగదా పడి చెడి నశించును. ఇట్టివాని కన్నిటికిని గారణ మేదిగా నుండవచ్చును? (యోజనను నటించి పైనిఁ జూచి.) ఆహా! నాయహంకారమే! యీయహంకార మొకటియే కద, నాయుత్తమకాలము నంతటిని రిత్తవోఁ జేసినది. ఆహా! ఆదియందు నేను రాజుగా నుండి, ఆఖేటంబునకై పోయి మృగయావినోదంబు సలిపి, సొమ్మసిల్లి పుడమిపైఁ బడి యున్నకాలంబున నాకును నాబలమునకును గామగవిని గొని తిండిపెట్టి, తెప్పరిల్లఁజేసి, యుపచరించిన యన్నప్రదాతతో విరోధించి, వాదించి హింసించితిని. అందులకు వారికామధేనువును నాకిచ్చినారు గారే యనుచూపోపమియే కారణంబుగ నుండెను. తుదకు ధరణీధరంబును గ్రుమ్మిన తగరువలె నత్తపోధనునితోడఁ బోరు సల్పి నాసంతానంబునకుఁ బ్రళయముఁ దెచ్చికొంటిని. అట్టి కాలమే నాయహంకారంబున కాదిమదశ. అక్కాలంబున క్షాత్రతేజంబు వహించి యుండినవాఁడ నగుటచే, ధనగర్వచోదితుఁడనై,



రాజ్యమదాంధత నట్లు పొనరించితిని. అని యొకతీరుగ మనస్సమాధానమును సమకూర్చికొనవచ్చును. ఇది యట్లు గాదే!

అహహా! విశ్వనాథ! ప్రపంచంబునఁ బొందఁగోరు పెద్దపదవి యేది? రాజత్వమే. ఐహికేచ్ఛలం దధికతమంబయిన యీషణరాజం బిది యొక్కటియే. అట్టిగొప్పస్థితియందును వైరాగ్యమొంది, తుర్యపదవిం జెందఁగోరి, యిట్లు ముముక్షుఁడ నైతిని. మోక్షాపేక్ష నొందినవారు మొదటఁ బరిత్యజింపవలసినది కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, అను శత్రుచయషట్కంబే యగును. వీనిలో మేనకయను నప్సరసయెడలఁ గామమననుగుణముగాఁ బ్రయోగించి మహాశ్రమసాధ్యంబయిన తపంబునుండి తొలఁగినాఁడను. ఇటులే యొక్కొక్కటికిని చోటిచ్చి యుండువాఁడను. ఇన్నిటికి నాయహంకారం బొక్కండే కదా! కారణం బయి యొప్పారుచున్నది. అహహా! గతించినవన్నియుఁ బోనిమ్ము ప్రాఁతకథలనెల్ల నేలత్రవ్వవలయును. ఈ హరిశ్చంద్రునిగుఱించి యీవసిష్ఠునితోడ వాదు పెట్టుకొన్నది యెందులకు? వ్యర్థమునకే కదా! పలువురు మెచ్చఁ బంతములు వేసినాఁడను. ఈ హరిశ్చంద్రుని నడవడికతోడ నా కెప్పుడేనియు నేదేని సంబంధముండెనా? యిది మిథ్యమ్మని నిర్ణయించుటకు? ఒక్కటియును లేదే. వ్యర్థముగాఁ దపోమదంబునం జేసి జిహ్వాపరాధమువలన నిన్ని కష్టములు తెచ్చుకొంటిని. ఆ పురుషవరేణ్యుని సద్గుణసచ్ఛీలంబు లిట్టివని ఝడితిప్రజ్ఞచే నారసి తోడనే వదలిపెట్టినాఁడనా? అట్టిలఘుకార్యము నూహించినవాఁడను గాకపోతిని. కట్టా! యొక్కటొక్కటిగా నన్ని మనోవనదహనచణం బయిన దావదహనంబునుంబోని సంకటంబులఁ గల్పించి ప్రయుక్తపఱిచినాఁడను. ప్రయోజనం బేమి?

ఏదయినఁ గొనసాగినదా? కొనసాగుటయా? ప్రచండతీక్ష్ణరశ్మిపై నిం బ్రయుక్తపఱిచినయాభీలతమోజాలంబులంబలె సాకారతం దేజరిల్లు సత్యంబు నెట్లు నాప్రయోగించిన యసంబద్ధకార్యంబులు డీకొని జయశీలంబులు గానోపును? మహాగాధసాగరజలం బింకినను మహోన్నతకుల ధరాధర నికరంబులు భూమికి లోనుగాఁ గ్రుంగినను సూర్యచంద్రులగతులు మాఱినను నతఁడు తనదృఢమనస్థైర్యంబును వీడఁడుగా! భళిరా! అతనిహృదయద్రఢిమ! వహ్వారే! చిత్తౌన్నత్యము! ఇప్పు డేమిచేయుదును? ఆహా! సాధు! హరిశ్చంద్ర! నీ విప్డు నావలన ననుభవించుశ్రమ మత్యంతము స్వల్పముగా నుండినను, నీవు సూర్యచంద్రు లున్నంతవఱకును గీర్తిశరీరుండవై సకల జన సంస్మరణార్హుండవై యుందువు. నన్నెదవో? నీనెపంబున నపకీర్తిశరీరం బూని యంతకాలంబున న్యూనత్వం బొందుదును. నీవో నాదుర్ఘట తపః ఫలంబునం దర్ధంబుతోడ నీతొల్లింటి సామ్రాజ్యపదవినిసైతము వహింపఁగలవు. నన్నెదవో? అన్నిట నేమఱి నామము వేసికొన్నవాఁడను. ఇవన్నియుఁ బ్రతిభాఖని యగు నీ విశ్వామిత్రుని కేమాత్రము? విశ్వామిత్రుఁడా? సామాన్యపామర జనునిం బోలెఁ బరివేదన మొందుచుఁ దనసార్థక నామధేయంబు నర్థవ్యక్తికి లొచ్చొనఁ గూర్చును. (క్రిందుఁ జూచి కొంతయాలోచనము నటించి) హా! యేమందును? ప్రపంచమునందు మహాప్రఖ్యాతి నందిన యీవిశ్వామిత్రుఁ డిప్పు డీవృద్ధవసిష్ఠునిమ్రోలఁ బొందఁబోవు నవమానశల్యం బెన్నటికిని హృదయపరిపీడనం బొనర్చుచునే కదాయుండును. అహో! కష్టమ్, కష్టమ్, వీని కన్నిటికిని హేతువు నాకత్యన్తము నిగ్రహస్థానమునం దుండఁదగిన యాదురహంకారము గదా! నాహృదయపీఠిక నధివసించి నన్నీదశకుఁ దెచ్చివైచి



నది. అక్కటా! అట్టి నామనోజ్ఞాత జాతంబయిన యహమహమిక వలని దోషంబులను నేను దక్కఁ దక్కుంగలవార లెవ్వ రెఱుఁగఁ గలరు? ఇప్పటికైనను ఆ హరిశ్చంద్రుఁ డొక్కించుక తప్పి చరించి నాఁడేని నేనును నాప్రియశిష్యులును పడిన శ్రమంబుల కన్నింటికి నొకతీరునఁ బరిహారంబు గలుగును. ఇన్ని నిష్ఠుర వజ్రపాతంబులం బోని కష్టచయంబులకు వెనుదీయని ధరాధరాధికధీరుండా యిపుడు చలింపనోపు? చలింపఁడు, చలింపఁడు. ఐనను గొంతచూతము. ఇయ్యదియే కట్టకడపటిశోధనంబుగ నిర్ణయించుకొందము. ఇదియే తన యొప్పులకుప్పయై పెచ్చుమిగులు నర్ధాంగలక్ష్మియొక్క శిరశ్ఛేదంబుఁ బొనరించుపట్టు, ఎంత సుగుణఖని యైనను సుకృత వారినిధియే యైనను, తన యనువ్రత యగుజాయయెడ ననుకంపఁ జెంపకుండఁడు. అంతేకాక తనయింతి యొక్కింతేనియు దోషంబు దీపించు దిక్కుచనినది కాదు, అని యతని చిత్తమునకును దెలివిడి గలదు. కాలప్రమాణమును గొంత మార్చి చెప్పవలసినదే తన పూఁట. అందులకుఁ దనజాయాప్రాణదానమే ప్రయోజనం బగును. కాఁబట్టి, తప్పక యొప్పుకొనఁ గలఁడు. పుత్త్రమరణంబునకును హృదయపరివేదనంబుం జెందఁడు. చన్నవారు చన్నవారే యను స్థిరమును గొన్నవాఁ డగును. ఉన్నవారిని చన్నవారినిగాఁ జేయ నొడంబడఁడు. అదియును జూతము. ఇదియే కడపటితడవ. ఇది వఱకు నాశిష్యులు ప్రయత్నించి కృతకృత్యులు గారైరి. ఇపుడు నేనే ప్రయత్నించి చూచెదను. ఇప్పుడు నావలనను గాకపోవునా? నేను వీనింగూర్చి తిన్నఁగాఁ బోయి యున్నకాలంబులయం దపజయము నొంది మల్లినవాఁడను గాను. కాఁబట్టి యిప్పుడును గృతార్థుఁడను గాకమానను. అట్లే నేను ముందుగానే చేయక ముదఱఁ

బెట్టుకొంటిని. అదియును నాబుద్ధిహీనతయే యగును. సరి, యిపుడు చూచెదను గాక.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమరంగము.

## ద్వితీయరంగము.

స్థలము : శ్మశానవాటికయందలి వధ్యస్థలము.

కాలము : సాయాహ్నము.

పాత్రములు : చెఱసాలయధికారి, సేవకుఁడు, వీరబాహువు, చంద్రమతి, హరిశ్చంద్రుఁడు.

(చంద్రమతిని ఊరికావలిభటులు పిలుచుకొనిపోయి, చెఱసాలయధికారియొద్ద నప్పగించుచున్నారు. సేవకుఁడు వచ్చి యధికారికి నమస్కరించుచున్నాఁడు.)

చెఱసాలయధికారి—సేవకా? తీర్మాన మెట్లయినది?

సేవకుఁడు—ఇదో చూడండి శిరశ్ఛేదము చేయునట్లు న్యాయాధిపతిగా రిచ్చిన యాజ్ఞాపత్రము. చేయిపట్టుగా నేరము దొరకినకాలమున తీర్మాన మిట్లు ముగియకుండునా?

చెఱసాలయధికారి—సరి, నేరస్థురాలిని కొట్టులోఁ బెట్టు. మఱునఁటి యుత్తరువు వచ్చిననే గదా కార్యము నెరవేర్చవలయును.

సేవకుఁడు—మఱునటి యుత్తరువా? లేదు, లేదు. నేటికే కార్యం నెఱవేర్చునట్లు ఆజ్ఞచేయఁబడి యున్నది.

చెఱసాలయధికారి—ఓహో! ఆలాగా సంగతి! (తనలోఁ జదువుకొనుచున్నాఁడు) ఔనౌను. బాగుగాఁ జెప్పినావు. ఎన్నటికిని లేదే యిట్టి యుత్తరువు. ఇదేమి క్రొత్తగా నున్నది. సరి, మనకేమి?



ఉత్తరువుమేరకు నడుపవలసినదే. మంచిది. ఇప్పుడే పోయి వీరబాహువును బిలుచుకొని రా.

(సేవకుఁడు నిష్క్రమించి వీరబాహువుతోడ వచ్చుచున్నాఁడు.)

వీరబాహు—దండం చామీ? దబ్బున పారమ్మన్నారు. గంజికుతికిలో పోస్కోవడంకూడా యిడిశేశి పారొచ్చినాను. మాయయ్యా! యేదైనా దూడాగీడా పసరంగిసరం యీడ్సుకొన్నాదా చామీ?

చెఱసాలయధికారి—ఏమిరా? యిల్లు రగిలి మండుచుండఁగాఁ జుట్టనిప్పు కావలెననెదవు?

వీరబాహు—చామీ? మాయబ్బతోడు, సుట్టా, గిట్టా, పట్టినోణ్ని గానయ్యా! పెద్దమాటలు శెప్తావున్నారు. మాయప్పా! మీకాళ్లకాడ కాస్కొని పడుండోణ్ని. అలా యెప్పుడూ యెంచబోకండి చామీ?

చెఱసాలయధికారి—ఒరీ! ఊరక మాటలాడకు. అట్టిదేమియు లేదు. న్యాయస్థలంబునుండి యుత్తరువు వచ్చియున్నది. దాని నెఱవేర్చవలెను. అవసరవిషయంబు, మహారాజావారి యింటివిషయము.

వీరబాహువు—అయ్యో! అదేటయ్యా ఇదో కాస్కొన్నాను చామీ! ఆట్లాటిపని యేమో శెప్తే యింటాను. నా శేతికింద వోఁడు వనోడున్నాడు. మా విద్దరవూ శేరి ఆపని చణంలో సేశేస్తాం అయ్యా!

చెఱసాలయధికారి—ఇదో! యీబిడ—

వీరబాహు—ఇదోవున్నాది. అవును శెప్పండయ్యా!

చెఱసాలయధికారి—ఔనురా! చెప్పుదానిని వినుము. అడ్డముగా మాట్లాడకు.

వీరబాహువు—(నోటిని చేతితో మూసికొని) నేదయ్యా! శెప్పండయ్యా! యింటాను.

చెఱసాలయధికారి—ఇది నిన్నటి సాయహ్నము మనమహారాజా వారి పుత్త్రరత్నము నెవ్వరును జూడకుండ నపహరించుకొని పోయి, హత్య చేసినట్లు నేరము స్థాపనంబు చేయఁబడి విచారణమున నేరస్థురాలే యని నిర్ధారణము సేయఁబడినది. కాఁబట్టి శిరశ్ఛేదమునకై యాజ్ఞాపింపఁబడినది. ఇప్పు డాదండన మాచరించునట్లు న్యాయాధిపతిగారియొద్దనుండి యుత్తరువు వచ్చియున్నది. కాఁబట్టి యాయాజ్ఞప్తిని తోడనే నెఱవేర్చవలయును. వధ్యస్థానంబున కీవు రావలసిన సన్నాహంబులతోఁ ద్వరలో వచ్చి చేరుదువుగాక.

వీరబాహు—అయ్యయ్యో! నాశండాల ప్పాపికూతరా! కరెంపాక్కాడలాగ వొక్క బిడ్డడే వున్నాడాయయ్యకు. ఆయన్నా సంపేసిందీయమ్మ. అయ్యయ్యో! యీయమ్మ బిడ్డాపాపల్ని కనుండనేదా? ఇదేఁవయ్యా! బూతమా? పిసాసవాఁ నాకడుపులో కలియబెడతావుందే. మనమారాజావోరిబిడ్డనే సంపేశింది యింకేమేం పల్లు శేశుండదు? ఏంటయ్యా! పిచ్చీ గిచ్చీ యెత్తి వుండాల దీనికి.

చెఱసాలయధికారి—ఒరీ! పిచ్చి నీకెత్తినది. ఇప్పు డీవు పోయి శీఘ్రముగా రా. ఉత్తరువును నేఁటికే జరుపవలయునఁట!

వీరబాహు—అట్టా వుంటే ఇదో వచ్చేస్తానయ్యా! నానింకా తామసం వుండాదేమో అంటా, వుండానయ్యా! కోపంసెయ్యకం డయ్యా నానిదో యిప్పుడే పారొస్తాను.

(ఇంటికై పరు గిడుచున్నాఁడు.)

వీరి—ఏమి యింత యుత్సాహాతిశయంబుతోఁ బరుగిడి వచ్చుచున్నారు?

వీరబాహు—ఉత్సాహంబా మఱియు నుత్సాహంబా! మన మేమేమో సంకల్పముల సంకల్పించి వేసితిమే. చూచితివా మనమునివరే



ణ్యుల స్థైర్యంబును? అంతశక్తి లేకుండినచో, మనయాచార్యులిందుఁ దలపెట్టుదురా? వసిష్ఠునితోడి వాదులను, బెట్టుకొందురా?

వీరి—ఏమి, ఏమీ, ఏమి! యేదైనను ఫలితమునకు వచ్చెనా?

వీరబాహు—ఫలితమునకు రాకయేమి? ఇఁక క్షణకాలంబున జయమే లభించును. వసిష్ఠుని మోము వాఁడిపోవలసినదియే.

చెల్లి—ఏమిసంగతి? సంగతిని బయటఁ బెట్టుఁడు. కొంచెము వినియైనను సంతోషించెదను.

వీరబాహువు—ఆహా! మునివర్యు లేవేవో తంత్రంబులం బన్ని చంద్రమతి యీనగరి రాజపుత్త్రుని హత్యచేసినట్లు నిర్ధారణము సేయించివేసిరి. ఆకారణంబునం జేసి, యాయమ్మ శిరశ్ఛేదంబు చేయునట్లు తీర్పు గలిగెను. సేవకు లామెను శ్మశానవాటికకుఁ దెచ్చియున్నారు. నే నిదిగోఁ బోవుచున్నాను. ఉత్తరువైనచర్య జరుపఁగలందులకై యేచుబోయి హరిశ్చంద్రుం బిలిచి యాయమ్మ తల నఱుక నియమించెదను. ఏమి చేయఁగలఁడు? అందుల కొప్పుకొనునా? మనస్సు వచ్చునా? కొంచెము తప్పియే చరింపవలసి వచ్చును. ఇట్టి సమయమున మునీంద్రులును రాఁగలరు. నీవును నచ్చోటికి వచ్చి యుండి జరిగినదానిని చూడుము. సంతోషించుము.

వీరి—ఆహా! ఆలాగా! అంతవఱకును నెఱవేఱిపోయెనా? తనయాలిని సంహరించునట్టి హృదయస్థైర్యమును గొనునా యొకఁడు? ఇందులకేదైనను దంత్రమును బన్నినచో హరిశ్చంద్రుఁడు తన సత్యవ్రతంబునుండి చ్యుతిఁ జెందఁగలఁడు. ఆక్షేపణ ముండదు. మనపడిన శ్రమంబులకుఁ బరిహారంబు కలిగిపోవును. పా పాపకీర్తులును మనల నంటకపోవును.

వీరబాహువు—అందులకనియే యుత్సాహంబుమైఁ బరుగిడి వచ్చినవాఁడను. మునివరు లందులకు నేదేని మార్గమును వెదకియే యుందురు. ఇదియేకదా వారికిఁ గార్యము. నిద్రయా? ఆహారమా? ఒక్కటియును లేదే, ఇదియే కడపటి యత్నంబుగ దృఢంబుగొని వచ్చునట్లు చెప్పిరఁట!

వీరి—సరి, సరి. ఇదిగో నేను వచ్చివేసెదను. మీరు ముందు పొండు. మీ వెంటనే వచ్చెదను.

వీరబాహు—అవునౌను. అదియే యుక్తము. నాతోడ రావలదు. నా వెంటనే రమ్ము.

(వీరబాహువు వేగముగా నిష్క్రమించుచున్నాఁడు.)

వీరబాహు—దండం. చామీ! ఇదో నచ్చేస్తిని శెప్పండయ్యా!

చెఱసాలయధికారి—ఒరీ! వీరబాహూ? దీనిఁ బిలుచుకొని వధ్యస్థానంబునకు రమ్ము.

వీరబాహు—ఇదో వచ్చేస్తి నయ్యా! (చంద్రమతిని డగ్గఱించి) యేయమ్మో నడు. నడు, నడు బేగినడు.

కన్యావృత్తము—ఈ మా - పాపం, యేమో శేస్తీ?
ఓమా! పో! పో, పోమా పోమా.

చంద్రమతి—(నడిచి వచుచ్చునే మెల్లఁగా) హా! పరమేశ్వరా? ఇదియు నీదివ్యచిద్విలాసంబులయం దొక్కటియా? ఏపాపమును దెలియని యీదాసురాలి నీపెద్ద యపనిందకుఁ లోఁబఱుచుటయు నొక యనుగ్రహమా? నేను మరణంబునకు వెనుదీయుదానను గాను. ఇట్టియపఖ్యాతితోడిచరమదశకై పరితపించుచున్నాను. మఱొక తూరి నాచిత్తేశునిముఖకమలంబు దర్శించునట్టిభాగ్యంబునకు నైతము నోచుకొనైతిని. హాదైవమా! నేనో, అబలను. అనాథను.



ఏమి యెఱుఁగుదును? నీవు సర్వజ్ఞుండవు. నీపాదపద్మంబుల నిజముని నమ్ముటయే నేఁ దెలిసికొన్నది.

(మౌనము భజించుచున్నది.)

వీరబాహువు—ఇదో, అయ్యా! దొంగకి దెయ్యాలు చానా అంటారే! అది చరిగ్గానే వున్నాది.

[చెఱసాలయధికారి, ఊరికావలివాఁడు వీరబాహువు, ఇద్దువ్వురును చంద్రమతితోడ వధ్యస్థానంబును జేరి నిలుచున్నారు.
హరిశ్చంద్రుఁడు గొంత యావలిప్రక్కఁగా నిలుచున్నాఁడు.]

చెఱసాలయధికారి—ఓరీ వీరబాహు! న్యాయాధిపతి యంపినయాజ్ఞను చదివెదను. విని, ఆలాగు చర్యను జరిపివేయుము.

వీరబాహు—ఆహా! అయ్యా! ఆలాగే సేస్తాను. చామీ!

చెఱసాలయధికారి—(ఆజ్ఞాపత్రమును జదువుచున్నాఁడు.) ద్వాపరయుగంబు 10367- వర్తంతి క్రోధినామవర్షంబు వైశాఖమాసము, అపరపక్షము ద్వాదశిని మాసమఖంబునఁ బరిశీలింపఁబడిన తగవునందు, నేరస్థురాలుగాఁ దీర్మానింపఁబడిన చంద్రమతి యను స్త్రీకి మరణ దండనము విధింపఁబడెను.

ఆకారణంబునంజేసి కాశికాక్షేత్రమునందలి చెఱసాల కధికారి యగు మీకుఁ దెలియపఱుచుట యేమనఁగా:-క్రోధినామసంవత్సరము వైశాఖమాసము, అపరపక్షము, ద్వాదశి తిథి సాయాహ్నము కాశికాక్షేత్రమునందలి శ్మశానవాటికం జేరిన వధ్యప్రదేశంబున, పైఁగనఁబఱిచిన నేరస్థురాలగు 'చంద్రమతి'యను దానియొక్క జీవములు శరీరమునుండి వియోగము నొందునట్లు, శిరశ్ఛేదము చేయవలయును,

ఈయుత్తరువు నెఱవేర్పఁబడినందులకై, యభిజ్ఞాన సూచనంబుగా, తమయొక్క చర్య జరిపిన చీటిని, ఈకట్టెడ చీటిని జేర్చి మాకంపివేయవలయును.

క్రోధినామసంవత్సర వైశాఖబహుళ ద్వాదశియందు మాచేవ్రాలును న్యాయస్థానము ముద్రయు వేయఁబడియున్నవి.

ఇట్లు,
ప్రథమన్యాయాధిపతి.

హరిశ్చంద్రుఁడు—(పత్రమునందుఁ జంద్రమతి యని చదువునపుడామె ముఖమును జక్కఁగాఁ జూచి) హా! పరమేమేశా? యేమికర్మము? అయ్యో? యేమిదుర్గతి సంభవించి పోయినది నా హృదయేశ్వరికి? మార్గమునం దేమితటస్థించెనో కదా? హా! పరమేశ్వరా? ఇట్లును నుమ్ము నీదృశపరిశోధనంబులకుఁ దార్తువా?

(అనుచునే తలవాంచి కండ్లనీరు గార్చుచుండును.)

చెఱసాలయధికారి—వీరబాహూ? యిఁక నీవు చర్య జరుపవచ్చును.

వీరబాహు—ఇదో చణంలోకే శేశేస్తానయ్యా!

(హరిశ్చంద్రుంగూర్చి.)

యేంటయ్యా! అరిసెప్పా! సూడు. ఇందా! యిది.

హరిశ్చంద్రుఁడు—అయ్యో!

వీరబాహు—యేంటరిసెప్పా! అయ్యో అంటావున్నావు. ఆఁడదంటా సూస్తావా? వోరైతే మనకేవఁప్పా. అయ్యవుత్తర వెట్టానో అట్టా నడ్సుకోవాలే. శెయ్యనని శెప్పేయి నేను శేసేస్తా అరిసెప్పా.

హరిశ్చంద్రుఁడు—అట్లేమియు నభ్యంతరము లేదు. తమరు సెల విచ్చినదానిని జేయుటకు సిద్ధుఁడనుగానే యున్నాను.



వీరబాహు—మంచిదిదోవుండావే. యిది మనమారాజావోరిబిడ్డణ్ణి దొంగిలించి కొంపొయ్యి సంపేశిందంటా. అందుకంటా తలనఱికేయాలనంటా ఆన వచ్చున్నాదప్పా! అదికూడా మనపనిగాదా దీన్ని వొంగేసి యీకత్తితో వోకేటు యేటుకు రెండేతునకలయీలాగనరికేయి అరిసెప్పా! బద్దరం. దొరగార్లంతా నిల్సుకుండారు.

(ఖడ్గమును జేతి కిచ్చుచున్నాఁడు. హరిశ్చంద్రుఁడు దానిఁ దీసికొని చంద్రమతిని వధ్యస్థానంబున కనునయించుచున్నాఁడు.)

హరిశ్చంద్రుఁడు—అయ్యో! కాంతాలలామ? నీకిట్టిగతి యెట్లు సమకూఱినది?

చంద్రమతి—నాథా? చింతింపకుఁడు. నేను రూకయును బట్టయును దెచ్చుటకై పోవుచుండఁగాఁ ద్రోవలో నొకప్రేతము దట్టువడెను. అది మనకొమారునివలెనే యుండెను. దానిఁ జూచి హృదయతాపాతిశయంబునం జేసి పొడకట్టిన పుత్త్రభ్రాంతికి గుఱియై చేతుల నెత్తి పెట్టుకొని ప్రలాపించితిని. తోడనే యారక్షకభటులు పరుగిడి వచ్చి నన్నుఁ బట్టుకొనిరి. పిమ్మట న్యాయస్థలంబునందు నేనే యాబిడ్డని దొంగిలి కొనిపోయి హత్యచేసినట్టు లనేకులు సాక్ష్యమిచ్చిరి. అందువలన న్యాయాధిపతి నాకు మరణదండనను విధించిరి.

హరిశ్చంద్రుఁడు—అక్కటకటా! కాశికాపతీ! యిది యేమిమాయ. "దైవము నమ్మినవారు ధన్యులు గాకమాన"రను మాట తథ్యమో? మిథ్యయో? అయ్యో! జ్ఞానవతి యగు నీ నాచంద్రమతి కిట్టియపనిందతోడి దుర్మరణమూ సంఘటిల్లెను? హాదైవమా? సర్వవ్యాపకసాక్షివి నీ వొక్కఁడవే యగుచో నీతప్పుసాక్ష్యమ్ముల జల్పము లెట్లు తథ్యంబు లగును? హా! కరుణానిధీ! ఇవ్విధంబుగను శోధింతువా? భరింపరాని పరిశోధనంబుల నెట్లు భరింపఁగలము? నిన్న గతించి

ప్రేతస్వరూపుఁడై పడియున్న బాలుని శరీరసంస్కారంబున కింకను మార్గము లేకున్నదే. ఇంతకు లోఁపుగ నీపెనుపిడుగు నాయెదపైఁ బడ నేమి చేయువాఁడను. ఈయిరువురికిని సంభవించినట్టులే యీ దీనునికిని సంభవంబయ్యెనేని! సర్వేశ్వరా! అదియే యీనీపాద దాసునిపైఁ బరిఢవిల్లఁ జేసిన తావకీన కృపాతరంగిణీతరంగామల శీకరవారిపూరంబు లగును. హా! యెట్టు లీపరితాపాగ్నికిఁ బాల్పడి పరితపింప నోపుదును. ఇఁక నీశరీర మెందులకు? హేయభాజనము! హేయభాజనము. అయ్యో! నాముద్దులకుఱ్ఱఁ డనదతనం బొంది గతించియు సంస్కారంబునకు గతి గానకుండువాఁడు. హా! కాత్యాయనీకాంతా! గరళకంఠ! ఏమిదోసఁగును బొసఁగించినవాఁడనో? ఎవ్వారిబాంధవ్య మోహపాశంబును ద్రెంచివైచితినో? సజ్జనుల హృజ్జలజాతంబుల నశ్రాంతక్లాంతికి విశ్రాంతపఱిచినాఁడనో? నగరంబునం దేనేమేని దప్పఁ జరించినాఁడనో? ఉమారమణా! యే నొక్కటియుఁ దెలియకున్నాను. నాజీవములకు జీవంబె యీ నారీరత్నంబు. ఈ నాచెడినచేతులతోనా? దీని శిరఃకమలనికృంతన మాచరించుట. పిమ్మట ధన్యుంబలె ధరణీతలంబునఁ జరించుట! ఇంతకంటె నాకుఁ బాడసూపఁగల చెడుకాలం బొకఁడు చూపట్టునా? ఇంతకంటె నాచేయుదుశ్చరితంబు మఱొకం డుండునా? అహో! జగదీశా? సర్వేశా! పాపనాశ! భక్తపోషా! కాశీవాస! యేమిసేయుదును? ఏమిసేయుదును. ఎట్లిఁక నిలాతలంబున నుజ్జీవింతును? అయ్యో! మనోహారీ! నీశిరశ్ఛేదంబు సేసి ప్రేతంబుగాఁ జూచుటకా యీచర్మచక్షువు లున్నవి? యీపాదుకను లేపాపంబును జేసినవో? అయ్యో! అయ్యో! హా! విశాలాక్షీరమణా!

(తలవ్రేల వేయుచున్నాఁడు.)



చంద్రమతి—అహో! ప్రాణనాథా! కేవల మొకస్త్రీకై దేవరవా రిట్టి శోకార్తికిఁ జిత్త మాయత్తపఱుచుట, దగదు, తగదు. తొలిజన్మమునందలి దోషకర్మ మిట్లుగా నాశ్రయించి యిపుడు నివర్తి యగుచున్నదే కాని మఱేమియును గాదు. దాని నిరోధింప శక్తు లెవ్వరు? "వారి వారి కర్మానుసారంబుగా వారు వారు వత్తురు పోదురు" అనుట దేవరవారి దివ్యచిత్తమున కెక్కినది గాదో! నేనో! దేవరవారికి మధ్యను దటస్థించినదానను. కొంతకాల ముండి వియోగమును జెందెదను. కాఁబట్టి, దేవరవా రేల చింతింపవలెను? వలదు, జీవితేశా! వ్యసనపడకుఁడు. శరీరంబునకు బంధువు లయిన వారిని నమ్మి యాత్మకు బంధుత్వ మొందినవానిని జేవదలుట దగదు. ఆనిశ్చయజ్ఞానసంపత్తి గలిగియు దేవరవారు చింతిల్లుట యేల? వలదు, ఉత్తరువును ధైర్యంబు గొని నెఱవేర్పుఁడు.

హరిశ్చంద్రుఁడు—ఆహా! నామానసంబునకు వచ్చిన యోరాజహంసమా? ఏమ తెలివియే నీకు? యీప్రజ్ఞానవతి యగుజాయను వినా జీవించుటకంటె నన్న ద్వేషంబుం గొని యాయువు దొఱఁగుట మేలు. హా! కీరవాణీ? నీమంజుల స్వనంబులం జెప్పిన "మధ్య వచ్చినదాన, మధ్య నేఁగెదను"—అను నీమాటయే నాచిత్తంబును శతధా ఛేదించుచున్నది. భార్యాభర్తలసంబంధము జన్మాంతర పరిచయంబునం దొట్టినది గాదో? కాంతాలలామా! కాఁబట్టి వా రెన్నటికి నైకమత్యముఁ జెందినవారే యవుదురు. దీనివలననే కదా?

"గీ॥ తండ్రితోడ వ్రగ్గుఁ దనమహోన్నతవిద్య
తల్లితోడఁ జనును దనదుసుఖము
తన్వితోడఁ బోవుఁ దనమనోహ్లాదముల్
దనయుతోడఁ దక్కుఁ దనదునిక్క."

అనుటయు దీనిఁగూర్చియే. పడఁతీ! ననుబోలినపాపు లెవరు? ఈప్రపంచంబునం దొందుటకుఁ గానిగుణఖనిని భార్యఁగా న్యాయమార్గంబునఁ బొందియును, ఆయన్నులమిన్న నెడఁబాయవలసి వచ్చినది. అహో! యిఁక నామనోహరి నెడఁబాసియు నుజ్జీవించి యుండుట యొకగొప్పకార్యమా? అయ్యో! నాకు ధైర్యము చెప్పిన నీజీవము లెంతపరితపించుచున్నవో కదా! యీనీగతిని గాంచియు నాజీవంబు లింకను నీపాడుశరీరము నాశ్రయించి యున్నవే? అయ్యో! నాగుండె యెట్టిదిట్టతనము నవలంబించియున్నది?

(చింతిల్లుచున్నాఁడు.)

చంద్రమతి—ప్రాణనాథా! సర్వజ్ఞులరైన దేవరవారు కూడ నిట్లు పరితపించిన నేమిచేయ నగును? ఊఱట వల్కునంతటివా రెవ్వరున్నారు? నామనస్సునం దించుకంతేనియు భీతి లేదు. స్వల్పకాలంబునకు ముందు దేవరవారి ముఖదర్శన మబ్బకయే జీవము లెడఁబాయుచున్నవిగా, అని కొంచెము చిత్తవ్యథ యుండెను. నాజీవములు నాజీవితేశులచేతులార వియోగము, నొందునట్టి మహాభాగ్య మబ్బినది. ఇంతకంటెను నేను బొందఁగల ధన్యత్వం బేది గలదు? ఇంతేకాక యేను మరణమునకు వెనుదీయుదానను గాను. ఆయవస్థకే నెప్పుడును సిద్ధపడియే యుండుదానను. లోకములోఁ గొందఱు మానవులు దుష్కార్యంబుల సమాచరించి మరణము తటస్థించిన కాలంబునందు వానినిఁ దలఁచి దలఁచి పరితపింతురు. దాసురాలీజన్మమునందు దేవరవారి యాశ్రయ విశేషంబునం జేసి దుష్కార్యవిముక్తిం జెంది సన్మార్గంబు నవలంబించి సుకృతపరిపాకంబును జెంది యుంటిని. అదికారణంబున నంత్యదశకుఁ గుతూహలాయత్తచిత్తనై యుండుదానను. ఇంతేకాక మరణా



వస్థవలని విశేషంబునం జేసి ప్రజ్ఞావిశేషంబు దప్పి చిత్తస్వాస్థ్యము లేక యుండుదానను సైతముఁ గాను. సంపూర్ణబుద్ధి వైభవంబుతోడ దేవరవారి హస్తాబ్జంబులవలనఁ బ్రాణవియోగంబుం జెందెదను. ఇదొక్కటే నేను జన్మ మెత్తినందులకు సార్థకము పరమానందము. జీవములును సుకృతపరిపాకులు వోవుచోటికిఁ జేరి సుఖించుఁగాత! కాబట్టి యోచిత్తేశా! చింత మాని యీదాసురాలిని గూర్చి యేర్పడిన యాజ్ఞను నెఱవేర్పఁ దెగువ నొందుదురు గాక!

హరిశ్చంద్రుఁడు—పడఁతీ! నీధైర్యోక్తులవలన నామనంబు మఱింత నీరగుచున్నది గాని యొకవిధంబైన చిత్తస్వాస్థ్యంబును గాని చెందకున్నది. అయ్యో! జగదీశ యేమి సేయుదును? ఎట్లు పిమ్మట జీవింతును? కాంతామతల్లీ! నిజమునే నెఱితోడ నెఱనమ్మినవారము. ఇఁక దానివలన నేమి వచ్చినను రానిమ్ము. నీవు నీయిష్టదైవమును జిత్తపీఠికిఁ దార్చి ధ్యానంబు సల్పుము. తూర్పుదెసఁ దలఁజేసి యవనతవై యుందువుగాక! హా! పరమేశా! నిజమును దెలియుదువు నీవు. నీవే సత్యస్వరూపుఁడవై సర్వాన్తర్యామిత్వం బొంది యుందువు సర్వేశా! యిదే నాయర్ధాంగలక్ష్మి శిరశ్ఛేదంబు చేయుటకు సమకట్టినాఁడను. ఇఁక దీనియాత్మ పరమపవిత్రం బయిన నీపాదకమలంబులయం దైక్యము నొందునుగాక!

(కలఁతఁ జెందుచున్నాఁడు.)

చంద్రమతి—ప్రాణేశా! యిదే దాసురాలు త్రికరణశుద్ధిగ దేవరవారి పాదకంజంబులకు ననేకనమస్కారంబులు చేయుచున్నది. విజ్ఞానవతు లగు విరిబోండ్లు చిత్తశుద్ధిగఁ దలపోయవలసినది చిత్తేశుని శ్రీపాద యుగ్మంబే యగును. ఇఁక మఱొకతూరియుఁ ద్వదీయ పాదపల్లవంబులనే యెద నిల్పి భజించి నతిసల్పి తలవాంచెదను.

హరిశ్చంద్రుఁడు—అహో! గుణమణీ! నీశిరనికృత్తనంబునకు నాకరం బేమని తెగించి యొప్పఁగలదు? అయ్యో! నాదుష్కృతమా? నన్నుఁగూర్చి నోచ్చుకో లొకటి దప్ప నేఁ జేయఁగలుగున దేది గలదు? (వెనుదీసి) కాంతానుతల్లీ? జితకల్పవల్లీ! ఈ హరిశ్చంద్రహతకునిఁ దలపోసి నందునఁ బ్రయోజనం బేమి? ఆ జీవేశ్వర బంధుం డగు శ్రీ శ్రీకంఠుని దలపోయుము. అహో! ఆపరమేశ్వరుఁడే నీకుఁ దోడుపడునుగాక! భయపడకు, భయపడకు!!

చంద్రమతి—ప్రాణేశా!

సీ. సకలదిక్తటముల సాంధ్యరాగమువోలెఁ
  గెంజెడ లెంతయుఁ గెంపు నింప
ఘనఘనాఘనముల ఘననీలిమమువోలెఁ
  దనకంధరచ్ఛవుల్ - దనరుచుండ
క్షుద్రశిక్షణచణ - శూల మాకేలను
  డాకేలఁ గమనీయ - డమరుకంబు
పరమశిష్టులఁ బ్రోచు - వరదహస్తంబును
  హస్తంబుమఱియొంట నభయముద్ర

గీ. నెలమిఁ దళ్కొత్తఁ గాత్యాయనీధవుండు
  భక్తలోకంబుపాలింటి పరమధనము
  కమలఁ గట్టినభాతియై కానఁబడెడు
  భయము నాకేల హృద్వీథిఁ బ్రార్థివేన్ద్ర!

సీ. ఏడుదీవులకెల్ల నేకాధిపతి వయి మించినా వరులఁ గ్రుమ్మించినావు
  అవనీస్థలికి నంత యజ్ఞశాలలను బన్నించినావు యశమ్ము నించినావు
  ఇనకులంబునకుఁ బుట్టిల్లగునిజమున మొల్చినా విలఁ బాప మొల్చినావు
  సహజవిక్రమధైర్యశౌర్యగాంభీర్యముల్ పెంచినా విట్టు లో ర్పెంచినావు

తే.గీ. పుస్తెగట్టిన నీచేతిపోకకన్న, నాదుబ్రదుకున కిచ్చ యింకేది గలదు
  స్వామియానతి నేయు నాప్రేమగోయు, పుత్త్రశోకార్తురాలినన్ బొరిగొనుమిఁక.



హరిశ్చంద్రుఁడు—సతీమణీ! అది తథ్యంబే యగును. ఆ పరమేశ్వరుని పాదారవిందంబులనే త్రికరణశుద్ధిగఁ దలపోయుచు నవనతవై నిలుచుందువుగాక.

చంద్రమతి—ప్రాణనాయకా! విజ్ఞానవతులు భర్తృవచో విశేషంబున కనువుగా నీశ్వరపూజనం బొనర్తురు గాన దేవరవారి యాజ్ఞానుసారంబుగ నేనును ఆసర్వేశ్వరుని పాదకంజంబులను ధ్యానించుచు శిరంబు వాంచి నిలుచుండెదను.

దండకము—శ్రీమన్మహాదేవ! కాత్యాయనీజాని! నీపాదపద్మంబులన్
  జూడఁగా నెంచి క్షీరాబ్ధిజాప్రాణకాంతుండు కోలాకృతిం
  బూని గోత్రంబు భేదించి శోధించియున్ గానఁడయ్యెం
  గదా! భక్తసంలభ్య! యే నట్టి శ్రీపాదపంకేరుహద్వంద్వ
  మాహా! కనుంగొంటి హృన్నేత్రపర్వంబుగా శర్వ! ధన్యాత్మ! ధన్యాత్మ! ధన్యాత్మ నైతింగదే! సర్వసర్వంసహామండలిం గుల్కు నాచారభేదంబులన్ నామభేదంబులన్ రూపభేదంబులం
  బోల్చి తత్తన్మహాచిత్త దార్ఢ్యంబు సచ్ఛీలసద్భక్తి మార్గం
  బులం జూచి పెంపొందుకారుణ్యమున్ జేసి నీదైనసాయు
  జ్యసామ్రాజ్యముం గూర్పవే దేవ! నిష్పాక్షికం బైననీది
  వ్యనేత్రంబు, వీరుండు, భీరుండు మిత్రుం డమిత్రుండు వి
  ప్రుండు నీచుండు బాలుండు వృద్ధుండు సంపన్నుఁ డాపన్నుఁడున్,
  మానినీ మానవుం డన్న భేదంబులం గాంచునే సాంబ! యీకింక
  రీజీవముల్ నీదుపాదంబులం జేర్చి పాలింపుమా! భర్గ! భద్రేభచ
  ర్మాంబరా! విశ్వనాథా! నమస్తే నమస్తే నమః.

(చంద్రమతి తలవాంచి నిలుచున్నది. అపరాధిన్యాయవాదియును విశ్వామిత్రుని శిష్యుండును వచ్చుచున్నారు.)

అపరాధి న్యాయవాది—(చెఱసాలయధికారిం జూచి) అయ్యా! మరణదండన విధింపఁబడిన నేరస్థురాలిని గూర్చిన యంశములను మాత్రము గలిగిన కొన్నిసాక్ష్యంబు లుండునట్లు గానంబడుచున్నవి.

ఆసాక్ష్యంబులవలన నీమరణదండనము మార్చివేయుటకుఁ జాలినంత సందర్భము గలదు. కాఁబట్టి యీదండనమును స్వల్పకాలము నిల్పి యుంచుటతోడ నేరస్థురాలితోఁ గొన్నియంశంబులను మాట్లాడుటకు ననుమతి యియ్యవలయును.

చెఱసాలయధికారి—ఆహా! ఆలాగే చేయవచ్చును. మా కేవిధమయిన యభ్యంతరమును లేదు. ఓరీ! వీరబాహూ! దండనంబును స్వల్పకాలము నిలిపి యుంచుము. న్యాయవాది నేరస్థురాలితోడ నేమో మాటలాడవలయునఁట.

వీరబాహు—యేంటయ్యా! అరిసెప్పా! రవించిక తాళప్పా! యేటు యేయకుమా? అయ్య యేంటో శెప్తారంటా.

హరిశ్చంద్రుఁడు—ఆహా! ఆలాగే చేసెదను.

అప. న్యాయ—(హరిశ్చంద్రుం జేరి) అయ్యా! యీయమ్మ మీ భార్యయా?

హరిశ్చంద్రుఁడు—ఔనయ్యా!

అప. న్యాయ—ఆహా! యేమికాలము! వ్యర్థముగా నీ యమ్మమీఁద నపకీర్తిభారంబును మోపివైచిరి. పాపము! నడిచిన సంగతిని సవిస్తరముగ విన్నారా?

హరిశ్చంద్రుఁడు—ఔనయ్యా! ఒకపర్యాయము విని యుంటిని.

అప. న్యాయ—ఒకపర్యాయ మననేమి? అన్యాయము! ఊరిమేలు కొఱకుగా నేర్పఱుపఁబడిన యిక్కావలివాండ్రు మెయిమఱచి, కీడు సమాచరింపనుగదా కంకణమును గట్టికొనిరి. అయ్యో! ఏపాపంబు నెఱుఁగని యీస్త్రీపైని లేనినేరములను దప్పుసాక్ష్యంబులవలన నారోపించిరి. నేరస్థురాలినిగా నకటా! చేసివైచిరి. మే మీవార్తగవు



నందలి నిజము లయినయంశముల నెత్తి చెప్పి యెంతగ వాదించితిమో యడిగి చూడుఁడు.

గుమాస్తా—ఆహా! యేమి వాదించిరి! యేమివాదించిరి! ఏమిప్రశ్నములను వేసి సాక్ష్యంబులఁ దబ్బిబ్బులుగఁ జేసిరి! వీరివాక్పుణ్యము చేతనే కదా! ఉన్నది లేనట్లును లేని దున్నట్లును జెప్పసాగిరి. న్యాయవాదియు వీరియమానుషశక్తి కాశ్చర్య మొంది విడుదలచేసివైచుటకే యత్నించిరి. కట్టకడపట నాతప్పుసాక్ష్యంబుల నమ్మి మధ్యస్థులు నేరస్థురాలే యని చెప్పివేసిరి. న్యాయాధిపతులును దమ తీర్పానం దేమిచెప్పిరి? "మధ్యస్థులు నిన్ను నేరస్థురాలను చున్నారు. కాఁబట్టి నేనును అట్లే తీర్మానించెదను" అనిరి. అందువలననే వారి యనిష్టము వెల్లడి యగుచున్నది. వా రేమిసేయుదురు? మధ్యస్థులు సేయు తీర్మానముం గొని, తీర్పుఁజెప్పవలయు నని చట్టమున్నదఁట! లేకుండిన యెడల నొకేపెట్టున విడుదలగదా, చేసివేసి యుందురు. అయినప్పటికిని "మహారాజావారికి మనవి చేసికొని యీతీర్పును రద్దుపఱచుకొనన నిమ్మని వారియభిమతము." అని నమ్మెదను. ఈ యంశము వారిముఖమునుండియు మాటలనుండియుఁ జక్కఁగా వెల్లడియయినది.

అప. న్యాయ—మఱేమని తలఁచెదరు? అట్లు దానియందంత పట్టు లేకపోయినచో మే మేల యిక్కడికి వచ్చెదము. ఒకయంశమునకు మాత్రమే సాక్ష్యము వలసి యున్నది. ఈ సాక్ష్య ముండుట మాకు ముందే తెలిసియుండిన నింతవఱకుఁ దగవు ముదిరియే యుండదు. వ్యర్థముగా నాబ్రాహ్మణుని వానిభార్యను నమ్మి కదా మోసపోతిమి. వాండ్రనుసైత మీయూరికావలిభటులు సరిపఱచుకొన్నారుగా! వాండ్రును దమచానిన పోయినను బోవనిమ్మని మనకు

మొదలంట విరుద్ధముగానే వాఙ్మూలముల నిచ్చిరి. ఇంకను నిచ్చట నిద్దఱు సాక్షు లున్నా రనియే తెలియకపోయినది.

అట్లున్నచో నప్పుడే న్యాయస్థలమ్మునం దొక్కపెట్టునఁ గొట్టివేసి యుండవచ్చును. ఉండనీ—ఏమిచేయవచ్చును. ఒక జీవమును రక్షించుటయే యొక గొప్పకార్యము. మంచిది, ప్రొద్దు పోవుచున్నది. మనకార్యంబును ముగించుకొని సంతోషంబుగ నుండు కాలమునం దంతయు మాటలాడుకొనవచ్చును. మనకార్యమును జూతము ముందుగా. (హరిశ్చంద్రుంజూచి) ఏమయ్యా! ఈకార్యము మీకు సమ్మతమే కదా!

హరిశ్చంద్రుఁడు—అయ్యా! ఏతీఱుగా నైనను న్యాయమార్గంబున విడిపించినచోఁ దమ్మును నాకాశీకాపతి యనియే భావించి నమస్కరించెదను. నిజమును గ్రహించి యుండుతమకు నేను జెప్పవలసిన దేమున్నది? యీబీదనుగూర్చి యింత శ్రమం బెత్తికొనిన మిమ్మును మనమారఁ గృతజ్ఞతా సూచకంబుగ నమస్కరించుట దక్క మఱేమిచేయుటకు శక్తిఁగలిగినవాఁడను? దిక్కఱినవాండ్రకు దైవమే గతి యన్నసామెతగా, మీర లిచటఁ గానంబడితిరి. తమరిది చేయఁబోయెద రని నాకుఁ దెలిసినది గాదు.

అప. న్యాయ—"ఇప్పుడేమో మరణదండనమునకుఁ దీర్మానము పుట్టిపోయెనుగదా" యను మనశ్చాంచల్యంబు వలదు. ఒక్కక్షణకాలంబుననే మార్చివేయవచ్చును. ఇట్టి సందర్భమ్ములయందు మహారాజావారు న్యాయాధిపతుల తీర్మానములను మార్చివేయవచ్చును. అని చట్టమున్నది. అట్లు మేమే యెన్నోమరణదండనముల మార్పించి వేసియున్నాము. మాసంగతిని గూర్చి విచారించినయెడల మీకును దెలియవచ్చును. అంతమాత్రము లేకున్న



నీచెఱసాలయధికారి మామాట మాత్రంబున కీదండనమును నిలిపియుంచఁగలఁడా? అది యటుండనిండు. తీర్పును మార్చుటకు మార్గమున్నది. అందులకయి భయపడవలసిన దే లేదు. ఆశ్రమము మమ్మాశ్రయించినది. ముగింపునం దిప్పుడొక్కసాక్ష్యమే గావలయును. మాపరిశీలనమునం దదియును గుదిరియే యున్నది. అదియును మీయందేయున్నది. (వీరనిఁజూపి) ఈమనుష్యుఁ డెవఁడు? ఇతఁడును మీతోడ నుండువాఁడా?

హరిశ్చంద్రుఁడు—అవును, అయ్యా! మాతోడ నుండువారే.

అప. న్యాయ—అవునయ్యా! యిక్కడకు రా.

వీరఁడు—యేంటికిచామీ! పిలుస్తావున్నారూ!

అప. న్యాయ—ఈయమ్మ నిన్నను వచ్చునప్పు డెంతకాల ముండును?

వీరఁడు—రవించిక కంటికి శీకటిగా వుండొచ్చునయ్యా!

అప. న్యాయ—అట్లు చెప్పిన నెట్లు సరిపడును? దీపము పెట్టుటకు ముందా? వెనుకనా?

వీరఁడు—దీపంపెట్టా, రవించిక ముందూ యెన్కావుంటాది.

గుమాస్తా—ఒరీ! ముందుగానే కదరా యుండును?

వీరఁడు—అవును. దీపంయెలిగించడానికి ముందు గాదా. అందుకే అయ్యా! ఆయమ్మోర్ని నరికేయపోతారంటనే!

అప. న్యాయ—అట్టి దేమియును లేదు. దాని మార్చివేయుటకే యిప్పుడు మార్గము వెదకుచున్నాము.

వీరఁడు—అట్లైతే చరినెండి. అయ్యా! పాపం! మాయమ్మ. మాయన్న పెండ్లాం. ఆయమ్మనా నరికేయమంటారు.

అప. న్యాయ—(గుమస్తానుగూర్చి) ఏమయ్యా! యిట్టి ప్రత్యక్ష సాక్ష్యంబు నుంచుకొని వ్యాజ్యెమును వ్యర్థముగాఁ బాడుచేసి కొంటిరి. ఈయొక్క సాక్ష్యమైన సప్పుడే యుండియుండినఁ జాలునే.

గుమాస్తా—అట్లు చాలునా? ఒకసాక్ష్యంబును నమ్ముదురా? రెండు సాక్ష్యము లున్న సరిపఱుచుకొనవచ్చును. అదియును నా కప్పుడు జ్ఞప్తికి వచ్చినది గాదు. ఆయసత్యవాదులు వేయునట్టి పెనునపకీర్తి భారంబును వినఁగానే నా కున్నబుద్ధి యంతయు బూడిదలోఁ గలిసినది. ఏమిచేయవచ్చును? పోయినది పోనిండు. ఇప్పుడు కావలసిన పనినిగూర్చి యాలోచింపుఁడు.

అప. న్యాయ—సరి, ఉండనీ. ఆతనిపేరేమి?

హరిశ్చంద్రుఁడు—అతనిపేరు వీరఁడు.

అప. న్యాయ—సరి, మీపేరేమి?

హరిశ్చంద్రుఁడు—నాపేరు హరిశ్చంద్రుఁడు.

అప. న్యాయ—ఈయమ్మ నిన్నటిసాయాహ్నమునుండి యిచటనుండిన యంశము యథార్థమేకదా!

హరిశ్చంద్రుఁడు—ఆయంశము నాకుఁ దెలియదయ్యా! నేను దీనిఁ జూచినపుడు రాత్రి పదునైదు గడియలకుఁ బైఁబడి యుండ వచ్చును.

అప. న్యాయ—అయ్యయో! ఇదేమి యవస్థ?

గుమాస్తా—అయ్యా! అట్లేమియును జెప్పకుఁడు వారు జెప్పుమన్నట్లే మీరును జెప్పుఁడు. ఇద్దఱు తారుమాఱుగాఁ చెప్పవచ్చునా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! వా రొకవేళ దీని నిచట సాయహ్నమే చూచి యుండవచ్చును. నేను జూడలేదు. నేను దీనిని రాత్రి పదునైదు గడియలకుఁ బైఁగానే చూచియున్నాను.



గుమాస్తా—వారు సాయంకాలము చూచియుందురా! అదియును మీకుఁ దెలియనట్లుగదా చెప్పుచున్నారు. బాగుగా నున్నది? ఏమయ్యా! వీరయ్యా! యీయమ్మ నిన్నసాయంకాలము మొదలు నేటివేగు జామువఱకును నీ శ్మశానమునందే కదయుండిరి.

వీరఁడు—అవును. యిక్కడనేవున్నారు. మాయన్నకూడా సూస్తానే వున్నాడు.

అప. న్యాయ—మరేమయ్యా! యేల మార్చిచెప్పెదరు? ఒకవేళ మీ మనసున కిష్టములేని భార్యయా? యెట్లయినను నశించిపోనిమ్మను తలంపా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! యిది నాప్రాణసమానురాలయిన భార్య. దీనిశరీరమే నాజీవములకు నవలంబనభూమి. అట్లుండియు నేను సత్యంబు దప్పఁ బలుకఁ జాలను. అసత్యము లాడవచ్చునా?

గుమాస్తా—మంచిది. దీన నేమి? ఈయమ్మ యిక్కడికి వచ్చినదిగాదా? రాత్రి యిచ్చటనుండినదియుఁగాదా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! యిది యిచటికి వచ్చినది గలదు. ఉండినదియుఁ గలదు. నేను దీనిని రాత్రి పదునైదుగడియలకుఁబైఁగానే చూచినవాఁడఁగాని తత్పూర్వము చూచినవాఁడను గాను. అయ్యా! అది యొకటియే యే నెఱిఁగినది. నేను జెప్పఁగలుగునదియు నదియే.

గుమాస్తా—ఏమయ్యా! మీరు చెప్పుమాటలు వింతగా నున్నవి. కాలమును సూచించు యంత్రము మీచేతియందొకటి యుండెనా? విఘడియలనుగూడఁ దప్పక చెప్పుచున్నారు.

హరిశ్చంద్రుఁడు—అట్లేమియు లేదు. ఆకాశమును గనుఁగొనియే గడియలు నిర్ణయించుట. అదియునుగాక, దీని నేను జూచుకాలమున నూరిలో సందడి తగ్గి యొకజామైయుండవచ్చును. దానిఁ బట్టి చెప్పుచున్నానయ్యా!

అప. న్యాయ—ఆహా! బాగుగా నున్నది. గడియలను గనిపట్టు విధము. ఆకాశంబును జూచిన మోక్షంబునకుఁ ద్రోవదొరకును. అదియే, యింతటికిఁ దెచ్చివదలినది. మీకీ భార్యను విడిచివేయవలయునని యుండునట్లు దోఁచుచున్నది.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! అట్లు చెప్పకుఁడు. అది దానిచిత్తమునకుఁ దెలియును. నాచిత్తమునకును దెలియును. ఏమిచేయవచ్చును? సత్యమునకు విరోధంబుగఁ బలుక నగునా?

గుమాస్తా—అయ్యా! మీరు మంచివారుగాఁ గనఁబడుచున్నారు. వ్యవహారంబులను సైతము చక్కఁగఁ దెలిసియున్నారు. మీస్వాంత విషయంబునందు మాత్ర మిట్లేల వెల్లఁబోయెదరు? వినుఁడు.

గీ॥ "వారి జాతులందు - వైవాహికములందుఁ,
బ్రాణ, విత్త, మాన - భంగములను,
జకితగోకులాగ్ర - జన్మరక్షణమందుఁ
బొంకవచ్చు నఘముఁ - బొందఁడెవఁడు."

అను నౌశనసనీతి మీ రెఱింగినదిగా నుండవచ్చును. స్త్రీలకొఱకును వివాహములందును ఒకప్రాణికిఁ జేటు మూడుకాలమందును, ఉత్తమవంశ్యుల కాపదలు వొదలునపుడును, ఇత్యాదిసమయంబులయం దేదయిన నసత్య మాడునట్లు దటస్థించెనేని, యభ్యంతరము లేక, యబద్ధములు వలుక వచ్చునని పరమాచార్యుఁడగు శుక్రాచార్యుఁడు నీతినిగూర్చి పలికినవాఁడు. అట్టిది యేమాత్రము



నసత్యము గాదు. సర్వమును సాక్షాత్తుగఁ జూడఁబడిన విషయము. ఒకవేళ మీరు రాత్రిపదునైదుగడియలకుఁ బైని జూచియున్నను మీతోడ నుండువాఁడు సాయాహ్నము సూర్యాస్తమయ సమయమునఁ జూచియుండవచ్చునని చెప్పుచున్నాఁడు. ఇఁక నిం దేమి యసత్యముండఁ బోవుచున్నది? కాఁబట్టి మీయిద్దఱేకీభవించి పలుకుటయే మంచిది. మీమేలుకొఱకు మేమేల యిన్నిన్యాయము లెత్తి బోధింపవలయును? ఎత్తినపని యభ్యంతర మొందక కొనసాగఁ గలందులకై యింతపాటు పడుచున్నాము. పిమ్మట మీయిష్టము. స్త్రీపాపము భరించుకొనుట మహాపాతకము.

హరిశ్చంద్రుఁడు—అయ్యా! తమ రీబీదవానియం దనుగ్రహించి యిన్నివిధంబుల శ్రమలెత్తికొని చెప్పినందులకయి, యనేకకోటి నమస్కారంబు లర్పించెదను. కోపింపకుఁడు. ఎవరయిన నేమి? చూచినది గదా చెప్పవలయును. చూడనిదానింగూర్చి యెట్లు చెప్పవచ్చును? నాతోడ నుండువారు, వారు చూచినంతవఱకు వారు చెప్పెదరు. నేను జూచినట్లు నేను జెప్పెదను. ఉన్న దున్నట్లు చెప్పెదను. సత్యమునకుఁ జేటొక్కప్పుడును గలుగదు. కాఁబట్టి; అయ్యా! తమ రొక్కించుక ప్రయాసభారమును వహించి న్యాయంబుమై దీనవైన దీని నీదండనంబునుండి తప్పింతు రని ప్రార్థించుచున్నాను.

అప. న్యాయ—ఏమయ్యా! మీరు చెప్పుమాటలు చిత్రముగా నున్నవి. ఉన్నది చెప్ప నొప్పుకొన ననుచున్నారు. విడుదలను మాత్రము పొందింపవలయు ననుచున్నారు. ఇందు వంచనమేమో యుండునట్లున్నది. అట్లు లేకున్నఁ గన్నది చెప్పమికిఁ గారణంబేమి. ఉండనీ—(చంద్రమతినిజూచి) ఏమమ్మా! నీ వెనిమిటి చెప్పునది

నీచెవులఁ బడుచున్నదా? నీవు నిన్నటి సాయాహ్నమునుండి యిచట నుండినది యథార్థమేకదా?

చంద్రమతి—అయ్యా! నాభర్త సెలవిచ్చినయంశంబున నావంతయేనియు వంచనము లేదు. నే దీపముపెట్టిన రెండుగడియలకుఁ బిమ్మటనే అయ్యగారి యింటినుండి బయలువెడలితిని. పిమ్మటఁ బ్రేతముగాఁ బడియున్న నాపుత్త్రుని గనిపట్టి యెత్తుకొని వచ్చుటకు నర్ధరాత్ర మయినది. దీపము పెట్టుటకుముందుగా నే నిచటికి వచ్చిన దానను గాను. చావునకు భయపడి సత్యము చేవిడువఁదగునా?

అప. న్యాయ—(గుమాస్తాను జూచి.) ఆహా! కడతేఱిపోయెను వీరి విషయము. వీరు జీవములతో నీయిలాతలంబునందు బ్రదికి యుండఁగోరినవారు గారు. తమపుత్త్రుఁడు చనిపోవుటను దలఁచి, యేవిధంబుగనైనను మరణించుటయే వర మని యెంచి, తీర్మానము గొని యున్నారు. అట్లుగాకున్న, నొక స్త్రీ తాను వధ్యస్థానంబునం దుండునదై, భయ మొందని యంతరంగముతో నిట్లు న్యాయనిరూపణంబు చేయఁగల్గునా? జీవమును వదలఁ దెగించి యున్నారు. “తెగించిన వారికి దుఃఖమేది?” యనునంశము వీంద్ర వల్ల దృష్టాంత పూర్వకమగుటను మే మిప్పుడే చూచినారము.

గుమాస్తా—అవునౌను, బాగుగాఁ జెప్పినారు. అదియే తలఁపుగ నుండవచ్చును. పుత్త్రుఁడు మరణించినది మాత్రముగాదు. వీంద్రలో వధువొక్కరికిని పరుఁ డొక్కరికిని బానిస లయి యుండుట వీరి మాటలవలననే తేటపడుచున్నది. అదియు నొక కారణ మయి యుండవచ్చును. “బానిసతనమునుండి యెట్లు విముక్తి నొందుట. ఇట్లయినను మరణ మొంది ధన్యత నొందుదము” అని యిద్ద



ఱును మాట్లాడికొని గట్టిచేసికొనిన ట్లున్నది. అట్లున్న మన మేమి సేయవచ్చును?

అప. న్యాయ—ఓహో, ఆలాగా? అది. ఒకటికి రెండుగాఁ గారణము లేర్పడ్డవి. సరి, యింకేమి గావలయును. ఇంకఁ బ్రయత్నించుట వలని ప్రయోజనం బేది? ఒకవేళ వీంద్రవలననే యీహత్య జరుపఁబడి యుండిన నుండవచ్చును. మన మిందుఁ బ్రవేశించినది వ్యర్థమే. (చంద్రమతింగూర్చి) ఏమమ్మా! మీయభిప్రాయం బిటులున్న హత్యచేసినట్లొప్పుకొని యుండవచ్చునే. మాకును మిమ్ముఁగూర్చిన వ్యర్థశ్రమంబు లేకయే యుండునే.

చంద్రమతి—అయ్యా! తమ రెంచువిధంబున మాయెడల నేయొక్క వంచనమును లేదు. హత్యచేయనప్పుడు చేసినట్లుగా నెట్లు చెప్పవచ్చును? నిజమెంతో అంతే చెప్పినానయ్యా! తమరును జాలినంత ప్రయాసపడితిరి. మన మేమిచేయవచ్చును? వచ్చినదనుభవించియే తీఱవలయును గదా.

గుమాస్తా—(హరిశ్చంద్రుంగూర్చి) ఏమయ్యా! యీయమ్మచెప్పుటయును మీరు చెప్పుటయును న్యాయముగా గోచరించుచున్నవా? మీమనస్సులయందు నెలకొన్న విరక్తివలనఁ బ్రాణములు వదలుటకై పాల్పడుచున్నారు. అయ్యో! ఇదెంత పాతకము! ఒకటికి మూఁడగునే. ఉన్నదాని దాచి దండనమునకు లోఁబడుటయును, ఆత్మహత్యం గోడిగట్టుటయును దమ్ము బానిసఁ గొన్నవారిని వంచించుటయును అను మూడుపాతకంబులకు గుఱి కావలసియుండును. వీనియం దొక్కటొక్కటియును బెదనేరము లవును. అంతకంటెను గొప్పపాపమును నేరమును మఱొకటి యుండదు. వలదు, వలదు. మీరేమో జ్ఞాతలుగాఁ గానంబడుచున్నారు. ఉన్నదానిఁ జెప్పి

యీయమ్మ ప్రాణములను నిల్పుఁడు. కొమరుఁడు మడిసె నని కూడఁ దామును మరణ మొందఁ దలఁతురా? తనకన్నవారందఱును బిడ్డలా? విత్తిన విత్తనమ్ము లన్నియు వృక్షములగునా? జీవములతో నున్న పుత్త్రశతంబులకు జనకులు గావచ్చును. అట్లే జీవించి యున్నఁ బాటుపడి యుత్తమర్ణులకు ఋణధనము నచ్చుకొనవచ్చును. అప్పులువడి, తద్బాధ నోర్వఁజాలక యొకఁ డాత్మహత్యను జేసికొని నాఁడ యేని, వాఁడు మఱల జన్మమెత్తి యాయప్పిచ్చినవారికి బద్ధుఁడై ఋణము తీర్పవలసి వచ్చును. కాఁబట్టి, యింతయును జెప్పెదను. కాలము మించిపోవుచున్నది. చెప్పుఁడు. మేము పోవలయును. ఏమి మహారాజావారికి మనవిఁ బెట్టుకొనవచ్చునా?

హరిశ్చంద్రుఁడు—అయ్యా! తమరు దలఁచిన తలంపునందు నావంత యేనియు ద్రోహబుద్ధి మాయెడ లేదు. లో నొకటి వెలి నొకటిగా వ్యవహరించు వారము గాము. ఎవరు చనినను, ఎవరు మనినను సత్యంబును జేవదలము. మీరు మాయెడలఁ జూపినకరుణకుఁ గృతజ్ఞులమై యనేక నమస్కారంబు లర్పించెదము. దీనికంటె నుపకృతికిఁ దగినప్రత్యుపకృతిం జేయుశక్తి గలిగిన వారము గాము. మేము విన్నవించుకొన్నట్లు సత్యంబు నూఁతఁజేసికొని యీజీవిని నెట్లేని రక్షించినచోఁ దమకు సర్వేశ్వరుఁడు కరుణించుఁగాక! ఇది యొకటియే మీవిషయంబున నడిగికొనియెడి విజ్ఞాపనంబు.

అప. న్యాయ—అయ్యా! ఇవన్నియును వ్యర్థాలాపములు. న్యాయస్థలంబునందుఁ గొంత మార్చియే చెప్పవలయును. లేనిదానిఁ గూర్చి చెప్పవలదు. ఉన్నదానినే నూగింజంతమార్చి చెప్పవలయును. దాని వదలి పిండినపాలు పిండినట్లు చెప్పిన కార్యము



గొనసాగదు. ఉన్నసంగతి మీతోఁ జెప్పితిమి. పిమ్మట మీ యిష్టము.

[విశ్వామిత్రుఁడు వేగముగాఁ బ్రవేశించుచున్నాఁడు.
అందఱును వారి నీక్షించుచున్నారు.]

విశ్వామిత్రుఁడు—(హరిశ్చంద్రుంగూర్చి) హరిశ్చంద్రా! యేమిది! యేమిది! యేమిది? కత్తి చేతితోఁ బట్టుకొని నిలువఁబడియున్నావు? నీభార్యయుఁ దలవంచి కంఠమిచ్చి నిలుచున్నది. ఏమియిది? అన్యాయము! మిగుల ప్రజ్ఞానవతి నీయిల్లాలు. అట్టి యామె మీఁదను గోపింప నగునా? ఇది తెలివిగలిగినవారలకుఁ దగునా?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! నమస్కరించుచున్నాఁడను. దీనిమీఁద నాకొక్క యవజ్ఞతామతియును లేదు. ఇది యీయూరి రాజపుత్త్రుని దొంగిలి కొనిపోయి హత్యచేసినట్లు నేరము స్థాపించిరి. సాక్షులవాఙ్మూలంబులం గొని యిది నేరస్థురాలే యని మధ్యస్థులు చెప్పఁగా, న్యాయాధిపతులును దన్మార్గము ననుసరించియే దీనికి మరణదండనమును విధించిరి. దానిఁ గొనసాగించుటకై యిచ్చోట నున్నవాఁడను. మామంచికాలంబు ప్రయోజనంబుగ దేవరవారి నిచ్చోట నిపుడు దర్శింపఁ గలిగితిమి స్వామీ!

చంద్రమతి—స్వామీ! నాజీవము లీశరీరము నుండి వియోగమునొందు కాలంబున, నాసత్కర్మ ఫలంబునం జేసి, దేవరవారి నిచ్చో దర్శించునంతటి భాగ్యంబును బొందితిని. అగుటచే నాయాత్మ సద్గతిం జెందునట్లు ఆశీర్వదింపవలయును స్వామీ!

విశ్వామిత్రుఁడు—అక్కటక్కటా! యేమికాల మిది, యేమిగతి యిది. నామనస్సు సైతము పరితపించుచున్నదే. విజ్ఞానస్వరూపమే నీవైనదాని కిట్టియాపదయును దటస్థింపవచ్చునా? హా! హా!!

మమ్ము దర్శించిన పిమ్మట నీయాత్మ నీ శరీరమునుండి యెట్లు వియోగము చెందును? చెందదు, చెందదు. ఉండనీ, తల్లీ! నీ వావిధంబయిన నేరమును జేసియుందువా! నిజమును దాఁపక చెప్పుము. మే మందులకుఁ దగిన యుక్తిని గల్పించెదము. నీమామకుఁ బ్రత్యేకముగ స్వర్గంబును సృష్టించి యిచ్చియున్నార మను సంగతి నీకుఁ దెలిసినదే కదా! ఉండనీ—నీవు నిజమును జెప్పుము.

చంద్రమతి—స్వామీ! యే నొక్కపాపమును జేసియెఱుఁగను.

విశ్వామిత్రుఁడు—అట్లుగాకున్న నీమహానింద నీమీఁద రాఁగతంబు.

చంద్రమతి—స్వామీ! నిన్న నాపుత్త్రుఁడు వనమునందు సర్పదష్టుఁడయి మరణించెను. వాని దహనము చేయుటకై యీశ్మశానంబునకుఁ దెచ్చితిని. దహనము చేయవలసినఁ జిన్నరూకయు మూరెడు బట్టయునిచటివారికిఁ గట్నమీవలసిన దనునంశము నిచ్చోటఁ దెలిసికొన్నదాననై వానిని దెచ్చుటకై యేను బానిసపడియున్న విప్రునొద్దకుఁ బోవుచుంటిని. మధ్యేమార్గంబున నొకబాలుఁడు మరణించి పడియుండుటం గాంచితిని. అది నాపుత్త్రశరీరముమాదిరిగానే యుంటకు భ్రమఁ గొని దాని నెత్తి చేతులం బెట్టుకొని ప్రలపించుచుంటిని. అప్పు డూరికావలివాండ్రు వచ్చి నన్నుఁ బట్టుకొనిపోయిరి. పిమ్మట న్యాయస్థలంబునకుఁ గొంపోయి విచారించి సాక్ష్యంబులవలన హత్యచేసినదానను నేనే యని నిర్ణయించి మరణదండనకు లోఁబఱిచిరి. ఇంతయే నడచిన నిజము స్వామీ!

విశ్వామిత్రుఁడు—ఆహా! ఆలాగా! ఆలాగా! యేమిమాయ! చేతులలో శవ ముండఁబట్టి చంపినదానవు నీవే యని తలంపుం గొనిరి. ఒకవిధమునఁ జూడఁగా వారిమీఁదను దోషము లేదు.



గుమాస్తా—ఏమిస్వామీ? తమరుసైత మట్లు సెలవిచ్చెదరు? ఊరికావలివాండ్రు తప్పుసాక్షులంగొని ఆరంభమునుండి యబద్ధములనే పలికించి నిజముగాఁ దగవును రూపించివైచిరి. పాప మీయమ్మ యొక్కపాపమునకును లోఁబడినది గాదు.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్ర! వీరలెవరు?

హరిశ్చంద్రుఁడు—వారు న్యాయవాదులఁట! స్వామీ?

విశ్వామిత్రుఁడు—అయ్యా! మీరు న్యాయవాదులా? వాదిపక్షమున నుండువారా?

అప. న్యాయ—కాను స్వామీ! నేరస్థురాలిపక్షమున వచ్చిన న్యాయవాదిని.

విశ్వామిత్రుఁడు—మీరును నుండియా యిట్లుచేసివేసితిరి? అయ్యో! స్త్రీపాపమే! కొంచెము దృష్టించి యుండరాదా?

అప. న్యాయ—స్వామీ! మే మేమిచేయవచ్చును? నాతలఁ బలువిధములుగాఁ బగులఁగొట్టుకొంటిని. సాక్ష్యంబు లన్నియును దబ్బిబ్బులుగ నున్న వాదించి ప్రయోజనంబేమి? ఇదో చూడుఁడు. పెండ్లియాడిన పురుషులు. సుఖదుఃఖంబులఁ జేవిడువ నని వాగ్దానంబును జేసినవారు. వీరలే కన్నదానిని జెప్పఁజాల ననెద రే. వారుమాత్ర మొడంబడి రేని యీతీర్పును క్షణమాత్రంబున మార్చివేయ వచ్చును? అభ్యన్తరమే లేదు.

విశ్వామిత్రుఁడు—ఆహా! అందులకును మార్గ మున్నదా? అట్లయిన సరి. మే మింతలోపుగ నే మేమో చేసివేయుటకుఁ దలంపుఁ గొంటిమి. పరకాయప్రవేశాదిసిద్ధక్రియలం జేసి, యీమె జీవముల రక్షింపఁదలంపు గొంటిమి. అవన్నియు నసాధ్యములు. తోడనే

యగునవి గావు. ఉండనీ, మీరు చెప్పునదేమి? హరిశ్చంద్రుఁడు చెప్పఁజాలను అనునదేమి? కొంచెము వివరముగాఁ జెప్పుఁడు; చూతము.

అప. న్యాయ—ఇప్పుడు గతించిన యంశంబులను గాని యితర విషయంబులంగూర్చి కాని చర్చించుటవలనఁ బ్రయోజనము లేదు. ఈ తీర్పు మాఱుదలఁ జెందుట కొక్కవిషయమే చాలును. మొదట—హత్య చేయఁబడిన బిడ్డఁడు నిన్న సాయాహ్నము గానఁబడక పోయినట్లు వాఙ్మూలంబున వ్యక్త పడుచున్నది. ఆకాలమునం దీయమ్మ యీశ్మశానవాటికయందే యున్నట్లు లీనిలుచుండు వారివలనఁ దెలియవచ్చుచున్నది. వీరికిని అది తెలిసి యుండవలెను. ఏకారణముచేతనో యాయంశము దనకుఁ దెలియదని దాచెదరు. వీరు మాత్ర మట్లు చెప్పివేసిరేని నేరమేమియును లేక యెగిరిపోవును. ఇదియే మార్గము. స్వామీ!

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్రా! యేమి యిది! నీజీవములకు జీవమైన భార్యయెడల నీ వీతీఱున విరక్తిఁ గొంటివి. చూచినదానిని జెప్పుట కేమియభ్యంతర మున్నది?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుఁడను. దీనిని నిన్న రాత్రి పదునైదు ఘటికలకుఁ బైఁగా నిచ్చోఁ జూచినాఁడను. అంతకుఁ బూర్వముగాఁ జూచినవాఁడను గాను. సాయాహ్నమే చూచినట్లు చెప్ప నెట్లు సరిపడును?

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్రా! నీవు చెప్పుమాటలు సత్యంబులని గోచరింపకున్నవి. ఒకస్త్రీ యర్ధరాత్రంబున నెట్లు శ్మశానంబునకు రాఁగలదు. ముందుగానే వచ్చి యుండవలయును. దానిఁ జెప్పుటకు సంకోచం బేమి? మఱొకఁడును జూచినట్లు జెప్పుచున్నాఁడే. నీకుమాత్ర మేమియభ్యంతరము?



హరిశ్చంద్రుఁడు—స్వామీ! వారు ఒకవేళ ముందుగానే చూచియుండవచ్చును. నేను గాంచినది యర్ధరాత్రంబునకు మీఁదటనే. దానిమార్చి చెప్పుట యెట్లు సరిపడును?

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్రా! నీ కణుమాత్రం బయినను జీవకారుణ్యమున్నట్లు గనఁబడలేదు. ఒకజీవి యన్యాయముగ మరణించుట దెలిసికొనియు ఱాతిగుండె గలిగి యుంట మానవతతికి మర్యాదగాదు. హా! హా! నీమనంబు వజ్రంబుకంటెఁ గఠినతమంబుగా! ఇదటుండనీ! ఇందులోఁ బొల్లుమాటయును లేదు పొర్లింపును లేదు. నీవు గాంచిన దర్ధరాత్రమే యైననేమి! కొంత ముందుగఁ జూచినట్లు చెప్పుటవలన దోష మెంతమాత్రమును లేదు. చూచినదేమో సత్యము. దీని సీవించుకేనియు వెనుదీయక చెప్పు. అయ్యో! పాపము! భార్యనుగూర్చి యనుకంపఁ జెందనిచిత్తంబు మఱెద్దానిఁ గూర్చి కరుణారస మూనును? సంసారివిగా నుండియు నీకింత కఠినహృదయమా? మఱియు నీభార్యగుణంబు లీవెఱుఁగుదువు. అదికారణంబుగ నీ మానినీమణికిఁ బ్రాణదానం బొసఁగుపొంటె నీవింతచేయుటకుఁ దెగించవైతివేని నీవీజగత్తున గొప్పయపకీర్తికిఁ గారణభూతుండవై పోదువు. అదియట్లుండ, మాతపోబలపటిమను గ్రహించిన నీవిఁక నెందులకు వెనుదీయుట? వలదు. ఇప్పుడే యీన్యాయవాది చెప్పునంశంబులకు లోఁబడి యీతనివచనంబుల మేరకే చెప్పి తగినపని సిప్పుడే చేయుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! యీజగత్తునందలి యైహికవాంఛాపాశబద్ధుఁడై సన్మార్గంబునుండి చ్యుతిం జెంది దుష్పథంబులఁ దప్పఁ

జరించుచున్న యల్పుండు సామాన్యజనసముదయంబునకు బోధించు కాపథంబులరీతు లోకరీతి నుండుంగాని, మిన్ను మన్ను నొకటిగాఁ దలపోయు దేవరవారిం బోలినమునిపుంగవు లిట్లుపదేశించుట యెవ్విధంబున గ్రాహ్యంబు? జీవకారుణ్యం బన్నమాట మొదట తనజీవములు సద్గతింగాంచుపొంటెఁ దగఁ జరించుటయే యగును. అట్టికారుణ్యము గలవాఁడు దనసద్గతి కనువైన సన్మార్గప్రవర్తనముననుండి తప్పి చరింపకుండుటయే యగును. భార్యయైననేమి? పుత్త్రుఁడైననేమి? వీరు శరీరబాంధవులే కాని, జీవబంధువులు గారు. అనుట యందఱకును దెలిసినయంశమే.

"చం॥ అనఘులు బోధపూర్ణులు మహాత్ములు భోగనిధానమైయా
ధనముఁ బరిత్యజింతురు గతస్పృహులై పరమాద్భుతంబుగా;
మునుపును బొంద కిప్పుడును ముట్టక, యింకను గోరలేక, నె
మ్మనమునఁ దోఁచుభోగముల మానఁగఁజాలు రకిల్బిషాత్ములై."

దారాపుత్త్రబాంధవధనజీవితైశ్వర్యంబు లగు నీయవి యన్నియును బాహ్యప్రవృత్తికే కద! వీనింగూర్చిన సత్యమును పరిశీలించి మించిన దేవరవారును నిట్లు ఆచరింపుమని నాకు బోధించుట మంచిదగునా? కన్నంతమాత్రము చెప్పవలసినదే కాని కానినియంశమునుగూర్చి చెప్పుట యనీతిగద! భార్యకొఱ కొకరీతిగాను మఱొకరికొఱ కొకతీరుగాను సంభాషించుట క్షుద్రులచైదంబు లగును. సర్వశరీరంబులయందు నీమానవశరీరం బొకండే ప్రకృష్టతమంబైనదగును. దీని నరుదుమైఁ గాంచియును సన్మార్గంబునం బ్రవర్తించి సత్కార్యాచరణం బొనర్చి యింపొందక దుష్పథంబుఁ బ్రవర్తించి దుష్కార్యంబులనే యాచరించి, యిడుమ లందుటకంటె మౌఢ్యం బేది యుండును? ఈజీవంబులకుఁ దగినతోడు సత్యశీలం బొక్కటియే. ఆసత్యం బొక్కటియే యైహికాముష్మిక సౌఖ్యం



బుల నొసంగునది. క్షణభంగురం బయి శాశ్వతస్థితికి నోచుకోని యీనశ్వరశరీరంబు నొకవస్తువుగా నమ్మి, సర్వశాశ్వతం బయి నిత్యసర్వాశ్రయ నిర్వికార బ్రహ్మస్వరూపం బయిన సత్యము నెంతమాత్రమును వదలువారము గాము. జీవములకంటెను సత్యంబే యతిశయం బొందిన దగుటంజేసి దానివలన హింసలే కల్గినను సర్వోత్కృష్టసత్యంబును జేజార్పము. ఆసత్యము నూఁతఁగొనియే రాజ్యమును ద్యాజ్యము చేసియు నిధుల నదులఁ గలిపియు, శరీరములఁ గఠోరంబులగ నన్యాయత్తంబులుగఁ జేసియు సుకుమారగాత్రుండగు పుత్త్రుమరణంబున కంతఃకరణంబున నోర్చియు నుండువారము. ఇఁక మాకు సద్గతులఁ బ్రదర్శింపంజాలినవి యేవి గలవో యెన్ని గలవో అవన్నియు నొకపట్టున దహింపఁబడి నశించుఁగాక! మేమెంతయు సత్యవ్రతంబునుండి చలించువారము గాము. దేవరవారు ననుబోటియల్పుని బుద్ధిభ్రమంజేసి చేయుకాపథవర్తనంబొండుండెనేని యద్దాని ననుకంప సించి దిద్దుఁబాటునకుం దెచ్చి సన్మార్గోపదేశంబులం జేసి జన్మసార్థకం బొనర్పక సామాన్యజనుని మాడ్కి దుష్కార్యంబులం బ్రవర్తించునట్లు గఱపుట! అహో! దేవరవారి పదవికి నెంతమాత్రమును దగినది కాదు. ఇఁక స్వామీ! తమ రించుక తొలఁగి నిలుచుందురుగాక! నాయజమానులు నా కొసంగిన యాజ్ఞను నెఱవేర్పవలసినవాఁడను.

విశ్వామిత్రుఁడు—ఓహో! హరిశ్చంద్రా! త్వరపడి యాజ్ఞను నెఱవేర్చి నన్నపకీర్తిపంకంబునకు ముంచి పాపిఁ గావింపకుము. కొంత యోర్చికొందువుగాక!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుఁడను. యజమానుఁ డిడినయాజ్ఞను నెఱవేర్చుటయందు దేవరవారికిఁ బాపాపకీర్తు లెవ్విధిఁ దటస్థించును? దాసుఁ డెదిరించి మాట్లాడుటకు మన్నింపవలయును.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్రా! నీ కిదివఱకుఁ దటస్థించిన శ్రమంబులన్నియు నాపన్నిన యుపాయములవశంబుననే కాని మఱొండు గాదు. ఇందులకుఁ గారణ మొకటి గలదు. అదేదనిన; ఒకనాఁడు సునాసీరుండు తన పేరోలగంబునఁ దేజరిల్లు మునిలోకవరేణ్యులం గాంచి "మహాసీంద్రులార! యిలాతలంబున సచ్ఛీలంబునుండి స్వల్పం బేనియు జాఱని నరపాలుం డొక్కండుండునా?" యని యడిగెను. దాని విన్నవారందఱు మౌన ముద్రల భజించుచుండిరి గాని, వసిష్ఠమహానివర్యుండు మఖవానునిం గూర్చి "బిడౌజా! మాయందుఁ బ్రియంబు గూర్చువాఁడు హరిశ్చంద్రుండు సచ్ఛీలంబున కాభరణసదృశుం డొక్కరుఁడు గలఁడు" అనియె. వారియెడల దీర్ఘకాలంబుగఁ గొనియున్న పగయే కారణంబుగాన వారిచేఁ జెప్పఁబడిన యంశంబుల కన్నింటికి విరుద్ధంబులుగ నా హరిశ్చంద్రుండు దుర్గుణపుంజంబులచే నేర్పడిన యాకృతి గలవాఁడు. దాని నిదర్శనపూర్వకంబుగ నిరూపింతును గాక" అని, యీ భూతలంబుం జేరితిని. ఇచట నొకనాఁడు మాశిష్యులు వసిష్ఠమునిశిష్యులతోడ వాదించి, నాయొద్దకు వచ్చి మొఱలిడిరి. దానినే కారణంబు చేసికొని నాయుపాయంబులఁ గొనసాగింప వారి నోడంబఱిచి నిన్ను దుష్పథంబులం బ్రవర్తిల్లఁ జేయఁ ద్రోవ వెదకితిని. అతలంపును గొనియే యాగ మొనరింతు నని నిన్ను ధన మడిగి నీయొద్దనే యుంచిపోతిని. అక్కటా! యొక్కటొక్కటిగ నెన్నికష్టంబులకు నిన్ను గుఱిపఱిచినాఁడను హరిశ్చంద్రా! అడవియందుఁ గల మెకములను వేటగాండ్రం గొని నీనగరిని జొప్పించితిని. పిమ్మట నిన్నట్లు వనమునకు రప్పించి నిన్నుఁ గామపాశబద్ధునిగాఁ జేయ వలపుఁగొని వచ్చిన యాపూఁబోండ్లు మాయొద్ద శుశ్రూషలం జేయుచుండిన



మునికన్యకలు. వాండ్రును నావలననే నీ యేకపత్నీ వ్రతంబు ధ్వంసంబు గావించి వ్యభిచారవైఖరికిఁ దార్పఁబంపఁబడినవాండ్రు. మఱియు నీతోడ వ్యర్థవాదంబులు సలిపి నీయేలు వసుంధరా సామ్రాజ్యంబుం గొనుటయును, ఆ పిమ్మట నీయొద్ద దాచియుంచిన సొమ్మును దెమ్మనిన రిక్తస్థితిం జేసి లేదని మాఱుపల్కుదు వంచు నిన్ను బాధించుటయును. అట్టులుండియు నీవు స్థైర్యంబు వీడని వాఁడ వయి యవధిఁ గొని కాశికాక్షేత్రాభిముఖుండవయి పోవుచో మార్గమధ్యంబున మాఱువేసంబులం దాల్చి నీజనని మరణావస్థయం దుండి, నిన్నుఁ జూడ నిచ్చఁగొన్నటులు చెప్పినవాఁడును, గతించె నని చెప్పిన వాఁడును, మఱియును యుద్ధవీరులుగాను, జ్యోతిష్కుఁడు గాను, తత్త్వవేత్తగాను, అష్టావధానిగాను, వైద్యుఁడు గాను రసవాదిగాను మాఱురూపంబులం బూని వచ్చి మిమ్ములను గలఁత నొందించిన విషయంబులును, మిముఁ దప్పి నడువఁగలందులకై శోధించినయంశంబులును మాపన్నిన పన్నుగడలే. నీ భార్యాపుత్త్రుల వెలయిచ్చి కొన్న కాలకతుండును, నిన్ను వెలకుఁ దీసినయీ వీరబాహువును నాశిష్యులే యగుదురు. వీరందఱును నాదుర్బోధనలం గొని, వచ్చి, మీ కనేకవిధంబుల నాయాసంబులం గూర్చి, దుష్పథంబులకుఁ దార్పఁ బ్రయత్నించినట్టి వారలు. ఒకటేనియుఁ గొనసాగి వచ్చినది గాదు. వత్సా! హరిశ్చంద్రా! విను మా పిమ్మట, నాకుయుక్తులకు లోఁబడి దేవదాసునికి విషప్రయోగంబుం జేసి, వీనుఁగువలె మూర్ఛిల్లం జేసినదే కాక, వాని శ్మశానభూమికిఁ, జంద్రమతి మోసికొని పోవ నుంకించు కాలంబున నా బాలుని జీవింపఁజేసి యిచ్చెద నని పలికినవాఁడును సర్వార్థసిద్ధి యని చెప్పికొన్నవాఁడును నాశిష్యుఁడే యగును, ఎవరివలన నైనను

నేమాత్రంబయినను గొనసాగినదా? లేదు, లేదు. అహాహా! హరిశ్చంద్ర! ఏనును జాతిగుండెగలవాఁడనయి, యంతకుఁబైఁగాఁ జేసినకార్యముల నేమని చెప్పుదును? కాశీరాజపుత్త్రుని దొంగిలి తెచ్చి, విషయము నిచ్చి పీనుంగుఁబలె మూర్ఛిల్లఁ జేసినవాఁడును, బిమ్మట నాహత్య నీభార్యయే కావించిన దని, తీర్మానింపఁగం సాలి గాను, సాలెగాను, యాత్రికుఁడుగాను, సన్న్యాసిగాను, న్యాయవాదిలేఖకుఁడుగాను, ఆహత్య గావింపఁబడినది నిజస్థితిం గాంచిన వారివలెనే సాక్ష్యమ్ము లిచ్చినవా రందఱును నాశిష్యవర్గంబునఁ జేరినవారలే. అహాహా! హరిశ్చంద్ర! నీకై ప్రయుక్తపఱిచిన దుష్కార్యపరంపరల నెన్నని వాక్రుత్తును? చేయుకాలంబులయం దవి యొకటొకటియు నొక్కొక్క యణుమాత్రంబుగా గోచరించినవి. వాని నన్నిటిని గ్రోడీకరించి నేఁటికిఁ జూడఁగాఁ బర్వతప్రాయంబు లయి కానంబడుచున్నవి. "నీవారశూకమంత దుష్కార్యము మహోన్నత కులధరాధరంబంత ప్రవర్ధమానంబై పొడచూపు" నందు రే యానీతివిదుల వచోవిశేషంబున కేనే యిపుడు నిదర్శనరూపంబునుం జెందితిని. "తలఁచి చేయుము చేసితలఁపకు" మనునట్లే నీచెడుగుచైదములు చేయ సమకట్టుటకు మున్నుఁ దలఁచినవాఁడను గాను. ఆహా! ధరణీధరంబును డీకొన్న తగరుమాడ్కి వసిష్ఠమౌనివర్యునితోడ నెదుర్కొని మొక్క సెడితిని. మహాపఖ్యాతికిఁ బాత్రుండ నైతిని. అహాహా! అయోధ్యానాథా! హరిశ్చంద్రా! నాచేసిన యీకట్టడిచైదములు నాకు దుఃఖపరిణామకరంబులే యైనను లోకమునకు సన్మార్గప్రవర్తనమున కిదొక దృష్టాంతముగా నుండునుగాక! వత్సా! హరిశ్చంద్ర! యిన్నివిధంబుల కష్టంబులకు నిను దార్చినాఁడ నని వ్యసనపడకు.



నీ కీకష్టంబు లుత్పాదించుటకై యేను బడిన కష్టంబుల మితిగల దందువో? లేదు, లేదు. "చెఱుపకురా! చెడేవు." అనులోకోక్తి విన్నాఁడవుగావా? అహాహా! యీయపయశం బీదినంబుతోఁ దొలఁగునదియా! తొలఁగదు. సూర్యచంద్రు లున్నంత కాలము దుర్గ్రాహ్యంబు లగుననేక దేశంబులయందు, ననేకభాషలయందు ననేకవర్ణ్యులచేతను నాటకంబులగ నటింపఁబడును. ఆకాలంబులయందు నాయాకృతిం బూనినపాత్రంబును గాంచినచో జనులేమేని దూషింతురు. ఏమి చేయవచ్చును. ఇతరులకుఁ గష్టములు దేయత్నించువానిగతి యిదియే యగును. హరిశ్చంద్రా! యిది వఱకు నాకు వచ్చినపాపాపకీర్తులకుఁ బారమే లేదు. ఇఁక నిల్లాలిని సైతము చంపి స్త్రీహత్యవలనిదోషమునుగూడ నాతలపై మోపకు. కొంత యోర్చి యుండుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ! యీయవస్థ లన్నియు దేవరవారి యుపాయంబువలన సంభవించినవని నాకెట్లు దెలియును? నేఁటికే తమవలనఁ దెలిసికొంటిని. దేవరవా రింతకాల మీదీనునియెడలఁ బ్రయోగించిన తంత్రంబులం గూర్చి తలపోయుచో, నిప్పుడు దాసునిఁ గొంత దాళుకొనుమని సెలవిచ్చుటయు నొకతంత్ర మనియే భావించుట కెడమిచ్చుచున్నది. అదికారణంబుగ విధేయుని మన్నింపవలయు నని వేఁడుకొనియెదను.

విశ్వామిత్రుఁడు—హరిశ్చంద్రా! అట్లు నీవు సందియంపడ నవసరము లేదు. అట్లునీకు సందేహంబు పొడచూపునేని నీకులగురువు లయి నవసిష్ఠకులపతిని గొనివచ్చి వెల్లడి చేసెదను. వారు వచ్చునంతకేనియుఁ గొంత తాళికొని యుందువుగాక!

(శిష్యునింజూచి)

శిష్యా!

వీరఁడు——స్వామీ! ఏమియాజ్ఞ?

విశ్వామిత్రుఁడు——నీవు శీఘ్రగామివై పోయి వసిష్ఠమునివర్యులం జూచి యిప్పు డిచ్చో సంభవించియున్న విషయంబులను సవిస్తరంబుగఁ జెప్పి వారి నత్యంతశీఘ్రంబుగఁ బిలుచుకొని వత్తువుగాక! వారాలస్యముచేసినచో స్త్రీహత్యాదోషమున కేను బాత్రుండ నగుదును. అనుటయును దెలిపి తోడి తెమ్ము, త్వరగా రమ్ము, పొమ్ము.

వీరఁడు——స్వామీ! ఇదే యొక్కక్షణమాత్రంబునఁ బిలుచుకొని వచ్చెదను.

(పరుగెత్తుచున్నాఁడు.)

విశ్వామిత్రుఁడు——హరిశ్చంద్రా! జీవకారుణ్యము నుద్దేశించి యైనను శిరశ్ఛేదంబును జేయక స్వల్పకాలము తామసింపుము. సర్వమును శస్తమయ్యెడిని.

హరిశ్చంద్రుఁడు——స్వామీ! తాము సెలవిచ్చినయంశములో జీవకారుణ్యమును లేదు, మేలును లేదు. అసత్యమున కాస్పదుండనై నపిమ్మట జీవకారుణ్యం బెక్కడిది? దేవరవారు మహత్తైన రాజ్యభారంబును దానివలనఁ గలుగుసౌఖ్యంబులను విరక్తిఁ జెంది, అడవిలో నివసించి, తపించుచుఁ గాయగసరుల మెసవుచు ఘనతపోమహిమంబుం బొందియును కేవల మొక్కస్త్రీకొఱకు సత్యాతిరిక్తంబుగ నడుచుకొనుటకుఁ బురికొల్పు టేలొకో తెలియకున్నాఁడను. సత్యవిహీనులే సద్గతివిహీనులు. సత్యవిహీనులే సర్వశూన్యులు. సత్యవంతులే సత్కులశేఖరులు. సత్యాత్ములే సత్కులీనులు. సత్యమే నిత్యము. సత్యమే శ్రేయోనిదానము. సత్యమే సర్వదేవసాక్షాత్కారము. సత్య మొక్కండే సత్తపోధికము. సత్యమే



సర్వాధికతీర్థరాజము. సత్యంబే క్షేత్రోత్తమము. సత్యం బొక్కండే తనయాశ్రితుని సాయుజ్యపదవికిం దార్చి తేర్చునది. సత్యంబునకుఁ దుల్యంబు సత్యమే. కాబట్టి దాని నాశ్రయించి యుజ్జీవించుటే యందఱకును వలయునది.

[కాశీరాజపుత్త్రుని సంస్కరించుటకై శ్మశానంబునకుఁ దెచ్చుచున్నారు. రాజు రాజ్ఞి, మంత్రులు, న్యాయాధిపతులు, న్యాయవాదులు, ప్రభువులు, మొదలగువారు ప్రేతమువెన్నంటి వచ్చుచున్నారు. జంగమువారు పాడుచున్నారు.]

"ఉ. బాలకుఁడై క్షణంబు, యువభావయుతుం డయి కొంతకాలము
దేలదరిద్రుఁడై క్షణము విత్తసమన్వితుఁడై క్షణంబు జీ
ర్ణాలసగాత్రుఁ డౌనటుని యట్లు నటించి తుది న్నరుం డయా
మ్యాలయనామమైన తెరయందుఁ జొరంబడు సత్వరంబుగన్."

"ఉ. తాలిమి మాలి కన్నతలిదండ్రులతోడ మెలంగువారలం
గాలము గోలుపుచ్చె నని కానక లోన వ్యథాభరార్తులై
తూలుచు నిత్యసన్నిహితదుర్దశులై పలవించుచుం బ్రహో!
చేలలు సాంబమూర్తి మదిఁ బెంచినలీలలుగాఁ దలంపరో?"

[శవమును శ్మశానంబున దించెదరు. ఇరువురు మునులు వచ్చుటను సాశ్చర్యులై యందఱును జూచుచుండెదరు.]

(నారదుఁడును వసిష్ఠుఁడును బ్రవేశించుచున్నారు.)

హరిశ్చంద్రుఁడు——గురునాథా నమస్కరించుచున్నాఁడను. స్వామీ! మునిలోకాగ్రగణ్యా! నమస్కరించుచున్నాఁడను.

వసిష్ఠుఁడు——సుఖీభవ! సుఖీభవ!

నారదుఁడు——సకలసన్మఙ్గళాని భవంతు.

హరిశ్చంద్రుఁడు——కాంతాలలామా! యిదే మనగురునాథులు కులపతు లిచ్చోటికి విచ్చేసియున్నవారు. నారదమహామునిభగవానులవారును దయచేసియున్నవారు. ఈ సన్మునుల మదికి మనయెడలఁ

గలిగియుండు కృపకుఁ బారమనునదియే లేదు. ప్రాణేశ్వరీ! నీచేసిన తపస్సే తపస్సు. నీసమార్జించిన పుణ్యమే పుణ్యము. కాక నీజననీజనకులు చేసినపుణ్యమో వారిజననీజనకులు చేసినపుణ్యమో? ఎఱుఁగరాదు. ఇఁకఁ గాలము చాలినంత యుండదు. ఈపెద్దల పాదాబ్జంబులకు నీ శిరంబు సోఁకఁ బ్రణమిల్లి తూర్పుదెసకై తిరిగి తల వంచి నిలుచుందువు గాక.

(హరిశ్చంద్రుంగూర్చి.)

చంద్రమతి—స్వాములారా! దాసురాలను నమస్కరించుచున్నాను. నాయాత్మ సద్గతి నొందునటుల యాశీర్వదింపవలయును.

నారదుఁడు—దీర్ఘసుమంగలివిగా నుండి సుఖజీవినివై ప్రఖ్యాతి నొందుదువుగాక!

వసిష్ఠుఁడు—హరిశ్చంద్రా! ఒకానొక కారణముచేత మీకీవిధంబులయినశ్రమంబు లుత్పాదిల్లినవి. ఇఁక నీవు నీభార్యాపుత్త్రులతోడ సౌఖ్యాతిశయంబునఁ దేజరిల్లుదువుగాక.

హరిశ్చంద్రుఁడు—గురునాథ! ఇది యీనగరిరాజకుమారుని దొంగిలి హత్య చేసివేసినట్లు నేరము స్థాపింపంబడి మరణదండనమునకుఁ దీర్పు గలిగియున్నది. కాఁబట్టి దీని నిప్పుడే శిరశ్ఛేదమును జేయునట్లు దాసుని దాసునిగాఁ గొన్న వీరబాహు వనువా రాజ్ఞాపించియున్నారు. ఈ సమయముననే కులపతులు నారదభగవానుల వారిం గూడి యిచ్చటికి విజయముచేసితిరి. ఇంతకంటెను మేము పొందఁగలధన్యత వేఱే యేమున్నది?

వసిష్ఠుఁడు—వత్సా! హరిశ్చంద్ర! కొంత తామసింపుము. దీనిసంగతి మఱియు వేఱు. మాకును విశ్వామిత్రమునివరులకును నినుఁ గూర్చి మునులమండలిలో నొకవాగ్వాదము జగిగినది. అందువలనఁ



దటస్థించినశ్రమంబులే యివన్నియును. ఇందులకై నీవు చిత్తవ్యథ నొందవలసినది లేదు. కొంతయమరికతో నిచట నడువఁగలవాని నన్నిటిని గమనించుచుండుము.

హరిశ్చంద్రుఁడు—ఆలాగే చేసెదను. గురునాథా! అట్లుండియును నన్ను దాసునిఁగాఁ గొన్న యజమానునియాజ్ఞాతిక్రమణదోషమొనగూడునే యని భీతిలుచున్నాఁడను. మఱొక్కటియును లేదు.

నారదుఁడు—అవన్నియు నిచటనే తేటపడిపోవును. కొంత యోర్చి యుందువుగాక!

హరిశ్చంద్రుఁడు—(చంద్రమతింగూర్చి మెల్లఁగా) ప్రాణేశ్వరీ! యిందులో మర్మంబులుగ నేవో కొన్నియశంబు లుండునట్లు గానవచ్చుచున్నవి. ఇఁక నడుచువానిని గమనింతము.

చంద్రమతి—ఔను ప్రాణేశ్వరా! అట్లే గోచరించెడిని. అట్లు గాకున్న నిన్నికష్టంబు లొకదానివెంట నొకటిగా దారుణదారుణతర, దారుణతమంబులుగ మనల సోఁకునా?

నారదుఁడు—విశ్వామిత్రా! ఇఁకనేమి? యిన్నివిధంబులను జూచితివి, ముగింపేమి? జయాపజయంబు లెవ్వరివి?

విశ్వామిత్రుఁడు—దాని నేల చెప్పికొనవలయును? తెలిసియే యున్నది.

నారదుఁడు—అట్లు గాదు; అది వెలిపడిననే కాని మంచిది కాదు.

విశ్వామిత్రుఁడు—వెలిపడవలయునా? సరి, జయము వసిష్ఠులవారిది. అపజయమే మాది. సరియేనా?

నారదుఁడు—వసిష్ఠమునివర్యా! విశ్వామిత్రుఁడు చెప్పినది మీచెవి కెక్కెనా?

వసిష్ఠుఁడు—అవును, వింటిని, 'జయము మాది, అపజయము తమది' అని చెలవిచ్చిరి. ఉత్తములు పుటపరిపాక మొందినశుద్ధ స్వర్ణంబుం

బలె తమ్ము నాశ్రయించిన కష్టౌఘంబులవలన నపహతకల్మషు లయి, కడుం దేజరిల్లుదురు. అట్టివారల కట్టి కాలంబులయందు హృదయకర్కశత్వ మధికము.

"గీ॥ సంపదలు గల్గుతఱి మహా - జనులహృదయ
మభినవోత్పలకోమలం-బై తనర్చు
నాపదలు గల్గునెడల మ-హామహీధ
రాశ్మసంఘాతకర్కశం - బౌచు వెలయు."

అని నీతికోవిదు లండ్రు గాదె. అల్పులకన్ననో సంపదలు ప్రబ్బు కాలంబులయం దుబ్బుటయు, నాపదలఁ దబ్బిబ్బు లొందుటయు సహజములు. వీండ్ర నింక సర్వేశ్వరుం డభిరక్షించును గాక!

నారదుఁడు—కష్టము లన్నియు సుఖములే. ఎన్నియిడుములు వచ్చినను నవి మన మేలుకొఱకే! యీనీతు లన్నియు నటు లుండనిండు. అయ్యా! విశ్వామిత్రా! మొదటఁ జెప్పినట్లు హరిశ్చంద్రునకు వాని దగురాజ్యము నప్పగించుటకును నీ తపఃఫలంబునం దర్ధము దత్తముచేయుటకునై యున్నది. ఇప్పు డేమనియెదవు? ఏదైన నభ్యంతర ముండునో?

విశ్వామిత్రుఁడు—అట్టిదాని కభ్యంతర మొక్కటియును లేదు. ఇప్పుడే చేసివైచెదను.

నారదుఁడు—హరిశ్చంద్రా!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఏమిసెలవు?

నారదుఁడు—ఇఁక నీవు నీరాణువను బొంది యింతకుముందువలెనే ప్రజాపాలనంబుం జేయుచు, నైహిక సౌఖ్యంబు లొందుచుండువు గాక! ఈ విశ్వామిత్రముని మిమ్ము, నిరపరాధుల నిట్టిహింసలకుఁ బరీక్షార్థంబు దార్చినందులకై తన తపఃఫలబునం దర్ధంబు నీకు దారవోయుచున్నాఁడు. అట్టి యనన్యసాధ్య మహా తపఃప్రయో



జనం బొంది యనంతర మాముష్మికసౌఖ్యంబును సైతము గొల్ల గొందువుగాక!

హరిశ్చంద్రుఁడు—స్వామీ! విధేయుఁడను దేవరవారి యాజ్ఞోల్లంఘన మొనర్చినట్లు చిత్తగింపరాదు. విధేయుఁడు సర్వసర్వంసహాభారంబు భుజాగ్రసీమఁ గ్రాల సార్వభౌమఖ్యాతి సరవిఁ గాంచుచుండి తుదకుఁ బ్రేతభూమిని గాఁపుండునట్టివాఁడ నైతిని. ఇంక నా కేటివసుధావధూటీపాలనపాటవంబు! తగదు, తగదు. అట్టి సర్వశేఖరపదవికంటె నిదియే ప్రకృష్టతమం బయినది. కావున విధేయుఁడ నిట్లు వానప్రస్థపదవియం దుండియే జీవనసార్థక్యముం జెందెదను. మునివరులకు రాజ్య మర్పించినదియు నీసంకల్పమునం జేసియే కాఁబట్టి నన్ను మన్నింప వేఁడుకొనుచున్నాను.

నారదుఁడు—విశ్వామిత్రా! ఇందుల కేమనెదవు?

విశ్వామిత్రుఁడు—హా! హా! హరిశ్చంద్రా! బాగుగఁ జెప్పినాఁడవు! శ్మశానమా? యిది. నీపరీక్షార్థంబు దీని శ్మశానంబుగాఁ జేసితిని. అది యీక్షేత్రపాలకునకును దెలియదు.

[దేవదాసుఁడును, విశ్వనాథుఁడును విషమువలనిమూర్ఛనుండి తేఱి, లేచి, తమతమతల్లియొద్దకుఁ బోవుచున్నారు.]

దేవదాసుఁడు—(సర్వార్థసిద్ధినిం జూపి) అమ్మా! వీరు నాకాలియందు ముంటిని దీయువారివలె, నేదో మందుఁబెట్టి మంటిపైఁ బడిపోవునట్లు చేసివైచిరి.

(చంద్రమతి మిగుల సంతసముతోఁ, బుత్త్రు నెత్తుకొని, శిరంబు మూర్కొని ముద్దిడుచున్నది.)

విశ్వనాథుఁడు—(పరమానందునిం జూపి) హా! అమ్మా! యిదో నిలుచున్నారే, వీరే నన్నుఁ బిలుచుకొని పోయి చేఁదయిననీటిని త్రాగించి భూమిపైఁ బండఁబెట్టివేసిరి.

(కాశీరాజపత్ని మనఃకుతూహలముతోఁ, దనపుత్త్రు నెత్తుకొని శిరంబు మూర్కొని; ముద్దులాడుచున్నది.)

హరిశ్చంద్రుఁడు—హా! పరమేశ్వరా! అవ్యాజకరుణానిధీ!

ద్విపదలు.

"శ్రీ విశ్వనాథ! యా-శ్రితపారిజాత!
యీవేళఁ గరుణయిం - పెసలారెఁ గాదె 1
వడిఁగొని మూఁడుత్రోవలఁ - బాఱునేఱుఁ
దొడరి కెంజడలలోఁ - దుంపురుల్ గురియఁ 2
జెన్నుగా నొదలఁ - జేరినమించుఁ
గ్రొన్నెలతళుకు చ-కోరాళిఁ బిల్వ 3
నుఱక పువ్వులవిల్తు - నొకజుట్టు గొనిన
చుఱుకుఁజూపులకన్ను - చోద్యమై మెఱయఁ 4
దనర నేనుఁగుమోము - తనయునిఁ గన్న
వనజాక్షి డాఁపలి-వంక శోభిల్ల 5
మేలిముప్వన్నెల - మెకముచర్మ్ము
చేలఁ గట్టినకాసె - చెలఁగి తూఁగాడఁ 6
బోఁడిమి మెఱుఁగుల-పోల్కి దీపించు
మూఁడుముల్కులవాలు - ముష్టియం దమర 7
వెస ఖణిల్లున ఱంకె - వేసి గుప్పించు
బసవరాయని నెక్కు-పరమేశ శ్రీశ! 8
కాలకంధర లయ - కాలాగ్నిరుద్ర
కాలసంహార! శ్రీ-కాశీనివాస! 9
వాసుదేవప్రియ! వాసుకివలయ!
వాసవార్చిత! కృత్తి-వాస! సర్వేశ! 10
నాగశోభితహస్త! నాగానురారి!
వాగీశవినుత! సం-భావితచరిత! 11
గిరిశరాసన! రౌప్య-గిరిశృఙ్గ నిలయ!
గిరిజామనోహర! గిరిభేదివరద! 12



అరయఁ గృతార్థుండ - నైతి లోకముల
దురితంబు లన్నియుఁ - దొలఁగఁగాఁ గంటి." 13

నారదుఁడు—హరిశ్చంద్రా! రాజ్యంబు గైకొనుట కింకేమి యభ్యంతరము?

హరిశ్చంద్రుఁడు—స్వామీ! ఒకప్పు డొకరి కిచ్చివేసిన ద్రవ్యంబును మఱల నంగీకరించు టెట్లు? దత్తాపహారంబుకంటె దుశ్చరితంబు గలదే! యిది దేవరవారి చిత్తంబునకు రానియంశమా?

నారదుఁడు—హరిశ్చంద్ర! యిందు ముఖ్యముగాఁ జూడఁదగిన యశంబొండు గలదు. అదేదన, "నిదివఱకు నీయెడలఁ బ్రయుక్తపఱచిన వన్నియును పరీక్షార్థములు" అనునదియే. అదియు నిప్పుడు చక్కఁగా వెల్లడి యయ్యెను. మఱియును, విశ్వామిత్రముని దాను రాజ్యసౌఖ్యమ్ము లనుభవింపఁ దలంపుం గొని కాదు నీవలనఁ దాను బుచ్చుకొనుట. అదియునుగాక, రాజ్య మొసంగునప్పుడు, అయ్యది మంచి మంత్రబలంబుచేతను బరిపాలింపఁబడు నని యెంచి యుంటివి. ఇప్పు డట్లు గాక తద్వ్యతిరిక్తపద్ధతిని రాజ్యంబు వ్యాకులత నొందుచున్న దని నీవు పలుతడవలు పలువురిచే వినియునుండ వచ్చును. కాఁబట్టి, నీకు రాజ్య మేలుట కిష్టము లేకయే తక్కినను, అయోధ్యాపౌరుల క్షేమంబుకొఱకైన నాభారంబును భరింపవలసినవాఁడవు. వసిష్ఠా! యిందుల కేమనియెదవు?

వసిష్ఠుఁడు—అవునౌను. అట్లు సేయుటయే యుక్తముగా నుండును. కొంతకాలంబునకుఁ బిమ్మటఁ గుమారునకుఁ బట్టము గట్టి భార్యాసమేతుఁడై తాను వానప్రస్థాశ్రమంబుం జేకొనవచ్చును. (హరిశ్చంద్రుం గూర్చి) అన్నా! హరిశ్చంద్ర! నీయభిమతమేమి? చెప్పుము.

హరిశ్చంద్రుఁడు—స్వామీ. మునిశ్రేష్ఠు లగుదేవరవారే యాజ్ఞాపిం

చిన యెడల విధేయుఁడను జెప్పున దేమిగలదు? దేవరవారి యాజ్ఞానుసారము నడుచుకొన సిద్ధపడియున్నాఁడను.

నారదుఁడు——సరి, విశ్వామిత్రమునీ! ముమ్మూర్తుల స్వరూపంబులు గల యీచోటనే నీవాగ్దత్తముమేరకుఁ దపంబునం దర్ధమును దారవోయుము.

విశ్వామిత్రుఁడు——ఆహా! ఆలాగే చేసెదను. అందుల కభ్యన్తర మేమున్నది? హరిశ్చంద్రా! సమీపంబునకు రమ్ము. నీవే మహావైరాగ్య ప్రవరుఁడవు. నీవే పరమసుజ్ఞానివి. నీవే తపస్విజనాగ్రగణ్యుండవు. నీవంశాంకురం బయిన నీపుత్త్రరత్నంబో నీయట్లు మఱియు నీసహధర్మచారిణియైన చంద్రమతియో అహో! పేర్కొన నలవి కాని యుత్తమశీల! మహాపతివ్రత యిట్టి మీయువ్వురిని నేఁ బెట్టిన బాములు సైరింపఁబడుఁగాక! గుణాధిక్యంబుం గోరి మణుల సానఁ దీర్చుటవలె నీసద్గుణరాజిని నిర్మలతేజోవంతంబులుగాఁ జేసినాఁడను. మణులు దమయం దంతర్గతంబులయిన కాంతులను సానఁ దీర్చినతోడనే వెలికి నిర్గమింపంజేసినట్లు మీయంద యణఁగిపడియుండిన యీయుత్తమగుణమణులు నాపరీక్షాధీనంబులయి ప్రపంచమునందంతటను ప్రకాశములయి వెలసినవి. అందువలన మీరు నన్ను గొప్పగాఁ దలంతురే కాని నాయెడ నీచత్వబుద్ధిని వహింపకుందురుగాక!

హరిశ్చంద్రుఁడు——స్వామీ! యట్టియవజ్ఞతాబుద్ధి విధేయునిగూర్చి తలపోయ రాదు. సెలవీయను రాదు. ఇంత పరీక్షించి చూచినట్లు వక్కాణించియు మఱల నిట్టినందేహ మెందులకు?

విశ్వామిత్రుఁడు——కాదు, హరిశ్చంద్రా! అట్లు గాదు. “మీకు మేలును గీర్తియు జగద్విఖ్యాతం బగునట్లు చేసినవాఁడను నేనే”



యనుట దెలియఁజేయుటకై యట్లు పలికినాఁడను. మఱొక్కటి యును లేదు. అది యట్లుండ, నేను మిమ్మును బరీక్షించుటకై పలువగల శ్రమంబులకు లోఁబఱిచినను మీరు హృదయస్థైర్యముం గొని, సచ్ఛీలంబునుండి తొలంగక చాఞ్చల్య మొందక యుండిన వారలగుటంజేసి నేనిదివఱకును మనోవాక్కాయంబు లను త్రికరణములనుండి శుద్ధిగాఁ జేసినయే యుత్తమతపశ్చర్య గలదో, అందలి యర్ధభాగ మీముమ్మూర్తులు సాక్షిగా దత్తము సేయుచున్నాఁడను. ముమ్మాటికిని నిది సత్యము! సత్యము! సత్యము!

(హరిశ్చంద్రుఁడు వినయావనమ్రుండయి యంగీకరించుచున్నాఁడు.)

నారదుఁడు——వసిష్ఠా! కాంచితివా, సత్యమునకును దపమునకును గలిగిన తారతమ్యము? ఆహా! సాంసారికసౌఖ్యంబు లన్నియు నశ్వరంబులైనవియని దృఢజ్ఞాన సంపాదనంబునంజేసి యాటవికభూములందుఁ గ్రూరసత్త్వంబులతోడ మెలంగుచుఁ గాయగసరులను వాతపర్ణాంబువులను మెసవి శరీరధారణంబును సైరించి శీతాతపవాతంబులం గొట్టువడుచు నిజంబు గానలేక కష్టపడుచున్నారము. ఈసార్వభౌముండో? సకలసౌఖ్యంబుల నుండియు సత్యమునే నిత్యంబుగ భావించి భజించి నిజవస్తువును నేఁడు నిజముగా దర్శించినవాఁడు. వానివలన మనమును దర్శించినవారము. ఇంతేగాక యీవిశ్వామిత్రమునితపశ్చర్యయందును సగము పొందినాఁడు. ఆహా! వీనిం బోలిన ధన్యాత్ము లెవ్వారలు గలరు? అహో! ఇట్టిధన్యుని నిజశిష్యునిగాఁ బొందిన నీకంటె నుత్తము లెవ్వార లుందురు? ఆహా! అన్ని పదములును నేనుఁగుపాదమునం దిముడునట్లు సర్వమును సత్యమునందే లీన మొందును. ఇఁక “సత్యము” అనుపదమునకే “హరిశ్చంద్రుఁ” డనుపదము పర్యాయపదంబై వెలయునుగదా? ఇంకఁ

జంద్రమతి సచ్చరిత యన్ననో? "సత్యము తలకాఁచును" అన్నలోకోక్తికి జన్మస్థాన మగును.

ద్విపదలు.

"వారిధిమేఖలా - వలయితం బగుచు
గారాము నొందునీ - కాశ్యపియందుఁ
గమలంబునకుఁ గర్ణి - కవిధంబుగాను
విమలుఁడౌ వైష్ణవీ - విభు క్షేత్రవరము
కాశికానగరంబు - గడు ఖ్యాతిఁ గ్రాలు.
నీశుకారుణ్యా మ - హీనమై వెలయ
సత్యవంతుఁడు హరి - శ్చంద్రుం డనంగ
నిత్యసత్కీర్తుల - నెగడె నీవిభుఁడు
ఇనవంశ మతిఖ్యాతి - నితనిచేఁ గ్రాలె
ఘనుఁడు సత్యంబును - గడుఁ బ్రోచుకతన
మొనసి విశ్వామిత్ర - మునిపుంగవుండు
వినఁ గన రానట్టి - వివిధకష్టాళి
వెసఁ గుదియింపంగ - విసివి సత్యంబుఁ
బస గాదటంచుఁ దాఁ - బలికనే పొల్లు.
సత్యం బహో! యెంత - సర్వోత్తమంబు
సత్యంబు వరికింప - సత్తపోధికము
సత్యంబు నేఁడు వి - శ్వామిత్రమౌని
ఘనతపోబలమును గడు - డీలుపఱిచి
తనకు లోఁగొని మించె - ధరణిఁ దెల్లముగ.

హరిశ్చంద్రుఁడు—కేవలము దేనికిని సరిపోల్పఁ దగనిమమ్మును నీప్రపంచములోనివార లెన్నటికిని స్మరించునట్లు ననుకంప మెఱయ ననుగ్రహించిన మునిపుంగవులగు తమయొక్క పాదకమలంబులకు శిరంబులు సోఁకఁ బ్రణమిల్లుటఁ దక్క మాచేయునవి యేవిగలవు?



(నమస్కరించుచున్నారు.) గురునాథా! మాగురువర్యా! మమ్ముద్ధరించుపొంటెఁ గరుణఁ బూనిన ధర్మదేవతా! దేవరవారికి విధేయులమై యుండుటకు మే మొనర్చినతపమే తపము! ఆసత్తపఃఫలం బిచ్చుట నీదినమే కాంచితిమి. మమ్మెన్నటికిని బానిసలఁగాఁ గొని పరిపాలింపఁ బ్రార్థించెదము.

కాశీరాజు—అహో! అయోధ్యానాథా! హరిశ్చంద్ర సార్వభౌమా! మాయెడ నెట్టినేర మున్నను మన్నింపవలెను. మే మజ్ఞానంబునం జేసి చేసినదోషముల మనంబునం గొనక తొల్లిటివలె మాయెడల మైత్రిఁ గొనసాగింపవలెను. ఇదియే మాప్రార్థనము. చనిన పుత్త్రుఁ డుజ్జీవించె ననియు నిట్టి మహర్షులఁ జూడఁగాంచితిమే యనియు నీవింతసమ్మోదంబు కై కూడినను నామానసంబునం దొకవంక సత్యంబు గ్రహియించి కృత్యంబు నెఱవేర్పమికై కలిగినపరితాపంబు పేర్చి యేచ్చుచున్నది. కాఁబట్టి, మన్నింపవలెను.

హరిశ్చంద్రుఁడు—నృపాలా! ఇంతకుము న్నిమునివర్యులు వక్కాణించిన నన్నియు విని యుండువారలేకద! అందువలన నెవరిని నాడికొనవలెను? అన్నియు నొకకారణము ననుసరించి తటస్థించినవి. అందువలనఁ దమ రేల చింతిల్లెదరు? వలదు; మేము మీకుఁ గేవలము కృతజ్ఞులమై యుండువారము. తమరాజ్యము పొలిమేరను జేరుటవలననే మా కనేకములైనమేళ్లు సమకూఱియున్నవి. మునివరుల యప్పును దీర్చుట యొకవగయైనను మున్మూర్తుల స్వరూపంబులను నిమ్మహర్షులను దర్శింపఁగలిగితిమి. ఇంతకంటెను నింకొకఁడు పొందఁగలుగునది యేది యున్నది? నాశ్రేయంబుల కన్నిటికిని దమక్షేత్రంబే కదా జన్మభూమి యయ్యెను. కాఁబట్టి తమరును మాతోడ నయోధ్యకు వచ్చియే తీఱవలయును.

కాశీరాజు—ఆహా! అందుల కభ్యన్తర మేమి? కాఁచుకొనియే యున్నాఁడను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయరంగము.

## తృతీయరంగము.

స్థలము : అయోధ్యానగరములోనిసభామణ్డపము.

కాలము : పగలు.

పాత్రములు : వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు, నారదుఁడు, అత్రి, మొదలగు మునీంద్రులు, హరిశ్చంద్రుండు, దేవదాసుఁడు, చంద్రమతి, సత్యకీర్తి, కాశీరాజు, సామంతరాజులు, ప్రభువులు, వసిష్ఠశిష్యులు, విశ్వామిత్రశిష్యులు, సాంస్థానిక కవులు, మాగధులు మొదలగువారు.

---

విశ్వామిత్రుఁడు—శిష్యా! యీప్రకటనంబును నీనగరమునందలి సామంతులు, సేనాపతులు ప్రభువులు పౌరులు మొదలుగాఁగలవారలందఱును దెలిసికొనునట్లు వెల్లడిచేయుము.

శిష్యుఁడు—గురువర్యా! అట్లే చేసెదను. (ప్రకటనమును జదువుచున్నాఁడు.) ఈరాజ్యముయొక్క యేలుబడిక్రింద నమరియుండు సామంతులు సేనాపతులు ప్రభువులు పౌరులు మొదలగువారికందఱకును దెలియఁజేయుట యేమనఁగా, మేము మహారాజులుగాఁ బ్రకాశించుచుండి మహత్తైనయైశ్వర్యంబును జేవదలి వైరాగ్యస్థితిం గాంచియు, నొకకారణంబునంజేసి యీరాజ్యంబు హరిశ్చంద్రునివలనఁ బొంధితిమి. అందువలన హరిశ్చంద్రునిగుణగణంబులు



పుటముదీఱిన స్వర్ణంబువలెను సానఁబట్టిన మణివలెను గాంతి చెందెనని మీరు చక్కఁగా నెఱిఁగియే యున్నారు. ఇది యిట్లుండ మేము రాజ్యంబు వీడి వైరాగ్యంబు గొన్నపిమ్మటఁ బరిపాలనాపద్ధతులను మఱచినార మగుటంబట్టియు నిదివఱకుఁ గొన్నిదివసంబులుగఁ బ్రజలకుఁ గష్టంబులు సత్పరిపాలనంబు లేమింజేసి సంభవించి యుండవచ్చును. ఇఁక హరిశ్చంద్రుని పాలనంబుక్రింద నాకష్టంబులన్నియుఁ దొలఁగి సుఖించుచుందురుగాక! మీరందఱును నిఁకఁ బూర్వంబువలెనే యీహరిశ్చంద్ర నృపాలునకు మీయుత్తరవాదితనంబులం జెల్లించి ఘనతఁ జెంది వర్ధిల్లుదురుగాత!

ఇట్లు విశ్వామిత్రమునివరులు.

(మంగళవాద్యంబులు ఘోషించుచుండ వసిష్ఠుఁడు హరిశ్చంద్రునకుఁ గిరీటము నలంకరించును.)

వసిష్ఠుఁడు—హరిశ్చంద్రా? నీవు నీభార్యాపుత్త్రులంగూడి యాయురారోగ్యదృఢగాత్రంబులం బొంది, సొంపు పెంపార వసుంధరాపరిపాలనం బొనరించుచు వర్ధిల్లుదువుగాత!

ద్విపదలు.

"సర్వేశ్వరుని దైన - స్వస్వరూపంబు
ఉర్వి సత్యంబ యై - యొప్పారఁ గాన
సత్యం బదొక్కండె - సత్యత్వ మొంది
నిత్యస్థితింజేసి - నెగడు నటంచు
నీవు నీభార్యయు - నీపుత్త్రకుండు
భావసీమలఁ గూర్చి - పదిలంబు గాఁగ
బ్రదుకుఁడీ మిముఁ జూచి - పార్థివు ల్ధరణి
నెదల సత్యముఁ బూని - యొఱమిఁ జెందంగ'

ఇతరులగుమునులు—

గీ॥ దురధిగమ మాచు వసుమతిఁ - దోఁచుచుండు
తప మదంతయు డీల్పడి - దమథ మంది
సత్యమునఁజేసి నేఁడుప్ర-శస్తి వీడె
సాటి యెవ్వారు భువి హరి-శ్చంద్ర! నీకు.

గీ॥ సత్యవంతుండ వనుకీర్తి - సంతరించి
సత్యమును బ్రోఁచి నెలకొల్పు - సార్వభౌమ!
నీవు నీతనూ జాతుండు - నీదుసతియుఁ
బరఁగువారలు వినుతికిఁ - బాత్రు లౌచు.

హరిశ్చంద్రుఁడు—మంత్రీ! యీప్రకటనంబును మనసామంతులు సేనానులు ప్రభువులు పౌరులు లోనగువారికి వెల్లడి యగునట్లు ప్రకటింతువుగాక.

సత్యకీర్తి—సార్వభౌమా! అట్లే చేసెదను. (సత్యకీర్తి ప్రకటనను జదువుచున్నాఁడు) ఇందువలన మనరాణువక్రింద నమరియుండు సామంతనరపాలురు దండనాథులు ప్రభువులు పౌరులు మొదలుగాఁ గలవారలకుఁ దెలియఁజేయుట యేమనఁగా మేము గొన్ని దినములకుఁ బూర్వము ప్రకటించిన ప్రకటనానుసారంబున మేము మారాజ్యంబు విశ్వామిత్రమునిపుంగవులకు నప్పగించిన తలంపును నిపుడామునివరేణ్యులు ప్రకటించిన ప్రకటనవలన వార లాకాలంబున నీరాజ్యభారంబు నంగీకరించిన యంశంబుల నంటిన యభిప్రాయంబును, నిప్పుడు వారలు మాకు మఱల నప్పగించుటకుఁ గారణంబును నందఱకును జక్కఁగాఁ దెలియవచ్చియే యుండును. మేములేని సమయంబున నామునివరులయాజ్ఞకు బద్ధులై యంతఃకలహంబులకుఁ జోటీనివైఖరి నడఁకువ మెఱసి నడుచుకొనినందులకు మాకు మిగుల మనోమోదంబు గలుగుచున్నది. అందువలన మాప్రజలకు



మేము కృతజ్ఞతను జూపవలసియున్నది. ఇక బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రు లను నాలుగుజాతులవారును దమకుఁదమకుఁగల యాచార వ్యవహారాదులయం దొక్కింతేనియు లోపంబు గలుగని విధంబున సర్వేశ్వరునవ్యాజకరుణావిశేషాతిశయబలంబున నమితసౌఖ్యంబు లనుభవించుచు వర్తింతురుగాత.

ఇట్లు,

హరిశ్చంద్రుఁడు.

మాగధులు—

ద్విపదలు

వినయభూషణ! సద్వి - వేకసంపన్న !
తనరారుషోడశ - దానవినోది ! 1

అతులసత్కీర్తి మ-హాభాగ్యశాలి !
వితతధనుర్వేద - విద్యావిశేష ! 2

కరుణాపయోనిధీ ! - గాంభీర్యఘనుఁడ !
దురితదూరా! బుధ - స్తోత్రాళిపాత్ర ! 3

సర్వశాస్త్రార్థవి-చారసారజ్ఞ !
గర్వితరిపుగజ - కంఠీరవాభ ! 4

నిరుపమవిజ్ఞాన - నిధి ! భానువంశ
శరధిచంద్రా! హరి-శ్చంద్రావనీంద్ర! 5

నిత్యప్రసన్నుఁడై - నీతిఁ బోషించు
సత్యసంధాన త్రి-శంకుసత్పుత్ర ! 6

ఆస్థానపండితుఁడు——

భరతవాక్యము.

గీ. చెలఁగి యీసార్వభౌముస-చ్ఛీలములను
నొంది భూమీశు లెప్పు డీ - యుర్వి నేల
వసుమతీకాంత దాను స-స్యార్ధ గాఁగఁ
బ్రజలు సుఖియింత్రుగాక! యా - భవునికరుణ.

పంచమాంకము సమాప్తము.

